క్రీస్తుకు పూర్వం 6000 దగ్గర్నుంచి క్రీ. శ. 1942 వరకూ మానవ సమాజం చారిత్రకంగా, ఆర్థికంగా, రాజకీయంగా పయనించిన తీరు తెన్నులను సంపూర్ణంగా చిత్రించిన ఇరవై కథలు.

# వోల్గా నుంచి గంగకు

మూలం :

## రాహుల్ సాంకృత్యాయన్

తెలుగు సేత : చాగంటి తులసి




విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001

OLGA NUNCHI GANGAKU (Telugu) – By Rahul Sankrutyayan

ప్రచురణ నెం. : 2334

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : ఆగస్టు, 1986

ద్వితీయ ముద్రణ : జూలై, 1992

తృతీయ ముద్రణ : జూలై, 1995

చతుర్థ ముద్రణ : మే, 1999

పంచమ ముద్రణ : సెప్టెంబర్, 2002



ముఖ చిత్రం: చంద్ర

వెల: రూ.125-00

ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్ – 500 001
E-Mail: visalaandhraph@yahoo.com

విశాలాంధ్ర బుక్ హౌస్,
(అబిడ్స్/సుల్తాన్ బజార్) – హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి.



ముద్రణ: శ్రీ కళాంజలి గ్రాఫిక్స్, హైదరాబాద్-29. ఫోన్: 3224831

# మొదటి ముద్రణ ముందు మాట

మనిషి నేడు ఉన్నస్థితిలో ప్రారంభం నుంచీ లేడు. ఈ స్థితికి రావడానికి ఎన్నో గట్టి పోరాటాలు చెయ్యవలసి వచ్చింది. "మానవ సమాజం" అన్న పుస్తకంలో నేను మానవ సమాజ వికాసాన్ని గురించి సిద్ధాంతపరమైన వివేచన చేశాను. దాన్నే సరళంగా చెప్పొచ్చు. ఆ సరళ చిత్రణ వల్ల మానవ సమాజం ఎలా వికాసం చెందిందో అర్థం చేసుకోవడం తేలిక అవుతుందన్న అభిప్రాయం కలిగింది. దాంతో "వోల్గా నుంచి గంగకు" రాశాను. ఇందులో నేను మనదేశపు పాఠకుల సౌలభ్యం కోసం ఇండోయూరోపియన్ జాతిని తీసుకున్నాను. వికాస దృష్ట్యా ఈజిప్టు, సురియానీ లేదా సింధు జాతులు ఇండోయూరోపియను జాతి కన్నా వేల సంవత్సరాలు ముందు ఉన్నాయి. కాని వాటిని తీసుకున్నట్లయితే రచయితకీ, పాఠకులకి కూడా ఇబ్బందులు ఎక్కువవుతాయి.

ప్రతీ కాలంలోని సమాజాన్నీ నేను ప్రామాణికంగా చిత్రించడానికి ప్రయత్నించాను. కాని మొదటి ప్రయత్నంలో తప్పులు దొర్లడం సహజం. ఇంకా ప్రామాణికంగా శుద్ధంగా చిత్రించటానికి ముందు ముందు రాబోయే రచయితలకి నా ప్రయత్నం దోహదపడితే కృతార్థుణయ్యాననే అనుకుంటాను.

బంధుల మల్లుడి (బుద్ధుడి) కాలాన్ని తీసుకుని విడిగా వేరుగా 'సింహ సేనాపతి' అనే నవల రాశాను.

సెంట్రల్ జైలు, హజారీబాదు — రాహుల్ సాంకృత్యాయన్

**26-6-42**

# ద్వితీయ ముద్రణ ముందు మాట

ఏడెనిమిది నెలలలో మొదటి ముద్రణ ప్రతులన్నీ చెల్లిపోవడం రచయితకి సంతోషకారణం. అంతకన్నా సంతోషకరమైన సంగతి మరోటి ఉన్నది. ప్రాచీన భావాల్ని నమ్మేవారు తమ చికాకుని చిత్తం వచ్చినట్టూ వాగి వ్యక్తపరచడం ద్వారానో లేదూ తిట్లవర్షం కురిపించడం ద్వారానో వెల్లడిస్తున్నారు. అయితే ఇప్పుడు తిట్లు అంత ఎక్కువగా వినిపించటం లేదు. కొంత మంది పెద్ద మనుషులు ఎంతో నిగ్రహం చూపెట్టాలని వ్యర్థప్రయత్నం చేస్తూ పాండిత్య ప్రకర్షతో విమర్శించడానికి ప్రయత్నించారు రచయిత ఆ విమర్శలకి సమాధానం ఇవ్వాలనీ ఆశించారు. నిజానికి రచయితన్నవాడు రాయడానికి ఎప్పుడూ వెన కాడడు - అలిసిపోడు. కాని సమాధానంగా రాయడానికి ఏమన్నా ఉంటే కద ! ఏదన్నా రాయడానికి ఉంటే కద !! రాసిన ప్రతీ కథ వెనకా ఆ యుగానికి సంబంధించిన విషయాలు, గంభీరమైనవి, బరువైనవీ ఉన్నాయి. ప్రపంచభాష లెన్నిటిలోనో, తులనాత్మక భాషా శాస్త్రాల్లో, మట్టిమీద, రాతిమీద, రాగి, ఇత్తడి, ఇనుప లోహాలమీద సంకేతాల రూపంలోనూ లిఖిత రూపంలోనూ ఉన్న సాహిత్యంలో, లేదూ లిఖించబడని పాటల్లో, కథల్లో, ఆచారవ్యవహారాల్లో మంత్ర తంత్రాల్లో ఆ విషయాలు లభ్యమవుతాయి. పుస్తకాన్ని రాస్తున్నప్పుడూ, ఆ తర్వాత కూడా ఈ విషయసామగ్రికి మూలాధారాలని అనుబంధంలో పొందు పరచాలని ఆకాంక్షించాను. కాని ఈ పని బాగా పెద్దది. ఉన్న సమయమూ తక్కువ. ఆ కారణంగా వెనుదియ్యక తప్పలేదు. ఈ రెండు పుస్తకానికి ఆది అనుబంధం కూడా కానేరదు. ఎంచేత అంటే ఆ అనుబంధమే ఈ పుస్తకం కన్నా పెద్దదవుతుంది. అయినా దాని విషయమై నాకు ఆలోచన ఉండడం ఉంది.

ఈ ముద్రణలో మార్పులు చాలా తక్కువే చెయ్యాల్సివచ్చింది. చెప్పాలంటే అక్కడా అక్కడా ఏదో కాస్త చెయ్యి పెట్టినట్టయ్యింది. అంతే ప్రతీ కథకి ఓ వర్ణ చిత్రం ఉంటే బాగుణ్ణని అనుకున్నాను. అయితే యుద్ధకాలం అవడాన్ని ఆది నెరవేర లేదు.

కితాబ్ మహల్
ప్రయాగ

రాహుల్ సాంకృత్యాయన్

# విషయసూచిక

విషయం ... పేజీ

# ని శ

దేశం : ఓల్గా తీరం (ఎగువ) జాతి : ఇండో యూరోపియను
కాలం : క్రీస్తు పూర్వం 6000 సం.

## 1

మధ్యాహ్నపు వేళ. చాలారోజుల తరువాత ఇవాళ పొద్దు కనిపించింది. పొద్దు పొడిచి ఐదుగంటలైనా ఎండలో వేడీలేదు, తీక్షతాలేదు. మబ్బులూలేవు. గాలివానాలేదు. మంచూ కురవటంలేదు. పొగమంచూ ఆవరించిలేదు. అందుకే నాలుగుదిక్కులా ప్రసరించిన సూర్యకిరణాలు ఎంతో అందంగా ఉన్నాయి. వాటి స్పర్శ మనస్సుకి ఆనందాన్ని ఇస్తోంది. చుట్టూ ఉన్న దృశ్యమూ? ముదర నీలం రంగులో ఆకాశం, కింద కర్పూరం లాంటి తెల్లటిమంచుతో నిండిన నేల, ఇరవై నాలుగు గంటల బట్టి మంచు కురవలేదేమో నేలనిపడ్డ మంచు ఇంకా ఉండ ఉండల్లాగే ఉన్నప్పటికీ బాగా గట్టిపడిపోయింది. మంచుని ధరించిన ఈ నేల దిగంతాల వరకూ పరుచుకుని లేదు. ఉత్తరం వేపు నుంచి దక్షిణానికి కొన్ని మైళ్ళ వంకర టింకరగా బంగారపురంగు గీతలాగ వ్యాపించి ఉంది. దానికి రెండువేపులా కొండలమీద నల్లగా అడివివరస తీర్చి ఉంది. అడివిని కాస్త దగ్గరగా చూద్దాం పదండి. ఈ అడివిలో రెండురకాల వృక్షాలే ఎక్కువగా ఉన్నాయి. తెల్లటి బెరడుతో భూర్జవృక్షాలు—ప్రస్తుతం ఆకన్న మాటేలేని వృక్షాలు : రెండోరకం వృక్షాలు-నిటారుగా ఎత్తుగా లంబకోణం మాదిరిగా ఉండే కొమ్మలతో ముదురాకుపచ్చగానో నలుపన్న మాటేలేని ఆకులతోనో, సూదుల్లా ఉన్న ఆకులతో దేవదారు వృక్షాలు! వృక్షాలు చాలావరకూ మంచుతో కప్పుకుపోయి ఉన్నాయి. వాటి కొమ్మలమీదా, మానులమీదా, అక్కడక్కడ పట్టి ఉన్న మంచుతో నలుపూ తెలుపూ రంగులు ఏర్పడి దృష్టిని ఆకర్షిస్తున్నాయి.

ఇంకానా? భయంకరమైన నిశ్శబ్దం చుట్టూరా రాజ్యం ఏలుతోంది. ఎక్కడా కీచురాళ్ళ సవ్వడీలేదు. పక్షుల కలవరమూలేదు. పశువులు చేసే ధ్వనులూ లేవు.

పదండి .... కొండమీద అన్ని చెట్లలోనూ ఎత్తుగా ఉన్న దేవదారు చెట్టు ఎక్కి నాలుగుపక్కలా చూద్దాం. అంత ఎత్తుమీంచి అయితే మంచు నేలా దేవదారులే కాక ఇంకేమన్నా కనిపించొచ్చు. ఇక్కడ పెద్ద పెద్ద వృక్షాలే లేస్తాయా?

ఈ నేలని చిన్న చిన్న మొక్కలూ, గడ్డీ మొలవ్వా? ఏమో, మేమేఁవీ దాని గురించి చెప్పలేం. చలికాలం రెండొంతులైపోయి మూడో వొంతులో ఉన్నాం. ఈ వృక్షాలు మంచులో కూరుకుపోయి ఉన్నాయా-అయితే ఆ మంచు ఎంత దళసరిగా ఉందో కొలుద్దామంటే మా దగ్గరేం దానిక్కావల్సిన సాధనం ఏంలేదు. ఎనిమిది మూరలో మరి దానికన్నా ఎక్కువ దళసరే ఉండొచ్చునేమో! ఈ ఏడాది మంచు ఎక్కువగా పడుతోంది. అందరూ ఆ మాటే అంటున్నారు.

దేవదారు వృక్షం మీంచి ఏం కనపడుతోంది? ఆ మంచే! ఎత్తుపల్లాల్తో ఉన్న ఆ కొండభూమే! కొండలమీద ఉన్న ఆ అడివి వరసే! ఆఁ, కొండకి ఆ వేపుని ఓ జాగానుంచి పొగలేస్తోంది. ప్రాణి అన్నమాటే లేని ఈ అడివిలో పొగలేవడం కుతూహలం కలిగించే సంగతే! పదండి. అక్కడికి వెళ్ళి మన కుతూహలాన్ని తీర్చుకుందాం.

పొగ చాలాదూరంలో ఉంది. మబ్బులేని స్వచ్ఛమైన ఆకాశం వల్ల మనకి ఆ పొగ ఎంతో దగ్గరగా ఉన్నట్లు అనిపిస్తోంది. ఇదిగో ఇప్పుడిహ మనం దగ్గరికి వచ్చేశాం. నిప్పులో కాలుతున్న కొవ్వూ మాంసం వాసన మనకి వేస్తోంది. అదిగో ఏవో గొంతుకలూ వినిపిస్తున్నాయి. చిన్నపిల్లల గొంతుకలు. కాళ్ళ సవ్వడి కాకుండా, ఊపిరి తీసుకుంటున్న చప్పుడన్నా అవకుండా, మాట్లాడకుండా మనం వెళ్ళాలి. లేపోతే మనం వస్తున్నట్లు వాళ్ళకి తెలిసిపోతుంది. ఆ తర్వాత ఏమో ఎవరికి తెలుసు? స్వయంగానో లేదూ అంటే వాళ్ళ కుక్కల ద్వారానో మనకి ఏ రకమైన స్వాగతం చెప్తారో ఏమో!!

నిజఁవే! వీళ్ళు చిన్న చిన్న పిల్లలే! అందరికన్నా పెద్దవాడికి ఎనిమిదేళ్ళకన్నా ఎక్కువ ఉండవు. అందరికన్నా చిన్నవాడు ఓ ఏడాది వాడవుతాడు. ఒకే ఇంట్లో అరడజను మంది పిల్లలు. ఇది ఇల్లేం కాదు. సహజంగా దానంతటది ఏర్పడిన కొండగుహ. దీని పార్శ్వభాగాలూ వెనకవేపు భాగం చీకటి గుహ లోపలకి ఎంతవరకూ విస్తరించి ఉన్నాయో మనం చూడలేకపోతున్నాం. చూడ్డానికి ప్రయత్నించనూ కూడదు. మరి పెద్దవాళ్ళా? ఓ ముసలావిడ ఉన్నది. జనపనారలాంటి పొగవన్నె తెల్లటిజుట్టు చిక్కుచిక్కులుపడి జడలు కట్టి వేళ్ళాడుతోంది. ఆవిడ మొహం ఆ జడల్తో కప్పుకుపోయి ఉంది. ఇదిగో ఇప్పుడావిడ తనజుట్టుని చేత్తో పక్కకి తోసుకుంది. ఆవిడ కనుబొమ్మలూ తెల్లగా ఉన్నాయి. తెల్లటి మొహం నిండా ముడతలు. ఆ ముడతలన్నీ మొహం లోపల నుంచి పైకి వచ్చేయా అన్నట్టు కనపడుతున్నాయి. ప్రత్యేకించి పిల్లలూ మన బామ్మగారూ ఉన్నచోట గుహలో నిప్పుసెగా పొగా రెండూ ఉన్నాయి. బామ్మ ఒంటిని ఏ గుడ్డా లేదు. ఏ అచ్ఛాదనా లేదు. కాళ్ళ దగ్గర నేలమీద ఆవిడ ఎండి ఒడిలిపోయిన చేతులు పెట్టుకుంది. ఆవిడ కళ్ళు లోతుకుపోయాయి. లేత నీలంరంగు కంటిపాపలు కాంతిహీనంగా శూన్యంగా ఉన్నాయి. అయితే ఉండుండి వాటిలో కాంతి తళుక్కుమని మెరుస్తోంది.

అంచేత కంటిచూపు పూర్తిగా పోలేదని అర్థమవుతోంది. వినికిడైతే అసలు మంద గించేలేదు. చెవులు ఎంతో మెలకువతో ఉన్నట్టు తెలుస్తోంది. పిల్లలు చేసే చప్పుళ్ళు బామ్మ బాగా వింటున్నట్టుగా అర్థం అవుతోంది. ఇప్పుడే ఓ పిల్లాడు కెవ్వు మన్నాడు. ఆవిడ కళ్ళు వెంటనే ఇటు తిరిగాయి. ఏడాదీ ఏడాదిన్నర పిల్లలు! ఒకత్తి ఆడపిల్ల. రెండో వాడు మగపిల్లవాడు. ఇద్దరూ ఒకే ఎత్తులో ఉన్నారు. ఇద్దరి జుట్టూ కాస్తపసుపు వర్ణంతో కలిసిన తెలుపు రంగులో వుంది ముసలమ్మ జుట్టులాగే! అయితే జుట్టులో మెరుపూ జీవమూ రెండూ ఎక్కువే! బలిసిన దృఢ మైన శరీరాలు, ఎరుపువర్ణం కలిసిన తెలుపురంగులో ఉన్నాయి. విశాలమైన పెద్ద కళ్ళు. ముదర నీలంరంగు కంటిపాపలు. పిల్లాడు గొంతుచించుకుని పెద్దగా ఏడు స్తున్నాడు. పిల్ల నిల్చుని ఎముకని నోట్లో పెట్టుకుని చీకుతోంది.

"అగిన్ రా! ఇలా రా అగిన్! బామ్మ ఇదిగో ఇక్కడుంది" ముసలితనం వల్ల వొణుకుతున్న గొంతుతో ఆవిడ అన్నది.

అగిన్ లేవటం లేదు. అప్పుడో ఎనిమిదేళ్ళ పిల్లాడు వాణ్ణి ఎత్తుకుని బామ్మ దగ్గరికి తీసుకు వెళ్ళాడు. ఈ పిల్లాడి జుట్టూ చిన్నపిల్లాడి జుత్తులాగే పసుపు వర్ణం కలిసిన తెలుపురంగులోనే ఉంది. అయితే జుత్తుబాగా పొడుగ్గా ఉంది. ఉంగరాలు చుట్టుకుని ఉంది. పూర్తిగా దిసమొలతో ఉన్న వాడి ఒంటిరంగూ తెలుపే. అయితే అంత పచ్చగాలేదు. దానికితోడు ఒంటినిండా అక్కడక్కడ నల్లగా మురికి ఉంది.

"బామ్మా! రోచన ఎముకలాగేసుకుంది. అగిన్ ఏడుస్తున్నాడు." పెద్ద పిల్లాడు చిన్నపిల్లాణ్ణి బామ్మ దగ్గర నిలబెట్టి అన్నాడు.

పెద్ద పిల్లాడు అక్కణ్ణించి వెళ్ళిపోయాడు. ఎండి ఒడిలిపోయిన చేత్తో అగిన్‌ని ముసలమ్మ ఎత్తుకుంది. ఇంకా వాడు ఏడుస్తూనే వున్నాడు. కళ్ళంట ఏకధారగా నీళ్ళు కారడంతో వాడి బుగ్గలమీద దళంగా ఎర్రటి చారికలు కట్టాయి.

"ఏడవకురా అగిన్! రోచనని నేకొడ్తాగా!" బామ్మ అగిన్ మొహాన్ని ముద్దు పెట్టుకుంటూ సముదాయిస్తోంది. ఎన్ని సంవత్సరాల నుంచో కొవ్వుతో నాని ఉన్న నేలమీద తన రెండో చేత్తో చరుస్తూ ఊరుకోబెడ్తోంది. అగిన్ "ఊఁఊఁ" ఏడ్పు ఇంకా ఆగలేదు. వాడి కన్నీళ్ళు కట్టలేదు. బామ్మ తన మురికి చేత్తో కన్నీటిని తుడుస్తూ అగిన్ బుగ్గలమీద కట్టిన ఎర్రటి చారికల్ని నల్లగా చేసింది. ఒడిలి ఎండి పోయిన చర్మమూ, ఎముకలగూడు మధ్య తొక్కే మిగిలి ఎండు గుమ్మడిపిండెల్లా వేళ్ళాడుతున్న రొమ్ముల్ని అగిన్‌ని మరిపించడానికి వాడి నోటికి అందించింది. అగిన్ రొమ్ముని నోట్లో పెట్టుకున్నాడు. ఏడ్పు మానేశాడు. అదే సమయానికి బైటనుండి ఎవరో మాట్లాడుతున్నట్టు వినిపించింది. ఎండిపోయిన రొమ్ముని వదిలేసి పిల్లాడు మొహంపైకి ఎత్తి తొంగిచూశాడు. ఎవరిదో వినసొంపుగా ఉన్న తియ్యటి గొంతు వినిపించింది.

"అ-గి-న్"

అగిన్ మళ్ళా ఏడ్పు మొదలుపెట్టాడు. ఇద్దరు ఆడవాళ్ళు తలమీద మోసుకు వచ్చిన కర్రల మోపుల్ని ఓ మూలని దభీలుమని పడేశారు. ఒకావిడ రోచన దగ్గరికి రెండో ఆవిడ అగిన్ దగ్గరికీ పరుగు పరుగున వచ్చేరు. ఇంకా గట్టిగా ఏడుస్తూ అగిన్ "అమ్మా! అమ్మా!" అన్నాడు.

ఆవిడ ముళ్ళపంది ముల్లుతో కుట్టుకున్న, రోమాలతో నిండి ఉన్న తెల్లటి ఎద్దు చర్మాన్ని కుడిచేతికి అడ్డంలేకుండా కుడిరొమ్ముమీద కప్పుకుని ఉంది. ఆ చర్మాన్ని ఆవిడ విప్పి కింద పెట్టింది. పడుచు శరీరమే అయినా చలికాలం అవడాన్నీ, ఆహారం లోటైన కారణాన్నీ కండపుష్టి తగ్గివుంది. అయినా అసామాన్యమైన అందం! మట్టీ మురికీ లేకుండా శుభ్రంగా ఉన్న ఎర్రటి చెక్కిళ్ళలో ఎరుపు వర్ణంతో కలిసిన తెలుపు మెరుపూ - తళతళా-! నుదుటిమీద పడకుండా జడలుకట్టని పాండు వర్ణపు తెల్లని జుట్టు! తక్కువ కండపుష్టితో విశాలమైన వక్షం. గుండ్రగుండ్రని నల్లటి మొనలతో రొమ్ములు, ఉదరం లేకుండా ఉన్న సన్నని నడుం, ఓ మాదిరి పరిమాణం గల దృఢమైన పిరుదులు, కండరాలతో గుండ్రంగా ఉన్న తొడలు, శ్రమించి పరిగెట్టేదానికి చిహ్నంగా నాగలి ఆకారపు పిక్కలు. ఆ పద్దెనిమిదేళ్ళ పడుచు అగిన్‌ని రెండు చేతుల్తో ఎత్తుకుని వాడి మొహాన్ని కళ్ళని ముద్దుపెట్టుకుంది. అగిన్ ఏడ్పుమర్చిపోయాడు. వాడి ఎర్రటి పెదిమల మధ్య చిన్నచిన్న తెల్లటిపళ్ళు మెరుస్తున్నాయి. వాడి కళ్ళు సహం సహం మూసుకుని ఉన్నాయి. బుగ్గలమీద చిన్న చిన్న సొట్టలు పడ్డాయి. కిందపడివున్న ఎద్దు చర్మంమీద ఆ పడుచు కూచుంది. అగిన్ నోటికి తన మెత్తటి రొమ్ముని అందించింది. అగిన్ తన రెండు చేతుల్లో రొమ్ముని పట్టుకుని తాగడం మొదలుపెట్టాడు. దిగంబరంగా ఉన్న రెండో పడుచూ అక్కడికి రోచనని తీసుకొచ్చి కూచుంది. మొహాలు చూడగానే ఆ పడుచులిద్దరూ అప్పచెల్లెళ్ళని తెలిసిపోతుంది.

## 2

గుహలో వాళ్ళిద్దరూ ఏకాంతంగా మాట్లాడుకుంటున్నారు. వాళ్ళని వదిలి బైటికి వచ్చి చూస్తే తోలుకప్పుకున్న కాళ్ళగుర్తులు ఎన్నో మంచుమీద ఓ దిక్కుగా వెళ్తున్నట్టు కనబడుతున్నాయి. పదండి, వాటిని పట్టుకుని తొందర తొందరగా మనమూ వెళ్దాం. ఆ కాళ్ళ గుర్తులు వొంపు తిరిగి అవతలవేపు కొండ మీదికి అడవిలోకి వెళ్ళాయి. గబగబా పరిగెడుతూ ముందుకి వెళ్తున్నాం. అయినా ఆ కాళ్ళ గుర్తులు అలా కనపడుతూనే ఉన్నాయి. ఓసారి తెల్లటి మంచు పరుచుకున్న నేల మీంచీ, మరోసారి అడవుల మధ్యనుంచీ కొండ మధ్యభాగాన్ని దాటుకుంటూ మళ్ళీ మరో మంచు పరుచుకున్న నేలకీ, ఇలా కొండలతోనిండిన అడివి వెంబడే ముందుకు

వెళ్తున్నాం. చివరికి మన దృష్టి కొండ అంచుమీద పడ్డాది. అక్కడ నీలాకాశంతో కలుస్తోంది. ఆ నీలాకాశం మీద ఎన్నెన్నో మానవాకారాలు కనపడుతూ కొండ వెనక భాగంలోకి మాయమైపోతున్నాయి. వాళ్ళ వెనుక వేపు నీలాకాశం గాని లేక పోతే మనం వాళ్ళని చూడనే లేక పోయే వాళ్ళం. వాళ్ళ ఒంటినీ మంచులాంటి తెల్లటి ఎద్దుచర్మాలు ఉన్నాయి. వాళ్ళ చేతుల్లో ఉన్న ఆయుధాలకీ తెల్లటి రంగు పూసినట్లుగా ఉంది. మరలాంటప్పుడు ఆ మహత్తరమైన తెల్లటి మంచు ప్రదేశంలో కదుల్తూ మెదుల్తూన్న ఆకారాల్ని మనం ఎలా గుర్తుపట్టగలుగుతాం?

ఇంకొంచెం దగ్గరికి వెళ్ళి చూద్దాం రండి. అందరికన్నా ముందు దృఢమైన శరీరంతో నలభై యాభై ఏళ్ళ స్త్రీ ఉన్నది. ఆచ్ఛాదనలేని ఆవిడ కుడిభుజాన్ని చూసీ చూడగానే ఆవిడ చాలా బలవంతురాలని తెలిసిపోతోంది. ఆవిడ జుత్తు, మొహం, అవయవాలు అవీ అన్నీ గుహలో మనం చూసిన ఆ ఇద్దరి పడుచుల్లాగానే ఉన్నాయి. అయితే సైజుచేత కొంచెం పెద్దవిగా ఉన్నాయి. ఆవిడ ఎడంచేతిలో లావుగానూ సూదిగానూ ఉన్న మూడు మూరల దూర్జవృక్షపు కఱ్ఱ ఉన్నది. కుడిచేతిలో తోలు తాళ్ళతో కఱ్ఱపిడికి కట్టి, సానపెట్టి పదును చేసిన రాతిగొడ్డలి ఉన్నది ఆవిడ వెనకా తలే నలుగురు మొగవాళ్ళూ, ఇద్దరు ఆడవాళ్ళూ వెళ్తున్నారు. మొగవాళ్ళలో ఒకరి వయస్సు ఆమెకన్నా కొంచెం ఎక్కువ వుంటుంది. మిగిలినవాళ్ళు ఇరవై ఆరేళ్ళకి పధ్నాలుగేళ్ళకీ మధ్యవాళ్ళు. పెద్దవాడి జుట్టు పొడుగ్గా గోధుమవర్ణపు తెలుపు రంగులోనే ఉంది. ఆదేరంగులో ఉన్న దట్టమైన గడ్డం మీసాల్తో అతని మొహం కప్పుకుని ఉంది. స్త్రీ శరీరంలాగే అతని శరీరమూ బలంగా పుష్టిగా ఉంది. అతని చేతుల్లోనూ అలాంటివే రెండు ఆయుధాలు ఉన్నాయి. మిగిలిన ముగ్గురు మొగ వాళ్ళలో ఇద్దరు ఇల్లాగనే దట్టమైన గెడ్డాలు మీసాలు ఉన్నవాళ్ళు. అయితే వయస్సు చేత చిన్నవాళ్ళు. ఆడవాళ్ళలో ఒకావిడకి ఇరవై రెండేళ్ళు. రెండవ ఆమెకి పదహా రేళ్ళకన్నా తక్కువే ఉంటాయి. మనం గుహలో ఉన్నవాళ్ళని చూశాం. బామ్మగార్ని చూశాం. అందరినీ సరిపోల్చుకుని చూస్తే ఈ ఆడవాళ్ళూ, మొగవాళ్ళూ అంతా బామ్మగారి అచ్చుమూర్తుల్లా కనిపిస్తున్నారు. ఈ ఆడవాళ్ళ చేతుల్లోనూ మొగవాళ్ళ చేతుల్లోనూ కఱ్ఱలూ, ఎముకల ఆయుధాలూ, రాతి ఆయుధాలూ ఉండడాన్ని బట్టీ వాళ్ళ గంభీరమైన చేష్టలని బట్టీ వాళ్ళు ఏదో వేటకి వెళ్తున్నట్టుగా తెలుస్తోంది.

కొండమీంచి కిందికిదిగి ఆ నాయకురాలు-అవిణ్ణి తల్లి అందాం-ఎడంవేపుకి తిరి గింది.అంతమందీనిశ్శబ్దంగాఆవిడవెనకాతలే వెళ్లున్నారు,మంచుమీద నడుస్తున్నప్పుడు చర్మంతో కప్పుకున్న వాళ్ళ కాళ్ళచప్పుడు కాస్తయినా వినిపించటం లేదు. ముందుకి జరిగినట పెద్దశిలఅక్కడ ఉంది. దానికిటూఆటూ ఎన్నో బండరాళ్ళున్నాయి. వేటగాళ్ల తమ నడకవేగాన్ని బాగా తగ్గించేశారు. చెల్లాచెదరై వాళ్లు బహు జాగ్రత్తగా ఉన్నారు. కాళ్ళని చూచి ఎంతో నెమ్మదిగా, ఆగి ఆగి, ఒక్కొక్క అడుగువేస్తూ బండరాళ్ళని చేత్తో ముట్టుకునీ చూస్తూ ముందుకు వెళ్తున్నారు. అందరికన్నా ముందు తలి గుహ

ద్వారం ఎదటికి—బయలుస్థలం దగ్గరికి చేరుకుంది. గుహబైట నున్న తెల్లటి మంచుని జాగ్రత్తగా పరిశీలించి చూస్తోంది. అక్కడ ఏ కాలిగుర్తులూ లేవు. ఆవిడ ఒక్కత్తే గుహలోపలికి దూరింది. కొన్ని మూరల దూరం వెళ్ళేసరికి గుహ ఓ పక్కకి దారి తీసింది. అక్కడ వెలుతురు చాలా తక్కువగా ఉంది. కాస్సేపాగి ఆమె ఆ చీకటికి అలవాటు పడింది. ఆ తర్వాత మళ్ళీ ముందుకు వెళ్ళింది. అక్కడ బూడిదరంగు ఎలుగుబంట్లని-మూడింటిని-తల్లి-తండ్రి పిల్లని చూసింది. అవి నేలమీద పడుకుని ఉన్నాయో చచ్చిపడి ఉన్నాయో కాని మొహాలు కిందవేపుకి వాల్చి ఉన్నాయి. వాటిలో ఎక్కడా ప్రాణం ఉన్న లక్షణాలు కనిపించటం లేదు.

తల్లి నెమ్మదిగా బైటికి తిరిగివచ్చింది. ఆమె విప్పారిన మొహాన్ని చూడగానే ఆమె కుటుంబానికి విషయం అర్థమైపోయింది. తల్లి బొటనవేలితో చిటికనవేలుని ముడిచి పట్టుకుని మిగిలిన మూడువేళ్ళని విప్పి చూపెడుతుంది. తల్లివెనకనే ఇద్దరు మొగవాళ్లు ఆయుధాల్ని సరిచేసుకుని ముందుకు వెళ్లారు. మిగతావాళ్ళు ఊపిరి బిగబట్టి అక్కడే నిల్చుని ఎదురు చూస్తున్నారు. తల్లి లోపలికి వెళ్ళి ఎలుగుబంటిదగ్గర నిలబడింది. మగవాళ్ళలో పెద్దవాడు ఆడ ఎలుగుబంటి దగ్గర, రెండవవాడు పిల్ల ఎలుగుబంటి దగ్గరా నిలబడ్డారు. ముగ్గురూ ఒకేసారి వాడిగా పదునుగా ఉన్న తమ కర్రలతో గట్టిగా వాటిని పొడిచారు. కర్ర పొట్టలోకి దూరి గుండెలవరకూ చొచ్చుకుపోయింది. ఓ ఎలుగ్గొడ్డూ కదలదు- మెదలదు. చలికాలపు ఆర్నెల్లనిద్రా పూర్తవడానికి ఇంకా ఓ నెలపైగా సమయం ఉంది. అయితే ఈ సంగతి తల్లికి గాని ఆమె కుటుంబానికి గాని ఎక్కడ తెల్సు ? వాళ్లు ఎంతో మెలకువతో జాగ్రత్తగా పనిచెయ్యాలి. కర్ర సూది మొనతో మరో నాలుగైదుసార్లు పొట్టలో పొడిచి ఎలుగబంట్లని వాళ్ల వెల్లకితలా పడేశారు. ఆ తర్వాత ఏ భయమూ లేకుండా వాటి ముందుకాళ్ళనీ ముట్టినీ పట్టుకుని ఈడుస్తూ బైటికి తీసుకువచ్చారు. అంతమందీ ఎంతో సంతోషంతో సంబరంతో నవ్వుతూ గట్టిగా మాట్లాడుకున్నారు.

పెద్ద ఎలుగుబంటిని వెల్లకిలా పడేసి తల్లి తన తోలుదుప్పటీలోంచి చెకుముకి రాతిచాకుని తీసింది. ఎలుగుబంటి ఒంటిమీద ముందు చేసిన గాయంలోంచి ఆ చాకుని పొడిచి దానిపొట్టని చీల్చేసింది. రాతిచాకుతో ఎంతో చక్కగా సులువుగా ఎలుగ్గొడ్డు చర్మాన్ని చీల్చగలిగింది. దానికి కారణం అలవాటూ, చేతుల కండ బలమూ తప్పించి మరోటికాదు. మెత్తటి గుండెకాయలోంచి ఓ ముక్కనికోసి ఆవిడ తన నోట్లో వేసుకుంది. రెండో ముక్కని అందరికన్నా చిన్నవాడైన పధ్నాలుగేళ్ళ కుర్రాడినోట్లో వేసింది. మిగిలినవారంతా ఎలుగుబంటి చుట్టూరా కూర్చున్నారు. తల్లి అందరికీ గుండెకాయని ముక్కలుగా చేసియిస్తోంది. ఓ ఎలుగుబంటి పూర్తై రెండో ఎలుగుబంటిని కొయ్యడానికి తల్లి సిద్ధమయింది. అప్పుడు పదహారేళ్ళ పడుచు అక్కణ్ణించి లేచి బైటికి కాస్త దూరంగా వెళ్ళింది. మంచుముక్కొటి తీసుకుని

నోట్లోవేసుకుంది. ఆ సమయంలోనే అందరికన్నా పెద్దవాడైన మొగవాడూ బైటికి వచ్చేడు. ఆతడూ ఓ మంచుముక్కని నోట్లోవేసుకుని ఆ పదహారేళ్ళ పడుచు చెయ్యి పట్టుకున్నాడు. ఆవిడ కొద్దిగా సంకోచించింది కాని అంతట్లో మళ్ళీ మామూలైంది. మొగవాడు ఆవిణ్ణి కౌగిలించుకొని ఓ వేపుకి తీసుకొనివెళ్ళాడు. పదహారేళ్ళ పడుచూ, ఆ పురుషుడూ చేత్తో పెద్దమంచుగడ్డల్ని పట్టుకుని తిరిగి ఎలుగుగొడ్డు దగ్గరికి వచ్చేసరికి ఇద్దరి చెక్కిళ్ళూ కళ్లూ మరింత ఎరుపెక్కేయి.

"నే కోస్తానులే అమ్మా ! నువ్వు అలిసిపోయేవు" అన్నాడు పురుషుడు. తల్లి చాకుని అతని చేతికి ఇచ్చింది. ఆవిడ ఇరవైనాలుగేళ్ళ యువకుడి మీదకి వొంగి ముద్దు పెట్టుకుని, అతని చెయ్యి పట్టుకుని బైటికి తీసుకుని వెళ్ళింది.

మూడు ఎలుగ్గొడ్ల గుండెకాయల్నీ వాళ్ళు తిన్నారు. నాలుగు నెలల నుంచీ తిండి తినకుండా నిద్రపోతున్న ఎలుగ్గొడ్లలో కొవ్వు ఎక్కడుంటుంది ? పిల్ల ఎలుగు బంటి మాంసం మాత్రం ఎక్కువ మెత్తగానూ రుచిగానూ వుంది. అందులో చాలా భాగాన్ని వాళ్లు తినేశారు. ఆ తర్వాత కాస్సేపు విశ్రాంతి తీసుకోవడానికి అంతమందీ ఒకరిపక్కగా ఒకరు పడుకున్నారు.

ఇహ వాళ్లు ఇంటికి తిరిగివెళ్ళాలి. మగ ఎలుగునీ ఆడఎలుగునిఇద్దరు ఇద్దరు మొగవాళ్లు తోలుతాడుతో నాలుగుకాళ్లూ కట్టి కర్రతో భుజానికెత్తుకున్నారు. ఎలుగు బంటిపిల్లని ఓ పడుచుపల్ల భుజానికెత్తుకుంది. తల్లి తన రాతిగొడ్డలిని జాగ్రత్తగా పట్టుకుని ముందు నడుస్తోంది.

ఆ అడివి మనుషులకి గంటలూ కాలం గురించి ఏం తెలీదు. అయినా ఇవాళ వెన్నెల రాత్రి అన్న సంగతి వాళ్ళకి తెలుసు. కొంచెం దూరం వెళ్ళేసరికే సూర్యుడు ఆకాశం అంచులనుంచి కిందికి దిగిపోయినట్టు అనిపిస్తోంది. అయినా పూర్తిగా అదృశ్యం కాకపోవడంనుంచి సంజెకాంతులు కొన్ని గంటలసేపు వున్నాయి. ఆ కాంతులూ మాయమయ్యేక నింగీనేల అంతటా శ్వేతవర్ణం రాజ్యం యేల సాగింది.

వాళ్ళిల్లు—గుహ చేరుకోడానికి ఇంకా మరింత దూరం వెళ్ళాలి. బట్టబయలులో ఓ జాగా దగ్గర తల్లి ఉన్నట్టుండి నిలబడిపోయింది. చెవి వొగ్గి వినడం మొదలుపెట్టింది. అంతమంది నిశ్శబ్దంగా నిల్చుండిపోయారు. పదహారేళ్ళ పడుచు ఇరవై ఆరేళ్ళ యువకుడి దగ్గరకి వెళ్ళి "గుర్ర్—గుర్ర్—గుర్ర్—తోడేళ్ళు! తోడేళ్ళు!" అన్నాది. తల్లి పైకి కిందకి తలాడిస్తూ "గుర్ర్! గుర్ర్! గుర్ర్! తోడేళ్లు! చాలా వున్నాయి. అవును చాలా వున్నాయి!" అన్నాది. ఆవేశంతో నిండిన గొంతుతో, "సిద్ధపడండి" అన్నాది.

వేటని నేలమీద పెట్టేశారు. తమ తమ ఆయుధాల్ని పట్టుకుని అంతమందీ ఒకరివీపుకి మరొకరివీపు చేర్చి నాలుగుపక్కలకి మొహాలుపెట్టి నిల్చుండిపోయారు. చూస్తూ చూస్తూ వుండగానే ఏడెనిమిది తోడేళ్ళు గుంపుగా జాపోస్తున్న నాలికలతో

గుర్రులు కొడుతూ వీళ్ళచుట్టూ ప్రదక్షిణం చెయ్యడం మొదలుపెట్టాయి. మనుషుల చేతుల్లోని కర్రబల్లేలూ, రాతిగొడ్డళ్ళూ చూసి మీద కురకడానికి వెనకాడుతున్నాయి. ఈ సమయంలో వాళ్ల కట్టుకున్న వలయం మధ్యనున్న కుర్రవాడు తనకర్రకి కట్టివున్న సన్నని కర్రనీ, నడుంకి కట్టుకున్న సన్నని తోలు తాడూ తీసి-బిగించికట్టి విల్లుచేశాడు ఎక్కడ దాచేదో ఏమో వాడిగా వున్న రాతిమొన బాణాన్ని తీసి ఆ రెండింటినీ ఇరవైనాలుగేళ్ళ యువకుని చేతికి అందించి వలయం మధ్యలోకి అతన్ని లాగి తాను వెళ్ళి ఆ యువకుని జాగాలో నిల్చున్నాడు. ఇరవైనాలుగేళ్ళ యువకుడు వింటినారిని లాగి, బాణాన్ని ఎక్కుపెట్టి టంకారంతో తోడేలు పొటకి గురిచూసి బాణాన్ని వదిలాడు. తోడేలు దొర్లి నేలమీద పడిపోయింది. అయితే వెంటనే తనని తాను సంభాళించుకుని ముందూ వెనకా చూడకుండా గుడ్డిగా మీదకి ఉరకడానికి సిద్ధమవడానికి ఉద్యమించబోయింది. సరిగ్గా ఆ సమయానికి యువకుడు మరోబాణాన్ని వదిలాడు. ఈసారి తోడేలుకి చాలా గట్టిదెబ్బ తగిలింది. అది నేలకొరిగిపోవడాన్ని చూసి మిగతా తోడేళ్ళన్నీ దానిదగ్గరికి వచ్చేశాయి. దాని వొంటినుంచి కారే వేడినెత్తురుని నాకాయి. ఆ పైన దాన్ని పీక్కుతినడం మొదలు పెట్టాయి.

తోడేళ్ళు తిండియావలో పడివుండడాన్ని చూసి వాళ్ళు వేటని తమ భుజాలకెత్తుకుని ఎంతో జాగ్రత్తతో పరుగులుపెట్టారు. ఈసారి అందరికన్నా వెనక తల్లి వున్నాది. ఉండుండి ఆవిడ వెనక్కి తిరిగి తిరిగి చూస్తోంది. ఇవాళ మంచుపడటం లేదు. వెన్నెల రాత్రిలో వాళ్ళ కాలిగుర్తులు దారిని చక్కగా చూపెట్టగలవు. వాళ్ళ గుహ మరో అరమైలుకన్నా తక్కువే వుండివుంటుందేమో. ఇంతలో మళ్ళీ తోడేళ్ళ గుంపు వచ్చిపడ్డాది. వాళ్ళు వేటని మళ్ళీ నేలమీదపెట్టి ఆయుధాల్ని సరిచేసుకున్నారు. ఈసారి విలుకాడు ఎన్నోబాణాలు వదిలాడు కాని క్షణమైనా ఓచోట నిలవకుండా మీదకి ఉరుకుతున్న తోడేళ్ళని ఏం చెయ్యలేకపోయాడు. ఎంతసేపో మీదకి ఉరకడానికి ఎన్నెన్నో ఎత్తులు వేసిన తర్వాత నాలుగు తోడేళ్ళు కలిసి ఒక్కుమ్మడిగా ఓ పదహారేళ్ళ పడుచు మీదకి ఉరికాయి. పక్కనే నిల్చున్న తల్లి తనబల్లేన్ని ఓ తోడేలు పొట్టలోగుచ్చి నేలకేసి కొట్టేసింది. కాని మిగతా మూడు తోడేళ్ళూ ఆ పడుచుతొడని గాయపరిచి కిందపడేశాయి. రెప్పవేసేలోగా ఆవిడ పొట్టని చీల్చిపేగుల్ని బైటికిలాగేశాయి. పదహారేళ్ళపడుచుని రక్షించాలన్న ధ్యాసలో అందరూ వున్న సమయంలో మిగతా మూడు తోడేళ్ళూ వెనకనుంచి సందుచూసుకుని ఇరవైనాలుగేళ్ళ యువకునిమీద దాడిచేశాయి. ఆత్మరక్షణకి కాస్తన్నా అవకాశం యివ్వకుండా నేలకూల్చి పొత్తికడుపునీ పేగుల్నీ చీల్చేశాయి. వాళ్ళంతా అటువేపు దృష్టి సారించేసరికి ఇటు పదహారేళ్ళ పడుచుని తోడేళ్ళు యాభైగజాల దూరం ఈడ్చుకుపోయాయి. సహంచచ్చి పడివున్న తోడేలు దగ్గర ఇరవైనాలుగేళ్ళ యువకుడు ప్రాణాలు విడుస్తున్నట్లు తల్లి చూసింది. సహంచచ్చిన తోడేలునోట్లో

ఒకాడు వ్రదూర్చాడు. ఇంకొకాడు దాని ముందుకాళ్ళు పట్టుకున్నాడు. మిగతా వాళ్ళంతా తోడేలునోటి నుంచి కారుతున్న ఉప్పని వేడివేడి నెత్తురుని దోసిలిపట్టి తాగారు. దాని మెదడున్ని కోసి తల్లి మరింత సుపప్పు చేసిపెట్టింది. కొద్దినిముషాల్లో ఈ పనంతా పూర్తయింది. పదహారేళ్ళ పడుచు శరీరాన్ని కండకండలు చేసి తిన్న తర్వాతే తోడేళ్ళు మళ్ళీ వచ్చి వాళ్ళమీద పడతాయని వాళ్ళకి తెలుసు. చావ నిశ్చయంగా వున్న ఆ ఇరవైనాలుగేళ్ళ యువకుణ్ణి అక్కడే వదిలేసి మూడు ఎలుగ బంట్లనీ చచ్చినతోడేళ్ళని భుజాలకి ఎత్తుకుని పరిగెట్టడం మొదలుపెట్టారు. చివరికి ఎలాగైతేనేం గుహకి క్షేమంగా చేరుకున్నారు.

నిప్పు కణకణ రాజుతోంది. ఆ ఎర్రటివెలుగులో ఇద్దరు యువతూపిల్లలూ అందరూ నిద్రపోతున్నారు. వాళ్ళ చప్పుడు అయినా అవడం అమ్మ వొణుకుతు వున్న గంభీరమైన గొంతుతో "నిజా! వచ్చారా!" అని అడిగింది.

'ఆ' అంటూ తల్లి జవాబిచ్చి మొదట ఆయుధాలన్నిటినీ ఓ పక్కకి పెట్టింది. తర్వాత తోలుదుస్తులు విప్పేసి దిగంబరి అయింది. వేటని కిందపెట్టి మిగతా వాళ్ళందరూ ఆవిడలాగానే తోలు ఆచ్ఛాదనలను తీసేసి సుఖాన్ని కలిగచేసే నిప్పు సెగ రోమరోమానికి తగిలేటట్టు చూసుకున్నారు.

నిద్రపోతున్న కుటుంబమంతా మేల్కొంది. వీళ్ళకి చిన్నప్పటినుంచీ అతి చిన్నచప్పుడుకే మేల్కొనే అలవాటు. తల్లి ఇంతవరకూ ఎంతో మెలకువతో బహు జాగ్రత్తగా ఖర్చు చేస్తూ కుటుంబాన్ని నిర్వహించుకొచ్చింది. చలికాలం ఆరంభం కావడానికి ముందుగానే మరి లేళ్ళ వేటగాని, చెవులపిల్లుల వేటగాని, ఆవులు, మేకలు, గొర్రెలవేట గాని వుండదు. ఆ సమయానికి ఆ జంతువులన్నీ దక్షిణాన్ని వున్న వేడి ప్రాంతాలకి వలసవెళ్ళిపోతాయి. నిజానికి తల్లి కుటుంబం కూడా కాస్త దక్షిణానికి వెళ్ళాలి. అయితే ఆ సమయానికి పదహారేళ్ళ పడుచు కాస్తా జబ్బుపడ్డాది. ఆ కాలంనాటి మానవధర్మం ప్రకారం। కుటుంబ యజమానురాలైన తల్లి ఒకరికోసం మిగిలిన కుటుంబసభ్యులందరి ప్రాణాలకి ముప్పుకలిగేటట్టు చెయ్యకూడదు. అయితే తల్లి మనస్సు పీకింది. అదిగో అవిడ ఆ బలహీనతవల్లే ఇవాళ ఒక ప్రాణానికి బదులు ఇద్దరిని పోగొట్టుకోవలసివచ్చింది. ఈ ప్రాంతానికి ఇంకా రెణ్ణెళ్ళుపోతేగాని వేటాడ్డానికి పనికివచ్చే జంతువులు తిరిగిరావు. ఈలోగా ఇంకెంతమందిని పోగొట్టుకోవల్సి వస్తుందో! చూడాలి. మూడు ఎలుగుబంట్లతో, ఓ తోడేలుతో వాళ్ళకి చలి కాలం గడవదు.

పిల్లలకి నూ సంబరంగా వున్నాది. పాపం మాడేకడుపుతో ఇంతవరకూ పడుకుని వున్నారు. తోడేలు గుండెకాయని ముక్కలుముక్కలుగా కోసి ముందుగా తల్లి పిల్లలకి పెట్టింది. పిల్లలు గుటుకూ గుటుకూ ఆబగా ఆదరబాదరగా తింటున్నారు. ఎంతో నేర్పుతో గొడ్డుతోలుని ఏమాత్రం పాడవకుండా తల్లి వొలిచింది. తోలు ఎంతగానో ఉపయోగపడుతుంది మరి! మాంసాన్ని కోసి యిస్తూ

వుంటే ఆకలితో కరకరలాడుతున్న వాళ్ళు ముందు పచ్చిమాంసాన్నే కాస్త కాస్త తినే వారు. ఆ తర్వాత నిప్పుకణికలమీద కాల్చుకుని తిండం ప్రారంభించారు. తాము కాల్చుకున్న ముక్కల్లోంచి కాస్తకాస్త కొరుక్కుని తినమని తల్లిని అంతా ప్రాధేయ పడి అడుగుతున్నారు.

'ఊఁ సరిసరి, ఇవాళ కడుపునిండా తినండి. రేపట్నించి తిండానికి ఇంతింత దొరకదు'. అన్నాది తల్లి. ఆవిడలేచి గుహలో ఓ మూలకి వెళ్ళింది. అ మూలనున్న తోలుతిత్తిని బాగా ఉబ్బివున్నదాన్ని తెచ్చింది. "ఇదిగో తియ్యటి మద్యం ఇంతే వుంది. ఇవాళ్టికి తాగండి, నృత్యం చెయ్యండి; క్రీడలాడండి" అన్నాది.

పిల్లలకి తోలుతిత్తినుంచి తలోగుక్కా తాగటానికి దొరికింది. పెద్దవాళ్ళు ఎక్కువగా తీసుకున్నారు. అందరికీ మత్తెక్కింది. అందరికళ్ళు ఎరుపెక్కాయి. నవ్వులూ, పకపకలూ మొదలయ్యాయి. ఒకరు పాట ఎత్తుకున్నారు. అందరికన్నా పెద్దవాడు ఓ కర్రతో మరోకర్రని కొడుతూ వాయించడం మొదలుపెట్టాడు. నిజా నికి ఈ రాత్రి ఎంతో ఆనందమైన రాత్రి. తల్లిరాజ్యం హెచ్చుతగ్గులతో, అన్యాయా లతో కూడిన రాజ్యం కాదిది! ముసలి బామ్మగారూ, అదిగో ఆ పెద్ద మగవాడు వాళ్ళిద్దర్నీ వదిలేస్తే మిగతావారంతా తల్లిసంతానమే. తల్లి ఆ పెద్దమగవాడూ ఇద్దరూ ముసలి బామ్మగారి కొడుకూ కూతురే! అంచేత అక్కడ నువ్వువేరు, నేనువేరు, అన్నదానికి సావకాశమే లేదు. నిజానికి నువ్వూ నేను వేరు అన్న తేడాతో, నాది నీది అన్న యుగం రావటానికి ఇంకా చాలాకాలం గడవాలి. అయితే, ఒకటి మాత్రం ఉంది తల్లికి అందరు మగవాళ్ళమీదా సమానమైన అధికారం ఉంది. అంతేకాదు - ఆవిడదే మొదటి హక్కు. తన ఇరవై నాలుగేళ్ళ కొడుకూ, భర్తా చనిపోయినందుకు ఆవిడకు దుఃఖం లేదనికాదు. ఆనాటి జీవితంలో గతించిన కాలం కన్నా జరుగుతున్న కాలానికే ప్రాధాన్యత ఎక్కువ. తల్లికి ఇద్దరు భర్తలు వున్నారు. మూడోభర్తగా పధ్నాలుగేళ్ళవాడు తయారవుతున్నాడు. రాజ్యానికి నాయకురాలుగా వుంటూ వుండగా ఆమె పిల్లల్లో ఇంకెంత మంది భర్తలుగా తయారయ్యే వయస్సుకి అందుకుంటారో! తల్లికి ఇరవై ఆరేళ్ళ యువకుడంటే ఎక్కువ మక్కువ! అంచేత మిగతా ముగ్గురు యువతులకీ ఆ యాభై ఏళ్ళ పురుషుడొక్కడే గతి!

చలికాలం ఇంకా పూర్తికానేలేదు. ఓ రోజున గుహలో బామ్మ ప్రాణంపోయి పడివుండటం కనిపించింది. పిల్లల్లో ముగ్గురిని తోడేళ్ళు ఎత్తుకుపోయేయి. మంచు కరగ్గా ఆ పొంగుతున్న నదీప్రవాహంలో పెద్ద మగవాడు కొట్టుకుపోయేడు. ఈ విధంగా పదహారుమంది వున్న కుటుంబం కాస్తా తొమ్మిదిమందికి దిగిపోయింది.

# 3

వసంతకాలం చాలారోజులుగా మృతప్రాయంగా వున్న ప్రకృతిలో తిరిగి నూతన జీవనస్పందన కనపడుతోంది. ఆర్నెల్ళబట్టీ ఎండిపోయిన భూర్జవృక్షాలు

దట్టంగా ఆకులు తొడుగుతున్నాయి. మంచుకరిగింది. నేలంతా ఆకుపచ్చగా మారు తోంది. మత్తెక్కించే వనస్పతుల సువాసనలతోనూ, కొత్తమట్టి సువాసనలతోనూ గాలివీస్తోంది. జీవరహితంగా వున్న దిగంతం సజీవమయింది. ఒక్కోచోట చెట్ల మీద పక్షులు నానారకాలైన మధురకూజితాలు వినిపిస్తున్నాయి. ఒక్కోచోట కీచు రాళ్ళు ఎడతెరిపి లేకుండా గీపెడుతున్నాయి. కరిగిన మంచునీటి ప్రవాహం ఒడ్డంట వేలకొద్ది నీటిపక్షులు కీటకాల్ని తిండంలో మునిగివుంటే మరోచోట కలహంసలు ప్రణయ క్రీడలాడుతున్నాయి. ఇప్పుడిహ ఈ ఆకుపచ్చటి కొండలతో నిండినవనాల్లో అక్కడా అక్కడా గుంపులు గుంపులుగా లేళ్ళు దుముకుతూ గడ్డిమేస్తూ కనబడు తున్నాయి. ఒకచోట గొర్రెలు, మేకలు, ఇంకొకచోట దుప్పులు, వేరేచోట ఆవులు- వీటిని వేటాడ్డానికి పొంచికూచున్న చిరుతలు ఒకచోట వుంటే తోడేళ్ళు మరోచోట కనబడుతున్నాయి.

చలికాలంలో ఎండిపోయిన నదీప్రవాహంలా ఒకేచోట నిలిచిపోయిన మానవ కుటుంబాలు కూడా ఇప్పుడు తరలిరావడం మొదలుపెట్టాయి. తమ ఆయుధాలతో తమ చర్మ సామాగ్రిని, పిల్లల్ని మోసుకుంటూ గృహాగ్నిని పదిల పరచుకుంటూ ఆరుబయలు స్థలాలకి వస్తున్నాయి. రోజులు గడుస్తున్నకొద్దీ జంతువుల్లోనూ మార్పు వచ్చినట్టె వీళ్ళ ఎండి వారిగిపోయిన శరీరాలకి కొవ్వూమాంసం పడుతోంది. ఒక్కోసారి పెద్ద పెద్ద జులపాలజుట్టు ఉన్నవీళ్ళ పెద్ద పెద్ద కుక్కలు గొర్రెనో మేకనో పడతాయి. ఒక్కోసారి వాళ్ళే వలవిసిరో, బాణంతో కొట్టో లేకపోతే కర్రబల్లెంతో పొడిచో ఏదో ఓ జంతువుని కొడతారు. నదుల్లో చేపలూ వున్నాయి. ఈ వోల్గా నది ఎగువ భాగంలో నివసించే వారి వలలైతే ఈ రోజుల్లో ఎప్పుడూ ఖాళీగా రావటం లేదు !

రాత్రుళ్ళు ఇంకా చలిగానే వుంది. పగళ్ళు మాత్రం వేడిగా వుంటున్నాయి. నిశ కుటుంబం (తల్లిపేరు నిశ) ప్రస్తుతం మిగిలిన చాలా కుటుంబాలతోపాటు వోల్గా నది ఒడ్డున వున్నది. నిశలాగానే మిగిలిన కుటుంబాల్లోనూ వాళ్ళ వాళ్ళ తల్లులదే అధికారం. తండ్రిది కాదు. నిజానికి అక్కడ ఎవరి తండ్రి ఎవరో చెప్పడం సంభవం కాదు. నిశకి ఒనిమిదిమంది కూతుళ్ళు ఆరుగురు కొడుకులూ కలిగేరు. అందులో నలుగురు కూతుళ్ళూ ముగ్గురు కొడుకులూ ఆవిడ ఏభై ఐదో ఏట వరకూ మిగిలి వున్నారు. వీళ్ళంతా నిశ సంతానమే. సందేహం లేదు. వారిని ఆమె ప్రసవించ టమే తార్కాణం. అయితే వాళ్ళ తండ్రి ఎవరో చెప్పడం అసంభవమే. నిశకి ముందు ఆవిడ తల్లి బామ్మగారి హయాం అధికారం ఉండేది. అప్పుడు ఆ ముసలి బామ్మగారికి— ఆవిడప్పుడు ప్రౌఢ వయస్కురాలు- ఎంతమందో సోదరపతులు, మరెంతమందో పుత్ర-పతులు వుండేవారు. వాళ్ళంతమందీ ఎన్నెన్నిసార్లో నిశతో నృత్యమాడి, పాటలు పాడి ఆవిడప్రేమకి నోచుకున్నారు. ఆ తర్వాత, నిశ కుటుం బానికి నాయకురాలయ్యాక, ఆవిడ హయాం వచ్చాక నిరంతరం మార్పును కోరే

ఆవిడ ప్రేమకాంక్షను ఆవిడ సోదరులు కాని, ఈడేరిన ఆవిడ పుత్రులు కాని తిరస్కరించడానికి సాహసించేవారు కారు. అంచేత నిశకి బతికివున్న సంతానంలో ఎవరికి ఎవరు తండ్రో చెప్పడం ఎంతమాత్రం సంభవంకాదు. నిశ కుటుంబంలో ప్రస్తుతం ఆవిడ అందరికన్నా ముసలిది, పెద్దది, సర్వాధికారాలూ వున్నదీను, అయితే ఈ పెత్తనం, అధికారం ఇంకెంతో కాలం వుండేది కాదు. ఏడాది రెండేళ్ళలో ఆవిడ ముసలిబామ్మ అవబోతోంది. అప్పుడు అందరికన్నా బలిష్ఠురాలైన కూతురు లేఖ అధికారం, పెత్తనం రాబోతోంది. అప్పుడు లేఖకీ, ఆవిడ అప్పచెల్లెళ్ళకీ మధ్య కలహం తప్పకుండా వస్తుంది. ప్రతీ ఏటా కుటుంబంలోని కొంతమందిని తోడేళ్ళ వాతకో, చిరుతపులుల నోటికో ఎలుగ్గొడ్డ వాతకో, ఎద్దుకొమ్ములకో, వోల్గావరదలకో అర్పించాల్సి వస్తూ వుంటుంది. అటువంటప్పుడు కుటుంబం క్షీణించి పోకుండా సంఖ్య తగ్గిపోకుండా రక్షించాల్సిన కర్తవ్యం ప్రతీ తల్లిదీను! అధికారం లోనూ హయాంలో వున్న రాణిదీను. అయినా కలహాలు జరగడమూ మామూలే. లేఖ అప్పచెల్లెళ్ళలోను ఒకరిద్దరు స్వతంత్రంగా వేరే కుటుంబాలని ఏర్పరచడంలో సమర్థులూ స్థోమత ఉన్నవాళ్ళు అవుతారు. అయితే ఈ కుటుంబాభివృద్ధి ఆగిపోవడం అన్నది అనేక వీర్యాలకి ఒకే క్షేత్రమైనట్లు అనేక క్షేత్రాలకి ఒకే వీర్యమైనప్పుడు మాత్రమే జరుగుతుంది.

కుటుంబపు యజమానురాలు నిశకి తన కూతురు లేఖా వేటాడ్డంలో చాలా గట్టిదని తెలుసు. లేళ్ళు ఎక్కినట్టుగా లేఖ కొండలమీదకి ఎక్కిపోతుంది. ఆవేళ చాలా ఎత్తైన కొండరాతి మీద ఓ పెద్ద తేనెపట్టు కనపడింది. ఎలుగొడు కూడా అంతెత్తుకి ఎక్కి దాన్ని తినలేదు! అలాంటిది, లేఖ కర్రకి కర్ర కట్టి వాటితో, బల్లిలా పాకుతూ తేనెపట్టు దగ్గరికి వెళ్ళడమే కాదు. దివిటీతో పట్టునీ ఆ పెద్ద పెద్ద విషపు తేనెటీగలనీ కాల్చేసి తేనెపట్టుకి బెజ్జం పెట్టింది. పట్టుకింద పెట్టిన తోలు సిద్దెలో ముప్ఫైసేర్లకి తక్కువ కాకుండా తేనెకారింది. లేఖ చేసిన ఈ సాహసానికి నిశ కుటుంబం యావన్మంది కాదు. పొరుగుకుటుంబం వాళ్ళూ ఎంతో మెచ్చుకున్నారు. అయితే నిశకి మాత్రం లేఖ అంటే ఇష్టం వుండటంలేదు. నిశ కొడుకులు, యౌవనంలో ఉన్నవాళ్ళు లేఖ కనుసైగల ప్రకారం నాట్యమాడ్డానికి సిద్ధంగా వున్నంతగా నిశ వేడికోళ్ళని వినడానికి ఇష్టపట్టం లేదు. అలా అని ఆవిడ మాటని బాహాటంగా ధిక్కరించడానికి ధైర్యమూ చెయ్యటంలేదు. ఆవిడ ఇదంతా గమనిస్తోంది.

నిశ చాలారోజుల బట్టి దీనికి పరిష్కారమేమిటా అని ఆలోచిస్తోంది. లేఖ నిద్రపోతున్నప్పుడు దానిగొంతు పిసికి చంపేస్తేనో అని ఒక్కోసారి ఆవిడకి తోస్తుంది. అయితే లేఖ తనకంటే బలమైనదని ఆవిడకి తెలుసు. తను ఒకత్తే లేఖని ఏం చెయ్యలేదనీ ఆవిడ ఎరుగును. పోనీ ఎవరిసాయమన్నా తీసుకుంటేనో అనుకుంటే ఎవరన్నా తనకి ఎందుకు సాయం చేస్తారు? కుటుంబంలో వున్న మగ

వాళ్ళంతా లేఖ ప్రణయాన్ని పొందాలని, ఆవిడ దయకి పాత్రులవాలని ఉవ్విళ్ళూరుతున్నారు. నిశ కూతుళ్ళూ తల్లికి ఈ విషయంలో తోడ్పడ్డానికి సిద్ధంగాలేరు. వాళ్ళు లేఖ అంటే భయపడుతున్నారు. ఓవేళ వాళ్ళుగాని ఆ పనిచెయ్యటంలో కృతకృత్యులు కాలేకపోయారంటే లేఖ వాళ్ళని ప్రాణాలతో వదిలిపెట్టదని వాళ్ళు ఎరుగుదురు.

నిశ ఒంటరిగా కూచుని ఏదో ఆలోచిస్తోంది. ఉన్నట్టుండి ఆవిడ మొహం మతాబాలా వెలిగింది. లేఖను పడగొట్టడానికి ఆవిడకేదో ఉపాయం తట్టింది.

పూము పొద్దెక్కింది. అన్ని కుటుంబాల వాళ్ళూ తమతమ తోళ్ళడేరాల వెనక వేపున నగ్నంగా కూచునో, పడుకునో ఎండ కాగుతున్నారు. నిశ మాత్రం డేరా ముందు కూచుంది. ఆవిడదగ్గర లేఖ కొడుకు మూడేళ్ళవాడు ఆడుకుంటున్నాడు. నిశ చేతిలో వున్న దొన్నెలో ఎర్రటిస్ట్రాబెర్రీ పళ్ళు వున్నాయి. వోల్గానది ఆ ప్రక్కనే ప్రవహిస్తోంది. నిశ కూచున్న స్థలానికి ఎదురుగా భూమి ఏటవాలుగా నీటివరకూ వుంది. నిశ ఓ పండుని ఆ వాలులోకి దొర్లించింది. పిల్లాడు పరిగెట్టాడు. ఆ పండుని పట్టుకుని తినేశాడు. మరో పండుని దొర్లించింది. అయితే ఈసారి కుర్రాడు కాస్తదూరం వెళ్ళేక పండుని పట్టుకోగలిగేడు. నిశ ఎన్నోపళ్ళని ఒక్కసారే తొందర తొందరగా దొర్లించేసింది. కుర్రాడు వాట్ని పట్టుకోవాలని ఇంత తొందరపడ్డాడు కదా, వాడు ఏటవాలు జాగాలో పాకుడుమీద కాలుజారి వోల్గా ప్రవాహంలో దభీమని పడిపోయేడు. నది ప్రవాహం చాలా జోరుమీద వుంది. నిశ వోల్గా వేపు చూస్తూ కెవ్వుమని అరిచింది. కాస్త దూరంగా కూచున్న లేఖ ఇటు చూసింది. కొడుకు కనపడకపోవటంతో ఆవిడ ప్రవాహంవేపుకి ఉరికింది. నీళ్ళలో కుర్రాడు పైకి కిందకి తేల్తున్నాడు. ఆవిడ ప్రవాహంలోకి దూకి పిల్లాణ్ణి పట్టుకోగలిగింది. నీళ్ళు ఎక్కువ తాగేయడం నుంచి కుర్రాడు వేళ్ళాడి పడిపోయాడు. ఓల్గానది చల్లటి మంచునీరు ఒంటికి ముల్లులా గుచ్చుకుంటోంది. లేఖకి ఆ ప్రవాహాన్ని ఈది ఒడ్డుకురావడం కష్టంగా వుంది. ఆవిడకి ఓ చేతిలో పిల్లాడున్నాడు. రెండోచేత్తోనూ కాళ్ళతోనూ ఈదడానికి ఆవిడ ప్రయత్నిస్తోంది. సరిగ్గా ఆ సమయంలో ఆవిడకి తన గొంతుని ఎవరివో బలమైన చేతులు పట్టుకున్నట్లు తెలిసింది. ఆవిడకి విషయం అర్థం అవడానికి క్షణమైనా పట్టలేదు. చాలారోజుల బట్టి నిశ వైఖరిలో వచ్చిన మార్పుని ఆమె గమనిస్తోంది. ఇవాళ నిశ తనదారికి అడ్డంగా వున్న కంటకాన్ని—లేఖని—తొలగించాలని అనుకుంటోంది. లేఖ ఇప్పుడూ తన బలాన్ని చూపెట్టగలదు. అయితే ఆవిడచేతిలో పిల్లాడున్నాడు. లేఖ తనబలాన్ని వినియోగిస్తోందని తెలియగానే నిశ లేఖ శిరస్సు మీద తనగుండెని అన్చి కిందకి నొక్కింది. లేఖ ఒకే ఒక్క మునకతో నీళ్ళలో మునిగిపోయింది. నీళ్ళలో కాళ్ళూ చేతులూ కొట్టుకోవడంతో పిల్లాడు చేతిలోంచి జారిపోయేడు. ఇంకా నిశ లేఖని అదిమిపట్టి ఏం చెయ్యడానికి వీల్లేకుండా ఉంచింది. ఉన్నట్టుండి లేఖ చెయ్యి నిశ

మెడని చుట్టుకుని పట్టుకుంది. లేఖకి స్పృహతప్పి పోయింది. లేఖ బరువుతోపాటు నిశకి ఈదడం కష్టమైపోయింది. అయినా ఆవిడ మరికాస్త ప్రయత్నించింది. వ్యర్థమే అయింది. ఇద్దరూ ఒకేసారి వోల్గాకి బలిఅయిపోయేరు.

కుటుంబంలో బలాఢ్యురాలైన స్త్రీ రోచన. ఆవిడ ఆ తర్వాత నిశ కుటుంబానికి యజమానురాలయింది.*

---

* నేటికి 361 తరాలముందు జరిగిన కథ. ఆ కాలంలో హిందూ, ఈరాను, యూరోపీయ జాతులన్నీ ఒకే గుంపు (కబీలా)గా వుండేవి. మానవత్వానికిది ఆరంభకాలం.

# దివ

**దేశం : వోల్గాతీరం (మధ్యభాగం) జాతి : హిందూస్థాన్**
**కాలం : క్రీ. పూ. 3500.**

"దివా! ఎండ తీవ్రంగా ఉంది. నీ వొంటినిండా ఎంత చెమట పట్టిందో చూసావా! పద, ఇక్కడ రాతిమీద కూచుందాం"

"సరే సూరశ్రవా!" అని దివ సూరశ్రవుడితోపాటు ఓ పెద్ద దేవదారు వృక్షం నీడలో రాతిమీద కూచుంది.

గ్రీష్మకాలం మధ్యాహ్నపు వేళ. దానికితోడు లేడిని వేటాడ్డానికి దాని వెంట పరుగులు-అలాంటప్పుడు దివ నుదుటిమీద ముత్యాల్లా చెమట బిందువులు పొటకరించక ఏం చేస్తాయి? అయితే ఆ స్థలం చాలా అనువైనది. వాళ్ళ బడలిక తీరడానికి క్షణమైన పట్టదు. కొండ యావత్తూ కిందినుంచి మీదవరకూ ఆకుపచ్చ రంగుతో నిండివుంది. పెద్ద పెద్ద దేవదారు వృక్షాలు తమశాఖల్ని నిడారుగా ఉన్న ఆకుల్ని విస్తరించి సూర్యకిరణాలు కిందికి రాకుండా అడ్డుకుంటున్నాయి. నేలంతా ఎన్నెన్నోరకాల మూలికలూ లతలు, మొక్కలూ ఉన్నాయి. కాస్సేపు కూచోవడంతో యువతీ యువకు లిద్దరూ తేమ అలసటని మర్చిపోయేరు. చుట్టూతా ఉన్న మొక్కలకి పూసిన రంగురంగుల పువ్వులూ, వాటి కమ్మని పరిమళాలూ వాళ్ళ మనసుల్ని దోచుకున్నాయి. యువకుడు తన విల్లునీ, బాణాల్నీ రాతి గొడ్డల్నీ రాతి మీద పెట్టేశాడు. దగ్గర్లోనే గలగలా ప్రవహిస్తున్న స్ఫటికంలా స్వచ్ఛంగా ఉన్న జల ప్రవాహం ఒడ్డునే విరగపూసిన పూలమొక్కల దగ్గరికి వెళ్ళి తెల్లనీ, ఎర్రనీ, వంగపండు రంగుపీ పువ్వులు కొయ్యడం మొదలుపెట్టేడు. యువతీ ఆయుధాల్ని కింద పెట్టి తన నిడువైన బంగారపువన్నెతో మెరుస్తున్న కురులను సవరించుకో సాగింది. జుట్టుకుదుళ్ళు ఇంకా తడిగానే ఉన్నాయి. ఆవిడోసారి ప్రశాంతంగా ప్రవహిస్తున్న వోల్గానదీ ప్రవాహాన్ని చూసింది. ఓ క్షణంపాటు పక్షుల మధురకూజితాలు ఆవిణ్ణి తమపక్కకి ఆకర్షించాయి. వంగి పువ్వులు కోస్తున్న యువకునిమీద ఆవిడ చూపు నిలిచింది. యువకుడి జుట్టూ బంగారపు వన్నెదే! అయితే యువతి తన జుట్టుతో పోల్చిచూడలేకపోతోంది. ఆవిడకంటికి అతడిజుట్టే ఎంతో అందంగా అనిపిస్తుంది. యువకునికి పసుపూ బూడిదవన్నె కలిసిన దట్టమైన మీసం ఉంది. దానికి

పైన అతని ముక్కూ, బుగ్గలు, నుదురూ ఎరుపువన్నెతో ఉన్నాయి! యువతి చూపులు సూర్యశవుని రోమాలతో నిండి బలిష్ఠంగా ఉన్న భుజాలవేపుకి మళ్ళేయి. వాట్ని చూడగానే సూర్యశవుడు ఓ రోజున ఓ పెద్ద దంతాలున్న అడవిపంది నడుముని తన రాతి గంధ్రగొడ్డలి నెత్తి ఈ బలిష్ఠమైన చేతులతో ఒకే ఒక్క వేటులో ఎలా విరగ్గొట్టేడో ఆవిడకి జ్ఞాపకం వచ్చింది. ఆవేళ ఈ భుజాలు ఎంత కర్కశంగా ఉన్నాయి! ఇవాళ ఈ పువ్వుల్ని ఏరుతున్నప్పుడు ఎంత కోమలంగా కనబడుతున్నాయో! అయితే భుజాల కండరాలూ, మణికట్లుమీద ఉబ్బి ఉన్న నరాలూ ఇప్పుడూ అతని బలాన్ని చెప్పకచెపుతున్నాయి. ఆ భుజాన్ని ఓసారి ముద్దు పెట్టుకుందామా అని ఆవిడకి అనిపించింది. ఆవిడకవి ఎంతో అందంగానూ ఎంతో ప్రియమైన వాటిగానూ తోచాయి. ఆ తర్వాత ఆవిడ చూపు అతని తొడలవేపు మళ్ళింది. అడుగడుక్కీ అతని తొడలమీద కండరాలు నాట్యంచేస్తున్నాయి. ఎక్కడా కొవ్వులేకుండా కండరాలతోనిండిన అతని తొడలు, చక్కని పిక్కలూ,సన్నని మోకాలిచిప్పలూ దివకి నిజంగా ఎంతో అపూర్వంగా కనబడుతున్నాయి. సూర్యశవుడు ఎన్నోసార్లు దివప్రేమని పొందాలన్న వాంఛని వ్యక్తం చేశాడు. నోటితో ఎప్పుడూ అడగలేదు. తన చేష్టలతో తెలియచేశాడు. నృత్యంలో తన కౌశల్యాన్ని ఎన్నోసార్లు ప్రదర్శించి అమ్మిణ్ణి తనపట్ల ప్రసన్నురాలిగా చేసుకుందామని చూశాడు. అయితే దివ ఎంతమంది యువకులతోనో ఎన్నెన్నిసార్లో తనభుజాలు కలపి నాట్యం చేసింది. ఎన్నోసార్లు వాళ్ళని తన పెదిమలు ముద్దాడనిచ్చింది. అనేక పర్యాయాలు వాళ్ళకి తన తనువుని యిచ్చింది. అలాంటిది పాపం సూర్యశవుడు ఒక్క ముద్దుకి, ఒక్క కౌగిలింతకి ఒక్కసారంటే ఒక్కసారి చేతుల్తో చేతులు కలిపి నాట్యమాడ్డానికైనా ఇంతవరకూ నోచుకోలేదు.

దోసిలినిండా పువ్వులు నింపుకుని ఇప్పుడు సూర్యశవుడు దివవైపుకి వస్తున్నాడు. అతని నగ్నాంగాలన్నీ ఎంత పరిపూర్ణంగా ఉన్నాయి. అతని విశాలవక్షం, కొవ్వుతో కాక కండరాలతో చక్కటి పలుచటి ఉదరం ఎంత మనోహరంగా ఉన్నాయి! ఇంతవరకూ ఇతనిని లక్ష్యపెట్టలేదే అని ఆవిడ వాపోయింది. అయితే వాస్తవానికి దివ తప్పేమీ అంతగా లేదు. తప్పంతా సూర్యశవుడిదే! తన నోటికి సిగ్గనేతాళం వేసుకున్నాడు. నిజానికి తలుపుకొట్టిన వానికి దివ తలుపు తెరవకుండా ఎప్పుడూ లేదు.

సూర్యశవుడు తన దగ్గరకు రాగానే దివ చిరునవ్వులు చిందించింది.

"ఈ పువ్వులెంత అందంగా ఉన్నాయో! ఎంత సువాసన వేస్తోందో" అన్నాది.

పువ్వుల్ని రాతిమీద పెడ్తూ, "వీటిని నీ బంగారపువన్నె జడలోనే నేను ముడిచినప్పుడు ఇవి ఇంకా అందంగా ఉంటాయి" అన్నాడు సూర్యశవుడు.

"ఐతే సూరీ, నువ్వు నాకోసమేనా ఈ పువ్వులు తెస్త?"

"మరి దివా? నేనీ పువ్వుల్ని చూశాను. దాంతో నాకు జలదేవతలు జ్ఞాపకం వచ్చారు."

"జలదేవతలా?"

"ఎంతో అందమైన జలదేవతలు! ప్రసన్నం అయ్యేరా మనోవాంఛితా లన్నిటినీ నెరవేరుస్తారు. కోపంగాని వచ్చిందా ప్రాణాలతో వదలరు!"

"అయితే సూరీ! నువ్వు నన్ను ఎలాంటి జలదేవతనని అనుకుంటున్నావు?"

"కోపగించే దేవతగా మాత్రం కాదు."

"నీపట్ల నేనెప్పుడూ ప్రసన్నం కాలేదే"

దివ గట్టిగా నిట్టూర్చి మాట్లాడకుండా ఊరుకుంది. సూరశ్రవుడు మళ్ళీ చెప్పడం మొదలుపెట్టాడు.

"లేదు దివా! నువ్వు నాపట్ల ఎప్పుడూ కోపగించుకోలేదు. మన చిన్ననాటి రోజులు జ్ఞాపకం ఉన్నాయా?"

"అప్పుడు నీవు చాలా సిగ్గుపడేవాడివి."

"నువ్వు-ఎప్పుడూ కోపగించుకునేదానివి కాదు."

"అప్పుడు నా అంతట నేనే నిన్ను ముద్దాడుతూ ఉండేదాన్ని."

"నిజమే ఆ ముద్దార్ధం ఎంతో తియ్యగా ఉండేది,"

"కాని ఇదిగో నా యీ గుండ్రని చన్నులు ఎదగడం మొదలుపెట్టేక(కబీలా) గుంపులోని యువకులంతా నా కోసం ఆరులుజాచడం మొదలుపెట్టేక, నిన్ను నేను మరిచిపోయేను." అని దివ కొంచెం ఖిన్నురాలైంది.

"దివా! ఇందులో నీ తప్పేంలేదు."

"మరెవరి తప్పు?"

"నాది. ఎంచేతంటవా! గుంపులోని యువకులందరూ ముద్దాడవా అని నిన్ను అడిగారు. నువ్వు వాళ్ళని ముద్దాడావు. గుంపులోని యువకులందరూ కౌగిలింతలీయవా అని అడిగారు. నువ్వు కౌగిలింతలిచ్చావు. వేటలో నేర్పరులు, నృత్యంలో నిపుణులు, శారీరకమైన బలం దారుఢ్యం ఉన్నవాళ్ళు అందమైన వాళ్ళు - గుంపులోని యువకుల ఆశల్ని నువ్వెప్పుడూ కాదనలేదు."

"కాని సూరీ! నువ్వూ అలాంటి వాడివే. వాళ్ళందరికన్నా నిపుణుడివి-చతురుడివి - బలశాలివి, అందమైనవాడివి, నీ ఆశల్ని నేను తీర్చలేదు."

"నోటితో ఎప్పుడూ చెప్పే అలవాటు నీకులేదు. మన చిన్నతనంలో ఇద్దరం కలసి ఆడుకునేటప్పుడూ నువ్వు మాటలతో ఎప్పుడూ ఏదీ అడిగేవాడివి కాదు. ఇప్పుడు దివా సూరిని మరిచిపోయింది. కాని ఈ దివ (పగలు) ఆ ప్రకాశిస్తున్న సూరి (సూర్యుణ్ణి)ని ఎప్పుడైనా మరచిపోతుందా? ఇంక ఇప్పుడు దివ నిన్నెప్పుడూ మరచిపోదు."

"అయితే నేను ఆ సూరిగానూ నువ్వు ఆ దివాగానూ అయిపోదామా?"

"ఆఁ నేను నీ పెదిమలని ముద్దాడతాను."

పసిపిల్లలాంటి ఆ నగ్న సౌందర్యమూర్తులు తమ పెదిమలని కలిపారు. దివ అవసెపువ్వులాంటి సొగసైన తన నీలిరంగు కళ్ళని అదే రంగుతో ఉన్న సూరి కళ్ళలోకి గుచ్చుతూ "నువ్వు నా తల్లికడుపున పుట్టినవాడివే. నిన్ను నేను మర్చిపోయేను." అన్నాది. అవిడకళ్ళు చెమర్చాయి. సూరి తన బుగ్గలతో ఆమెకళ్ళని తుడుస్తూ "నువ్వు నన్ను మర్చిపోలేదు దివా! నువ్వు యీడేరక నీ గొంతు, నీ కళ్ళు, ని అవయవాలు అన్నీ నాకు ఇంకోలా కనిపించసాగాయి. దాంతో నేనే నీకు దూరం అయిపోతూ వచ్చాను.

"మనస్ఫూర్తిగా కాదు కదా సూరీ!"

"అదే దివా!"

"చెప్పు. ఇహ నువ్వెప్పుడూ నాదగ్గర సిగ్గుపడవుగా!"

"ఉహూం సిగ్గుపడను. మరి నన్నీ పువ్వుల్ని గుచ్చనీ."

సూరశ్రవుడు ఓ కాడనుంచి నారని లాగి దాంతో ఎర్రని తెల్లని వంగపండు రంగువి. పువ్వులన్నింటిని గుచ్చడం మొదలుపెట్టేడు. పువ్వులు క్రమంగా గుచ్చడంలో అతని చక్కని అభిరుచి కనబడింది. తల వెంట్రుకల్ని సరిచేసి వీపుమీద పరిచాడు. ఎండాకాలంలో ఓల్గా నదీతీరంలోని యువతీయువకులు స్నానం చెయ్యడం అన్నా నదిలో తరచు ఈతలాడ్డం అన్నా ఎక్కువగా ఇష్టపడతారు. అందుకే దివ జుట్టు చిక్కులుపడకుండా శుభ్రంగా వుంది. సూరి మూడు మడతల వడ్డాణంలా ఆ జుట్టుని తీర్చి దిద్దాడు. మధ్యస్థంగా తెల్లపువ్వుల గుత్తినీ, రెండు వైపులా వంగపండు రంగు పువ్వులగుత్తుల్ని నుదుటమీద జుట్టులో పెట్టేడు. దివ రాతిమీద కూచునిఉంది. సూరి కొంచెం వెనక్కి నాలుగడుగులు వేసి ఆవిడ మొహాన్ని చూశాడు. ఆవిడ అతనికి ఎంతో అందంగా కనిపించింది. మరికాస్త దూరం వెళ్ళి చూశాడు. ఆవిడింకా అందంగా కనిపించింది. అయితే అక్కడికి పువ్వుల పరిమళం రావటంలేదు. సూరి ఆవిడ దగ్గర కూచుని తన బుగ్గలని ఆవిడ బుగ్గలకి చేర్చాడు. దివ తన సహచరుని కళ్ళను ముద్దాడింది. కుడిచేతిని భుజంమీద వేసింది. సూరి తన ఎడంచేత్తో దివ నడుం చుట్టూ వేసిపట్టుకున్నాడు.

"దివా! ఈ పువ్వులు ఇందాకటికన్నా అందంగా ఉన్నాయి."

"పువ్వులా? నేనా?"

సూరికి ఏం జవాబు చెప్పాలో తోచలేదు. కాస్సేపు ఊరుకుని ఇలా అన్నాడు.

"నేను కొంచెం దూరంగా వెళ్ళి నిన్ను చూశాను. నువ్వు చాలా అందంగా కనిపించావు. ఇంకా దూరంగా వెళ్ళి చూశాను. మరింత అందంగా కనబడ్డావు."

"వోల్గానది ఒడ్డునుంచి చూస్తే?"

"ఉహూ! అంత దూరంనుంచి వద్దు-"

సూరి కళ్ళలో విచారం కనిపించింది. "దూరంనుంచైతే నీ పరిమళం దూరమైపోతుంది. నీ రూపమూ దూరమైపోతుంది."

"సూరీ! నీకు నన్ను దూరం నుంచి చూద్దామనిపిస్తోందా? లేకపోతే నీకు నా దగ్గర ఉందామనిపిస్తోందా?"

"దగ్గరగా ఉండడం. దివా! పగలువెంట సూర్యుడు ధగధగ లాడినట్టు"

"ఇవాళ నాతో నృత్యం చేస్తావా?"

"తప్పకుండా"

"ఇవాళ నాతోపాటు ఉంటావా?"

"తప్పకుండా."

"రాత్రంతా?"

"తప్పకుండా."

"అలా అయితే ఇవాళ గుంపులో మరే యువకుడి దగ్గరికి నేను వెళ్ళను" అని దివ సూరిని కౌగలించుకుంది.

ఇంతలో ఎంతోమంది యువతీయువకులు వేటగాళ్ళు అక్కడికి వచ్చారు. వాళ్ళ సవ్వడి విన్నా కూడా ఈ ఇద్దరూ ఒకరినొకరు కౌగలించుకునే ఉన్నారు.

"దివా! ఇవాళ నువ్వు సూరిని సహచరుడిగా చేసుకున్నావా?" వాళ్ళు దగ్గరికి వచ్చి అడిగారు.

"ఆ' మొహం వాళ్ళవైపుకి తిప్పి - "ఇదిగో చూడండి. ఈ పువ్వులు సూరే అలంకరించాడు" అన్నది.

"సూరీ! నువ్వు పువ్వులు మా చక్కగా అలంకరిస్తావు. నా జుట్టునీ అలంక రించవా? అన్నది ఓ యువతి.

"ఇవాళ కాదు. ఇవాళ సూరి నా వాడు. రేపు." అన్నది దివ.

"రేపు సూరి నా వాడు" అన్నాది యువతి.

"రేపా? రేపూ సూరి నా వాడే" అంది దివ.

"రోజూ నీ వాడేనా? ఇదేం బాగులేదు." అన్నాది యువతి.

దివకి తనతప్పు తెలిసింది. "రోజూ కాదు సోదరీ! ఇవాళ్టికి, రేపటికి మాత్రమే" అంది.

మెల్లిమెల్లిగా ఎందరో వేటగాళ్ళు ప్రౌఢవయస్కులు వచ్చేశారు. ఓ పెద్ద నల్లకుక్క దగ్గరగా వచ్చి సూరి కాళ్ళు నాకటం మొదలుపెట్టింది. సూరికి తను వేటాడిన పెద్ద గొర్రె గురించి జ్ఞాపకం వచ్చింది. దివ చెవిలో ఏదో చెప్పి అతడు దొడుతీశాడు.

## 2

కర్రతడకల గోడలతోనూ, గడ్డితోనూ వేసిన ఓ విశాలమైన గుడిసె. రాతి గొడ్డళ్ళు పదునుగానే ఉంటాయి గాని వాటితో ఈ కలపను కొట్టడానికి వీలుపడదు.

వాళ్ళు కలపను కొయ్యడానికి నిప్పుని ఉపయోగించేవారు. అయితే రాతిగొడ్డళ్ళు చాలా ఉపయోగపడ్డాయి. అందులో సందేహంలేదు. ఇంత పెద్ద గుడిసా? అవును. మరి, ఇందులోనే నిశ సమూహం అంతమందీ- నిశ శేషాలో ఏ ప్రాచీనకాలపు స్త్రీ సంతానమో–ఉంటున్నారు. గుంపు గుంపుగా ఒకే కప్పు కింద ఉంటుంది. కలిసి వేటాడుతుంది. కలిసి పళ్ళనీ, తేనెని పోగుచేస్తుంది. గుంపు యావత్తుకీ ఒకతే నాయకురాలు. గుంపు యావత్తునీ నడపడానికి ఒక జనసమితి ఉన్నది-నడపడమే అయితే ఈ నడపడంవల్ల గుంపులో వ్యక్తుల జీవితాల్లో ఏ అంశమూ భిన్నంగా ఉండదు. వేటాడ్డం, నాట్యమాడ్డం, ప్రేమించడం, ఇళ్ళుకట్టడం, తోలు ఆచ్ఛాదనలు తయారుచెయ్యడం- అన్ని పనులను జనసమితే నిర్వహిస్తుంది. ఈ సమితిలో సమూహపు తల్లులకే ప్రాధాన్యత ఉంటుంది. నిశ సమూహం ఉంటున్న ఈ గుడిసెలో నూటయాభైమంది స్త్రీ పురుషులు ఉన్నారు. అయితే వీళ్ళంతా ఒక కుటుంబమేనా? చాలావరకు ఒకటే కుటుంబం అనొచ్చు. అనేక కుటుంబాలనికూడా చెప్పొచ్చు. ఎంచేతా అంటే తల్లి జీవించినంతకాలం ఆమె సంతానం అంతా కలిపి ఓ చిన్న కుటుంబంలా ఉంటుంది. అంటే ఆవిడ సంతానంలో అందరూ ఆ తల్లి పేరుతోనే పిలవబడతారు. ఉదాహరణకి చెప్పాలంటే దివతల్లి లేదనుకొండి-దివే ఎంతో మంది పిల్లలకి తల్లి అయిందనుకోండి, అప్పుడాపిల్లల్ని దివాసూనులు (దివాపుత్రులు) దుహితలు (దివాపుత్రికలు) అంటారు. అలా అయినా కూడా దివ సంతానానికి తమ స్వంత ఆస్తి (మాంసం, పళ్ళు) అంటూ వేరుగా ఏం ఉండదు. యావన్మందీ, స్త్రీ పురుషులంతా కలిసి ఆ స్తిని ఆర్జిస్తారు. కలిసే దానిని అనుభవిస్తారు. ఏమీ సంపాదించలేని రోజుల్లో కలిసే పస్తు పడుకుంటారు. ఏ వ్యక్తి తన సమూహాన్ని కాదని తనకి ప్రత్యేకమైన హక్కుని కలిగివుండడు. సమూహం ఆజ్ఞలని, సమూహపు రివాజుల్ని పాటించడం వాళ్ళకి తమ తమ కోరికల ననుసరించే నడవడం అంత తేలికగా కనపడుతుంది.

మరి గుడిసో? ఈ గుడిసె తాత్కాలికమైనదే. ఈ చుట్టుప్రక్కల ఇప్పుడు దొరుకుతున్న వేట జంతువులు ఈ పరిసరాల్ని వదిలి దూరంగా వెళ్ళిపోయినా, ఈ చుట్టూ ప్రస్తుతం దొరుకుతున్న కందమూల ఫలాలు అయిపోయినా ఈ యావన్మందీ మరోచోటికి తరలిపోతారు. శతాబ్దాల బట్టి గడించిన అనుభవంతో వేట జంతువులు ఏ ప్రాంతం నుండి ఏ ప్రాంతానికి ఎప్పుడు వెళ్ళిఉంటాయో వాళ్ళు గ్రహించుకోగలరు. ఇక్కణ్ణుంచి వెళ్ళిపోయేక పై కప్పుమీది గడ్డితే రాలి కింద పడిపోతుంది కాని కలపతోనూ, రాళ్ళతోనూ కట్టుకున్న గోడలు మాత్రం చాలా సంవత్సరాల వరకూ అలాగే నిలిచి ఉంటాయి. కొత్త ప్రాంతాలకి వెళ్ళి అక్కడున్న గోడలమీద గడ్డితో పైకప్పువేసి కొత్త యిల్లు కట్టుకుంటారు. అందులో ఓ పక్క సామాను పెట్టుకోడానికి ఇంకోవైపు వంట వొండుకోడానికి జాగాల్ని కేటాయించుకుంటారు.

సమూహంలో అంతాకలిసి మట్టితో పాత్రలు తయారు చేస్తారు. పుర్రెలని కూడా పాత్రల్లా వినియోగిస్తారు. ఒక్కోసారి పచ్చిమాంసాన్ని తింటారు. ఒక్కోసారి తాజా మాంసాన్ని కాల్చుకొని తింటారు. ఎండిపోయిన మాంసాన్ని కాల్చడం నిషిద్ధంగా భావిస్తారు. వోల్గానదికి ఈ పరిసర ప్రాంతాల్లోని అడవుల్లో తేనె పుష్కలంగా దొరుకుతుంది. అంచేత తేనెని భక్షించే భల్లూకాలూ ఇక్కడ ఎక్కువగా ఉంటాయి. నిశ – సమూహానికి తేనె అంటే బహుప్రీతి. తేనెగా తిందమన్నా వాళ్ళకి ఇష్టమే - మద్య రూపంలో తాగడమన్నా ఇష్టమే.

మరి ఈ సంగీతమా? స్త్రీ పురుషులు కలసి తియ్యని స్వరాలతో పాడుతున్నారు. ఆచ్ఛాదనలుగా తయారు చెయ్యడానికి తోళ్ళని అంతమంది కలసి బాదీ కొట్టే బాగుచెయ్యటం లేదూ? అలాగే ఇది కూడా! సమూహం ప్రతీ పనినీ కలిసే చేస్తుంది. అంతేకాదు ఆ పనిని సరదాగా మనోరంజకంగా కూడా చేస్తుంది. పాడుతూ కలసి పనిచేయడం ఓ భాగమే. పాడ్డంలో పని అలసటని మర్చిపోవడం జరుగుతుంది. అయితే ఇప్పుడీ పాటలు పనిచేస్తూ పాడుతున్న పాటల్లా లేవు. ఓసారి స్త్రీల గొంతు తియ్యగా కోమలంగా వినిపిస్తూంది. మరోసారిపురుషుల గొంతు గంభీరంగా కర్కశంగా వినిపిస్తోంది. పదండి వెళ్ళి చూద్దాం ఏమిటో మరి.

గుడిసెలో ఓ పక్కగా కేటాయించిన భాగంలో సమూహంలోని స్త్రీలూ పురుషులూ, యువకులూ, వృద్ధులూ, పిల్లలూ అంతా చేరారు. ఇంటికప్పు మధ్యలో కోసేసి ఉంది. దానికి సరిగా కిందని దేవదారుకర్రలతో మండుతున్న అగ్ని. స్త్రీ పురుషులంతా ఏదో రాగయుక్తంగా పాడుతున్నారు. ఆ రాగం లోంచి వినిపిస్తున్న శబ్దాలేమిటా -

"ఓ-ఓ-గ-గ—న్-ఆ-ఆ—యా."

వీళ్ళి అగ్నిని ప్రార్థిస్తున్నారా? సమూహపు నాయకురాలు, జనసమితి నిర్వాహకులూ అగ్నిలో మాంసాన్ని కొవ్వుని, పళ్ళని, తేనెని వదులుతున్నారు. ఈసారి సమూహానికి వేట బాగా దొరికింది. పళ్ళూ తేనె పుష్కలంగా లభించాయి. జంతువులవల్ల గాని మానవశత్రువుల వల్లగాని సమూహపు సంతానానికి ఏకీడూ కలగలేదు. అందుకే ఈ పున్నమిరోజున సమూహం అగ్నిదేవునికి తమ కృతజ్ఞతలు చెప్పకుంటూ పూజిస్తున్నది. ఇప్పుడిప్పుడే సమూహపు నాయకురాలు తేనే— మద్యంతో నిండిన గిన్నెను అగ్నికి అర్పించింది. జనమంతా నిల్చున్నారు. పుట్టినప్పుడెలా నగ్నంగా ఉన్నారో అలాగే ఇప్పుడూ అందరూ నగ్నంగా ఉన్నారు. ఈ వేడీ ఉక్కలో తమ చర్మాన్ని మరో చర్మంతో కప్పడం అన్నది తమ శరీరాలకు మరింత యాతన కలిగించడంగా వారు భావిస్తున్నారు. వాళ్ళ శరీరాలు ఎంత సౌష్టవంగా ఉన్నాయో! వీళ్ళలో ఎవరికైనా పొట్ట పెరిగిందా? ఎవరి ఒంటినైనా కొవ్వుపట్టి ఊబగా తయారయిందా! అబ్బే సౌందర్యం అంటే ఇదే! ఆరోగ్యం అంటే ఇదే వీళ్ళందరి మొహాలు అచ్చుముచ్చు ఒక్కలాఉన్నాయి. ఎందుకుండవూ?వీళ్ళంతానిశ,

సంతానమే! తండ్రివల్లా, సోదరులవల్లా పుత్రులవల్లా పుట్టినవారు. అందరూ మంచి ఆరోగ్యవంతులూ, బలిష్ఠులూను. అనారోగ్యంతోనూ దుర్బలత్వంతోనూ వ్యక్తిఃజీవితంలో, ఈః ప్రకృతి మధ్య. ఈః జంతులోకం మధ్య-శతృత్వ . మధ్య బతకలేడు.

సమూహపు నాయకురాలు లేచి పెద్దశాలలోకి వెళ్ళింది. మట్టితో అలికిననేల మీద అంతా కూచున్నారు. తోలుసిద్దెలతో మధువు వస్తూనే వుంది. మధుపాత్రలా? ఒకరిచేతిలో పుర్రెతో చేసిన పాత్ర ఉంటే మరొకరి దగ్గర ఎముకతో చేసినదో, కొమ్ముతో చేసినదో ఉంది. ఇంకొహరి దగ్గర దేవదారు ఆకులదొన్నె ఉంది. యువతీయువకులు, ప్రౌఢ వయస్కులైన మగవారు, ఆడవారు,వృద్ధపురుషులు,వృద్ధ స్త్రీలు,వేరువేరు జోడాలుగా కూచుని సురాపానంలో మునిగి ఉన్నారు. అయితే ఇది నియమంకాదు.వృద్ధ స్త్రీలుఎంతోమంది తాముతమ జీవితంలోసంపూర్ణంగాఆనందాన్ని అనుభవించామనీ, ఇప్పుడిహ ఈః వొంతు యౌవ్వనంలో ఉన్నవాళ్ళదని అంటారు. అయితే ఎంతమందో యువతులు దీనికిభిన్నంగా తమచేతులతో కొంతమంది వృద్ధులకి వాళ్ళబతుకుల చివరి కాలంలో అమృతపుగుటకల్ని తాగించాలని అనుకుంటున్నారు. అదిగో చూడండి దివని. ఆవిడ దగ్గర ఎంతమంది యువతీ యువకులు కూర్చుని ఉన్నారో! ఇవాళ ఆవిడ చెయ్యి ఋభుని భుజంమీద ఉంది. సూరశ్రవుడు దివాతోపాటు కూచుని ఉన్నాడు.

అన్నపానాలు, నృత్యగీతాలు ఆ తర్వాత ఈః పెద్దశాలలో ప్రేమికుల క్రీడా కలాపాలు అన్నీ ఇక్కడే. పొద్దున్నేలేచి కొంతమంది స్త్రీ పురుషులు ఇంటి పనులు చేస్తారు. కొంతమంది వేటాడ్డానికి వెళ్తారు కొంతమంది పళ్ళని ఏరతారు. మరి గులాబీవన్నె బుగ్గలతో కనిపించే ఈః చిన్న చిన్న పిల్లలా ? వాళ్ళలా కొంతమంది తల్లి ఒడిలో ఉంటే కొంతమంది చెట్టునీడలో పరిచిన చర్మాలమీద వుంటారు. కొంతమంది ఎదిగిన పిల్లల వీపుమీదో, ఒడిలోనో ఉంటే మరి కొంతమంది వోల్గానది ఒడ్డున ఇసుకలో గెంతుతూ ఉంటారు.

నిశ రాజ్యంలో కన్నా ఇప్పుడు వృద్ధ స్త్రీలూ పురుషులూ ఎక్కువ సుఖంగానూ, సంతుష్టిగానూ, ఉన్నారు. సమూహం అన్నది ఇప్పుడు జీవించి ఉన్న ఒక తల్లి రాజ్యం కాదు! జీవించి ఉన్న ఎందరో తల్లులు కుటుంబాలతో కలిసిన ఏక కుటుంబం. ఇప్పుడు ఓ సమూహంగా ఉంటోంది. ఇప్పుడిది ఓ తల్లి పెత్తనంలో ఉన్న అడ్డూ ఆపూ లేని రాజ్యం కాదు. సమూహం జనసమితి అధికారంలో పెత్తనంలో ఉంటోంది. అంచేత ఇక్కడ ఏ నిశకీ తన లేఖని వోల్గానదిలో ముంచి చంపాల్సిన అవసరం లేదు.

## 3

దివాకి నలుగురు కొడుకులూ, ఐదుగురు కూతుళ్లూను. నలభై అయిదో ఏట ఆవిణ్ణి నిశసముదాయానికి జన-నాయకురాలిగా చేశారు. గత ఇరవై అయిదేళ్ళలో

నిశ సముదాయం సంఖ్యలో మూడు రెట్లు పెరిగింది. సూరి దివాపెదిమల్ని ముద్దాడి అభిణ్ణందుకు అభినందిస్తూ ఉంటాడు. అయితే "ఇదంతా అగ్నిదేవుని దయ భగవంతుని ప్రతాపం. అగ్నిని శరణుజొచ్చిన వాడిచుట్టూ దేవుని శరణుజొచ్చిన వాడి చుట్టూ మధువులు ప్రవహిస్తూనే ఉంటాయి. వోల్గానది ప్రవాహంలా ఎప్పుడూ పారుతూనే ఉంటాయి. వాడి వనాల్లో అనేక రకాలైన పశువులు గడ్డిమేస్తూనే ఉంటాయి" అని అంటుంది దివ.

నిశ సమూహానికి చాలా కష్టంగా ఉంది. పూర్వంలాగా నిశ సమూహం ఓ స్థలం నుంచి మరో స్థలానికి మారినప్పుడు కాస్తంత అడివితో వాళ్ళ అవసరాలు తీరటం లేదు. వాళ్ళ సమూహం ఉండే ఇంటినే మూడురెట్లు విశాలంగా కట్టుకోవలసి రావడమే కాదు, మూడు రెట్లు పెద్దదైన వేటస్థలాన్ని కూడా కేటాయించుకోవలసి వస్తోంది. ప్రస్తుతం వాళ్ళు ఏ వేట స్థలంలో డేరా వేసుకున్నారో దానికి ఉత్తరంగా ఉష-సమూహం వారి వేటస్థలం ఉంది. రెండింటి మధ్యా కొంత స్థలంలో ఎవరి హక్కుకూ రాని వనభూమి ఉంది. నిశ–సమూహం వారు ఎవరికీ చెందని ఆ వన ప్రాంతానికే కాదు ఉష– సమూహం వారి వేట స్థలానికి వేటాడ్డానికి చాలా సార్లు వెళ్ళేరు. జనసమితి ఉష-సమూహం వారితో కలహం రావచ్చునని అనుకుంది. అయితే మార్గాంతరం ఏం తోచలేదు. జనసమితిలో ఓసారి దివ అన్నాది- "దేవుడు ఇన్నినోళ్ళని సృష్టించాడు. ఆ నోళ్ళకి ఆహారంగాఈ వనాల్ని పుట్టించాడు. ఈ వనాల్ని వదిలేస్తే ఇంత మంది నోటికి ఆహారం ఇవ్వలేం. అంచేత నిశ సమూహం అడవిలోని ఎలుగ్గొడనీ, ఆవుల్నీ, గుర్రాలని వదులుకోలేదు. వోల్గా నదిలోని చేపల్ని వదులుకోలేనట్లుగానే!"

ఉష సమూహం నిశ సమూహం చేస్తున్న యీ దురన్యాయాన్ని చూసింది. వాళ్ళ జనసమితి నిశ జనసమితితో చాలాసార్లు సంభాషణలు జరిపింది. బోధపర్చింది. నచ్చచెప్పింది. "అనాదికాలం నుంచి మన రెండు సమూహాల మధ్యా ఎప్పుడు యుద్ధం అన్నది జరగలేదు. ప్రతి శరత్కాలంలోనూ ఇక్కడి కొచ్చి ఉంటూ వస్తున్నాం." అయితే ఆకలితోచచ్చిపోతూ న్యాయబద్ధంగా ఉండడానికి నిశసమూహం ఎలా సిద్ధంకాగలదు? అన్ని నియమాలూ విఫలమైనప్పుడు అడవి చట్టాల్ని పట్టుకోవల్సివస్తుంది. రెండు సమూహాలు లోలోపల ఎవరికివారు దీనికి సిద్ధపడ్డం మొదలు పెట్టారు. ఒకరి సంగతి మరొకరికి తెలియటంలేదు. ఎంచేతా అంటే ప్రతి సమూహమూ పెళ్ళి-పేరంటం, శుభం అశుభం-చావులూ అన్నీ తమ సమూహంలోంచే చేసుకుంటున్నారు.

నిశ సమూహంలోని ఓ దళం తమదికాని వేటస్థలం లోకి వేటాడ్డానికి వెళ్ళింది. ఉష సమూహం లోనివారు పొంచేసుకుని పొంచికూచున్నారు. వాళ్ల దాడిచేశారు. నిశ సమూహం వారూ నిలిచి పోరాడారు. అయితే ఈ దాడికి సిద్ధమై తగినంత సంఖ్యలో వాళ్ల రాలేదు. తమజట్టులో చచ్చిపోయిన వాళ్ళనెంత మందినో అక్కడేవదిలేసి,

దెబ్బలుతిన్న వాళ్ళనెంతమందినో తమతో తీసుకుని వాళ్లు పారిపోయేరు. ఈ సంగతి సమూహం నాయిక విన్నది. దీని గురించి జనసమితి యోచన చేసింది. ఆ పిమ్మట సాధారణసభ - యావత్తు సమూహంలోని స్త్రీ పురుషులందరితో కూడిన సభ జరిగింది. జరిగిన భోగట్టా అంతా సభకి తెలపడం జరిగింది. చనిపోయినవారి పేర్లు చెప్పేరు. దెబ్బలుతిన్నవారిని సభముందు హాజరు పరిచారు. సోదరులూ, పుత్రులూ, తల్లులూ, తోబుట్టువులూ, కుమార్తెలూ అంతా జరిగిన దానికి ప్రతీకారం తీర్చుకోవాలని సమూహాన్ని యావత్తునీ ఉత్తేజపరిచారు. నెత్తురు చిందినదానికి ప్రతీకారంగా నెత్తురు చిందించడం సమూహం ధర్మానికి చాలా విరుద్ధమైనపని. సమూహ ధర్మానికి విరుద్ధంగా ఏ సమూహమూ ఏపనినీ చెయ్యలేదు. అయితే ఈ సమూహం చచ్చిపోయినవాళ్ళ నెత్తురుకి ప్రతీకారంగా యుద్ధం చెయ్యాలని నిర్ణయించింది.

నృత్యవాద్యాలు కాస్తా యుద్ధవాద్యాలుగా మారిపోయేయి. పిల్లల్ని ముసలి వాళ్ళనీ కాపాడటానికి కొంతమంది స్త్రీ పురుషుల్నీ వదిలి మిగతావారంతా బయల్దేరారు. వాళ్ళ చేతుల్లో విల్లులూ, బాణాలూ, రాతిగొడ్డళ్ళూ, బడితెలూ, కర్రగదలూ ఉన్నాయి. వాళ్లు తమ శరీరాలకి చాలా దళసరిచర్మాలని కంచుకాలుగా కట్టుకున్నారు. ముందు వాద్యాలు మోగుతూ వెళ్తున్నాయి. వాటివెనక ఆయుధాల్ని పట్టుకున్న స్త్రీ పురుషులు, సమూహం నాయకురాలు దివ అందరికన్నా ముందువుంది. దూర దూర ప్రాంతాలవరకూ వినిపిస్తున్న రణవాద్యాలధ్వనులతో, జనుల కోలాహలంతో ఆరణ్యం అంతా మారుమోగుతోంది. పశువులూ పక్షులూ భయంతో అటూ-ఇటూ పరుగులు తీస్తున్నాయి.

తమ వేటస్థలాన్ని వదిలి ఎవరికీ చెందని స్థలంలోకి ప్రవేశించారు. - హద్దులు తెలిపే చిహ్నాలు ఏవీ లేనప్పటికి ప్రతి సమూహంలోని వేటగాడికి తమ హద్దు ఏదో తెలుసు. ఆ విషయంలో ఆతడు అబద్ధం ఆడలేడు. అబద్ధం అన్నది మనిషి ఇంకా అప్పటికి ఎరగడు. అది ఎంతో కఠినవిద్య. వేటగాళ్ళతమ సమూహానికి ఈ విషయం చేరవేశారు. వాళ్ళ సమూహం ఉండే గుడిసెలోంచి ఆయుధాలు ధరించి బయలుదేరారు. ఉష సమూహం నిజానికి న్యాయం కోరుకుంటోంది. తన వేపు క్షేత్రాన్ని కాపాడుకోవాలని మాత్రమే అది అనుకుంటోంది. అయితే మిత్రులు కాని రెండో సమూహం వారు ఈ న్యాయానికి ఇచ్చగించడం లేదు. ఉష సమూహాల వారి వేట క్షేత్రంలో రెండో సమూహాల మధ్యా యుద్ధం జరిగింది. చెకుముకి రాళ్ళతో తయారు చేసిన సూదిమొన ఉన్న బాణాలు స్సర్‌స్సర్‌మని కురుస్తున్నాయి. రాతిగొడ్డళ్ళతో దభీదభీమని ఒకరిపైనొకరు కొడుతున్నారు. బల్లెంతో గదలతో ఒకరినొకరు దెబ్బ తీస్తున్నారు. ఆయుధాలు చెయ్యిజారిపోయినా విరిగిపోయినా యుద్ధం చేస్తున్నా ఈ భటులూ భటురాండ్రు తమ చేతుల్తో దంతాలతో లేదూ కిందపడి ఉన్న రాళ్ళు తీసుకుని యుద్ధాన్ని సాగిస్తున్నారు.

నిశ సమూహం సంఖ్య ఉష సమూహం సంఖ్యకన్నా రెండింతలు ఉంది. అంచేత నిశ సమూహాన్ని గెలవడం ఉష సమూహం వారికి అసంభవమే. అయితే పోరాడ్డం తప్పనిసరి. సమూహంలోని ఆఖరి పిల్లడు చనిపోయేంతవరకూ పోరాడవల్సిందే. ఝాముపొద్దెక్కిన తర్వాత యుద్ధం మొదలయింది. ఆడవిలో ఉషసమూహంలో మూడుపంతుల్లో రెండుపంతులమంది చచ్చిపోయేరు. అయితే గాయపడ్డవారిని మాత్రం శత్రువులు చంపలేదు. సమూహాల యుద్ధంలో గాయపడ్డ శత్రువుని హింసించడం మహా అధర్మం. మిగిలిన ఓ వంతూ వోల్గా ఒడ్డున యుద్ధం చేస్తూ ప్రాణాలువదిలారు. వృద్ధులతో పిల్లలతో తల్లులు సమూహపు గుడిసెని వదిలి పారిపోవాలని అనుకున్నారు. అయితే అప్పటికే సమయం మించిపోయింది. నిశసమూహంలోని అనాగరిక స్త్రీ పురుషులు వాళ్ళని తరిమితరిమి పట్టుకున్నారు. పాలుకారే పసిపిల్లల్ని రాళ్ళమీద వేసి కొట్టేరు. వృద్ధ స్త్రీలకి పురుషులకి మెడల్లో రాళ్ళు కట్టి వోల్గానదిలో ముంచేశారు. సమూహం గుడిసెలో ఉన్న మాంసాన్నీ, పళ్ళనీ, తేనెని, మద్యాన్నీ మిగతా సామానంతటిని బైటపెట్టి పిల్లల్నీ స్త్రీలని గుడిసెలో బంధించి గుడిసెకి నిప్పుపెట్టేరు. శరీరంలోని కణుపు కణుపుని తుళ్ళగొడుతూ మండుతున్న జ్వాలల మధ్య జనం ఆక్రందన చేస్తూ ఉంటే నిశసమూహం ఎంతో ఆనందిస్తూ అగ్నిదేవుడికి కృతజ్ఞతలు చెప్పుకుంది. శత్రువులు కూడబెట్టిన మాంసంతోనూ మదిరతోనూ తమ యిష్టదేవతలని తృప్తిపరచింది. తమను తామూ తృప్తిపరచుకున్నాది.

సమూహం నాయకురాలు దివకి చాలా సంతోషంగా ఉంది. ఆవిడ ముగ్గురు తల్లుల దగ్గర్నుంచి వారి గుండెల్ని అంటుకుని ఉన్న పిల్లల్ని లాక్కుని రాళ్ళమీద విసిరి కొట్టింది. ఆ పిల్లల పుర్రెలు బద్దలై ఫటేల్మని చప్పుడవగానే ఆవిడ ఆనందంతో ఇకిలించింది. కడుపునిండా తిన్నాకా, తాగాకా ఆ అగ్ని కాంతుల్లోనే నృత్యం చెయ్యడం మొదలయింది. దివ తన ఈడేరిన చిన్న కుమారుడు పసుతో కలిసి ఆవాళ నాట్యం చేస్తోంది. నగ్నంగా ఉన్న ఆ ఇద్దరూ తాళానికి అనుగుణంగా నృత్యం చేస్తూనే ఒకరినొకరు ముద్దాడుతున్నారు. ఒక్కోసారి కౌగలించుకుంటున్నారు. మరోసారి గుండ్రంగా తిరిగి రకరకాలైన నృత్యవిన్యాసాలను చేస్తున్నారు. సమూహంలోని వారందరికీ ఈ రోజు తమ నాయకురాలు దివ ప్రేమకి పసు నోచుకున్నాడని తెలుసు. విజయంతో ఉన్మత్తురాలైన తన తల్లి ప్రేమని పసు నిరాకరించడనీ వాళ్ళకి తెలుసు.

నిశా సమూహం వేటక్షేత్రం ఇప్పుడు నాలుగింతలకన్నా అధికంగా పెరిగిపోయింది. శరత్కాలనివాసానికి ఇహచింతన్నది లేదు. భయం, చింతా ఒకే ఒక దావికుంది. ఉష సమూహంలో చంపబడ్డ జనం అంతా బతికుండగా సాధించలేకపోయేరు కాని ఇప్పుడు చచ్చి ప్రేతాలై సాధించాలని అనుకుంటున్నారు. ఆ కాల్చేసిన గుడిసె ఇప్పుడు ప్రేతపురంగా మారిపోయింది. ఆ వేపునుంచి నిశసమూహంలో వారికి ఒంటరిగా వెళ్ళడం మహాకష్టంగా ఉంది. వేటకెళ్ళినవాళ్ళు ఎన్నోసార్లు చాలా

దూరంవరకూ విస్తరించి మండుతున్న అగ్ని ముందు వందలకొద్దీ మనుషులు నగ్నంగా నృత్యంచేస్తున్నట్టు చూశారు. స్థలాన్ని మార్చేటప్పుడు ఈ సమూహానికి అటువైపు నుంచే వెళ్ళాల్సి ఉంది. అయితే అప్పుడు వాళ్ళ సంఖ్య ఎక్కువగా ఉంటుంది కాబట్టి ఫర్వాలేదు. ఆఖరిగాక పగటిపూట వాళ్ళు వెళ్ళారు. దివ అయితే ఎన్నోసార్లు చీకట్లో పసిపాపలు నేలలోంచి ఎగిరిగంతేసి ఆవిడచేతుల్ని చుట్టుకుంటున్నట్టుగా చూసి వులిక్కిపడి కెవ్వుమంటోంది.

# 4

దివకి ఇప్పుడు డెబ్భై ఏళ్ళు పైబడ్డాయి. ఇప్పుడావిడ నిశసమూహానికి నాయకురాలు కాదు. అయితే ఇప్పటికి ఆవిడా సమూహానికి గౌరవనీయురాలైన వృద్ధురాలు. ఎంచేతా అంటే ఇరవై ఏళ్ళపాటు ఆవిడ సమూహానికి నాయకురాలుగా ఉండి పెరుగుతున్న సమూహాభివృద్ధికి ఎంతగానో కృషిచేసింది. ఈ కాలంలో సమూహానికి పై సమూహాలతో చాలాసార్లు యుద్ధాలు చెయ్యవలసి వచ్చింది. ఆయా సమయాల్లో ఎంతమంది జనాన్నో నష్టపోవాల్సివచ్చింది. అలా అయినప్పటికి నిశ సమూహం ఎప్పుడూ గెలుస్తూనే ఉంది. ఇప్పుడు ఈ సమూహానికి ఎన్నో మాసాలకు సరిపడా వేటక్షేత్రం ఉన్నది. దివ దృష్టిలో ఇదంతా భగ(వంతుని) కృపే. అయితే మధ్య మధ్య తనచేతుల్తో తాను విసిరికొట్టిన పసిపాపలు కనిపించి ఆవిడకి నిద్ర పట్టడం మానేస్తూ ఉంటుంది.

చలికాలం రోజులు. వోల్గాలో నీరు గడ్డకట్టుకుపోయింది. నెలల తరబడి కురిసే మంచువల్ల నదిఒడ్డు వెండితో చేసిన ఇసకతిన్నెలాగానో లేదా అంటే దట్టంగా పోసిన పత్తిరాశిలాగానో కనపడుతోంది. అటువంక శిశిర ఋతువువల్ల అడివంతా నిర్జీవంగా స్తబ్దంగా ఉన్నాది. నిశ సమూహపు సంఖ్య ఇప్పుడింకా ఎక్కువయింది. అంచేత దానికి కావల్సిన ఆహారం కూడా పరిమాణంలో ఎక్కువ అవడం తప్పనిసరి. అయితే పనిచేసేవాళ్ళ సంఖ్యా ఎక్కువయింది. పని ఉన్న రోజుల్లో ఎక్కువెక్కువ పరిమాణంలో ఆహారాన్ని సేకరించేవారు. చలికాలంలోనూ నేర్పరితనం ఉన్న కుక్కల సాయంతో నిశపుత్రులూ, పుత్రికలూ వేటాడ్డానికి వెళ్ళి కొద్దోగొప్పో తీసుకువస్తున్నారు. ఈ మధ్య వాళ్ళు వేటలో ఓ కొత్త పద్ధతిని మొదలుపెట్టేరు- మేత దొరక్క కోళ్ళు, ఆవులు, గుర్రాలు మొదలైన వేట జంతువులు ఓ అడివి నుంచి మరో అడివికి వలస వెళ్ళిపోతూ ఉంటాయి. నిశ సమూహం నేలమీదపడ్డ గింజలు మొలకెత్తడం చూసింది. దాంతో వాళ్ళు గడ్డి విత్తుల్ని తేమగా ఉన్న నేలలో జల్లటం మొదలుపెట్టేశారు. ఇల్లాగ్గా వేసినగడ్డి కారణంగా జంతువులు మరికొన్నాళ్ళు ఆ అడవిలోనే నిలిచిఉంటూ ఉండేవి.

ఆ వేళ ఋక్షశ్రవుని కుక్క చెవులపిల్లిని వెంటతరిమింది. ఋక్షశ్రవుడూ

దాని వెనక పరిగెట్టేడు. చెమటలు కారుతూవుంటే అతడు తన ఒంటిమీదున్న పెద్ద చర్మకంచుకాన్ని విప్పి భుజంమీద వేసుకొని మళ్ళీ పరుగెట్టేడు. అయినా కుక్క ఎంతకీ కనిపించలేదు. మంచులో దాని కాళ్ళగుర్తులు మాత్రం కనిపిస్తున్నాయి. ఋషుడు ఆయాసంతో రొప్పుతూ అలసట తీర్చుకోడానికి ఓ పడిపోయిన చెట్టు కొమ్మమీద కూచున్నాడు. ఇంకా అతని అలసట పూర్తిగా తీరన్నలేదు. దూరంగా ఎక్కడినుంచో అతనికి కుక్క అరుపు వినిపించింది. దాంతో మళ్ళీ లేచి పరిగెట్టడం మొదలుపెట్టేడు. అరుపు దగ్గరవుతోంది. దగ్గరకి వెళ్ళి చూశాడు. దేవదారు చెట్టుని ఆనుకుని ఓ అందమైన యువతి నిల్చునివుంది. ఆవిడ ఒంటిని తెల్లటిచర్మ కంచుకం ఉంది. తెల్లటోపి కిందనుంచి బంగారపువన్నె జుత్తు అక్కడ అక్కడ కనబడు తోంది. ఆవిడ కాళ్ళదగ్గర ఓ చెవులపిల్లి చచ్చిపడివుంది. ఋషుణ్ణిచూసి కుక్క దగ్గరగా వెళ్ళి గట్టిగా మొరగడం మొదలుపెట్టింది. ఋషునిచూపు ఆ అందమైన యువతి మొహం మీదికి మళ్ళింది. ఆవిడ చిరునవ్వులు చిందిస్తూ "మిత్రుడా! ఈ కుక్క నీదా?" అని అడిగింది.

"నాదే, కాని నిన్ను నేనెప్పుడూ చూడలేదే!"

"నేను కురుసమూహపు దాన్ని, ఇది కురుసమూహపు భూమి."

"కురుసమూహమా? ఋషుడు ఆలోచనలో పడ్డాడు. కురుసమూహం వారు వాళ్ళ పొరుగువారు. ఎన్నో ఏళ్ళబట్టీ ఈ రెండు సమూహాలకీ పడటంలేదు. మధ్యే మధ్య యుద్ధాలు కూడా జరుగుతున్నాయి. అయితే కురుసమూహం ఉష సమూహం కన్నా తెలివైనవాళ్ళు. అంచేత యుద్ధంలో గెలిచే ఆశ లేకపోతే కాళ్ళకి బుద్ధిచెప్తా తారు. అల్లాగ్గా చేతులు గెలుపు సంపాదించి పెట్టలేకపోతే కాళ్ళు బతికి ఉండడానికి తోడ్పడుతున్నాయి. నిశపుత్రులు కురుసమూహాన్ని నాశనం చెయ్యాలని మాటి మాటికీ నిర్ణయించుకుంటారు. అయితే వాళ్ళ నిర్ణయం ఇప్పటి వరకూ కార్యరూపం దాల్చలేదు.

ఋషుడు మాట్లాడకపోవడం చూసి ఆ యువతి ఇలా అంది– "ఈ చెవుల పిల్లిని నీ కుక్క చంపింది. దీన్ని నువ్వే తీసుకుపో."

"కాని ఇది కురుసమూహపు వేటక్షేత్రంలో చచ్చింది."

"అవును, మా క్షేత్రంలో చచ్చింది. నిజమే, కాని నేను ఈ కుక్క యజ మాని కోసం ఎదురుచూస్తూ నిల్చున్నాను."

"ఎదురుచూస్తూనా?"

"అవును అతను వస్తే ఈ చెవులపిల్లిని ఇచ్చేద్దామని"

కురు పేరు వినగానే ఋషుని మనస్సులో కొంచెం ద్వేషభావం కలిగింది. అయితే ఆ అందమైన యువతి స్నేహపూర్వకంగా మాట్లాడ్డంతో ఆ ద్వేషం కాస్తా పోయింది. ప్రత్యుపకారం చేద్దామన్న భావం కలిగి అతను ఇలా అన్నాడు -

"ఈ వేటజంతువునే కాదు నా కుక్కనికూడా నువ్వు ఇచ్చేవు. ఈకుక్కంటే నాకు ప్రాణం."

"అందమైన కుక్క."

"సమూహం మధ్యలో ఉండనీ, నా గొంతు విని వింటంతో నా దగ్గరికి వొచ్చేస్తుంది."

"దీని పేరు?"

"శంబు."

"మరి నీ పేరో మిత్రమా?"

"ఋక్షశ్రవ రోచనాసూను."

"రోచనాసూను! మా అమ్మ పేరూ రోచనే. ఋక్షా, తొందరలేకపోతే కాస్సేపు కూచో."

ఋక్షుడు విల్లునీ కంచుకాన్నీ మంచుమీద పెట్టి అందమైన యువతి కాళ్ళ దగ్గర కూచున్నాడు.

"ఇప్పుడు మీ అమ్మ లేదా?"

"లేదు. ఆవిణ్ణి నిశ సమూహం వారు యుద్ధంలో చంపేశారు. ఆవిడ నన్నెంత గానో ప్రేమించేది." అని చెప్తూ ఆ యువతి కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

ఋక్షుడు తనచేత్తో ఆవిడ కన్నీళ్ళు తుడుస్తూ అన్నాడు – "ఈ యుద్ధం ఎంత చెడ్డది!"

"మరే, దాన్నించి మనకిష్టమైనవాళ్ళు మనల్ని విడిచి వెళ్ళిపోతారు."

"ఇప్పటికీ ఆ యుద్ధం ముగిసిపోలేదు!"

"ఎవరో ఒకరు నాశనం అవందే అదెలా ముగుస్తుంది? నిశ పుత్రులు మళ్ళీ దాడి చెయ్యబోతున్నారని నేను విన్నాను. వాళ్ళూ నీలాంటి యువకులే అయి ఉంటారనుకుంటాను. అవునా ఋక్షా?"

"నీలాంటి యువతులే కురుసమూహంలో ఉండి ఉంటారు అవునా?"

"అయినా మనం ఒకర్నొకరం చంపుకోవాలి ఋక్షా! అదేమిటో కాని!"

మూడు రోజుల తర్వాత తమ సమూహం కురుజనాల మీద దాడి చెయ్య బోతోందన్న సంగతి ఋక్షునికి జ్ఞాపకం వచ్చింది. ఋక్షుడు ఏదో మాట్లాడదా మనుకునేలోగా యువతే మళ్ళీ అన్నది-

"కాని ఈ సారి మేం యుద్ధం చెయ్యం."

"ఏమిటీ? కురుసమూహం యుద్ధం చెయ్యదూ?"

"అవును, మా సంఖ్య బాగా తగ్గిపోయింది, గెలుస్తామన్న ఆశ మాకు లేదు"

"అయితే కురుసమూహం ఏం చేస్తుంది?"

"ఓల్గా తీరాన్ని వదిలి ఎక్కడికో దూరంగా వెళ్ళిపోతాం. ఓల్గా తల్లి

ప్రవాహం ఎంత ప్రీతైనదో! ఇహ చూడ్డానికి కూడా దొరకదు. అందుకే నేనిక్కడ గంటల తరబడి కూచుని దీని సుప్తప్రవాహాన్ని చూస్తూ ఉన్నాను."

"అయితే ఇహ మళ్ళీ ఓల్గాను నువ్వు చూడలేవన్నమాట!"

"ఈదే అదృష్టమూ ఉండదు. ఈ లోతైన నదిలో ఈదుతూ ఉంటే ఎంత ఆనందంగా ఉండేది!" అందమైన యువతి బుగ్గల మీద నుంచి కన్నీటి బిందువులు కారుతున్నాయి.

"ఎంత క్రూరత్వం! ఎంత నిష్ఠురత్వం!" ఋషుడు విచారంతో అన్నాడు.

"ఏం చేస్తాం? ఇది సమూహధర్మం రోచనానూనా!"

"ఇది అనాగరిక ధర్మం." *

---

*నేటికి రెండువందల ఇరవై అయిదవ తరాలకి ముందున్న ఓ ఆర్యసమూహపు కథ ఆ కాలంలో భారత, ఈరాను, రష్యాల శ్వేతజాతులకు చెందిన ఓ జాతి ఉండేది దానినే ఇండోస్లావు జాతి అని కాని శతం వంశమని కాని అంటారు.

# అమృతాశ్వుడు

దేశం : మధ్య ఏషియా; పామీరు (ఉత్తరకురు), జాతి: ఇండో ఈరా నియన్.

కాలం : క్రీస్తుకు పూర్వం 3000

## 1

ఫర్గానా ఎంత అందమైనది! ఆకుపచ్చటనం కప్పుకున్న కొండలు, అక్కడక్కడా ప్రవహించే నదులు, జలధారలు - కాశ్మీరు సౌందర్యాన్ని కళ్ళారా చూసిన వాళ్ళే ఈ అందాన్ని తెలుసుకోగల్గుతారు. హేమంతకాలం అయిపోయింది. వసంతం ప్రవేశించింది. వసంతశోభ ఆ కొండరోయని భూతల స్వర్గంగా మార్చేస్తోంది. పశుపాలకులు ఆకురాలు కాలపు తమ నివాసాలనుంచి, కొండగుహల నుంచి, రాతి యిళ్ళనుంచి బయటపడి విశాలమైన పచ్చిక బయళ్ళలోకి వచ్చేశారు. గుర్రపు వెంట్రుకలతో వేసిన డేరాల్లోంచి పొగ పైకి లేస్తోంది. ఈ డేరాల్లో ఎర్రరంగు డేరాలు ఎక్కువ. ఇప్పుడిప్పుడే ఓ డేరా నుంచి ఓ యువతి తోలుతిత్తిని భుజానికి వేళ్ళాడదీసుకుని దిగువ వేపు రాళ్ల మధ్య గలగల మని ప్రవహిస్తున్న నది ఒడ్డుకి వెళ్ళింది. ఆవిడింకా డేరాల నుంచి అట్టే దూరం వెళ్ళి ఉండదు. ఇంతలో ఓ పురుషుడు ఆవిడ ముందు నిల్చున్నాడు. యువతికి ఉన్నట్లే ఇతని ఒంటిని కూడా ఓ పల్చని తెల్లని ఉన్ని కంబళి ఉన్నది. దాని రెండు కొసలూ కుడి భుజం మీదకి ఇల్లాగ్గా కట్టి ఉన్నాయి కదా-అతని కుడి చెయ్యీ, భుజమూ, వక్షంలో సగం భాగమూ, మోకాళ్ల కింద భాగమూ తప్ప మిగతా శరీరం అంతా కప్పబడే ఉంది. అతని పసుపు వర్ణపు జుట్టూ మీసాలు చక్కగా తీర్చి దిద్ది ఉన్నాయి. అందమైన యువతి యువకుణ్ణి చూసి ఆగిపోయింది.

"సోమా! ఇవాళ ఇంతాలస్యంగా నీళ్ళు తేవడానికి వెళ్తున్నావేం!" పురుషుడు ఋజ్రాశ్వా చిరునవ్వుతో అడిగేడు.

"మరే ఋజ్రాశ్వా! కాని నువ్వేమిటిలా దారితప్పి వచ్చేవు."

"దారి తప్పి కాదు సఖీ - నీ దగ్గరకే వచ్చాను."

"నా దగ్గరకా? చాలా రోజుల తర్వాత!"

"ఇవాళ సోమ జ్ఞాపకం వచ్చింది!"

"మంచిదే! నీళ్ళు తీసుకుని నేను ఇంటికి వెళ్ళాలి. అమృతాశ్వుడు భోజనానికి కూచున్నాడు."

మాట్లాడుకుంటూ ఇద్దరూ నదివరకూ వెళ్ళి, ఇంటికి తిరిగి వచ్చేరు.

"అమృతాశ్వుడు పెద్దవాడయ్యేడు" ఋజ్రాశ్వుడు అన్నాడు.

"మరే, నువ్వు చూసి చాలా ఏళ్ళయింది!"

"నాలుగేళ్ళుగా?"

"ఇప్పుడు వీడికి పన్నెండోయేడు, నిజం చెప్తున్నా, అబద్ధంకాదు. రూపంలో నీతో సరితూగుతాడు."

"ఏమో ఎవరికి తెల్సు? ఆ రోజుల్లో నేనూ నీ దయకి పాత్రుణ్ణే!" అమృతాశ్వుడు ఇన్నాళ్ళూ ఎక్కడున్నాడు?

"మాతామహుల ఇంట, వాహ్లీకులతో."

యువతి నీటితో నిండి ఉన్న తోలుతిత్తిని డేరాలో పెట్టింది. తన భర్త కృచ్ఛ్రాశ్వునికి ఋజ్రాశ్వుడు వచ్చినట్టు చెప్పింది. వాళ్ళిద్దరూ వాళ్ళిద్దరి వెనకా అమృతాశ్వుడూ డేరాలోంచి బైటికి వచ్చేరు.

"ఏం మిత్రమా ! కృచ్ఛ్రాశ్వా ! బాగున్నావా?" అని ఋజ్రాశ్వుడు ఎంతో గౌరవపూర్వకంగా అడిగాడు.

"అగ్నిదేవుని దయ ఋజ్రాశ్వా ! రా. ఇప్పుడే సోమాన్ని (భంగు) నూరి తేనెతోనూ గుర్రపు పాలతోనూ చేశాం."

"మదుసోమమా? ఇంత పొద్దున్నా?"

"నేను గుర్రాల మందతో వెళ్తున్నాను. బైట చూడలేదా గుర్రం సిద్ధంగా ఉంది."

"అయితే ఇవాళ సాయంత్రానికి తిరిగి రావన్నమాట."

"బహుశా రాను. అందుకే ఆ సోమంతో నిండిన తోలుతిత్తి, తియ్యటి గుర్రపు మాంసమూను."

"గుర్రపు మాంసం!"

"మరే, మా పశువులమీద అగ్నిదేవుడి దయ పూర్తిగావుంది. నేను గుర్రాల్నే ఎక్కువగా పెంచుతున్నాను."

"అయితే కృచ్ఛ్రాశ్వా! నీ పేరు మాత్రం ఉల్టాగా ఉంది."

"మా తల్లిదండ్రుల కాలంలో మా ఇంట్లో గుర్రాలు తక్కువగా ఉండేవి. అందుకని ఈ పేరు పెట్టారు."

"కాని ఇప్పుడు నిన్ను బుద్ధాశ్వుడనాలి."

"సరేగాని పద లోపలికి"

"మిత్రమా! ఈ దేవదారుచెట్టు నీడలోఈగడ్డిమీద ఎందుకు కూచోకూడదూ!"

"సరే అలాగే, సోమా! మాంసంతోనూ సోమంతోనూ ఈ మిత్రుణ్ణి తృప్తి పరుద్దాం. నువ్వు తీసుకురా."

"కాని కృశ్రాా ! నువ్వు గుర్రాలకోసం వెళ్తున్నానన్నావే"

"వెళ్తాను. ఇవాళకాదు రేపు. కూచో ఋజ్రాశ్వా !"

సోమ సోమంతో ఉన్న తోలుతిత్తి, మధుపాత్రా తీసుకువచ్చింది. ఇద్దరు మిత్రుల మధ్యా అమృతాశ్వుడు కూచున్నాడు. సోమ సోమాన్ని, పాత్రవీ కింద పెడుతూ "ఉండండి పరుపు తెస్తాను" అన్నది.

"వద్దు సోమా! మెత్తగా ఉన్న ఈ పచ్చిక పరుపుకన్నా బాగుంది" అన్నాడు ఋజ్రాశ్వుడు.

"అది సరేగాని ఋజ్రా! నువ్వు ఉప్పుతో ఉడకబెట్టిన మాంసం తింటావో నిప్పులో కాల్చింది తింటావో ముందు చెప్పు. ఎనిమిది నెలల లేత దూడ మాంసం!"

"నాకయితే సోమాకాల్చిన దూడమాంసమే ఇష్టం. ఒక్కొక్కసారైతే నేను దూడ దూడనే మొత్తం అలాగే కాల్చేస్తాను. కాలడం కొంచెం ఆలస్యం అనుకో. అయితేనేం మాంసం మా రుచిగా ఉంటుంది. మరి నువ్వేమో నా పానపాత్రనీ నీ పెదిమలతో మధురంగా చెయ్యాలి."

"నిజమే సోమా! ఋజ్రుడు ఎన్నాళ్ళ తర్వాతో వచ్చేడు." కృశ్రాాశ్వుడు అన్నాడు.

"చిటికల్లో వచ్చేస్తాను. నిప్పు బాగా వుంది. మాంసం కాల్చడానికి అట్టే సేపు పట్టదు."

కృశ్రాాశ్వుడు మధుపాత్రలోకి వొంపడం చూసి ఋజ్రాశ్వుడు అన్నాడు, "ఏమిటా తొందర?"

"సోమరస మధురాతిమధురంగా ఉంది. సోమాచేతి సోమం!! అద్భుతమే. ఈ సోమం తాగిన వాణ్ణి అమృతమయుణ్ణి చేస్తుంది. సోమం తాగు. అమృతుడివై పో."

"నువ్వేం అమృతుడివవుతావు? పాత్ర తర్వాత పాత్ర లాగేస్తున్నావు. నీ వరసచూస్తే నువ్వు కొద్ది రోజుల్లోనే మృత ప్రాయుడివయ్యేటట్టు ఉన్నావు!"

"సోమం అంటే నేనెంత పడిచస్తానో నీకు తెల్సా ఋజ్రా!"

సరిగ్గా ఆ సమయానికి నిప్పుమీద కాల్చిన మూడు మాంసం ముక్కల్ని చర్మంమీద పెట్టుకుని తీసుకొచ్చింది సోమ.

"అయితే కృశ్రాా! నీవు సోమా అంటే పడిచావటం లేదా?" అని అడిగింది.

"సోమా అన్నా సోమం అన్నాకూడా నాకెంతో ప్రీతి." కృశ్రాాశ్వుని గొంతు మారింది. అతని కళ్ళు ఎరుపెక్కి పోతున్నాయి. "అయినా సోమా! ఇవాళ నేనంటే నీకేం లక్ష్యం!"

"నిజమే! ఇవాళ నేను అతిథి ఋజ్రుడిదాన్ని."

"అతిధా? పాత చెలికాడా?" నవ్వడానికి ప్రయత్నిస్తూ కృచ్ఛ్రాశ్వుడు అన్నాడు.

ఋజ్రాశ్వుడు సోమాని చెయ్యిపట్టుకుని తన పక్కనే కూచోపెట్టుకున్నాడు. సోమంతో నిండిన పాత్రని ఆమెనోటికి అందించాడు. సోమా రెండుగుటకలు వేసి, "ఇహ నువ్వుతాగు ఋజ్రా! ఎన్నాళ్ళకో ఈ సుదినం వచ్చింది" అన్నాది.

ఋజ్రాశ్వుడు మధుపాత్రలోని సోమాన్నంతటినీ ఒక్కగుక్కలో తాగేసి పాత్రని కింద పెడుతూ, "నీ పెదిమలని తాకగానే ఈ సోమం ఎంతో తియ్యగా అయిపోతుంది" అన్నాడు.

కృచ్ఛ్రాశ్వునికి సోమం మత్తు ఎక్కడం మొదలుపెట్టింది. అతడు తటాలున తన పాత్రని సోమంతో నింపి సోమా వేపుకి ఆ పాత్రని చాచి తొట్రుపడే గొంతుతో, "అలా అయితే సో- సో—మా- దీ—దీన్ని మధు- మధురంగా చె- చె- య్యి!" అన్నాడు.

సోమా ఆ పాత్రని ఎంగిలిచేసి తిరిగి యిచ్చింది అమృతాశ్వుడుకి ఈ పెద్ద వాళ్ళ ప్రేమకలాపాలు రుచించకపోవడంతో తన ఈడు అబ్బాయిలతోనూ అమ్మాయిలతోనూ ఆడుకోవడానికి పారిపోయేడు. కృచ్ఛ్రాశ్వుడు బరువెక్కి మూతలు పడిపోతున్న కంటి రెప్పలతో, తూలిపోతున్న తల ఆడిస్తూ "సో—సోమా ! పప్ప్పాట ప ప పాడనా?" అన్నాడు.

"నిజమే నీలాంటి పాటగాళ్ళు కురుసమూహంలో ఎక్కడన్నా ఉన్నారా?"

"మ—మ-మరే—న—నన్నాతో స—స—స్సమానమైన ప— ప- ప్పాట — క — కాదులే- లే-డు-ను-ను— నువ్వువి-.వి-విను- ప్పపి-వే—మమ—సో—సోమం."

"ఆపవోయి కృ·చ్ఛా! నీ పాటకి అడివివదిలేసి జంతువులూ పిట్టలూ పాలి పోతున్నాయి."

"ఊఁ(ఊఁ."

సోమ తాగి అమృతులయే సమయం కాదిది. సాధారణంగా సూర్యాస్తమానం తర్వాత సమయం సరియైనది. అయితే కృచ్ఛ్రాశ్వునికి ఏదో ఓ వంక దొరకాలి. అంతే. అతడు మైకం పూర్తిగా ఎక్కి వొళ్ళు తెలీకుండా పడిపోయాడు. అప్పుడు ఋజ్రాశ్వుడూ సోమా తమ పానపాత్రలు కింద పెట్టేశారు. ఇద్దరూ నది ఒడ్డుకి వెళ్ళి అక్కడున్న ఓ రాతిమీద కూచున్నారు. కొండల మధ్య ఈస్థలంలో నదీ ప్రవాహం కొంత సమతల ప్రదేశంలోంచి పారుతోంది. అయితే అందులో పెద్ద పెద్దవీ చిన్న చిన్నవీ రాళ్ళకుప్పలు చాలా ఉన్నాయి. వాటిమీద ప్రవాహం నీళ్ళు కొట్టుకుంటూ చప్పుడు చేస్తున్నాయి. రాళ్ళసందుల్లోంచి అక్కడక్కడ చేపలు తమ రెక్కల్ని ఆడిస్తూ అటూ ఇటూ ఈదుతూ కనపడుతున్నాయి. ఒడ్డునే ఎండిన నేలలో పెద్ద పెద్ద సాలవృక్షాలు, దేవదారువృక్షాలూ మరేవేవో వృక్షాలు ఉన్నాయి. పక్షుల కలకల రవాలూ, పువ్వుల పరిమళంతో వీచే పిల్లవాయువులూ మనస్సుకి ఆహ్లాదాన్ని కలి

గించేవిగా ఉన్నాయి. చాలా సంవత్సరాల తర్వాత వాళ్ళిద్దరూ ఈ అందమైన స్వర్గం లాంటి ప్రాంతంలో తమ పాత ప్రేమని తిరిగి తోడుకుంటున్నారు. ఇప్పుడు వాళ్ళకా పాతరోజులు జ్ఞాపకం వస్తున్నాయి. అప్పుడు సోమ పదహారేళ్ళది. బంగారపువన్నె జుట్టుతో బహుచక్కటిది. వసంతోత్సవపు రోజుల్లో ఋజ్రాశ్వుడు తన మేనమామగారి ఇంటికి వచ్చాడు. సోమ అతని మేనమామ కూతురు. ఆవిడ ప్రేమికుల్లో అప్పుడు ఋజ్రాశ్వుడూ ఉన్నాడు. ఆ రోజుల్లో సోమాని పొందుదా మనుకున్న వాళ్ళందరి మధ్యా చాలా పెద్ద పోటీగా ఉండేది. అయితే ఆఖరికి ఆవిడ కృచ్ఛాశ్వుడిదయింది. మిగిలినవాళ్ళతోపాటు ఋజ్రాశ్వునికి ఓటమి ఒప్పుకోక తప్పలేదు. ఇప్పుడు సోమ కృచ్ఛాశ్వుని పత్ని. అయితే ఆనందమూ ఉత్సాహమూ నిండిన ఆ యుగంలో స్త్రీ పురుషుడి చరాస్తిగా మారడానికి యింకా అంగీకరించలేదు. అంచేత ఆవిడకి తాత్కాలికంగా తను యిష్టపడ్డ ప్రియుణ్ణి ఎంచుకునే హక్కు ఉంది. అతిథులదగ్గరకి, మిత్రుల దగ్గరికి స్వాగతం చెప్పడానికి తమ స్త్రీని పంపించడమన్నది ఆ రోజుల్లో సర్వసామాన్యమైన సదాచారం. ఇవాళ సోమ ఋజ్రాశ్వుని సొత్తయింది.

సాయంత్రంవేళ ఊళ్ళోని స్త్రీపురుషులందరూ మహాపితరుని(గుంపు నాయకుడు లేదా పరిపాలకుడు) విశాలమైన వాకిట్లో సమావేశమయ్యారు. సోమం, తేనెతో చేసిన మద్యం, రుచికరమైన గోమాంసం, గుర్రపుమాంసం తీసుకువస్తున్నారు. మహాపితరులు పుత్రోత్సవం చేస్తున్నారు. కృచ్ఛుడు నిషాలో ఉన్నాడు. అతనికి బదులు సోమా, ఋజ్రాశ్వుడూ అక్కడికి వచ్చేరు. రాత్రి చాలా పొద్దుపోయేవరకూ భోజన పానాదులతో, నృత్యగీతాలతో మహోత్సవపు వేడుకలు జరిగేయి. సోమ పాటల్ని ఋజ్రాశ్వుని నృత్యాన్నీ ఎప్పటిలాగానే కురుసముహంలోని వారంతా ఎంతో మెచ్చుకున్నారు.

## 2

"మధురా! నువ్వు అలసిపోలేదు కదా!"

"అబ్బే లేదు. నాకు గుర్రపుస్వారీ అంటే చాలా ఇష్టం."

"ఆ దోపిడీగాళ్ళు నన్ను ఎంత గట్టిగా బంధించారో!"

"మరే, వాల్హీకులు పశు గోవుల్నీ, అశ్వాలనే కాదు వాళ్ళ అమ్మాయిల్నీ దోచుకోవడానికి వచ్చేరు."

"నిజమే, పశువుల్ని దోపిడీ చెయ్యడంవల్ల రెండు సమూహాల మధ్యా శాశ్వతమైన శత్రుత్వం పుడుతోంది. కన్యల్ని దోపిడీచేయటం తాత్కాలికమే - ఆఖరికి మామగారికి అల్లుణ్ణి సత్కరించక తప్పదు కదా!"

"నీ పేరేమిటో నాకు తెలీదే!"

"అమృతాశ్వుడు. కృచ్ఛాశ్వపుత్రుడిని. కౌరవుణ్ణి".

"కౌరవుడవా! కురు మా మేనమామగారి కులమే."

"మధురా! నీకిహ భయంలేదు. ఎక్కడికి వెళ్తావో చెప్పు"

మధుర మొహం నిండా సంతోషం మెరిసింది. కాని అంతలోనే ఆ మెరుపు మాయమయింది. అమృతాశ్వుడు అర్థం చేసుకున్నాడు. మాటమారుస్తూ ఇలా అన్నాడు- "పక్థుల కన్యలు మా ఊరికి కూడా వచ్చారు."

"అపహరించి తెచ్చినవారేనా అందరూ?"

"లేదు అందులో మేనమావల కూతుళ్ళు చాలామంది ఉన్నారు."

"అదిగందుకే కాని నాకీ కన్యలకోసం దోపిడీలు కొట్లాటలంటే చాలా అసహ్యం."

"నాక్కూడా మధురా! అక్కడి స్త్రీలూ పురుషులూ వాళ్ళమధ్య ప్రేమ సాధ్యమవుతుందో లేదో కూడా తెలుసుకోరు."

"మేనమామ కూతురితో పెళ్ళి ఇంతకన్నా మంచిది. ఎంచేత అంటే వాళ్ళకి ఒకరినొకరు మొదట్నించి తెలుసుకోడానికి అవకాశం ఉంటుంది."

"నీకలాంటి ప్రియుడెవరైనా ఉన్నాడా మధురా!"

"లేడు. నాకెవరూ మేనత్తలు లేరు"

"పోనీ ఇంకెవరన్నా?"

"ఖాయంగా ఎవరూ లేరు"

"నాకా భాగ్యం కలగచేస్తావా?"

మధుర సిగ్గుపడుతూ తన చూపుల్ని కిందకి వాల్చింది.

"మధురా! కొన్ని జనపదాల్లో స్త్రీలు స్వతంత్రంగా ఉంటారు. అలాంటి జనపదాలు ఉన్నాయి. నీకు తెల్సా?"

"నువ్వంటున్నది నాకర్థం కాలేదు అమృతాశ్వా!"

"వాళ్ళనెవ్వరూ దోచుకోరు. ఎవరూ వాళ్ళని శాశ్వతంగా తమపత్నిగా చేసుకోలేరు. అక్కడ స్త్రీ పురుషులిద్దరూ సమానులే."

"అయుధాల్ని కూడా సమానంగా ఉపయోగించగలరా?"

"ఆ! అక్కడ స్త్రీలు స్వతంత్రులు."

"ఆ జనపదం ఎక్కడుంది అమృత్-అమృతాశ్వా!"

"అమృత్ అనే పిలువు మధురా! ఆ జనపదం ఇక్కణ్ణించి పశ్చిమ దిశగా చాలా దూరంలో ఉంది."

"నువ్వక్కడికి వెళ్ళావా అమృత్?"

"ఆఁ అక్కడ స్త్రీ జీవితమంతా స్వతంత్రంగా బతుకుతుంది. అడవిలో స్వేచ్ఛగా విహరించే లేడిలాగ! చెట్లమీద స్వేచ్ఛగా ఎగిరే పిట్టల్లాగ."

"అది చాలా మంచి జనపదమై ఉంటుంది. అక్కడ స్త్రీని ఎవరూ దోచుకోరు కదూ?"

"సర్వస్వతంత్రురాలైన ఆడపులిని బతికుండగా ఎవడన్నా దోచుకోగలడా?"

"మరి పురుషుడో అమృత్?"

"పురుషుడూ స్వతంత్రుడే".

"పిల్లలో?"

"మధురా! అక్కడ ఇల్లూ కుటుంబం వేరేరకంగా ఉంటుంది. ఊరంతా కలసి ఒకటే కుటుంబంగా ఉంటుంది."

"అయితే అక్కడ తండ్రి కర్తవ్యమో ?"

"తండ్రి అని చెప్పలేం మధురా! అక్కడ స్త్రీ ఎవరికీ పత్నికాదు. ఆవిడ ప్రేమ స్వచ్ఛందమైంది."

"అలా అయితే అక్కడ ఎవరూ తమ తండ్రిని ఎరగరా?"

"ఇంట్లో ఉన్న పురుషులంతా తండ్రులే."

"ఇదేం పద్ధతి?"

"అందుకేమరి అక్కడ స్త్రీ స్వతంత్రురాలు, యోధురాలు, వేటకత్తె."

"మరి ఆవుల పెంపకం, గుర్రాల పెంపకమో?"

"అక్కడ ఆవులూ, గుర్రాలూ అడవుల్లో పెరుగుతాయి. ఇక్కడ లేళ్ళు అడవుల్లో పెరగటం లేదూ? అలాగ!"

"మరి మేకలూ గొర్రెలో?"

"అక్కడి వాళ్ళకి పశువుల పెంపకం తెలీదు. వేటాడి చేపల్ని పట్టీ అడవిలో పళ్ళని సేకరించుకుని కాలక్షేపం చేస్తారు."

"వేటొక్కటేనా? అయితే వాళ్ళకి పాలు దొరకవు కాబోలు."

"తల్లిపాలే. అదీ చిన్నతనంలో మాత్రమే."

"గుర్రపు స్వారీ కూడా తెలీదా?"

"ఊహూఁ. చర్మాన్ని ఆచ్ఛాదించుకోవడం తప్ప ఇంకోటి ఎరగరు."

"అయితే వాళ్ళు చాలా కష్టపడుతూ ఉండి ఉంటారు."

"కాని అక్కడ స్త్రీలు పురుషుల్లాగే స్వతంత్రులు. పళ్ళని పోగుచేస్తారు. వేటాడుతారు. యుద్ధంలో శత్రువుల మీద రాతిగొడ్డళ్ళనీ, బాణాలనీ వదులుతారు."

"ఇదైతే నాకూ ఇష్టమే. నేనూ ఆయుధాలు ఉపయోగించడం నేర్చుకున్నాను. కాని యుద్ధంలోకి పురుషుల్లాగ వెళ్ళడానికి అవకాశం ఎక్కడుంది?"

"పురుషుడు ఈ పనిని తన కర్తవ్యంగా తీసుకున్నాడు. గుర్రాల్ని, ఆవుల్ని, గొర్రెల్ని, మేకల్ని తను పెంచుతాడు. స్త్రీలని పశుపత్నిని చెయ్యలేదు. గృహపత్నిగా చేశాడు."

"కన్యలను దోచుకొనడానికి వీలుగా తయారుచేశాడు. అక్కడ కన్యలు దోచుకోబడుతూ ఉండరనుకుంటాను. అవునా అమృత్!"

"ఓ సమూహంలోని అబ్బాయిలూ - అమ్మాయిలూ ఎప్పుడు ఆ సమూహం లోనే ఉంటారు. బైటికి వెళ్ళేదీ లేదు. బైటనుంచి తెచ్చుకునేదీ లేదు."

"ఎలాంటి పద్ధతో?"

"అది ఇక్కడ కుదరదు."

"అందుకేమరి కన్యలు దోచుకోబడుతూ ఉంటారు."

"అది సరేగాని మధురా? ఏమీ చెప్పేవుకాదు!"

"దేని గురించిట?"

"నా ప్రేమ గురించి."

"నేను నీదాన్నే అమృత్."

"కాని నిన్ను అపహరించి తీసుకెళ్ళాలని నేననుకోటంలేదు."

"అయితే మరి నన్ను యుద్ధం చెయ్యనిస్తావా?"

"నాకు సాధ్యమైనంత వరకూ."

"మరి వేటాడనిస్తావా?"

"నాకు సాధ్యమైనంతవరకూ."

"అంతేనా?"

"ఎందుకంటావా? నేను మహాపితరుని ఆజ్ఞప్రకారం నడవాలికదా! నా వరకు నేను నీ స్వాతంత్ర్యానికి అడ్డుపెట్టను మధురా!"

"ప్రేమించడానికీ, ప్రేమించకపోవడానికీ కూడానా?"

"ప్రేమే మన ఇద్దరిమధ్యా బంధాన్ని ఏర్పరుస్తోంది. సరే ఆ విషయంలో కూడా అడ్డురాను."

"అలా అయితే అమృత్! నేను నీ ప్రేమని స్వీకరిస్తున్నాను."

"అయితే మనం ఇప్పుడు కురుసమూహానికి వెళ్దామా? పక్షుల్లోకి వెళ్దామా?"

"నీ ఇష్టం నువ్వెక్కడికంటే అక్కడికి."

అమృతుడు గుర్రాన్ని వెనక్కి తిప్పేడు. మధుర చెప్పిన దారిని పక్షుల ఊళ్ళోకి తీసుకువెళ్ళేడు. ఊళ్ళో ఒక డేరాలో ఒకడు చంపివేయబడితే మరో డేరాలో ఒకడు గాయాలతో పడి ఉన్నాడు. ఒకమ్మాయి దోచుకోబడింది. అంతా అల్లకల్లో లంగా ఉంది. మధుర వాళ్ళమ్మ ఏడుస్తోంది. తండ్రి ధైర్యంచెప్తూ ఊరడిస్తున్నాడు. ఆ సమయానికి వీళ్ళ గుర్రం డేరా ముందు వచ్చి నిలబడింది.

అమృతాశ్వుడు గుర్రం దిగేక మధుర గుర్రంమీంచి కిందికి దూకింది. అమృ తాశ్వున్ని బైటనే నిల్చోమని తను లోపలికి వెళ్ళింది. అకస్మాత్తుగా తమ ముందు నిల్చున్న కూతురిని చూసి మొదట ఆమె తల్లీ దండ్రీ తమకళ్ళని నమ్మలేకపోయేరు. తర్వాత వాళ్ళమ్మ కుమార్తెని కౌగిలించుకొని ఆవిడ మొహాన్ని కన్నీళ్ళతో తడిపే సింది. కాస్త కుదుటపడ్డ తర్వాత తండ్రి అడగ్గా ఇలా చెప్పింది - "వాల్హీకులు పక్షు కన్యలను దోచుకొని పోతున్నారు. నన్ను అపహరించి తీసుకుపోతున్నవాడు కాస్త

అదును చూసుకొని గుర్రంమీంచి నేను గెంతేశాను. వాడు నన్ను పట్టుకుని మళ్ళీ గుర్రం ఎక్కించాలని చూశాడు. నేను వాడ్ని ఎదిరిస్తున్నాను. ఇంతట్లో గుర్రం స్వారీ చేసుకుంటూ ఓ యువకుడు వచ్చాడు. అతడు వాల్హీకుణ్ణి ఎదురు సవాలు చేశాడు. వాణ్ణి గాయపరచి కింద కూలతోశాడు. ఆ కురు యువకుడే నన్ను ఇక్కడికి మళ్ళీ దిగబెట్టడానికి వచ్చాడు."

"అయితే ఆ యువకుడు నిన్ను తీసుకెళ్ళిపోతాననలేదా?"

"బలాత్కరించి తీసుకెళ్ళనన్నాడు."

"కాని మన జనపదం ఆచారం ప్రకారం నువ్వు అతని సొత్తువయ్యావు."

"అతన్ని నే ప్రేమిస్తున్నాను నాన్నా!"

మధుర తండ్రి బైటికి వచ్చి అమృతాశ్వునికి స్వాగతం చెప్పేడు. డేరా లోపలికి తీసుకువెళ్ళాడు. ఊళ్ళోవాళ్ళకి సంగతి వింతగా అనిపించింది. అయితే తర్వాత అందరి గౌరవానికీ సానుభూతులకి పాత్రుడై అమృతాశ్వుడు అత్తవారింటి నుంచి మధురని తీసుకుని బయల్దేరాడు.

# 3

అమృతాశ్వుడు ఇప్పుడు కురుగ్రామానికి మహాపితరుడు. అతని దగ్గర వందలాది గుర్రాలు, ఆవులు, గొర్రెలూ, మేకలూ ఎన్నెన్నో ఉన్నాయి. అతని నలుగురు కొడుకులూ మధురాపశువులమందనీ ఇంటిపనినీచూసుకుంటారు. ఊళ్ళో బీదకులాలకిచెందినవాళ్ళు కొంతమంది వాళ్ళింట్లో పనిచేస్తున్నారు. పని వాళ్ళలాకాదు ఇంట్లో మనుష్యుల్లాగానే! కుటుంబ సభ్యుల్లాగానే! ఒక కురువ్యక్తి మరో కురువ్యక్తిని తనతో సమానంగా చూడాలి. ప్రవర్తనలో తేడా ఏం ఉండకూడదు. అమృతాశ్వుని హయాంలో ఊళ్ళో యాభైకన్నా ఎక్కువ కుటుంబాలు ఉన్నాయి. వాళ్ళ మధ్య వచ్చే కలహాలు, తగాదాలు, వ్యాజ్యాలూ; అన్నిటినీ మహాపితరుడే పరిష్కరించాలి. నీటివసతులూ, మార్గసౌకర్యాల్లాంటి సార్వజనిక కార్యాలను కూడా అతడే నిర్వహిస్తున్నాడు. యుద్ధభయం ఎప్పుడూ ఉండనే ఉంటుంది. యుద్ధంలో సేనకి అధిపతిగా ఉండడం మహాపితరుని కర్తవ్యాల్లో ముఖ్యమైన కర్తవ్యం. నిజానికి యుద్ధాల్లో గెలుపులే ఓ వ్యక్తిని మహాపితరుని పదవికి యోగ్యుడిగా తీర్చిదిద్దుతాయి.

అమృతాశ్వుడు గొప్పయోధుడు. పక్థులతో, వాల్హీకులతో, మిగిలిన సమూహాలతో చేసిన అనేక యుద్ధాల్లో అతడు తన అపూర్వ వీరత్వాన్ని ప్రదర్శించాడు. మధురకి తాను యిచ్చిన వాగ్దానాలను అతడు పాటించాడు. మధుర అమృతాశ్వునితోపాటు ఎలుగ్గొడ్లనీ, తోడేళ్ళనీ, పెద్దపులుల్ని వేటాడ్డమేకాదు, యుద్ధాల్లో కూడా పాల్గొంది. అయితే సమూహాల్లో కొందరు దీనిని అంగీకరించలేదు. వాళ్ళ అభిప్రాయం - స్త్రీ ఇంటిపనులు మాత్రమే నిర్వహించాలి.

అమృతాశ్వుడు మొట్టమొదటిసారి మహాపితరుని ఎన్నుకోబడ్డ రోజున కురుపురం మహోత్సవం జరుపుకుంటోంది. యువతీ యువకులు ఆ రోజుకి మాత్రం తాత్కాలిక ప్రణయ సంబంధాలు పెట్టుకున్నారు. గ్రీష్మకాలం. నదీతీరంలోనూ, కొండలమీదా, లోయల్లోనూ గుర్రాల మందలూ, ఆవుల మందలూ స్వచ్ఛందంగా మేస్తున్నాయి. వాళ్ళకి శత్రువులున్నారన్న మాటే ఊళ్ళోవాళ్ళు మర్చిపోయేరు. పశు సంపత్తి ఉన్నదీ అంటే చాలు శత్రువుల సంఖ్యా పెరిగిపోతుంది. కురుజనం వోల్గా తీరంలో ఉన్నప్పుడు వాళ్ళ దగ్గర ఇంత పశుసంపత్తి లేదు. ఆ రోజుల్లో వాళ్ళకి అడివిలోంచి ఆహారాన్ని సేకరించవలసివచ్చేది. ఒక్కొక్కసారి వేటేమీ దొరక్కా, తేనె పళ్ళూ దొరక్క పస్తుపడుకోవలసివచ్చేది. ఇప్పుడు కురుజనం వేట జంతువుల్లో కొన్నిటిని-ఆవుల్ని, గుర్రాల్ని, గొర్రెల్ని, మేకలని,గాడిదలని పెంపుడు జంతువులుగా చేసుకున్నారు. వాటివల్ల వాళ్ళకి మాంసం,పాలు, చర్మమేకాదు- ఉన్ని,వస్త్రాలు కూడా లభ్యమౌతున్నాయి. కురుస్త్రీలు దారం వడకడంలోనూ, కంబళ్ళు నేయడంలోనూ నేర్పరితనం ఉన్నవాళ్ళు. అయితే ఈ నేర్పరితనం సంఘంలో వారికి పూర్వం ఉన్నస్థానాన్ని స్థిరంగా యథాప్రకారం ఉంచలేకపోయింది. ఇప్పుడు రాజ్యం స్త్రీది కాదు. పురుషుడిది. సమూహపు నాయిక రాజ్యమూకాదు. జనసమితి రాజ్యమూ కాదు. యోధుడైన మహాపితరుని రాజ్యం. జనాభిప్రాయాన్ని గౌరవిస్తూ కూడా చాలా వరకూ తన యిష్టానుసారం నిర్ణయాలు తీసుకుంటాడు. మరి సంపత్తో? స్త్రీ రాజ్యంలో కుటుంబం, కుటుంబం అంతా ఎప్పుడూ కలిసే ఉండేది. కలిసే పని చేసేది. అలాంటిది ఇప్పుడు తమ తమ కుటుంబాలు, తమ తమ పశుసంపత్తి, దాని లాభ నష్టాలు అన్నీ వేరు వేరు అయ్యేయి. అయితే ఒకటి మాత్రం ఉంది - అందరి మీదకీ విపత్తు ముంచుకువచ్చినప్పుడు ఈ సమూహం మళ్ళీ పాతకాలపు సమూహ రూపంగా మారిపోవాలని అనుకుంటుంది.

అమృతాశ్వుని మహోత్సవంలో ఒళ్ళు పై తెలీకుండా లీనమైపోయిన సమూహానికి తమ పశుసంపత్తి గురించిన ఆలోచనే లేకపోయింది. వాద్యధ్వనుల కనుగుణంగా, నృత్యం అడుగులువేస్తున్న యువకుల ధ్యాస సోమం మీద మద్యం మీద సుందరీమణుల మీద ఉన్నది. మరో ఝాముకి తెల్లారిపోతుంది. అయినా నృత్యం ఇంకా సాగుతూనే ఉంది. ఆ సమయంలో నాలుగుపక్కల నుండి కుక్కలు గట్టిగా మొరుగుతూ లోయమీద భాగం వేపుకి పరిగెడుతున్నట్టు తెలిసింది. సోమ పానం చేసేవాళ్ళలోనూ చాలా రకాల వాళ్ళు వుంటారు. కొంతమంది తమ కళ్ళలో కాస్త ఎరుపుజీర వచ్చేంతవరకూ తాగి ఆనందిస్తారు తప్ప వొంటిమీద స్మారకం తప్పేవరకూ తాగరు. అమృతాశ్వుడూ ఈ రకంవాడే. అంచేతే కుక్కలు మొరగడం విని నెమ్మదిగా లేచాడు. కర్రపిడి ఉన్న తన రాతిగదని తీసుకుని నది ఒడ్డునే కుక్క మొరుగులు వినిపిస్తున్న దిశగా వెళ్ళేడు. కొంత దూరం వెళ్ళే సరికి అస్తమించబోతున్న చంద్రుని కాంతిలో ఎవరో స్త్రీ వస్తున్నట్టు కనిపించింది.

ఆతడు ఆగిపోయేడు. దగ్గరగా వచ్చేక ఆవిడ మధుర అని తెలిసింది. మధుర గట్టిగా వేగంగా ఊపిరితీస్తోంది. ఆవిడ ఆవేశపడుతూ చెప్పింది – "పురులు మన పశువుల్ని తోలుకుని పోతున్నారు."

"తోలుకుపోతున్నారా! మన యువకులంతా తాగిన మైకంలో ఉన్నారే! నువ్వెక్కడివరకూ వెళ్ళేవు మధురా !"

"ఈ సంగతి తెలుసుకోగలిగినంత దూరం వెళ్ళేను"

"పశువులన్నిటినీ తీసుకుపోతున్నారా?"

"చాలా సేపట్నించీ చెల్లాచెదరుగా ఉన్న మందల్ని ఓ చోట చేర్చడంలో మునిగి ఉన్నట్టున్నారు."

"నీ సలహా ఏమిటి మధురా ?'

"ఆలోచించడానికి సమయం లేదు."

"మరి మన యువకులంతా నిషాలో ఉన్నారే!"

"రాగల్గినవాళ్ళని తీసుకుని వెంటనే దాడిచెయ్యాలి."

"తప్పకుండా, కాని ఓ సంగతి మధురా ! నువ్వు నాతో రాకూడదు. ఈ కబురు వినగానే యువకుల మైకం సగం వదిలిపోతుంది మిగతా సగం పెరుగు తాగించి వదలగొట్టు. మత్తుదిగిన వాళ్ళని ఎప్పటికప్పుడు పంపిస్తూ ఉండు."

"మరి కురుస్త్రీలో?"

"కురుల మహాపితరుని హోదాతో వాళ్ళందర్నీ యుద్ధరంగంలోకి దూకవల సినదిగా నేను ఆజ్ఞాపించగలను. మరిచిపోయిన ఆ పురాతనాచారాన్ని మనం ఆచరణలో పెట్టాలి."

"నేను ముందు రావడానికి ప్రయత్నించను. సరే తొందర తొందరగా పద"

మహాపితరుని ఆజ్ఞ ప్రకారం వాద్యాలన్నీ ఒక్కసారిగా ఆగిపోయేయి. స్త్రీ పురుషులందరూ మహాపితరుని దగ్గర గుమిగూడేరు. నిజంగానే, ఆవులు, గుర్రాలు అపహరించబడ్డాయన్న మాట వినగానే వాళ్ళలో చాలా మందికి తాగుడు మైకం వదిలిపోయింది. ప్రేమమత్తు వదిలిపోయి వీరావేశం ఆవహించింది. మేఘ గంభీర కంఠంతో మహాపితరుడు గర్జిస్తూ చెప్పేడు-

"కురు స్త్రీ పురుషులారా! మన శత్రువులు పురుల దగ్గర్నుండి మన సంపత్తిని మనం విడిపించుకోవాలి. యుద్ధం జరుగుతుంది. మీలో మైకం పోయి తెలివి వచ్చిన వాళ్ళంతా ఆయుధాల్ని పట్టండి. గుర్రాలెక్కి నావెంట రండి. ఇంకా మత్తు వదలని వాళ్ళు మధుర ఇచ్చిన పెరుగుతినండి. మత్తుకారిపోయేక పరుగు పరుగున రండి. కురుస్త్రీలారా! నేనివాళ మిమ్మల్ని కూడా యుద్ధరంగానికి రమ్మనమని ఆజ్ఞాపిస్తున్నాను. పూర్వకాలపు కురుస్త్రీలు పురుషులతో సమానంగా యుద్ధరంగంలో పాల్గొనే వారని పెద్దలు చెప్పగా మనం విన్నాం. ఇవాళ మీ మహాపితరుడు అమృతాశ్వుడు ఆదే ఆజ్ఞాపిస్తున్నాడు."

రెప్పపాటులో నలభై గుర్రాలు సిద్ధమయ్యేయి. పురులు ఎన్ని పశువుల్ని తోలుకుని పోగుచెయ్యగలిగితే అన్నిటిని పోగుచేసుకుని లోయపైభాగం వేపుకి తోలుకుని పోతున్నారు. అయితే రెండుగంటలు పరుగు తీసేక, తెల్లారే సమయానికి వాళ్ళని కురుజనులు చూశారు. గుర్రాలమందనీ, ఆవులమందనీ పోగుచేసి వాటిని కొండమీద పరిగెట్టిస్తూ తోలుకుపోవడం ఏమంత సులభమైనపని కాదు. గుర్రాలమీద స్వారీ చేస్తున్న పురులు తమ తోలు కొరడాతో గాల్లోనూ రాళ్ళమీద ఝళిపిస్తూ పశువుల్ని పరుపెట్టి అదలిస్తున్నారు. పురులసంఖ్య దగ్గర దగ్గర నూరు ఉంటుందని అమృతాశ్వుడు కనిపెట్టేడు. నలభైమందున్న తన చిన్న ముఠాతో వాళ్ళమీద దాడిచేసి యుద్ధం మొదలుపెట్టాలా వద్దా అని బుర్ర బద్దలుకొట్టుకుని అతడు ఆలోచించ దలుచుకోలేదు. పొడుగైన కొమ్ముల బరిశెను సరిచేసుకుని శత్రువుమీద దాడిచెయ్యమని ఆజ్ఞాపించాడు.

కురువీరులు, వీరవనితలూ - వీరవనితలేం తక్కువగా లేరు. వాళ్ళూ వీళ్ళూ చెరి సమానంగానే ఉన్నారు- ఏ మాత్రం భయపడకుండా గుర్రాల్ని ముందుకి ఉరికించారు. వాళ్ళని చూడగానే పురులు తమలో కొంతమందిని పశువుల్ని ఆపి ఉంచడానికి వదిలి మిగతావారంతా కిందవేపుకి పరిగెట్టేరు. గుర్రాలమీద యుద్ధం చెయ్యడానికి వీలుగా నదిఒడ్డునే ఉన్న మైదానంలో నిలిచి కురులరాకకి ఎదురుచూడ్డం మొదలు పెట్టేరు. అమృతాశ్వుని రూపం చూసితీరాల్సిందే. అతని గుర్రం అమృత్ అతడూ ఇద్దరూ ఒకే శరీరానికి చెందిన అంగాల్లా కనపడుతున్నారు. లేడి కొమ్ముతో చేసిన పదునైన అతనిబల్లెం ఓసారి తగిలిందా అంటే ఆ తగిలినవాడు మరి గుర్రం మీద కనిపించటం లేదు. పురులు విల్లూ బాణాలూ రాతిగొడ్డళ్ళూ ఉపయోగించి వాటినే నమ్ముకొని పెద్ద తప్పుచేశారు. వాళ్ళదగ్గరా అన్ని కొమ్ము బల్లేలు ఉండి ఉంటే కురుజనులు వాళ్ళని ఎదుర్కోగలిగి ఉండేవారు కాదు. గంటపైగా యుద్ధం జరుగుతోంది. కురుజనం నిబ్బరంగా నిలిచి ఇంకా పోరాడుతున్నారు. కాని పురుజనం మూడువొంతుల్లో ఓ వంతు యోధులు నేలకూలిపోయేరు. నిజంగా భయపడాల్సిన సంగతే! సరిగ్గా ఇదే సమయానికి ముప్పైమంది కురుయోధులు గుర్రాలమీద స్వారీచేస్తూ శత్రువుల్ని సవాలుచేస్తూ యుద్ధరంగానికి వచ్చిపడ్డారు. కురుజనుల ధైర్యసాహసాలు ఇనుమడించాయి. పురులు ఘోరంగా చచ్చిపోతున్నారు. వాళ్ళ క్లిష్టపరిస్థితి చూసి పశువుల్ని ఆపి నిలిచివున్న పురుయోధులు కూడా అక్కడికి వచ్చేరు. అయితే ఈ సమయానికి నలభైమంది కురువీరుల్నీ వీరవనితల్ని తీసుకొని మధుర వచ్చేసింది. గంటన్నరసేపు హోరాహోరీ యుద్ధం జరిగింది. చాలామంది పురులు చచ్చిపోయేరు. కొంతమంది పారిపోయేరు.

దెబ్బతిన్న వాళ్ళని హతమార్చి కురుసేన పురుగ్రామం వేపుకి బయల్దేరింది. ఆ గ్రామం నాలుగు కోసులకు పైన ఉంది ఊరంతా ఖాళీగా ఉంది జనం డేరాలను వదిలి పారిపోయేరు. వాళ్ళపశువులు అక్కడక్కడ మేస్తున్నాయి. అయితే కురుజనం

మొదట పురుజనం పనిపట్టాలి. పురుజనం ఘోరంగా చిక్కుకుపోయేరు. మీదకి పారిపోవడానికంత సావకాశం లేదు. కొండలోయ దారి ఇరుకైనది. ముందుకు వెళ్తున్న కొద్దీ మరీ ఇరుకైపోతుంది. కొండపైకి ఎక్కడం మహాకష్టం- అయినా ప్రాణాల్ని కాపాడుకోడానికి స్త్రీలూ పురుషులూ గుర్రాలమీద పారిపోతూనే ఉన్నారు. ఆఖరికి ఆ ఇరుకుదారిలో గుర్రం ఇహముందుకు వెళ్ళే వీలులేకపోయింది. అప్పుడిహ నడక మొదలుపెట్టేరు. కురుజనం వాళ్ళకి దగ్గరగా వచ్చేశారు. పిల్లలూ, ముసిలి వాళ్ళూ, స్త్రీలూ తొందరగా ముందుకు వెళ్ళలేకపోతున్నారు. అంచేత వాళ్ళకి పారి పోడానికి అవకాశం కలిగించడానికి కొంతమంది కురుభటులు ఓ ఇరుకుచోట నిలుచుండిపోయారు. కురులు తమ బలాన్నంతటినీ ఉపయోగించడానికి ఇక్కడ వీలుగాలేదు. అంచేత పురులనుండి దారిని నిరాటంకం చెయ్యడానికి కొన్ని గంటలు పట్టింది. పురులూ కురులూ ఇద్దరూ ఇప్పుడు కాలినడకనే ఉన్నారు. అయితే పురు జనంలో మగవాళ్ళు ఓ డజను మంది మిగిలేరేమో! అంచేత కొద్దిరోజులు మాత్రమే వాళ్ళు పురుకుటుంబాన్ని కాపాడగలరు. వాళ్ళు ఓ రోజు కొంతమంది ధైర్యమైన స్త్రీలను తీసుకొని ఓ దుర్గమమైన దారిని ఆ కొండలోయని వదలి వెళ్ళిపోయేరు. కొండల్ని దాటుకుంటూ దక్షిణంవేపుకి తరలిపోయేరు. అక్కడక్కడ దాక్కుని ప్రాణభిక్ష పెట్టమని అడుగుతూ కనిపించిన పురుపిల్లల్ని, ముసలివాళ్ళనీ స్త్రీలనీ కురుజనులు పట్టుకున్నారు. ఖైదీలుగా పట్టి ఉంచడం పితృయుగపు నియమానికి విరుద్ధం. అంచేత పిల్లల దగ్గర్నుంచి ముసలివాళ్ళ వరకూ అందరు మగవాళ్ళనూ వాళ్ళు హతమార్చేరు. స్త్రీలని మాత్రం తమతోపాటు తీసుకువచ్చేరు. పురుల పశు సంపత్తి అంతా వీళ్ళదే అయింది. ఇప్పుడా ఆకుపచ్చటి నదీలోయ ప్రాంతం కిందనుంచి మీదవరకూ అంతా కురుజనుల పశువులబీడు అయింది. ఓ తరం వరకూ ఒక స్త్రీ కన్నా ఎక్కువ మందిని కలిగి ఉండొచ్చునన్న పద్ధతిని మహాపితరుడు ఏర్పరచేడు. ఈ కాలంలోనే మొట్టమొదటిసారిగా కురుజనంలో సవతులు ఏర్పడ్డారు.*

---

నేటికి రెండువందల తరాలకి పూర్వంనాటి ఓ ఆర్యజన సమూహానికి చెందిన కథ. ఆ కాలంలో భారతదేశానికి ఈశాన్యాన చెందిన శ్వేతజాతుల సంఘం ఒకటి ఉండేది. ఈ రెండింటికీ కలిపి ఒకటే పేరు ఉండేది ఆ పేరే ఆర్యులు. పశుపాలనం వాళ్ళ జీవనోపాధికి ముఖ్యసాధనం.

# పురుహూతుడు

దేశం : వక్షులోయ (తాజికిస్తాను) జాతి : ఇండో ఇరానియన్
కాలం : క్రీస్తుకు పూర్వం 2500

వక్షునదీ ప్రవాహం గురగురమని శబ్దం చేస్తూ మధ్యగా ప్రవహిస్తోంది. దాని కుడి ఒడ్డుని ప్రవాహాన్ని ఆనుకుని కొండలున్నాయి. ఎడంవేపు ఎక్కువ ఏటవాలుగా ఉండడం నుంచి లోయ వెడల్పుగా ఉన్నట్టు కనపడుతోంది. దూరం నుంచి చూస్తే దట్టంగా ఉన్న ఆకుపచ్చటి ఎత్తైన దేవదారు వృక్షాల నలుపురంగు తప్పించి ఇంకేం కనపడదు. దగ్గరకి వస్తే కిందవేపు పొడుగ్గానూ మీదకి వెళుతున్నకొద్దీ చిన్నవైపోతూనూ ఉన్న కొమ్మలతో ఆ చెట్ల శిఖరాలు బాణాల్లా సూదిగా కనపడ తాయి. వాటికింద అనేకరకాల వనస్పతులు మిగతా చెట్లూ ఉన్నాయి. గ్రీష్మం అయి పోవచ్చింది. అయినా వర్షాలు ఇంకా ప్రారంభం కాలేదు. ఉత్తర భారతదేశంలో మైదాన ప్రాంతపు జనం వేడిభరించలేక బాధపడేనెల. కాని ఈ ఏడు వేల అడుగులు ఎత్తుమీద ఉన్న కొండలోయలో వేడి అన్నది అడుగు పెట్టలేకపోతుంది. వక్షునదీ ఒడ్డున ఓ యువకుడు వెళుతున్నాడు. అతని ఒంటిని ఉన్నికంచుకం ఉంది. దాని మీద ఎన్నో చుట్లు చుట్టిన నడుంపటాకా, కిందకి ఉన్నిషరాయి, పాదాలకి ఎన్నో పేనినతాళ్ళతో చేసిన చెప్పులూ ఉన్నాయి. తలమీద పెట్టుకున్న టోపీ చెవులను కూడా మూసేసింది. ఆ టోపీని తీసి తన వీపున ఉన్న వెదురుబద్దల బుట్టకి తగిలిం చాడు. అతని పొడుగైన పసుపు వర్ణపు వెంట్రుకలు మెరుస్తూ వీపుమీద చిందర వందరగా పడి గాలి తాకిడికి ఉండుండి అల్లల్లాడుతున్నాయి. యువకుడి నడుంకి తోలుతో చుట్టిన ఓ రాగి ఖడ్గం వేళ్ళాడుతోంది. అతని వీపుమీద ఆకులీనెలతోనూ వెదురుబద్దలతో అల్లిన గొట్టం ఆకారంలో ఉన్న బుట్ట ఉన్నది. దాంట్లో యువకుడు చాలా వస్తువులు, విప్పేసి పెట్టిన విల్లూ, బాణాలతో నిండిన అమ్ములపొదీ పెట్టుకు న్నాడు. అతనిచేతిలో ఓకర్రకూడా ఉంది. దాన్ని ఆబుట్ట అడుగుభాగంలో గుచ్చి నిల బడి మధ్య మధ్య అలసట తీర్చుకుంటున్నాడు. ఇప్పుడు ఎక్కుడు జాగానుంచి అత నికి కష్టంగా ఉంది. అతని ముందు దుక్కతన్నిన గొర్రెలు ఆరు నడుస్తున్నాయి. వాటి వీపుమీద గుర్రపు వెంట్రుకలతో చేసిన పెద్ద పెద్ద సంచులున్నాయి. ఆ సంచుల నిండా సెనగపిండిఉంది. యువకుడి వెనకాతలే ఓ ఎర్రటి బొచ్చుకుక్క నడుస్తోంది.

మధుర గంభీర స్వరాలతో పర్వత ప్రాంతం అంతా ప్రతిధ్వనిస్తోంది. దాన్నింట యువకుడూ ఈలవేస్తూ వెళుతున్నాడు.

ఓ రాతిమీద నుంచి సన్నని వెండిలా తెల్లటి ధారపడుతూ కనిపించింది. రాతిమీద నుంచి జలధార సరిగా కిందకి పడడానికి ఎవరో ఓ కర్రగొట్టాన్ని తగిలించారు రొప్పుతూ రోజుతూ ఉన్న గొర్రెలు కిందపడుతున్న నీళ్ళు తాగటం మొదలు పెట్టేయి. యువకుడు ఆ పక్కనే పాకివున్న ద్రాక్షతీగల్ని వేళ్ళాడుతున్న ద్రాక్ష గుత్తుల్ని చూశాడు. కూచుని వీపునున్న బుట్టని నెలకిదించి అతడు ద్రాక్ష గుత్తుల్ని కోసుకుని తిండం మొదలుపెట్టేడు. ద్రాక్ష ఇంకా పండలేదు. వగరూ పులుపూ వున్నది. మరోనెల పోతేనేగాని బాగా పండవు. అయినా యువకుడికి అవి బాగానే వున్నాయి. అంచేత అతడు ఒక్కొక్కపండునీ నోట్లో వేసుకుంటున్నాడు. అతనికి బహుశా దాహంవేస్తూ వుండివుంటుంది. నడచి నడచి అలసిపోయిన వెంటనే చల్లటి నీళ్ళు చెడుగుచేస్తాయి. కాబట్టి దాహం వేస్తున్నా నీళ్ళు తాగకుండా తాత్సారం చేస్తున్నాడు.

నీళ్ళు తాగి గొర్రెలు చుట్టూ వున్న పచ్చగడ్డిని మేస్తున్నాయి. బొచ్చుకుక్క వేడి భరించలేకపోతోంది. అంచేత అది తన యజమాని వెంటాపోలేదు, గొర్రెల్తోనూ వెళ్ళలేదు. తిన్నగావెళ్ళి నీటిధారకిందకిపోయి పడుకుంది. ఇప్పటికీ దాని పొట్ట కొలిమితిత్తిలాగ ఉబ్బుతూ తీస్తూ వుంది. దాని ఎర్రటి పొడుగ్గైన నాలిక తెరచిన నోట్లోంచి బైటికివచ్చి అల్లల్లాడుతోంది. యువకుడు ధారకింద నోరుపెట్టేడు. అతని దాహం వెంటనే తీరింది. పుడిసిలితో నీళ్ళు తీసుకుని ముందువేపునున్న జుట్టు కుదుళ్ళను తడుపుకుంటూ మొహం కడుక్కున్నాడు. అతని ఎర్రని బుగ్గల్నీ, ఎర్రటి పెదిమలనీ కప్పడానికి ఇప్పుడిప్పుడే పచ్చటి రోమాలు మొలకెత్తుతున్నాయి. గొర్రెలు మైమరచి గడ్డిమేస్తూ వుండడంచూసి యువకుడు తనగొట్టాం బుట్ట దగ్గర కూచున్నాడు. చెవులు నిగిడించి తనవేపే చూస్తున్న బొచ్చుకుక్క చూపుని గ్రహించి గొట్టాం బుట్టలో ఓ పక్కచెయ్యిదూర్చి గొర్రెతొడ మాంసం ముక్కని ఎండిపోయిన దాన్ని తీసి నడుం పటకాకి వేళ్ళాడుతున్న తోలుకి చుట్టబెట్టిన పదునైన రాగికత్తితో ముక్కలు ముక్కలు చేసి తాను కొంచెం తింటూ కుక్కకి తినిపించడం మొదలు పెట్టేడు. ఇంతలో కర్రగంట ఖణఖణమంటూ వినిపించింది. యువకుడు దూరంగా చెట్టుపొదదాటునుంచి సగం కనిపిస్తూ వస్తున్న గాడిదను చూసేడు. ఆ తర్వాత రెండో గాడిద కనిపించింది. వాటి వెనక ఓ పదహారేళ్ళమ్మాయి తనలాగే దుస్తులు వేసుకుని వీపుమీద గొట్టాం బుట్టని తగిలించుకుని వస్తూ వుండడం చూశాడు. ఎంతో సహజంగా అతడు ఈలవెయ్యసాగాడు. యువకుడు ఏదన్నా ఆలోచనలో పడ్డాడా, అతని నోటంట ఈలపాట అతనికి తెలీకుండానే వచ్చేస్తుంది. ఊపిరిపీల్చుకుంటున్నంత సహజంగా ఈలవేస్తాడు. పదహారేళ్ళమ్మాయికి ఈల ఓసారి వినపించనూ వినిపించింది. ఆవిడ ఆవేపుకోసారి చూడనూ చూసింది. అయితే యువకుడు లతల వెన

రాతల వుండడం నుంచి కనిపించలేదు. యువకుడావిణ్ణి ఏభైబారల దూరం నుంచి చూసినప్పటికీ ఆవిడ అందమైన మొహం అతని గుండెలో చిన్నగా ముద్రవేసింది. ఆవిడ ఎక్కడికి వెళ్తోందోనని తెలుసుకోడానికి కుతూహలపడుతూ ఎదురుచూస్తున్నాడు. ఇటువంక వక్షునదికి ఎగువభాగంలో ఏ ఊరూలేదు. ఆ సంగతి అతనికి తెలుసు. అంచేత తనలాగే ఆవిడా ఈ తోవంటపోయే బాటసారే అయివుంటుందని అతనికి అర్థమైంది.

అందమైన పదహారేళ్ళమ్మాయి అపరిచితురాలవడం నుంచి బొచ్చుకుక్క ఆమెని చూసి అరవడం మొదలుపెట్టింది. "ఉండు. ఊరుకో" అని యువకుడు అదమాయించేసరికి అది మొరగడం మానేసి మెదలకుండా కూచుంది. పదహారేళ్ళ పడుచుతో కూడా వున్న గాడిదలు నీళ్ళు తాగసాగాయి. ఆవిడ తన వీపుమీద వున్న బుట్టదింపుకోబోతూవుంటే యువకుడు తన బలమైన చేతులతో దాన్ని తీసుకుని కిందపెట్టేడు. ఆ పడుచు చిరునవ్వుతో కృతజ్ఞతని తెలుపుతూ "అబ్బ చాలా ఉక్కగా వుంది" అన్నది.

"వేడీ ఉక్కా కాదు. ఎత్తుమీదకి ఎక్కిరావడం నుంచి అలా అనిపిస్తోంది. కాస్సేపు విశ్రాంతి తీసుకుంటే ఒంటికి పట్టిన చెమట ఆరిపోతుంది."

"వాతావరణం బాగుంది"

"మరో పది పదిహేనురోజుల వరకూ వాన వస్తుందన్న భయంలేదు"

"వర్షం అంటే నాకు భయం. కాలవలూ జారుడూను—వాటితో దారి సరిగ్గా ఉండదు."

"గాడిదలకైతే నడక మరీకష్టం అవుతుంది."

"మాకు గొర్రెలు లేవు. అంచేతే గాడిదల్ని తోలుకువచ్చేను. సరేకాని నువ్వెక్కడికి వెళుతున్నావు మిత్రమా!"

"పొలిమేర వరకూ, ప్రస్తుతం మా గుర్రాలూ, ఆవులూ, గొర్రెలు అక్కడే వున్నాయి."

"నేనూ అక్కడికే వెళ్తున్నాను. పిండీ, గింజలూ, పళ్ళూ, ఉప్పూ తీసుకు వెళుతున్నా."

"నీ పశువుల్ని ఎవరు చూస్తారు?"

"మా ముత్తాత, సోదరులూ, అప్పచెల్లెళ్లూ"

"ముత్తాతా? ఆయన చాలా ముసిలివాడయి ఉంటాడే!"

"పండుముసిలివాడు. అంత ముసిలివాడు మరింకెక్కడా కనిపించడు."

"అలా అయితే ఆయనేం పశువుల్ని చూడగలడు?"

"ఆయన ఇంకా చాలా గట్టిగా వున్నాడు. ఆయన జుట్టూ కనుబొమ్మలూ పండిపోయేయి. అయితే పళ్ళుమాత్రం కొత్తగా గట్టిగా వున్నాయి. చూడ్డానికి ఏభై ఏభై అయిదేళ్ళ వాడిలా వుంటాడు."

"అలా అయితే ఆయన్ని ఇంటిదగ్గరే వుంచాలి"

"ఆయన ఒప్పుకోడు కదా! నేను పుట్టకముందునుంచి ఆయన ఊరుకి వెళ్ళ లేదు."

"ఊరుకి వెళ్ళలేదూ?"

"వెళ్ళడానికి ఇష్టపడడు. ఊరంటే ఆయనకి అసహ్యం. ఓచోట కట్టిపడేసి నట్టు వుండడానికి మనిషి పుట్టలేదు అంటాడు. పాతకాలం సంగతు లెన్నెన్నో చెప్తూ వుంటాడు. అదిసరేకాని నీ పేరేమిటి మిత్రమా?"

"పురుహూత-మ్మాద్రీ పుత్ర పౌరవ. మరి నీ పేరేమిటి సోదరీ?"

"రోచనా మ్మాద్రి"

"అలా అయితే నువ్వు మా మేనమామల కులానికి చెందిన దానివి సోదరీ! ఎగువ మ్రదులా? దిగువ మ్రదులా?"

"ఎగువ మ్రదులమే."

వక్షునదికి ఎడం ఒడ్డున పురుల ఊళ్ళున్నాయి. కాని దానికి దిగువ భాగం-కిందనున్న మైదానంతో కలిసివున్నది-మ్రదులది. కుడి ఒడ్డుకి ఎగువభాగం మ్రదులదీ కిందభాగం పరశువులదీను. భూమినిబట్టి చూసినా, జనసంఖ్యని బట్టి చూసినా పురులు మ్రదులకన్నా తక్కువ ఏం లేరు. పురులకి కిందభాగంలో వున్న మ్రదులని దిగువ మ్రదులంటారు. రోచన ఎగువ మ్రదులకి చెందినది. పురుహూతుని మేనమామగారి ఊరూ ఎగువమ్రదులదే.

ఈ సంగతి తెలిశాక ఇద్దరిమధ్యా ఆత్మీయత పెరిగింది. పురుహూతుడు మళ్ళీ సంభాషణ మొదలుపెట్టేడు.

"రోచనా, మనం ఇవాళ పొలిమేర వరకూ చేరుకోలేం. నువ్వు ఒంటరిగా ధైర్యంచేసి ఎలా వచ్చేవు?"

"నిజమే. రాత్రివేళప్పుడు గాడిదలని చిరుత నోటపడకుండా కాపాడ్డం కష్టం అని తెల్సు. అయినా తాతకోసం తిండిసామాన్లు తీసుకెళ్ళడం తప్పనిసరి. పురుహూత్! తాతకి నేనంటే ఎంతో ఇష్టం. తోవలో ఎవరో ఒకరు తోడుదొరుకుతారని కూడా అనుకున్నాను. ప్రస్తుతం పొలిమేరవరకూ వెళ్ళేవాళ్ళు చాలామంది వుంటారు. అదీకాకపోతే నిప్పునెగడువేస్తే సరిపోతుందన్న ఆలోచనా వచ్చింది."

"ప్రయాణంచేస్తూ నిప్పునెగడు వెయ్యడం కుదరదు. నీ దగ్గర ఆరణి ఉందా రోచనా?"

"ఆఁ ఉన్నాది."

"ఉన్నాసరే ఆరణిని రాపాడి అగ్నిదేవతని ప్రసన్నం చేసుకోవడం తేలికైన విషయం కాదు. సర్లే, నా దగ్గరా ఓ పవిత్రమైన ఆరణివుంది. అది మా ఇంట మా పితామహుల కాలంనుంచీ వున్నాది. ఈ ఆరణితో వెలువడ్డ అగ్నితో చాలా

యజ్ఞాలు జరిగాయి. ఎన్నో దేవపూజలు జరిగాయి. నా నోటికి అగ్నిమంత్రం కూడా వచ్చు. అంచేత ఈ ఆరణితో అగ్ని తొందరగా ప్రత్యక్షమౌతాడు."

"అయినా పురుహూత్! మనం ఇద్దరం ఉన్నాం. చిరుతకి మనదగ్గరికి రావడానికి ధైర్యం చాలదు."

"మన బొచ్చు కూడా వుంది రోచనా!"

"బొచ్చా?"

"ఇదిగో ఈ ఎర్రకుక్క." రోచనకూడా "బొచ్చూ! బొచ్చూ!" అని పిలిచింది కుక్క లేచివచ్చి ఆవిడకాళ్ళని వాసన చూడ్డం మొదలుపెట్టింది. రోచన దాని వీపు నిమరగానే బొచ్చుకుక్క తోకాడిస్తూ ఆవిడ కాళ్ళ దగ్గర కూచుంది. "బొచ్చు చాలా తెలివైన కుక్క రోచనా!" అని పురుహూతుడు అన్నాడు.

"చాలా బలమైంది కూడా"

"నిజమే తోడేలన్నా, ఎలుగ్గొడ్డన్నా, చిరుతన్నా ఏ మాత్రం భయపడదు."

గొర్రెలూ గాడిదలు బాగా మేశాయి. అలసటా తీరింది. అంచేత ఇద్దరు బాటసార్లు మళ్ళీ నడక మొదలుపెట్టేరు. బొచ్చుకుక్క వాళ్ళవెనకాలే వస్తోంది. వాళ్ళు వెళుతున్న కాలిబాట మెలికలు తిరిగివుంది కాని ఎగుడు ఎక్కువగా వుంది. అంచేత వాళ్ళు చాలా జాగ్రత్తగా అడుగులువేస్తూ నెమ్మదినెమ్మదిగా ముందుకు సాగుతున్నారు. ఒక్కోచోట నేలని అంటుకునివున్న ఎర్రటి స్ట్రాబెర్రీ పళ్ళనీ, ఇంకోచోట వాల్‌పళ్ళనీ కోసి పురుహూతుడు రోచనకి ఇస్తున్నాడు. బాగా పండి ముగ్గిన పళ్ళు ఇంకా ఆవలేదని పురుహూతుడు వాపోతున్నాడు.

సాయంత్రం వరకూ వాళ్ళు మాట్లాడుకుంటూ ఆ ఎగుడు ఎక్కుతూనే వున్నారు. పొద్దుదిగిపోతోంది. ఓ పొదకింద గలగలమని పారుతున్న జలధారనీ, ఆ పక్కనే బట్టబయలు జాగాని, ఆ జాగాలో సగం కాలిన కర్రముక్కలూ, బూడిదా, గుర్రపు లద్దెలు పడివుండడాన్ని చూశారు. పురుహూతుడు బూడిదని కెలికి చూశాడు. బుగ్గిలో నిప్పు వున్నది. అతడు మా సంతోషపడిపోతూ ఇలా అన్నాడు- "రోచనా! రాత్రి మకాం వెయ్యడానికి ఇంతకన్నా మంచి జాగా ఇంకెక్కడా ముందుని దొరకదు. పక్కనే నీళ్ళున్నాయి. గడ్డీ పుష్కలంగా వున్నది. ఎండు పుల్లలూ వున్నాయి. అదీగాక ఇవాళ పొద్దున్నే ఇక్కణ్ణించి వెళ్ళిన బాటసారులు నిప్పుని బుగ్గిలో దాచిపెట్టి మరీ వెళ్ళారు."

"నిజమే పురుహూత్! ఇంత మంచి జాగా దొరకదు. ఇవాళ్టికి ఇక్కడే మకాం వేద్దాం. ముందునున్న మరో జలధార వరకూ వెళ్లేసరికి చీకటిపడి పోతుంది."

పురుహూతుడు మరుక్షణంలో తన గొర్రాం బుట్టని రాతికి ఆన్చి నేలమీద పెట్టేడు. ఆ తర్వాత రోచనది కూడా దింపేడు. ఇద్దరూ కలిసి గాడిదల మీద నున్న బరువుల్ని తీశారు. వాటి మీద వున్న జీనును కట్లనీ విప్పేశారు. గాడిదలు అటూ ఇటూ రెండు మూడుసార్లు దొర్లి ఆ తర్వాత గడ్డిమేయడానికి వెళ్ళిపోయేయి.

గొ[రెల్ని బలవంతంగా లాక్కొనివచ్చి పట్టుకోవలసి రావడం నుంచి వాటి వీపుల్ని వున్న బరువుల్ని దించడం కొంచెం ఆలస్యం అయింది. తోలుతిత్తి తీసుకుని రోచన జలధార నుంచి నీళ్ళు నింపుకురావడానికి వెళ్ళింది. పురుహూతుడు ఆకుల్ని చిన్న చిన్న పుల్లల్ని వేసి నిప్పు రాజేశాడు. ఆ తర్వాత పెద్ద పెద్ద కర్రలువేసి పెద్ద మంటని తయారుచేశాడు. రోచన నీళ్ళు నింపుకుని వచ్చేసరికి పురుహూతుడు రాగిపాత్రని ముందు పెట్టుకుని ఆవుకాలులో నార్గోవంతు ముక్కని చాకుతో కోస్తు న్నాడు.

"రేపు సాయంత్రానికల్లా మనం ఎగువకి చేరుకుంటాం రోచనా ! నీ పశు సమూహం మరీ దూరంగా లేదు కదా?" అని రోచనని అడిగేడు.

"మనం వెళ్ళబోతున్న పొలిమేరకు తూర్పుగా మూడు కోసుల దూరంలో వుంటుంది."

"నాది తూర్పుగా ఆరుకోసుల దూరంలో వుంది. అలా అయితే మీ ముత్తాత గారి పశుసమూహం నా దారిలోనే పడుతుంది."

"ఆలా అయితే మా తాతని నువ్వుచూడొచ్చు. తాత నిన్నెలా చూడగలడా అని నేననుకుంటున్నాను. మంచిదయింది."

"ఇంకో రోజేగా! తొడతో పావుభాగం చాలు. ఇది వెనకతొడభాగం రోచనా! వొట్టిపోయిన ఆవుది."

"నా దగ్గర దూడకాలు సగం వున్నాది. ఈ కాలంలో మాంసం ఎక్కువ నిలవ వుంచితే కంపుకొడ్తుంది కదా !"

"ఉప్పేసి మాంసం వొండితే ఎలా వుంటుంది."

"మా బాగుంటుంది. నా దగ్గర గొ[రెకాలు ఎముకా వున్నది పురుహూత్ ! మాంసం, గొ[రెకాలు ఎముకనీ ఆ తర్వాత కాస్తపిండీ కలిపితే మంచి సూప్ తయారవుతుంది. పడుకోబోయే ముందు చక్కగా సూప్ తాగొచ్చు."

"నేనొక్కణ్ణే వుండివుంటే సూప్ చేసి వుండేవాణ్ని కాదు రోచనా! చాలా సేపుపడుతుంది. సూప్ అయ్యే వరకు మనం పశువుల్ని కట్టి బాతాఖానీ కొడుతూ గడుపుదాం."

"తాత నేవొండిన సూప్‌ని చాలా పొగుడుతాడు పురుహూత్ ! ఇది రాగిపాత్ర కదూ ?"

"అవును రాగి చాలా ఖరీదు రోచనా ! ఈ పాత్ర ఓ గుర్రపు విలువచేస్తుంది.. అయితే ప్రయాణంలో బాగా ఉపయోగపడుతుంది."

"అయితే మీ ఇంట్లో చాలా పశువులు ఉండివుంటాయి పురుహూత్!"

"ధాన్యమూ ఎక్కువే రోచనా! అందుకే ఓ గుర్రం విలువచేసే రాగి పాత్ర వున్నాది. ఇదిగో ఇంద నేను మాంసం కోసేశాను. నీళ్ళు ఉప్పువేసి మాంసాన్ని నిప్పుమీద పెట్టు. నేనటువేపు కర్రలుపెట్టి నిప్పుచేస్తాను. తర్వాత కాస్త గడ్డికోసి

గాడిదల్ని గొర్రెల్ని ఇక్కడ మధ్యస్థంగా కట్టేయాలి. మనకి ఆవుదూడ మాంసం అంటే ఎంత ఇష్టమో చిరుతపులికి గాడిద మాంసం అంటే అంతకంటే ఇష్టం అని నీకు తెల్సా? ఏయ్ బొచ్చూ! అందాకా నువ్వు దవడలాడించు" అని కాస్తమాంసం వున్న ఓ బొమికని బొచ్చుకుక్క ముందుకి విసిరేడు. బొచ్చుకుక్క తోకాడిస్తూ బొమికను కాలికింద నొక్కిపెట్టి పళ్ళతో కొరకడానికి ప్రయత్నిస్తోంది.

పురుహూతుడు ఒంటినున్న కంచుకాన్నీ, నడుంపటాకాన్ని విప్పేశాడు. చేతుల్లేని జుబ్బాలోంచి విశాలమైన ఛాతీ, కండలు తిరిగిన చేతులూ ఆ ఇరవై ఏళ్ళ యువకుడికి మంచిబలం వున్నదని చెప్పక చెప్తున్నాయి. పనిచేస్తున్నప్పుడు పురుహూతుని రోమ రోమమూ కదుల్తున్నది. గొట్టాం బుట్టలోంచి కొడవలితీసి చూస్తూ చూస్తూ వుండగానే ఓ మోపెడు గడ్డికోసి పారేశాడు. చెవులు పట్టుకుని గాడిదల్ని లాక్కొచ్చి కొయ్యలుపాతి వాటిని కట్టేసి వాటి ముందంత గడ్డిపడేశాడు. అలాగే గొర్రెలనీ కట్టేశాడు.

పనంతా పూర్తి చేసుకుని పురుహూతుడు నిప్పుదగ్గరకి వచ్చి కూచున్నాడు. రోచన పాత్రలోంచి ఉడికిన మాంసం ముక్కల్ని తీసి చర్మంమీద పెడుతోంది. పురుహూతుడు గొట్టాంబుట్టలోంచి ఓ చర్మాన్ని తీసి కింద పరిచాడు. తర్వాత కర్రతో చేసిన ఓ అందమైన పానపాత్రనీ, పారదర్శకంగా కనిపించే తిత్తిలోంచి పానీయాన్నీ తీసిబైట పెట్టేడు. దాన్ని తీస్తూ ఉంటేనే పిల్లంగోవి నేలమీద పడ్డాది. ఎంతో మృదువైన పసిపిల్ల పడిపోయిందా అన్నట్టు, ఆ పసిపిల్లకి ఎక్కడ దెబ్బ తగిలిందో అని తల్లి బాధపడుతున్నట్టూ అతడు ఆ పిల్లంగోవిని వెంటనే నేలమీంచి తీసి జాగ్రత్తగా బట్టతో తుడిచి ముద్దు పెట్టుకుని తిరిగి గొట్టాంబుట్టలో పెట్టబోయేడు.

రోచన ఇదంతా చూస్తోంది. "పురుహూత్! నువ్వు పిల్లంగోవి వాయిస్తావా?" అని అడిగింది.

"ఇదంటే నాకు ప్రాణం. రోచనా! నా బ్రతుకు దీనితోనే ఉందనిపిస్తుంది."

"పిల్లంగోవి నాకు వినిపించు పురుహూత్"

"ఇప్పుడా? భోంచేసిన తర్వాత?"

"ఇప్పుడు కొంచెం"

"సరే అయితే" పురుహూతుడు పిల్లంగోవిని పెదిమలకి అన్చి ఎనిమిది వేళ్ళనీ దాని రంధ్రాల మీద తిప్పడం మొదలు పెట్టేడు. విశాలమైన వృక్షాల నీడల నుండి కమ్ముకుని వస్తున్న సంజెచీకట్లలో దిగంతాల వరకూ వ్యాపించిన స్తబ్ధ వాతావరణంలో ఆ పిల్లంగోవి తియ్యటినాదం తన గారడీతో నాలుగు దిక్కుల్ని బంధించింది. రోచన తనను తాను మరచిపోయి తన్మయత్వంతో ఆ నాదాన్ని వింటోంది. పురుహూతుడు ఊర్వశీ వియోగంలో వ్యధతో బాధపడుతున్న పురూరవుని విరహగీతాన్ని పిల్లంగోవి మీద వాయిస్తున్నాడు. పాట ఆగి

పోగానే స్వర్గం నుంచి పృథ్వీ మీదకి పడిపోయి నట్టుగా రోచనకి అనిపించింది. ఆనందంతో కళ్ళు చెమర్చగా ఆవిడ పురుహూతుడితో ఇలా అంది- "పురుహూత్! నీ పిల్లంగోవి పాట ఎంతో తియ్యగా ఉంది. ఇలాంటి మురళీగానాన్ని నేనెప్పుడూ వినలేదు. ఎంత లయబద్ధంగా ఉంది!"

"అంతా అలాగే అంటారు రోచనా! ఏమిటో నాకు తెలీదు.పిల్లంగోవిని పెదిమలకి ఆన్చగానే నేను సర్వస్వం మర్చిపోతాను. ఈ మురళి నా దగ్గర ఉంటే ప్రపంచంలో మరేవస్తువూ నాకు అక్కరలేదు."

"రా పురూ ! మాంసం చల్లారి పోతోంది."

"ఇదిగో రోచనా, బయల్దేరి వచ్చేముందు మా అమ్మ ఈ ద్రాక్షారసం కూడా ఇచ్చింది. కొంచెం ఉంది. మాంసంతోపాటు తాగితే ఎంతో బాగుంటుంది.

"సుర అంటే నీకు ఇష్టమా పురూ?"

"ఇష్టం అని చెప్పలేను, రోచనా! ప్రీతికి అంతు ఉండదు. అయితే కళ్ళలోకి చిన్నగా ఎరుపుజీరలు రాగానే మరి ఓ గుటక కూడా వెయ్యలేను."

"నేనూ అంతే పురూ! మత్తులో ఒంటిమీద స్మారకం తప్పిన మనిషిని చూస్తే నాకు అసహ్యం." రోచన తన కర్రపానపాత్రని బైటికి తీసింది.

మూడువొంతుల మాంసంలో ఓ వొంతు మాంసం బొచ్చుకుక్కకి వేశారు. మెల్లిగా ఇద్దరూ భోంచేశారు. చుట్టూ చీకటి ఆవరించింది. లావుపాటి కర్రలతో భగభగ మండుతున్న నిప్పు దగ్గరా, ఆ చుట్టూ కొద్దిపాటి జాగాలోనూ కనిపిస్తున్న ఎర్రటి కాంతి తప్ప మిగతా ఎక్కడా ఏమీ కనిపించడం లేదు. కొన్ని ధ్వనులు మాత్రము వినపడుతున్నాయి. పురుగులూ, చిన్న జంతువులూ చేస్తున్న ధ్వనులు, మాట్లాడుకుంటూ మధ్యమధ్య మురళీనాదం వింటూ వినిపిస్తూ ఇద్దరికీ కాలం గడుస్తోంది. పిండి కలిపి ఉడకబెట్టిన మాంసం ఎన్నో గంటల తర్వాత తయారయింది. ఇద్దరూ తమతమ పానపాత్రాల్లో వేడివేడి సూప్‌ని తాగేరు. రాత్రి బాగా పొద్దుపోయేక నిద్రపోదామని అనుకున్నారు. రోచన చర్మపుపక్కని వేసుకుని తనబట్టల్ని విప్పుకోసాగింది. పురుహూతుడు నిప్పులో మరిన్ని కర్రలు వేశాడు. పశువులకి గడ్డి వేశాడు. ఆ తర్వాత వనదేవతలని ప్రార్థించాడు. బట్టలు విప్పి నిద్రపోయేడు.

మర్నాడు పొద్దున నిద్రలేచేక ఒక్కరాత్రి సాంగత్యంతో ఇద్దరికిద్దరికీ తాము స్వంత అన్నాచెల్లెళ్ళం అన్న భావం కలిగింది. రోచన లేచేక పురుహూతుడు తన కోరికని ఆపుకోలేకపోయేడు.

"నిన్ను ముద్దాడాలనిపిస్తోంది సోదరీ" అన్నాడు.

"నాకూ అదే అనిపిస్తోంది పురూ! ఈ లోకంలో మనం అన్నా చెల్లెళ్ళం అయ్యేం."

పురుహూతుడు చెల్లాచెదురుగా ఉన్న ఆవిడ జుట్టుని వెనక్కి సద్ది రోచన రెండు బుగ్గలనీ ముద్దుపెట్టుకున్నాడు. ఇద్దరి మొహాలూ చాలా సంతోషంగానూ

ప్రసన్నంగాను ఉన్నాయి. ఇద్దరి కళ్ళూ చెమర్చేయి. ఇద్దరూ మొహాలు కడుక్కొని పిండినీ ఎండు మాంసాన్నీ తిని పశువులమీద బరువులు కట్టి బయల్దేరారు. మధ్య మధ్య రెండు మూడుచోట్ల వాళ్ళు అలసట తీర్చుకోడానికి కూర్చున్నారు కూడా. అయితే మాటల్లో సమయం ఎంతో తొందరగా గడచిపోయింది. ఎప్పుడు పొలిమేరకి చేరుకున్నారో ఎప్పుడు మాద్రతాత దగ్గరికి వచ్చేరో వాళ్ళకి తెలియదు. రోచన పురుహూతుణ్ణి తాతకి పరిచయం చేసింది. పురులవీరత్వాన్ని, సాహసాన్ని పొగుడుతూ తాత పురుహూతుణ్ణి ఆహ్వానించాడు.

## 2

ఆ పొలిమేరని మద్రులదో చిన్న ఊరు ఉంది. అక్కడి ఇళ్ళు డేరాలు. లేకపోతే గడ్డితో వేసిన గుడిసెలూను. దిగువ వేపు పీటవాలు ప్రాంతంలోనూ, ఎత్తైన కొండ ప్రాంతంలోనూ దట్టంగా దేవదారు వృక్షాలతో అడవే అడవి కనపడుతుందా— అలాంటిది ఇక్కడ, ఈ పొలిమేర మీద ఎక్కడా చెట్టన్నమాట లేదు. నేల చాలా వరకు సమతలంగా ఉంది. ఆకుపచ్చటిగడ్డి, దళసరి తివాసీలా పరచుకొని ఉంది. ఈ పచ్చటి మైదానంలో ఓ దగ్గర గొర్రెలు, ఓ దగ్గర ఆవులు, మరో దగ్గర గుర్రాలు మేస్తున్నాయి. వాటి మధ్య అక్కడక్కడ లేగదూడలూ, గుర్రంపిల్లలూ గెంతులేస్తూ ఆడుతున్నాయి. ఈ నేలని చూసే మాద్రతాత,"మనిషి ఓ దగ్గరే కట్టేసి పడిఉండడానికి పుట్టలేదు" అని అంటూ ఉంటాడు. మాద్రతాత డేరా ఈ నెల్లో ఇక్కడ ఉంది. గడ్డి తరిగిపోగానే మరో చోటుకి వెళ్ళిపోతాడు. పాలు, పెరుగూ, వెన్న, మాంసం ఇక్కడ పుష్కలంగా ఉంటాయి. డేరా ఈ వస్తువులతోనే నిండి పోయి ఉంది. ప్రతి పదిహేను ఇరవై రోజులకి ఊళ్ళోంచి ఓ మనిషి వస్తాడు. ఇక్కణ్ణించి వెన్నా మాంసం తీసుకెళ్తాడు. చలికాలంలో ఈ పొలిమేర మంచుకురు స్తోంది. వీలైతే తాత అప్పుడూ మకాం ఇక్కడే వేసి ఉండేవాడు. అయితే పశువులు మంచుతిని బతకలేవుకదా! అంచేత చుట్టుదారిని ఆయన కాస్త దిగువన ఉన్న అడవి ప్రాంతానికి వెళ్ళిపోతాడు. పశువులన్నీ దిగువ గ్రామానికి వెళ్ళిపోతాయి. గ్రామం పేరు చెప్తే చాలు తాతగారు చెయ్యెత్తి కొట్టడానికి వస్తారు!!

ఇద్దరు ప్రయాణీకులు తాతడేరా దగ్గరికి చేరేసరికి ఇంకా పొద్దుపోలేదు. సామాన్లుదించిన తర్వాత తాతనవ్వేస్తూ గుర్రంపాలతో చేసిన సుర (కూమిస్)ని నింపిన కర్రగిన్ని, కప్పూ వాళ్ళముందు పెట్టేడు. మూడు నాలుగు కప్పులు తాగ్గానే ప్రయాణపు బడలిక అంతా ఎగిరిపోయింది. సాయంత్రం లేగదూడల్నీ గుర్రపు పిల్లల్నీ తీసుకొని రోచన అప్పచెల్లెళ్ళూ అన్నదమ్ములూ, ఊళ్ళోని యువకులైన పశువులకాపరులూ వచ్చేరు. ఆ సరికి రోచన పురుహూతుడు పిల్లంగోవి ఎంత బాగా వాయిస్తాడో తాతకి చెప్పేసింది. మరి తాతలాంటి సరదామనిషి పురుహూతుణ్ణి

ఎక్కడ వదుల్తాడు? ఆయనకీ పశువుల సమూహానికి చెందిన యువకులందరికీ షిల్లం గోవంటే చాలా ఇష్టం. రాత్రి నృత్యం జరుగుతున్నప్పుడూ పురుహూతుడు తన ప్రతిభని చూపెట్టేడు.

తెల్లారుతూనే పురుహూతుడు శలవు తీసుకుంటానన్నాడు. గాని తాత అంత వేగిరం ఎందుకు వెళ్ళనిస్తాడూ? మధ్యాహ్నం భోజనాలైన తర్వాత తాత తన కథ మొదలుపెట్టేడు. గొట్టాంబుట్ట దగ్గర పెట్టిన రాగి పాత్రని చూసి కథ మొదలు అయింది.

"ఈ రాగిని చూసినా, వ్యవసాయపు పొలాల్ని చూసినా నా గుండె మండుతుంది. ఈ రెండూ వక్షునదీ తీరానికి వచ్చిన్నాటినుంచీ అంతటా పాపం అధర్మం పెరిగిపోయేయి. దేవతలూ కోపగించేరు. అంటువ్యాధులు ఎక్కువైపోయేయి. కొట్లు కోడాలు నరుక్కోడాలు ఎక్కువైపోయేయి." అన్నాడు తాత.

"ఇంతకు పూర్వం ఈ రెండూ లేవా తాతా?" పురుహూతుడు అడిగేడు.

"లేవురా అబ్బాయీ! ఇవి నా చిన్ననాటి రోజుల్లో కొద్దికొద్దిగా అప్పుడప్పుడే వచ్చేయి. మా తాతైతే వీటిపేరన్నా వినలేదు. ఆ కాలంలో రాతితో చేసినవీ, ఎముకలతో కొమ్ములతో చేసినవీ, కర్రతో చేసినవీ ఆయుధాలు ఉండేవి."

"అలాగా! అయితే కలప నెలా కోసేవారు తాతా?"

"రాతి గొడ్డలితో"

"చాలా సేపు పడుతూ ఉండి ఉంటుంది. ఇంతబాగానూ తెగి ఉండి ఉండదు."

"ఇదిగో ఈ తొందరే అన్నిపన్లనీ నాశనం చేసేస్తోంది! ఇప్పుడు రెణ్ణెళ్ళకి సరిపడే గ్రాసాన్నో సగం బతుక్కి ఉపయోగపడే స్త్రీ గుర్రాన్నో ఇచ్చి ఓ రాగి గొడ్డలి తీసుకో. ఆ తర్వాత అడవులకి అడవులు నరికేసి ధ్వంసం చేసెయ్యి. ఊళ్ళకి ఊళ్ళు చంపేసి నాశనంచేసెయ్యి. అయితే ఊళ్ళు అడవిరో చెట్లలా ఆయుధాలు లేకుండా లేవు. వాటిదగ్గరా అంత పదును గొడ్డలీ ఉంది. ఇదిగో ఈ రాగి గొడ్డలి యుద్ధాన్ని మరింత క్రూరంగా మార్చేసింది. దీనితోగాని గాయం అయిందా విషపూరితమైపోతుంది. పూర్వం అయితే బాణపు ములుకులు రాతివి ఉండేవి. అవింత పదునుగా ఉండేవి కావు కాబట్టి సరిపోయేది! అయితే నేర్పరుల చేతుల్లో అవీ ఉపయోగపడేవి! ఇప్పుడీ రాగిములుకులతో ముక్కుపచ్చలారని పిల్లకాయలూ పులిని వేటాడేద్దామనుకుంటున్నారు. ఇప్పుడిహ ఎవడైనా గొప్ప విలుకాణ్ణవాలని ఎందుకనుకుంటాడు?"

"తాతా! నువ్వు చెప్పేవాటిల్లో ఓ దానిని నేను ఒప్పుకుంటున్నాను. మనిషి ఓ దగ్గరే కట్టిపడి ఉండడానికి పుట్టలేదు. నిజం."

"అవున్రా అబ్బాయీ! రోజూ చేసినచోటే దానిమీద దానిమీదే మల విసర్జన చెయ్యడం ఎంత అసహ్యకరం! మన డేరా ఇవాళ ఇక్కడుంది. పశువులు ఇక్కడి గడ్డిని మేస్తాయి. ఈ చుట్టుప్రక్కల మనుష్యులవీ పశువులవీ మలమూత్రాలు కన

పడ్డం మొదలెడతాయి. అప్పుడు ఈ చోటు వదలి మరో చోటుకి వెళ్ళిపోతాం. అక్కడ కొత్తగా మొలిచిన పచ్చిక ఎక్కువగా ఉంటుంది. అక్కడ నేలా నీరు గాలీ ఎక్కువ పరిశుద్ధంగా ఉంటాయి."

"అవున్తాతా! నాకూ అలాంటి నేలంటేనే ఇష్టం. అలాంటిచోట నా పిల్లంగోవి ఇంకా తియ్యగా పలుకుతుంది."

"మా బాగా సరిగ్గా చెప్పేవురా తండ్రీ! పూర్వం మేం ఈ డేరాల సమూహాన్నే గ్రామం అంటూ ఉండేవాళ్ళం. ఈ సమూహాలుఓచోట ఓ ఏడాదిపాటు కాదుకదా మూణ్ణెళ్ళు కూడా ఉండేవికావు. కాని ఇవాళో గ్రామాలు పుత్రుల కోసం పౌత్రులకోసం నూరు తరాల కోసం కోసం తయారవుతున్నాయి. రాతివి, కర్రవి, మట్టివి గోడలు లేపుతున్నారు. గాలిలోపలికి రాకుండా రాళ్ళతోనూ, కర్రతోనూ, గడ్డితోనూ కప్పు లేస్తున్నారు, గాలి ఇంక లోపలికి ఎలా వస్తుందీ? ఇప్పుడూ పేరుకి అగ్నినీ వాయువునీ దేవతలంటున్నారు. అయితే మనమనస్సుల్లో ఆ భక్తి గౌరవమూ ఎక్కడా లేవు. అందుకే ఇప్పుడు కొత్త కొత్త రోగాలొచ్చి పడుతున్నాయి. ఓ సూర్యభగవానుడా! ఓ నా సత్యా! ఓ అగ్నీ! మీరీ మనుషులపట్ల ఆగ్రహాన్ని చూపెడుతున్నారు. చూపించాల్సిందే!"

"కాని తాతా! ఈ రాగిగొడ్డళ్ళనీ, రాగి ఖడ్గాలనీ, రాగి బాణాలనీ వదిలేసి మనం ఎలా బతగ్గలం? వీటిన్ని వదిలేస్తే మనల్ని శత్రువులు ఒక్కరోజులో మింగెయ్యరూ?"

"ఒప్పుకుంటున్నానబ్బాయీ! ఒప్పుకుంటున్నాను. రెణ్ణెళ్ళ గ్రాసాన్నో సహం బతుక్కి ఉపయోగపడే స్వారీగుర్రాన్ని నవ్వుతూ సంతోషంగా ఇచ్చి జనం రాగి ఖడ్గం కొన్లేరు. వక్షు తలికడుపున పుట్టి దిగువ మద్రులూ పరుశువులూ ఆవిడకే మచ్చతెచ్చేరు. వక్షునది ఎంతవరకూ వెళ్తోందో నేను ఎరగను. ఎవరూ ఎరగరు. అయితే అబద్ధాలు కూసేవాళ్ళు మాత్రం భూమి చివర్లని ఉన్న అపారమైన జలంలో వక్షు కలిసిపోతుంది అని అంటారు. మద్రుల భూమినీ పరుశువుల భూమినీ దాటేక వక్షునది కొండల్ని వదిలి మైదానంలోకి వెళ్తోందనీ ఆ తర్వాత ఉన్న భూమి అబద్ధాలాడే భగవద్విరోధులదనీ మాత్రం తెల్సు. అక్కడ పొడుగ్గా ఉన్న కాళ్ళతో చిన్న కొండంత శరీరంతో జంతువులుంటాయనీ అంటారు. వాటి నేమంటారు అబ్బాయీ! జ్ఞాపకశక్తి రోజురోజుకీ క్షీణించిపోతోంది!"

"ఒంటె (ఉష్ట్రం, శుతుర్) తాతా! అయితే కొండంత మాత్రం ఉండదు. ఓసారి దిగువ మాద్రుడొకడు ఒంటెపిల్లనోదాన్ని తెచ్చేడు. ఆర్నెల్లదన్నాడు. అది మన గుర్రం అంతా ఉన్నాది."

"అవునబ్బాయీ! పై దేశాల్లో తిరిగి వచ్చినవాళ్ళు అబద్ధాలాడ్డం ఎక్కువ నేర్చుకుంటారు. ఏమంటారన్నావూ? ఏమిటదీ!"

"ఒంటె"

"ఆఁ అయితే ఒంటెమెడ ఇంతపొడుగనీ అంతపొడుగనీ, వక్షునదికి ఈ ఒడ్డున నిల్చుని ఆ ఒడ్డుని ఉన్న గడ్డిమేసేస్తుందని అంటారు. ఇదీ అబద్ధమే కదరా అబ్బాయీ!"

"అవున్తాతా! ఆ ఒంటెపిల్ల మెడ కన్నా గుఱ్రం మెడ పొడుగ్గానే ఉటుంది. అయితే ఈ ఒడ్డునుంచి ఆఒడ్డు మెయ్యడం అన్నది మాత్రం పచ్చి అబద్ధం."

"ఇదిగో ఈ అబద్ధాలకోర్లు మద్రులూ పర్షువులే రాగిగొడ్డళ్ళ రోగాన్నీ, రాగిఖడ్గరోగాన్ని వ్యాపింపచేశారు. పర్షువులు మన ఉత్తర మద్రులమీద ఈ ఆయుధాల్తోనే దాడిచేశారు. ఇది మా తండ్రి కాలంనాటి మాట. రెండేసి గుఱ్రాలిచ్చి ఒకో రాగిగొడ్డల్ని దిగువ మద్రుల్నించి మనవాళ్ళు కొన్నారు."

"రాగి గొడ్డళ్ళ దగ్గర రాతి గొడ్డళ్ళు ఎందుకు పనికిరానివయ్యేయి, అవును తాతా!"

"మరే. పనికిరాకుండా పోయేయిరా బాబూ! అందుకే మరో గత్యంతరము లేక రాగి శస్త్రాల్ని తీసుకోవల్సివచ్చింది. పురుల మీదకి దిగువమద్రులు దాడి చేసినప్పుడు మీవాళ్ళు మా మద్రులదగ్గర్నుంచి రాగిశస్త్రాల్ని కొన్నారు. ఉత్తర మద్రులకీ పురులకీ మధ్య ఎప్పుడూ కలహం వచ్చినట్టు వినలేదురా నాయినా! కాని పర్షులు దిగువమద్రులు మాత్రం ఎప్పుడూ దొంగపనులు చేస్తూవచ్చేరు. పాత ధర్మాలని వదిలేసి కొత్తవాటి గురించి ఎప్పుడూ మాట్లాడుతూ ఉండేవారు. వాళ్ళనుంచి మన వాళ్ళకి కూడా మన ప్రాణాల్ని కాపాడుకోవడం కోసం అలాగ్గానే చేయవలసి వచ్చింది. దిగువ మద్రులూ పర్షులూ రాగిశస్త్రాల్ని విడిచి పెట్టనంత వరకూ ఎగువనున్న మనం వాటినీ విడిచిపెట్టడం అన్నది ఆత్మహత్య చేసుకోవడమేనని నేననుకుంటున్నాను. అయితే రాగి ఇంతలా వ్యాప్తిచెందడం మాత్రం కీడుకే. ఇందులో ఏం సందేహం లేదురా బాబూ! ఈ పాపాన్ని ప్రచారం చేస్తున్నవాళ్ళు ఈ రెండు సమూహాలే. వాళ్ళకి దేవతల దీవనలు ఎప్పటికీ దొరకవు. కటిక చీకటి నిండిన పాతాళంలోకి పోతారు. తప్పదు. ఇదిగో వీళ్ళనిచూసీ, వీళ్ళకి భయపడి మన ఊళ్ళు మట్టిళ్ళతోనూ రాతిళ్ళతోనూ వెలిశాయి పూర్వం ఇదిగో ఇలాంటి డేరాలతో, ఇవాళ ఇక్కడైతే రేపక్కడిగా ఉండే ఊళ్ళు ఈ వక్షనదీ గర్భంలో ఉండేవి. అయితే ఈ మద్రులూ, ఈ పర్షులూ ఆ పద్ధతిని చీల్చి చెండాడేరు. ఎక్కడ చూసి చేశారో–భూమాత గుండెల్ని ఈ రాగిశస్త్రాలతో చీల్చేశారు. ఇలాంటి పాపం ఎప్పుడూ ఎవరూ చెయ్యలేదు. భూమిని తల్లంటారు కదా నాయినా!"

"అవున్తాతా! భూమిని తల్లీ అంటారు. దేవీ అంటారు ఆవిణ్ణి పూజిస్తారు."

"అవునా, ఆ తల్లి భూదేవి గుండెల్ని తమ చేతుల్తో ఈ పాపిష్టి వాళ్ళు చీల్చేశారు. ఇంకేంచేశారూ? పేర్లు మర్చిపోతున్నాను, జ్ఞాపకం ఉండటం లేదురా బాబూ!"

"సేద్యం, వ్యవసాయం"

"ఆఁ అదీ, సేద్యంచెయ్యడం మొదలుపెట్టేరు. గోధుమలు చల్లారు. వరి చల్లారు. యవలు వేశారు. ఇంతవరకూ ఎప్పుడూ ఇది విన్లేదు. మన పూర్వులెప్పుడూ తల్లి భూదేవి గుండెని చీల్చలేదు. భూదేవిని అవమానించలేదు. తల్లి భూమాత మన పశువులకి గడ్డి ఇచ్చేది. ఆవిడ అడవుల్లో రకరకాలైన తియ్యని పళ్ళు ఉండేవి. మనం ఎన్నితిన్నా తరగనన్ని పళ్ళు, కాని ఈ మ్రదుల పాపాల్నించి, వాళ్ళని చూసి చూసి మనం చేసిన పాపాల్నించి మొలఎత్తు ఎదుగుతూ ఉండే ఆ గడ్డి ఏమై పోయిందో! ఇప్పుడు పూర్వంలా బలంగా పుష్టిగా ఉండే ఆ ఆవులు ఎక్కడున్నాయి? ఆ ఆవుల్లో ఒక్కావు మొత్తం మ్రదుల సమూహం యావత్తుకీ ఓ రోజు భోజనానికి సరిపోయేది. ఇప్పుడా ఆవులూ లేవు. ఆ గుర్రాలూ లేవు. ఆ గొర్రెలూ లేవు. అడవిలో ఉండే లేళ్ళూ ఎలుగ్గొడ్లూ కూడా అంత పెద్దవి ఉండటంలేదు. మనుషులూ ఆ కాలంలోలాగా ఎక్కువరోజులు బతకటంలేదు. దీనికంతటికీ తల్లి భూదేవి కోపమే నాయినా! మరోటికాదు."

"తాతా! మీరెన్ని శరత్కాలాలు చూశారు?"

"నూరుపైగా నాయినా! ఆ కాలంలో మావూళ్ళో పదిడేరాలు ఉండేవి. ఇప్పుడు మట్టితోనూ రాతితోనూ కట్టినగోడలతో ఉన్న ఇళ్ళు వంద ఉన్నాయి. పొలాలు సాగులేని రోజుల్లో ఇళ్ళూ ఊళ్ళూ ఓచోట స్థిరంగా ఉండేవికావు. పొలాలొచ్చేయి. ఇహ ఆ గోధుమల్ని లేళ్ళు తినకుండా కాపాడు. మిగిలిన పశువుల నోట పడకుండా చూడు. పొలాలేం వచ్చిపడ్డాయోకాని మనిషిని కట్టేసి ఉంచే గుంజలే అయ్యేయి. కాని బాబూ, మనిషి ఓ చోట కట్టిపడిఉండటానికి పుట్టలేదు. మనుషులకోసం దేవుళ్ళు చెయ్యనిపని ఈ మ్రదులూ పర్శులూ చేసి చూపెట్టేరు."

"కాని తాతా ఇప్పుడీ వ్యవసాయాన్ని మనం వదిలేద్దామనుకుంటే వదిలెయ్య గలమా? ఇవాళ మనం తినే ఆహారంలో సగం ధాన్యమే."

"అవున్నాయినా! ఒప్పుకుంటున్నాను.అయితే మనపూర్వులు ధాన్యం తినేవారు కాదు. ఇక్కణ్ణించి దక్షిణానికి ఇరవైఅయిదు కోసుల దూరంలో గోధుమల అడివి ఉంది, అక్కడ గోధుమలు వాటంతటవే మొలుస్తాయి. వాటంతటవే పండుతాయి. వాటంతటవే రాలతాయి. వాట్ని ఆవులు తింటాయి. పాలు ఎక్కువ ఇస్తాయి. గుర్రాలు తింటాయి. బాగా పుష్టిగా తయారవుతాయి. ప్రతీఏడూ మన పశువులు అక్కడికి వెళ్తాయి. తల్లి భూదేవి మనుషులకోసం ధాన్యాల్ని పండించటం లేదు. ఆ గింజలు మన పొలాల్లో పండే గోధుమగింజలకన్నా చిన్నవిగా ఉంటాయి. భూదేవి వాట్ని పశువులకోసం పుట్టించింది, అడివి గోధుమలు మరిలేకుండా ఎక్కడ నశించి పోతాయో అని నాకు భయంగా ఉంది. మనం తిండానికి అబ్బాయీ - ఈ ఆవులు న్నాయి. గుర్రాలున్నాయి. గొర్రెలూ మేకలూ ఉన్నాయి. అడివిలో ఎలుగ్గొడ్లూ లేళ్లూ, పందులు – ఎన్నో రకాల వేట జంతువులున్నాయి. ద్రాక్ష మొదలైన పళ్ళు ఎన్నో ఉన్నాయి. ఈ ఆహారాన్నంతటినీ తల్లి భూదేవి మనకి సంతోషంగా ఇస్తూ

ఉండేది. కాని మృదులూ పర్శులూ వీళ్ళమొహం పాడుగాను, వీళ్ళు ఆ పాతవాటి నన్నిటినీ ధ్వంసంచేసి కొత్తదారివేశారు. దాన్నించి మనుషుల మీద దేవుళ్ళకోపం పట్టాది. ఇంకా నాయినా! ముందుముందు వక్షువాసుల నుదుటిని ఇంకేం రాసి ఉందో! పాతికేళ్ళయింది. ఈ పొలిమేరదాటి ఊళ్ళో నేను అడుగుపెట్టలేదు. చలి కాలంలో రాస్త దిగువ ప్రాంతానికి ఓ గుడిసెకి వెళ్ళిపోతాను. ఏం వెళ్తాను? అంతమందీ పూర్వులు ఏర్పరచిన పద్ధతులన్నిటిని ధ్వంసంచేసి పారేయాలని చూస్తూంటే ఇంకేం చెయ్యను? పూర్వీకుల నోట విన్నవాటిని ఇన్నిరోజులబట్టి భద్రంగా అట్టేపెడు తున్నాను. ఇప్పటికీ నేర్చుకుందామనుకున్నవాడు ఇక్కడికి నా దగ్గరకి వస్తాడు. అయితే పూర్వీకులమాటల్ని ఒప్పుకోనివాళ్ళే ఎక్కువై పోతున్నారు. మృదులకి పర్శు లకే వ్యవసాయంవల్ల కడుపు నిండడంలేదని వింటున్నాను. ఇప్పుడిహ వాళ్ళు వక్షు వాసుల ఆహారవస్త్రాదుల్ని మోసుకెళ్ళి ఎక్కడ ఇచ్చివస్తున్నారో వాటి బదులు ఏం తెచ్చుకుని వస్తున్నారో- మాటవరసకి చూడు, ఇది ఓ గుర్రాన్ని ఇచ్చి కొన్న పాత్ర, ఆకలితో చావవలసివస్తే ఈ పాత్రని తింటే కడుపు నిండుతుందా? ఇహ పురులని కడుపునిండా తిండిలేకుండా వొంటికి బట్ట లేకుండా చూస్తావు! వాటికి బదులు వాళ్ళ ఇళ్ళలో ఈ పాత్రల్ని చూస్తావు!"

"ఇంకో సంగతి తాతా- మరోటి తెలిసింది. దిగువ మృదుల స్త్రీలు చెవుల్లోనూ మెళ్ళోనూ పచ్చగా తెల్లగా ఉన్న ఆభరణాలు పెట్టుకోడం మొదలుపేట్టేరు. ఓ చెవి ఆభరణానికి ఓ గుర్రం వెలట తాతా! దాన్ని రాగి అనరు. సువర్ణం అంటారు. తెల్ల దాన్ని వెండి అంటారు."

"ఈ అన్యాయపు మనుషుల్ని ఎవరూ చంపేయరేం! వీళ్ళు ఈ వక్షుజన సమూహాలన్నిటినీ సర్వనాశనంచేసిగాని వదలరు!మన ఆహారానికి వస్త్రాలకీ మిగిలింది కూడా వీళ్ళు ఉంచేటట్టులేదు. మన స్త్రీలు వీళ్ళని చూసి ఇహ రెండు గుర్రాల వెల చేసే కుండలాల్ని చెవులకి పెట్టుకుంటారు. ఓ దయాళువూ! అగ్ని భగవానుడా! ఇక ఎక్కువకాలం నన్ను ఈ మనుషుల మధ్య ఉంచకు. నన్ను పితృలోకంలోకి తీసుకుపో."

"మరో ఘోరపాపం తాతా! మృదులూ పర్శులూ ఎక్కణ్ణించో మనుషుల్ని పట్టుకొచ్చేరు. వాళ్ళచేత రాగిఖడ్గాలనీ, రాగిగొడ్డళ్ళనీ తయారు చేయిస్తున్నారు. ఆ మనుషులు చాలా నేర్పున్న చేతిపనివాళ్ళు. కాని మృదులు వాళ్ళని ఇష్టమైతే ఉంచు కుంటున్నారు. లేదూ అంటే పశువుల్ని అమ్మినట్టు అమ్మేస్తున్నారు. వ్యవసాయం, కంబళ్ళు నేసేపని ఒకటేమిటి ఇంకేవేవో పనులు ఆ పట్టుకొచ్చిన మనుషులచేత చేయిస్తున్నారు. వాళ్ళని దాసులు అంటున్నారు."

"మనిషిని కొండం అమ్మడం! మేం కూడూగుడ్డని అమ్మడాన్నే తప్పుగా అనుకునే వాళ్ళం. కాని మన పూర్వులూ, పితృదేవతలూ ఈ మృదులింత నీచస్థితికి దిగజారిపోతారని కల్లోకూడా అనుకుని ఉండరు వేలు కుళ్ళిపోతే దాన్ని కోసి

పారెయ్యడమే తగినమందు. లేకపోతే శరీరం యావత్తూ కుళ్ళిపోతుంది. ఈ మద్రు లనీ పర్శులనీ వక్షునదీతీరంలో ఉండనియ్యడమే పాపం అబ్బాయీ! నేనాట్టేరోజులు ఇప్పుడంతా చూడ్డానికి ఉండను."

మూద్రతాతచెప్పే కథలు చాలా ఆసక్తికరంగా సరదాగా ఉండేవి. అయితే పనికివచ్చే ఆయుధాలు చేతిలోకి వచ్చేక వాట్నివదిలి మనిషి జంతువుల మధ్యా శత్రువుల మధ్యా బతకలేడన్న విషయం తెలుసుకునే వివేకం పురుహూతుడికి ఉన్నాది.

మూడవరోజు అతడు సెలవు పుచ్చుకుంటానంటే ముసిలాయన అతని నుదురు కనుబొమ్మల్నీ ముద్దాడి దీవించాడు. రోచన చాలాదూరం అతన్ని సాగనంపడానికి వెళ్ళింది. ఇద్దరూ విడిపోయేటప్పుడు కన్నీళ్ళతో ఒకరిబుగ్గ లొకరు తడువుకున్నారు.

# 3

మూద్రతాత చెప్పింది నిజమేఅయింది. అయితే పాతికేళ్ళయిన తర్వాత!దిగువ మద్రులూ పర్శులూ నానాటికీ ఎగువపురులనీ మద్రులనీ అణచివేస్తూ వచ్చేరు. ఈ దిగువతెగల్లో వస్త్రాలనీ, కంబళ్ళనీ స్వయంగా నేసే స్త్రీ పురుషులు ఉన్నారు. వాళ్ళకి తిండికి బట్టకీ ఎక్కువఖర్చు అవుతోంది. అంచేత వాళ్ళు చేత్తోతయారుచేసిన వస్తువులు మంచివైనప్పటికీ ఎక్కువ ప్రియంగా ఉంటాయి. అలాంటిది దిగువ మద్రుల దగ్గరా, పర్శుల దగ్గరా దాసులు ఉన్నారు. వాళ్ళు తయారుచేసే వస్తువులు అంత నాణెమైనవికావు. అయినా చవక. అక్కడున్న వ్యాపారస్తులు ఈ వస్తువులన్నిటినీ ఒంటెమీదో గుర్రంమీదో వేసుకుని పైపేశాల్లో అమ్మడానికి వెళ్తే బాగా అమ్ముడుపోయేవి. ఎగువతెగ వారికీ ఇప్పుడు రాగి వస్తువులు ఎక్కువగా కావల్సి వచ్చేయి. ఒకటేమిటంటే - ఏడాది కేడాది అవి కాస్తకాస్త చౌక అవుతూ వస్తున్నాయి. రెండోది మట్టితోనూ కర్రతోనూ చేసిన వస్తువులకన్నా అవి శాశ్వతంగా ఉంటాయి. పాతికేళ్ళక్రితం ఒకింటా అర ఇంటా రాగిపాత్ర కనిపించేది. అలాంటిది ఇప్పుడు లేని ఇల్లంటూ లేదని చెప్పాలి. బంగారం వెండీ వాడకం కూడా పెరగడం మొదలుపెట్టింది. వీటన్నిటి కోసం ఈ సమూహాలకి ఆహారాన్ని, కంబళ్ళనీ, చర్మాలనీ గుర్రాల్నీ ఆవుల్నీ అమ్మవలసివస్తోంది. దాంతో వాళ్ళు చితికిపోవడం మొదలుపెట్టేరు. ఎగువ తెగల్లో కొందరు స్వంతంగా వ్యాపారం చెయ్యడానికి ప్రయత్నించారు. ఎందుకంటే దిగువనున్న తమ పొరుగు వారు తమని మోసగిస్తున్నారేమో నన్న అనుమానం వాళ్ళకి కలిగింది. కాని వక్షునదికి దిగువకి వెళ్ళే తోవ వాళ్ళ జన్మస్థలం మీద నుంచే వెళుతుంది. మద్రులు ఆ తోవని ఎగువవారికి ఇవ్వడానికి ఇష్టపడలేదు. చాలాసార్లు ఈ విషయమై చిన్న చిన్న కలహాలు జరిగేయి. ఎన్నో

సార్లు ఉత్తర మద్రులు పురులు బైటదేశాలకి వెళ్ళడానికి కొత్తదారులు వేద్దామని చూశారు. కాని వాళ్ళు కృతకృత్యులు కాలేకపోయారు.

దిగువవారికీ ఎగువవారికీ మధ్య జరుగుతున్న ఈ సంఘర్షణలో ఓ ముఖ్యమైన విషయం ఉంది. దిగువవారు తమలోతాము ఐకమత్యంతో ఉండలేక పోతున్నారు. కాని ఎగువవారు ఐకమత్యంతో తమలోతాము కలిసి ఉంటూ దాడులు ఎదురుదాడులు చేస్తున్నారు. ఈ యుద్ధాల్లో తన వీరత్వం వల్లా వివేకం, బుద్ధివల్లా పురుహూతుడు తన సమూహానికి ప్రీతిపాత్రుడయ్యేడు. ముప్పై ఏళ్ళ పిన్నవయస్సుకే అతనిని పురు సమూహం తన మహాపితరునిగా ఎన్నుకుంది.

వ్యాపారరీత్యా సాగిస్తున్న మద్రుల అన్యాయాన్ని ఆపకపోతే ఎగువ సమూహం వారికి భవిష్యత్తు ఉండదన్న సంగతి పురుహూతునికి స్పష్టంగా తెలిసింది. రాగివాడకం తగ్గడానికి బదులు రోజురోజుకీ పెరుగుతోంది. ఆయుధాలు, పాత్రలు ఆభరణాలకోసమే కాదు-ఇప్పుడు జనం మణుగుల కొద్దీ మాంసం, లేదా కంబళ్ళు తీసుకెళ్ళడానికి బదులు మారకంకోసం రాగి కత్తో, చాకో తీసుకెళ్ళడానికి ఇష్టపడుతున్నారు. పురుహూతుడు తన సమూహపు సమావేశంలో తమ దుఃఖాలకి కారణం దిగువ సమూహాలు వ్యాపారరీత్యా చేసే అన్యాయమే అని చెప్పేడు. తమ మార్గానికి అడ్డంకిగా ఉన్న మద్రులని తొలగించకపోతే తాము వారి చేతి కీలు బొమ్మలమై పోవలసివస్తుందని అందరూ ఒప్పుకున్నారు. వాళ్ళకి దాసులైపోయే రోజు వచ్చినా రావొచ్చు. పురుల ఉత్తర మద్రుల మహాపితరుల సమష్టి సమావేశంలోనూ ఈ నిర్ణయానికే వచ్చేరు. రెండు సమూహాలవాడూ కలసి యుద్ధం నడపడానికి పురుహూతుణ్ణి తమ ఉమ్మడి సేనాధిపతిగా ఎన్నుకున్నారు. అతనికి ఇంద్రుడన్న పదవి ఇచ్చేరు. ఇల్లాగా పురుహూతుడు మొదటి ఇంద్రుడయ్యేడు.

పురుహూతుడు చాలా తీవ్రంగా సైనికసన్నాహాలు మొదలుపెట్టేడు. ఇంద్ర పదవి చేపట్టిన వెంటనే అతడు ఆయుధాల్ని తయారు చెయ్యడానికి ఓ ఇద్దరు కమ్మరి దాసులకి ఆశ్రయమిచ్చేడు. ఎగువ సమూహం వారు ఆ దాసులపట్ల చాలా బాగా ప్రవర్తించేవారు. వాళ్ళ సాయంతో రాగి తయ్యారీలో నేర్పరితనం సంపాదించడంలో కృతకృత్యులయ్యేరు. ఈ రకంగా మద్రుల్లోనూ పురుల్లోనూ ఖింతో మంది లోహ శిల్పులు (రాగి పనివాళ్ళు)గా తయారయ్యేరు. తమ కమ్మరిదాసులని తిప్పి ఇచ్చేయమని నోటితో అడగడమే కాక ఆయుధాల్ని కూడా ఉపయోగించాలని చూశారు. అయితే దిగువ సమూహాల్లో వ్యాపార ప్రవృత్తి పెరగడంతో యుద్ధపరాక్రమం తగ్గిపోయింది. యుద్ధంలో గెలవలేకపోవడంతో వాళ్ళు రాగిని ఇవ్వడం మానేశారు. కాని అయితే దాంతో తమ వ్యాపారమే నష్టమైపోతుందని తొందరగానే తెలుసుకున్నారు. మద్రులూ పురులూ అంత క్రితం కొనుక్కున్న పాత్రలలో, పళ్ళేలతో తమ శస్త్రాలు చేసుకోడానికి ఓ తరం వరకూ ఇబ్బందిపడరు.

చివరకి ఇంద్రుడూ అతని రెండు సమూహాలూ మద్రులనీ పర్శులనీ నాశనం చేసి తీరాలని నిశ్చయించుకున్నారు. పురుహూతుడు కూడా స్వంతంగా లోహపుపని చెయ్యడం నేర్చుకున్నాడు. అతని సూచనల ప్రకారం కత్తుల తయారీలోనూ, బల్లేలు చెయ్యడంలోనూ, బాణాల ములుకులు చెయ్యడంలోనూ ఎన్నో మార్పులు జరిగేయి. నిపుణులూ బలిష్ఠులూ అయిన భటుల ఛాతీలకి దెబ్బతగలకుండా ఉండడానికి, అతడు ఎన్నో వక్షకవచాలు రాగితో చేయించాడు.

మొదట ఓ శత్రువు పనిపట్టాలని ఇంద్రుడు నిర్ణయించాడు. పర్శువులని మొదట ఎన్నుకున్నాడు. చలికాలంలో పర్శులు ఎక్కువసంఖ్యలో వ్యాపారం చెయ్యడానికి బైట ప్రాంతాలకి వెళ్ళిపోతూ ఉంటారు. ఆ సమయాన్ని సరియైన సమయంగా ఇంద్రుడు భావించాడు. ఉత్తర మద్రులకీ పురుయోధులకీ యుద్ధకౌశలాన్ని నేర్పించాడు. పర్శులకీ మద్రులకీ శత్రువులు ఘాతుకంగా దాడిచేస్తారనీ, వక్షునదీ లోయలో తమ నామరూపాలు లేకుండా పోతాయని వాళ్ళకి తెలీదు. ఇంద్రుడే స్వయంగా నాయకత్వం వహించి మంచి మెరికల్లాంటి మద్రవీరుల్ని పురువీరుల్ని ఎన్నుకుని శత్రువుమీద దాడిచేశాడు. యుద్ధానికి గల కారణాన్ని తెలుసుకోడానికి పర్శునికి ఆట్టే సమయం పట్టలేదు. తెలుసుకున్నాక పర్శులు ప్రాణాలకి ఒడ్డి ఎంతో ధైర్యసాహసాలతో పోరాడారు. అయితే ఆ తొందరలో వాళ్ళు పర్శు గ్రామాలనన్నిటినీ కూడగట్టుకోలేకపోయేరు. ఇంద్రుని సేన ఒకదాని తర్వాత ఒకటి చొప్పున పర్శుగ్రామాల్ని ఆక్రమించుకుంటూ వేలాది పర్శులని సంహరించింది. ఎవరినీ ఖైదీగా పట్టుకోలేదు. దిగువమద్రులు ప్రమాదాన్ని తెలుసుకునేలోగా సమయం మించిపోయింది. ఆఖరికి కొన్నిగ్రామాలు మాత్రమే మిగిలేయి. వాటిని ఆక్రమించడానికి సరిపోయినంత మంది భటులను వదలి ఇంద్రుడు కురుభూమికి వచ్చేశాడు. దిగువ మద్రులు దాడిచేశారు. అయితే వాళ్ళకి పర్శులగతే పట్టింది. దిగువమద్రులకి పర్శు సమూహానికి చెందిన పురుషుడవనీ, పిల్లాడవనీ, ముసిలివాడవనీ, వాళ్ళ చేతికి చిక్కినవాళ్ళని ఎవర్నీ వాళ్ళు ప్రాణాలతో వదలలేదు. స్త్రీలనీ తమ స్త్రీలతో కలుపుకున్నారు. చేతికి చిక్కిన దాసుల్లో తమ దేశాలకి తిరిగి పోతామన్నవాళ్ళని వాళ్ళ వాళ్ళ దేశాలకి పంపించేశారు. కొంత మంది దిగువ మద్రులూ పర్శు స్త్రీపురుషులూ ప్రాణాలు దక్కించుకుని వక్షులోయని వదిలి పడమరదిశగా వెళ్ళిపోయేరు. వాళ్ళ సంతానమే తర్వాత ఈరాను పర్శు (పర్శియను) అన్న పేరుతోనూ మద్ర (మిడియను) అనే పేరుతోనూ ప్రసిద్ధికెక్కింది. వాళ్ళ పూర్వీకుల మీద ఇంద్రుని నాయకత్వంలో జరిగిన అత్యాచారాన్ని వాళ్ళు మర్చిపోలేకపోయేరు. అంచేత ఈరానీలు, ఇంద్రుణ్ణి తమ ఘోర శత్రువుగా భావించడం మొదలుపెట్టేరు. వక్షునదీలోయ యావత్తూ ఉత్తరమద్రుల చేతిలోకి పురుల చేతిలోకి వచ్చింది. ఇద్దరూ కుడీ ఎడమతీరాలని పంచుకున్నారు.

వక్షునివాసులు కొత్త పద్ధతుల్ని తొలగించి పాత పద్ధతుల్ని తిరిగి ప్రవేశపెట్టాలని శాయశక్తులా ప్రయత్నం చేశారు. అయితే రాగిని వదలి రాతి ఆయుధాల వేపుకి మళ్ళించ లేకపోయేరు. రాగికోసం వక్షు పర్వతలోయకి అవతలున్న ప్రాంతాలతో వ్యాపార సంబంధాలు పెట్టుకోడం తప్పనిసరి అయింది.

అయితే దాసత్వాన్ని వాళ్ళు ఎప్పుడూ అంగీకరించలేదు. బైటవాళ్ళనెవరినీ తమ వక్షులోయ ప్రాంతంలో స్థిరంగా నివాసం ఏర్పరచుకోనివ్వలేదు. శతాబ్దాలు గడిచిపోయి జనం పురుహూత ఇంద్రుణ్ణి మర్చిపోసాగారు. లేదా అంటే అతన్ని దైవంగా చేసుకోగల్గేరు. ఆసరికి వంశం చాలా అభివృద్ధి చెందింది. అంత మంది పోషణకి వక్షునదీ ప్రాంతం సరిపోలేదు. అంచేత వారి సంతానంలో ఎంత మందికో దక్షిణానికి వలసపోక తప్పలేదు.

ఇంతకు పూర్వం ఓ సమూహం రెండో సమూహంతో కలవకుండా ఎక్కచ్చిగా స్వతంత్రంగా ఉండేది. మహాపితరుని ప్రాముఖ్యం ఉన్నప్పటికీ అతడూ ప్రతిదానికీ సమూహం మీదే ఆధారపడుతూ ఉండేవాడు. వక్షునదీ తీరంలో జరిగిన ఆఖరిపోరాటంతో ఎన్నో సమూహాలకి కలిపి ఓ సేనాపతి, ఇంద్రుడు పుట్టేడు.*

---

* ఇది నేటికి నూట ఎనభై తరాలకు ముందు కాలం నాటి ఆర్య సమూహాల కథ. ఈ సమూహాల్లోని కొన్ని సమూహాల సంతానమే భారతదేశానికి బయల్దేరబోతున్నది. ఆ సమయానికి సేద్యం చెయ్యడం, రాగి వాడకం ఆరంభమైంది. ఆర్యులు దాసత్వాన్ని స్వీకరించి దాన్ని తిరిగి వదిలెయ్యాలని అనుకుంటున్నారు.

# పురుధానుడు

దేశం : ఎగువస్వాత్   జాతి : ఇండో ఆర్యన్
కాలం : క్రీస్తుకు పూర్వం 2000

ఆ సువాస్తు ఎడమతీరం ఆకుపచ్చని కొండలతో, ప్రవహించే జలధారలతో, చాలాదూరం వరకూ పరచుకున్న పొలాల్లో ఉయ్యాలలూగే గోధుం మొక్కలతో చాలా అందంగా ఉంది. అయితే ఆర్యులకి తమ రాతి గోడలన్నా, దేవదారు చిపుళ్ళతో చేసిన వస్తువులన్నా,ఇళ్ళన్నా చాలాగర్వం. అందుకే వాళ్ళు ఈ ఈ ప్రాంతానికి(అందమైన ఇళ్ళున్న ప్రదేశం–స్వాత్) అని పేరుపెట్టేరు. వక్షునదీతీరం దాటి ఆర్యులు పామీరులోనూ, హిందూకుష్‌లోనూ ఉన్న దుర్గమాలైన ఎల్లల్నీ కునార్, పంజకోరా లాంటి నదుల్నీ ఎంతో కష్టపడి దాటేరు. ఆ జ్ఞాపకాలు వాళ్ళకి చాలా రోజుల వరకూ బహుశా ఉండి ఉంటాయి. ఇవాళ మంగళపూర్ (మంగళూర్) లో ఇంద్ర పూజకోసం చేస్తున్న భారీ ఏర్పాట్లు ఈ దుర్గమ మార్గాలగుండా తమని క్షేమంగా తీసుకొచ్చిన ఇంద్రునిపట్ల తమ కృతజ్ఞతను తెలుపుకోడానికేమో ఎవరికి తెలుసు!!

ఇవాళ మంగళపురపు పురులు తమ తమ అందమైన ఇళ్ళని ఆకుపచ్చని దేవదారు కొమ్మలతోనూ, రంగురంగుల జెండాలతోనూ అలంకరించారు. ఓ కొత్త రకపు ఎర్రజెండాలని పురుధానుడు తగిలిస్తూ ఉండడం చూసి ఓ జెండాని తనచేత్తో పట్టిచూస్తూ అతని పొరుగింటి సుమేధుడు ఇలా అడిగేడు— "మిత్రమా నీ జెండాలు చాలా తేలిగ్గాను మెత్తగాను ఉన్నాయి. మా వేపు ఇలాంటి వస్త్రాలు తయారవవు. ఇవేవో మరోరకపు గొర్రెలవై యుంటాయి. అవునా?"

"ఇవి గొర్రెల ఉన్నితో చేసినవి. కావు సుమేధా!"

"మరి?"

"ఇది చెట్లమీద పెరిగే ఓ రకపు ఉన్ని."

"మా ప్రాంతాలలో గొర్రెల ఒంటి మీద ఉన్ని ఉంటే ఈ ఉన్ని అడవిలో చెట్లకి మొలుస్తుందా?"

"అలా అనే వినికిడి. నేను ఆ చెట్టుని చూడలేదు."

తకిలీని తొడమీద తిప్పి దాన్ని తిరగడానికి వదలి ఉన్నిదారాన్ని తీస్తూ సుమేధుడు ఇలా అన్నాడు–"ఎంత అదృష్టవంతులో అక్కడివాళ్ళు! వాళ్ళ అడవిలో చెట్టుకీ ఉన్ని తయారవుతుంది! మన ప్రాంతాల్లో చెట్లు వెయ్యడానికి వీలవదా?"

"ఏమో తెలీదు. ఎంత శీతోష్ణాలని ఆ చెట్లు భరించగలవో మనకి తెలీదు. కాని సుమేధా ! మాంసం చెట్లకి తయారవదా?"

"ఓ దేశంలో చెట్లమీద ఉన్ని అవుతూ ఉంటే మరో దగ్గర మాంసమూ తయారవొచ్చు! దీని ఖరీదెంతో?"

"ఖరీదా? ఉన్ని వస్త్రాల కన్నా చాలా తక్కువ. అయితే ఉన్నితో సమానంగా మన్నిక ఉండదు''.

"ఎక్కడ కొన్నావు?"

"అసురుల దగ్గర. ఇక్కణ్ణుంచి ఏభై కోసుల దూరంలో వాళ్ళదేశం ఉంది. వాళ్ళ ఈ వస్త్రాలే కట్టుకుంటారు."

"ఇంత చౌక అయితే మనం కూడా ఎందుకు కట్టుకోకూడదూ?"

" అయితే వీటితో చలి ఆగదు."

"మరి అసురులెలా కట్టుకుంటున్నారూ?"

"వాళ్ళ ప్రాంతంలో చలి తక్కువ. మంచన్నది చూడ్డానికైనా కనిపించదు."

"నువ్వు వర్తకానికి తూర్పు పడమరలకీ ఉత్తరానికి వెళ్ళకుండా దక్షిణానికే ఎందుకు వెళుతున్నావు?"

"అక్కడైతే లాభాలు ఎక్కువ దొరుకుతాయి. వస్తువులూ చాలా రకాలైనవి దొరుకుతాయి. అయితే ఓ చిక్కుమాత్రం ఉంది. అక్కడ చచ్చేటంత వేడి. చల్లటి తియ్యటి నీళ్ళకోసం ప్రాణాలు కొట్టుకుపోతాయి."

"అక్కడి మనుషులెలా ఉంటారు పురుధాన్?"

"పొట్టిగా ఉంటారు. రంగు రాగి రంగు. మహాకురూపులూ. ముక్కేమో అసలు ఉన్నట్టే ఉండదు! చప్పిముక్కులూ, దిబ్బముక్కులూను! అక్కడో పాడు పద్ధతి ఉంది. మనుషుల్ని కొంటారు! అమ్ముతారు! !"

"కొండం అమ్మడమూనా?"

"వాళ్ళని దాసులంటారు."

"దాసులకీ వాళ్ళ యజమానులకీ చూపుల్లో ఏమన్నా తేడా ఉంటుందా?"

"అబ్బే - అయితే దాసులు బీదవాళ్ళు, పరాధీనులు. వాళ్ళ పంచప్రాణాలు యజమానుల చేతుల్లో ఉంటాయి."

"ఇంద్రుడు మనల్ని రక్షించుగాక! అలాంటివాళ్ళ మొహాలు మనకి కనిపించకుండా ఉండుగాక!"

"సుమేధా! ఇంకా నీ తకిలీ తిప్పుతూనే ఉన్నావు! యజ్ఞానికి రావా?"

"ఎందుకు రానూ? ఇంద్రుని దయవల్ల బలిసిన పశువుల మాంసమూ, మధుర

మైన సోమమూ దొరుకుతాయి! ఇంద్రపూజలో పాల్గొనని దౌర్భాగ్యు డెవడైనా ఉంటాడా?"

"నీ గృహపత్ని ఎలా ఉంది? ఈ మధ్య నృత్యం చేసే దర్బారులో ఆవిడ పత్తాలేదు."

"నీ మనస్సు బాధపడ్తోందా పురుధాన్?"

"బాధపడే ప్రశ్నే లేదు. నువ్వేమో ముసిలికాలంలో తెలిసీ కావాలని యువతిని ప్రేమించాలనుకున్నావు సుమేధా!"

"ఏభై ఏళ్ళకే ముసలితనం రాదు!"

"కాని ఏభైకీ ఇరవైకి ఎంత తేడానో చెప్పు!"

"అలాగే అయితే ఆ రోజే ఆవిడ నిరాకరించి ఉండాల్సింది!"

"ఆవేళ నువ్వు మీసాలూ గెడ్డాలు కత్తిరించేసుకుని పద్దెనిమిదేళ్ళ వాడిలా తయారై వచ్చేవు. ఉషావాళ్ళమ్మా నాన్నా నీ ఏభై ఏళ్ళని చూడలేదు. నీ పశు సంపత్తిని చూశారు."

"ఇంక ఆపవోయి పురూ! మీ కుర్రాళ్ళు ఎప్పుడూ..........."

51

"సరే వదిలేస్తున్నా సుమేధా! అదిగో వాద్యనాదాలు వినిపిస్తున్నాయి. యజ్ఞం మొదలయినట్టుంది!"

"ఆలస్యం చేస్తున్నది నువ్వూ, తిట్లుతినేది సుమేధుడూను పాపం!"

"అయితే పద - ఉషని కూడా తీసుకెళ్దాం"

"ఆవిడింకా ఇంట్లో ఉండి ఉంటుందనుకున్నావా!"

"అయితే ఆ ఉన్నినీ తకిలీని తే, ఇంట్లో పెట్టివద్దాం."

"ఇవి యజ్ఞానికేం అడ్డూ?"

"ఇదిగో ఇందుకే ఉష నువ్వంటే ఇష్టపడదు!"

"ఇష్టపడుతుంది! కాని మీ మంగళపురం యువకులు ఇష్టపడనిస్తే కదా!"

మాట్లాడుకుంటూ ఇద్దరు మిత్రులు నగరానికి బైట కట్టిన యజ్ఞవేదిక వేపుకి వెళ్తున్నారు. తోవలో ఏ యువతీ యువకులైనా పురుధానుణ్ణి చూస్తే అతను పలకరింతగా చిరునవ్వు నవ్వుతాడు. వాళ్ళకి కంటితో సైగలుచేసి మొహం తిప్పుకుంటాడు. సుమేధుడి కంట ఓ యువకుడు పడ్డాడు. ఇహ చెప్పేదేముంది? వాగడం మొదలుపెట్టేడు.

"వీళ్ళు ఈ యువకులు మంగళపురానికే మచ్చ."

"మిత్రులూ ర్రాతులూ కారు. నన్నుచూసి నవ్వుతున్నారు."

"వీళ్ళు దుర్మార్గులు-ఆ సంగతి నీకు తెల్సు. వీళ్ళని పట్టించుకుంటావేమిటి?"

"నాకైతే మంగళపురంలో పెద్దమనిషన్న వాడెవడూ కనిపించటం లేదు."

యజ్ఞవేదిక దగ్గర పెద్దమైదానం ఉంది. దాంట్లో అక్కడక్కడ ఎత్తు వేది

కలు, దేవదారు ఆకులతో స్థంభాలకి తోరణాలు కట్టి ఉన్నాయి. గ్రామంలోని స్త్రీ పురుషులు చాలామంది వేదికకి చుట్టు చేరారు. కాని అక్కడ సాయంత్రానికి ఇంకా ఎక్కువమంది కూడతారు. పురుసమూహంలోని స్త్రీ పురుషులందరికీ కలిపి ఓ పెద్ద ఉత్సవం మంగళపురంలో జరుగుతుంది. దాంట్లో స్వాత్‌నదికి రెండో తీరంలో ఉన్న మద్రులు కూడా పాల్గొంటారు.

ఉష జోడుగా మిత్రులిద్దరూ రావడాన్ని చూసింది. ఆవిడ సుమేధ్ దగ్గరికి వెళ్ళి అతని చేతిని తన చేతిలోకి తీసుకుని యువతీయువకుల మధ్య జరిగే ప్రేమ సల్లాపాన్ని అభినయిస్తూ - "ప్రియుడా! సుమేధా! పొద్దుట్నుంచి నీ కోసం గాలించి గాలించి చస్తున్నాను. నువ్వెక్కడున్నావో పత్తా తెలిసిందికాదు" అన్నది.

"నేనేం చావలేదు. బతికే ఉన్నాను!"

"అలాంటి అశుభపు మాటలు నోట రానీయకు. బతికుండగానే నన్ను విధవ రాలిని చేసేకు."

"విధవలకి పురుల్లో మరుదులు కొరతేం లేదే!"

"అయితే పునిస్త్రీలకి మరుదులు చేదా!" పురుధాన్ అడిగాడు.

"భలే చెప్పేవు! ఈవిడ నన్ను పంపించడానికి వచ్చింది. పొద్దున్నే ఇల్లు బయల్దేరింది. ఎంతమంది ఈవిడికి తమ ఇంట ఆతిథ్యం ఇచ్చేరో ఎవరికి తెల్సు? సాయంత్రం చూడు ఇహ, ఒకడేమో నాతో నృత్యం చెయ్యి అంటాడు, మర్గోడు ఉహుఁ నాతో అంటాడు! తగాదా అయిపోతుంది. కొట్టు కోవడాలు చంపుకోవడాలూ జరుగుతాయి. చెడ్డపేరేమో ఈవిణ్ణించి మధ్య సుమేధుడికి వస్తుంది! !"

చెయ్యి వదిలేసి కళ్ళలో భావాన్ని గొంతుసీ మారుస్తూ "అయితే ఉషని నువ్వు పెట్టిలో మూసేసి దాద్దామనుకుంటున్నావా? నీచావు నువ్వు చావు. నా దారిని నే పోతా!" అన్నాది ఉష.

పురుధానుణ్ణి ఒక్కడినే ఏకాంతంగా పట్టుకుని చూసి చిరునవ్వు నవ్వి వేదిక దగ్గరున్న గుంపులో మాయమైపోయింది.

ఏడాది మొత్తానికి ఇవాళ ఒక్కరోజే పాతకాలపు ఇంద్రుడికి స్వాత్‌లోయలో వక్షుతీరంలో లాగ అన్నిటికన్నా పెద్దదయిన గుర్రం మాంసం తిండానికి దొరుకు తుంది. ఈ గుర్రంకోసం అన్ని సమూహాల మధ్యా ఎంపిక జరుగుతుంది. నిజానికి స్వాత్‌లోయలో గుర్రంమాంసం తినరు. అయితే ఇంద్రుడికి సంవత్సరానికొకసారి చేసే ఈ పూజలో యజ్ఞశేషంగా అందరూ భక్తిభావంతో పుచ్చుకుంటారు. సమూ హపు మహాపితరుడు – ఇక్కడ అయన్ని జనపతి అని అంటారు. ఇవాళ తన జన పరిషత్తుతోపాటు ఇంద్రుడికి ప్రీతికరమైన బలిని అర్పించడానికి సిద్ధంగా ఉన్నాడు. జనపతికి బలి అర్పించే విధానం అంతా తెల్సు. మంత్రాలన్నీ కంఠతావచ్చు. వక్షు తీరవాసులు ఆ మంత్రాలతోనే స్తుతిస్తూ ఇంద్రుడికి బలి సమర్పించేవారు. వాద్య ఘోషతో, స్తోత్రమంత్రాలతో, అశ్వాన్ని స్పృశించడం, ప్రోక్షించడం దగ్గర్నుంచి

ఆలంబనం (వధించేవరకు) వరకూ మొత్తం యావత్తుకార్యం నిర్వహించడం జరిగింది. ఆ తర్వాత అశ్వంచర్మాన్ని వొలిచి దాని శరీరాంగాలని వేరుచేసి, కొన్ని అంగాలని పచ్చిగానూ, మరికొన్నిటిని తాళింపు పెట్టి అగ్నికి సమర్పించారు. యజ్ఞశేషాన్ని పంచే సమయానికి సాయంత్రం అయిపోయింది. అప్పటికి మైదానమంతా స్త్రీ పురుషులతో నిండిపోయింది. అందరూ బాగా అందమైన బట్టలువేసుకుని ఆభరణాలు పెట్టుకునీ ఉన్నారు. స్త్రీలు రంగురంగుల పల్చటి కంబళ్ళమీద నగిషీలు చెక్కిన రంగురంగుల పటకాలని కట్టుకున్నారు. అందమైన కంచుకాలు వేసుకున్నారు. చాలామంది చెవులకి బంగారపు కుండలాలు ఉన్నాయి. వసంతం అయిపోవస్తోంది. లోయలో చాలా రకాలైన పువ్వులు బహుశా ఇవ్వాల్టికోసమే పూసినట్టు ఉన్నాయి. యువతీయువకులు ఆ పువ్వులతో తమ పొడుగాటి కురులను బాగా అలంకరించుకున్నారు. ఇవాళ ఇంద్రోత్సవంలో స్వేచ్ఛాప్రణయానికి వాళ్ళకి సంపూర్ణమైన అధికారం ఉంది. సాయంత్రం బాగా ముస్తాబై పురుధారుడి చేతిలో చెయ్యి కలిపి ఉష తిరుగుతోంది. సుమేధుడు వాళ్ళిద్దర్నీ చూసి మొహం తిప్పుకున్నాడు. పాపం ఏం చేస్తాడు? ఇంద్రోత్సవం సమయంలో కోపం కూడా తెచ్చుకోలేడు. కిందటి సంవత్సరం ఈ విషయంలో జనపతి అతన్ని కూకలేశాడు.

ఇవాళ తేనె, పాలు కలిసిన సోమరసం నదులై నిజంగా ప్రవహిస్తోంది. గ్రామగ్రామాల ప్రజల తరఫునుంచి లేగదూడల మాంసం ఎంతో రుచికరమైనది, సోమరసంతో నిండిన పూర్ణకుంభాలు వచ్చి ఉన్నాయి. నూతన ప్రణయంలో చిక్కుకుని మత్తెక్కి ఉన్న యువతీయువకులకి ఎక్కడికి వెళ్ళినా బ్రహ్మాండంగా స్వాగతాలు చెప్తున్నారు. మాంసం ముక్కల్ని నోట్లో వేసుకుంటారు—సోమరసం ఓ కప్పు తాగుతారు. ఇష్టమైతే వీళ్ళకోసం వాయించే వాద్యాలకి అనుగుణంగానో, లేదా అప్పటికే వాగుతున్న వాద్యనాదాలకి సరిపడానో నాట్యం చేస్తారు. అక్కణ్ణించి మరో గ్రామం వారు చెప్పే స్వాగతాలు అందుకోడానికి వెళ్తారు! యావత్తు సమూహం తరపునా పెద్ద ఎత్తున ఏర్పాటుచేసిన నృత్యాలుచేసే దర్బారు చాలా పెద్దదే.

ఇంద్రోత్సవం ముఖ్యంగా యువతీయువకుల పండగ. ఈరోజు పగలూ రాత్రీ యువకులకు ఏ బంధనమూ ఉండదు. స్వచ్ఛందంగా సంచరించవచ్చు.

## 2

ఈ ఎగువస్వాత్ భాగంలో పశుసంపత్తి పుష్కలంగా ఉంది. పంట ధాన్యమూ హెచ్చే. అందుకే ఇక్కడి ప్రజలు చాలా సుఖంగా సమృద్ధితో ఉన్నారు. వాళ్ళకి లేని వస్తువుల్లో ముఖ్యమైనవి రాగి, విలాసవస్తువుల్లో వెండి బంగారాలూ, కొన్ని రత్నాలూను. వీటిగిరాకీ రోజురోజుకీ పెరిగిపోతోంది. ఈ వస్తువులకోసం ప్రతి ఏడాదీ స్వాత్‌కుభా (కాబులు) నదుల సంగమం దగ్గర ఉన్న అసురుల నగరానికి

వెళ్ళాల్సివస్తోంది. ఈ అసురనగరాన్ని తర్వాత్తర్వాత ఆర్యులు పుష్కలావతి (చార్‌సద్దా) అన్న పేరుతో వ్యవహరించేవారు. ఈ పేరునే మనం వాడదాం. చలి కాలంలో మధ్యలో స్వాత్, పంజకోరా మిగిలిన నదీలోయల్లో నివసించే కొండ జాతులవారు - పురులు, కురులు, గాంధారులు, మద్రులు, మల్లులు, శివి, ఉశీనరులు మొదలైనవాళ్ళు తమ గుర్రాలని, కంబళ్ళనీ మిగిలిన అమ్మకపు వస్తువుల్నీ తీసుకుని పుష్కలావతి బయలుమైదానంలో మకాంవేస్తారు. ఈ అసురవ్యాపారస్థులు వీళ్ళ వస్తువులని తీసుకుని వాటికిబదులు వీళ్ళకి కావల్సిన వస్తువులు ఇచ్చేవారు. శతాబ్దాల తరబడి ఇది ఇలా క్రమం తప్పకుండా జరుగుతోంది. ఈ సంవత్సరం పురుల జేహారుల గురువు పురుధానుని నాయకత్వంతో పుష్కలావతికి వెళ్ళింది. ఈ మధ్య చాలా సంవత్సరాల బట్టి అసురులు తమని బాగా మోసం చేస్తున్నారని కొండజాతుల వాళ్ళు మొత్తుకుంటున్నారు. అసుర నగర వ్యాపారస్థులు ఈ కొండవాళ్ళకన్నా చాలా తెలివైనవాళ్ళు. అందులో ఏం సందేహంలేదు. అదీగాక వీళ్ళని వాళ్ళు ఉత్తి అడివిమాలోకాలని అనుకునేవారు. ఈ మాటలో కొంతనిజం లేకపోలేదు. అయితే బంగారపువన్నె జుట్టూ నీలికళ్ళూ ఉన్న ఆర్యులు గుర్రపుస్వారీ తెలిసిన వారు అసురనగర వాసులకన్నా తాము హీనులమని ఒప్పుకోడానికి ఎప్పుడూ సిద్ధపడేవారు కాదు. రానురాను ఆర్యుల్లో పురుధానునివంటి వాళ్ళు ఎంతోమందికి అసురులభాష అర్థంచేసుకుని వాళ్ళతో కలసి తిరగడానికి అవకాశందొరకగానే అసురులు ఆర్యుల్ని ద్విపాదపశువులంటారని అర్థమైంది. ఇదిగో ఇదే ఆరంభం. ఈ రెండుజాతుల మధ్యా వైమనస్యం పెరగడానికి!!

అసురనగరాలు చాలా అందమైనవి. ఇటుకలతో కట్టిన పక్కా ఇళ్ళు, నీళ్ళు పోవడానికి కాలువలు, స్నానపుగదులు, వీధులు, చెరువులు అన్నీ ఉన్నాయి. ఆర్యులు కూడా పుష్కలావతి సౌందర్యాన్ని కాదనేవారు కాదు. అక్కడక్కడ కొంత మంది అసురయువతుల సౌందర్యాన్ని వాళ్ళ ముక్కు, జుట్టూ, ఒడ్డూ పొడుగు బాగుండక పోయినా లోపాలున్నా మెచ్చుకునేవారు. అయితే దేవదారు వృక్షాలతో ఆచ్ఛాదించబడిన కొండలోయలో కర్రతో కట్టిన చిత్రవిచిత్రమైన మేడ లతో, వరస తర్వాత వరసగా తీర్చిదిద్దినట్లుండే శుభ్రమైన ఇళ్ళతో ఉండే మంగళ పురం ఏ లెక్కనీ పుష్కలావతికి తీసికట్టని చచ్చినాసరే ఒప్పుకునేవారు కాదు. పుష్కలావతిలో నిండా ఓ నెల ఉండడంకూడా వాళ్ళకి కష్టం అనిపించేది. మాటి మాటికి వాళ్ళకి తమ సమూహపు భూమి జ్ఞాపకానికొచ్చేది. స్వాత్‌నదీ పుష్కలావతి దగ్గరా ప్రవహిస్తున్నది. అయినా ఆ నీటిలో వాళ్ళకి ఆ రుచి కనిపించేది కాదు. అసురుల చెయ్యి తగిలి ఆ పవిత్ర జలం కలుషితమైపోయిందని వాళ్ళు చెప్పేవారు. ఏమైనా ఆర్యులు అసురుల్ని తమతో సమానమైన వారని ఒప్పుకోడానికి సిద్ధంగా లేరు. ముఖ్యంగా అసురుల దగ్గర వేలకొద్దీ ఉన్న దాసదాసీ జనాల్ని మేడమీద

గదుల్లో కూచుని శరీరాన్ని అమ్ముకునే వేశ్యలనీ చూసిన తర్వాత అసలే ఒప్పుకో లేదు.

ఐతే వ్యక్తులపరంగా ఆర్యులకీ అసురుల్లోనూ, అసురులకి ఆర్యుల్లోనూ ఎంతో మంది మిత్రులు ఏర్పడ్డారు. అసురులరాజు పుష్కలావతికి దూరంగా సింధుతీరంలో ఉన్న ఓ నగరంలో ఉంటున్నాడు. అంచేత పురుధానుడు ఆతణ్ణి చూడలేదు. అయితే రాజప్రతినిధిని మాత్రం చూశాడు. అతడు పొట్టిగా లావుగా ఉంటాడు. చాలా సోమరి. మద్యపానం నుంచ అతని దళసరి కనురెప్పలు ఎప్పుడూ మూతలుపడే ఉంటాయి. అతని ఒంటినిండా దజన్లకొద్దీ వెండివీ బంగారంవీ ఆభరణాలు ఉన్నాయి. చెవులకి కన్నాలు పెట్టుకుని భుజాలవరకూ ఆభరణాల్ని వేళ్ళాడదీసుకున్నాడు. ఈ ముఖ్యోద్యోగి పురుధానుడి దృష్టిలో మహా కురూపి. తెలివితక్కువ దద్దమ్మాను. అలాంటి రాజప్రతినిధి ఉన్న రాజ్యంపట్ల పురుధానుని వంటి మనిషికి మంచి అభిప్రాయం కలగలేదు. అతడు అసురరాజుకి బావమరదనీ, అందుకే ఈ పదవిలో అత నున్నాడని పురుధానుడికి తెలిసింది.

ఎన్నో ఏళ్ళ అప్పటా అప్పటా తాత్కాలికంగానే అయినా అసురులతో సాంగత్యం చెయ్యటంవల్ల పురుధానుడికి అసురసమాజంలో ఉన్న చాలా బలహీన తలు తెలిసేయి. పై వర్గపు అసురులు ఎంత తెలివైనవారైనా కానీ, వాళ్ళలో పిరికి వాళ్ళు చాలామంది కనపడతారు. వీళ్ళు తమకింద ఉన్న భటులతో దాసులతో శత్రు వుని ఎదిరించాలని అనుకుంటారు. దుర్బలుడైన శత్రువు ఎదుట తప్ప, అలాంటి సేన నిలవలేదు. అసురులు పరిపాలకుడు - రాజుకి సామంతులకి వాళ్ళ జీవితాలకి పరమావధి భోగవిలాసాలే. ప్రతి సామంతరాజుకి వందలకొద్దీ స్త్రీలు, దాసీలు ఉండే వారు. స్త్రీలనికూడా వాళ్ళు దాసీల్లాగానే చూసేవారు. ఈ మధ్యే అసురరాజు కొంత మంది కొండ (ఆర్య) జాతి స్త్రీలని బలాత్కారంగా తన రాణీవాసంలో పెట్టేడు. దాన్నించి ఆర్యసమూహాల్లో తీవ్ర సంచలనం కలిగింది. అసురుల రాజధాని సరి హద్దులకి చాలా దూరంలో ఉండడంనుంచీ అక్కడి వరకూ ఆర్యులు వెళ్ళలేక పోవడం నుంచీ అసురరాజు బతికిపోయేడు! అందుకే ఆర్యస్త్రీల గురించి విన్న సంగ తులు పుక్కిటి పురాణాలని జనం అనుకున్నారు.

పుష్కలావతి బజార్లనుంచి రకరకాలైన ఆభరణాలు, నూలుబట్టలు, అస్త్ర శస్త్రాలు, ఇంకామిగిలిన వస్తువులు సువాస్తుకేకాక కునార్‌కి ఎగువభాగపు తీరంలో దేశ దిమ్మరులుగా తిరిగే జాతుల గుడిసెలవరకూ కూడా చేరేవి, సువాస్తులోని అందమైన స్త్రీలు, బంగారపువన్నె జుట్టుకలిగిన వాళ్ళు నిపుణులైన అసుర పనివారిచేత తయారు చెయ్యబడ్డఆభరణాలంటే అందులోనూ చేత్తో చేసినవంటే ఎక్కువ ముచ్చటపడేవారు. దాంతో ప్రతి సంవత్సరం బేహారులతోపాటు ఆర్య స్త్రీలు కూడా ఎక్కువ సంఖ్యలో పుష్కలావతికి రావడం మొదలుపెట్టేరు. పాపం సుమేధుడు నిజంగానే ఉషని విధవరాల్ని చేసి పైలోకానికి వెళ్ళిపోయేడు. ఇప్పుడు అవిడ తన పినమావగారి

కొడుకూ, తనకు మరిదీ అయిన పురుధానుడి పత్ని. ఈ ఏడాది ఆవిడా పుష్కలావతికి వచ్చింది. పుష్కలావతి నగరాధిపతి మనుషులు బంగారపువన్నె జుట్టుగల వారి డేరాల్లో చాలామంది అందమైన యువతుల్ని చూసి ఆ సంగతి తమ యజమానికి చెప్పేరు. బేహారులు తిరిగి వెళ్ళే సమయంలో, కొండలోకి వెళ్ళేవెళ్ళగానే వాళ్ళ మీదపడి దోచుకోవాలని అతడు నిర్ణయించుకున్నాడు. ఇది తెలివి తక్కువ పనే-ఎంచేతా అంటే బంగారపు వన్నె జుట్టు కలవారు చాలా వీరులనీ, బలమైనవారనీ తెలిసీ కూడా ఇలాంటి నిర్ణయం చేసుకున్నాడంటే అతనెంత బుద్ధిహీనుడో అర్థం అవుతుంది. నగరంలోని పెద్ద పెద్ద వ్యాపారసులు సాహుకార్లు అతనంటే అసహ్యించుకుంటున్నారు. ఈ మధ్యే నగరాధిపతి ఓ వ్యాపారస్తుని అందమైన కుమార్తెను బలాత్కారంగా తనింట్లో పడేసుకున్నాడు. ఆ వ్యాపారస్తుడు పురుధానుడికి మిత్రుడు. నగరాధిపతి ఆ వ్యాపారస్థునికి ఆగర్భ శత్రువయ్యేడు. ఉష కూడ అసుర వ్యాపారస్తుని ఇంటికి చాలాసార్లు వెళ్ళింది. వ్యాపారస్తుని భార్య మాట్లాడేది ఒక్కమాటైనా ఆవిడకి అర్థం కాకపోయినా పురుధానుడు దుబాసీగా ఉండడంవల్లా, వ్యాపారస్తుని భార్య మాటామంచీ బాగుండడం నుంచీ, ఈ ఇద్దరిమధ్యా ఆర్యస్త్రీ అసుర స్త్రీలైనప్పటికీ స్నేహం ఏర్పడింది. పురుధానుడూ బేహారులు ఇహ రెండ్రోజుల్లో వెళ్ళిపోతారనగా ఆ వ్యాపారస్తుడు తన దగ్గర ఎక్కువ కొనుగోలు చేసే పురుధానుడికి విందు చేశాడు. అప్పుడు అతడు పురుధానుడి చెవిలో నగరాధిపతి నీచ సంకల్పం గురించి చెప్పేడు.ఆ రాత్రే పురుధానుడు ఆర్యుల వర్తకప్రముఖులనందరినీ పిలిచిచర్చించాడు. ఆయుధాలు తక్కువగా ఉన్నవాళ్ళు వెంటనే కొత్త ఆయుధాలు కొన్నారు. అమ్మడానికి తెచ్చిన గుర్రాలూ, మిగిలిన బరువైన మూటలూ అన్నీ అమ్ముడైపోయేయి. స్వారీ చేసే గుర్రాలూ, కొనుక్కున్న ఆభరణాలూ, లోహపు వస్తువులూ-తేలికైన సామానే ఉంది. అంచేత వాళ్ళకి విషయంలో భయపడాల్సినదేం లేదు. స్వాత్ ప్రాంతపు ఆర్యస్త్రీలలో ఆభరణాల పట్లా సింగారం పట్లా సరదా ఎక్కువవుతున్నా వాళ్ళు సంగీత నృత్యాలతోపాటు ఆయుధ విద్యని కూడా ఇప్పటికీ నేర్చుకుంటూనే ఉన్నారు. విపత్తు గురించి వినగానే వాళ్ళూ తమతమ ఖడ్గాలనీ చర్మపు కవచాలనీ సిద్ధం చేసుకున్నారు.

అసుర భటులు సరిహద్దు దగ్గర కొండ ఏటవాలు ప్రాంతంలో ముందుగానే దారి అటకాయించి తమమీద దాడిచేస్తారని పురుధానుడికి తెలుసు. అంతేకాక వాళ్ళదే మరోదళం వెనక నుంచీ ముట్టడించాలని అనుకుంటుంది. అంచేత పురుధానుడు దానికి తగ్గట్టూ పూర్తి ఏర్పాట్లు చేశాడు. మొదటే శత్రువులు ముట్టడించబోతున్నారన్న వార్త తెలియడం నుంచి ఏర్పాట్లు చేసుకోడానికి వీలయింది. మామూలుగా అయితే పంజకోరా, కునార్ స్వాత్ వర్తకులు వేరువేరుగా ఒకరి గురించి మరొకరు ఆలోచించకుండా ఎవరిదారిని వారు వెళ్ళేవారు. అయితే ఇప్పుడు అందరూ సన్నద్ధులై ఉన్నారు. శత్రువుకి ఆచూకీ దొరక్కుండా ఉండాలని పుష్కలావతి నుంచి కాస్త ముందు వెనకలుగా ఒకటి రెండు రోజులు తేడాలో బయల్దేరారు. అయితే అద్రిద్వారం దగ్గర అందరూ ఒకే సమయానికి చేరుకునేటట్టు నిర్ణయించుకున్నారు. ద్వారం కోసో రెండు కోసులలో ఉండనగా పురుధానుడు పాతికమంది అశ్వికులని

పంపించాడు. ద్వారం లోపలికి వీళ్ళు వెళ్తూ ఉండగా అసురులు బాణాలు వెయ్యడం మొదలుపెట్టేరు. దాడి మాట నిజమే అయింది. అశ్వికులు వెనక్కి తిరిగి వచ్చి తమ నాయకుడికి సంగతి చెప్పేరు. మొదట వెనకవేపు నుంచి దాడిచేసే శత్రువులతో తలపడాలని పురుధానుడు అనుకున్నాడు. అందులో సుళువూ ఉంది. ఎంచేతా అంటే ప్రతి ఏడాదీ అసురులు ఆర్యుల దగ్గర వేలకొద్దీ సంఖ్యలో గుర్రాలని కొంటున్నారే తప్ప వాళ్ళలో మెరికల్లాంటి సైనికులు గుర్రపుస్వారీ చేస్తూ యుద్ధం చెయ్యగలిగే వారు తయారు అవలేదు.

బేహారుల గుంపు ఆగిపోయింది. ఆ గుంపుని కాపాడడానికి కొంతమంది భటులను అక్కడ ఉంచి మిగిలిన అశ్విక భటులను తీసుకుని పురుధానుడు వెనక్కి మళ్ళేడు. బంగారపు వన్నె జుట్టు కలవారు హఠాత్తుగా ఇలా తమమీద పడతారని అసుర సేనకి తెలీదు. ఆర్యుల పొడుగుబల్లేల ధాటికి, ఖడ్గాల ధాటికి ఆ సేన ఎక్కువ సేపు నిలవలేకపోయింది. అయితే ఆర్యదళం వాళ్ళని కేవలం ఓడించి వదిలెయ్యాలని అనుకోలేదు. బంగారపు వన్నె జుట్టుగలవారిని కన్నెత్తి చూస్తే ఎంత ప్రమాదమో ఆ నల్లటి అసురులకి తెలియజెప్పాలని అనుకున్నారు. అసుర సేన పారిపోవడం చూసి పురుధానుడు బేహారులకి కబురు పంపేడు. తన అశ్విక దళంతో పుష్కలావతి మీద వచ్చి పడ్డాడు. అసుర సైనికుల్లాగానే వాళ్ళ నగరాధిపతి కూడా ఇలా అవుతుందని అనుకోలేదు. అసురులు తమ పూర్తి బలాన్ని చూపెట్టడానికి అవకాశమే లేకపోయింది. చాలా సుళువుగా అసురదుర్గమూ, నగరాధిపతీ బంగారపు వన్నె జుట్టుగలవారి చేజిక్కారు. అసురులు చేసిన ఈ ద్రోహానికి ఆర్యులు ఆవేశపడ్డారు. అతి నిర్దయతో అసుర పురుషుల్ని వధించారు. నగరం నాలుగు వీధుల మొగలో అసుర ప్రజలందరిముందూ నగరాధిపతిని చిత్రవధ చేశారు. వాళ్ళ స్త్రీలనీ, పిల్లల్నీ, వ్యాపారస్థులనీ చంపలేదు. దాసుల్ని చేసుకుందామన్న కోరికేగాని ఉండి ఉన్నట్లయితే ఆర్యులు ఇంతమందిని వధించేవారు కాదు; పుష్కలావతిలో చాలా భాగానికి నిప్పుపెట్టి కాల్చేశారు. ఇది మొదటి అసుర దుర్గ పతనం!

అసురులకీ ఆర్యులకీ మధ్య మహాయుద్ధం — దేవాసుర సంగ్రామం ఇల్లాగా ఆరంభం అయింది.

పురుధానుడు తిరిగివచ్చి అబ్జద్వారం దగ్గర కూడిన అసుర సైనికుల్ని చంపేశాడు. ఆ తర్వాత పీతకేశులు—ఆర్యబేహారులు తమ తమ సమూహపు భూములకి వెళ్ళిపోయేరు.

చాలా సంవత్సరాలవరకూ పుష్కలావతిలో మరి వ్యాపారం హెచ్చరిల్లలేదు. పీతకేశులు అసురుల వస్తువులు కొనడానికి నిరాకరించేరు. అయితే ఇత్తడీ, రాగి వాడకాన్ని వాళ్ళు ఎంతకాలం బహిష్కరించగలరు?*

---

*నేటికి నూట ఎనిమిది తరాల ముందు ఆర్యులకీ (దేవ) అసురులకీ మధ్య సంఘర్షణ జరిగింది. దాని కథే ఇది. ఆర్యుల ఈ కొండ సమాజంలో దాసత్వం అంగీకరించబడలేదు రాగితోనూ, ఇత్తడితోనూ చేసిన ఆయుధాలూ మరింత ప్రాబల్యంలోకి వచ్చేయి.

# అ ం గి రా

స్థానం: గంధారం (తక్షశిల) జాతి: ఇండో ఆర్యను
కాలం: క్రీస్తుకు పూర్వం 1800.

"ఈ నూలుబట్ట దండగ. దీనితో చలీ ఆగదు. పోనీ అని వానకీ పనికి రాదు!" తన తడిసిపోయిన కంచుకాన్ని విప్పుకుని కంబళీని కప్పుకుంటూ యువకుడు అన్నాడు.

"ఎండాకాలంలో చాలా బాగుంటుంది," రెండో యువకుడు-తన కంచుకాన్ని తలుపుమీద పరుస్తూ అన్నాడు. ఇంకా చాలాపొద్దు వుంది. అయినా సత్రంలో జనం నిప్పు దగ్గర అప్పుడే తిష్టవేసుక్కూర్చున్నారు. ఇద్దరు యువకులూ పొగలో కూర్చో కుండా కిటికీకి దగ్గరగా గాలి తగుల్తుందని కంబళ్ళు కప్పుకుని కూచున్నారు. "మరో ఆమడదూరం ఈ సరికి మనం వెళ్ళి వుండేవాళ్ళం. రేపొద్దున్నకల్లా గంగాధార్ నగరం (తక్షశిల) చేరిపోయే వాళ్ళం. అయితే ఈ గాలివానని ఏం చెయ్య గలం?" అన్నాడు మొదటి యువకుడు.

"చలికాలంలో కురిసే ఈ మబ్బు మరీబాధగా వుంటుంది. అయి తే ఇప్పుడు గాని కురవకపోయిందా మనరైతులు ఇంద్రుణ్ణి వానలు కురిపించమని ప్రార్థనలమీద ప్రార్థనలు చేస్తారు! పశులకాపరులైతే మరీ గోలపెట్టేస్తారు." అన్నాడు రెండో యువకుడు.

"నువ్వన్నది నిజమే అనుకో మిత్రమా! ఇదిగో బాటసార్లే కేవలం ఈ వానని ఇష్టపడరు. అయితే ఎవడూ ఎప్పుడూబాటసారిగానే వుండిపోడు కదా?" అని మెడవెనక వేపుఉన్న పెద్ద గాయపుమచ్చని చూసి "నీ పేరేమీటి మిత్రమా?" అని అడిగాడు.

"పాలమూద్రుడు. మరి నీ పేరు?"

"వరుణ సౌవరుడు. అయితే నువ్వు తూర్పువైపు నుంచి వస్తున్నావా?"

"మరే. మద్రుల దగ్గర్నుండి. నువ్వు దక్షిణాన్నుంచేనా? దక్షిణాన్ని ఇప్ప టికీ అసురులు ఆర్యులతో పోరాడుతున్నారని వినికిడి. అది నిజమేనా? చెప్పు చెప్పూ."

"సముద్రతీరంలో వాళ్ళది ఒక్కటంటే ఒక్కనగరం మిగిలివుంది. మా మధ్యా ఇంద్రుడు అసురుల వంద నగరదుర్గాలని ఎలా ధ్వంసం చేశాడో' నువ్వు విన్నావా మిత్రమా!"

"విన్నాను విన్నాను. అసురుల నగరదుర్గాలు లోహంతో (రాగి) కట్టినవా?"

"అసురలదగ్గర కావాల్సినంత లోహం వుంది. అయితే నగరదుర్గాలు కట్టడానికి సరిపడినంతలేదు. ఈ కథ అంతటా ఎలా పాకిందో నాకు తెలీదు. అసురులు ఇళ్ళు ఇటుకలతో కట్టినవి. అవి నాల్గుకోణాలవి, వెడల్పుకన్నా పొడుగెక్కువగా వున్నవీ-నిప్పులో కాల్చినవీను. వాళ్ళ నగరాలకి చుట్టూ కట్టినగోడ కూడా ఇటికలవే. ఈ ఇటికలు ఎర్ర రంగులో వుంటాయి. లోహరంగులో ఉన్నా లోహానికీ (రాగికీ) ఈ ఇటికలకీ ఎంతో తేడా వుంది. వీట్ని లోహం అని చెప్పడానికి కుదరదు".

"కాని వరుణా-అసురులవి లోహదుర్గాలనే వినికిడి."

"మన ఇంద్రుడికి ఈ దుర్గాలని ధ్వంసం చేయడానికి చాలాశక్తిని వినియోగించవలసి వచ్చింది. అందుకే బహుశా ఈ పేరు వాటికి వచ్చి వుంటుంది.!"

"శంబరుడి పరాక్రమం గురించీ కథలకి కథలు వింటున్నాం. అతని ఇల్లు సముద్రంలో వుండేదనీ అతని రథం ఆకాశంలో నడిచేదనీ!"

"రథంమాట ఉత్తబద్ధం. యుద్ధ విద్యలన్నిటిలో అశ్వారోహణంలోనే అసురులు వెనకబడ్డారు. ఇప్పటికీ ఉత్సవ సమయాల్లో అసురులు గుర్రపు రథాలకి బదులు వృషభరథాలని వాడతారు. మనం మన ఈ గుర్రాల నుంచే గెలిచేమని నేననుకుంటాను పాల్! లేకపోతే మనం అసురనగరాన్ని జయించలేకపోయే వాళ్ళం. శంబరుడు కాలంచేసి రెండు వందల ఏళ్ళు అయింది. నా నమ్మకం ఏమిటంటే అతని దగ్గర అశ్వరథమే వుండివుండదు – ఆకాశంలో నడవడం మాట దేవుడెరుగు !''

"శంబరుడు అంత సామాన్యుడైతే మరి ఆ శత్రువుని గెలిచేడని మన ఇంద్రునికి అంత గొప్పతనం ఎందుకు వచ్చింది?''

"శంబరుడు గొప్పవీరుడు కనక! సౌవీరపురంలో శంబరుడి స్వర్ణకవచాన్ని నేను చూశాను. అది చాలా దృఢంగా పెద్దదిగా వుంది. అసురులు సాధారణంగా పొట్టిగా వుంటారు. అయితే శంబరుడు మాత్రం ఒడ్డూ పొడుగూవుండి చాలా పెద్దగా వుండేవాడు. బహుశా ఎక్కువ లావుగానూ పుష్టిగానూ వుండేవాడు. మన మధ్వా ఇంద్రుడు సన్నగా పలచగా అందంగా వుండేవాడు. సింధునదీ తీరంలో ఇప్పటికీ అసురుల నగరదుర్గాలు వున్నాయి. ఆ దుర్గాల్లోపల్నుంచి కొద్దివందల మంది ధనుర్విద్య తెలిసినవారు వేలాది శత్రుసైనికుల్ని దగ్గరకి రాకుండా ఆపగలరు. నిజం చెప్పాలంటే ఈ అసురుల పురాలు అయోధ్యలే (అపరాజేయాలు). అలాంటి అయోధ్యాపురాల్ని ధ్వంసం చేసిన మన మధ్వా ఇంద్రుడు – కాదు కాదు- ఆర్య సేనాని మహా పరాక్రమవంతుడు."

"దక్షిణాన్ని ఇప్పటికీ అసురులు బలంగా వున్నారా వరుణ్?"

"చెప్పేనుకదా! సముద్రతీరాన్ని వాళ్ళకి మిగిలిన ఒకేఒక్కచోట ఈ మధ్యే పడిపోయింది. ఈ యుద్ధంలో నేనూ పాల్గొన్నాను.'' అని చెప్తున్నప్పుడు వరుణుడి

ష్మిరటి మొహం ఇంకా ఎరుపెక్కింది. అతడు తన పొడుగాటి బంగారపు వన్నెతో మెరుస్తున్న జుట్టుని వెనక్కివేసి సరిచేసుకుంటూ "అసురుల చివరి దుర్గం పడి పోయింది" అన్నాడు.

"మీ ఇంద్రుడెవరు?"

"ఇంద్రపదవిని మేం రద్దుచేసేశాం."

"రద్దుచేసేశారా?"

"ఆఁ దాన్నించి మా దక్షిణాది ఆర్యులకి భయం పట్టుకుంది."

"భయం ఎందుకూ?"

"ఇంద్రుడంటే మనం సేనానాయకుడని కదా అనుకుంటున్నాం.అవునా ?"

"అవును."

"మరి సేనానాయకుణ్ణి ఆర్యులు సర్వస్వం అనుకోరు. ఒప్పుకోరు. యుద్ధ సమయంలో అతని ఆజ్ఞలని శిరోధార్యంగా భావించినా ఆర్యులు తమ జన పరిషత్తునే అన్నిటికన్నా ఉత్కృష్టమైనదీ పెద్దదీ అనుకుంటారు. మరి జనపరిషత్తులో ప్రతి ఆర్యుడికీ తన అభిప్రాయం ఖచ్చితంగా చెప్పే హక్కు వుంటుంది."

"అవును అది వుంది."

"కాని దీనికి వ్యతిరేకం— అసురుల ఇంద్రుడూ లేదా రాజూను. అంతా తనే ! అతడు జనపరిషత్తుని తనపై దానిగా ఒప్పుకోడు. అసురరాజు నోట ఏ పలుకు వచ్చినా దానినే ప్రతి అసురుడూ చెయ్యాల్సి వుంటుంది. లేకపోతే వాడికి చావే."

"అలాంటి ఇంద్రుణ్ణి మనం ఎప్పుడూ ఇష్టపడలేం."

"కాని అసురులు అలాంటి ఇంద్రుణ్ణే ఇష్టపడుతూ వచ్చేరు. తమ రాజుని వాళ్ళు మనిషని అనుకోరు. దేవుడని అనుకుంటారు. అతనిని పూజించడానికి వాళ్ళేమిటేమిటి చేస్తారో నువ్వు విన్నావంటే నమ్మలేవు."

"అవునవును. నేనూ చూశాను. అసుర పురోహితులు తమ ప్రజలని గాడి దల్ని చేస్తున్నారు."

"గాడిదలకన్నా కనిష్టం. వాళ్ళు లింగాన్నీ యోనినీ పూజచేస్తారు. నువ్వు విన్నావో లేదో! ఇవి రెండూ స్త్రీ పురుషుం ఆనందానికి సాధనాలని నేను ఒప్పు కుంటున్నాను. వీటిద్వారా సంతానం వృద్ధిచెందుతుంది. కాని వీటిని సాక్షాత్తుగానూ లేదూ అంటే మట్టితోనూ రాతితోనూచేసి పూజచెయ్యడం ఎంత మూర్ఖత్వమో!"

"ఇందులో సందేహం ఏముంది?"

"అసురరాజులు లింగదేవుడి పరమభక్తులు. కాని ఇదంతా నాకైతే ఉత్తి టక్కరితనంలా కనిపిస్తుంది. అయినా అసురరాజులూ, వాళ్ళ పురోహితులూ మూర్ఖులుకారు. వాళ్ళు మన ఆర్యులకన్నా చాలా తెలివైనవాళ్ళు. వాళ్ళ నగరా ల్లాంటి నగరాలని నిర్మించుకోడానికి మనం వాళ్ళ దగ్గర చాలా నేర్చుకోవాలి. వాళ్ళ విపణివీథులు (బజారులు), వాళ్ళ పూచిన తామరలతో నిండిన సరస్సులు, వాళ్ళ

ఎత్తైన మేడలు, వాళ్ళ వాళ్ళరాజమార్గాలు మన ఆర్యభూముల్లోఎక్కడా కనిపించవు. ఉత్తర సౌవీరంలోని అసురులు పరిత్యజించిన నగరాలని చూశాను. ఇదిగో మొన్న కొత్తగా వాళ్ళు ఓడిపోయిన నగరాన్నీ చూశాను. మనం ఆర్యులం వాళ్ళ ప్రాచీన నగరాల్ని మరమ్మత్తు చేసికూడా సరియైన రూపం కలిగించలేకపోయేం. ఇహ ఈ కొత్త నగరం-శంబరుడు స్వయంగా కట్టించేడని చెప్తారు –దేవపురంలా వుంటుంది.''

"దేవపురం!''

"ఆఁ - దేవపురం! మరి దాన్ని పృథ్వీలో దేనితోనూ పోల్చి చెప్పలేం. మిత్రమా! ఓ కుటుంబానికి వాసయోగ్యమైన ఇంటినే తీసుకోండి. దాంట్లో అన్ని టితో అలంకరించిన ఒకటి రెండు సావిళ్ళు (కూచునే గదులు), పొగ పోవడానికి అమర్చిన గొట్టంతో వేరుగా వంటిల్లూ, వాకిట్లో ఇటుకలతో కట్టిన నుయ్యీ,స్నానాల గదీ, పడగ్గదీ, సామాన్లగదీ ! సామాన్యులైన వర్తకుల ఇళ్ళే రెండేసి, మూడేసి అంతస్థులు వుండడం నేను చూశాను. ఎంతని వర్ణించి చెప్పనూ? అసురపురాన్ని దేవపురంతో మాత్రమే నేను పోల్చిచెప్పగలను.''

"తూర్పువేపునా అసురుల నగరాలు వున్నాయి. కాని మా మద్రుల భూమికి (స్యాత్‌కోటభూమి) చాలా దూరంలో వున్నాయి.''

''మరి అలాంటి నగరాల్ని నిర్మించినవాళ్ళు, అలాంటి పురాల్ని వెలయించిన వాళ్లు, మనకంటే తెలివైనవాళ్ళు, నేర్పరులు. దాన్ని మనం ఒప్పుకుతీరాలి. సముద్రం గురించి వినివుండవు అవునా?''

"పేరు విన్నాను.''

"పేరు విన్నంత మాత్రాన, వర్ణించినంత మాత్రాన అంచనాకి అందదు. సముద్రతీరాన్ని నిలబడి చూస్తేనే కొంతకొంత బోధపడుతుంది. ఎదురుగా మీదకి చూస్తే నీలిరంగు సముద్రపునీళ్ళు నీలిరంగు ఆకాశంలో కలిసి కనపడతాయి."

"ఆకాశంతో కలిసా వరుణ్?"

"ఆఁ. ఎంతదూరం వరకూ చూసినా సముద్రజలం తాటి ప్రమాణంలో మీదికి లేస్తూ కనపడుతుంది. చివరకి పోయిపోయి ఆకాశంలో కలిసిపోతుంది. రెండింటి రంగూ ఒక్కలా అయిపోతుంది. అయితే సముద్రజలం ఎక్కువ నీలంగా ఈ అపారసముద్రంలో అసురులు తమ విశాలమైన నౌకల్ని ఏమాత్రం భయంలేకుండా నడుపుతారు. నెలలకి నెలల తరబడి, సంవత్సరాలకి సంవత్సరాల తరబడి ప్రయాణం చేస్తారు. సముద్రంలోంచి నానారకాలైన రత్నాల్ని తెస్తారు. అసురుల తెలివితేటలకీ ధైర్యసాహసాలకీ ఇది కూడా తార్కాణమే. ఇదేకాదు, నువ్వో సంగతి వినైనా వుండివుండవు మిత్రమా! అసురులు నోటితో ఏఁవీ అనకుండా సంభాషించ గలరు."

"నోటితో మాట్లాడకుండానా? ఏమిటి చెప్తున్నావు మిత్రమా?"

"ఆహాఁ మాట్లాడకుండానే! మట్టినో, రాయినో, తోలునో ఇయ్యి. ఓ అసు

రుడు దానిమీద ఏవేవో చిహ్నాలు గీస్తాడు. రెండోవాడికది బోధపడిపోతుంది. మనం రెండుగంటల సేపు మాట్లాడినా అర్థం చేసుకోలేని దాన్ని అతడు అయిదో పదో గుర్తులుగీసి చెప్పగలడు. ఇది ఆర్యులకి ఎప్పుడూ తెలీదు. ఇప్పుడు మన ఆర్యులు ఆ గుర్తుల్ని నేర్చుకుంటున్నారు. కాని సంవత్సరాలు గడిచిపోతున్నాయి. కాని వాళ్ల నేర్చుకోవడం పూర్తికాలేదు."

"అలా అయితే మనకంటే అసురులు చాలా నిపుణులే. నిశ్చయంగా!"

"వాళ్ళు కమ్మరైతేనేం, వఁడ్రంగులైతేనేం, కుమ్మర్లయితేనేం, కంసాలులైతేనేం, నేతపనివారైతేనేం, వాళ్ళ చేతినైపుణ్యాన్ని మనం చూస్తూనేవున్నాం. అసురులు మనకంటే అన్నిటా నిపుణులన్న దాంట్లో సందేహం ఏముంటుంది?"

"మరి అసురులు వీరులని కూడా నువ్వు చెప్పేవు!"

"అవును, అయితే వాళ్ళసంఖ్య చాలా తక్కువ. ఆర్యుల్లాగ వాళ్ళ ప్రతి పిల్లడూ ఉగ్గుపాలతో కత్తిపట్టుకోడం నేర్చుకోడు. వాళ్ళలో వీరులూ యోధులూ వేరుగా వుంటారు. వేరువేరు శ్రేణులుగా అందరూ వుంటారు. చేతిపనులు చేసేవారు వేరు, వ్యాపారస్తులు వేరు, దాసులు వేరు. యోధుల శ్రేణిలో వాళ్ళుతప్ప మిగిలిన వాళ్ళు యుద్ధ విద్య నేర్చుకోరు. యోధులు వాళ్ళని తక్కువగా చూస్తారు. దాసదాసీ జనాల స్థితి పశువులకన్నా కనిష్టంగా వుంటుంది. వాళ్ళని కొనీ అమ్మే వ్యాపారం చెయ్యడమే కాదు, వాళ్ళ బతుకులతో చిత్తం వచ్చినట్లు ఆడుకోవచ్చు."

"వాళ్ళలో యోధులెంతమంది వుంటారు?"

"నూటికి ఒకరు కూడా కాదు. దాసదాసీజనాలు నూటికి నలభైమంది వుంటారు. అర్ధదాసులూ నూటికి నలభైమందే. శిల్పులూ రైతులూ అర్ధదాసులే. నూటికి పదు గురు వ్యాపారస్థులు. మిగిలినవారు తదితరులూను."

"అందుకేమరి అసురులు ఆర్యులచేత ఓడిపోయేరు."

"నిజమే-వాళ్ళ ఓటమికి ఇదో పెద్దకారణమే. మరో పెద్దకారణమూ వుంది. వాళ్ళ రాజుని ప్రజలందరికీ పైన వున్న దేవుడని అనుకోడం."

"దీన్ని మనం ఆర్యులం ఎప్పటికీ అంగీకరించలేం."

"అందుకే మనం ఇంద్రపదవిని రద్దుచెయ్యాల్సి వచ్చింది. మధ్యా తర్వాత వచ్చిన ఎవరో ఓ ఇంద్రుడి సంగతిది! అతగాడు అసురరాజులా అవాలని అను కున్నాడు."

"అసుర రాజులాగా! ఆర్యజనులతోనా చిత్తం వచ్చినట్టు ప్రవర్తించడం!"

"మరే! అతనొక్కడే కాదు. అతని తర్వాత మరోడు- ఈ విషయంలో వాళ్ళకి సాయం చేస్తూ కొంతమంది ఆర్యులు కూడా పట్టుబడిపోయేరు!"

"సాయం చేస్తూనా?"

"కులం అనీ, కుటుంబం అనీను! అందుకే సౌవీర సమూహం ఇప్పుడిహ

ఎవరికీ ఇంద్రపదవి ఇవ్వనని నిర్ణయించింది. ఇంద్రుడికి అశని (మెరుపు) హస్తదేవు డని కూడా పేరు వుంది. దానివల్ల జనంలో క్రమకలిగే ప్రమాదమూ వుంది."

"చాలమంచి పనిచేసింది సౌవీరసమూహం మిత్రమా!"

"కాని ఆర్యజాతికే కళంకం తెచ్చేవాళ్ళు ఆర్యుల్లో ఎంతోమంది పుట్టేరు. వీళ్ళు అసురుల ప్రతివిషయాన్నీ ఇరవై నాలుగ్గంటలూ పొగుడుతూనే వుంటారు. వాళ్ళకి మరోపని లేదు. అసురుల దగ్గర పొగిడే విషయాలున్నాయి. వాటిని నేనూ పొగుడుతున్నాను. ఆ విషయాల్ని మనం నేర్చుకోవాలి. వాళ్ళ ఆయుధాల్ని మనం అనుకరించాం. వాళ్ళ వృషభరథాల్ని చూసే మన మధ్య ఇంద్రుడు అశ్వరథాల్ని చేసేడు. ధనుర్బాణాలతో యుద్ధం చేయడానికి గుర్రంకన్నా రథం ఎక్కువ వీలుగా వుంటుంది. రథంమీదైతే ఎన్ని కావాలంటే అన్ని అమ్ములపొదులని పెట్టుకోవచ్చు. శత్రువుల బాణాలనుంచి రక్షించుకోడానికి డాలునీ పెట్టుకోవచ్చు.వాళ్ళ కవచాలనుంచి గదలూ శక్తినుంచి మనం చాలా నేర్చుకున్నాం. వాళ్ళ నగరాల నుంచి కూడామనం చాలా విషయాలు తెలుసుకుంటున్నాం. వాళ్ళ సముద్ర యాత్రల్నించి కూడా మనం నేర్చుకోవాలి. ఎంచేతా అంటే లోహం (రాగి), మిగిలిన లోహాలు, రత్నాలు, ఇంకా అనేకానేక వస్తువులు సముద్రానికి ఆవలివైపునుంచి వస్తున్నాయి. ఇప్పటికీ ఈ వ్యాపారమంతా అసుర వ్యాపారస్థుల చేతిలోనే ఉంది. మనం స్వతంత్రంగా, ఎక్కచ్చిగా ఉండాలని అనుకుంటే సముద్రంలో నౌకలు నడపడం నేర్చుకోవాలి. కాని అసురుల్లో చాలా విషయాలు మా ఘాతుకమైనవిగా మనం తెలుసుకోవాలి. ఉదాహరణకి లింగపూజ."

"కాని లింగపూజ ఏ ఆర్యుడు ఇష్టపడతాడూ?"

"అలా అనకు మిత్రమా! ఎంతమందో ఆర్యులు మనమూ అసురుల్లాగ మన పురోహితుల్ని ఏర్పాటు చేసుకోవాలని అంటున్నారు. మనలో యోధులనీ, పురోహితు లనీ, వ్యాపారస్థులనీ, వ్యవసాయదారులనీ, శిల్పులనీ ఎటువంటి భేదమూ లేదు. అందరూ అన్ని పనులూ ఇచ్ఛానుసారం చెయ్యగలరు. కాని అసురులు వేరు వేరు తరగతులుగా చేసి పెట్టుకున్నారు. ఇవాళ ఆర్యుల్లో పురోహితుల్ని ఏర్పడనియ్యి. చూస్తూ చూస్తూ ఉండగా మరికొన్ని సంవత్సరాల్లో లింగపూజ కూడా మొదలై పోతుంది. అసుర పురోహితులు మా మోసగాళ్ళు. ఆర్యపురోహితులు కూడా లాభం కోసం లోభపడి అలాగే చెయ్యడం మొదలుపెడ్తారు."

"ఎంతో కీడుమూడుతుంది వరుణ్!"

"గత రెండువందల సంవత్సరాల నుంచి అసుర సాంగత్యంతో ఆర్యుల్లో వాళ్ళ చెడ్డలు ఎన్నెన్ని వచ్చేసేయో! వాటిని చూసి పెద్దవాళ్ళంతా నిరాశపడి పోతున్నారు. నేను నిరాశపడ్డంలేదు. ఆర్యసమూహాలకి వాళ్ళ పాత విషయాల గురించి సరిగ్గా బోధపరిస్తే వాళ్ళు తోవతప్పరని నేను అనుకుంటున్నాను. గంధార నగరం (తక్షశిల)లో అంగిరా అనే ఆర్యఋషి ఉన్నారని వినికిడి. ఆయన ఆర్యుల

ప్రాచీన విద్యలో నిష్ణాతుడు. ఆయన ఆర్యులకి ఆర్యమార్గంతో నడవడానికి తగిన విద్యని నేర్పుతారుట. ఆర్యుల విజయం కోసం నేను కత్తి పట్టుకున్నాను. ఇప్పుడు ఆర్యత్వాన్ని కాపాడ్డానికి కూడా ఏమన్నా చెయ్యాలని అనుకుంటున్నాను."

"ఎంత దైవికం! నేనూ అంగిరా దగ్గరకే వెళ్తున్నాను - ఆయన దగ్గర యుద్ధవిద్య నేర్చుకోడానికి."

"కాని పాల్! నువ్వు తూర్పువేపునున్న ఆర్యుల సంగతులేమీ చెప్పలేదు."

"తూర్పువేపు ఆర్యులు దావానలంలా పాకిపోతున్నారు. ఈ గంధార్‌కి తర్వాత ఉన్న భూమిని మేం మద్రులం తీసుకున్నాం. దాని తర్వాత దాన్ని మల్లులు తమ జనపదంగా (సమూహపుభూమి)చేసుకున్నారు. ఇలాగ్గానే కురులు, పాంచాలులు మొదలైన సమూహాలు కూడా పెద్ద పెద్ద ప్రదేశాల్ని స్వంతం చేసుకున్నారు."

"అలా అయితే అక్కడ చాలా పెద్దసంఖ్యలో ఆర్యులు ఉన్నారన్నమాట!"

"మరీ అంత ఎక్కువగా లేరు. ముందుకు వెళ్తున్నకొద్దీ అసురుల సంఖ్య, తదితరుల సంఖ్య పెరుగుతూ కనపడుతుంది."

"ఇంకా ఇతరులెవ్వరు మిత్రమా?"

"అసురులు రాగివర్ణంలో ఉంటారు. తూర్పువేపు మరోరకం మనుషులు ఉన్నారు. వాళ్ళని కోలులంటారు. బొగ్గంత నల్లగా ఉంటారు. ఈ కోలులు గ్రామాల్లోనూ ఉంటారు. అడివిలో మృగాల్లాగానూ ఉంటారు. అడివికోలుల ఎన్నో ఆయుధాలు రాతివే!"

"అలా అయితే ఆర్యులకి అనార్యులతో చాలా పోరాడాల్సి వస్తోందన్న మాట."

"తలపడి పోరాడ్డం ఇప్పుడు బాగా తక్కువ. ఆర్యుల గుఱ్ఱాల్ని చూడగానే అనార్యులు పారిపోతారు. కాని వాళ్ళు రాత్రివేళప్పుడు మన ఊళ్ళమీద దాడి తీస్తున్నారు. అందుకని వాళ్ళపట్ల క్రూరంగా ఉండాల్సి వస్తోంది. దీంతో అసురులవీ (శబరులు) కోలులవి ఊళ్ళకి ఊళ్ళు నిర్మానుష్యమైపోయేయి. వాళ్ళు తూర్పువేపుకి పారిపోతున్నారు."

"అయితే పాల్! మీ వేపున అసురుల నడవడికలు ఆర్యులకి అలవడే ప్రమాదం లేదా?"

"మద్ర సమూహంలో లేదు. బహుశా మల్లుల విషయంలోనూ అంతే. ముందేమవుతుందో చెప్పలేను. మా వేపున నిజానికి అనార్యులు అడవుల్లోనే ఉండిపోయేరు."

మిత్రులిరువురి సంభాషణ చీకటిపడేంత వరకూ సాగింది. సత్రపు సంరక్షకులు వచ్చి అన్నపానాదుల గురించి అడిగివుండకపోతే ఇంకా ఆ సంభాషణ బహుశా సాగుతూనే ఉండి ఉండేది. సత్రం గ్రామస్థులు కట్టించినది. అందులో అందరు యాత్రికులకీ, అంటే పీతకేశులకి ఉండడానికి ఏర్పాట్లు ఉన్నాయని వేరే చెప్పాల్సిన

అవసరం లేదు - ఖాద్యసామగ్రి లేనివాళ్ళకి సత్రంనుండి పిండి, గోమాంసం సూప్తా యిస్తారు. సామాన్లు యిచ్చినా లేదా వాటికిబదులు మరేమన్నా వస్తువు యిచ్చినా సత్రపు సంరక్షకురాలు భోజనం వండిపెడుతుంది. సోమానికి సురకి ఈ సత్రం చాలా పేరున్నది. వరుణుడూ పాల్ నిప్పుమీదకాల్చిన గోమాంసంతోనూ సురతోనూ తమ స్నేహాన్ని మరింత గట్టిపరుచుకున్నారు.

## 2

అంగీర ఋషి సింధునదికి తూర్పువేపునున్న గంధారసమూహానికి అందరి కన్నా పెద్ద అధికారిగా జనపతిగా పనిచేశారు. పుష్కలావతి (చార్‌సద్దా) నుంచి మొట్టమొదటి తరం తర్వాత అసురులు వలసవెళ్ళిపోవడం మొదలుపెట్టేరు. రెండో తరంలో కునార్ తీరంనుంచి వచ్చిన గంధార సమూహపు ఓ శాఖ పశ్చిమ గంధారని ఓడించింది. దాంతో చావగా మిగిలిన అసురులు అతిశీఘ్రంగా పశ్చిమ గంధార నుండి పారిపోవడం మొదలుపెట్టేరు. ఆ తర్వాత ముప్పై ఏళ్ళకి సింధుకి తూర్పు భూభాగం పైన గంధారులు మద్రసమూహం వారూ దాడిచేశారు. వితస్తా (ఝీలం) సింధులకి మధ్యనున్న భూభాగం గంధారులూ, వితస్తా ఐరావతి (రావి)లకి మధ్య భూభాగాన్ని మద్రులూ తమతమ భాగాలుగా పంచు కున్నారు. అవే తర్వాతర్వాత తూర్పు గంధారం, మద్ర జనపదం అన్న పేర్లతో ప్రసిద్ధిచెందాయి. ఈ ప్రథమ దేవాసుర సంగ్రామంలో రెండు జాతులవాళ్ళూ అమా నుషంగా క్రూరంగా ప్రవర్తించడంలో ఒకరితో ఒకరు పోటీపడ్డారు. దాని ఫలితంగా గంధారంలో బొత్తిగా లేకుండానూ, మద్రలో చాలాతక్కువగానూ అసురులు మిగిలారు. కాని కాలం గడుస్తున్న కొద్దీ అసురులతో ఉన్నా శత్రుత్వం తక్కు వవుతూ వచ్చింది. పీతకేశులూ తమ యుద్ధపు క్రూరత్వాన్ని తగ్గించుకున్నారు. ఇంతేకాదు- వరుణ సౌవీరుడు చెప్పినట్టుగా పీతకేశుల మీద అసురుల ప్రభావం అనేక విషయాల్లో కనిపించసాగింది. అంగిరాఋషి వక్షుతీరం నుండి వస్తున్న ఆర్య సంప్రదాయాలు తెలిసిన గొప్పపండితుడే కాదు - ఆయన ఆర్యులు తమ రక్తాన్నీ తమ ఆచార వ్యవహారాలనీ పరిశుద్ధంగా ఉంచుకోవాలనికూడా చెప్పేవాడు. సంప్ర దాయాల్ని విడవకూడదని చెప్పేవాడు. అందుకే తూర్పు గంధారలో అశ్వమాంస భక్షణాన్నీ - ఓ రకంగా లేకుండానే పోయింది- అశ్వపోషణనీ ప్రోత్సహించి పునః స్థాపించేడు. ఆర్యత్వం అంటే ఆయనకున్న ప్రేమా, ఆయన విజ్ఞానం, యుద్ధ విద్యలో ఆయనకున్న ప్రావీణ్యం - దిశదిశలా మారుమోగడం వల్ల దూరదూర ప్రాంతాల్లో ఉన్న ఆర్యజనపదాల నుంచి కూడా ఆర్యకుమారులు ఆయన దగ్గర విద్యాబుద్ధులు నేర్చుకోడానికి రావడం మొదలుపెట్టేరు. భవిష్యత్తులో గంధార పురంలో అంగిరా వేసిన ఈ విత్తు తక్షశిల రూపంలో ఓ మహావృక్షంగా అవుతుందని

ఆ కాలంలో ఎవరికైనా ఎలా తెలుస్తుంది? ఆయన నాటిన జ్ఞానాంకురం మహావృక్షం అవుతుందనీ, దాని నీడలో ఆ తియ్యటిపళ్ళకోసం వందలాది యోజనాల నుంచి ఆర్యజ్ఞానాన్ని ఆకాంక్షించేవారు, ఆర్యవిద్యంటే ప్రీతి ఉన్నవాళ్ళు వస్తారని ఏం తెలుస్తుంది?

అంగిరాఋషి అరవై అయిదేళ్ళవాడు. పండిపోయిన జుట్టూ, నాభిస్థానం వరకూ పొడుగ్గా వేళ్ళాడుతున్న తెల్లటి మెరిసే గెడ్డం, ప్రశాంతంగా, గంభీరంగా ఉండే మొహానికి మరింత వన్నెతెచ్చాయి. భూర్జపత్రాలూ, సిరా, కలం, ఉపయోగించే కాలం రావడానికి ఇంకా ఎన్నో శతాబ్దాలు గడవాల్సి ఉంది! ఆయన అధ్యాపకం అంతా నోటితో చెప్పేదే! ప్రాచీన గీతాలనీ కవిత్వాన్నీ విద్యార్థులు పునశ్చరణ చేస్తూ కంఠస్థం చేసేవారు. దూర ప్రాంతాల నుంచి వచ్చే విద్యార్థులు తమతోపాటు ఖాద్యపదార్థాలని ఉచ్చుకోలేక పోయేవారు. అంచేత అంగిరాఋషికి విద్యార్థుల కోసం భోజనవసతితోపాటు వస్త్రాలు కూడా ఏర్పాటు చెయ్యవలసి వచ్చేది. అంగిరా తన పిత్రార్జితమైన భూముల్నే కాక తన విద్యార్థుల సాయంతో అడివిని నరికి కొత్తపొలాన్ని కూడా సేద్యంచేసేవాడు. సాలుకు సరిపోయే గోధుమలు పండేవి. అప్పటికి తోటలు పెంచే ఆచారంలేదు. అయితే అడివిలో పళ్ళు పక్వానికొచ్చే కాలంలో తన శిష్య బృందంతో ఆయన పళ్ళు పోగుచెయ్యటానికి వెళ్ళేవాడు. పొలాల్ని దున్నేటప్పుడు, విత్తులు నాటేటప్పుడూ, పంట కోసేటప్పుడూ, పువ్వుల్నీ, పళ్ళనీ, కట్టెలనీ ఏరేటప్పుడూ ఋషీ అతని విద్యార్థులూ వక్షునదీ తీరం దగ్గరా, సువాస్తుతీరంలోనూ అల్లిన గీతాలను రాగాత్మకంగా పాడేవారు. గంధారం మొత్తానికి అంగిరాదే పెద్ద అశ్వస్థం (గుర్రాలను పెంచే స్థలం). దూరదూర ప్రాంతాల వరకూ తన శిష్యుల్నీ, తన పరిచయస్థులనీ పంపి మంచి జాతైన గుర్రాలనీ, ఆడవాటినీ, మగవాటినీ కూడా వెతికించి మరీ పోగుచేసేవాడు. వాటి వంశాన్ని వృద్ధిచేశాడు. త్వరితకాలంలో పెద్ద పేరువచ్చిన సైంధవ (సింధునదీ తీరంవి) గుర్రాలు మొట్టమొదట అంగిరా అశ్వస్థంలోనే మొదలయ్యేయి. ఈ గుర్రాలేకాక అంగిరాఋషి దగ్గర వేలకొద్దీ ఆవులూ గొర్రెలూ వున్నాయి. ఆయన శిష్యులకి విద్యాధ్యయనంతోపాటు నిరంతర పని చెయ్యాల్సివచ్చేది. ఆయన కూడా మధ్యమధ్యలో వాళ్ళకి సాయంచేస్తూ ఉండేవాడు. అలా చెయ్యటం వాళ్ళకీ ఆయనకీ కూడా తప్పనిసరి. అలా చేస్తేనే శిష్యులకి అన్నవస్త్రాలకి లోటు ఉండేదికాదు.

తక్షశిలకి తూర్పువేపున ఉన్న కొండలు ఎప్పుడూ మంచినీటితో మంచి ఫలాలతో సస్యశ్యామలంగా ఉండేవి. అంగిరాఋషితోపాటు ఆ కాలంలో వరుణుని గుంపూ, పాలుని గుంపూ పశువుల మందల సంరక్షణ చేస్తున్నాయి. డేరాలబైట కాస్త దూరంగా తెల్లటి లేగదూడలూ ఎర్రటి లేగదూడలూ గెంతులు చేస్తున్నాయి. ఋషి తన శిష్యులతోపాటు బైట పచ్చనిగడ్డి మీద కూచుని ఉన్నాడు. ఆయన ఎడం చేతిలో సన్నని ఉన్ని ఏకు ఉంది. కుడిచేతితో పెద్ద కర్రతకిలీని తిప్పుతున్నాడు.

శిష్యుల్లోనూ ఒకడు తకిలీ తిప్పుతూ ఉంటే మరొకడు ఉన్నిని శుభ్రం చేస్తున్నాడు. వేరొకడు మూరెడు పొడుగుని ఏకుల్ని చేస్తున్నాడు. ఋషి ఇవాళ ప్రాచీన నవీన పద్ధతుల గురించీ, ఆర్యుల సంప్రదాయాలు, అనార్యుల సంప్రదాయాల గురించీ, చేతిపనుల్లో, వృత్తుల్లో వేటిని స్వీకరించాలి? వేటిని వదిలెయ్యాలి? బోధపరుస్తున్నారు.

"అబ్బాయిల్లారా! కొత్తవన్నీ వదిలెయ్యవలసిననీ పాతవన్నీ స్వీకరించవలసిననీ అని అనటం పూర్తిగా తప్పు. అలా చెయ్యడంకూడా సాధ్యంకాదు. వక్షు తీరంలోని ఆర్యుల్లో మొట్టమొదట రాతి ఆయుధాలకి బదులు రాగి ఆయుధాలు ప్రచారంలోకి వచ్చినప్పుడు కొంతమంది ఈ కొత్త వస్తువుని వ్యతిరేకించారు "

అంగిరా ప్రియశిష్యుడు వరుణుడు ప్రశ్నించాడు-"రాతి ఆయుధాలతో పని ఎలా జరిగేది చెప్మా?"

"ఇవాళ రాగి ఆయుధాలతో పని నడుస్తోంది అబ్బాయీ, రేపొద్దున్న ఇంత కన్నా పదునైన ఆయుధం ఏదైనా వస్తే అప్పుడూ జనం ఇలాగే ప్రశ్నిస్తారు - రాగి ఆయుధాలతో పని ఎలా జరిగేదోనని!! ఎప్పుడు ఏ ఆయుధం వాడకంలో ఉంటే మనిషి దాంతో పనిసాగించుకుంటాడు. రాతి గొడ్డళ్ళతో యుద్ధాలు జరుగుతున్న రోజుల్లో రెండు పక్షాలవారి దగ్గరా రాతిగొడ్డళ్ళే ఉండేవి. ఓ పక్షం రాగి గొడ్డలిని చేపట్టగానే రెండో పక్షానికి కూడా రాతి ఆయుధాన్ని వదిలి రాగి గొడ్డల్ని స్వీకరించవలసి వచ్చింది. అలా స్వీకరించకపోయి ఉన్నట్లైతే ప్రపంచంలో వాళ్ళు బతకగలిగేవారు కాదు. అందుకే కొత్తవాటి నన్నిటినీ త్యజించాలని అనడం తప్పు అని నేను చెప్పేది. నేను కొత్తదాన్ని వ్యతిరేకించేవాణ్ణయితే ఇంత అందమైన గుర్రాల్ని, ఇంత చక్కటి ఆవుల్ని వృద్ధి చెయ్యగలిగేవాణ్ని కాదు. మంచి జాతైన మగ గుర్రాలకీ ఆడగుర్రాలకీ పుట్టిన పిల్లలు మంచివవుతాయన్నది నేను గమనించాను. అందుకే నేను కొన్ని మంచి మగగుర్రాల్నీ మంచి ఆడగుర్రాల్నీ ఎంచాను. ఇవాళ, ముప్పై అయిదు సంవత్సరాల తర్వాత ఇప్పుడు మీరు అంగిరా సృష్టించిన గుర్రాల జాతిని చూస్తున్నారు.

అసురులు పొలాల్లో ఎరువులు వేసే చక్కటి ఏర్పాట్లు చేసేవారు. వాళ్ళు ఈ కొండల్నుంచి పారే నదులకి కాలవలు తవ్వి పొలాలకి నీరు పెట్టేవారు. గంధారలో మేం వాటినన్నిటినీ అనుకరించాం. వాళ్ళ నగర నిర్మాణ పద్ధతులు, చికిత్స చేసే పద్ధతులు యెన్నెన్నో మంచివి ఉన్నాయి. వాటిని మేం స్వీకరించాం. ఆహారానికి సంబంధించినవీ, వస్త్రాలకి సంబంధించినవీ, జీవితాన్ని రక్షించుకోడానికి ఉపయోగపడే వస్తువులు యెన్ని వస్తువులైనా సరే స్వీకరించాల్సిందే. ఇవి పాతవా కొత్తవా? ఇవి ఆర్యులవా? అనార్యులవా? అని ఆలోచించకూడదు. సువాస్తులో ఇంకొక పూర్వం ఆర్యులు నూలు వస్త్రాలంటే ఏమిటో ఎరుగరు. కాని ఇప్పుడు మనం అంతా నూలుబట్టలు కట్టుకుంటున్నాం. ఎండాకాలంలో యెంతో సుఖంగా ఉంటాయి.

అయితే విషంలా త్యజించాల్సిన వస్తువులూ యెన్నో వున్నాయి. అసురుల లింగ పూజాధర్మం మనకి గర్హనీయమైనది. వాళ్ళలో ఉన్న జాతిభేద విభజన మనం త్యజించాల్సిన సంగతి. ఎందుకూ అంటే దాన్నించి అంతమందీ తమ సమూహాన్ని రక్షించడానికి ఆయుధాల్ని చేపట్టలేరు. నిర్వీర్యత్వం పెరిగిపోతుంది. ఒకరు పెద్దా ఒకరు చిన్నా అని హెచ్చు తగ్గులు పెరిగిపోతాయి. అసురులతో మనకి రక్తసంబంధం ఉండకూడదు. ఆ సంబంధం ఉందీ అంటే మనమూ అసురులంగా తయారవడానికి మార్గం ఏర్పడిపోతుంది. దాంతో ఆర్యుల్లోనూ నానావృత్తులకి రకరకాలైన చేతి పనులకి సంబంధించిన జాతులు చిన్నవీ పెద్దవీ ఏర్పడిపోతాయి."

"రక్త సంబంధాన్ని ఆర్యులంతమందీ చెడ్డదని అనుకుంటున్నారా?" పాల్ అడిగేడు.

"ఆహా. అయితే ఆ విషయంలో తీసుకోవల్సినంత జాగ్రత్తా శ్రద్ధా తీసుకోవడం లేదు. అసుర స్త్రీలకో, కోల స్త్రీలతో ఆర్యులు శారీరక సంబంధాలు పెట్టుకోడం లేదూ?"

"సరిహద్దు ప్రాంతాల్లోని వారు శారీరక సంబంధాలు పెట్టుకుంటున్నారు. అసురపురాల్లోని వేశ్యల దగ్గరికి మన భటులు వెళ్ళడం సర్వసామాన్యం అయిపోయింది" అన్నాడు వరుణుడు.

"దీని పరిణామం ఏమవుతుంది? వర్ణసంకరం పెరిగిపోతుంది. అసురుల్లోనూ పీతకేశాలతో అమ్మాయిలూ, అబ్బాయిలూ పుడతారు. దాంతో మోసపోయో, భ్రమలోపడో ఆర్యులు వాళ్ళని తమలో చేర్చుకుంటారు. ఇహ రక్త పారిశుద్ధ్యం ఎక్కడుంటుందీ? అందుకే రక్త పారిశుద్ధ్యానికి మన స్త్రీలూ, పురుషులూ చాలా జాగ్రత్త వహించాలి. ఇదేకాదు, ఆర్య జనపదాల్లో మనం బానిసల ఆచార పద్ధతిని స్వీకరించకూడదు. రక్త పారిశుద్ధ్యం పాడవడానికి ఇంతకన్నా ప్రమాదకరమైనది మరోటి లేదు. ఆర్య జనపదాల దగ్గర అనార్యులు నివసించకుండా ఉండేటట్టు ప్రయత్నం చేయడం అవసరం అని కూడా నేనంటాను.

అన్నిటికన్నా ప్రమాదకరమైనదీ, అన్ని చెడుగులకీ మూలం అయినదీ అసురుల రాజ్యవిధానం. దానిలో ఓ భాగమే వాళ్ళ పురోహితుల ఆచారపద్ధతీను. అసుర సమూహానికి ఏ హక్కూ లేదు. అసురరాజు ఎలా చెప్తే అలా నడవడం తన ధర్మమని ప్రతి అసురుడూ అనుకుంటాడు. ప్రజలకి సంబంధించిన అన్ని విషయాలకి బాధ్యత మీదనున్న దేవుళ్ళదనీ, దేవుళ్ళ తర్వాత రాజు వహిస్తాడనీ, సమూహానికి ఏం చెయ్యడానికిగాని ఏమన్నా చెప్పడానికిగాని హక్కులేదనీ, రాజు సాక్షాత్తూ భూమ్మీద ఉన్న దేవుడనీ అసుర పురోహితుడు ఉపదేశిస్తూ ఉంటాడు. శివి-సౌవీరులు ఇంద్రపదవిని రద్దుచేశారని విన్నప్పుడు నాకు చాలా సంతోషం కలిగింది. ఆర్యుల్లో ఇంద్రుడికి ఎప్పుడూ అసుర రాజుకున్నంత స్థానంలేదు. ఇంద్రుడు సమూహంద్వారా

ఎన్నుకున్న ఓ పెద్ద యోధుడు మాత్రమే. సమూహం మీద తన శాసనం చలాయించే ఏ హక్కూ అతనికి లేదు. అయినా ఆ పదవి ప్రమాదకరమైనది. కొంత మంది ఆ పదవిని చోటుచేసుకుని ఆర్యుల్లోనూ రాజ్యాధికార సంప్రదాయాన్ని ప్రవేశ పెట్టాలని ప్రయత్నించారు. ఆర్యులు తమ ఆర్యత్వాన్ని నిలుపుకుందామని అనుకుంటే ఏ వ్యక్తికీ రాజుకుండే అధికారాలు ఇవ్వకూడదు. ఆర్యుల్లో అసుర ధర్మాలంటే చాలా ఏవగింపు ఉంది. అయితే ఆర్యుల్లో ఏ రోజైతే రాజు అన్నవాడు వస్తాడో ఆ రోజు అసురుల్లో ఉన్నట్లే పురోహితుడు కూడా వస్తాడు. ఇహ అప్పుడు ఆర్యత్వం అంతరించి పోయిందనే అనుకోండి. ఆ సమూహం శ్రమఫలితాన్ని ఐశ్వర్యాన్ని రాజు అనుభవిస్తాడు. దేవతల దీవనలు పొందడానికి పురోహితుడికి లంచం ఇచ్చి తనవేపు తిప్పుకుంటాడు. ఇల్లాగ్గా రాజూ పురోహితుడూ కలిసి సమూహాన్ని తమ బానిసలుగా చేసేసుకుంటారు.

ఆర్యుల పాత సంప్రదాయాల్ని మనం గట్టిగా అమలుపరచాలి. ఏ ఆర్య సమూహమన్నా వాటిని వదిలేస్తే ఆర్యజాతి నుండి దానిని బహిష్కరించాలి. వెలి వెయ్యాలి."

# 3

సౌవీరకి దక్షిణప్రాంతం(కరాచీకిదగ్గర)నుంచి వరుణునికి ఈ మధ్య చాలా విచారకరమైన వార్తలు వస్తున్నాయి. ఆఖరి అసుర దుర్గం పడిపోయిన తర్వాత ఆర్యుల్లో బాగా అంతఃకలహం ఆరంభమయ్యేట్టు ఉందని తెలిసింది. వరుణుడు తన గురువుతో సౌవీరసమస్య గురించి ఎన్నోసార్లు అన్ని కోణాల నుంచి చర్చించాడు. ఈ కలహం మొదట సౌవీరలో పుట్టినప్పటికీ ఈ అంతఃకలహాలు ఆర్య సమూహాలన్నిటికీ సంభవిస్తాయని అంగిరాఋషి అభిప్రాయపడుతున్నారు. ఆర్యులు మొదట్నించీ వ్యక్తి కన్నా సమూహపు శాసనానికి ఎక్కువ విలువ ఇస్తున్నారు. అటు అసురుల్లో నిరంకుశ రాజ్యాధికారాన్ని చూసి ఎంతోమంది ఆర్యనాయకులకు అధికారమన్నా ఐశ్వర్య భోగాలన్నా లోభం కలగవచ్చు. ఈ రెండు మనఃప్రవృత్తులకీ మధ్య తప్పకుండా సంఘర్షణ జరిగితీరుతుంది. అసురుల సంఖ్య ఎక్కువగా ఉన్న జనపదంలో ఈ సంఘర్షణకి ఎక్కువ సావకాశం ఉంది. ఎంచేతా అంటే అక్కడ ఓడిపోయిన అసురులు ఆర్యుల్లో అంతఃకలహాలు పెట్టి, తాము లాభం పొందాలని చూస్తారు.

ఎనిమిదేళ్ళ తర్వాత సౌవీరపురం (రోరుకీ, రోడీ) వార్తలు మరింత విచారకరంగా ఉండడంతో వరుణుడికి గంధారపురం వదిలివెళ్ళాల్సి వచ్చింది. సత్రంలో కలిసిన మొదటి మిత్రుడు మాద్రుడు కూడా అతనితో కలిసి బయల్దేరేడు. గంధార సరిహద్దులు దాటి వాళ్ళు ఉప్పు కొండలున్న సింధు జనపదానికి చేరుకున్నారు. ఉప్పు

గనుల్లో పనిచేసేవారిలో అసురులే(వ్యాపారస్థులు, గ్రామికులు) ఇప్పటికీ ఎక్కువగా ఉన్నారు. పీతకేశుల మీద దాని చెడ్డ ప్రభావం పడ్డది. వాళ్ళలో సోమరితనం ఎక్కువైంది. వాళ్ళు తమ పనిని అనార్య గ్రామికులచేత చేయించడానికి ఎక్కువ ఇష్టపడేవారు. తమ పని గుర్రపుస్వారీ చేస్తూ కత్తి తిప్పి యుద్ధం చెయ్యడమేనని అనుకునేవారు. అనార్యులకి తమ ఎదుట అసురరాజుల్లాంటి నిరంకుశాధికారాన్ని చూపించే ఆర్య శాసనాధికారానికి అంకురార్పణ చెయ్యడానికి వీలైన మంచిస్థలాలు కనబడుతున్నాయి. కాని ఉప్పుకొండలు దాటేక సౌవీరుల ప్రథమస్థలం (మూలస్థానం - ముల్తాను) చేరేక అక్కడ పరిస్థితి మెరుగ్గా కనిపించింది. ఇక్కడ ఉంటున్న వాళ్ళంత మందీ ఆర్యులే. భరించలేని వేడిని సహిస్తూ కూడా జనపదాల్ని ఆర్యులు ఏర్పరుచుకున్నారూ అంటే అది చాలా మెచ్చుకోవలసిన సంగతే!(వరుణుడూ, పాల్ ఎండాకాలంలోనే ప్రయాణం చేస్తున్నారు. సింధునది మీద నావ ప్రయాణం చేస్తే, ప్రయాణం ఇంత కష్టంగా ఉండేదికాదు.)

సౌవీరపురం(రోరుక్, రోడీ)లో ఎండవేడి గురించి చెప్పేదేముంది! ఆ వేడి వాళ్ళని విపరీతంగా బాధపెడ్తోంది. ఆర్యుల్లో అప్పటికింకా వ్రాత సంకేతాలు (లిపి) ప్రచారంలోకి రాలేదు. అంచేత అప్పుడప్పుడూ సౌవీర బేహారుల ద్వారా వరుణుడు తన మిత్రులకి పంపిన సందేశాలు వాళ్ళకి పూర్తిగా అందలేదు. ఈ సమయంలో అతనికి అసురుల లిపి ఎన్నోసార్లు జ్ఞాపకానికొచ్చేది. సౌవీరపురం చేరేక వ్యవహారం చాలా దూరం వెళ్ళిందని అతనికి తెలిసింది. సౌవీరపురంలోనే సుమిత్రుణ్ణి సమర్థించేవాళ్ళు చాలా తక్కువ మంది ఉన్నారు. అయితే దక్షిణ సౌవీరలో ఆఖరి అసురదుర్గాన్ని ధ్వంసం చేసిన సుమిత్రుడి పక్షాన్ని ఉన్న ఆర్యులు ఎక్కువ సంఖ్యతోనే ఉన్నారు. ఆ ఆఖరి దుర్గాన్ని ధ్వంసం చేసిన సందర్భంలో సేనాపతి సుమిత్రుడు అసుర పౌరులపట్ల అవసరానికి మించి దయ చూపెట్టేడు. ఆ సమయంలో వరుణుడు సుమిత్రుణ్ణి చాలా ప్రశంసించాడు. అయితే అదంతా సుమిత్రుడు వేసిన ఎత్తు అని వరుణుడికి ఇప్పుడు తెలిసింది. ఈ ఓటమి తర్వాత అసురులు ఆర్యులకి వ్యతిరేకంగా మళ్ళీ నిలబడలేరనీ ఈ దయ చూపెట్టడాన్ని సముద్రతీరంలో ఉన్న అసుర వ్యాపారస్థుల సంపత్తినీ, శక్తినీ మన వ్యక్తిగత లాభానికి ఉపయోగించుకోవచ్చనీ అతడు అనుకున్నాడు.

సుమిత్రుడు ఇప్పటికీ సేనని తీసుకుని సముద్రతీరంలో ఉన్న అసురపురంలో ఉన్నాడు. కృత్రిమపు యుద్ధాల నెపంతో అక్కణ్ణించి తిరిగి వచ్చేచూచే ఎత్తటం లేదు. వరుణుడు మొదట సమూహంలోని సామాన్య నాయకుల్ని కలుసుకున్నాడు. వాళ్ళకి సుమిత్రుని ఎత్తులూ విషయాలు స్పష్టంగా తెలీదు. వ్యక్తిగత ద్వేషం కారణంగా కొంతమంది జననాయకులు సుమిత్రుణ్ణి వ్యతిరేకిస్తున్నారనే వాళ్ళు అనుకుంటున్నారు. ఆ తర్వాత అతడు ప్రధాన నాయకుల్నందర్నీ కలుసుకున్నాడు. ఆ నాయకులే సమూహపు శాసన భారాన్ని వహించినవారు. వాళ్ళు అన్ని విషయాలూ చెప్పేరు.

అయితే సుమిత్రుడి చెడునడత గురించి వాళ్ళకి స్పష్టంగా తెలిసినప్పటికీ సమూహం లోని సామాన్య ప్రజలకి, దాని గురించి స్పష్టంగా తెలీదనీ, వాళ్ళు వేరే విధంగా సుమిత్రుణ్ణి అర్థం చేసుకుంటున్నారనీ కూడా చెప్పేరు.

అసురపుర విజయంలో వరుణుడు సుమిత్రుడికి ఉపసేనానాయకుడు. ఆ యుద్ధం జరిగి తొమ్మిదేళ్లైపోయినప్పటికీ, అందుకే జనం వరుణుడి ఖడ్గకౌశలం గురించి ఇప్పటికీ పొగుడుతూ ఉంటారు. వరుణుడు సమూహానికి సుమిత్రుడి గురించిన యధార్థాలు చెప్పడానికి ముందు తానే స్వయంగా వెళ్ళి సుమిత్రుడి గురించిన నిజానిజాలు తెలుసుకోవాలని అనుకున్నాడు. ఆ ఉద్దేశంతో ఓ రోజు ఇద్దరు మిత్రులూ దక్షిణ సౌవీరకి వెళ్ళడానికి నౌక ఎక్కేరు. గంధార వ్యాపారస్థుల్లా వేషం వేసుకున్నారు. అసురపురాన్ని చూస్తే నిజంగా అది ఆర్యులపురం కాదు అసురులదే అనిపిస్తోంది. ఆ పురంలోని విపణివీదుల్లో పెద్ద పెద్ద అసుర సముద్రవర్తకుల భవనాలూ దేశ విదేశాల వస్తువులెన్నెన్నో అమ్మకాని కున్నాయి. ఎంతో మంది అసురసామంతులూ తమ తమ కుటుంబాలతో ఆ పేటల్లో ఉన్నారు. వాళ్ళ దగ్గర పూర్వంలాగానే దాస దాసీజనాలు చేతులు కట్టుకుని ఉన్నారు. విజేతలైన ఆర్యులు ఎక్కడున్నారా అని వరుణుడికి జిజ్ఞాస పట్టుకుంది. సుమిత్రుడు అసురరాజు భవనంలో ఉంటున్నాడు. ఓ రోజున గంధారవర్తకుని తరపున కానుకలిచ్చి పాలమ్మాద్రుణ్ణి అతని దగ్గరకి వరుణుడు పంపేడు. పీతకేశాలూ, గౌరవర్ణమూ ఈ రెండింటిని వదిలేస్తే మిగతా అన్ని విషయాల్లో సుమిత్రుడు అసురరాజుగా మారిపోయేడని తిరిగివచ్చిన మ్మాద్రుడు చెప్పేడు. అతని నివాసం, ఆర్య సేనాపతి ఉండే నిరాడంబరమైన ఇల్లుకాదు. వెండి బంగారాలతో ధగధగమెరిసే అసురదర్బారు. అతని పరిచరులైన సైనికుల్లోనూ ఎక్కడా నిరాడంబరత లేదు. ఓ వారం తిరిగేసరికి అక్కడ అసురకన్యల నృత్యాలలోనూ మద్యపాన గోష్ఠులలోనూ ఆర్యచిహ్నాలు కనిపించాయి. ఎంతో మంది ఆర్యస్త్రీలు తమ తమ భర్తల దగ్గరకి రావాలని అనుకుంటున్నారు. అయితే ఏదో వంకలు పెట్టి వాళ్ళని రానీయకుండా చేస్తున్నారు. ఎన్నోసార్లు తన భార్య సందేశాలు పంపినా సుమిత్రుడు ఆవిణ్ణి రానివ్వలేదు. అతడు అసుర పురోహితుని కూతురుతో ప్రేమలో పడ్డాడు. అంతేకాదు, నగరంలోని ఎంతో మంది అసుర స్త్రీలు అందమైనవారు అతని అంతఃపుర పరిచారికలయ్యేరు. తన ఆర్య సైనికులకీ అతడు అలాంటి విశృంఖలమైన స్వేచ్ఛనే ఇచ్చేడు. బైట నుంచి ఆర్యులు వస్తే దాసులచేత ఏదో ఓ గల్లంతు చేయించేవాడు. ఉపద్రవం కలిగించేవాడు. దాంతో కొట్టుకోవడాలు, చంపుకోడాలు దొమ్మీ ఆయ్యేది. ఆర్యులు రావడం మానేశారు.

వరుణుడు అన్ని విషయాలు పూర్తిగా తెలుసుకుని తన మిత్రునితోపాటు చల్లగా అక్కణ్ణించి సౌవీరపురానికి ప్రయాణమయ్యేడు.

సుమిత్రుడు తన బలాన్ని చాలా పెంచుకున్నాడనీ, ఇప్పుడిహ అసుర పురంలో ఆర్య యోధులతోనేకాక అసురశక్తినీ యెదురుకోవలసి వస్తుందనీ, దీని

కోసం సన్నద్ధమై అసలు విషయాలు ప్రజలకి చెప్పాలనీ వరుణుడు సౌవీరపురం లోని జననాయకులకి తెలియచెప్పేడు.

వరుణుడు నృత్యదర్బారులో అందరికీ ప్రీతిపాత్రుడు. సంవత్సరాల తరబడి తమభర్తల మొహం యెరగని ఆర్య స్త్రీలు ఈ అందమైన నాట్యకారుని నోట ఏకాంతంలో తమ భర్తలు అక్కడ చేస్తున్న పనుల గురించి విని వాటిని పూర్తిగా నమ్మేరు. ఆ నోట ఆ నోట ఈ విషయాలు చాలా వేగంగా అంతటా తెలిసి పోయేయి. వరుణుడు కవికూడా! పతి వియోగంతో బాధపడుతున్న ఆర్య స్త్రీల భావా లను పాటలుగా అసుర కాన్యలను శపిస్తూ కట్టేడు. సుమిత్రుని స్వార్థాన్నీ విలాస జీవితాన్నీ ఆ పాటల్లో పొందుపరిచేడు. ఈ పాటలు దావానలంలా సౌవీర లోని ఆర్య గ్రామాలన్నిటిలో అంటుకున్నాయి. ప్రతి ఊళ్ళోనూ ఈ పాటలే విన పడ్డం మొదలెట్టేయి. ఆఖర్ని అతడు ఆర్య స్త్రీలని కొద్ది మందిని వాళ్ళ వాళ్ళ భర్తల దగ్గరికి పంపించాడు. వాళ్ళని తిరస్కరించి వారి భర్తలు తిప్పి పంపేయ డంతో పరిస్థితి మరింత విషమించింది. సుమిత్రుణ్ణి తిరిగి రమ్మని కోరినా అతడు రావడానికి అంగీకరించ లేదు. అతని స్థానంలో వరుణున్ని సేనానాయకుడిగా చేసి అపారమైన ఆర్యసేనని తీసుకుని అసురపురానికి ప్రయాణం కట్టేరు. వరుణుడు యెదురుతిరిగాడని తెలియగానే సుమిత్రుని సైన్యంలో కలకలం పుట్టింది. వాళ్ళలో వాళ్ళు కలహించుకున్నారు. ఎంతోమంది తమ అనార్య ప్రవర్తనకి నిజంగానే పశ్చా త్తాపపడ్డారు. ఆ మిగిలిన సైన్యంతో కలిసి యుద్ధంచేసి గెలిచే ఆశ సుమిత్రుడికి లేదు. అంచేత వరుణుడికి అసురపురాన్ని అప్పగించి సౌవీరపురం తిరిగి వెళ్ళి పోతానని ఆఖరికి అతడు తెలియచేశాడు. ఈ ప్రకారంగా ఆర్య సమూహం మొదటి పరీక్షలో ఉత్తీర్ణులయ్యేరు. వరుణుడు అసురులని వెంటాడి తరమలేదు. వాళ్ళి ప్పుడు అస్త్రాలతో యుద్ధం చేయడం లేదు. ఆర్యుల్ని అసురుల ప్రభావానికి దూరంగా ఉంచడానికి అతడు వేరే ఓ ఆర్యపురాన్ని ఏర్పరచేడు. అంగిరా ఋషి చెప్పిన విషయాలనెన్నిటినో ఆచరణలో పెట్టసాగాడు.*

---

* ఇది నేటికి నూట ఇరవై అయిదు తరాలకి పూర్వం జరిగిన ఆర్య కథ.

# సు దా సు డు

దేశం : కురుపాంచాల (పశ్చిమ సంయుక్త ప్రాంతం)
జాతి: వైదిక ఆర్యులు, కాలం : క్రీస్తుకు పూర్వం 1500.

వసంతకాలం అయిపోవస్తోంది. చనాబ్ (చంద్రభాగ) నది పల్లపు భూముల్లో కనుచూపుమేర వరకూ పండిన గోధుమ పొలాలు బంగారువన్నెతో గాలి తాకిడికి ఉయ్యాలా లూగుతూ అలల అలలుగా కనిపిస్తున్నాయి. వాటి మధ్య అక్కడక్కడ స్త్రీ పురుషులు పాటలుపాడుతూ పంటకోస్తున్నారు. పంట కోసేసిన పొలాల్లో మొలిచిన పచ్చగడ్డిని మెయ్యడానికి ఆడగుర్రాలనీ వాటిపిల్లల్నీ వదిలేరు. ఎండలో ఓ బాటసారి చేతికర్ర పట్టుకుని నెమ్మదిగా వెళ్తున్నాడు. అతడు తలకి చింకిరి గుడ్డని తలపాగాగా చుట్టుకోవడం నుంచి అతని తల ముందు భాగంలో బూడిదరంగు జుట్టూ జనపనారలా కనపడుతోంది. ఒంటిమీద ఓ పాత దుప్పటి చుట్టబెట్టుకున్నాడు. మోకాళ్ళవరకూ పంచకట్టుకున్నాడు. దాహంతో అతని నోరు ఎండిపోతోంది. ముందునున్న గ్రామానికి చేరిపోగలనన్న ధైర్యంతో ఉన్నవాడు కాస్తా తోవ పక్కనే ఉన్న ఓ మట్టి నుయ్యినీ చిన్న జమ్మిచెట్టునీ చూసి ఇంక ఓపికపట్ట లేకపోయేడు. మొదట తలపాగా గుడ్డనీ, ఆ తర్వాత కట్టుపంచెతోనూ, ఆ పిమ్మట ఆ రెండింటినీ జోడించి నూతి నీళ్ళలోకి ముంచడానికి ప్రయత్నించాడు. కాని లాభం లేకపోయింది. మరేం చేసేదిలేక నిరాశగా పక్కనున్న చెట్టుకి ఆనుకుని కూర్చున్నాడు. ఇహ అక్కణ్ణించి లేవడం తనవల్లకాదని అతడు అనుకున్నాడు. ఆ సమయానికి ఓ భుజాన్ని తోలుతిత్తీ, రెండో భుజాన్ని తాడూ, చేత్తో తోలు బాల్చీ పట్టుకుని ఓ అమ్మాయి అటువస్తూ కనిపించింది. నిరాశతో కూచున్న బాటసారికి ఆశకల్గింది. యువతి నూతి దగ్గరకొచ్చి తోలుతిత్తిని కింద పెట్టింది. బాల్చీని నూతిలోకెయ్యబోతూన్న సమయంలో ఆవిడ దృష్టి బాటసారిపై పడ్డాది. అతని మొహం వాడిపోయింది. పెదిమలు పగిలిపోయి ఉన్నాయి. దవడలు తోతుకుపోయేయి. కళ్ళు గుంటలుపడి ఉన్నాయి. పాదరక్షలు లేక పాదాలు దుమ్మూ ధూళీ కొట్టుకొని ఉన్నాయి. అయినప్పటికీ అతడు యువకుడు అని తెలుస్తూనే ఉంది. సువర్ణ కేశాలతో. కంచుకాన్ని కట్టుకున్న ఒంటిమీద ఓణీకప్పుకునీ, లుంగీ వేసుకుని సామాన్యమైన వేషధారణతో ఒద్దికగా ఉన్న ఆ అమ్మాయిని బాటసారిచూశాడు.

ఎండరో నడవడాన్ని అతని మొహం బాగా కందిపోయింది. నుదుటిమీదా, పై పెదిమ మీదా చెమట పట్టి ఉంది. ఆ అమ్మాయి ఆ అపరిచిత యువకుణ్ణి కాస్సేపు చూసి మాద్రులకి స్వాభావికమైన చిరునవ్వుతో ఆ యువకుని దాహాన్ని సగం తీరుస్తూ తియ్యటి కంఠంతో ఇలా అంది—"నీకు దాహం వేస్తున్నట్టుంది సోదరా! అవునా?"

"అవును, నాకు చాలా దాహంగా ఉంది." జారిపోతున్న ధైర్యాన్ని కూడ దీసుకొని ఆ యువకుడు చెప్పేడు.

"అయితే నేన్నీళ్ళు తెస్తానుండు."

యువతి బాల్చీలో నింపే సమయానికి యువకుడు ఆమె దగ్గరకొచ్చి నిల్చు న్నాడు. అతని విశాలకాయం, దేహపుతీరూ అతడు అసాధారణమైన పౌరుషం ఉన్న వాడని చెప్పక చెపుతున్నాయి. తోలుతిత్తికి వేళ్ళాడుతున్న తోలు గ్లాసుని బాట సారి చేతికిచ్చి యువతి బాల్చీలో నీళ్ళు అందులో పోసింది. బాటసారి పెద్దగుటక వేసి మొహం కిందకి వంచి కూర్చున్నాడు. ఒక్క గుక్కలో గ్లాసులో ఉన్న నీళ్ళన్నీ తాగేశాడు. అతని చేతిలోంచి గ్లాసు జారిపోయింది. తనని తాను సంబా ళించుకోపోయి అతడు కూడా వెనక్కి తిరగబడిపోయేడు. లిప్తపాటు యువతి భ్రమాన్పడి నిల్చుండిపోయింది. కళ్ళు తేలిపోయి యువకుడు స్పృహతప్పి పోడాన్ని ఆవిడ చూసింది. వెంటనే తన తలకి కట్టుకుని ఉన్న రుమ్మాలుని విప్పి నీటితో తడిపి ఆవిడ యువకుని మొహాన్ని నుదుటిని తుడవడం మొదలుపెట్టింది. కొన్ని క్షణాల తర్వాత అతడు కళ్ళువిప్పేడు. అతడు సిగ్గుపడుతూ క్షీణ కంఠంతో— "అమ్మాయీ, నీకు కష్టం కలిగించాను. నాకు చాలా విచారంగా వుంది" అన్నాడు

"నాకేం కష్టం లేదు. ఎందుకలా అయింది? నాకు చాలా బయంవేసింది."

"మరేం లేదు. ఖాళీ కడుపుని దాహంతో చాలా నీళ్ళు తాగేసాను. ఇవ్వా డింకేం ఫర్వాలేదు."

"ఖాళీ కడుపా?" అని బాటసారిని ఇంకేం మాట్లాడనివ్వకుండా యువతి అక్కణ్ణించి ఓ పరుగు పెట్టింది. కాస్సేపటిలో ఓ గిన్నెతో పెరుగూ, పిండీ, తేనే తెచ్చింది. యువకుడి మొహంలో సిగ్గూ మొహమాటాన్ని చూసి ఆ అమ్మాయి "నువ్వేం మొహమాటపడకు బాటసారీ! నా అన్నయ్యా ఒకడు ఎన్నో ఏళ్ళ క్రితం ఇల్లువదలి వెళ్ళిపోయేడు. నీకిమ్మాత్రం సాయంచేస్తున్నప్పుడు నాకు మా అన్నయ్య జ్ఞాపకం వస్తున్నాడు.

బాటసారి గిన్నెని తీసుకున్నాడు. యువతి బాల్చీతో నీళ్ళు తీసి ఇచ్చింది. పిండి కలుపుకుని నెమ్మది నెమ్మదిగా యువకుడు తాగాడు. అది తాగిన తర్వాత అతని వాడిపోయిన మొహం కాస్త తేటపడ్డాది. ఎంతో నిగ్రహం ఉన్న ఆ యువ కుడు తన చూపులతో మౌనంగా కృతజ్ఞత తెలుపుతూ మాటల్లో కూడా ఏదో చెప్పాలని అనుకుంటూ ఉంటే అతని మనస్సులోని మాటని గ్రహించిందా అన్నట్టు

ఆ యువతి "సంకోచపడాల్సినదేం లేదు సోదరా; నువ్వు చాలా దూరం నుంచి వస్తున్నట్టున్నావు" అన్నాది.

"అవును, చాలా దూరం నుంచి. తూర్పు వేపు నుంచి, పాంచాల నుంచి."

"ఎక్కడికి వెళ్తున్నావు?"

"అక్కడికీ ఇక్కడికీ ఏం లేదు, ఎక్కడికైనా సరే!"

"అయినా-"

"ప్రస్తుతానికి ఏదన్నా పని దొరికితే బాగుణ్ణని ఉంది. తిండీ, గుడ్డకి కొరత లేకుండా."

"పొలాల్లో పని చేస్తావా?"

"ఎందుకు చెయ్యనూ? దున్నడం, నాటడం, పంటకొయ్యడం అన్నీ చెయ్యగలను. కళ్ళాల్లో కూడా పని చెయ్యగలను. గుర్రాల్నీ ఆవుల్నీ మేపగలను. ఇప్పుడంటే క్షీణించి ఎండిపోయేను కాని నా ఒంట్లో బలం ఉంది. కొద్ది రోజుల్లో మళ్ళా ఎంత బరువుపనైనా చెయ్యగలుగుతాను. అమ్మాయీ!! ఎప్పుడు ఎవరి దగ్గర నేను పనిచేసినా వాళ్లెవరూ కోపగించుకోడం జరగలేదు."

"అలా అయితే మా నాన్న నిన్ను పనిలోకి తీసుకోవచ్చు. నీళ్ళుపట్టుకుని నేను వెళ్తున్నా, నాతో పాటురా."

యువకుడు ఆ నీటి తోలుతిత్తిని తను తీసుకువెళ్తానని ఎంతగానో ప్రయత్నించాడు. కాని యువతి ఒప్పుకోలేదు. పొలంలో ఓ ఎర్రడేరా వేసిఉంది. డేరా బైటని దగ్గర దగ్గర ఓ నలభైమంది స్త్రీ పురుషులు కూర్చుని ఉన్నారు. వాళ్ళలో ఈ యువతి తండ్రి ఎవరో యువకుడు పోల్చుకోలేకపోయేడు. అందరి ఒంటినీ ఒకేలాంటి సామాన్యమైన బట్టలు, ఒకేలాంటి పచ్చనిజుట్టు, తెల్లటి శరీరాలు, చీకూ చింతా లేని మొహాలు. యువతి తోలుతిత్తినీ బాల్చీని మధ్యలో పరిచి ఉన్న చర్మం మీద దింపింది. ఆ తర్వాత అరవై ఏళ్ళ ముసిలాయన దగ్గరకి వెళ్ళింది. ఆ ముసిలాయన మంచి ఆరోగ్యంతో బలంగా పుష్టిగా ఉన్నాడు.

"ఈ పరదేశి యువకుడికి ఏదన్నా పనికావాలట నాన్నా!"

"పొలాల్లోనా అమ్మా!"

"ఆఁ. ఏ పనైనా సరే."

"అయితే ఇక్కడే పనిచెయ్యనియ్యి. ఇక్కడ మిగతా పురుషులకి ఇచ్చే జీతమే ఇతనికీ ఇద్దాం."

యువకుడు వింటున్నాడు. ముసిలాయన ఆ మాటని మరోసారి మళ్ళీ యువకుడికి చెప్పాడు. యువకుడు ఒప్పుకున్నాడు.

"రావయ్యా అబ్బాయీ! నువ్వూరా. మేమంతా మధ్యాహ్నపు భోజనాలు చేస్తున్నాం" అని ముసిలాయన అన్నాడు.

"అర్యా! ఇప్పుడిప్పుడే మీ అమ్మాయి ఇచ్చిన పిండీ నీళ్లు తాగేను."

"ఆర్యాలేదు గీర్యాలేదు. నేను జేతా ఋభుపుత్ర మాద్రుణ్ణి. ఏం తినగలిగితే అది తిను. అపాలా! మైరేయం (పచ్చిసారాయి) అశ్వినీ క్షీరంది ఇయ్యి. ఎండ దెబ్బకి చాలా మంచిది. సాయంత్రం మాట్లాడుకుందాం అబ్బాయీ! ప్రస్తుతం నీ పేరు మాత్రం చెప్పు."

"సుదాస పాంచాలుడు"

"సుదాసకాదు, సుదాః - మంచి దానం చేసేవాడు. మీ తూర్పువాళ్ళకి భాషని సరిగ్గా మాట్లాడ్డమన్నా తెలీదా? పాంచాల జనపదం నుంచి వచ్చేవా? మంచిది. అపాలా! ఈ తూర్పువాళ్ళు మహా మొహమాటస్థులు. దగ్గరుండి భోజనం పెట్టు-సాయంత్రానికి కాస్తపని చెయ్యడానికి తగ్గట్టూ, పుంజుకునేటట్టూను!"

సుదాసుడు అపాలా బలవంతం పెడ్తే రెండు మూడు కప్పులు మైరేయాన్ని తాగాడు. కాస్త రొట్టిముక్కని తిన్నాడు. రెండ్రోజుల బట్టీ ఆకలితో ఉండడాన్ని గలి ఆకలి వేసి అసలే ఆకలి చచ్చిపోయింది.

ఎండతీక్షణత తగ్గుతున్న కొద్దీ సుదాసుడిలో చురుకుతనం హెచ్చుతూ వచ్చింది. ఆ సంగతి అతనికే తెలిసింది. సాయంత్రం గోధుమపంటని కొయ్యే డంలో అతడు ఎవరికీ తీసిపోలేదు.

రాత్రికి జనం అంతా అక్కడికి కాస్తదూరంలో ఉన్న కళ్ళాల దగ్గరున్న పాకలకి వెళ్లేరు. రాత్రి అక్కడ రెండు వందలకి పైగా పోగైన పనివాళ్ళు జేతా పొలం చాలా పెద్దదని చెప్పేరు. కళ్ళాలపాకల్లో వంట వండేవాళ్ళు తమపనిలో తాము మునిగి ఉన్నారు. ఓ పెద్ద ఎద్దుని చంపారు. దాని బొమికలు, పేగులు, కొంత మాంసాన్ని ఓ పెద్ద డేగిసాలో వేసి ఇంకా మూడు గంటలపొద్దు ఉంటూ ఉండగానే పొయ్యి ఎక్కించారు. మిగిలిన మాంసం ముక్కలని ఒక్కొక్కటీ అర్థ శేరు అర్థశేరు ఉన్నవాటిని ఉప్పులో ఉడకబెడుతున్నారు. పాకలకి బయట ఓ పెద్ద నున్నటి చదునైన మైదానం కళ్ళం కోసం ఉన్నది. దానికి ఓ పక్క పక్కనుయ్యి, నీళ్ళు నింపినతొట్టీ ఉన్నాయి. స్త్రీలూ పురుషులూ అందరూ ఆ తొట్టి దగ్గరకెళ్ళి కాళ్ళు చేతులు కడుక్కున్నారు. ఒళ్ళు కడుక్కోవాలనిపించిన వాళ్ళు ఒళ్లూ కడుక్కున్నారు. చీకటి పడ్డంతోపాటు పంక్తిగా కూచున్న స్త్రీ పురుషులకి రొట్టెలూ, మాంసపు ముక్కలూ, ముంతలతో మద్యం వడ్డించారు. సుదాసుడు మొహమాట స్థుడని అపాలా, అతణ్ణి తనదగ్గర కూచోపెట్టుకుంది. నిజానికి అతడు మొహమాట పడతాడని కూడా కాదు-ఆవిడ ధ్యాసంతా దేశాలు తిరగడానికి వెళ్ళిపోయిన తన సోదరుడి మీద ఉంది. ఆ జ్ఞాపకంతో ఆవిడ సుదాసుణ్ణి తన పక్కనే కూచోపెట్టు కుంది. భోజనాలైన తర్వాత పాటలూ నాట్యం మొదలయ్యేయి. అయితే సుదా సుడు వాటిలో పాల్గోలేకపోయేడు. కాని ఆ తర్వాత మంచి పాటగాడుగా, మంచి నర్తకుడుగా అందరికీ ప్రీతిపాత్రుడయ్యేడు.

పొలాల్లో కోతలు, కట్టివెయ్యడాలూ, నూర్పుళ్లూ నెలా పదిహేనురోజుల పాటు ఏకబిగిని సాగాయి. రెండు వారాలు తిరక్కుండానే సుదాసుడు పోల్చుకోలే నంతగా మారిపోయేడు. నీలిరంగుకళ్ళు పెద్దవిగా కాంతివంతంగా తయారయ్యేయి. బుగ్గల్లోకి సహజమైన ఎరుపువన్నె వచ్చింది. కండపుష్టి ఏర్పడింది. ఓ వారం గడ వగానే జేతా అతనికి కొత్తబట్టలు ఇచ్చాడు.

నూర్పులు దగ్గర దగ్గర అయిపో వచ్చేయి. తండ్రీ కూతురూ, సుదాసుడూ మరో ఆరేడుగుర్ని మినహాయిస్తే మిగతా అందరూ తమ తమ ధాన్యం తీసుకుని వెళ్ళిపోయేరు. వాళ్ళకి స్వంత పొలాలు చాలా తక్కువ. అంచేతే తమ పొలాల్లో కోతలయ్యేక వాళ్ళు జేతా పొలార్లో పనిచెయ్యడానికి వచ్చేరు. ఈనెలా పదిహేను రోజుల్లో జేతా, అతని కూతురూ తమ దగ్గర పనికి కుదురుకున్న యువకుడి స్వభావం బాగా తెలుసుకున్నారు. అతడు సరళస్వభావుడు. ఎప్పుడూ నవ్వుతూ సంతోషంగా ఉంటాడు. ఓ రోజు సాయంత్రం మద్యపానం అయ్యేక జేతా సుదా సుని దగ్గర తూర్పువాళ్ళ ప్రసక్తి తెచ్చాడు. అపాలా కూడా వాళ్ళ దగ్గరే కూచుని వింటోంది.

"సుదాః తూర్పువేపు నేను చాలా దూరమైతే వెళ్ళలేదు కాని పాంచాల పురాన్ని (అహిచ్ఛత్రం) చూశాను. చలికాలంలో నా గుర్రాల్ని తీసుకుని వెళ్ళేను."

"పాంచాల (రుహేల ఖండం) ఎలా ఉంది మీకు?"

"జనపదంలో ఏ లోపం, దోషంలేదు. మద్రుల్లాగే ఆ జనపదమూ ఆరోగ్య వంతంగానూ సమృద్ధివంతంగానూ ఉంది. నిజానికి అక్కడి పొలాలు ఇక్కడివాటి కన్నా ఎక్కువ సారవంతమైనవాటిగా కనిపించాయి. కాని...."

"కానీ ఏమిటి?"

"క్షమించు సుదాః! అక్కడ ఉండేవాళ్ళు మనుషులుకారు."

"మనుషులు కారా? అయితే దేవతలుంటున్నారా? దానవులుంటున్నారా?"

"వాళ్లు మనుషులుకారని మాత్రమే నే చెప్పగలను."

"నాకేం కోపంరాదండీ ఆర్యవృద్ధా! మీకెందుకలా అనిపించిందో చెప్పండి."

"సుదాః! నా పొలాల్లో పనిచేసిన వారిని రెండు వందల మంది ఆడవాళ్ళనీ మగవాళ్ళనీ నువ్వు చూశావుకదా!"

"ఆఁ చూశాను."

"నా పొలాల్లో పనిచెయ్యడం నుంచీ, నా దగ్గర జీతాలు పుచ్చుకోడం నుంచీ నా ఎదట వాళ్ళనెప్పుడున్నా గానీ, దీనత్వం చూపెడుతూ చూశావా?"

"అబ్బే! లేదు. అలా చూళ్ళేదు సరికదా అంత మందీ మీ కుటుంబపు సభ్యు ల్లాగే అనిపించారు.''

"అవునా, మరి వీళ్ళనీ మనుషులంటారు. వీళ్లు నా కుటుంబపువారు. అంత మందీ మద్ర స్త్రీలూ, మద్ర పురుషులూను! తూర్పువేపున ఇలాంటిది మచ్చుకైనా

కనపడదు. అక్కడ దాసులూ యజమానులూ కనపడతారు! మనుషులు కనపడరు. మిత్రులు కనపడరు."

"నిజం చెప్పేరు ఆర్య వృద్ధా! మనిషి విలువ నేను శత్రుదు (సత్లజ్) దాటేక ముఖ్యంగా ఈమద్రభూమికి వచ్చేక తెలుసుకున్నాను. మనుష్యుల్లా ఉండడం ఆనందించాల్సిన సంగతి.గర్వించాల్సిన విషయం, అదృష్టమూను!"

"చాలా సంతోషం అబ్బాయి! నువ్వు అపార్థం చేసుకోలేదు. తాము పుట్టిన జన్మభూమంటే అందరికీ ప్రేమ ఉంటుంది."

"దానర్థం దోషాల్ని చూడకుండా కళ్ళు మూసుకోడం అవకూడదు."

"కురు-పాంచాల ప్రాంతాల్లో ప్రయాణంచేస్తున్నప్పుడు నేను చాలాసార్లు ఆలోచించాను. అక్కడి పండితులతో కూడా చర్చించాను. ఈదోషం ఎందుకు వచ్చిందో కారణమూ తెలిసింది. అయితే దానికి విరుగుడు మాత్రం తెలియలేదు."

"ఏమిటా కారణం ఆర్యవృద్ధా!"

"పాంచాల జనపదం పాంచాలులదని అంటారు. కాని అక్కడ ఉండేవారిలో సగం మంది కూడా పాంచాలులు కారు."

"నిజమే. వలస వచ్చినవాళ్ళు బైటవాళ్ళు చాలామంది ఉన్నారు."

"బైటవాళ్ళు కాదు అబ్బాయి! మొదట్నించీ ఉన్న ఆదిమవాసులు ఎక్కువ మందీ ఉన్నారు. అక్కడున్న చేతిపనులవారు, వ్యాపారస్తులు, దాసులు అంత మంది పాంచాలురు ఆ భూమ్మీద అడుగుపెట్టడానికి ముందునుంచీ ఉన్నారు. వాళ్ళ రంగు చూశావా?"

"ఆహా, పాంచాల జనపు ఛాయకి పూర్తిగా భిన్నంగా ఉంటుంది. నల్లగానో, చామన ఛాయగానో లేదూ అంటే రాగి రంగు గానూను."

"మరి పాంచాలజనపు వర్ణం మద్రుల్లా తెల్లటి తెలుపు కదా?"

"చాలా వరకు."

"అవును చాలావరకే. ఎంచేతా అంటే ఇతరవర్ణాల వారితో సంకరం అయితే రంగులో మార్పు ఎలాగూ వస్తుంది. మద్రుల్లాగ అక్కడ ఆర్యులు — పీతకేశులు స్థిరపడి ఉంటే బహుశా అక్కడా మనుషులు ఉండి ఉండేవారనినేను అనుకుంటాను. ఆర్యులు- ఆర్యేతరుల మధ్య హెచ్చు తగ్గు భావానికి భిన్నవర్ణమే కారణం అయి ఉంటుంది."

"ఆర్యవృద్ధా ! మన పూర్వులు అసురులని చెప్పేవారిలో, అదే ఆ ఆర్యేతరుల్లో మొదట్నించీ ఈ హెచ్చు తగ్గులూ దాసులూ యజమానులూ బహుశా ఉంటూ వచ్చేరు కాబోలు! మీకీ సంగతి తెలిసే ఉంటుంది!"

"అవును. కాని పాంచాలులు ఆర్యసమూహం వారే.అందరిదీ ఒకటే నెత్తురు. అందరిదీ ఒకటే కుటుంబం. అయినా అక్కడ వీళ్ళలో కూడా హెచ్చు తగ్గుల భావం అల్లాగానే కనపడుతుంది. పాంచాలరాజు దివోదాసు నా దగ్గర కొన్ని గుర్రాలు

కొన్నాడు. ఆ సందర్భంలో అతని దగ్గరికి వెళ్ళేను. తెల్లగా పుష్టిగా ఉన్న యువకుడు. అందమైనవాడు.అయితే ఏం, అతని తలమీద ఎర్రగా పచ్చగా రాళ్ళతో పొదిగినదీ బరువైనదీ పెద్దదీ ఓ తట్ట (కిరీటం), చెవులకి పెద్ద పెద్ద కన్నాలు. వాటికి వేళ్ళాడుతున్న పెద్ద పెద్ద రింగులు. ఇంకా చేతులనీ, మెళ్ళోనూ ఇంకేవేవో తమాషా తమాషా అయినవి ఉన్నాయి ! ! వాటన్నిటినీ చూసి నాకు అతని మీద జాలివేసింది. చంద్రుణ్ణి రాహువు మింగుతున్నట్టుగా అనిపించింది. అతన్నితోపాటు అతని భార్యా ఉంది. అందంలో మద్రస్త్రీలకి ఏం తీసిపోదు. అయితే పాపం ఆవిడా ఎర్రరాళ్ళు పచ్చరాళ్ళు బరువులు దిగేసుకుని కుంగిపోతోంది!"

సుదాసుడి గుండె వేగంగా కొట్టుకోడం మొదలెట్టింది. తన మనస్సులో భావాలు తన మొహాన్ని కనిపించకుండా ఉండడానికి అతడు శాయశక్తులా ప్రయత్నం చేశాడు. అయినా సాధ్యంకాక మాటమార్చేడు- "పాంచాలరాజు గుర్రాన్ని కొన్నారా ఆర్యవృద్ధా?''

"ఆఁ తీసుకున్నాడు. మంచి ధర కూడా ఇచ్చేడు. ఎంత హిరణ్యం ఇచ్చేడో జ్ఞాపకం లేదు. కాని అక్కడ పాంచాల సమూహం వారూ అతని ముందు సాష్టాంగ పడి మొక్కడం దేవుళ్ళద్దం చూసేసరికి నాకు ఒళ్ళుతకబగమండింది-చచ్చినా సరే మద్రుడెవడు అలాంటి పని చెయ్యలేదు, అబ్బాయీ !''

"మీకు అలా చెయ్యాల్సిరాలేదు కదా ఆర్యవృద్ధా!"

"అలాచెయ్యమని ఎవరైనా అని ఉంటే నేను పోట్లాడేవాణ్ణి! తూర్పురాజులు అలా చెయ్యమని మాతో చెప్పరు. అది నుంచీ వస్తున్న పద్ధతది!''

"ఎందుకనీ?"

"ఎందుకని అడుగుతున్నావా అబ్బాయీ ! దీనికో పెద్దకథ ఉంది. పడమటి వేపుగా ముందుకి వెళ్తూ వెళ్తూ పాంచాల సమూహం యమునకీ గంగకీ హిమావాన్‌లకి మధ్య (ఉత్తర దక్షిణ పాంచాలుల) భూమికి వెళ్ళేటప్పటికి వాళ్ళు సరిగ్గా మద్రుల్లాగే ఒక కుటుంబంగా, ఒక వంశంగా ఉండేవారు. అసురులతో సాంగత్యం పెరిగింది. వాళ్ళని చూసి ఈ ఆర్య పాంచాలుల్లోని కొంతమంది సేనా నాయకులూ, రాజులూ, పురోహితులూ అవుదామని ఉవ్విళ్లూరసాగారు!''

''ఉవ్విళ్లూరేరా? ఎందుకనీ?''

"లోభం ! కష్టపడకుండా పరాయివాళ్ల సంపాదనని కాజెయ్యడానికి! ఇదిగో ఈ రాజులూ పురోహితులే పాంచాలులమధ్య భేదాలన్నీ లేవతీసారు. వాళ్ళని మనుషులుగా ఉండనివ్వలేదు." చెప్తూ చెప్తూ జేతా పని ఉండడాన్ని లేచి వెళ్ళిపోయాడు.

## 2

మద్రపురంలో (శాకలా లేక స్యాల్‌కోట్) లో జేతా సమూహంతో కలిసి సుదాసుడు నాలుగేళ్ళు గడిపాడు. జేతా భార్య చనిపోయింది. పెళ్ళైనా అప్ప

చెల్లెళ్ళో కూతుళ్ళో ఎవరో ఒకరు ఎప్పుడూ ఆయన ఇంట్లో ఉంటూ ఉండేవారు. అయితే ఎప్పుడూ ఇంట్లో ఉండే సభ్యులు జేతా, సుదాసూ, అపాలానూ. అపాలాకి ఇప్పుడు ఇరవై ఏళ్ళు. అపాలాకి సుదాసుకి ఒకరంటే ఒకరికి చాలా ప్రేమని వాళ్ళి ద్దరి ప్రవర్తనవల్లా తెలుస్తోంది. మద్రపురంలోని అందమైన అమ్మాయిల్లో బాగా అందమైన అమ్మాయిగా అపాలాని అందరూ చెప్పుకుంటారు. ఆవిడకి సరిజోడీఅయిన అందమైన యువకులు లేరన్నమాట లేదు. అలాగే సుదాసులాంటి యువకుడి సరిజోడు అయిన అందమైన యువతులకి లోటు లేదు. కాని ఎప్పుడు చూసినా సుదాసు అపాలాతోనో, అపాలా సుదాసుతోనో నృత్యం చేయడం అందరూ గమ నిస్తున్నారు. జేతాకి ఈ సంగతి తెల్సు. ఆయన కది అంగీకారమే-ఎటొచ్చీ సుదాసు మద్రపురంలో పూర్తిగా ఉండిపోవడానికి ఒప్పుకోవాలి గాని! కాని సుదాసు మధ్య మధ్య తల్లిదండ్రుల కోసం పలవరిస్తూ ఉండేవాడు. సుదాసు తన తల్లిదండ్రులకి ఒక్కడే! ఆ విషయమూ జేతాకి తెలుసు.

ఓ రోజు అపాల సుదాసూ చంద్రభాగా (చనాబ్ ) నదిలో స్నానం చెయ్యడానికి వెళ్ళేరు. చంద్ర భాగా ప్రేమికుల నది. స్నానం చేస్తున్న ప్పుడు సుదాసు ఎన్నోసార్లు అపాలా ఎర్రటి నగ్నశరీరాన్ని చూశాడు. అయితే ఇవాళ ఎంత మందో అమ్మాయిల నగ్నసౌందర్యంతో అపాలా సౌందర్యాన్ని సరిపోల్చి చూసేడేమో, ఇవాళే అపాలా సంపూర్ణలావణ్యం గురించి అతనికి పూర్తిగా తెలిసింది. తిరిగి వస్తున్నప్పుడు మాట్లాడకుండా నడుస్తున్న సుదాసుని చూసి "ఏం సుదాస్! ఇవ్వాళ నువ్వేం మాట్లాడడం లేదు! అలిసిపోయావా ఏం? చంద్రభాగా ప్రవాహంలో రెండుసార్లు ఈదడం కష్టమే!" అన్నాది.

"అపాలా! నువ్వా ఆ దరి నుంచి ఈ దరికి ఈదేవు! నా సంగతంటావా రెండుసార్లేం, తీరికంటూ ఉంటే పదిసార్లన్నా ఇట్నుంచటూ అట్నుంచిటూ ఈద గలను!"

"నీళ్ళల్లోంచి బైటికి రాగానే నీ ఛాతీ ఎంత పొంగిపోయిందో! నీ దండలు తొడలూ రెట్టింపు లావుగా కనిపించాయి."

"ఈదడం మంచి వ్యాయామం. ఈత శరీరానికి పుష్టినీ అందాన్నీ కూడ ఇస్తుంది కాని నీ సౌందర్యం ఇంకేం వృద్ధిచెందాలి! నువ్వు త్రిలోకసుందరివి!"

"నీ కళ్ళకి అలా కనిపిస్తున్నానా సుదాస్!"

"మోహంతో అంటున్న మాట కాదు అపాలా! ఆ సంగతి నీకు తెల్సు."

"నిజమే. ఓ ముద్దన్నా నువ్వు నన్ను ఎప్పుడూ అడగలేదు. మద్ర యువ తులు ముద్దులివ్వడంలో ఎంతో ఔదార్యంతో ఉంటారు మళ్ళీ!"

"అడక్కపోయినా ముద్దిచ్చి నువ్వు నీ ఔదార్యాన్ని చూపేవు."

"కాని అప్పుడు నేను నీలో నా సోదరుడు శ్వేతశ్రవుణ్ణి చూసుకుంటూ ఉండే దాన్ని."

"అయితే ఇప్పుడివ్వవా?"

"అడిగితే ముద్దివ్వనా?"

"మరి అడిగినట్లైతే నువ్వు నా దాని...."

"ఇదనకు సుదాస్! కాదని నేను దుఃఖపడాల్సి వస్తుంది."

"కాని ఆ దుఃఖం కలగకుండా చేసుకోవడమూ నీ చేతిలో ఉంది."

"నా చేతిలో కాదు, నీ చేతిలో."

"ఎలా?"

"మా తండ్రి ఇంట నువ్వు శాశ్వతంగా ఉండడానికి సిద్ధమేనా?"

ఆ సుకుమారమైన పెదిమలు ఈ కఠోరమైన మాటలని ఉచ్చరిస్తాయేమోనని ఎన్నోసార్లు సుదాసుడు భయపడుతూ వచ్చాడు. ఇవాళ పిడుగు పడ్డట్టు హఠాత్తుగా అతని చెవుల్ని బద్దలుకొడ్తూ ఆ మాటలు గుండెకి తగిలాయి. కాస్సేపటివరకూ అతని మనస్సు కలవరంతో నిండిపోయింది. అయితే తన ఆంతర్యాన్ని అపాలా పసికట్టడం అతనికి ఇష్టంలేదు.

"నేనెంతగా నిన్ను ప్రేమిస్తున్నానో అపాలా!" కాస్సేపటికి నిబ్బరం తెచ్చుకుని తననితాను నిగ్రహించుకొని అన్నాడు సుదాసు.

"నాకు తెల్సు. నా సంగతి నీకూ తెల్సు. ఎప్పటికీ నీ దాన్నై ఉండాలని నేననుకుంటున్నాను. నాన్నా దీనికి ఎంతో ఆనందిస్తాడు. అయితే నువ్వు మాత్రం పాంచాలని పూర్తిగా మర్చిపోవాలి."

"పాంచాలని వదిలెయ్యడం ఏం కష్టం కాదు. కాని అక్కడ నా ముసలి తల్లిదండ్రులున్నారు. మా అమ్మకి నేనొక్కణ్ణే సంతానం. చచ్చిపోయేలోగా ఓసారి ఆవిణ్ణి తప్పకుండా చూడ్డానికి నే రావాలని నా దగ్గర మాట పుచ్చుకుంది."

"మీ అమ్మగారికిచ్చిన వాగ్దానాన్ని నా నుంచి నువ్వు నిలుపుకోలేక పోవడం నా కిష్టంలేదు. నువ్వంటే నా కెంతో ప్రేమ సుదాస్! నువ్వువెళ్ళి పోయినా సరే, ఎప్పుడూ నిన్ను ప్రేమిస్తూనే ఉంటాను. బతుకంతా ఆఖరిశ్వాస వదిలేంతవరకూ నీ కోసం నేను ఏడుస్తూ ఉంటానన్న సంగతి నాకు తెల్సు. కాని మనం మన రెండు వాగ్దానాలనీ నిలుపుకోవాలి. నువ్వు మీ అమ్మకిచ్చిన వాగ్దానాన్నీ నేను నా మనస్సుకీ, హృదయానికీ ఇచ్చిన వాగ్దానాన్నీ."

"నీ మనస్సుకి నువ్వు ఇచ్చిన వాగ్దానం ఏమిటి అపాలా?"

"మనుషుల దేశం నుంచి అమానుషుల దేశానికి వెళ్ళనని!"

"అమానుషుల దేశం పాంచాల జనపదమా?"

"అవును; మనిషికక్కడ విలువలేదు. స్త్రీకి స్వాతంత్ర్యం లేదు."

"నేను నీతో ఏకీభవిస్తున్నాను."

"నువ్వు నాతో ఏకీభవిస్తున్నందుకు నిన్ను ముద్దాడనిస్తాను." కన్నీళ్ళతో

నిండిన చెంపలను సుదాసు పెదిమలకి ఆనించింది. సుదాసు ముద్దు పెట్టుకున్న తర్వాత "నువ్వు వెళ్ళు. ఓ సారి మీ అమ్మగారిని చూసిరా. నీ కోసం మద్రపురంలో నేను ఎదురుచూస్తూ ఉంటాను" అన్నాది అపాలా.

అపాలా మాయామర్మం లేకుండా అమాయకంగా అన్న మాటలు వినగానే సుదాసుకి తనమీద తనకే అసహ్యం కలిగింది. ఆ అసహ్యాన్ని తన మనస్సు నుండి ఎప్పటికీ మళ్ళీ అతడు తొలగించుకోలేకపోయేడు. తల్లిదండ్రులను ఓ సారి చూసి వస్తానని చెప్పి ఇంటికి వెళ్ళడానికి సుదాసు జేతా అనుమతి పుచ్చుకోగలడు. జేతా, అపాలా లిద్దరు దానికి అంగీకరించారు.

సుదాసు వెళ్ళడానికి ముందు రోజు అపాలా సుదాసుతో కలసి చాలా సమయం గడిపింది. నల్లకలువల్లాంటి నీలికళ్ళ నుంచి రోజంతా కన్నీరు కారుతూనే వుంది. ఇద్దరి కళ్ళూ అశ్రుపూరితాలవుతూనే ఉన్నాయి. వారు వాట్ని కప్పిపుచ్చుకోవాలని ప్రయత్నించనూ లేదు. ఇద్దరూ గంటల తరబడి ఒకరినొకరు ముద్దాడుతూ, తమని తాము మరిచి కౌగిలించుకుంటూ, మౌనంగా కన్నీళ్ళు నిండిన కళ్ళతో ఒకరినొకరు చూసుకుంటూ గడిపారు.

వెళ్ళేటప్పుడు అపాలా సుదాసుని తిరిగి కౌగలించుకుంది. "సుదాస్! మద్రపురంలో నేను నీ కోసం ఎదురుచూస్తూ ఉంటాను" అని చెప్పింది.

అపాలా అన్న ఈ మాట జీవితాంతం సుదాసుని గుండెల్లో నిలిచిపోయింది.

## 3

వాళ్ళమ్మ అంటే సుదాసుకి చాలా ప్రేమ. సుదాసు తండ్రి దివోదాసు మంచి పరాక్రమశాలి. వీరుడు. ధైర్యసాహసాలు ఉన్నవాడు. ఆ రాజుని ప్రశంసిస్తూ వశిష్ఠుడూ, విశ్వామిత్రుడూ, భరద్వాజుడూ* మొదలయిన మహాఋషులు యెన్నెన్నో మంత్రాలు రచించారు. అయితే ఋగ్వేదంలో ఉన్నంత మాత్రాన ఆ మంత్రాల్లో ఉన్న ముఖస్తుతి దాగిపోదు!! సుదాసుకి తన తల్లంటేనే అపారమైన ప్రేమ. ఆవిడ లాంటి వాళ్ళు ఇంకెంతెంతమందో భార్యలూ, దాసీలు ఉన్నారనీ, తను తన తండ్రికి జ్యేష్ఠపుత్రుడవడాన్నీ, పాంచాల సింహాసనానికి వారసుడవడాన్నీ తన-తల్లిని దివోదాసు కాస్త లక్ష్య పెట్టేవాడనీ సుదాసుకి తెలుసు. లేకపోతే లెక్కలేనంతమంది అందమైన పడుచులతో రాణివాసం నిండి ఉండగా పళ్ళూడిపోయిన ఈ ముసలావిడపట్ల ప్రేమ ఎందుకు చూపెడ్తాడు! ఎందుకు లెక్కచేస్తాడు? తను తల్లికి ఒక్కడే కొడుకైనప్పటికి తండ్రికి మాత్రం ఒక్కడే కొడుకుకాడు. అతడుగాని లేకుండా ఉంటే ప్రతర్దనుడు దివోదాసుకి వారసుడయ్యేవాడు.

సంవత్సరాలకి సంవత్సరాలు గడిచిపోయేసరికి అతని తల్లి తన కొడుకికక రాదని నిరాశపడిపోయింది. ఏడ్చి ఏడ్చి ఆవిడ కంటి దృష్టి మందగించింది. ఓ రోజు

ఎవరికీ తాను వస్తున్నట్టు తెలియనైనా తెలియజేయకుండా చడీచప్పుడూ లేకుండా తండ్రిని కూడా కలవకుండానే సుదాసు తన తల్లి కెదురుగా ప్రత్యక్షమయ్యాడు. కాంతిలేని కళ్ళతో తనవేపు తన తల్లి చూస్తూ ఉండడంతో "అమ్మా నేనూ! నీ సుదాసుణ్ని" అని అన్నాడు.

ఆవిడ కళ్ళలోకి వెలుగు వచ్చింది. అయినా తాను కూచున్న ఎత్తైన ఆసనం నుండి కదలకుండానే ఆవిడ - "నువ్వు నిజంగా నా సుదాసుడివే అయితే మాయమైపోడానికి అక్కడ ఎందుకు నిల్చున్నావు? వచ్చి నన్నెందుకు కౌగలించుకోవు? నీ మొహాన్ని నా ఒళ్ళో ఎందుకు దాచుకోవు?" అన్నాది.

సుదాసు తన మొహాన్ని వాళ్ళమ్మ ఒళ్ళో దాచుకున్నాడు. ఆవిడ చేత్తోనిమిరి చూసింది. మాయమైపోయే తల కాదని నిజంగానే సుదాసు వచ్చేడనీ తెలుసుకుంది. ఆవిడ అతని మొహాన్ని, బుగ్గల్ని, నుదుటిని, జుట్టుని ఎన్నోసార్లు ముద్దాడి కన్నీళ్ళతో తడిపేసింది. లెక్కలేనన్నిసార్లు కౌగలించుకుంది. తల్లి కన్నీళ్ళు ఆగేటట్టు కనిపించకపోవడంతో "అమ్మా నేను నీ దగ్గరికి వచ్చేశాను. అయినా నువ్వు ఏడుస్తున్నావెందుకమ్మా!" అన్నాడు సుదాసు.

"ఇవ్వాళ్టికి మాత్రమే నాయనా! ఈ క్షణానికే బాబూ! ఈ కన్నీళ్ళు ఆఖరి కన్నీళ్ళు సుదాసూ! నా బంగారు తండ్రీ! నా బుజ్జితండ్రీ!"

అంతఃపురం నుంచి రాజుగారికి వర్తమానం వెళ్ళింది. ఆయన పరుగు పరుగున వచ్చాడు. సుదాసుని కౌగలించుకుని ఆనందంతో కన్నీళ్ళు కార్చాడు.

రోజులూ నెలలూ గడిచాయి. నెలలు గడిచి గడిచి రెండు సంవత్సరాలుకూడా అయ్యేయి. తల్లిదండ్రి దగ్గర సుదాసు సంతోషంగా ఉండటానికి ప్రయత్నిస్తున్నాడు. అయితే ఏకాంతంగా ఉన్న సమయాల్లో అతని చెవులని బద్దలు కొడుతూ ఆ మాటలే వినిపిస్తూ ఉండేవి - "నేను నీకోసం మద్రపురంలో యెదురుచూస్తూ ఉంటాను." అతని కంటికి యెదురుగా ఆ ఎర్రటి కదులుతున్న పెదిమలు ప్రత్యక్షమౌతాయి. కన్నీళ్ళతో కళ్ళు మసకబారేంత వరకూ అలా కనిపిస్తూనే ఉంటాయి. సుదాసుకి యెదురుగా ప్రేమ రెండు రూపాల్లో ఉన్నాది - ఓ పక్క అపాలా ప్రేమ-కృత్రిమత్వం అన్నది ఎరగని సహజమైన ప్రేమ! రెండోపక్క ముసలి తల్లి ప్రేమ! వాత్సల్యంతో నిండిన తల్లి మనస్సు! నిస్సహాయురాలయిన తల్లి మనస్సుని గాయపర్చటం అన్నది, హద్దులన్నది లేని తన నీచత్వానికీ స్వార్థానికీ గుర్తుగా అతనికి అనిపించింది. అంచేత తల్లి బతికి ఉన్నంతకాలం పాంచాలని విడిచి వెళ్ళకూడదని అతడు నిర్ణయించుకున్నాడు. కాని రాకుమారుడి భోగవిలాసాలతో కూడిన జీవితాన్ని గడపడం అన్నది అతని శక్తికి మించిన దానిలా అనిపించింది. తండ్రి పట్ల ఎప్పుడూ గౌరవంతో మెలిగేవాడు. తండ్రి ఆజ్ఞలను తు.చ. తప్పకుండా పాటించేవాడు.

---

* ఋగ్వేదం 6, 26, 2, 25.

ఓ రోజు ముసలి దివోదాసు కొడుకుని పిల్చాడు.

"బాబూ సుదాసూ! నేను బతుకులో చివరి దశకి చేరుకున్నాను. ఇంక పాంచాల దేశపు భారాన్ని మోయడం నా వల్లకాదు," అన్నాడు.

"అయితే ఆర్యా! ఈ భారాన్ని పాంచాలులకే ఎందుకు అప్పగించకూడదూ?" అన్నాడు సుదాసు.

''పాంచాలులకా? నీ ఉద్దేశమేమిటో నాకు అర్థంకాలేదు నాయనా!"

"ఆర్యా! ఈ రాజ్యం పాంచాలులదే కదా! మన పూర్వులు పాంచాల సమూహంలో సామాన్యజనంగానే ఉండేవారు. అప్పుడు పాంచాలానికి రాజెవరూ లేరు. పాంచాల సమూహమే యావత్తు పరిపాలననీ చూసుకునేది – ఇప్పటి మల్లులాగా, మద్రుల్లాగ, గంధారుల్లాగా! అక్కడి సమూహాలు పరిపాలనా భారాన్ని వహిస్తున్నట్టుగానే!! తర్వాత మన తాత వధ్య్రశ్వుని పూర్వీకుని కెవడికో లోభం కలిగింది–భోగాలని అనుభవిద్దామన్న తృష్ణ పట్టుకుంది. ఇతరుల కష్టార్జితాన్ని అపహరిద్దామన్న లుబ్ధత్వం కలిగింది. అతగాడు జనపతిగానో సేనాపతిగానో ఉండి ఉంటాడు. సమూహం కోసం ఏ యుద్ధమో గెల్చి సమూహపు ప్రేమని విశ్వాసాన్నీ సంపత్తినీ పొంది ఉంటాడు. దాంతో ఆసరా తీసుకుని సమూహంపట్ల విశ్వాసఘాతుకం చేశాడు. సమూహ పరిపాలననీ, జనరాజ్యాన్నీ తొలగించి అసురుల్లోలాగా రాజు పరిపాలనని స్థాపించాడు. అసురుల్లాగానే వశిష్ఠుడూ విశ్వామిత్రులు పూర్వీకుల్లో - ఎవరికో ఒకరికి మనకిప్పుడు అతని పేరు తెలియదు-లంచంగా పురోహితుడి పదవిని ఇచ్చాడు. ఆ పురోహితుడు ప్రజల కంట్లో దుమ్ముకొట్టడం మొదలుపెట్టాడు - ఈ రోజుని ఇంద్రుడూ, అగ్నీ, సోముడూ, వరుణుడూ, విశ్వదేవుడూ మిమ్మల్ని పరిపాలించడానికి పంపించారు. రాజాజ్ఞలని పాటించండి. దేవతల బలికి శుల్కాన్ని పన్నునీ ఇవ్వండి, అని చెప్పడం ప్రారంభించాడు. ఇది పూర్తిగా నమ్మకద్రోహం, దోపిడీ నాన్నా? ఎవరివల్ల అధికారం వచ్చిందో వాళ్ళ పేరునే పూర్తిగా మర్చిపోవడం, వాళ్ళ పట్ల కృతజ్ఞతతో ఒక్కమాటన్నా నోట ఉచ్చరించకపోవటం!!"

''లేదు బాబూ! సమూహమే-ప్రజలే మనని రాజులుగా చేసేవారని మనం ఒప్పుకుంటాం. అభిషేకం జరిగేటప్పుడు చేయించే ప్రతిజ్ఞతోపాటు వాళ్ళే మనకి రాజ చిహ్నాన్ని పలాశదండాన్ని ఇస్తారు."

"అభిషేకం ప్రతిజ్ఞా ఇప్పుడో తమాషాగా తయారయింది! కాని నిజంగా రాజు మీద సమూహానికి స్వామిత్వం ఉందా? లేదే! రాజు తన సమూహంతో పాటు కూచుని సహపంక్తిలో భోజనం చెయ్యడు. సహాయపడడు. ఇదిగో, ఇవే సమూహానికి రాజుమీద ఎలాంటి స్వామిత్వం లేదని చెప్పడానికి చాలు! మద్రుల్లో కాని గంధారుల్లో కాని జనపతి ఇలా చెయ్యగలడా?"

"ఇక్కడ మనం అలాచేస్తే ఏదో ఓ రోజున శత్రువు మనని చంపేస్తాడు. లేదా అంచే విషం పెట్టేస్తాడు."

"ఇదిగో, ఈ భయమూ దొంగకే-ఇతరుల సొత్తు అపహరించినవాడికే కలుగుతుంది! జనపతులు దొంగలుకారు, అపహరించే వాళ్ళూ కారు. నిజానికి వాళ్ళు తమనితాము జనపుత్రులుగా భావించుకుంటారు. అల్లాగ్గానే ప్రవర్తిస్తారు. అంచేతే వాళ్ళకి భయం ఉండదు. రాజులు దొంగలు. సమూహపు అధికారాల్ని అపహరించే వాళ్ళు. అందుకే వాళ్ళకి ప్రతిక్షణమూ భయంవేస్తూనే ఉంటుంది. రాజుల రాణివాసాలూ, రాజుల వెండి బంగారాలూ, రత్నవైడూర్యాలూ, రాజుల దాసదాసీజనాలూ, వాళ్ళ సమస్తభోగాలూ, వాళ్ళు సొంతంగా సంపాదించుకున్నవి కావు. ఇవన్నీ అపహరించగా వచ్చినవే!"

"బాబూ! దీనికంతటికీ నన్ను నువ్వు నేరస్థుణ్ణంటావా?"

"అబ్బే, ఎంత మాత్రం అలా అనను. ఆర్యా! నీ బదులు నేను ఆ పదవిలోకి వస్తే ఇష్టం ఉన్నా లేకపోయినా నేనూ అదే చెయ్యాల్సివస్తుంది. నేను దీనికి నా తండ్రి దివోదాసు నేరస్థుడని అనడం లేదు."

"నువ్వు రాజ్యాన్ని సమూహానికి తిరిగి యిచ్చేయాలని అంటున్నావు. ఇది జరిగే పనేనా? సమూహపు భోగభాగ్యాల్ని తస్కరించేవాడు కేవలం పాంచాలరాజు దివోదాసే కాడు. తస్కరించే సామంతులు అనేకులు ఉన్నారు. అందులో దివోదాసూ ఒకడు! ఇది నువ్వు అర్థం చేసుకోవాలి. దివోదాసు పెద్దవాడూ గొప్పవాడూ కావొచ్చు. కాని వాళ్ళ సామూహిక బలం ముందు బలహీనుడే! అనేక ప్రాంతాల రాజులు, రాజవంశీయులు (ఉగ్రులైన రాజపుత్రులు), సేనాధిపతులూ – వీళ్ళందరికన్నా పురోహితుడే బలవంతుడైన సామంతుడు!"

"అవును! పురోహితుడి శక్తిని నేనెరుగుదును. రాజుగారి కనిష్ఠపుత్రులు రాజపదవిని పొందలేకపోతారు. దాంతో వాళ్ళు పురోహితు (బ్రాహ్మణులు)లై పోతారు. నా తమ్ముడు ప్రతర్దనుడూ అలాగే చేసాడని నేననుకుంటాను. ఇప్పటికింకా రాజసింహాసనపు వేదికా, యజ్ఞవేదికగానే రాజుకీ పురోహితుడికీ మధ్య భేదం ఉన్నాది. కాని ఎవరికి తెల్సు - ముందు ముందు క్షత్రియులూ, బ్రాహ్మణులూ వేరువేరు శక్తులుగా రెండువర్గాలుగా అయిపోతారేమో!! మద్రుల్లోనూ గాంధారుల్లోనూ కత్తినీ క్రర ఉద్ధరిణినీ రెండింటినీ ఒక్కడే చేత్తో పట్టుకుని నిర్వహించగలడు. కాని పాంచాలపురంలో క్రర ఉద్ధరిణి విశ్వామిత్రుడి చేతిలోనూ, కత్తి వధ్ర్యశ్వపుత్రుడు దివోదాసు చేతిలోనూ ఉంటాయి. సమూహం ఇంకా ఇప్పటికి, ఇక్కడ మూడు భాగాలుగానే విభజించుకుని ఉంది - సామంతులుగా, సమూహపు భోగభాగ్యాలని అపహరించేవారుగా, పెళ్ళిపేరంటాల సంబంధంగా- తల్లిదండ్రుల సంబంధంగా రాజూ పురోహితుడూ ఒకదేకావచ్చు. కాని ఇప్పటికే వీళ్ళు వేరువేరుగా రెండు పేర్లతో క్షత్రియుడనీ బ్రాహ్మణుడనీ వ్యవహరించబడుతున్నారు. వీళ్ళిద్దరి మధ్యా వాళ్ళ వాళ్ళ స్వార్థం నుంచి అప్పుడే పోటీ మొదలయింది. అందుకే బ్రాహ్మణ క్షత్రియుల మధ్య వాళ్ళ శక్తులమధ్య మైత్రిని తిరిగి ప్రతిష్ఠించడానికి తీవ్ర ప్రయ

త్నాలు జరుగుతున్నాయి. ఈ రెండువర్గాలే కాక మరో కులం వారూ అధికసంఖ్యలో ఉన్నారు. వారిది మూడోవర్గం. ఇప్పుడీ మహాజనపు పేరుని మార్చి దాన్ని విశ్ అని (విట్) లేదూ ప్రజలనీ అంటున్నారు. ఎంత అవమానకరం!! దేన్ని జనం (సమూహం–తండ్రి) అని అంటూ వచ్చేరో దాన్నే ప్రజ (పుత్రుడు)గా పిలవడం ప్రారంభించారు. ఆర్యా! ఇది పూర్తిగా మోసంకాక మరేమిటో చెప్పండి!"

"బాబూ నువ్వు మరో పెద్ద సంఖ్యని లెక్కించలేదు!"

"అవును. ఆర్యజనులు కాని వారు! చేతిపనులు చేసే ప్రజలూ, వ్యాపారస్థులూ, దాసదాసీజనాలూను! బహుశా వీళ్ళనుంచే సామంతులు సమూహానికి (జనానికి) అధికారం లేకుండా చెయ్యడంలో కృతకృత్యులయ్యారు. తమని పరిపాలించే సమూహం తమలాగే మరొకరి చేతికింద పరాధీనంగా ఉండడాన్ని చూసి ఆర్యులుకాని ప్రజలకి సంతోషం కలిగింది. దీన్నే రాజు తన న్యాయం అన్నాడు."

"నువ్వన్నదాంట్లో బహుశా తప్పేమీలేదు. కాని రాజ్యాన్ని ఎవరికి తిప్పి ఇవ్వాలి? అదిచెప్పు. దొంగలనీ, తస్కరుల్నీ, సామంతుల్నీ, వ్యాపారస్థుల్నీ వదిలేస్తే ఆర్యజనం. అనార్య ప్రజలూ అందరికన్నా ఎక్కువసంఖ్యలో ఉన్నారు. వాళ్ళు రాజ్యాన్ని పాలించగలరా? ఇటుచూస్తే ధర్మసామంతులూ, రాజసామంతులూ గద్దల్లా కాచుకు కూచున్నారు - నేను వదిలెయ్యగానే ప్రజల్ని పొడుచుకుతిండానికి!! కురుపాంచాల సమూహాల (జనరాజ్యం) నుంచి రాజ్యపరిపాలనని లాక్కుని ఆరేడు తరాలు మాత్రమే అయింది. అంచేత సమూహపాలన కాలం ఇంకా జ్ఞాపకాల్లో ఉంది. ఆ కాలంలో ఈ భూమిని దివోదాసు రాజ్యం అని అనేవారు కాదు. "పంచాలాః" (యావత్తు పాంచాలవాసులు) అనేవారు. కాని నాకీరోజున మళ్ళీ వెనక్కి వెళ్ళేమార్గం కనిపించటంలేదు."

"నిజమే! మార్గంలో వశిష్ఠుడూ, విశ్వామిత్రుడూ లాంటి మొసళ్ళు కాచుకూర్చున్నాయి!"

"మనం కాలాన్ని వెనక్కి తిప్పలేం. దీన్ని మన చేతకానితనం అను, మన దేశంలో లేనిదను. రేపెక్కడికి చేరతామో దాని సంగతి మనకి తెలీదు! సుదాసు లాంటి కొడుకు కలిగినందుకు నాకు సంతోషంగా ఉంది. ఒకప్పుడు నేనూ యువకుణ్ణే. ఇంకా అప్పటికి వశిష్ఠుడి కవిత్వం, విశ్వామిత్రుడి కవిత్వం ఇంత ప్రచారంలోకి రాలేదు. ప్రజల వివేకాన్ని మట్టుపెట్టే వాళ్ళ ధర్మాలూ కర్మకాండలూ వాటి మాయా ఇంతలా జనంలో చొచ్చుకుపోలేదు. రాజులోని ఈ దొంగబుద్ధిని, చోర ప్రవృత్తిని తగ్గించాలని నేననుకుంటూ ఉండేవాణ్ణి. కాని ఆలా చెయ్యడానికి నా శక్తి చాలలేదు. ఆ సమయంలో మీ అమ్మే నా సర్వస్వమూ అయింది. కాని తర్వాత నేననుకున్నట్టూ జరగకపోవడంతో, నిరాశలో నేను మునిగిపోవడంతో ఈ పురోహితులు తమ కవిత్వపు వల్లోనే కాదు, అందమైన కన్యల ఉచ్చులో నన్ను బిగించేశారు. ఇంద్రాణి దాసీజనాల్ని ఉపమానంగా చెప్పి రాణివాసాన్ని వందలాది దాసీ

జనాలతో నింపేశారు. దివోదాసు పతనాన్నుంచి నువ్వు గుణపాఠం నేర్చుకో జాగ్రత్తపడు. ఈ చోరప్రవృత్తిని రూపుమాపడానికి ఏదన్నా దారి దొరకవచ్చు. ప్రయత్నించు, కాని సుదాసు లాంటి సహృదయుడైన దొంగని తొలగించి ప్రతర్ద నునివంటి హృదయంలేని వాడిచేతిలో, మోసకాడూ, దొంగా చేతిలో పాంచాల దేశాన్ని పెట్టడం మంచిదికాదు. పితృలోకాన్నుంచి నేను చూస్తూ ఉంటాను నీ ప్రయ త్నాల్ని! ఎంతో సంతోషంతో చూస్తూ వుంటాను నాయినా!"

# 4

దివోదాసు దేవలోకానికి వెళ్ళిపోయాడు. ఇప్పుడు సుదాసు పాంచాలుల రాజు. ఋషుల సమూహం అతని చుట్టూ ఇప్పుడు తిరుగుతోంది. ఈ తెల్లగెడ్డాల వాళ్ళు ఇంద్రుడి పేరుతో, వరుణాగ్నుల పేరుతో, సోముడి పేరుతో ప్రజల్ని ఎంత గుడ్డి వాళ్ళగా చేశారో ఇప్పుడు సుదాసుకి బాగా తెలిసింది. వాళ్ళ బలమైన ఉచ్చుల్లో తనూ చిక్కుకుపోతున్నట్టు సుదాసుకి అనిపిస్తోంది. ఎవరికోసం తను ఏదైనా మేలు చేద్దామని అనుకుంటున్నాడో వాళ్ళ తననీ తన భావాలనీ విపరీతంగా, విరుద్ధంగా అర్థం చేసుకుంటున్నారు. ఈ రాజు అధర్ముడనీ, పాపాత్ముడనీ చాటిచెప్పడానికి సిద్ధంగా ఉన్నారు. కాలికి పాదరక్షలైనా లేకుండా ఒంటిని చిరిగిన గుడ్డలతో ఎరగని దేశాల్లో తాను తిరిగిన రోజులు సుదాసుకి జ్ఞాపకం వస్తున్నాయి. ఆ రోజుల్లో అత డెంత స్వతంత్రుడో కదా! సుదాసుని మనోవేదనని అర్థం చేసుకునేవాడు, సానుభూతి చూపెట్టేవాడూ ఒక్కడైనా లేడు. పురోహితులు—ఋషులూ అతని దగ్గరికి పడుచు దనంతో అందంగా ఉన్న తమ మనుమరాళ్ళనీ, మునిమనుమరాళ్ళనీ పంపుతు న్నారు. రాజులు - ప్రాంతీయ సామంతులు తమ కూతుళ్ళనీ పంపుతున్నారు. కాని సుదాసుకి తను మండుతున్న ఇంట్లో ఉన్నట్లుగా ఉండేది. చంద్రభాగా నదీతీరంలో తనకోసం ఎదురుచూస్తున్న ఆ నీలికళ్ళని అతడు మరిచిపోలేకుండా ఉన్నాడు.

సుదాసు యావత్తు సమూహానికి - ఆర్యజనం అనార్యజనం ఇద్దరికీ ఏ భేదం లేకుండా సేవ చెయ్యాలని కంకణం కట్టుకున్నాడు. కాని అలా చెయ్యడానికి ముందు దేవతలనే బురదలో ఆపాదమస్తకమూ మునిగి ఉన్న జనానికి దేవతల దయ సుదాసు మీద ఉన్నదన్న నమ్మకాన్ని కలిగించాలి! ఋషులూ, బ్రాహ్మణులూ అతణ్ణి పొగడ్డమే దానికి సరైన తార్కాణం తప్ప ఇంక మరో దారి ఏం కనిపించలేదు. ఋషుల ప్రశం సల్ని పొందడానికి చివరికి సువర్ణాన్నీ, గోవుల్నీ, ధాన్యాన్నీ, దాసదాసీ జనాన్ని దానం చెయ్యడం తప్ప మరో గత్యంతరం లేదూ అని అతనికి అర్థం అయింది. బలి సిన ఆవుదూడల మాంసంతోనూ, మధురమైన సోమరసంతోనూ బొజ్జలు పెంచుకున ఈ ఋషుల అభిప్రాయంలో ఇప్పుడు సుదాసు నిజంగా సుదాసు (మంచి దానశీలి) అయ్యాడు. ముఖస్తుతులు చేసే ఈ ఋషులు అల్లిన దానస్తుతులు సుదాసుకి సంబం

ధించినవి ఇప్పటికీ ఋగ్వేదంలో ఎన్నో ఉన్నాయి. కాని ఈ దానస్తోత్రాలని విని వాటిని అల్లిన కవుల్ని సుదాసు ఎంత అసహ్యించుకునేవాడో ఎవరికి తెల్సు?

సుదాసుని కీర్తి యావత్తు ఉత్తర పాంచాలంలోనే (రుహేల ఖండం) కాదు, దూర దూర ప్రాంతాలవరకూ పాకింది. భోగభాగ్యాలనుండి విరక్తుడైన తన జీవితంలో తన శక్తికి తగ్గట్టూ సాధ్యమైనంతవరకూ విశ్వజనానికి మేలు చేస్తూ ఉండేవాడు.

తండ్రి చనిపోయిన కొన్నేళ్ళకి సుదాసుని తల్లిపోయింది. సంవత్సరాల తరబడి సంవత్సరాలు సలుపుతూ బాధపెడ్తూన్న గాయానికి అతడు అలవాటు పడిపోయాడు. ఇప్పుడా పుండు రాచపుండులా బాధపెట్టసాగింది. ప్రతిక్షణమూ అపాలా తనముందు నిలబడినట్టూ, కళ్ళనీళ్ళతో, ఒణుకుతున్న పెదిమలతో "మద్రపురంలో నీ కోసం నేను ఎదురుచూస్తూ వుంటా" అని అంటున్నట్టూ అతనికి అనిపిస్తోంది. ఈ మానసిక వ్యధ అనే మండే అగ్నిని సుదాసు తన కన్నీటితో ఆర్పలేకపోతున్నాడు.

హిమాలయాల్లో వేటాడ్డానికన్న నెపంతో ఓ రోజు సుదాసు పాంచాలపురం (అహిచ్ఛత్రం) నుంచి బయల్దేరాడు.

మద్రపురంలో (స్యాల్‌కోట్) ఆ ఇల్లు ఉన్నది! అపాలా ప్రేమ అతనికి అక్కడే దొరికింది. కాని ఇప్పుడక్కడ జేతాలేడు. అతని ప్రియురాలు అపాలా లేదు. ఇద్దరూ చనిపోయారు. అపాలా చచ్చిపోయి ఓ సంవత్సరమే అయింది! ఇప్పుడా ఇంట్లో అపాలా సోదరుడూ-కొన్నాళ్ళు కనిపించకుండా పోయి తర్వాత ఇంటికి తిరిగివచ్చిన వాడు-అతని కుటుంబమూ ఉంటున్నాది. ఆ ఇంటితో స్నేహసంబంధాన్ని పెంచుకునే ధైర్యం సుదాసుకింక లేదు. అతడు అపాలా స్నేహితురాల్ని కలుసుకున్నాడు. ఆవిడ అపాలా బట్టల్ని-ఆ రంగు రంగుల కొత్త బట్టల్ని — లోపల వేసుకునేవాటిని, ఉత్తరీయాన్ని (ఓణీని), కంచుకాన్ని, తలకి కట్టుకునే దాన్ని అతని ముందు పెట్టింది.

"నా స్నేహితురాలు చివరిగడియల్లో ఈ బట్టల్ని కట్టుకుంది. నేను సుదాసుకి మాటిచ్చాను సోదరీ! 'మద్రపురంలో నీ కోసం నేను ఎదురుచూస్తూ ఉంటా'నని మాటిచ్చాను. ఇవే ఆవిడన్న ఆఖరిమాటలు." అపాలా స్నేహితురాలు కళ్ళంట నీళ్లుకారుస్తూ ఎంతో బాధపడ్తూ అతనికి చెప్పింది.

ఆ బట్టల్ని తీసుకుని సుదాసు తనగుండెకి హత్తుకున్నాడు. తన కళ్ళకు అద్దుకున్నాడు. ఆ బట్టల్లోంచి అపాలా ఒంటి సువాసన వస్తున్నది."*

---

*ఇది నేటికి నూట నలభై నాలుగు తరాల పూర్వం జరిగిన ఆర్య సమూహపు (జనం) కథ. ఈ కాలంలోనే ప్రాచీన ఋషులు వశిష్ఠుడూ, విశ్వామిత్రుడూ, భరద్వాజుడూ ఋగ్వేదంలోని మంత్రాలని రచిస్తున్నారు. ఈ కాలంలోనే ఆర్య పురోహితుల సహాయంతో కురుపాంచాలుల ఆర్య సామంతులు ప్రజాధికారం మీద ఆఖరిదెబ్బ, అన్నిటికన్నా బలమైన దెబ్బ కొట్టేరు.

# ప్రవాహణుడు

స్థానం : పాంచాలం (యుక్తప్రాంతం)
కాలం : క్రీస్తుపూర్వం 700

"ఓ పక్క ఆకుపచ్చగా వనాలు, ఆ వనాల్లో పండిన వాల్ పళ్ళ మత్తెక్కించే వాసనలు, పిట్టల తియ్యటి కూతలు, ఇంకో పక్క స్వచ్ఛమైన నీటితో ప్రవహిస్తున్న గంగానది, దాని ఒడ్డునున్న పల్లాల్లో మన వేలాది కపిలగోవులూ, నల్లావులూ, వాటి మధ్య రంకెలు వేస్తూ బలిసిన పెద్ద పెద్ద వృషభాలు! ప్రవాహణా! అప్పుడప్పుడైనా ఈ దృశ్యాల్ని తనివితీరా చూడాలి. నువ్వయితే ఎప్పుడూ ఆ ఉద్గీథాన్ని (సామ) గానం చెయ్యడంలోనైనా మునిగిపోయి ఉంటావు. లేదా అంటే వశిష్ఠుడివో, విశ్వామిత్రుడివో మంత్రాల్ని పునః పునః వల్లిస్తూనో ఉంటావు!"

"లోపా! నీ కళ్ళు ఆ దృశ్యాన్ని చూస్తే, నీ కళ్ళని చూసి నేను తృప్తి పడుతూ ఉంటాను."

"హుఁ! మాటని మార్చేయడంలో మహా ఘటికుడివి! నువ్వు ఆ పాత పాటలని నీ సహాధ్యాయులతో పాటు కుక్క మొరుగుతున్నట్టు పునః పునః పాడుతున్నప్పుడు నా ప్రవాహణుడు బతుకంతా అడ్డాల్లో బిడ్డడిలా ఉండిపోతాడని అనిపిస్తూ ఉంటుంది."

"ప్రవాహణుడి గురించి నిజంగా ఇదేనా నీ అభిప్రాయం? లోపా!"

"అభిప్రాయం ఏదైనా కానీ! దాంతోపాటు ప్రవాహణుడు ఎప్పటికీ నా వాడే అన్న గట్టి అభిప్రాయమూ ఉంది."

"ఇదిగో ఈ ఆశవల్లా ఈ నమ్మకంతోనే నాకు శ్రమించడానికీ, విద్యని ఆర్జించడానికి బలం వస్తోంది. నా మనస్సుని నా చెప్పుచేతల్లో పెట్టుకుని ఎంతో మనోనిగ్రహాన్ని అలవర్చుకున్నాను. లేకపోతే లెక్కలేనన్నిసార్లు ఈ ప్రాచీన గాథల్నీ, పాత మంత్రాలనీ, ప్రాచీన ఉద్గీథాలనీ కంఠస్థం చెయ్యనని నా మనస్సు మొరాయించింది. శ్రమించి శ్రమించి మనస్సు పూర్తిగా అలిసిపోయి, ఇంకేం చెయ్యకుండా అన్నిటినీ వదిలేసి కూచున్నప్పుడు దానికి మందు నాకు ఒక్కటే కనపడుతుంది. ఆ విరుగుడు మందు తప్ప మరేదీ నాకు తోచదు- అదేమిటనుకుంటున్నావు? లోపాతో కాస్సేపు కొన్ని క్షణాలు గడపడం!"

"దానికి నేనెప్పుడూ సిద్ధంగానే ఉంటాను."

లోపా బూడిదరంగు కళ్లు ఎటో దూరంగా చూస్తున్నాయి. ఆవిడ జుట్టు ఎరుపూ బూడిదరంగూ కలిసిన వర్ణంలో ఉంది. ప్రాతఃకాలపు పిల్లవాయువులకి ఆవిడ మెత్తటి జుట్టు అటూ ఇటూ కదులుతున్నాది. లోపా అక్కడ లేనట్టుగా అని పిస్తున్నాది. లోపా జుట్టుని తన వేళ్ళతో సరిచేస్తూ "లోపా! నీ ముందర నేను అల్పు ణ్ణని అనుకుంటున్నాను " అన్నాడు ప్రవాహణుడు.

"అల్పుడివా? కాదు ప్రవాహణా!" అంటూ లోపా అతనిని తన చెక్కిళ్ళకి ఆనించుకుంది-"నువ్వంటే నాకెంతో గర్వం. మా మేనత్తతో కలిసి వచ్చిన ఎనిమి దేళ్ళ ఆ పిల్లాణ్ణి పసితనం నిండిన నా కళ్ళతోనే చూసిన ఆ రోజు నాకింకా జ్ఞాపకం ఉంది. నేనప్పుడు మూడేళ్ళదాన్నో నాలుగేళ్ళదాన్నో. కాని ఆ చిన్ననాటి చిత్రాన్ని జ్ఞాపకం ఉంచుకోడంలో నా స్మరణశక్తి గొప్పగానే పని చేసింది. ఆ బంగారపు వన్నెకల జుట్టు, ఆ చిలక ముక్కు, ఆ పల్చటి ఎర్రటి పెదాలు, మెరిసే ఆ నీలికళ్ళు, మేలిమి బంగారం లాంటి పచ్చటి శరీరం అన్నీ జ్ఞాపకమే! "అమ్మా లోపా! ఇతడు నీ సోదరుడు' అని అమ్మ నాతో చెప్పడమూ జ్ఞాపకం ఉంది. నేనప్పుడెంతో సిగ్గు పడిపోయాను. కాని అమ్మ నీ మొహాన్ని ముద్దు పెట్టుకుని 'అబ్బాయీ ప్రవాహణా నీ మేనమామ కూతురు ఈ లోపా సిగ్గుపడుతోంది. దీని సిగ్గుని వదలగొట్టు' అని అన్నాది."

"నేనేమో నీ దగ్గరికి వచ్చేను. నువ్వు అత్తయ్య సువాసనలు వెదజల్లే జుట్టు వెనక నీ మొహాన్ని దాచేసుకున్నావు!"

"కాని మొహాన్ని దాచుకునేటప్పుడు చూడ్డానికి వీలుగా కళ్ళు జుట్టు సందుల్లో పెట్టాను. నువ్వేం చేస్తావోనని నేను చూస్తూనే ఉన్నాను. అమ్మ ఒడీ, దాసీ జనం, దాసీవాళ్ళ పిల్లలూ తప్ప అక్కడింకెవరూ లేరు. తండ్రిగారి గురుకులం ఇంకా ఏర్పడలేదు. ఈ ఇంట్లో నేనొంటరిదాన్ని అని అనుకుంటూ ఉండేదాన్ని. అంచేత నిన్ను చూసేసరికి ఎంతో సంతోషం కలిగింది."

"ఆడుకోడానికి. అందుకేనన్న మాట నువ్వు నాక్కనబడకుండా దాక్కు న్నది! నేను నీ తెల్లటి బరిఒంటినీ, గుండ్రటిమొహాన్నీ చూశాను. పసితనం నిండిన నా కళ్ళకి ఎంతో బాగున్నట్టు అనిపించింది. దగ్గరగా వచ్చి నేను నీ భుజం మీద చెయ్యివేశాను. అమ్మా అత్తయ్యా ఏం చేశారో నీకుతెల్సా? ఇద్దరూ ముసిముసినవ్వులు నవ్వుకున్నారు. 'బ్రహ్మదేవుడు మనకోరికని తీర్చుగాక!" అనుకున్నారు. ఆ కోరిక ఏమిటో, దాని అర్థం ఏమిటో అప్పుడు నాకు తెలీలేదు."

"నాకదేం జ్ఞాపకంలేదు ప్రవాహణా! నీ మెత్తటిచెయ్యి నా భుజాన్ని తాక డమే గొప్ప సంగతి."

"సిగ్గుతో నువ్వు ముడుచుకుపోయేవు."

"నువ్వు నా చేతిని నీ చేతిలోకి తీసుకున్నావు. కాని పెదవి మాత్రం విప్పేవు కావు. అప్పుడు అమ్మేమిటన్నాది?"

"అత్తయ్య అన్న ప్రతీమాటా నాకు జ్ఞాపకమే. అత్తయ్యని మర్చిపోగలనా? అమ్మ నన్ను గార్గ్య మావయ్య దగ్గర వదిలేసి ఇంటికి వెళ్ళిపోయింది. అయితే అత్తయ్య ప్రేమ అమ్మని మరిపించేసింది. అత్తయ్యని నేనెలా మరిచిపోగలను?" ప్రవాహణుడి కళ్ళల్లో నీళ్ళు నిండుకొచ్చేయి. అతడు లోపా పెదిమల్ని ముద్దు పెట్టుకున్నాడు. "అత్తయ్య మొహం అచ్చు ఇలాగే ఉండేది లోపా! మనిద్దరం ఒకదగ్గరే పడుకునేవాళ్ళం. నువ్వేమో నిద్రపోయేదానివి కాని నేను మెలకువగానే ఉండేవాణ్ని. కాని అత్తయ్య రావడం చూడగానే తెరిచిన కళ్ళని మళ్ళీ మూసుకునే వాణ్ని. ఆవిడ నెమ్మదిగ ఊపిరితీస్తూ నా బుగ్గలమీద ముద్దు పెట్టుకునేది. నేను కళ్ళు తెరిచేవాణ్ని. 'బాబూ! లే' అనేది. ఆ తర్వాత నీ మొహాన్ని ముద్దు పెట్టుకునేది. అయితే నువ్వు ఒళ్లు ఎరక్కుండా నిద్రపోతూ ఉండేదానివి!"

లోపా కళ్ళనిండా నీళ్ళు నిండుకున్నాయి. "అమ్మని నేను చాలా తక్కువ చూడగలిగాను."

"ఊఁ. అప్పుడు నువ్వు నా దగ్గర నోరువిప్పకుండా నిల్చోడం చూసి అత్తయ్య - 'ఇది నీ సోదరిరా బాబూ! దీని పెదాలని ముద్దు పెట్టుకో - 'గుఱ్ఱం గుఱ్ఱం' ఆడదామని పిలువు" అన్నాది."

"అవును.నువు నా పెదిమలమీద ముద్దుపెట్టుకుని 'గుఱ్ఱం గుఱ్ఱం' ఆడదాం అని పిల్చావు. నేను అమ్మ జుట్టులో దాచుకున్న నా మొహాన్ని బైట పెట్టాను. నువ్వక్కడే గుఱ్ఱంలా ఒంగి నిల్చున్నావు. నేను నీ వీపుమీద ఎక్కి కూర్చున్నాను."

"అప్పుడే నిన్ను నేను బైటికి తీసికెళ్ళిపోయాను."

"నేనెంత పెంకిదాన్ని !"

"నువ్వెప్పుడూ ధైర్యం అయినదానివే లోపా ! నా సర్వస్వమూ నువ్వేను. మావయ్య దగ్గర భయంతో నా పాఠాన్ని కంఠస్థం చేస్తూ ఉండేవాణ్ని. అలిసిపోయినప్పుడు నీ దగ్గరికి వచ్చేసేవాణ్ణి."

"నీ కోసమే మరి నేనూ నీ దగ్గరే కూచునేదాన్ని."

"నువ్వు నే చేసిన కృషిలో సగం కృషి చేసి ఉన్నట్లయితే మావయ్య దగ్గరున్న అంతేవాసులందరికన్నా ముందుండే దానివని నాకు అనిపిస్తూ ఉంటుంది లోపా!"

"కాని నీకంటే ముందు మాత్రం కాదు!" లోపా ప్రవాహణుడి కళ్ళలోకి ఓసారి తేరిపార చూసి "నేను ఎప్పుడూ నీకంటే ముందుకు పోవాలని అనుకోను" అన్నాది.

"కాని నాకు సంతోషం కలిగేది!"

"ఎందుకో తెల్సా? మనిద్దరిమధ్యా వేర్వేరు ఆత్మాభిమానం అన్నది లేదు!"

"లోపా ! నా మనస్సుకి ఉత్సాహాన్నే కాదు, నా శరీరానికి నువ్వు శక్తిని ఇచ్చావు. నేను రాత్రుళ్లు ఎంత తక్కువనిద్రపోయేవాణ్ని. సొంతంగా వల్లెవెయ్యడం మిగతావాళ్ళ చేత వల్లెవేయించడంలో తిండీ గిండీ అన్నీ మర్చిపోయేవాణ్ణి. నువ్వు నన్నా వేదాధ్యయన మందిరం నుంచి ఆ అంధకారంలోంచి బలవంతంగా ఓసారి వనంలోకి మరోసారి ఉద్యానవనానికి ఇంకోసారి గంగానది ఒడ్డుకీ లాక్కుపోయే దానివి. నాకు ఇవన్నీ అంటే ఇష్టమే. లోపా ! అయితే మూడు వేదాల్లో విద్యనీ బ్రాహ్మణ విద్యనంతటినీ శీఘ్రాతిశీఘ్రంగా పూర్తి చేసెయ్యాలని కూడా ఉంది."

"నువ్విప్పుడు చివరికి వచ్చేశావు. ప్రవాహణుడు నాతో సమానమైన వాడ య్యాడు అని నాన్న అంటున్నారు "

"నేనూ అలాగే అనుకుంటున్నాను. బ్రాహ్మణాల్లో చదవాల్సినది ఇంకా చాలా తక్కువే. కాని బ్రాహ్మణాలతో విద్య పూర్తయిపోదు.

"ఇదే నేను నీతో చెప్పాలనుకుంటున్నాను. కాని ఇంకా ఈ పలాశదండం జడలజుట్టూ అలాగే ఉంటాయన్నమాట?"

"ఉహూఁ. దీని గురించి విచారపడకు లోపా! పలాశదండాన్ని వదిలేసే రోజు వచ్చేస్తోంది. పదహారేళ్ళబట్టీ జడలు కట్టిన ఈ జుట్టుకి నువ్వింక వాసన నూనె రాయొచ్చు. నీకా హక్కు ఉంటుంది."

"ప్రవాహణా! నూనె రాయకుండా జుట్టుని జడలు కట్టించుకుంటూ సంస్కార రహితంగా వదిలెయ్యాలన్న పట్టింపు ఇంతెందుకో నాకర్థం కాదు. నువ్వేమో నా పెదిమల్ని ముద్దాడ్డం ఎప్పుడూ మానలేదు!"

"ఆ అలవాటు చిన్ననాటినుంచీ ఉంది."

"అయితే మిగతా గురుకులాల్లోని అంతేవాసులూ ఈ కఠోరనియమాన్ని పాటిస్తూ వుంటారా?"

"గత్యంతరం లేక ! లేదూ అంటే గౌరవ ప్రతిష్ఠల కోసం కూడా చేస్తారు లోపా! బ్రాహ్మణ బ్రహ్మచారులు ఎంత కఠిన తపస్సు చేస్తున్నారో అని జనం అను కుంటారు."

"పోతే, కురురాజు నాన్నకి గ్రామాలు, హిరణ్యం, బంగారం, దాసదాసీ జనం, ఆడగుర్రాల రథాల్నీ ఇస్తున్నారు. మా ఇంట్లో అయితే ముందే దాసీజనం ఎక్కువగా వున్నారు. ఈ మధ్య కురురాజు మళ్ళీ ముగ్గుర్ని పంపేరు. వాళ్ళకి ఇక్కడ పనేలేదు."

"అమ్మెసెయ్యి లోపా! వాళ్ళు పడుచువాళ్లు. ఒక్కొక్కావిడకి ముప్పై ముప్పై బంగారపు నాణాలు వస్తాయి."

"ఎంత విచారకరం ! మనం బ్రాహ్మలం. ఇతరులకన్నా ఎక్కువ చదువు కున్న వాళ్ళం. జ్ఞానం ఉన్న వాళ్ళమూను. ఎంచేతా అంటే మనకి దానికి కావల్సిన అవకాశాలు వున్నాయి. కాని ఈ దాసీ వాళ్ళ బతుకుల్ని చూసినప్పుడు నాకు

బ్రహ్మ, ఇంద్రుడూ, వరుణుడూ మిగతా మన దేవతలందరన్నా వశిష్ఠుడూ, భర ద్వాజుడూ, భృగు, అంగిరా మొదలైన ఋషులందరన్నా నా తండ్రిలాంటి – నేటి మహాధనికులైన శ్రోత్రియ బ్రాహ్మణులందరన్నా ఎంతో అసహ్యం వేస్తుంది. ఎక్కడ చూసినా వ్యాపారమే, బేరమే- లాభమే, లుబ్ధత్వమే కనబడుతున్నాయి. ఆ వేళ నల్ల దాసీదాని మొగుణ్ని నాన్న కోసలనుంచి వచ్చిన ఆ కోమటికి ఏభై బంగారు నాణాలకి అమ్మేశారు. నల్లది నా దగ్గరకొచ్చి ఏడ్చి మొత్తుకుంది. నేను నాన్నగారికి ఎంతో చెప్పాను. కాని 'ఇంత మంది దాసీవాళ్ళకి ఇంట్లో జాగా చాలదు. ఒక వేళ వుంచుకున్నా ఎందుకా ధనం పనికివచ్చేటట్టు?' అన్నారు. వాళ్ళిద్దరూపాపం విడిపోవడానికి ముందు రోజు రాత్రి ఎంత ఏడ్చారో !! వాళ్ళ రెండేళ్ళ పసిపిల్ల పొద్దున్నే లేచి ఎంత గోలా గగ్గోలు పెట్టిందో ! ఆ పసిపిల్లకి మా నాన్న పోలికలు వున్నాయని అందరూ అంటారు !! అయినా నల్లదాని మొగుణ్ణి అమ్మేశారు– వాడు మనిషికానట్టూ, ఏదో పశువైనట్టూను! బ్రహ్మదేవుడు వాణ్ణీ వాడి తర్వాత వందతరాల వాళ్ళనీ ఇందుకే పుట్టించినట్టూను ! ఇది నేను ఒప్పుకోలేను ప్రవాహణా ! నీలా నేను నాలుగు వేదాలనీ వల్లెవెయ్యలేదు. కాని చదువుతూవుంటే విన్నాను. వాటిలో కంటికి కనిపించని వస్తువులకన్నా, అగోచరమైన లోకాలన్నా శక్తులన్నా ప్రలోభాన్నీ, భయాన్నీ కలిగేటట్టుగా వున్నది."

లోపా ఎర్రటి చెక్కిళ్ళని తన కళ్ళకి హత్తుకుని ప్రవాహణుడు "మన ప్రేమ అభిప్రాయభేదాల కోసమే పుట్టింది!" అన్నాడు.

"అభిప్రాయభేదం మన ప్రేమని మరింత బలపరుస్తుంది."

"బాగా చెప్పేవు లోపా! ఈ మాటల్నే ఇంకెవరన్నా అని ఉంటే నేనెంత వేడెక్కి పోయేవాణ్ణో! కోపంతో మండిపోయేవాణ్ణో ! కాని ఇక్కడ నా దేవత లందరి మీదా, ఋషులమీదా, గురువులమీదా నువ్వు నీ నోటితో తీవ్రంగా వాగ్బాణాలు విసురుతూ ఉంటే ఆ నోటిని మళ్ళీ మళ్ళీ ముద్దు పెట్టుకోవాలనిపిస్తోంది. ఎందుకనీ?"

"ఎందుకూ అంటే మనలోపల రెండు రకాలైన భావాల ద్వంద్వం తరుచూ ఉంటూనే ఉంటుంది. మనం వాటిపట్ల సహనం చూపిస్తాం. అవీ, మనం అభిన్నులం!"

"నువ్వూ నాకు అభిన్నమైన దానివే లోపా!"

# 2

"నువ్వు ఈ 'శివి' శాలువల్ని ఎప్పుడూ కప్పుకోలేదు. కాశీ చందనంతోనూ సాగరముత్యాలతోనూ ముస్తాబు చేసుకోలేదు! ఇవంటే ఇంత తిరస్కారం ఎందుకూ? లోపా!"

"వీటివల్ల నేనింకా ఎక్కువ అందంగా ఉంటానా?"

"నువ్వెప్పుడూ నాకు అందంగానే ఉంటావు"

"అలా అయితే ఈ బరువులన్నిటినీ వేసుకుని వొంటిని కష్టపెట్టడం వల్ల లాభం ఏమిటిటా? నువ్వు పెద్ద బరువుని నీ తలమీద కిరీటం అన్న పేరుతో పెట్టుకుంటావా, చూసినప్పుడల్లా నాకు మహా అసహ్యంగా అనిపిస్తుంది ప్రియా!"

"కాని మిగతా స్త్రీలంతా వస్త్రాలకోసం ఆభరణాలకోసం పడిచస్తారు!"

"నేనలాంటి స్త్రీని కాదు."

"నువ్వు పంచాలరాజ్యం హృదయాన్నే పరిపాలించే స్త్రీవి!"

"ప్రవహణుడి స్త్రీని. పాంచాలులకి రాణిని!"

"అవును ప్రేయసీ! ఈ రోజు వస్తుందని మనం ఎప్పుడైనా ఊహించామా? మావయ్య మనకి నేను పంచాలరాజ్యానికి పుత్రుణ్ణన్న విషయాన్ని అసలు చెప్పకుండా దాచేసాడు."

"ఆ సమయంలో నాన్న ఇంకేం చెయ్యగలరు? పంచాలరాజ్యంలోని వందలాది రాణుల్లో నా మేనత్తా ఒకత్తి. నీ కన్నా పెద్దవాళ్ళు పంచాల రాజ్యంలో పదిమంది పుత్రులున్నారు! అలాంటప్పుడు నువ్వోరోజున పాంచాలుల రాజసింహాసనానికి అధికారివి అవుతావని ఎవరు అనుకోగలరు?"

"అదిసరేగాని, నీకి రాజభవనం అంటే ఇష్టం లేదెందుకని లోపా?"

"ఎందుకని అడుగుతున్నావా? గార్గ్య బ్రాహ్మణ మహాధనికుని భవంతంటేనే విసిగిపోయేను. మాకైతే అది భవంతే! కాని అక్కడి దాసదాసీజనాలకి? ఇహ ఈ రాజ భవనం ఆ మహాధనికుని భవంతికన్నా వెయ్యిరెట్లు పెద్దది. ఇక్కడ నిన్నూ నన్నూ వదిలేస్తే మిగిలిన వాళ్ళంతా దాసదాసీజనాలే! ఇద్దరు దాసదాసీ జనపువాసం కానంత మాత్రాన దాసదాసీ జనంతో నిండిపోయి ఉన్న ఈ రాజభవనం దాసదాసీ జనపు భవనం కాకుండా పోదు !! కాని నీ గుండెంత కఠినమైనదో కదా ! నాకు ఆశ్చర్యం వేస్తూ ఉంటుంది ప్రవాహణా!"

"అందుకే మరి కఠోరమైన వాగ్బాణాల్ని సహించగలుగుతోంది."

"ఊహూఁ. మనిషి ఎప్పుడూ అలా అవకూడదు!"

"మనిషిగా అవడానికి కాదు, యోగ్యుణ్ణవడానికి నేను ప్రయత్నించాను ప్రేయసీ! ఓ రోజు ఈ రాజభవనానికి రావల్సి ఉంటుందన్న సంగతి మాత్రం ఆ యోగ్యతని సంపాదించడానికి ప్రయత్నిస్తున్న రోజుల్లో నాకు తెలీదు."

"నన్ను ప్రేమించినందుకు పశ్చాత్తాపపడ్డం లేదుకదా ప్రవాహణ్?"

"నీ ప్రేమ నాకు తల్లిపాలలాగ ఏ ప్రయత్నం చేయకుండానే దొరికింది. అది నాలో ఓ భాగంగా అయిపోయింది. నేను లౌకికుణ్ణి లోపా! అయినా నీ ప్రేమ విలువేమిటో నాకు తెలుసు. మనస్సు ఎప్పుడూ ఒక్కలా ఉండదు. ఎప్పుడన్నా మనస్సుకి విషాదం కలిగితే, నాకు బతుకు దుర్భరంగా అనిపిస్తే నీ ప్రేమ, నీ సద్భావం నాకు చేయూతనిస్తూ ఉంటాయి."

"కాని నేన్నీకు ఎంతగా చేయూత ఇద్దామనుకుంటున్నానో అంతగా ఇవ్వలేక పోతున్నాను, ప్రవాహణ్! అందుకెంతో విచారంగా ఉంది!"

"ఎందుకంటే నేను రాజ్యాన్ని పరిపాలించడానికి పుట్టాను."

"కాని ఒకప్పుడు నువ్వు మహాబ్రాహ్మణుడివవ్వాలన్న పట్టుదలతో ఉండే వాడివి!"

"నేను పంచాలపురం (కన్నౌజు) రాజభవనానికి అధికారిని అన్న విషయం నాకప్పుడు తెలీదు."

"రాచకార్యాలే కాకుండా మిగతావిషయాల్లోనూ నువ్వు తలదూరుస్తున్నావు! అంత అవసరం ఏమొచ్చింది?"

"అంటే బ్రహ్మదగ్గర్నుంచి - బ్రహ్మతత్వానికి నే వేస్తున్న పెద్ద అంగ గురించా అడుగుతున్నావూ లోపా! ఇదీ రాచకార్యానికి సంబంధించినదే. వేరైనది కాదు. రాజ్యానికి ఆసరా ఇవ్వడం కోసమే మన పూర్వీకులైన రాజులు వశిష్ఠుణ్ణి విశ్వామిత్రుణ్ణీ అంతగా సన్మానించేవారు. ఆ ఋషులు ఇంద్రుని పేరు అగ్ని పేరూ వరుణుడి పేరూ చెప్పి రాజుగారి ఆజ్ఞలని పాటించాలని ప్రజలని ప్రేరేపిస్తూ ఉండే వారు. ఆకాలంలో రాజులు ప్రజల విశ్వాసాన్ని చూరగొనడానికి ఈ దేవతల పేరుతో పెద్ద పెద్ద యజ్ఞాలు బ్రహ్మాండమైన ఖర్చుతో చేసేవారు. ఇప్పుడూ మనం యజ్ఞాలు చేస్తున్నాం. బ్రాహ్మలకి దానాలూ దక్షిణలూ ఇస్తున్నాం. ప్రజలు దేవతల దివ్యశక్తిని నమ్మాలనీ, మనం తింటున్న ఈ బాస్మతి (సువాసన వేసే) వరి అన్నం, ఆవుదూడల మాంసంతో చేసిన మధురమైన సూపూ మనం కట్టుకుంటున్న సన్నని మెత్తటి బట్టలూ, మనం పెట్టుకుంటున్న రత్న వైడూర్యాలు ముత్యాలతో చేసిన ఆభరణాలూ ఇవన్నీ ఆ దేవతల దయవల్లేనని ప్రజలు అనుకోవాలని మనమూ పనులు చేస్తున్నాం."

"అయితే ఈ పాతదేవతలు చాల్లేదా? ఇప్పుడీ కొత్త బ్రహ్మ అవసరం ఏమొచ్చిందీ?"

"ఇంద్రుణ్ణిగాని వరుణున్నిగాని బ్రహ్మనిగాని కొన్నితరాలై ఎవరూ చూడ లేదు. ఇప్పుడు చాలామందికి వాళ్ళగురించి సందేహాలు మొదలయ్యాయి."

"అలా అయితే మరి ఈ బ్రహ్మం మీద సందేహం కలగదా?"

"ఎవరూ దాన్ని చూడాలన్నమాట ఎత్తడానికి వీలులేకుండా నేను బ్రహ్మ స్వరూపాన్ని చెప్పాను. అది ఆకాశంలాగ చూసేదీ కాదు. వినేదీకాదు. ఇక్కడా అక్కడా ఎక్కడబడితే అక్కడ ఉండేది! మరి అలాంటిదాన్ని చూడాలన్న ప్రశ్నన్నది ఎలా వస్తుందీ? ప్రశ్నన్నది ఆ సాకారదేవుళ్ళ గురించే వస్తుంది మరి!"

"నువ్వు ఆకాశం ఆకాశం అంటూ అసాధారణులైన ఉద్దాలకుడూ ఆరుణి లాంటి బ్రాహ్మలనే భ్రమలో పెట్టేస్తున్నావు. ఇదంతా ప్రజల్ని భ్రమలో పెట్టి ఉంచడానికేనా?"

"లోపా! నువ్వు నన్నెరుగుదువు. నీ దగ్గర నేనేం దాచగలుగుతానూ? ఈ రాజభోగాల్ని ఇలా చేతిలో ఉంచుకోడానికి సందేహాలు లేవనెత్తేవాళ్ళ బుద్ధిని మొక్కపోయేటట్టు చెయ్యాలి. ఇది చాలా అవసరం. దేవుళ్ళపట్లా వాళ్ళకోసం చేసే యజ్ఞాల పట్లా పూజలపట్లా సందేహాల్ని లేవనెత్తే వాళ్ళే ఇవాళ మనకున్న పెద్ద శత్రువులు!"

"మరి నువ్వు బ్రహ్మ అస్తిత్వం గురించి, అతని దర్శనం గురించి కూడా మాట్లాడుతున్నావే?"

"అస్తిత్వం ఉన్నాదంటే మరి దర్శనం కూడా ఉండాలి. అయితే ఇంద్రియాల ద్వారా కాదు. ఇంద్రియాల ద్వారా దర్శించగలం అని కాని చెప్పేమా మరి సందేహవాదులు, 'అయితే అతణ్ణి చూపించూ" అని నిలదీస్తారు అందుకే ఆయన్ని దర్శించడానికి పొందడానికి కావల్సిన సాధనాలు ఎన్నెన్నిటి గురించో ఇలా చెపుతున్నాను కదా-ప్రజలు ఏభై అరు తరాల వరకూ తోవ తెలీక అటూ ఇటూ తిరుగుతూ ఉండిపోతారు. అయితే నమ్మకాన్నీ కోల్పోరు!! పురోహితులు చెప్పిన స్థూలమైన ఆయుధాన్ని పనికిరానిదానిగా భావించి ఈ సూక్ష్మమైన అయుధాన్ని కనిపెట్టాను. నువ్వు శబరులదగ్గర రాతి ఆయుధాల్నీ, రాగి ఆయుధాల్నీ చూశావు కదా లోపా?"

"ఆఁ. నీతోపాటు దక్షిణం వేపున్న అరణ్యాల్లో తిరగడానికి వెళ్ళినపుడు చూశాను."

"అదే - యమునా నదికి ఆవలగట్టు వేపు. శబరుల రాతి ఆయుధాలూ, రాగి ఆయుధాలూ నల్ల లోహంతో(ఇనుం)చేసిన మన ఈ ఆయుధాలకి ఆగుతాయా?"

"ఊహూఁ. ఆగవు."

"మరి అలాగే వశిష్ఠుడూ, విశ్వామిత్రుడూ చెప్పిన ఈ పాతదేవుళ్ళు వాళ్ళ కోసం చేసే యజ్ఞాలూ శబరుల్లాంటి వాళ్ళని సంతుష్టపరచగలవు. వాళ్ళకున్న వివేకం వాటిని ఒప్పుకోగలదు. అయితే బాగా వివేకం ఉన్న ఈ సందేహవాదుల తీక్షణబుద్ధి దగ్గర ఆ దేవుళ్ళూ యజ్ఞాలు పనికిరాకుండా పోతున్నాయి.''

"వాళ్ళ దగ్గర నీ బ్రహ్మకూడా ఆగడు! ఎందుకూ పనికిరాడు. నువ్వు జ్ఞానులైన బ్రాహ్మల్ని శిష్యులుగా చేసుకొని బ్రహ్మజ్ఞానం బోధిస్తూ తిరుగుతున్నావా, మరి నేను నీ ఇంట్లోనే నీ మాటల్ని పచ్చి అబద్ధాలనీ, వొట్టి మోసమనీ అంటున్నాను."

"నువ్వు అసలు రహస్యాన్ని (ఉపనిషత్తు) తెలుసుకున్నావు మరి."

"బ్రాహ్మలు వివేకులైతే నీ రహస్యాన్ని పట్టలేరా!"

"దాన్ని నువ్వు చూస్తున్నావు. కొంతమంది ఈ రహస్యాన్ని పట్టుకుంటున్నారు. అయితే వాళ్లు నా ఈ రహస్యం (ఉపనిషత్తు), ఈ ఆయుధం తమకు చాలా ఉపయోగపడుతుందని అనుకుంటున్నారు. వాళ్ళ పౌరోహిత్యం అన్నా వాళ్ళ పెద్దరికం అన్నా ఆచార్యత్వం అన్నా ప్రజలకి నమ్మకం పోయింది. అంటే దాని ఫలితంగా వాళ్ళకి దొరికే దక్షిణలు దొరక్కుండా పోతున్నాయి. ఆ దక్షిణల నుంచేకదా వాళ్ళకి

ఎక్కి తిరగడానికి ఆడగుర్రాల రథాలూ, తిండానికి ఉత్తమమైన భోజనం, ఉండటా నికి అందమైన భవంతులూ, అనుభవించడానికి అందమైన దాసీలు లభించేది! !"

"ఇది పూర్తిగా వ్యాపారమేగా?''

"వ్యాపారమే. ఇలాంటి వ్యాపారం కదా ఇందులో నష్టం వస్తుందన్న భయం లేదు. అందుకే ఉద్దాలకుడు లాంటి వివేకవంతుడైన బ్రాహ్మడు నా దగ్గరికి చేత సమిధ పట్టుకుని నా శిష్యుడవడానికి వస్తున్నాడు. బ్రాహ్మలపట్ల గౌరవాన్ని ప్రద ర్శిస్తూ వాళ్ళకి ఉపనయనాలు చెయ్యకుండానే అంటే శాస్త్రానుసారం గురువుని కాకుండానే నేను వాళ్ళకి బ్రహ్మజ్ఞానాన్ని ప్రసాదిస్తున్నాను.''

"ఇదెంత నికృష్టమైనదో! ఎంత నీచమైన ఆలోచనో! ప్రవాహణా!''

"ఒప్పుకుంటున్నాను. కాని మన ఆశయానికి ఇది అన్నిటికన్నా ఉపయోగ పడే సాధనం. వశిష్ఠుడూ, విశ్వామిత్రుడూ తయారుచేసిన నౌక వెయ్యేళ్ళన్నా పని చెయ్యలేదు! కాని ప్రవాహణుడు తయారుచేస్తున్న ఈ నౌక రెండువేల ఏళ్ళ వరకూ రాజుల్ని, సామంతుల్ని, ఇతరుల దనాన్ని అపహరించి భోగాలనుభవించే వాళ్ళనీ వాళ్ళు చేరాలనుకున్న తీరాలకి చేరుస్తూ ఉంటుంది. యజ్ఞం అనే నౌక అంత బల మైనదానిగా నాకు అనిపించలేదు లోపా! అందుకే ఈ దృఢమైన నౌకని తయారు చేశాను. దీన్ని బ్రాహ్మలూ, క్షత్రియులూ కలిసి సరిగ్గా ఉపయోగించుకుంటూ ఐశ్వ ర్యాన్ని అనుభవిస్తూ ఉంటారు. అయితే లోపా, ఈ అవకాశం, లేదా ఈ బ్రహ్మ కన్నా గొప్పదాన్ని మరో దాన్ని నేను కనిపెట్టాను.''

"అదేమిటి?"

"చచ్చి మళ్ళీ ఈ లోకంలోకి తిరిగిరావటం - పునర్జన్మ!"

"ఇది అన్నిటికన్నా పెద్దమోసం!"

"మరి అన్నిటికన్నా ప్రయోజనాన్ని ఇచ్చేదికూడా! ఎంత ఎత్తుని మన సామంతుల దగ్గరా, బ్రాహ్మలదగ్గరా, కోమట్ల దగ్గరా అపారమైన ఐశ్వర్యం పోగు పడుతూ వచ్చిందో అంతెత్తునీ సామాన్య ప్రజలు డబ్బు లేని వాళ్ళయ్యేరు. ఈ డబ్బు లేని వాళ్ళని, చేతిపనులు చేసేవాళ్ళనీ, రైతుల్నీ దాసదాసీజనాన్ని రెచ్చకొట్టే వాళ్లు పుట్టుకొస్తున్నారు. 'మీరు మీకష్టార్జితాన్ని ఇతరులకి ఇచ్చి బాధలు పడుతున్నారు. మీరు ఇలా బాధలు పడ్డం వల్లా, త్యాగాలూ, దానాలూ చెయ్యడం వల్లా చచ్చేక స్వర్గానికి వెళ్తారు, అంటూ వాళ్ళు మిమ్మల్ని మోసంచేస్తూ నమ్మకం కలగజేస్తున్నారు. ఎవరూ స్వర్గానికి వెళ్ళి చచ్చిపోయిన వాళ్ళు అనుభవించే ఐశ్వర్య భోగాల్ని చూడలేదు అని చెపుతున్నారు. దీనికే నా విరుగుడు! నా జవాబు. ఈ ప్రపంచంలో కనిపించే హెచ్చు తగ్గులకీ, చిన్నా పెద్ద జాతుల బేదానికీ, గొప్పవాళ్ళూ, బీదవాళ్ళూ అన్న తేడాకీ కారణం పూర్వజన్మలో చేసుకున్న కర్మల ఫలితమే! దీని ప్రకారం మేం పూర్వ జన్మలో చేసుకున్న సత్కర్మలకీ, దుష్కర్మలకీ ఫలితాల్ని ప్రత్యక్షంగా చూపి స్తున్నాం!"

"అలా అయితే దొంగకూడా తన దొంగసొత్తుని పూర్వజన్మ ఫలితంగా చెప్పగలుగుతాడే?"

"కానీ దానికి మేం మొదటే దేవతల సహాయం, ఋషుల సహాయంతోపాటు ప్రజల నమ్మకాన్ని కూడా సంపాదించుకున్నాం. దాన్నించి దొంగసొత్తుని పూర్వ జన్మ వల్ల కలిగిన సంపాదనగా అంగీకరించటం జరగదు. ఈ జన్మలో శ్రమించ కుండా ఆర్జించిన ధనం దేవతల దయవల్ల దొరుకుతుందని మేం ఇంతకు ముందు చెప్పేవాళ్ళం. కాని దేవుళ్ళన్నా, వాళ్ళ దయన్నా సందేహం పుట్టడంతో మరో కొత్త చిట్కాని చూడాల్సిన అవసరం వచ్చిపడ్డది. బ్రాహ్మల్లో దానిక్కావల్సిన దేమిటో ఆలోచించే శక్తి లేకుండా పోయింది. ప్రాచీన ఋషుల మంత్రాలనీ ప్రవచనాల్నీ వల్లెవెయ్యడంలోనే వాళ్ళు తమ ఆయుష్షులో నలభై నలభైఅయిదేళ్ళు గడిపేస్తున్నారు. చాల్ల మరో కొత్తవిషయాన్ని గంభీరమైన దాన్ని ఏం ఆలోచించగలరు?"

"కాని నువ్వూ వల్లెవెయ్యటంలో చాలా కాలాన్నే వెచ్చించావు ప్రవాహణా!"

"పదహారేళ్ళే! ఇరవైనాలుగేళ్ళు నిండేక నేను బ్రాహ్మణ విద్యలని వదిలి, బైట ప్రపంచంలోకి వచ్చేశాను. ఇవతలికి వచ్చేకే నాకు చదవడానికి ఎక్కువగా దొరికింది. బ్రాహ్మలు తయారు చేసిన పాతనౌక ఈనాటి పరిస్థితులకి బలమైనది కాదన్న సంగతి రాజ్య పరిపాలనలోని సూక్ష్మాలు బోధపర్చుకున్నాకే తెలిసింది."

"అందుకని నువ్వు దృఢంగా ఉన్న నౌకని తయారుచేశావా?"

"సత్యాసత్యాలతో నాకు సంబంధం లేదు. అది ప్రయోజనకరమూ కాదా అన్నదే నాక్కావలసినది! లోపా! ప్రపంచంలో తిరిగి తిరిగి జన్మించడం అన్న సంగతి కొత్తగా ఇవాళ కనిపిస్తోంది. ఐతే దాన్లో వున్న స్వార్థంకూడా నాకు తెలుసు. కాని నా బ్రాహ్మణ శిష్యులు దాన్ని పట్టుకుని ఇప్పుడే ప్రచారం చేసేస్తున్నారు. పితృ దేవతలు వెళ్ళే మార్గాన్ని, దేవతల మార్గాన్ని (పితృయానం, దేవయానం)తెలుసుకో డానికి అప్పుడే జనం పన్నెండేసి సంవత్సరాలు ఆవుల్ని మేపడానికి సిద్ధపడుతు న్నారు! లోపా! నువ్వూ వుండవు. నేనూ వుండను. కాని దరిద్రులు యావన్మందీ ఈ పునర్జన్మ నమ్మకంతో, యావజ్జీవం కలిగే కష్టాల్ని, అన్యాయాల్ని, కాఠిన్యాల్ని సహించడానికి సిద్ధపడేకాలం వస్తుంది! స్వర్గం అంటే ఏమిటో నరకం అంటే ఏమిటో చెప్పడానికి ఎంత తిరుగులేని చిట్కానో ఇది! చూశావా లోపా!"

"కాని ఇది తన పొట్టకోసం, తన స్వార్థంకోసం వందలాది తరాలను పాడు చెయ్యడం! నాశనం చెయ్యడం!"

"వశిష్ఠుడూ, విశ్వామిత్రుడూ పొట్టకోసమే వేదాన్ని రచించారు. ఉత్తర పంచాల (రుహేల్ఖండం) రాజు దివోదాసు శబరదుర్గాలని కొన్నిటిని జయించ డంతో అతని మీద కవితలమీద కవితలు అల్లారు. పొట్టకోసం ఏర్పాటు చేసుకోవ డంలో తప్పులేదు. అయితే మన పొట్టకోసమే కాకుండా రాబోయే వెయ్యేళ్ళవరకూ

మన కొడుకులు, మనవలు. సోదరులు, బంధువులు అందరి పొట్టలకోసం ఏర్పాటు* చేసినప్పుడే మన కీర్తి ఎప్పటికీ నిలిచిపోయి ఉంటుంది. ప్రవాహణుడు ఆ పనే చేస్తున్నాడు. దాన్ని ప్రాచీన ఋషులు కూడా చెయ్యలేకపోయారు. ధర్మపిండాలు తినే బ్రాహ్మలు కూడా ఆ పనిని చెయ్యలేకపోయారు."

"నువ్వు ఎంత కఠినాత్ముడివో! ప్రవాహణా!"

"కాని నే నెంతో యోగ్యతతో నా పనిని పూర్తిచేశాను."

## 3

ప్రవాహణుడు చనిపోయాడు. అతని బ్రహ్మవాదం, అతని పునర్జన్మ లేక పితృయాన వాదాలు సింధు దగ్గర్నుంచి సదానీరా(గండక్)తీరం వరకూ తమ విజయ ఢంకాని మోగిస్తున్నాయి. యజ్ఞాల ప్రచారం ఇంకా అంతగా తగ్గిపోలేదు. అయితే బ్రహ్మజ్ఞానులు వాటిని నిర్వహించటంలో విశేషమైన ఉత్సాహాన్ని ప్రదర్శిస్తున్నారు. క్షత్రియుడైన ప్రవాహణుడు కనిపెట్టిన బ్రహ్మవాదంలో బ్రాహ్మలు చాలా దక్షులైపోయారు. దాంట్లో కురుపాంచాలంలో కురుల యాజ్ఞవల్క్యుడికి మంచి ఖ్యాతి వచ్చింది. మంత్రస్రష్టలూ, యజ్ఞప్రతిష్టాపకులూ అయినా వశిష్ఠుడూ, విశ్వామిత్రుడూ, భరద్వాజుడూ పుట్టిన కురు పాంచాలంలో యాజ్ఞవల్క్యుడూ అతని సహచరులూ అయిన బ్రహ్మవాదులూ, బ్రహ్మవాదినులు బాగా పేరుపొందారు. బ్రహ్మవాదుల పరిషత్తులని నిర్వహిస్తే యజ్ఞాలు చేసినదానికన్నా ఎక్కువ పేరు వస్తోంది. అంచేత రాజులు రాజసూయం మొదలైన యజ్ఞాలతోపాటో లేదూ అంటే వేరుగానో పరిషత్తుల్ని నిర్వహించేవారు. వాదంలో గెలిచినవారికి ఆ పరిషత్తుల్లో వేలకొద్దీ గోవుల్ని, గుర్రాల్ని, దాసదాసీజనాల్ని బహుమానంగా యిచ్చేవారు. (ముఖ్యంగా దాసీజనాన్ని ఎక్కువగా యిచ్చేవారు. ఎంచేతా అంటే బ్రహ్మవాదులు రాజుల అంతఃపురంలో పెరిగిన దాసీలంటే విశేషంగా మక్కువ చూపెట్టేవారు.)

యాజ్ఞవల్క్యుడు యెన్నో పరిషత్తుల్లో గెలిచాడు. ఈసారి విదేహరాజు (తిర్హుత్) జనకుని పరిషత్తులో గొప్ప విజయాన్ని సాధించాడు. అతని శిష్యుడు సోమశ్రుడు వెయ్యి ఆవుల్ని తన సొంతం చేసుకున్నాడు. విదేహనుంచి కురు వరకూ ఆ ఆవుల్ని తోలి తెచ్చుకునే కష్టాన్ని యాజ్ఞవల్క్యుడు ఎందుకు పడతాడు? అతడు ఆ ఆవుల్ని బ్రాహ్మలకి పంచిపెట్టేశాడు. బ్రహ్మవాదిగా యాజ్ఞవల్క్యుడికి పెద్ద పేరు వచ్చింది. హిరణ్యాన్ని (బంగారపు నాణాలు) సువర్ణాన్ని, దాసదాసీజనాల్ని, సంకర జాతి ఆడగుర్రాల రథాన్ని అతడు తనతోపాటు ఎన్నో పడవల్లో నింపుకుని కురు దేశానికి తెచ్చుకున్నాడు.

---

* త్వం తదుక్థ మింద్ర వర్హణాకః ప్రయచ్ఛతా సహసా శూర దర్షి

అవగిరేదసం శంబరం హన్ ప్రావో దివోదాసం చిత్రాభిరూతీ॥ ఋగ్వేదం 6,26,5

ప్రవాహణుడు చనిపోయి అరవై ఏళ్ళైపోతుంది. అప్పటికి యాజ్ఞవల్క్యుడు ఇంకా పుట్టన్నా పుట్టలేదు. కాని నూరేళ్ళు పైబడ్డ లోపా పంచాలపురం (కనోజ్) బయటనున్న రాజోద్యానంలో ఇప్పటికీ ఉంటోంది. ఉద్యానంలోని మామిడిచెట్లు, అరటిచెట్లు, నేరేడుచెట్లు వాటి నీడల్లో ఉండటం అంటే ఆవిడకి ఇష్టం. బతుకంతా ఆవిడ ప్రవాహణుడి మాటల్ని ఎప్పుడూ ఖండిస్తూనే వచ్చింది. కాని ఈ అరవై ఏళ్ళలో ప్రవాహణుడి దోషాల్ని ఆవిడ మర్చిపోయింది. జీవితాంతం ప్రవాహణుడు తనపట్ల చూపిన ప్రేమే ఇప్పుడు ఆవిడకి జ్ఞాపకం ఉంది. ఇప్పటికీ మునిలామె కంటి చూపు మందగించలేదు. బుద్ధిమాంద్యమూ రాలేదు. ఐతే బ్రహ్మవాదులంటే ఇప్పటికీ ఆవిడకి ఒళ్ళుమంటే! ఆ వేళ బ్రహ్మవాదిని గార్గీ వాచక్నవి పంచాల పురానికి వచ్చింది. రాజోద్యానానికి దగ్గర్లోనే ఉన్నా ఓ ఉద్యానంలో యెంతో గౌరవ సన్మానాలతో ఆవిణ్ణి విడిది చేయించారు. జనకుని పరిషత్తులో యాజ్ఞవల్క్యుడు ఎలా మోసంచేసి తనని ఓడించాడో గార్గి మర్చిపోలేకుండా ఉంది. "మళ్ళీ ప్రశ్నించావంటే నీ తల వక్కలైపోతుంది!'' - ఇలా అనడం చర్చ ఎలా అవుతుంది? రక్తంలో చేతులు తడుపుకునే క్రూరులే ఇలా అనగలిగేది - చెయ్యగలిగేదీనూ! గార్గికి ఈ ఆలోచనలు తెగటంలేదు.

గార్గి లోపా పితృకులానికి చెందిన అమ్మాయి. బ్రహ్మవాదం విషయంలో ఆవిడతో అసలు ఏకీభవించకపోయినా లోపాకి ఆవిణ్ణి బాగా తెలుసు. ఈసారి యాజ్ఞవల్క్యుడు తనమీద నీచమైన ఆయుధాన్ని ప్రయోగించడంతో యాజ్ఞవల్క్యుడంటే గార్గి మండిపడుతోంది. అందుకే తన ముత్తవ్వ మేనత్త దగ్గరికి వచ్చింది. ఆవిడ భావాల్లో కొంత మార్పు తప్పనిసరిగా వచ్చింది. తన దగ్గరికి వచ్చిన గార్గి నుదుటినీ కళ్ళనీ లోపా ముద్దుపెట్టుకుని కౌగలించుకుంది. కుశల ప్రశ్నలు వేసింది.

"విదేహం నుంచి వస్తున్నానత్తయ్యా!" అన్నాది గార్గి.

"మల్లయుద్ధం చెయ్యటానికి వెళ్ళేవా తల్లీ!"

'ఊఁ, మల్లయుద్ధమే జరిగింది అత్తా! ఈ బ్రహ్మవాదుల పరిషత్తులు మల్లయుద్ధాలాంటివే! వాటికన్న ఎక్కువైనవి కావు. మల్లుల్లాగే వీటిలోనూ ప్రత్యర్థిని మోసంతోనూ కపటంతోను, నేలకరిపించే నీతి ఉంటుంది'"

"కురుపంచాలలోని చాలామంది బ్రహ్మవాదులు రంగంలోకి దూకిఉంటారే!"

"కురుపంచాలం ఇప్పుడు బ్రహ్మవాదుల దుర్గం ఆయిపోయింది."

"నా కంటి ముందే ఈ బ్రహ్మవాదపు నెరుసుని, చాలా చిన్న నెరుసుని నా ప్రవాహణుడు విడిచిపెట్టాడు. అదీ సదుద్దేశంతో కాదు !! ఇప్పుడా నెరుసు కాస్తా కార్చిచ్చు అయి కురుపంచాలాన్నంతటినీ కాల్చి విదేహకి పాకుతోంది.''

"అత్తా! నువ్వనే మాటల్లో ఉన్న నిజం ఇప్పుడు నాకు కొంచెం కొంచెం గ్రహింపులోకి వస్తోంది. నిజానికి ఇది భోగవిలాసాలని సంపాదించటానికి ఓగొప్ప

సాధనం. విదేహలో యాజ్ఞవల్క్యుడికి లక్షల కొద్దీ సంపత్తి దొరికింది. మిగతా బ్రాహ్మలకీ కావలసినంత డబ్బు లభించింది."

"అమ్మాయీ! ఇది యజ్ఞంకన్నా లాభసాటైన వ్యాపారం. మా ఆయన దీన్ని రాజులకీ, బ్రాహ్మలకీ భోగవిలాసాలని కలిగించే మంచి బలమైన నౌక అని అంటూ ఉండేవాడు. అయితే యాజ్ఞవల్క్యుడు జనకుని పరిషత్తులో గెలిచాడన్న మాట! మరి నీవు మాట్లాడలేదా?''

"మాట్లాడకపోయినట్లైతే ఇంత దూరం గంగానదిలో నౌకని నడపాల్సిన అవసరం ఏముందీ?"

"నౌకలో దొంగలూ దోపిడీగాళ్ళూ తగల్లేదుకదా!"

"లేదత్తా ! వ్యాపారస్తుల గుంపులో అందులోనూ పెద్ద పెద్ద గుంపుగా వెళ్తున్నప్పుడు భటుల ఏర్పాటూ ఉంటుంది. మా బ్రహ్మవాదులం ఒంటరిగా తిరిగి మా ప్రాణాల్ని విపత్తులో పెట్టుకునేటంత మూర్ఖులం కాము."

''అయితే యాజ్ఞవల్క్యుడు అందరినీ ఓడించేశాడా?"

"ఓడించడం అని దాన్ని అనకూడదు."

"ఏం? అదెందుకనీ !"

"పృచ్ఛకులు యాజ్ఞవల్క్యుడి జవాబు విని నోరు మూసుకుని ఊరుకున్నారు. అందుకని అది ఓడించడం అవదు."

"నువ్వూనా?"

"ఆహా నేనూను. కాని అతడు వాదించి నా నోరు మూయించలేదు. వ్యర్థ ప్రలాపంతో నా నోట మాట రాకుండా చేశాడు."

"వ్యర్థ ప్రలాపంతోనా?"

"ఊఁ. బ్రహ్మగురించి నేను ప్రశ్నిస్తున్నాను- నా ధాటికి తట్టుకుని తప్పించుకోడానికి వీల్లేకుండా యాజ్ఞవల్క్యుడ్ని వాదంతో ముట్టడించాను. అప్పుడు యాజ్ఞవల్క్యుడు నేనాశించని మాట అన్నాడు.

"ఏమిటది అమ్మాయీ ?"

"నీ తల ముక్కచెక్కలై పోతుంది గార్గీ – మళ్ళీ ప్రశ్నవేశావో జాగ్రత్త అని అతడు నా ప్రశ్నకి జవాబు అడగడానికి వీల్లేకుండా నన్ను ఆపేశాడు."

"ఇది వరకు అయితే లేదు కాని అమ్మాయీ ఇప్పుడు నాకు నమ్మకం కలుగుతోంది. గార్గీ! యాజ్ఞవల్క్యుడు ప్రవాహణుడికి పక్కా శిష్యుడని ఋజువయింది. ప్రవాహణుడి మిథ్యావాదాన్ని ఇతడు సంపూర్ణత్వం వరకూ తీసుకెళ్లాడు. మంచిపనే అయింది గార్గీ! నువ్వు మళ్ళీ ప్రశ్నించలేదు!"

"నీకెలా తెలిసింది అత్తా!''

''నువ్వు నా కళ్ళ ముందు సజీవంగా నీ తలతోపాటు ఉండడంవల్ల !"

"అయితే నేను ఇంకా ప్రశ్నించి ఉంటే నా తల వక్కలైపోయేదన్న మాటని నువ్వు నమ్ముతున్నావా అత్తా !"

"ఆహా తప్పకుండా! కాని యాజ్ఞవల్క్యుడి బ్రహ్మతేజం చేతకాదు. ఇతరుల తలలెలా వక్కలైపోతున్నట్టు మనం చూస్తూ ఉన్నామో అలాగ...."

"కాదత్తా!"

"నువ్వు చిన్నపిల్లవి గార్గి! ఈ బ్రహ్మవాదం కేవలం మానసిక కల్పనా మనస్సు ఆడే తలకిందులాట అని నీకు తెల్సు.అదేకాదు గార్గి, దీని వెనక రాజులదీ బ్రాహ్మలదీ గొప్ప స్వార్థం ఉన్నాది. ఈ బ్రహ్మవాదం పుట్టినప్పుడు – దీన్ని పుట్టించినవాడు నా పక్కలో పడుకుంటూ ఉండేవాడు. ఇది రాజు అధికారాన్ని, బ్రాహ్మణ అధికారాన్ని దృఢపరిచే గొప్ప సాధనం! ఇనుంతో చేసిన ఖడ్గంలాగ, రక్తసిక్త హస్తుడూ, క్రూరుడూ అయిన భటుడిలాగా!"

"నేనలా అనుకోలేదు అత్తా!"

"చాలా మంది అలా అనుకోడంలేదు. జనక వైదేహుడూ ఈ రహస్యం (ఉపనిషత్తు) ఎరిగి ఉండడని నేను అనుకోను. కాని యాజ్ఞవల్క్యుడికి తెల్సు. మా ఆయన ప్రవాహణుడికి ఎలా తెల్సో అల్లాగా తెల్సు.ప్రవాహణుడికి ఏ దేవుడన్నా, దేవలోకమన్నా, పితృలోకమన్నా యజ్ఞాలన్నా బ్రహ్మవాదమన్నా నమ్మకంలేదు. కేవలం భోగవిలాసాల మీద అతనికి నమ్మకం ఉంది. తన జీవితంలోని ప్రతిక్షణాన్నీ ఈ భోగవిలాసాల కోసమే అర్పించాడు. ఇంక మూడు రోజులకి చచ్చిపోతాడనగా విశ్వామిత్రుని కులానికి చెందిన పురోహితుడి కూతురు సువర్ణకేశాలతో అందంగా ఉన్న అమ్మాయి అతని రాణివాసంలోకి వచ్చింది. బతుకుతాడన్న ఆశలేదు. అయినా సరే అతడు ఆ ఇరవై ఏళ్ళ అందమైన అమ్మాయితో ప్రేమసల్లాపా లాడుతూనే ఉన్నాడు."

"ఆవుల్ని దానం చేసేసి, విదేహరాజు ఇచ్చిన అందమైన దాసీలని యాజ్ఞవల్క్యుడు తనతోపాటు తెచ్చుకున్నాడు అత్తా?"

"అతడు ప్రవాహణుడి పక్కా శిష్యుడని నేనిందాకనే చెప్పాను కదా! చూశావా అతని బ్రహ్మవాదాన్ని? మరి దీన్ని నువ్వు దూరం నుంచి చూశావు. దగ్గర్నుంచి చూసే అవకాశం దొరికి ఉంటే చూసి ఉండేదానివి అమ్మాయీ!"

"అయితే అత్తా, నేను ఇంకా ప్రశ్నించి ఉంటే నా తల వక్కలైపోయేదని నువ్వు నిజంగానే అనుకుంటున్నావా?"

"నిస్సందేహంగా ! యాజ్ఞవల్క్యుడి బ్రహ్మతేజం వల్ల మాత్రం కాదు అమ్మాయీ ! ప్రపంచంలో ఎంతమంది శిరస్సులనో చడీచప్పుడూ లేకుండా ఎగరగొట్టేస్తూ ఉండటం లేదూ? అలాగ!"

"నా తల తిరిగిపోతోంది అత్తా!"

"ఇవాళా? నాకైతే నాకు జ్ఞానం వచ్చిన రోజు నుంచీ తిరుగుతోంది !

అంతా కపట నాటకం ! పచ్చిమోసం! ఈ రాజవాదం, బ్రాహ్మవాదం, యజ్ఞవాదం అనీ ప్రజల కష్టారితాన్ని తేరగా అనుభవించే పద్ధతులు! ప్రజలు వాళ్ళంతటవాళ్ళు చైతన్యవంతులైతే తప్ప ఎవరూ వాళ్ళని ఈ ఉచ్చు నుంచి తప్పించి కాపాడలేరు. ప్రజలు చైతన్యవంతులవడం ఈ స్వార్థపరులకి ఇష్టంలేదు."

"ఈ కపటం అంటే అసహ్యించుకొనేటట్లు మనిషి మనస్సు- హృదయం ప్రేరేపించదా!"

"ప్రేరేపిస్తుందమ్మాయీ! నాకున్న ఆశల్లా అదే!"

---

* ఇది నేటికి నూటఎనిమిది తరాలకి ముందు జరిగిన కథ. . ఎగువ బ్రహ్మపురం (గంగా యమునల మధ్యదేశం)లో ఉపనిషత్తులోని బ్రహ్మజ్ఞాన రచన ఆ కాలంలోనే ప్రారంభమయింది. అప్పటికే భారతదేశంలో ఉద్యానాలు, అసలైన ఇనుమూ ప్రచారంలోకి వచ్చేశాయి.

# బంధులమల్లు

(క్రీస్తుకు పూర్వం 490)

## 1

వసంతానికి యౌవనకాలం. చెట్లు ఆకులన్నీ రాల్చేసి కొత్తవాటిని తొడుక్కున్నాయి. సాలవృక్షాలు (టేకుచెట్లు) తమ తెల్లటి పువ్వులతో వనాన్ని సువాసనలతో నింపుతున్నాయి. ఇంకా స్నేపు గడిస్తేనేకాని ఎండ తీవ్రం అవదు. దట్టమైన టేకువనంలో ఎండుటాకులమీద మనుషులు నడుస్తున్న కాలిచప్పుడు వినిపిస్తున్నాది. ఓ పెద్ద పుట్ట (చెదలు పెట్టినది) దగ్గర నిలబడి ఇద్దరు యువతీ యువకులు దాన్ని చూస్తున్నారు. యువతిది ఎర్రటి గౌరవర్ణం. ఆవిడ మొహం మీద నల్లటి పొడుగైన ఉంగరాల జుట్టు ఎగురుతోంది. చిత్తం వచ్చినట్టూ అల్లల్లాడుతున్న ఆ జుట్టు ఆవిడ అందాన్ని మరింత ఎక్కువ చేస్తోంది. యువకుడు తన బలమైన చేతిని యువతి భుజంమీద వేశాడు.

"మల్లికా! ఈ పుట్టని చూస్తూ ఇంత తన్మయంలో పడ్డావేం!"

"చూడు. ఇది రెండు అరలుగా ఎంత పెద్దదిగా ఉందో!"

"అవును. ఇది మామ్మూలు పుట్టలకన్నా పెద్దది. కాని ఇంతకన్నా కూడా పెద్దపుట్టలు ఉంటాయి. వానపడితే దీంట్లోంచి నిజంగానే నిప్పు పొగా వస్తాయా అని నువ్వు ఆలోచిస్తూ ఉండొచ్చు."

"అబ్బే - అది వొట్టి పుక్కిటి పురాణం అయి ఉండొచ్చు. కాని ఈ చీమల్లాంటి చిన్నచిన్న పురుగులు, చీమలకన్నా ఎక్కువ మెత్తటివీ ఎర్రటి రక్తంలాంటి నోరున్న ఈ తెల్లటి పురుగులు ఇంత పెద్ద పుట్టని ఎలా కడుతున్నాయో !"

"మనిషి కట్టిన భవనాలని వాడి శరీర పరిమాణంతో కొలిచిచూస్తే అవీ ఇలాగే ఎన్నోరెట్లు పెద్దవిగా కనపడతాయి. ఇది ఓ చెదపురుగు పనికాదు. నూరువేల చెదపురుగులు కలిసి దీన్ని పెట్టాయి. మనిషికూడా ఇలాగే కలిసి తన పనుల్ని చేస్తాడు!"

"అందుకే నేనూ కుతూహలంతో దీన్ని చూస్తున్నాను. ఇవి పరస్పరం ఎంత మైత్రితో ఉన్నాయో! వీటిని అతి క్షుద్రప్రాణులుగా తలుస్తాం. నూరువేల ప్రాణులు

ఒకటిగా ఉండి ఇంత పెద్ద పెద్ద కట్టడాన్ని చేస్తున్నాయి. మన మల్లులు ఈ చెద పురుగుల్ని చూసైనా కాస్త పాఠం నేర్చుకోరని నాకు విచారంగా ఉంది."

"మనిషి కలిసి ఉండడంలో మైత్రితో ఉండడంలో ఎవరికీ తీసిపోడు. పైగా మనిషి నేడు శ్రేష్టమైన ప్రాణిగా రూపొందేడంటే దానికి కారణం మైత్రీ భావమే! అంచేత అంత పెద్ద పెద్ద నగరాల్నీ, పెద్ద పెద్ద ఊర్లనీ, గ్రామాల్నీ నెలకొల్పడంలో కృతకృత్యుడయ్యాడు. అంచేతే నౌకలు అపారసాగరాన్ని దాటి ద్వీపద్వీపాంతరాల్లోని నిధుల్ని పోగుచేసుకు వస్తున్నాయి. అంచేతే మనిషి ముందు ఏనుగులు, ఖడ్గమృగాలు, సింహాలూ తలవొంచుకుని నిలబడుతున్నాయి."

"కాని మనిషికున్న ఈర్ష్య! ఈ ఈర్ష్యగాని లేకపోయి ఉన్నట్లయితే ఎంత బాగుండి ఉండేది!"

"మల్లుల ఈర్ష్య జ్ఞాపకానికొస్తోందా?"

"ఊఁ, వాళ్లు నువ్వంటే ఎందుకంత ఈర్ష్యపడుతున్నారు? నేనెప్పుడూ నువ్వు ఎవరినీ నిందించగా కాని అపకారం చెయ్యగాకాని చూడలేదు. పైగా నీ మంచి ప్రవర్తనకి దాసులూ పనివాళ్ళూ ఎంత ముగ్ధులవుతున్నారో అందరికీ తెలిసిన సంగతే! అయినా ఎంతమందో గౌరవనీయులైన మల్లులు నువ్వంటే యింతగా అసూయపడుతున్నారు!"

"కారణం చెప్పమంటావా? అందరూ నన్ను ఇష్టపడుతూ ఉండడాన్ని నేను బహుజన ప్రియుడిగా అవడాన్ని వాళ్ళు గమనిస్తున్నారు. ప్రజాతంత్రంలో (గణ రాజ్యం) సర్వులకీ ఇష్టుడైన వాణ్ణి చూసి అసూయపడేవాళ్ళు ఎక్కువగా ఉండడం మామూలే. బహుజన ప్రియత్వం వల్లే ఇక్కడ ప్రజాతంత్ర ప్రముఖుడుగా ఎవడైనా అవగలుగుతాడు."

"కాని నీ గుణాల్ని చూసి వాళ్ళు సంతోషించి ఉండాల్సింది. మల్లుల్లో ఈ రోజు వరకూ తక్షశిలలో ఇంత గౌరవం ఎవరికీ వచ్చినట్టు ఎప్పుడూ విన్లేదు. నేటికి కూడా కోసలరాజు ప్రసేన్‌జిత్తు దగ్గర్నుంచి నీకు ఆహ్వానం మీద ఆహ్వానం వస్తోందని వాళ్ళకి తెలియదా ఏం?"

"మేం తక్షశిలలో పదేళ్ళపాటు కలిసి చదువుకున్నాం. అతనికి నా స్వభావం, నా గుణం తెల్సు."

"కుసీనారా మల్లులకి తెలీదంటే మాత్రం నేను ఒప్పుకోను. మహాలిచ్ఛవి ఇక్కడికి వచ్చి నీ దగ్గర బస చేసినప్పుడు అతని నోట నీ గుణగణాల ప్రశస్తి కుసీనారావాళ్ళు చాలామందే విన్నారు."

"కాని మల్లికా, నేనంటే అసూయపడేవాళ్ళు నా గుణగణాలు తెలిసే అసూయ పడతారు. గుణవంతుడవడం, బహుజన ప్రియుడు కావడం ప్రజాతంత్రంలో ఈర్ష్యకి ముఖ్యకారణం. నాకోసం నేను బాధపడడంలేదు. మల్లులకి సేవచేద్దామని తక్షశిలలో అంత శ్రమపడి శస్త్రవిద్య నేర్చుకున్నాననే నా విచారం. నేడు వైశాలీ లిచ్ఛవుల్ని

కోసలవాళ్ళూ మగధవాళ్ళూ తమతో సమానమైనవారని ఒప్పుకుంటారు. కాని కుసీనారా కోసలరాజ్యాన్ని తనకంటే గొప్పదని, తనమీదదని అనుకుంటోంది. మన పావా, అనూసియ, కుసీనారా మొదలైన తొమ్మిది మల్ల ప్రజాతంత్రాలన్నిటినీ మైత్రీబంధంలో బంధించి లిచ్ఛవుల్లాగ మన తొమ్మిది మల్లుల సమూహాల్ని సమ్మిళితం చేసి బాగా శక్తివంతమైన దుర్గంగా చేద్దామని అనుకున్నాను. తొమ్మిది మల్ల ప్రజాతంత్రాలూ కలిసిపోతే ప్రసేనజిత్ మన వంక కన్నెత్తైనా చూడలేడు. ఇదిగో ఇదే నా విచారం."

బంధులమల్లు గౌరవర్ణపు మొహం వెలవెల పోవడం చూసి మల్లికకి బాధ అనిపించింది. ఆవిడ అందుకని మాటని మార్చింది.

"నీ స్నేహితులు వేటకి వెళ్ళడానికి సిద్ధంగా ఉండి ఉంటారు. నేనూ వద్దామనుకుంటున్నాను. గుర్రాలమీదా? కాలినడకనా?"

"గవయ్ (నీల్‌గాయ్ - ఆవు ఆకారం కల అడివి జంతువు)ని గుర్రం మీంచి వేటాడ్డం కుదరదు మల్లికా! మోకాళ్ళవరకూ వేళ్ళాడే ఈ లుంగీతోనూ మూడు మూరల దూరం వరకూ గాల్లో ఎగిరే ఈ వోణితోనూ, చిత్తం వచ్చినట్టు చెల్లాచెదురుగా నల్లత్రాచుల్లాగ ఎగరే జుట్టుతోనూనా వేటకి వచ్చేది?"

"ఇవి నీకు బాగోలేవా?"

"బాగోలేక పోవడమా?" మల్లిక ఎర్రటి పెదాల్ని అతడు ముద్దుపెట్టుకున్నాడు. "మల్లిక పేరుతో సంబంధమున్న ప్రతీదీ నాకు బాగుంటుంది. అయితే వేటకి వెళ్ళేటప్పుడు అడవితుప్పల్లోంచి పరిగెట్టాల్సివస్తుంది!"

"వీటైతే నేన్నీ ముందరే కట్టేసుకుంటున్నాను." అని మల్లిక లుంగీని బిగించి కట్టుకుంది. జుట్టుని సరిచేసుకుని నెత్తిమీదకి ముడివేసుకుంది. "నా ఓణీని పాగాగా చుట్టిపెట్టు బంధుల్!" అన్నాది.

పాగా చుట్టి కంచుకంలోంచి ముందుకు ఉబికివచ్చి చిన్న మారేడుపళ్ళతో పోటీపడుతున్నాయా అన్నట్టు ఉన్న స్తనాల్ని సగం కౌగలించుకున్నాడు బంధుల్ "మరి నీ యీ స్తనాలో?" అని అడిగాడు.

"మల్లకన్యలందరికీ స్తనాలు ఉంటాయి!"

"కాని ఇంత అందంగా ఉంటాయా?"

"అయితే మాత్రం వీటిన్ని ఎవరైనా ఎత్తుకుపోతాడా ఏం?"

"యువకుల దిష్టి తగులుతుంది!"

"ఇవి బంధుల్‌వి అని వాళ్ళందరికీ తెలుసు."

"ఊహూఁ. నీకు అభ్యంతరం లేకపోతే వీటిని నా అంగవస్త్రంతో లోపల కట్టేస్తాను, మల్లికా!"

"బట్టల చాటునుంచీ కనబడుతూ ఉంటే నీకు తృప్తి కలగటంలేదా?" మల్లిక చిరునవ్వు నవ్వి బంధుల్ మొహాన్ని ముద్దుపెట్టుకుంటూ అడిగింది.

బంధుల్ కంచుకాన్ని తొలగించి తెల్లటి స్పటికశిలలా మెరుస్తున్న వక్షం మీద ఉన్న ఆ రక్తవర్ణపు గుండ్రని స్తనాల్ని అంగవస్త్రంతో కట్టేశాడు. మల్లిక దాని మీద తిరిగి కంచుకాన్ని తొడుక్కుంది.

"ఇప్పుడిహ నీ వనుకున్న ప్రమాదం తప్పిపోయిందా బంధుల్?"

"నా వస్తువుకేం ప్రమాదంలేదు ప్రేయసీ! ఇప్పుడిహ పరుగెత్తేటప్పుడు ఇవి కదలాడవుకూడా!"

వేటకి వెళ్ళడానికి తయారై మల్ల యువతీ యువకులంతా ఈ ఇద్దరి కోసం ఎదురు చూస్తున్నారు. వీళ్ళు రాగానే ధనుస్సులూ, ఖడ్గాలూ, బల్లేలూ పుచ్చుకుని బయల్దేరారు. మధ్యాహ్నపువేళ నీల్‌గాయ్‌లు ఎక్కడ విశ్రాంతి తీసుకుంటాయో ఒకతనికి తెలుసు. అతడు తోవ చూపగా అందరూ అతని వెంట వెళ్లారు. పెద్ద వృక్షాలకింద కొద్దిగా ఉన్న గడ్డినీడలో నీల్‌గాయ్‌ల గుంపొకటి నెమరువేసుకుంటూ విశ్రాంతి తీసుకుంటోంది. గుంపుకి పెద్దదైన ఓ నీల్‌గాయ్ నిల్చుని చెవుల్ని నిక్క పొడ్చుకుని ముందుకూ వెనక్కీ వింటూ కాపలా కాస్తోంది. మల్లులు రెండు భాగాలుగా విడిపోయారు. ఓ భాగం వాళ్ళు అస్త్రశస్త్రాలని పుచ్చుకుని ఓ పక్క చెట్ల చాటుని పొంచి కూచున్నారు. రెండోభాగం వాళ్ళు వెనకవేపు నుంచి ముట్టడించడానికి వీలుగా రెండు దళాలుగా విడిపోయేరు. ఈ రెండు దళాలు తిరిగి కలుసుకునే వేపు నుంచి గాలి వీస్తోంది. నీల్‌గాయ్ ఇంకా లేడితోక లాంటి తన చిన్నతోకని ఆడిస్తూనే ఉంది. రెండు దళాలు కలుసుకోడానికి ఇంకా ముందే మిగతా మృగాలన్నీ కూడా లేచినిల్చుని ముక్కుపుటాలని పెద్దవి చేసుకుని గాలి పీలుస్తూ చెవుల్ని ముందుకు నిగిడించి చలించిన శరీరాలతో ఆ దిశగా చూస్తున్నాయి. ఓ క్షణంలోనే అవి పసికట్టేశాయి. ప్రమాదం ముంచుకొస్తోందని వాటికి అర్థమైపోయింది. నీల్‌గాయ్ వెనకాతలే మిగతా మృగాలన్నీ గాలివీస్తున్న దిశగా పరిగెట్టడం మొదలుపెట్టాయి. ఇంకా అవి ప్రమాదాన్ని కంటితో చూడలేదు. అంచేత మధ్య మధ్య నిల్చుని వెనకవేపుకి చూస్తున్నాయి. దాక్కుని ఉన్న వేటగాళ్ళ దగ్గరికి వెళ్ళి ఓ సారి మళ్ళీ అవి వెనక్కి తిరిగి చూడసాగాయి. సరిగ్గా ఆ సమయానికి ఒక్కసారిగా ఎన్నో వింటినారెలు ధ్వనించాయి. నీల్‌గాయ్ గుండెకి గురిచూసి బంధుల్ బాణం పట్టుకున్నాడు. మల్లికా మిగతా వాళ్ళెంత మందో కూడా దాని గుండెకే గురిపెట్టారు. అయితే బంధుల్ బాణం కాని గురి తప్పి పోయి ఉంటే ఆ మృగం దొరికి ఉండేది కాదు. అది నిజం. నీల్‌గాయ్ నిల్చున్నచోట అక్కడికక్కడే కూలిపోయింది. గుంపులోని మిగిలిన మృగాలు చెల్లాచెదరైపోయి పరుగు పుచ్చుకున్నాయి. బంధుల్ దగ్గరికివెళ్ళి చూసేసరికి నీల్‌గాయ్ ప్రాణాలు విడుస్తోంది. రెండు మృగాలవి నెత్తురు చుక్కల్ని అనుసరిస్తూ వేటగాళ్ళు ఓ కోసెడు దూరం వెళ్ళి ఓ మృగం నేలమీద కూలి పడిపోయి ఉండడం చూసారు. వేటాడ్డంలో కృతకృత్యులు కావడంతో నేటి వనభోజనం మహా ఆనందంగా జరిగింది.

కొంత మంది కర్రలతో పొగలేకుండా పెద్దగా మండే నిప్పుని చెయ్యడం మొదలు పెట్టారు. కొంత మంది పెద్ద రాగిపాత్రల్ని సిద్ధం చేశారు. కొంత మంది మగవాళ్ళు మృగపుచర్మాన్ని వొలిచి మాంసాన్ని ముక్కలుగా కొయ్య సాగారు. అన్నిటికన్నా ముందు నిప్పుమీద కాల్చిన గుండె మాంసమూ, మద్యం తాగే పాత్రలూ వచ్చాయి. మాంసాన్ని ముక్కలుగా. రెండు చేతుల్లోనూ బంధుల్ కోస్తూ ఉండడం నుంచి మల్లిక తనచేత్తో అతని నోటికి కాల్చిన మాంసపు ముక్కనీ మద్యపు పాత్రనీ అందించింది.

మాంసం ఉడకడం పూర్తికానే లేదు చీకటి పడిపోయింది. భగ భగ మండే కట్టెల నిప్పు ఎర్రటికాంతిని వెదజల్లుతోంది. అదే చాలు. ఆ కాంతిలోనే మల్లుల నృత్యగానాలు మొదలయ్యాయి. కుసీనారా అందరిలో అందమైన యువతి - మల్లిక వేటదుస్తుల్లో తన నాట్యకౌశల్యాన్ని, ఎంతో అద్భుతంగా ప్రదర్శించింది. ఆ జంబూ ద్వీపం అంతట్లోనూ అమూల్యమైన స్త్రీరత్నం బంధుల మల్లుకి దొరికిందని అతని స్నేహితులు అతని అదృష్టాన్ని పొగుడుతున్నారు.

## 2

కుసీనారా సంస్థాగారంలో (ప్రజాతంత్ర భవనం) నేడు చాలామంది జనం పోగయ్యేరు. గణసంస్థ (పార్లమెంటు) సభ్యులు యావన్మందీ శాలలో కూచుని ఉన్నారు. ఎంతోమంది ప్రేక్షకులూ, ప్రేక్షకురాళ్ళూ శాల బైటనున్న మైదానంలో నిల్చుని ఉన్నారు. శాలకి ఓ కొసనున్న ప్రత్యేకస్థానంలో గణపతి కూచుని ఉన్నారు. ఆయన సభ్యుల్ని తేరిపార చూసారు. ఆ తర్వాత నిల్చుని ఇలా అన్నారు:

"గౌరవనీయులైన సభ్యులారా! అందరూ వినండి. ఇవాళ మన ఈ సమావేశం ఏ పని నిమిత్తమై జరుపుకుంటున్నామో దాని గురించి గణసంస్థకి తెలుపుతాను. చిరంజీవి బంధుల్ తక్షశిలలో యుద్ధవిద్యలో శిక్షణపొంది మల్లుల గౌరవాన్ని పెంచి తిరిగివచ్చాడు. కుసీనారా బైట జనం కూడా అతని శస్త్ర నైపుణ్యం గురించి ఎరుగుదురు. అతనిక్కడికి వచ్చి నాలుగేళ్ళయింది. మన గణానికి సంబంధించిన చిన్నాచితకా పనులు నా సమ్మతితో అతనికి అప్పగించాను. అతడు ప్రతీపనినీ ఎంతో తత్పరతతో చేసి కృతకృత్యుడవుతూ ఉన్నాడు. ఇప్పుడు గణసంస్థ అతనికి న్యాయమైన పదవిని – ఉప సేనాపతి పదవిని యివ్వాలి. ఇది తీర్మానించటానికి నే చేస్తున్న విజ్ఞప్తి."

"గౌరవనీయులారా! గణసంస్థ చిరంజీవి బంధుల్‌కి ఉపసేనాపతి పదవిని ఇస్తోంది. దీన్ని అంగీకరించిన చిరంజీవి ఊరుకుని అంగీకరించని చిరంజీవి మాట్లాడాలని కోరుతున్నాను."

దీనిని గణపతి ముమ్మారు ప్రకటించాడు.

ఈ సమయంలో రోజ్‌మల్లు అన్న ఓ సభ్యుడు, పై ఉత్తరీయాన్ని తొలగించి ఇట్లలేని కుడిభుజాన్ని ఎత్తి చూపెడుతూ నిలుచున్నాడు.

"చిరంజీవి ఏదో మాట్లాడదామనుకుంటున్నాడు. మంచిది. మాట్లాడు" అన్నాడు గణపతి.

"సభ్యులారా! నాకు చిరంజీవి బంధుల్ యోగ్యత విషయంలో సందేహం ఏంలేదు. అతనిని ఉపసేనాపతిని చేసే విషయాన్ని మాత్రంగా నేను అంగీకరిం చను. మన గణసంస్థలో ఎవరికైనా ఉన్నత పదవిని ఇచ్చేముందు అతనిని పరీక్షించే సంప్రదాయం ఉంది. చిరంజీవి బంధుల్‌ని కూడా ఆ నియమం ప్రకారం పరీక్షించాలని నేను అనుకుంటున్నాను."

రోజ్‌మల్లు కూచున్న తర్వాత మరో ఇద్దరు ముగ్గురు సభ్యులు కూడా అదే మాట అన్నారు. కొంత మంది సభ్యులు పరీక్ష అవసరంలేదని నొక్కి చెప్పారు. చివరికి గణపతి ఇలా అన్నారు—

"గౌరవనీయులైన సభ్యులారా! చిరంజీవి బంధుల్‌ని ఉపసేనాపతిగా నియ మించే విషయంలో గణసంస్థలో కొద్దిగా అభిప్రాయభేదం కనపడింది. అంచేత అభిప్రాయాన్ని (ఓటు) తెలుసుకోవలసిన అవసరం వచ్చింది. శలాకా (కడ్డీ) లను పంచేవారు అభిప్రాయం తెలియచేసే కడ్డీలను (ఓటుని తెలియచెప్పే కర్రపుల్లలు) తీసుకుని మీ దగ్గరికి వస్తున్నారు. వాళ్ళు ఓ చేత్తో ఎర్రకడ్డీలను రెండో చేత్తో నల్ల కడ్డీలను పట్టుకుని ఉన్నారు. ఎర్రకడ్డీ అవునని చెప్పడానికి నల్లకడ్డీ కాదని చెప్ప డానికి! రోజ్ అభిప్రాయాన్ని బలపరుస్తున్న చిరంజీవులు మూల తీర్మానాన్ని అంగీ కరించని వారు నల్లకడ్డీని తీసుకోవాలి. మూల తీర్మానాన్ని అంగీకరించేవారు ఎర్ర కడ్డీని తీసుకోవాలి."

శలాకాలను పంచేవారు అభిప్రాయాన్ని తెలియచేసే కడ్డీలను తీసుకుని ఒక్కొక్క సభ్యుడిదగ్గరకీ వెళ్ళేరు—అందరూ తమ తమ ఇచ్ఛానుసారం ఒక్కో కడ్డీని తీసుకున్నారు. తిరిగి వచ్చేక మిగిలిన శలాకాలని గణపతి లెక్కపెట్టాడు. ఎర్రకడ్డీలు ఎక్కువగానూ నల్లకడ్డీలూ తక్కువగానూ ఉన్నాయి. అంటే నల్లకడ్డీ లను ఎక్కువమంది జనం తీసుకున్నారన్నమాట!

"గౌరవనీయులైన సభ్యులారా! నల్లకడ్డీలను ఎక్కువమంది తీసుకున్నారు. అంచేత గణసంస్థ చిరంజీవి రోజ్‌మల్లుతో ఏకీభవించిందని స్వీకరిస్తున్నాను. ఇప్పు డిహ చిరంజీవి బంధుల్‌ని ఏవిధంగా పరీక్షించాలన్నది గణసంస్థ నిర్ణయించాలని కోరుతున్నాను," అని గణపతి ప్రకటించారు.

ఎంతోసేపు తర్జనభర్జనలూ, వాదవివాదాలూ, చర్చలూ అభిప్రాయసేకర ణకి కడ్డీలూ తీసిన తర్వాత బంధుల మల్లు ఏడుకర్ర రాటలని ఒక్క ఊపిరిని కత్తితో నరికివెయ్యాలని నిర్ణయించారు. ఏడోరోజున పరీక్ష జరుగుతుందని నిర్ణయిం చాక సమావేశం ముగిసింది.

ఏడో రోజున కుసీనారా మైదానానికి స్త్రీ పురుషులు బ్రహ్మాండమైన సంఖ్యలో వచ్చారు. మల్లిక కూడా వచ్చింది. కాస్త కాస్త దూరంలో బలిష్ఠంగా ఉన్న ఏడు కర్ర రాటలు పాతారు. గణపతి ఆజ్ఞానుసారం బంధుల్ తన కత్తిని సరిచేసుకున్నాడు. జనసమూహం యావత్తూ ఊపిరి బిగబెట్టి చూడసాగింది. బంధుల్ మల్లు బలమైన చేతుల్నీ ఆ చేతుల్లోని పొడుగ్గా నిడువైన ఖడ్గాన్నీ చూసి బంధుల్ తప్పకుండా పరీక్షలో గెలుస్తాడు, సందేహం లేదని జనం అనుకున్నారు. బంధుల్ చేతిలోని ఖడ్గం మెరుపులా మీదకి లేవడాన్ని, కింద పడ్డాన్ని జనం చూశారు. మొదటి రాట తెగి పడ్డాది - రెండోదీ, మూడోది, ఆరోది తెగేటప్పుడు బంధుల్ చెవులకి ఖణేల్మనే శబ్దం వినిపించింది. అతని భృకుటి ముడిపడింది. అంత ఉత్సాహం నీళ్ళు కారిపో యింది. బంధుల్ కత్తి ఏడో రాట కొసకంటా తెగకుండానే ఆగిపోయింది. బంధుల్ తొందర తొందరగా అన్ని రాటల చివర్లనీ ఒక్కసారి చూశాడు. అతని శరీరం ఒణికింది. కోపంతో మొహం ఎర్రబడింది. ఆయినా అతడు నోరు విప్పలేదు.

ఏడోరాట కొన పూర్తిగా తెగలేదని గణపతి ప్రకటించారు. జనం సానుభూతి బంధుల్ మల్లు పక్షే ఉంది.

ఇంటికి వెళ్ళాక బంధుల్ మొహం ఎర్రబారి గంభీరంగా ఉండడం చూసి మల్లిక తన విచారాన్ని మరిచి అతన్ని ఓదార్చాలని అనుకుంది.

"మల్లికా! నన్ను గొప్ప మోసం చేశారు. ఇలా చేస్తారని నేననుకోలేదు." అన్నాడు బంధుల్.

"ఏమైంది?"

"ప్రతీ రాటలోనూ ఇనపమేకులు దిగేసి ఉన్నాయి. ఐదోరాట వరకూ నాకేం తెలీలేదు. ఆరోది తెగ్గొట్టినప్పుడు నాకు ఖణేల్మని శబ్దం స్పష్టంగా వినిపించింది. మోసం చేశారని నాకు అర్థం అయ్యింది. ఆ శబ్దాన్ని విని ఉండకపోయినట్లైతే ఏడో రాటా పూర్తిగా తెగ్గొట్టేసి ఉండేవాణ్ణి. కాని మనస్సు కలతచెంది చలించి పోయింది."

"ఇంత మోసమా? ఇది ఎవరు చేశారో కాని వాళ్ళు మహానీచులు."

"ఎవరు చేశారో మనం తెలుసుకోలేం. రోజ్ మల్లంటే నాకెంత మాత్రం కోపం లేదు. నిజానికి అతడు ఉచితంగానే మాట్లాడాడు. అతని అభిప్రాయంతో గణ సంస్థ సభ్యులు ఎక్కువ సంఖ్యలోనే ఏకీభవించారు. కాని కుసీనారాలో నా పట్ల స్నేహభావం కలిగినవాళ్ళు ఇంత లేకుండా ఉన్నారా అని నాకు కోపంగా ఉంది. క్షోభగా ఉంది."

"అయితే బంధుల్ మల్లుకి కుసీనారా మీద కోపం వచ్చిందా?"

"కుసీనారా నన్ను కనిపెంచి పెద్దచేసిన తల్లి. కాని ఇంక నేను కుసీనారాలో ఉండను."

"కుసీనారాని విడిచి వెళ్ళిపోదామనుకుంటున్నావా?"

"కుసీనారాకి బంధుల మల్లు అవసరం లేదు. అంచేత వెళ్ళిపోతాను."

"ఎక్కడికి వెళ్తావు?"

"మల్లికా! నువ్వు నాకు తోడుగా ఉంటావా?" విప్పారిన మొహంతో బంధుల్ మల్లు అడిగాడు.

"నీడలాగ బంధుల్!" మల్లిక బంధుల్ ఎర్రని కళ్ళని ముద్దుపెట్టుకుంది. దాంతో అతనిలోని కరుకుతనం మాయమైపోయింది.

"మల్లికా! నీ చేతులిలా ఇయ్యి." మల్లిక చేతుల్ని తన చేతుల్లోకి బంధుల్ తీసుకున్నాడు.

"ఈ చేతులు నా శక్తి ధారలు! ఇవి ఉన్నాక బంధుల్ ఎక్కడైనా నిర్భయంగా సంచరించగలడు" అన్నాడు.

"అయితే ఎక్కడికి వెళ్దామని నిర్ణయించుకున్నావు? ఎప్పుడు వెళ్దాము?"

"ఏ మాత్రం ఆలస్యం చెయ్యకుండా! ఎంచేతంటావా? రాటల్లో దిగేసిన ఇనుప మేకుల గురించి గణపతికి ఎలాగూ తెలిసిపోతుంది. దాంతో ఆయన మళ్ళీ పరీక్ష చెయ్యడానికి ఇంకో రోజు నిర్ణయిస్తారు. మనం జనం పట్టుబట్టక ముందే ఇక్కణ్ణించి వెళ్ళిపోవాలి."

"అన్యాయాన్ని పరిహరించనియ్యవెందుకని ?"

"కుసీనారా నా గురించి తన అభిప్రాయమేమిటో చెప్పియే చెప్పేసింది. మల్లికా! కనీసం ప్రస్తుతానికి నాకు ఇక్కడ పనేం లేదు. కుసీనారాకి బంధుల్ అవసరం వచ్చినప్పుడు ఇక్కడికి వచ్చి వాలతాడు."

ఆ రాత్రే తీసుకువెళ్ళడానికి వీలైన వస్తువుల్ని తీసుకొని మల్లికా బంధుల్ కుసీనారాని విడిచి వెళ్ళిపోయారు. మర్నాటికి అచిరవతి (రాపతి ఒడ్డు) దగ్గరున్న బ్రాహ్మల ఊరు మల్లగ్రామం (మలావ్, గోరఖ్‌పుర్) చేరుకున్నారు. మల్లుల జనపదంలో మల్లగ్రామపు సాంకృత్యులు తమ యుద్ధ వీరత్వానికి పేరు తెచ్చుకున్న వాళ్ళు. అక్కడ బంధుల్ మిత్రులుకూడా ఉన్నారు. అయితే బంధుల్ స్నేహితుల్ని కలుసుకోడానికి వెళ్ళలేదు - అక్కణ్ణించి పడవ ఎక్కి శ్రావస్తి (సహేట్-మహేట్) వెళ్ళాలని అక్కడికి వచ్చాడు. మల్లగ్రామంలో సుదత్త శ్రేష్ఠిమనుషులు కూడా ఉన్నారు. వాళ్ళ ద్వారా పడవల్ని ఏర్పాటు చేసుకోడం తేలిక. సాంకృత్య బ్రాహ్మణులు తమ కులాచారం ప్రకారం తమ గుమ్మం ముందు ఓ బలిసిన పందిపిల్లని కోశారు. స్వయంగా వండి బంధుల్ మల్లుకి మల్లికకి ఆ మెత్తటి పంది మాంసంతో విందు చేశారు.

## 3

శ్రావస్తి రాజధానిలో కోసలరాజు ప్రసేనజిత్తు తన సహాధ్యాయుడూ మిత్రుడూ అయిన బంధుల్ మల్లుకి బ్రహ్మాండంగా స్వాగతం చెప్పాడు. తక్షశిలలో

ఉన్న రోజుల్లోనే "నేను రాజైనప్పుడు నువ్వు నా సేనాధిపతివి అవ్వాలి." అని ప్రసేన్‌జిత్తు తన కోర్కెని చెప్పాడు. రాజు అయిన తర్వాత కూడా చాలా సార్లు దాని గురించి రాశాడు. కాని ఆ కాలంలో అన్ని రాజ్యాలకన్నా సంపన్నమైన కోసల కాశీలాంటి విశాల రాజ్యానికి సేనాపతి అయ్యేబదులు తన కుసీనారాలో ఓ మామ్మూలు గణసంస్థకి ఉపసేనాపతిగా ఉండడాన్నే బంధుల్ ఎక్కువగా ఇష్ట పడ్డాడు. కాని ఇప్పుడు కుసీనారా అతణ్ణి తృణీకరించింది. అంచేత ప్రసేన్‌జిత్తు ఆ మాట ఎత్తినప్పుడు బంధుల్ ఓ షరతు పెట్టాడు.

"నీ మాటని నేను ఒప్పుకుంటాను మిత్రమా! కాని దానితోపాటు ఓ షరతు ఉంది."

"సంతోషంగా చెప్పు బంధుల్!"

"నేను మల్లపుత్రుణ్ణి."

"నాకు తెలుసు. మల్లులకి వ్యతిరేకంగా వెళ్ళమని నేనెన్నడూ ఆజ్ఞాపించను."

"ఇంతే. అదే నాక్కావల్సింది."

"మిత్రమా! మల్లులతో మా సంబంధం ఎంత వరకూ ఇప్పడుందో అంతే ముందు కూడా ఉంచుకోవాలని అనుకుంటున్నాను. నాకు రాజ్యాన్ని విస్తరించాలన్న కోరిక లేదన్న సంగతి నీకు తెలుసు. ఏదన్నా కారణంచేత నాకు మల్లుల్ని వ్యతిరే కించవలసి వస్తే నీ ఇష్టం వచ్చినవేపు నువ్వు ఉండడానికి నీకు స్వతంత్రం ఉంటుంది. నా ప్రియ మిత్రుడి కోసం ఇంకేమన్నా నే చెయ్యవల్సినది ఉందా?"

"లేదు మహారాజా! చాలు. ఇంతే, ఇంకేం లేదు."

# 4

బంధుల్ మల్లు కోసల సేనాపతి. ప్రసేన్‌జిత్తు లాంటి మెత్తటి రాజుకి, నిరు త్సాహంగా ఉండే రాజుకి ఇలాంటి యోగ్యుడైన సేనాపతి ఒకడు ఉండడం చాలా అవసరం. నిజానికి అతనికి బంధుల్ మల్లుగాని దొరికి ఉండకపోతే మగధులూ వత్సులూ అతని రాజ్యంలో ఎంతో భాగాన్ని బహుశా కొట్టేసి ఉండేవారు.

శ్రావస్తికి వెళ్ళిన కొంత కాలానికి మల్లికలో నీళ్ళు పోసుకున్న లక్షణాలు కనిపించాయి. ఓ రోజు బంధుల్ మల్లు "నీకే వస్తువు మీదైనా మనస్సయితే చెప్పు మల్లికా!" అని అడిగాడు.

"మనసవుతోంది కాని చాలా దుష్కరమైనది."

"బంధుల్ మల్లుకి దుష్కరం అన్నదేది లేదు మల్లికా! ఏమిటది? దేనిమీద మనసవుతోందో చెప్పు."

"అభిషేక పుష్కరిణిలో స్నానం చెయ్యాలని."

"మల్లుల పుష్కరిణిలోనా?"

"కాదు. వైశాలీలోని లిచ్ఛవుల పుష్కరిణి."

"నువ్వు చెప్పింది నిజమే మల్లికా! నీ మనసు తీర్చటం కష్టసాధ్యమే అయినా బంధుల్ మల్లు తప్పకుండా తీరుస్తాడు. రేప్పొద్దున్నే సిద్ధంఅవు! రథం మీద మనిద్దరం వెళ్దాం."

మర్నాడు తోవలో తిండానికి కావల్సినవి పట్టుకుని ఖడ్గం, ధనుస్సు మొదలైన ఆయుధాల్ని తీసుకుని వాళ్ళిద్దరూ రథం ఎక్కారు.

దూరదూరపు మజిలీల నెన్నిటినో ఎన్నో వారాలు ప్రయాణంచేసి దాటాడు. ఆఖరికి ఓ రోజున బంధుల్ రథం వైశాలీలో తన సహాధ్యాయుడు మహాలి అధ్యక్షుడుగా ఉన్న ద్వారంలోంచి ప్రవేశించింది. ఈ మహాలి కొంత లిచ్ఛవుల ఈర్ష్యవల్ల అంధుడయ్యాడు. మహాలిని కల్సుకుందామా అని బంధుల్‌కి అనిపించింది. కాని కడుపుతో ఉన్న భార్య మనసు తీర్చడంలో ఏదన్నా విఘ్నం రావొచ్చునని తన నిర్ణయాన్ని మార్చుకున్నాడు.

అభిషేక పుష్కరిణి రేవుల దగ్గర కాపలా ఉంది. అక్కడ జీవితంలో ఒకే ఒక్కసారి స్నానం చేసే (అభిషేకం పొందే) అదృష్టం ఏ లిచ్ఛవి పుత్రునికైనా కలుగుతుంది. అదీ లిచ్ఛవి గణపరిషత్తులోని తొమ్మిదివందల తొంభైతొమ్మిది సభ్యుల స్థానాల్లో ఖాళీ అయిన స్థానంలో ఎన్నుకోబడితేనే! కాపలా వాళ్ళు అడ్డుకోగానే బంధుల్ మల్లు కొరడాలతో వాళ్ళని బాది తరిమేశాడు. మల్లికను స్నానం చేయించి రథం ఎక్కించి తక్షణమే వైశాలినుంచి బయల్దేరాడు. కాపలాదారులు చెప్పగా సంగతి తెలుసుకొని ఐదువందల మంది లిచ్ఛవి రథికులు బంధుల్‌ని వెంటపెట్టారు. మహాలికి ఈ సంగతి తెలిసి వాళ్ళని వారించాడు. కాని అహంభావులైన లిచ్ఛవులు ఎక్కడ వింటారు? దూరం నుంచి రథచక్రాల చప్పుడు విని మల్లిక వెనక్కి తిరిగి చూసింది.

"చాలా రథాలు వస్తున్నాయి బంధుల్!" అన్నాది.

"అయితే ప్రేయసీ, రథాలన్నీ ఒకే వరుసలో ఓ గీతలా ఉన్నప్పుడు చెప్పు" అన్నాడు బంధుల్.

మల్లిక అలాంటి సమయాన్ని చూసి బంధుల్‌కి చెప్పింది. బంధుల్ వింటి నారిని లాగి ఒక్కబాణం వదిలాడనీ, అది ఐదువందల లిచ్ఛవుల నడుం పట్టాల్లోంచి దూసుకుని వెళ్ళిపోయిందని ప్రాచీన చరిత్రకారులు చెప్తారు. లిచ్ఛవులు దగ్గరికివచ్చి యుద్ధం చెయ్యమని సవాలు చేశారు.

"మీలాంటి చచ్చినవాళ్ళతో నేను యుద్ధం చెయ్యను." బంధుల్ మల్లు తేలిగ్గా అన్నాడు.

"చూడు మేం చచ్చేమో లేదో!"

"నేను రెండో బాణాన్ని వాడను. ఇళ్ళకి వెళ్ళిపొండి, ప్రియుల్ని బంధువుల్ని

ముందు కలుసుకోండి. ఆ తర్వాత ఆ నడుం పటకాలు విప్పుకోండి!" అని బంధుల్ మల్లు మల్లిక చేతిలోని కళ్లెం తీసుకుని రథాన్ని మాంచివేగంతో తోలి కంటికి కని పించకుండా మాయమైపోయాడు.

నడుం పటకాలు విప్పగానే ఐదు వందల లిచ్ఛవులూ నిజంగానే చచ్చి పోయారు.

## 5

శ్రావస్తి (నేటి నిర్మానుష్యమైన సహేట్ - మహేట్) ఆ కాలంలో జంబూ ద్వీపంలో కల్లా పెద్దనగరం. ప్రసేన్‌జిత్తు రాజ్యంలో శ్రావస్తి కాకసాకేత్ (అయోధ్య) వారణాసి, (బనారస్) మహానగరాలు రెండూ ఉన్నాయి. శ్రావస్తిలో సుదత్తుడు (అనాథ పిండకుడు), మృగారుడు, సాకేతంలో అర్జునుడు లాంటి వాళ్ల ఎంతో మంది కోటీశ్వర్లు అయిన షావుకార్లు కాశీ-కోసల సమ్మిశ్రిత రాజ్యంలో ఉండే వారు. ఈ వర్తకుల సమూహాలు జంబూ ద్వీపంలోనే కాక తామ్రలిపి గుండా తూర్పు సముద్రం (బంగాళాఖాతం), భరుకచ్ఛం (భడౌంచ్), సుప్పారకం (సోపారా)ల గుండాను పడమర సముద్రం (అరబ్‌సాగరం) గుండాను దూర దూర ప్రాంతాల్లో ఉన్న ద్వీపాల వరకూ వెళ్ళేవి. బ్రాహ్మణ సామంతులతో (మహాశాలులతో) క్షత్రియ సామంతులతో సరిసమానమైన స్థానం వాళ్ళకిలేదు. అయినా వీళ్ళకి సంఘంలో చాలా ఉన్నతమైన స్థానం ఉండేది. ధనం విషయంలో అయితే సామంతులు వీళ్ళ ముందు ఎందుకూ కొరగారు. సుదత్తుడు జేతరాకుమా రుని ఉద్యానం జేతవనాన్ని కార్షాపణాల్ని (ఆనాటి నాణాలు) వెదజల్లి కొన్నాడు. గౌతమ బుద్ధుడి కోసం అక్కడ జేతవన విహారాన్ని కట్టించాడు. మృగారుని పుత్రుడు పుంద్రవర్ధనుడి వివాహానికి ప్రసేనజిత్తు రాజు స్వయంగా సపరివార సమే తంగా సాకేతానికి వెళ్ళాడు. పెళ్ళికుమార్తె తండ్రి అర్జున శ్రేష్ఠి దగ్గర అతిథిగా ఉన్నాడు. అర్జునుడి కూతురూ, మృగారుని కోడలూ అయిన విశాఖ తన మెళ్ళో గొలుసుతో వెయ్యిగదులున్న ఏడంతస్తుల విహారాన్ని చాలా విశాలమైన దాన్ని కట్టించింది. దానికి 'పూర్వారామ మృగార మాతాప్రసాదం' అని పేరు వచ్చింది. దేశ దేశాంతరాల నుంచి పిండబడి పిండబడి ధనం ఈ షావుకార్ల దగ్గరకి వచ్చిపడు తోంది. అలాంటప్పుడు వాళ్ళ అపారమైన సంపత్తి గురించి వేరే ఏం చెప్పాలి??

జైవాలుడు, ఉద్దాలకుడు, యాజ్ఞవల్క్యుడూ యజ్ఞవాదానికి అప్రధానమై నవిగా రెండో స్థానాన్ని ఇస్తూ అసలైన మోక్షానికి బ్రహ్మవాదం అనే దృఢమైన దాకని తయారుచేశారు. జనకుడులాంటి రాజులు గొప్పగొప్ప బహుమతులను ప్రకటించి బ్రహ్మకి సంబంధించిన శాస్త్రార్థ పరిషత్తులని ఏర్పాటు చెయ్యటం మొదలు పెట్టారు. దాంతో వేదాలకి మించి ఊహించడానికి మార్గం లభించింది. అది దేశాల్లో

స్వతంత్రంగా వివేచించటం ఆలోచించటం ఓ వెల్లువలా వచ్చిన కాలం. సమాలోచకులు (తీర్థంకరులు) తమ తమ అభిప్రాయాలని, ఆలోచనలని ప్రజలముందు సామాన్య సభల్లో చెప్పేవారు. ఒక్కొక్కచోట సామాన్యమైన ఉపదేశంగా, ప్రతివాదంగా సూక్ష్మంగా ఇది రూపం దాల్చేది. మరికొన్నిచోట్ల ఒక్కొక్కరు వాదానికి సవాల్ చేస్తూ దాన్ని ప్రకటించడానికిగాను నేరేడుకొమ్మల్ని పాతుతూ తిరుగుతూ ఉండేవారు. ప్రవాహణుడు ఏభై ఆరు తరాల్ని తోవ తప్పించి తిప్పడానికి బ్రహ్మసాక్షాత్కారానికి చాలా మార్గాలు చెప్పాడు. వాటిలో ప్రవజ్యం (సన్యాసం), ధ్యానం, తపం మొదలైనవి ఉన్నాయి. ఇప్పుడు ఉపనిషత్‌విద్యకి దూరంగా ఉన్న వాళ్ళు, తమ స్వతంత్ర భావాల్తోపాటు ప్రవజ్యం బ్రహ్మచర్యం గురించి నొక్కి చెప్తున్నారు. అజిత్ కేస్ కంబల్ ఒట్టి భౌతికవాది. భౌతిక పదార్థాలని తప్పించి అతడు ఏ ఆత్మనీ, ఈశ్వరభక్తినీ, నిత్యతత్వాన్నీ స్వర్గనరకాల్నీ పునర్జన్మనీ వేటినీ నమ్మడు. అయినప్పటికీ అతడు గృహపరిత్యాగి. బ్రహ్మచారీను. ఆ కాలంలో పరిపాలకులైన సామంతుల సానుభూతి పొందడానికేకాక వాళ్ళ కోపానికి ఎర కాకుండా ఉండడానికి కూడా తన భౌతిక వాదానికి మతస్వరూపం ఇవ్వాల్సివచ్చింది. లౌహిత్య బ్రాహ్మణ సామంతులూ, పాయాసీలాంటి రాజన్య సామంతులూ భౌతిక వాదులే. తమ భావాల కారణంగానే వాళ్ళు జనంలో ప్రసిద్ధులయ్యారు. ఆ ప్రసిద్ధి నుంచి ఒకవేళ భౌతికవాదాన్ని త్యజిస్తే లోకులు నవ్వులుపాలుకి గురి అవుతామని అనుకునేవారు. అయినా వీళ్ళ భౌతికవాదం సంఘానికి ప్రమాదకరమైనదికాదు.

భౌతికవాదం ప్రచారంలో బాగా ఉన్నట్టు తెలుస్తూనే ఉంది. కాని బ్రాహ్మణ సామంతులకి కుబేర్లులాంటి వ్యాపారస్థులకి గౌతమబుద్ధుడి అనాత్మవాదం అంటే అన్నిటికన్నా మించిన శ్రద్ధ ఉన్నాది. ముఖ్యంగా కోసలలో మరీ విపరీతంగా ఈ శ్రద్ధ కనపడుతోంది. దానికి గౌతముడు కోసలలోని శాక్యగణానికి చెందినవాడవడం ఓ కారణం. భౌతికవాదులు చెప్పినట్టే గౌతముడూ చెప్పేవాడు. "ఆత్మ ఈశ్వరుడు లాంటి నిత్య పదార్థాలేమీ విశ్వంలో లేవు. అన్ని పదార్థాలూ ఉత్పన్నమౌతాయి. తిరిగి శీఘ్రంగానే విలీనమైపోతాయి. ప్రపంచం పదార్థాల సముదాయం కాదు. అది ఘటనా ప్రవాహం." వివేకవంతులకి భావాలు చాలా సమంజసంగానూ మనస్సుకి నచ్చి నాటుకునేవిగానూ అనిపించేవి. అయితే అలాంటి అనాత్మవాదం వల్ల ప్రజల కట్టుబాట్లకి, గొప్ప బీదా తేడాలకి, యజమాని దాసీ జనుల భేదానికి ముప్పు వచ్చే ప్రమాదం ఉంది. అందుకే అజితుడి భౌతికవాదమంటే సామంతవర్గానికి కాని వ్యాపారస్థుల వర్గానికి కాని అంత ఇష్టం కలగలేదు. గౌతమబుద్ధుడు తన అనాత్మవాదం—భౌతికవాదంలో మరికొన్ని విషయాల్ని చేర్చి ఆ అరుచి లేకుండా చేశాడు. "నిత్యమైన ఆత్మనేది ఏదీ లేకపోయినప్పటికీ చైతన్య ప్రవాహం స్వర్గమో లేదూ అంటే నరకమో లాంటి లోకాల్లోంచి ఓ శరీరం నుంచి మరో శరీరానికి ఓ శరీర ప్రవాహం నుంచి మరో శరీర ప్రవాహానికి మారుతూ ఉంటుంది." అని బుద్ధుడు

చెప్పాడు. ఈ అభిప్రాయంలో ప్రవాహణరాజు కనిపెట్టిన ఆయుధం, పునర్జన్మకి కావల్సినంత చోటుచేసుకోడానికి వీలు ఉన్నది. గౌతముడుగాని కేవలం శుద్ధ భౌతిక వాదాన్ని ప్రచారం చేసి ఉంటే శ్రావస్తి, సాకేతం, కౌశాంబి, రాజగృహం, వత్రి కల్లోని ధనవంతులైన శ్రేష్టిరాజులు తమ సంచుల్ని గుమ్మరించేవారుకాదు. బ్రాహ్మణులూ, క్షత్రియులూ, సామంతులు వాళ్ళ పరిపాలనా యంత్రాంగమూ ఆయన పాదాలకి ప్రణామం చెయ్యడానికి పోటీపడేవారు కాదు.

శ్రావస్తిలోని ఉన్నతవర్గానికి చెందిన స్త్రీలకి గౌతమబుద్ధుని బోధనలంటే ఎక్కువ శ్రద్ధ ఉన్నది. ప్రసేన్‌జిత్తు పట్టపురాణి మల్లికాదేవికి బౌద్ధమతం పట్ల ఎంతో ఆసక్తి. ఆవిడ నగరంలోని పెద్ద శ్రేష్ఠిగారి కోడలూ, ఆవిడకి స్నేహితురాలు అయిన విశాఖ తన భక్తిని ఓ పెద్ద విహారాన్ని కట్టించి బుద్ధుడికి దానం చేసింది. సేనాధిపతి బంధుల్‌మల్లు భార్య మల్లిక పట్టపురాణి మల్లికకి ఎంతో ఇష్టురాలు. మిత్రురాలు. ఆవిడ ప్రేరణవల్ల మల్లిక బుద్ధుడి ఉపదేశాలు వినడానికి వెళ్ళేది. ఆ తర్వాత కొంతకాలానికి బుద్ధుడి ఉపాసకురాలు అయింది.

ఇప్పుడు మల్లిక ఇల్లు చాలా నిండుగా ఉన్నాది. కోసలలాంటి పెద్ద రాజ్యానికి సేనాధిపతి అయినవారి ఇల్లు నిండుగా ఉండాల్సిందే! మల్లికకి పదిమంది కొడుకులు. అందరూ వీరులే. అందరూ రాజుగారి సేనలో పెద్ద పదవుల్లో ఉన్నారు. రాజుమీద బంధుల్‌మల్లు ఓ తరంపాటు తన పలుకుబడిని నిలుపుకున్నాడు. ఈ లోపల అతనికి ఎందరో శత్రువులయ్యారు. ఇంకో జనపదానికి చెందినవాడు ఇంత పెద్ద పదవిలో ఉండడం వాళ్ళకి కిట్టేదికాదు. ఈర్ష్యా అసూయతో వాళ్ళు రాజుగారికి చాడీలు చెప్పడం మొదలుపెట్టారు. రాజు అసలే కాస్త మందబుద్ధివాడు. "బంధుల్‌మల్లు మహారాజుని బుద్ధిహీనుడంటున్నాడు" అని చెప్పి రాజుని రెచ్చకొట్టారు. ఆఖరికి సేనాధిపతి రాజ్యాన్ని లాక్కుందామనుకుంటున్నాడని కూడా చెప్పారు. ప్రసేన్‌జిత్తుకి మాటలు మనస్సుకి బాగా పట్టాయి. రాజు తనకీ, బంధుల్ మల్లుకీ శత్రువులైన వారి మాటల ప్రకారం ఆడ్డం మొదలుపెట్టాడు.

నువ్వెందుకంత విచారంగా ఉన్నావూ?" అని ఓ రోజు మల్లిక బంధుల్ మల్లు విచారంగా ఉండడం చూసి అడిగింది.

"రాజు నన్ను అనుమానిస్తున్నాడు."

"అలా అయితే సేనాపతి పదవిని వదిలేసి కుసీనారా ఎందుకు వెళ్ళిపోకూడదూ? అక్కడ మనకి జీవనోపాధికి లోటులేదు-కావల్సినంత వ్యవసాయ క్షేత్రం ఉన్నది."

"అంటే - రాజుని అతని శత్రువుల చేతుల్లో వదిలేసి వెళ్ళిపోవడం అని అర్థం! మల్లికా! నువ్వు గమనించడంలేదూ! మగధరాజు అజాతశత్రువు ఎన్నోసార్లు కాశీమీద దండెత్తాడు. ఓసారైతే అతణ్ణి ఖైదీగా పట్టుకున్నాం కూడా. అయితే మహారాజు ఔదార్యంతో రాజపుత్రి వజ్రని పెళ్ళి చేసుకుని అతణ్ణి విడిచేశాడు. కాని

అజాతశత్రువు జంబూద్వీపం యావత్తునీ సంపాదించి చక్రవర్తి నవుదామని అను కుంటున్నాడు మల్లికా! ఈ పెళ్ళితో అతడు ఊరుకునేవాడు కాడు. అతని గూఢ చారులు రాజధాని నిండా ఉన్నారు. మన పొరుగురాజు అవంతిరాజు అల్లుడు వత్సరాజు ఉదయనుడి నడతా సరిగ్గాలేదు. అతడూ సరిహద్దులో సన్నాహాలు చేస్తు న్నాడు. ఇలాంటి స్థితిలో శ్రావస్తిని విడిచి వెళ్ళిపోవడం ఉట్టి పిరికితనం అనిపిలచు కుంటుంది మల్లికా!"

"మిత్ర ద్రోహం కూడాను."

"నాకు నా గురించిన చింతలేదు. మల్లికా! యుద్ధాల్లో ఎన్నిసార్లు నేను మృత్యు ముఖంలోకి వెళ్ళి తిరిగిరాలేదు ? ఏ సమయాన్నైనా మృత్యువు నన్ను తన పొట్ట పెట్టుకున్నా అదేం పెద్ద సంగతి కాదు."

మల్లిక-ఒ మామ్మూలు పనివాడి కూతురు. తోటమాలి కూతురు. అయితేనేం తన మంచి గుణాల కారణంగా ప్రసేన్‌జిత్తుకి పట్టపురాణి అయింది. ఆవిడ చని పోయింది. లేకపోతే రాజుగారి చెవులు ఇంతగా శత్రువులు కొరకగలిగేవారు కాదు. ఓ రోజున సరిహద్దులో తిరుగుబాటు అవుతోందని చెప్పి రాజు బంధుల్ మల్లు పుత్రుల్ని ఆ చోటుకి పంపించేశాడు. వాళ్ళు తమకి చెప్పిన పనిలో కృతకృత్యులై వస్తుండగా వాళ్ళని ఎదురుకోడానికి బంధుల్ మల్లునే మోసంచేసి పంపించాడు. ఇల్లాగా తండ్రీ కొడుకులు పదిమందీ ఒకేచోట యుద్ధంలో ప్రాణాలు పోగొట్టు కున్నారు. ఈ భోగట్టాతో ఉత్తరం వచ్చే సమయానికి మల్లిక బుద్ధుడికీ అతని భిక్షు సంఘానికి విందు చెయ్యడానికి వెళ్లబోతుంది. ఆవిడ పదిమంది కోడళ్ళూ ఎంతో ప్రేమతో ఎన్నోరకాలైన భోజన పదార్థాలు తయారుచేశారు. మల్లిక ఉత్తరాన్ని చదువుతుంది. ఆమె గుండెల్లో గునపం గుచ్చినట్లయింది. కాని ఆవిడ తననితాను సంభాళించుకుంది. కంట తడిపెట్టలేదు సరికదా మొహంలో ఎక్కడా విచారపు ఛాయలు కనిపించకుండా తనలోపలే దాచుకుంది. ఉత్తరాన్ని చీరకొంగుకి కట్టుకుని ఆవిడ సంఘం యావత్తుకి భోజనాలు పెట్టించింది. భోజనాలైన తర్వాత బుద్ధుడి ఉప దేశాన్ని ఎంతో భక్తితో విన్నది. ఆఖర్ని ఆ ఉత్తరాన్ని ఆవిడ అందరికీ చదివి విని పించింది. బంధుల్ కుటుంబం మీద పిడుగే పడ్డాది. మల్లిక చాలా ధైర్యంగా ఉంది. కాని వితంతువులై పోయిన బంధుల్ పడుచుకోడళ్ళని ఓదార్చడం బుద్ధుడికి కూడా కష్టమైపోయింది.

ప్రసేన్‌జిత్తుకి నిజం నిలకడమీద తెలిసింది. అతనికి చాలా దుఃఖం, మనస్తా పమూ కలిగాయి. కాని ఇప్పుడేం చెయ్యగలడు ? ప్రసేన్‌జిత్తు తన మనశ్శాంతి కోసం బంధుల్ మేనల్లుడు దీర్ఘకారాయణుణ్ణి తన సేనాపతిగా చేసుకున్నాడు.

# 6

చలికాలం కపిలవస్తుకి చుట్టు ప్రక్కల పొలాలు, గోధుమపంటతో, యవల పంటతో పసుపుపచ్చని పువ్వులతో నిండుగా ఉన్న ఆవాలితో చూడముచ్చటగా ఉన్నాయి. నేడు నగరాన్ని బాగా అలంకరించారు. అక్కడ అక్కడ తోరణాలూ, పువ్వులతో ఆకులతో కట్టారు. ప్రజాతంత్ర భవనాన్ని విశేషించి బాగా అలంకరించారు. మూడు రోజుల బట్టి రెక్కలు ముక్కలు చేసుకుని కష్టపడ్డ తర్వాత ఇవాళ కాస్త ఊపిరి పీల్చుకోడానికి దాసజనానికి పీలుచిక్కింది. వాళ్ళలో కొంత మంది ఓ ఇంటిమూలని కూచుని ఉన్నారు.

"మనదీ ఒక బతుకేనా? మనుషులుగా పుట్టడానికి బదులు గొడ్లయి పుట్టి ఉంటే బాగుండి ఉండేది. అప్పుడు మనికి మనిషికుండే జ్ఞానం ఉండి ఉండేది కాదు" అన్నాడు కాక్.

"మా బాగా చెప్పేవు కాక్! నిన్న మా యజమాని దండపాణి కాల్చిన ఇనుప ముక్కతో నా భార్యకి వాత పెట్టాడు."

"ఎందుకు పెట్టేడూ?"

"ఎందుకని వీరిని ఎవరడుగుతారు? వీళ్ళు దాసజనంలో భార్యాభర్తల సంబంధాన్నీ మన్నించరు. పైపెచ్చు ఈ దండపాణి తాను నిగంఠశ్రావకుణ్ణ (జైనుడని)ని కూడా చెప్పుకుంటాడు. నిగంఠులు నేలనుండే పురుగుల్ని తప్పించడానికి తమ దగ్గర నెమలిపింఛపు కుంచెలని అట్టే పెట్టుకుంటారు! నా భార్య చేసిన అపరాధ మల్లా ఎన్నో రోజుల్నుంచి జబ్బుగా ఉన్న మా కూతురు మొహం తిరిగి పడిపోయిందని నాతో చెప్పడానికని రావడమే! పాపం, మా కూతురు బతకనూలేదు. చచ్చిపోవడమూ మంచిదేలే! లేకపోతే మనలాగే అదీ బతకాల్సివచ్చేది. నిజం కాక్! మనకి దాసజనానికి బతుకున్నది ఏదీలేదు! ఇంతేకాదు. మా యజమాని కసాయివాడు కదా- ఈ సంబరం కోలాహలం అయిపోయిన తర్వాత నా భార్యని అమ్మేస్తానని అంటున్నాడు."

"అయితే ఆ కసాయి దండపాణికి కాల్చిన ఇనప ఊచతో వాత పెట్టేకకూడా కడుపునిండలేదా?"

"లేదన్నా! పన్నెండేళ్ళు పోయిన తర్వాత మా కూతురుని అమ్మి ఉంటే ఏభై నాణాలు దొరికేవి అని ఆయన అంటున్నాడు. అదేదో మేం కావాలని అతని ఏభై నాణాలని మట్టికలిపేసినట్టు మాట్లాడుతున్నాడు.

"మన బానిసలకి తల్లి హృదయం, తండ్రి హృదయం ఉండదన్నట్టు!"

"స్వాగతం పలకడానికి ఈ అట్టహాసం అంతా చేస్తున్నారా— ఇది కూడా ఓ వాసీపుత్రుడికే చేస్తున్నారు." అన్నాడు ఓ ముసలి బానిస.

"ఎవరు తాతా?"

"ఈ కోసల రాజకుమారుడు-విడూడభుడు."

"దాసీ పుత్రుడా?"

"ఆఁ మహానామ శాక్యుడి ఆ ముసలి దాసీదాన్ని ఎరగవా? మనలా నల్లగా ఉండదు! ఏ శాక్యుడివల్లో పుట్టి ఉంటుంది."

"దాసీలలో అలాంటి వాటికేం లోటు తాతా?"

"ఊఁ ఆ దాసీకీ మహానాముడికి ఓ కూతురు పుట్టింది. చాలా తెల్లగా మా అందంగా ఉండేది. చూడ్డానికి శాక్యుల అమ్మాయిలాగే ఉండేది."

"ఎందుకుండి ఉండదూ? చక్కటి చుక్కలా ఉండే అమ్మాయిలని వాళ్ళు దాసీపుత్రికలైనా యజమానులు ఎంతో ప్రేమతో పెంచుతారు మరి!"

"కోసలరాజు ప్రసేనజిత్తుడు ఓ శాక్యకన్యని పెళ్ళి చేసుకోవాలని అనుకున్నాడు. అయితే ఏ శాక్యుడూ తన కూతురుని ఇవ్వడానికి ఇష్టపడలేదు. శాక్యులు ముల్లోకాల్లోనూ తామే గొప్పకులం వాళ్ళం అనుకుంటారు కాక్! అయితే పిల్లనివ్వమని పూర్తిగా తిరస్కరిస్తే కోసలరాజు శాక్యగణం మీద క్రోధం వహిస్తాడు. అంచేత మహానాముడు తన ఈ దాసీకన్యని శాక్యకుమారి అని చెప్పి ప్రసేన్‌జిత్తుకి యిచ్చేస్తాడు. ఆ పిల్ల వార్షభక్షత్రియ. ఆవిడ కొడుకే ఈ విడూడభ రాజకుమారుడు."

"కాని ఇప్పుడు వీడుకూడా శాక్యుల్లాగానే మన నెత్తురుని తాగాలని అనుకుంటున్నాడు."

బాజాలు మొదలయ్యాయి. లోలోపల దాసీపుత్రుడని అసహ్యించుకుంటున్నప్పటికీ శాక్యులు అంతమందీ కోసలరాజు కుమారుడికి బ్రహ్మాండంగా స్వాగతంచెప్పి ప్రజాతంత్ర భవనానికి తీసుకువచ్చారు.

విడూడభుడు తన మేనమామ కులం వారి స్వాగతం అందుకుని మాతామహుడు మహానాముని ఆశీర్వాదాలు పొంది యెంతో సంతోషంతో కపిలవస్తు నుంచి శలవు తీసుకున్నాడు. దాసపుత్రుడి కాలిదూళి పడి ప్రజాతంత్ర భవనం అపవిత్రమైపోయింది. అంచేత దాన్ని శుద్ధిచెయ్యడం అవసరం. ఎంతోమంది దాసదాసీ జనాలు ఆసనాల్ని దుమ్ముదులిపి కడిగి శుభ్రపరుస్తున్నారు. అతి వాగుడుకాయ ఐన ఓ దాసీది ఆసనాన్ని కడిగేటప్పుడు దాసీపుత్రుడు విడూడభుణ్ణి నోటికి వచ్చిన తిట్లతో దుమ్మెత్తి పోస్తోంది. విడూడభుడి సైనికుడొకడు తన బళ్ళాన్ని ప్రజాతంత్ర భవనంలో మరిచి పోయాడు. ఆ బళ్ళాన్ని తీసుకెళ్ళడానికి తిరిగి వచ్చినప్పుడు అతడు దాసీ తిట్టే తిట్లు జాగ్రత్తగా విన్నాడు. నెమ్మదిగా ఈ సంగతంతా విడూడభుడి చెవికి వెళ్ళింది. కపిలవస్తులో శాక్యులనేవాళ్ళు లేకుండా తుడిచిపారేస్తాను అని అతడు సంకల్పించుకున్నాడు. ఆ తర్వాత అనుకున్నంత పనీ చేసి చూపెట్టాడు. తనని ఓ దాసీ కడుపున పుట్టించినందుకు అతనికి ప్రసేనజిత్తుడంటే క్రోధం - రెండో గురి ప్రసేనజిత్తు దయ్యాడు.

దీర్ఘకారాయణుడు తన మేనమామనీ, మేనమామ కొడుకులని హత్యచేయించా డన్న సంగతిని మరచిపోలేకపోయాడు. అటు ముసిలికాలంలో తను చేసిన పొర పాట్లన్నిటికీ పశ్చాత్తాపపడుతూ ప్రసేన్‌జిత్తుడు దీర్ఘకారాయణుని పట్ల మరింత నమ్మకం పెట్టి యెంతో మృదువుగా వ్యవహరించాలని అనుకుంటున్నాడు. ఓ రోజు మధ్యాహ్న భోజనం ఐన తర్వాత అతనికి బుద్ధుణ్ణి చూడాలని అనిపించింది. కొద్ది యోజనాల దూరంలో ఏదో శాక్యగ్రామంలో బుద్ధుడు విడిదిచేసి ఉన్నాడని విని అతడు కారాయణుణ్ణీ మరికొంతమంది సైనికుల్నీ తీసుకుని బయల్దేరాడు. బుద్ధుడున్న గృహంలోకి వెళ్ళబోయే ముందు అతడు తన కిరీటాన్నీ ఖడ్గాన్నీ మిగిలిన రాజ చిహ్నాలనన్నిటినీ కారాయణుడి చేతికిఇచ్చేశాడు. కారాయణుడు విదూడభుడితో చేతులు కలిపే ఉన్నాడు. అతడు ఒక్క రాణీగార్ని మాత్రం అక్కడ వదిలేసి విదూడభుణ్ణి రాజుగా ప్రకటించి శ్రావస్తికి దారి తీశాడు.

ఎంతోసేపు ఉపదేశం విని, ప్రసేనజిత్తు బైటికి వచ్చాడు. రాణి ఏడుస్తూ జరిగినదంతా చెప్పింది. అక్కణ్ణుంచి ప్రసేనజిత్తు తన మేనల్లుడూ మగధరాజూ ఐన అజాతశత్రువు సాయం పొందడానికి రాజగృహానికి బయల్దేరాడు. ముసలితనం చేత కొన్ని వారాలు నడిచేసరికి తోవలోనే అతని ఒళ్ళు పాడైపోయింది. సాయంత్రం రాజగృహం చేరుకునేటప్పటికి నగరద్వారం మూసేసారు. ద్వారం బయట ఓ కుటీ రంలో ఆ రాత్రే ప్రసేనజిత్తుడు మరణించాడు. పొద్దున్న రాణి విలాపం విని అజాత శత్రువు, వజ్రా పరుగు పరుగున వచ్చారు. కాని అతని కట్టెని అట్టహాసంతో కాల్చడం తప్ప వాళ్ళింక ఏం చెయ్యగలుగుతారు?

బంధుల్ హత్యకిది ప్రతీకారం. జానిసత్వపు దుష్కర్మలకిది పరిణామం.*

---

* నేటికి నూరుతరాల ముందు జరిగిన చరిత్రకి సంబంధించిన కథ. ఆ కాలంనాటికే సాంఘిక వ్యత్యాసాలు చాలా ఎక్కువైపోయాయి. ధనిక వ్యాపారవర్గం సంఘంలో ఓ గొప్ప స్థానాన్ని పొందేసింది. పరలోకానికి వెళ్ళే తోవ చెప్పేవాళ్ళు, నరకప్రాప్తి నుంచి ఉద్ధరించేవాళ్ళు యెంతోమంది పుట్టుకొచ్చారు. కాని ఊరూరా జానిసత్వం అనే నరకజ్వాలలు భగభగ మండుతున్నట్టు చూసి కూడా అందరి కళ్ళు అటువేపు మూసుకుపోయి ఉన్నాయి.

# నాగదత్తుడు

కాలం : క్రీస్తుకు పూర్వం 335

"ఉచితానుచితాల మీద మనం దృష్టి ఉంచాలి. విష్ణుగుప్తా! మనం మనుషులం కాబట్టి మనకి కొన్ని కర్తవ్యాలు ఉన్నాయి. అంచేత ఉచితం మీద ధ్యాస వుంచాలి."

''కర్తవ్యం మతమేనా?"

''నేను మతాన్ని కపటం అనుకుంటాను. మతం కేవలం ఇతరుల సొత్తుని కాజేసేవాళ్ళకి ఇతరుల సొత్తుని నిశ్చింతగా అనుభవించడానికి వీలు కలగచెయ్యడానికే ఉంది. మతం ఎక్కడన్నా బీదవాళ్ళనీ బలహీనుల్నీ పట్టించుకుందా? మతాన్ని అంగీకరించని జాతేదీ ఈ ప్రపంచంలో లేదు. కాని ఎప్పుడన్నా అది దాసుల్ని మనుషులని అనుకుందా? దాసుల్ని వదిలెయ్యి, దాసజనం కాని స్త్రీల విషయం చూడు–ఎప్పుడన్నా మతం వాళ్ళకి న్యాయాన్ని చేకూర్చిందా? డబ్బుండాలి నీకు–నువ్వు ఇద్దర్ని నలుగుర్ని, పదిమందిని ఆఖరికి వందమంది స్త్రీలని వివాహితలుగా చెయ్యగలవు! వాళ్ళు దాసీజనంకన్నా ఏం గొప్పగా ఉండరు. మతం దీన్ని ఉచితమే అంటుంది. నేనంటున్న ఉచితం, మతం చెప్పే ఉచితం కాదు. పైగా నేననేది ఆరోగ్యవంతుడయిన మనిషి మనస్సు దేన్ని ఉచితం అంటుందో అదీ!!"

''అలా ఐతే ఏది అవసరమో అదే ఉచితం అని నేనంటాను."

''అప్పుడు మరి ఉచితానుచితాల మధ్య తేడానే ఉండకుండాపోతుంది."

''తేడా వుంటుంది మిత్రమా! అవసరం అంటే కేవలం ఎవడో ఒక్కడికి అవసరం ఐనదని నేను అంటంలేదు."

"కాస్త స్పష్టంగా చెప్పు విష్ణుగుప్తా!"

''ఇదిగో మన తక్షశిలా గాంధారాలనే తీసుకో సోదరా! మనకి మన స్వాతంత్ర్యం యెంతో ప్రియమైనదీ ఉచితమైనదీ కూడా! కాని మనదేశం ఇంత చిన్నది కదా, పెద్ద శత్రువుని అది యెదుర్కోలేదు. మద్రులూ, పశ్చిమ గంధారులూలాంటి చిన్నచిన్న సమూహాలు మన పొరుగువారిగా ఉన్నంతవరకూ నిశ్చింతగా ఉన్నాం. అప్పటప్పట యుద్ధాలు అయ్యేవి - కాని కొద్దిమంది వ్యక్తులు మాత్రమే బలి అయ్యేవారు. మన స్వాతంత్ర్యాన్ని అపహరించడం అన్నది జరగలేదు. తక్షశిలని అరిగించుకోడం ఎవరికయినా అంత తేలికైన సంగతి కాదు. కాని పార్శవులు (ఈరా

సీలు) మన పడమటివేపు పొరుగువారయ్యారు. దాంతో మన స్వాతంత్ర్యం వాళ్ళ దయాదాక్షిణ్యాల మీద ఆధారపడిపోయింది. మన స్వాతంత్ర్యానికి ఏవిటి కావాలి? మనమూ పార్శ్వులంత బలమైన వాళ్ళం అవ్వాలి!''

''బలమైనవాళ్ళం కావడానికి ఏం చెయ్యాలి?''

''చిన్న చిన్న సమూహాలు ఉంటే (గణాలు) లాభంలేదు. చిన్నచిన్న జనపదాలకి బదులు ఓ విశాల రాజ్యాన్ని మనం స్థాపించాలి.''

''ఆ విశాల రాజ్యంలో చిన్నచిన్న జనపదాలకి ఎలాంటి స్థానం ఉంటుంది?''

"ఆత్మీయతాభావం."

"ఇది గందరగోళంలో పెట్టే మాట విష్ణుగుప్తా! దాసుడు ఎప్పుడైనా యజమానిపట్ల ఆత్మీయతా భావంతో ఉండగలడా?"

"అయితే నాగదత్తా! స్థానం పొందడం అన్నది ఇచ్చగించటం వల్లా అభిప్రాయపడ్డం వల్లా జరగదు. యోగ్యతవల్ల జరుగుతుంది. తక్షశిలా గంధారంతో యోగ్యత ఉంటే ఆ విశాలరాజ్యంలో అది ఉన్నతస్థానం పొందుతుంది. లేదూ, మామ్మూలు స్థానాన్ని పొందుతుంది."

"బానిస స్థానమా?"

"కాని మిత్రమా! పశ్చిమ గంధారంలో దారయేశ్ రాజ్యంలో దొరికిన స్థానం కన్నా మన ఈ బానిసస్థానం చాలా మంచిదవుతుంది. సర్లే, నా రోగ నిదానాలనీ, ఔషధాన్నీ వదిలెయ్యి. మనం ఓ చిన్న జనపదం రూపంలో మన అస్తిత్వాన్ని నిలుపుకుని ఉండలేకపోతున్నాం అన్నది ఖాయంగా తెలిసాక మనం మన స్వాతంత్ర్యాన్ని స్థిరంగా ఉంచుకోవాలంటే ఏం చెయ్యాలి? నువ్వేచెప్పు!"

"చెప్తాను విష్ణుగుప్తా! మనం మన గణస్వాతంత్ర్యాన్ని స్థాపించుకోవాలి. ఏ రాజుకీ అధీనులం కాకుండా ఉండాలి. మనం ఓ చిన్న జనపదం రూపంలో మన స్వాతంత్ర్యాన్ని స్థిరంగా ఉంచుకోలేక పోతాం అన్నదాన్ని నేను ఒప్పుకుంటున్నాను. అందుకే ఉత్తరాపథంలో (పంజాబు) ఉన్న గణాల (జనపదాల) నన్నిటినీ కలిపి ఓ సంఘంగా మనం సంఘటితపరచాలి."

"ఆ సంఘంలో ప్రతీ గణం (జనపదం) స్వతంత్ర ప్రతిపత్తిలో ఉంటుందా లేక సంఘమే అన్నిటిమీదా ఉంటుందా?"

"మన వ్యక్తులందరి మీదా గణం ఉన్నట్టే గంధారం, మద్ర, మల్ల, శివి మొదలైన గణాలన్నిటి మీదా సంఘం ఉంటుంది. సంఘాన్ని అలా మీదదానిగా ఒప్పుకోవాలని నేను అనుకుంటున్నాను."

"దీన్ని ఎలా ఒప్పించగలం? గణాన్ని బయటి శత్రువుల నుండి కాపాడ్డానికి మనం సేనని ఉంచుకోక తప్పదు. దాని కోసం బలి (పన్ను) తీసుకోవాలి. తప్పదు."

"మనం గణాల్లో ఎలా వ్యక్తులచేత చేయిస్తున్నామో అలాగ్గానే సంఘంలో ఉన్న గణాలచేత చేయించగలుగుతాం."

"గణంలో అయితే ఆదినుంచీ వస్తున్న ఒక సమూహానికీ, ఒకే రక్తానికి చెందిన కుటుంబం మనది. అనాది కాలం నుంచీ ఈ కుటుంబానికి గణ నియమాల్ని పాటించే అలవాటు ఏర్పడిపోయి ఉంది. కాని ఈ గణాల సంఘం కొత్తది. ఇక్కడ నెత్తురు సంబంధం లేదు. పైగా పెచ్చు అనాదికాలం నుంచీ రక్తం వేరు కావడం వల్ల దెబ్బలాటలూ పరస్పరం పోటీ పడ్డాలూ ఉన్నాయి. మరి అలాంటప్పుడు సంఘం నియమాల్ని మనం అందరిచేతా ఎలా ఒప్పించగలుగుతాం? ఆచరణకి సాధ్యమా కాదా అన్న దృష్టితో నువ్వు దీనిగురించి ఆలోచించి ఉన్నట్లయితే దీని గురించి ఎప్పటికీ ఇలా చెప్పేవాడివి కాదు మిత్రమా! సంఘం చెప్పినట్టూ గణాలు విని ఒప్పుకోవడం అన్నది వాటిని బలవంతంగా ఒప్పుకునేటట్టు చేసే శక్తి ఎక్కణ్ణించి వస్తుంది?"

"ఆ శక్తిని మనం లోపల్నుంచే పుట్టించగలగాలి అని నేననుకుంటున్నాను."

"లోపల్నుంచి పుడితే మంచి మాటే అని నేనూ ఒప్పుకుంటున్నాను. కాని దాన్ని లోపల్నుంచి పుట్టించలేం అన్న సంగతి ఎన్నోసార్లు పార్శవుల (పెర్షియన్ల) చేత దెబ్బతిని మనం తెలుసుకున్నాం. అంచేత మనం ఎలా వీలైతే అలా దాన్ని పుట్టించాలి."

"రాజరికాన్ని స్వీకరించైనా సరే?"

"కేవలం తక్షశిలకే కాదు. తక్షశిల - గాంధారం లాంటి ఎన్నో జనపదా లన్నిటికి కలిపి ఓ రాజు - చక్రవర్తిని స్వీకరించినా తప్పులేదు. అభ్యంతరం లేదు."

"అలా అయితే పార్శవ దారయోశ్‌నే రాజుగా ఎందుకు అంగీకరించ కూడదూ?"

"పార్శవ దారయోశ్ మనవాడుకాదు మిత్రమా! మనం జంబూద్వీపం వాళ్ళం అని నీకూ తెలుసు."

"సరే మరి నందుడైతే?"

"ఉత్తరాపథంలో (పంజాబు) ఉన్న అన్ని గణాలనీ కలిపి ఒక సంఘంగా మనం చెయ్యలేకపోతే సందుణ్ణి అంగీకరించడానికి మనకి అభ్యంతరం ఉండక్క ర్లేదు. పశ్చిమ గాంధారంలా దారయోశ్‌కి దాసులమై ఉండడం మంచిదా లేకపోతే మన జంబూద్వీపపు చక్రవర్తి క్రింద ఉండడం మంచిదా?"

"విష్ణుగుప్తా! ఆ నిరంకుశుడైన రాజుగారి రాజ్యాన్ని నువ్వింతా చూడలేదు. చూసి ఉన్నట్లయితే నీకు అర్థమై ఉండేది. అక్కడ సామాన్యజనం బానిసలకన్నా ఎక్కువ యోగ్యులుగా ఏం ఉండరు."

"పశ్చిమ గంధారం మినహాయించి నేనింకే రాజు రాజ్యంలోనూ కాలు పెట్ట లేదని ఒప్పుకుంటున్నాను. అయితే దేశదేశాలు తిరిగి చూడాలన్న కోరిక నాకున్నది. నీలాగ మధ్య మధ్య ఓసారి తిరిగి రావడానికి బదులు చదువు పూర్తైపోయాక ఒక్కే సారి ఏకంగా తిరగడానికి వెళ్దామనుకుంటున్నాను. కాని విదేశీయుల అసహ్యకర మైన బానిసత్వం నుంచి కాపాడుకోవాలంటే చిన్నచిన్న విభేదాలనీ, ఎల్లల్నీ అధిగ మించాలి అన్న నా అభిప్రాయం మాత్రం దేశాటన చేసినా మారదు. దారయోశ్ విజయానికి అదే మూలమంత్రం."

"వాళ్ళెంత విజయాన్ని సాధించారో నేను దాన్ని దగ్గరగా చూడాలను కుంటున్నాను."

"దగ్గరగానా?"

"ఆఁ. నేను తూర్పునున్న మగధవరకూ వెళ్ళాను. నందరాజ్యాన్ని చూశాను. మన గంధారం (తక్షశిల)తో పోల్చి చూస్తే అదో నరకం. శక్తివంతమైనదే– సందే హంలేదు - అయితే బీదవాళ్ళని రాచి రంపాన్ని పెట్టడంలో!! శ్రమించే జనం రైతులూ, చేతిపనివాళ్ళూ, దాసులూ ఎంతగా పీడించబడుతున్నారో! నేను వర్ణించి చెప్పలేను!!"

"నందుడి రాజ్యంలో తక్షశిలలాంటి స్వాభిమానమూ స్వాతంత్ర్యం పట్ల ప్రేమా ఉన్న గణం కలియలేదు. అందుకే అలా ఉంది!"

"కలిసింది విష్ణుగుప్తా! లిచ్ఛవుల గణరాజ్యం మన గంధార కన్నా మంచి బలమైనది. కాని అది ఇవాళ వైశాలి మగధకి పాదదాసి. ఇప్పుడు లిచ్ఛవులు మగధ వేటగాళ్ళ వెనక ఉండే బలమైన కుక్కలు. అంతకన్నా ఏంకారు. వైశాలీకెళ్ళి చూడు. పాడుపడిపోతోంది. గత నూటయాభై సంవత్సరాల్లో దాని జనసంఖ్య మూడోవంతుకి పడిపోయింది. శతాబ్దాల తరబడి సంపాదించిన స్వాతంత్ర్యమూ, స్వాభిమానమూ ఇప్పుడు మగధరాజ్యం కోసం పోరాడే సైనికుల్ని తయారుచెయ్య డానికి పనికివస్తున్నాయి. ఓసారి ఏ పెద్ద రాజ్యాని కిందనైనా చిక్కుకున్నామో ఇహమరి దాని చేతుల్నించి తప్పించుకోవడం చాలా కష్టం."

"నాగదత్తా! నేనూ ఒకప్పుడు నీలాగే ఆలోచించేవాణ్ణి. కాని ఇప్పుడు చిన్న చిన్న గణరాజ్యాల యుగం వెళ్ళిపోయిందనీ పెద్ద గణరాజ్యాన్ని కాని సంఘాన్ని కాని స్థాపించడం అన్నది కేవలం స్వప్నమే అనీ అనుకుంటున్నాను. అందుకే కాలానికి అవసరమైన దాన్నే నేను ఉచితమైనదనీ అంటున్నాను. ఇప్పుడు పశ్చిమా నికి వెళ్ళడానికి సన్నాహాలు చేస్తున్నావా? అది చెప్పు!"

"ఆఁ. మొదట పార్శవుల దేశానికి వెళ్తాను. ఆ తర్వాత వీలైతే యవనుల (గ్రీకు) దేశాన్నీ చూడాలనుకుంటున్నాను. మనలాగే వాళ్ళవీ గణరాజ్యాలే. కాని గొప్ప చక్రవర్తి దారయోశ్ ఆశల్నీ అతని వంశస్థుల ఆశల్నీ వాళ్లు ఎలా విచ్ఛిన్నం చేశారో చూడాలి. స్వయంగా దాన్ని చూడాలని నాకున్నది."

"నేనూ వెళ్తున్నాను. మిత్రమా! తూర్పుదేశాల్ని చూడాలి. మగధలో సంపూర్ణ జంబూద్వీపాన్ని సమైక్యపరిచే శక్తి ఉందో లేదో చూడాలి. మన చదువులు స్థార్థ ధనార్జనా, కుటుంబపోషణలకి బదులు మనం ఈ పనులు చేద్దాం. కాని మిత్రమా! నువ్వు వైద్యశాస్త్రమూ మిగతా విద్యతోపాటు చదువుకుని మంచిపని చేశావు. నేను నేర్చుకోలేదు. ఇప్పుడు విచారిస్తున్నాను. దేశాటన చేసేవాళ్ళకి ఇది చాలా ఉపయోగకరమూ లాభకరమూ అయిన విద్య."

"నువ్వంతకన్నా లాభదాయకమైన జ్యోతిషవిద్యనీ, సాముద్రిక శాస్త్రాన్నీ నేర్చుకున్నావు."

"మిత్రమా! ఈ విద్యలు అబద్ధాల విద్యలని నీకు తెలుసు."

"కాని విష్ణుగుప్త చాణక్యుడికి విద్యలు అబద్ధాలవైతేనేం నిజాలవైతేనేం. అతనికి ఏది అవసరమో అది ఉచితమే కదా!"

చిన్ననాటినుంచీ ఆడుతూ పాడుతూ చదువుతూ కలిసి ఉన్న నాగదత్త కాష్య, విష్ణుగుప్త చాణక్యులు తక్షశిలవాళ్ళు. విద్యార్థులుగా ఆఖరిసారి వాళ్ళు మాట్లాడుకున్న మాటలివి. ఎన్నోసార్లు పార్శవుల చేతికిందకి వెళ్ళిన తక్షశిలనీ, దాని స్వాతంత్ర్యాన్నీ కాపాడ్డానికి తమతమ ఆలోచనల ప్రకారం ఏదన్నా మార్గం కనిపెట్టాలని వాళ్ళు తపన పడుతున్నారు.

# 2

చుట్టూ చిన్నచిన్న కొండలు, చెట్లూ చేమలూ మొక్కా మోడూ లేని కొండలు. ఆకుపచ్చటి ప్రకృతిని చూడాలని అక్కడ కళ్ళు కాయలు కాస్తాయి. కొండలమధ్య లోయ పరుచుకొని ఉంది. దాంట్లోనూ నీళ్ళుకాని పచ్చటి మొక్కలు కాని ఎక్కడన్నా కనిపించటం అన్నది క్వచిత్తే! ఈ లోయ వెంబడే యాత్రికులు వెళ్ళే తోవ ఉన్నది. ఆ తోవంట ఎప్పుడూ జనం వస్తూ పోతూ ఉంటారు. యాత్రికుల సమూహాలకీ వాళ్ళ పశువులకీ విశ్రాంతి తీసుకోడానికి సత్రాలు ఉన్నాయి. చుట్టూ ఉన్న భూమిని చూస్తే ఈ సత్రాల్లో అన్ని సౌకర్యాలు ఉంటాయని ఎక్కడా అనిపించదు. ఇన్నేసి వస్తువులు ఈ ఎడారిలో ఎక్కణ్ణుంచి తెచ్చి ఉంచుతున్నారో అని అనిపిస్తుంది.

మజిలీల్లో ఈ సత్రాలు ఎక్కువ. కొన్ని సైనికుల కోసమూ, సామాన్య రాజోద్యోగుల కోసం, మరికొన్ని వ్యాపారస్తులకోసం ఉన్నాయి. ప్రతీచోటా కనీసం ఓ రాజభవనం రాజుగారూ అతని క్షత్రపులూ (పెర్షియను మండలాధిపతులు) ప్రయాణం చేస్తున్నప్పుడు విడిది చెయ్యడానికి ఉన్నది. ఇవాళ ఈ మకాంలో ఉన్న రాజభవనంలో ఎవరో విడిదిచేసి ఉన్నారు. ఆ భవనపు అశ్వశాలలో గుర్రాలు కట్టి ఉన్నాయి. బయట పనివాళ్లు దాసులు కనిపిస్తున్నారు. అందరి మొహాలు విచారంగా

ఉన్నాయి. ఇంతమంది జనం ఉన్నా ఆ రాజభవనం చచ్చేటంత నిశ్శబ్దంగా ఉన్నది. ఈ సమయంలో ముగ్గురు రాజోద్యోగులు కంగారుపడుతూ రాజభవన ద్వారం గుండా బయటికి వచ్చారు. వాళ్ళు సామాన్యుల సత్రాల్లోకి వెళ్ళారు. వాళ్ళు కట్టుకున్న ఖరీదైన బట్టలూ, అధికారం పలుకుబడి, కనిపించే వాళ్ళ మొహాల్ని చూడగానే జనం భయంతోనూ గౌరవంతోనూ ఓ పక్కకి వెళ్ళి నిల్చుండిపోతున్నారు. "ఇక్కడెవరన్నా వైద్యుడున్నాడా?" అని వాళ్ళు జనాన్ని అడుగుతున్నారు. ఆఖరికి సామాన్యజనం దిగే సత్రంలో ఓ హిందూ వైద్యుడు బసచేసి ఉన్నాడని తెలిసింది. ఈ ప్రాంతంలో వానలు చాలా తక్కువ. అందులోనూ వానాకాలం ఎప్పుడో వెళ్ళిపోయింది. యాపిలు, ద్రాక్షలూ, ఖర్బూజాలాంటి పళ్ళు చవక అవడాన్ని ఈ సత్రంలో ఎక్కువ అమ్ముడవుతున్నాయి. రాజోద్యోగులు వైద్యుడి దగ్గరికి వెళ్లే సమయానికి అతడు ఓ పెద్ద ఖర్బూజాపండుని కోసుకుని తింటున్నాడు. అతని చుట్టూ అతనిలాగే ముష్టి వాళ్ళలా చింకిగుడ్డలు కట్టుకున్న ఈరానీ వాళ్ళు ఎంతో మంది కూచుని వున్నారు. వాళ్ళముందూ అలాగే ఖర్బూజాపళ్ళు ఉన్నాయి. రాజోద్యోగుల్ని చూస్తూనే ముష్టివాళ్ళు భయంతో నాలుగుపక్కలకి బెదిరిపోయారు. ఒకడు అక్కడే నిల్చున్న మనిషి వేపు వేలుపెట్టి చూపిస్తూ "అయ్యా! ఇతనే హిందూవైద్యుడు" అని చూపెట్టాడు.

వైద్యుడు కట్టుకున్న మాసిన గుడ్డల్ని చూసి రాజోద్యోగి మొహం తిరిగిపోయింది. అతడు వైద్యుడి మొహాన్ని చూసాడు. ఆ గుడ్డలకీ ఆ మొహానికీ ఏం సంబంధం లేదు. ఆ మొహంలో ఎక్కడా భయమన్నదికాని దైన్యంకాని లేదు. అతని నీలికళ్ళలోని కాంతిని చూసి రాజోద్యోగి వైఖరి మారిపోయింది. రాజోద్యోగి ముడిపడ్డ భృకుటి మళ్ళీ విడింది!

"నువ్వు వైద్యుడివా?" అని కాస్త మర్యాదగా అడిగాడు.

"ఊఁ"

"ఎక్కడివాడివి?"

"తక్షశిల."

తక్షశిల పేరు వినగానే రాజోద్యోగికి ఇంకా గౌరవం పెరిగింది. ఇంకా మెత్తబడిపోయాడు.

"మా క్షత్రపులు (మండలాధిపతి) వక్షుసోగ్ద మండలాధిపతి భార్య-మహా చక్రవర్తి గ్గారి సోదరి జబ్బుపడ్డారు. నువ్వు ఆవిడకి చికిత్స చెయ్యగలవా?"

"వైద్యుణ్ణి కదా! ఎందుకు చెయ్యలేనూ?"

"కాని నీ బట్టలూ వేషమూ...."

"బట్టలూ వేషమూ వైద్యం చెయ్యవు. వైద్యం చేసేది నేనూ!"

"కాని ఇవి మహామురిగ్గా ఉన్నాయి."

"ఇవాళ పీటిని మారుద్దామనే అనుకుంటున్నాను. ఓ నిమిషం ఉండండి." అని వైద్యుడు ఉతికిన ఉన్ని అంగరఖాని తొడుక్కున్నాడు. అది ముందు తొడుక్కున్నదానిమీద కాస్త శుభ్రంగా ఉంది. మందుల పొట్లాలతో నిండిఉన్న ఓ తోలు సంచిని చేత్తో పట్టుకుని వైద్యుడు రాజోద్యోగితోపాటు బయల్దేరాడు.

అవడానికైతే అది సత్రమే కాని అక్కడ గాడిదల లద్దెలూ లేవు. ముష్టి వాళ్ళ చింపిరిగుడ్డలూ పేలూ లేవు. ఇక్కడ జాగా అంతా శుభ్రంగా ఉంది. మీదకి వెళ్ళే మెట్లమీద రంగురంగుల తివాసీలు పరచి ఉన్నాయి. మెట్లకి ఇటూ అటూ ఉన్న గోడలకి అందమైన చెక్కడపుపని చేసి ఉంది. గదుల్లోనూ అలాగే చాలా ఖరీదైన తివాసీలు పరిచి ఉన్నాయి. ద్వారాలకి పల్చటి పట్టు పరదాలు వేళ్ళాడుతున్నాయి. వాటి దగ్గర పాలరాతి బొమ్మల్లా ఉన్న అందగత్తెలు మౌనంగా నిల్చుని ఉన్నారు. ఓ ద్వారం దగ్గరకి వెళ్ళి రాజోద్యోగి వైద్యుణ్ణి అక్కడ ఉండమని సైగ చేశాడు. ఓ అందగత్తె చెవిలో ఏదో చెప్పాడు. ఆవిడ చాలా నెమ్మదిగా తలుపు తెరిచింది. లోపలున్న పరదా కారణంగా అక్కడ ఏమున్నదీ ఏం కనిపించటం లేదు. కొద్ది నిమిషాల తర్వాత ఆవిడ బయటికి వచ్చింది. వైద్యుణ్ణి తనతోపాటు రమ్మనమని పిలిచింది.

లోపల అడుగుపెట్టగానే గదంతా చక్కటి సువాసనలతో నిండి ఉన్నదని వైద్యుడు గ్రహించాడు. గదంతటినీ ఓసారి చూశాడు. ఆ గదిని అలంకరించటంలో అత్యద్భుతమైన నేర్పుని ప్రదర్శించారు. తివాసీలు, పరదాలు, బాలీసులు, దీపపు స్తంభాలు, చిత్రలేఖనాలు, శిల్పాలు-అలాంటివాటిని వైద్యుడు ఇంత వరకూ ఎప్పుడూ చూడలేదు. ఎదురుగుండా ఓ మెత్తటి పేరుపు గోడకి ఆనించి రెండు మూడు బాలీసులూ పెట్టి ఉన్నాయి. అందులో ఓ బాలీసుని ఆనుకుని నడివయస్సులో ఉన్న పురుషుడు కూచుని ఉన్నాడు. స్థూలశరీరం. ఈ చెవినుంచి ఆ చెవి వరకూ ఉన్న పెద్ద పెద్ద మీసాలు. ఎరుపు పసుపూ కలిసిన రంగులో ఉన్న ఆ మీసాలు అక్కడక్కడ పండిపోయి తెల్లగా ఉన్నాయి. అతని పచ్చటికళ్ళు ఎన్నో రోజుల బట్టి జాగరం చేసినట్టు ఎంతో బాధపడుతున్నట్టూ కనపడుతున్నాయి. అతని పక్కనే ఎంతో అందమైన యువతి కూచుని ఉంది. ఆవిడ రంగు వెన్నలా తెల్లగా ఉండడమే కాదు, వెన్నకన్నా ఆవిడ మెత్తగా ఉన్నట్టు అనిపిస్తోంది. ఆవిడ తెల్లటి బుగ్గమీద గులాబీ రంగు ఇప్పుడు కాస్త వన్నెతగ్గి ఉన్నది. ఆవిడ పల్చటి పెదాల్ని మెరిసే పంజరంలో ఉండే చిలకముక్కుతో పోల్చి చెప్పలేం. ఆవిడ పల్చటి కనుబొమలు విల్లులా వంగి మెత్తటి పచ్చని రోమాలతో తీర్చిదిద్ది ఉన్నాయి. విశాలమైన కనురెప్పలతో చెవులవరకూ ఉన్న ఆవిడ నీలిరంగు కళ్ళు ఎర్రగా వాచిపోయి ఉన్నాయి. ఆవిడ శిరస్సు సన్నని బంగారపు దారాలతో చుట్టి అలంకరించారా అన్నట్టు ఉన్నది. ఆవిడ ఒంటిని నిండుచేతులతో ఉన్న ఆకుపచ్చటి పట్టు కంచుకమూ, ఆడవాళ్ళు కట్టుకునే ఎర్రరంగు పట్టులాగా ఉన్నది. ఆ అందమైన మృదువైన ఒంటిమీద రత్నాభరణాలూ,

ముత్యాలహారాలు అక్కర్లేని బరువులా కనపడుతున్నాయి. ఈ ఇద్దరేకాక ఆ గదిలో ఇంకా ఎంతోమంది అందగత్తెలు నిల్చుని ఉన్నారు. వాళ్ళ మొహాలూ వాళ్ళ నమ్రతనీ బట్టి వాళ్ళు క్షత్రపుని అంతఃపుర పరిచారికలై ఉంటారని వైద్యుడుకి వెంటనే బోధపడ్డాది.

పురుషుడు - క్షత్రపుడే -వైద్యుణ్ణి ఆపాదమస్తకం ఓసారి చూసాడు. వైద్యుని నీలంకళ్ళు క్షత్రపుడి దృష్టిని ఆకట్టుకున్నాయి. తన దుస్తుల్ని ఇతనికిగాని తొడిగితే ఇతడు పర్శపురి (పర్సేపోలోస్) అంతటిలో అందమైన యువకుడిగా పరిగణించబడతాడు అని క్షత్రపుడు అనుకున్నాడు.

"మీరు తక్షశిల వైద్యులా?" ఎంతో మర్యాదగా క్షత్రపుడు అడిగాడు.

"అవును మహామండలాధిపతీ!"

"భార్యకి చాలా జబ్బు చేసింది. నిన్నటినుంచీ ఆవిడ పరిస్థితి మరీ పాడై పోయింది. మా వైద్యులిద్దరూ ఇచ్చిన మందులు ఏవీ పనిచెయ్యటం లేదు."

"నేను మీ భార్యని చూసాక వైద్యులతో మాట్లాడతాను."

"వాళ్ళు మీ దర్శనానికి సిద్ధంగా ఉంటారు. రండి. లోపలికి వెళ్దాం."

తెల్లటి గోడకున్న తెల్లటి పరదాని పక్కకి తీసారు. అక్కడ లోపలికి వెళ్ళటానికి ద్వారం ఉన్నది. క్షత్రపుడూ ఆ పదహారేళ్ళ పడుచూ ముందు వెళ్ళారు. వైద్యుడు వారి వెనకాతలే వెళ్ళాడు. లోపల ఏనుగుదంతపు కోళ్ళతో ఉన్న మంచం ఉన్నది. దానిమీద సముద్రపు నురుగులా తెల్లటి మెత్తటి పక్క. జబ్బుచేసినావిడ దానిమీద పడుకొని ఉంది. కదళీమృగపు చర్మంతో (సాంబర హరిణం)చేసిన తెల్లటి శాలువాతో ఆవిడ ఒంటిని కప్పారు. మొహం మాత్రమే బైటికి కనిపిస్తోంది. క్షత్రపుడు రావడాన్ని చూసి పరిచారికలందరూ పక్కకి తప్పుకున్నారు. వైద్యుడు దగ్గరగా వెళ్ళి చూసాడు. మండలాధిపతి భార్య మొహమూ ఆ పదహారేళ్ళ పడుచు మొహం ముమ్మూర్తులా ఒక్కలా ఉన్నాయి. పడుచు మొహంలోని యవ్వన సౌందర్యానికి బదులు ఈవిడ మొహంలో ప్రౌఢత్వమూ దానికి తోడు దీర్ఘవ్యాధి ప్రభావమూ కనబడుతున్నాయి. ఎర్రటి పెదాలు పాలిపోయి పచ్చగా ఉన్నాయి. నిగారింపుతో ఉండే బుగ్గలు పీక్కుపోయి లోతుకుపోయాయి. కళ్ళు మూసుకుపోయి గుంటలు పడ్డాయి. ఎక్కుపెట్టిన విల్లులా ఉన్న ఆవిడ కనుబొమలు పచ్చగా ఉన్నాయి. తెల్లటి స్నిగ్ధమైన లలాటం శుష్కించి మెరుపు తగ్గి ఉన్నది.

"అపకా!" క్షత్రపుడు మొహాన్ని ఆవిడ దగ్గరగా పెట్టి పిల్చాడు. రోగి కాస్త కళ్ళు తెరచి మళ్ళీ మూసేసుకుంది.

"అపస్మారకం ఉండీ ఉండకుండా ఉంది." అన్నాడు వైద్యుడు. ఆ తర్వాత ఆవిడ చేతుల్ని బైటికి తీసి నాడి చూశాడు. అతి కష్టంమీద నాడి పట్టుకొనేటట్టుగా ఉంది. ఒళ్ళు దాదాపు చల్లబడింది. వైద్యుడి ఆందోళన క్షత్రపుడికి తెలిసింది.

"కొద్దిగా ద్రాక్షసారా, ఎంత నిలవైనదైతే అంత నిలవైనది కావాలి." వైద్యుడు కొంచెం ఆలోచించిన మీదట అడిగాడు.

ప్రయాణంలో ఉన్న క్షత్రపుడి దగ్గర సారాకి లోటులేదు. తెల్లటి గాజు కూజాలో నెత్తురులా ఎర్రగా ఉన్న ద్రాక్షసారా దానితోపాటు రత్నాలు తాపడం చేసిన బంగారపు పాత్ర కూడా తీసుకువచ్చారు. వైద్యుడు ఓ పొట్లాం విప్పాడు. తన కుడిచేతి చిటికినవేలుకి ఉన్న పొడుగాటిగోరుతో గురివింద గింజంత మందు ఏదో తీసి రోగి నోరు తెరవమన్నాడు, క్షత్రపుడికి ఆవిడ నోరు తెరవడానికేం కష్టం కలగలేదు. అతడు మందు నోట్లో వేసి ఓ గుక్క ద్రాక్షసారాని కూడా పోశాడు. రోగి దాన్ని మింగడాన్ని చూసి వైద్యుడు సంతోషించాడు.

"ఇహ ఇప్పుడు బయట మీ వైద్యుల్ని ఓసారి కలిసి మాట్లాడతాను. కాస్సేపటికి మహా మండలాధిపతి భార్య కళ్ళు తెరుస్తారు. అప్పుడు మళ్ళీ వచ్చి నేను తప్పకుండా చూడాలి," అని క్షత్రపుడితో అన్నాడు. రెండో గదిలోకి వెళ్ళి వైద్యుడు పార్శ్వవైద్యులతో సంప్రదించాడు. సోగ్ద నుంచి బయల్దేరినప్పుడు ఆవిడకి కొద్దిగా జ్వరం తగిలిన లగాయితు ఇప్పటివరకూ ఉన్న పరిస్థితినంతా వాళ్ళు వర్ణించి చెప్పారు. ఇంతలో ఓ పరిచారికవచ్చి యజమానురాలు మండలాధిపతిని పిలుస్తోందని కబురుతెచ్చింది. మహాక్షత్రపుని మొహం విప్పారింది. అతడు వైద్యుణ్ణి తీసుకుని లోపలకి వెళ్ళాడు. మండలాధిపతి భార్య కళ్ళు బాగా తెరిచింది. ఆవిడ మొహంలో బతికే సూచనలు కనిపిస్తున్నాయి.

నిబ్బరమైన గొంతుతో నెమ్మదిగా ఆవిడ మాట్లాడింది.

"మీరు నా కోసం చాలా ఆదుర్దా పడుతున్నారు. నాకు బాగయిపోతుందని చెప్పడానికే మిమ్మల్ని పిల్చాను. బలం చిక్కుతున్నట్టుగా నాకు తెలుస్తోంది."

"ఇదే మాటని ఈ హిందూవైద్యులూ కూడా నాతో చెప్తున్నారు," అన్నాడు క్షత్రపుడు.

"నా జబ్బేమిటో హిందూవైద్యులకి తెలిసింది. నా జబ్బు తగ్గిపోయింది. అవునా వైద్యా!" మరింత విప్పారిన మొహంతో ఆవిడ అన్నది.

"అవును జబ్బు తగ్గిపోయింది. అయితే కొంతకాలం విశ్రాంతి తీసుకోవాలి. ఎంత వేగిరం మిమ్మల్ని పర్శుపురి పంపడానికి తగినంత బలం మీకు చేకూరేటట్టు చేయగలనా అని నేను ఆలోచిస్తున్నాను. నా దగ్గర అద్భుతమైన రసాయనం ఉన్నది. హిందువుల రసాయనాన్ని (లోహాల నుంచి తయారు చేసిన మందులు) నేను మీకు ఇస్తున్నాను. అనుపానంగా కొద్ది కొద్దిగా ద్రాక్షరసం, దానిమ్మ రసం తాగుతూ ఉండాలి."

"వైద్యా! మీరు రోగాన్ని కనుక్కోగలరు. మిగతావాళ్ళంతా పనికిమాలిన మూర్ఖులు. గాడిదలు. మీరెలా చెపితే అలాగే చేస్తాను. రోశనా!"

"అమ్మా!" పదహారేళ్ళ పడుచు ముందుకు వెళ్ళి అడిగింది.

"అమ్మా రోశనా! నీ కళ్ళు చెమ్మగా ఉన్నాయి. ఆ వైద్యులు నన్ను చంపేసి ఉండేవారు. కాని ఇప్పుడు బెంగలేదు. హిందూవైద్యుణ్ణి మన దేవుళ్ళు అహూర్,-మజ్దా పంపించారు! ఈయనకేం ఇబ్బంది కలగకుండా చూడు. వైద్యులు చెప్పిన ప్రకారం తినడానికి తాగడానికి నువ్వే సొంతంగా నాకు తెచ్చి ఇయ్యి" అన్నది.

వైద్యుడు రోశనకి ఏమేమి చెయ్యాలో చెప్పి బయటకి వెళ్ళాడు. క్షత్రపుడి మొహం బాగా విప్పారింది. భోజపత్రాల్లో కొన్ని మందుల్ని కట్టి క్షత్రపుడికి అప్పగించి వైద్యుడు సత్రానికి వెళ్ళాలని అనుకున్నాడు.

"మీరు మాతోపాటు ఉండాలి" అన్నాడు క్షత్రపుడు.

"కాని నాకు దర్బారు మర్యాదలు తెలీవు."

"మీకు మనిషిగా ఎలా వ్యవహరించాలో, ఉండాలో బాగా తెలుసు. పద్ధతులు జాతి జాతికీ వేరువేరుగా ఉంటాయి."

"నేను ఉండడం మీ పరిచారికలకి శ్రమ."

"ఈ పక్కగదినే మీకు ప్రత్యేకించి ఏర్పాటుచేస్తున్నాను. మీరు మా దగ్గరే ఉంటే మాకు నిండుగా ఉంటుంది."

"మీ భార్య గురించి ఇంక ఏ దిగులూ పెట్టుకోకండి. వైద్యులు జబ్బుని సరిగా గుర్తించలేదు. నేను మరో రెండు గంటలు ఆలస్యంగా వచ్చి ఉన్నట్టయితే జబ్బు దాటిపోయేది. కాని ఇప్పుడు ఆవిడ జబ్బు మళ్ళింది. తెలిసిందికదా!"

క్షత్రపుడి బలవంతం మీద వైద్యుడు అక్కడే ఓ గదిలో ఉండడానికి అంగీకరించాడు.

మండలాధిపతి భార్య నాలుగోరోజుకల్లా లేచి కూర్చోగలిగింది. ఆవిడ మొహంలోని ముడతలు చూస్తూ చూస్తూ ఉండగానే మాయమైపోయి విప్పారడం మొదలయింది. రోశనకి అందరికన్నా ఎక్కువ సంబరంగా ఉన్నది. రెండో రోజునే క్షత్రపుడిచ్చిన బాగా ఖరీదైన పట్టు అంగరఖాని స్వయంగా తన చేతులతో రోశన వైద్యుడికి ఇచ్చింది. ఆ అంగరఖాతో, నడుంకి కట్టుకున్న ఆ బంగారపు పటకాతో, బంగారం తాపడం చేసిన పాదరక్షలతో, ఇప్పుడతడు ముష్టివాళ్ళ మధ్య కూచుని ఖర్బూ జాతినే మనిషిలా లేడు.

మండలాధిపతి భార్య ఇప్పుడు కాస్త తేలికైన ఆహారాన్ని తీసుకోవడం మొదలు పెట్టింది. ఆరో రోజు సాయంత్రం ఆవిడ వైద్యుణ్ణి తన దగ్గరకి పిలిచింది. వైద్యుడు ఆవిడకి కొత్తమనిషిలా కనిపించాడు. తన మేనల్లుళ్ళలో ఒకడు వచ్చేడా అన్నట్టు ఆవిడకి అనిపించింది. దగ్గరకి రాగానే అతనిని కూచోమని చెప్పింది.

"వైద్యా! నేనెంతో కృతజ్ఞురాలిని. ఈ నిర్మానుష్యమైన అడవి జాగాలో నన్ను కాపాడ్డానికి దేవుడు మజ్దావే మిమ్మల్ని పంపించాడు. మీరు పుట్టిన ఊరు ఏది?"

"తక్షశిల."

"తక్షశిలావా? చాలా ప్రసిద్ధమైన నగరం. విద్యలకి పేరుపొందినది. మీరు తక్షశిల రత్నంలాంటివారు."

"అబ్బే, నేను తక్షశిలలో ఎంతో సామాన్యమైనవాణ్ణి. కొత్తగా వైద్యం మొదలుపెట్టినవాణ్ణి."

"మీరు చిన్నవారే, నిజమే. కాని వయస్సుకీ జ్ఞానం ఉండడానికీ ఏం సంబంధం లేదు! మీ పేరేమిటి, వైద్యరత్నా?"

"నాగదత్త కాష్య."

"పూర్తిగా మీ పేరు పలకడం నాకు కష్టంగా ఉంది. నాగ్ అంటే సరి పోతుందా?"

"ఆహాఁ!"

"మీరు ఎక్కడికి వెళ్తున్నారు?"

"ప్రస్తుతానికి పర్శుపురి (పర్సెపోలీస్) వెళ్దామనుకుంటున్నాను."

"తర్వాత?"

"తిరగడానికి, యాత్రలు చేద్దామన్న ఉద్దేశంతోనే నేను ఇంటి నుంచి బయల్దే రాను."

"మేమూ పర్శుపురే వెళ్తున్నాం. మాతోపాటు రండి. మేం మీ మంచి చెడ్డలు పూర్తిగా చూస్తాం. రోశనా! వైద్యులకి సదుపాయం జరిగేటట్టు నువ్వే స్వయంగా చూడు. దాసీవాళ్ళు అశ్రద్ధగానూ నిర్లక్ష్యంగానూ ఉంటారు."

"లేదమ్మా! నేను స్వయంగానే చూస్తున్నాను. నేను ఈ పనికి సోఫియాని నియమించాను."

"మా తమ్ముడు నా కోసం ఇక్కడికి పంపించిన గ్రీకు యువతి సోఫియానా?"

"అవునమ్మా! నీ కోసం చెయ్యాల్సిన పని ఏమీ లేదు. ఆ అమ్మాయి చాలా తెలివైనదానిగా కనిపించింది. అందుకే నేను దాన్ని నియమించాను."

"అయితే వైద్యరత్నా ! మాతోపాటు పర్శుపురికి రావాల్సిందే ! మీరెలా కోరితే అలాగే నేను చేస్తాను. కాని మా కుటుంబ వైద్యులుగా మీరు ఉండిపోవాలని నాకున్నది."

నాగదత్తుడు కాస్సేపు కూచుని తన గదిలోకి వెళ్ళిపోయాడు.

## 3

ప్రపంచంలో కెల్లా పెద్దదైన రాజ్యానికి రాజధాని ఇలా చెట్టూ చేమా లేని మొక్కా మోడూ ఎదగని ఉట్టి కొండల్లో ఉంటుందనీ, అక్కడ ప్రకృతి ఏ సంపదా ఇవ్వకుండా ఇలా ఉంటుందనీ నాగదత్తుడు ఊహించలేకపోయాడు. పర్శుపురి పెద్ద

నగరం. రాజభవనంలో మెరిసే విశాలమైన రాతిస్థంభాలూ, ఆకాశాన్ని అంటే ఆ భవనపు శిఖరాలూ చక్రవర్తి వైభవాన్ని చాటి చెపుతున్నాయి. దానికి తగినట్లూ నగరమూ సమృద్ధవంతంగానే ఉంది. కాని ఇదంతా మనిషి శ్రమపడి నిర్మించినదే! ప్రకృతి తనకు తానుగా ఇక్కడ మనిషికి ఏమీ ఇవ్వలేదు. మనిషిని ఎంతో దరిద్రుడిగా వదిలేసింది !

పర్షుపురినీ, చక్రవర్తి వైభవాన్ని చూపెట్టడానికి చక్రవర్తిగారి సోదరి అపశా నివాస స్థానం ఒకటి చాలు. మరోటి చూపించక్కర్లేదు. మండలాధిపతి భార్య పర్షుపురి చేరాక నాగదత్తుడి విషయమై చేయగల సదుపాయాలు చేయటానికి ఎంతో శ్రద్ధతీసుకుంది. దక్షిణ తీసుకోమని ఆవిడ బలవంతం చేస్తే వైద్యుడు సోఫియానే కావాలని అడిగాడు. సోఫియా మాట్లాడే వచ్చీరాని పారసీ భాషని అర్థంచేసుకోవడం కష్టంగా ఉన్నప్పుడే నాగదత్తుడు ఆమె మెరిసే కళ్ళలో గొప్ప ప్రతిభ దాగి ఉన్నదని తెలుసుకున్నాడు. ఆవిడిప్పుడు అతని స్వంతం అయింది- దాసీగా ! అయితే నాగదత్తుడు ఎప్పుడూ ఆవిణ్ణి దాసీగా చూడలేదు. నెమ్మది నెమ్మదిగా భాష తెలియడం, ఆ భాషలో జ్ఞానం పెరగడం జరిగింది. నాగదత్తుడూ గ్రీకులిపిని నేర్చుకున్నాడు. సోఫియా ఎంతో కష్టపడి అతనికి ఏథెన్సు భాష నేర్పించడం మొదలు పెట్టింది. ఓ ఏడాది గడిచేసరికల్లా అతడు అందులో నైపుణ్యం సంపాదించాడు.

"అదృష్టమూ- విధీ ఎంత చిత్రమైనదో ! మీలాంటి దయగల యజమాని కింద దాసీగా కుదురుకుంటానని నేనెప్పుడూ ఊహించలేదు!" ఓ రోజు సోఫియా యువకుడైన ఆ వైద్యునికి తన కృతజ్ఞతని చెప్పుకుంది.

"లేదు. సోఫియా నువ్వు! మండలాధిపతి భార్య దగ్గరేగాని ఉండి ఉన్నట్లయితే నీ కింతకన్నా ఎక్కువ సుఖంగా బతుకు గడిచేది. కాని సోఫియా ! నన్ను యజమాని అని పిలవకు. బానిసత్వం అన్నమాట వింటేనే నాకు కంపరం పుట్టుకు వస్తుంది."

"కాని నేను మీ దాసీదాన్నే కదా!"

"నువ్వు దాసీ దానివి కావు. నేను సోఫియాని బానిసత్వం నుంచి విడుదల చేశానని క్షత్రప దంపతులకి చెప్పేశాను."

"అయితే ఇప్పుడు నేను దాసీదాన్ని కాదా?"

"ఊహూఁ. ఇప్పుడు నువ్వూ నాలాగే స్వతంత్రురాలివి. నువ్వెక్కడికి వెళ్లాలనుకుంటే అక్కడికి పంపించడానికి నేను ప్రయత్నిస్తాను."

"కాని నేను మీ దగ్గరే ఉండాలని అనుకుంటే నన్ను మీరు వెళ్ళగొట్టేయరు కదా ?"

"ఇది నీ ఇష్టం మీద ఉంటుంది."

"బానిసత్వం మనుషుల్ని ఎంత అణిచేస్తుంది! మా తండ్రిగారింట నేను మా దాసజనాల్ని చూశాను. వాళ్ళు నవ్వుతూ ఉండేవారు. సరదాలూ ఖుషీలూ

చేస్తూ ఉండేవారు. కాని ఆ నవ్వుల వెనక ఇంత వ్యధ దాగి ఉంటుందని నే నెప్పుడూ అనుకోలేదు. నేనే బానిసనయ్యాక బానిసత్వం అంటే ఎంత నరకమో నాకు బోధ పడ్డాది."

"నువ్వు బానిసవి ఎలా అయ్యేవు సోఫీ! ఏమీ అనుకోపోతే చెప్పు."

"మా తండ్రి ఏథెన్సు నగరంలో ఓ ప్రముఖ పౌరుడు. మక్‌దూనియా(మేసిడోనియా) రాజు ఫిలిప్పు మా నగరాన్ని జయించినప్పుడు మా తండ్రి కుటుంబంలోని వాళ్ళందర్నీ తీసుకుని ఓడ మీద ఆసియాకు పారిపోయారు. అక్కడ తల దాచుకోగలం అని మేం అనుకున్నాం. అయితే మేం వెళ్ళిన కొన్ని నెలలకే పార్శ్వులు ఆ నగరం మీదకి దండెత్తారు. నగరం వాళ్ళ వశమైపోయింది. ఆ గందరగోళంలో తలోచోటకి అంతా చెల్లాచెదరై పోయారు. పార్శ్వులు ఎంత మందో పౌరుల్ని ఖైదీలుగా పట్టుకున్నారు. నేనూ ఆ ఖైదీల్లో ఉన్నాను. చక్కటి రూపమూ యవ్వనమూ ఉన్నదాన్నవడం చూసి నన్ను సేనాపతి దగ్గరికి పంపించారు. సేనాపతి రాజు దగ్గరకి పంపించాడు. రాజు దగ్గర నాలాంటి గ్రీకు యువతులు వందల కొద్దీ ఉన్నారు. తన సోదరి వస్తోందని విని అతడు నన్ను ఆవిడ దగ్గరికి పంపించాడు. నేను దాసీదాన్నే అయినా నా అందం కారణంచేత నాకు దాసీవాళ్ళలో ప్రత్యేకస్థానం లభించింది. అంచేత మామూల్మాలు బానిసల అనుభవాలకి నా అనుభవాలకి తేడా ఉంది. అయితే అదెంత నరకయాతనో నాకే తెలుసు. నేను మనిషిని కానసీ నాది మనిషి పుట్టుక కాదని అనిపించింది."

"అయితే సోఫీ!నువ్వు మీ నాన్నని మళ్ళీ కలుసుకోలేకపోయావన్నమాట!"

"ఆయన బతికి ఉండిఉంటారన్న నమ్మకమే నాకులేదు. ఇపుడు మేమంతా గాలికి ఎగిరే ఎండుటాకులం. మా ప్రియమైన ఏథెన్సు నాశనం అయిపోయింది ఇహ బతికి ఉన్నప్పటికీ కలుసుకోడానికి చోటు ఎక్కడ ఉంది?"

"ఏథెన్సు పెద్ద నగరమా సోఫియా?"

"ఒకప్పుడు స్వామీ!"

"స్వామీ అని అనకు. నాగ్ అను సోఫీ!"

"ఒకప్పుడు పెద్దనగరమే నాగ్ ! కాని ఇప్పుడు పాడుపడిపోయింది. గొప్పవాడైన ధారయేశ్‌ని ఓడించిన మా గణరాజ్యం అల్పుడూ, నీచుడూ అయిన ఫిలిప్పు చేతిలో ఓడిపోయింది.

"ఎందుకలా అయింది సోఫీ?"

"పార్శ్వుల దండయాత్రలను ఎన్నిటినో ఎదుర్కొన్నప్పటికీ పార్శ్వులకి ధీటుగా మనమూ ఓ పెద్ద రాజ్యాన్ని స్థాపిస్తేనే కాని దీనికి మోక్షంలేదని ఏథెన్సు లోని ఎంతోమంది ఆలోచనాపరులు అనుకున్నారు. ఏథెన్సువాళ్ళే అతనికి సాయం చేసి ఉండకపోయినట్లైతే ఫిలిప్పు ఎప్పటికీ గెలిచి ఉండేవాడు కాదు."

"అయ్యో! తక్షశిలా! నువ్వోవిష్ణుగుప్తుని కన్నావే?"

"తక్షశిలేమిటి ? విష్ణుగుప్తుడేమిటి నాగ్?"

"నా జన్మ స్థలం, గర్వించదగ్గ స్థలం, తూర్పునున్న ఏథెన్సు తక్షశిల! మా గణరాజ్యమూ ఎన్నోసార్లు గొప్ప చక్రవర్తి దారయేశ్‌నీ అతని వారసుల్నీ కూడా యుద్ధంచేసి తరిమేసింది. కాని అక్కడ ఇప్పుడు ఫిలిప్పుకి సాయం చేసిన ఏథెన్సు పౌరులు అన్నట్టుగానే నా సహాధ్యాయుడు విష్ణుగుప్తుడూ అంటున్నాడు."

"తక్షశిల కూడా మా ఏథెన్సులాగే గణరాజ్యమేనా?"

"అవును గణరాజ్యమే! మా తక్షశిలలో బానిసలు లేరు. ఆ భూమిమీద అడుగు పెట్టగానే బానిస స్వేచ్ఛని పొంది మనిషవుతాడు."

"ఓహో! తక్షశిల ఎంత దయగల దేశం! అందుకే బానిసలతో వ్యవహరించడం మీకురాదన్న సంగతి మొట్టమొదటి రోజునే నాకు అర్ధమైంది నాగ్!!"

"ఎప్పటికీ రానక్కర్లేదు కూడా! 'నువ్వుగాని మాగధుల్ని తీసుకువచ్చేవో పవిత్రమైన తక్షశిలలోనూ బానిసత్వం అన్న కళంకం రాకమానదు' అని నేను విష్ణుగుప్తుడికి చెప్పాను."

"మాగధులెవరు నాగ్?"

"హిందూ దేశపు ఫిలిప్పులు! తక్షశిలకి తూర్పున ఉన్న విశాలమైన హిందూ రాజ్యం. పార్శవుల దండయాత్రలతో మేం విసిగిపోయి ఉన్నాం. గెలుస్తున్నప్పటికీ మా బలం క్షీణిస్తూవస్తోంది. అలిసిపోతున్నాం. నిజానికి పార్శవ చక్రవర్తిని తక్షశిల ఒంటరిగా ఎదుర్కోలేదు. కాని దీనికి మందు ఒకటే అని నేనంటాను. అది మా గణరాజ్యాలనెన్నిటినో కలిపి ఓ గణసంఘాన్ని స్థాపించడమే."

"కాని నాగ్! మా దేశంలో అలా చేసి చూద్దం అయింది. మా హెల్లా జాతిలోని గణరాజ్యాలెన్నో కలిసి సంఘంగా ఏర్పడి పార్శవుల్ని ఎదిరించాయి. కాని ఆ సంఘం చిరకాలం నిలవలేదు. గణరాజ్యాల్లో తమతమ స్వేచ్ఛకోసం పట్టుదల చాలా ఉంటుంది. దాంతో అవి తమందరి మీదా సంఘానికి పైస్థానం యివ్వడానికి సిద్ధపడవు."

"అయితే నా అభిప్రాయం తప్పుగానూ విష్ణుగుప్తుడి అభిప్రాయం సరియైనదానిగానూ ఋజువవుతుందా?"

"విష్ణుగుప్తుడు గణరాజ్యాల సంఘం జయప్రదం అవడానికి అవకాశం లేదంటాడా?"

"అవును. మన శత్రువు చాలా బలవంతుడవడాన్ని మన గణరాజ్యాల సంఘం అతణ్ణి ఎదుర్కోలేదని అతడు అంటాడు. ఎన్నో గణరాజ్యాలని, వాటి ఎల్లల్ని తుడిచేసి ఓ విశాలమైన గొప్ప గణరాజ్యాన్ని స్థాపించగలిగితే బహుశా ఇది సంభవం కావొచ్చు. అయితే గణరాజ్యాలు దీనికి అంగీకరించవు."

"నాగ్! నీ మిత్రుడే బహుశా సరిగ్గా చెప్తున్నాడు కాని మేం చివర వరకూ ఏథెన్సు స్వాతంత్ర్యాన్ని కోల్పోవాలని ఎప్పుడూ అనుకోలేదు."

"అయితే సోఫీ! గణరాజ్యం అయ్యిండీ ఏథెన్సు ఈ బానిసత్వాన్ని ఎలా స్వీకరించింది?"

"తొందరగా పతనం చెందడానికి! ధనికుల లోభత్వంవల్ల బానిసత్వం వచ్చింది. క్రమేణా యజమానులకన్నా దానిసల సంఖ్య పెరిగిపోయింది."

"నీకు ఇక్కడ పార్శ్వపుల్లో ఏవి ఎక్కువ చెడ్డగా అనిపించాయి?"

"బానిసత్వం. మా దేశంలోనూ ఉండేది! చక్రవర్తుల రాణివాసాలూ, ధనికుల అంతఃపురాలూనూ!"

"మీ దేశంలో అవి లేవా?"

"మా దేశంలో మక్‌దూనియా (మేసిడోనియా) రాజు ఫిలిప్పు కూడా ఒక్క భార్యకన్నా ఎక్కువమందిని వివాహం చేసుకోలేడు. ఇక్కడైతే చిన్న చిన్న రాజోద్యోగులు కూడా ఎన్నో పెళ్ళిళ్ళు చేసుకుంటారు!"

"మా దేశంలోనూ అప్పుడప్పుడు కొందరు బహువివాహాలు చేసుకుంటూ ఉంటారు. అయితే వారి సంఖ్య తక్కువ. స్త్రీల బానిసత్వానికి ఇది చిహ్నంగా నాకు అనిపిస్తుంది. ఏథెన్సు బానిసత్వాన్ని ప్రవేశపెట్టింది. మా తక్షశిలా ఎంతోమంది స్త్రీలనీ పెళ్ళి చేసుకోవచ్చని బహుభార్యాత్వాన్ని ప్రవేశపెట్టి బానిసత్వానికి పునాది వేసింది."

"కొన్ని కుటుంబాల్లో డబ్బూ ఆస్తీ పేరుకుపోవటం అన్న చెడ్డకూడా ఉన్నది."

"గణరాజ్యంలో డబ్బు ఎంతైనా పోగవనీ, సంపత్తి పెరగనీ, రాజుల్లా దాన్ని నీళ్ళలా ఖర్చు చెయ్యకూడదని నేను విష్ణుగుప్తుడికి చెప్పాను. ఇక్కడ నువ్వు చూస్తూనే ఉన్నావు సోఫీ! ఖరీదైన లేడి చర్మాలు, పట్టువస్త్రాలు, రత్నాలు, వజ్రాలు, ముత్యాలు మొదలైనవాటిని ఎలా వినియోగిస్తున్నారోను!! ఈ గులాబీ రంగు బుగ్గలూ, ఈ పగడపు పెదాలూ ఉన్నవాళ్ళు ఈ వస్తువు లన్నిటినీ తయారు చెయ్యటానికి ఎన్నికోట్లమంది జనం ఆకలి చావులు చస్తున్నారో కనీసం ఒక్కసారన్నా ఆలోచించరు!"

"మన ఇళ్ళల్లోని నీటిని లాక్కుంటేనే సముద్రానికి అంతజలం వచ్చింది!!"

"మట్టిని బంగారం చేసేవాళ్ళు తిండానికి తిండి కట్టుకోడానికి గుడ్డా లేకుండా ఉన్నారు. బంగారాన్ని మట్టిగా చేసేవాళ్ళు జల్సాలు చేస్తున్నారు. మూడు సార్లు చక్రవర్తి దగ్గరికి వెళ్ళాను. ప్రతీసారీ తలనెప్పితో తిరిగి వచ్చాను. అతని సమస్తవైభవంలోనూ చలికాలంలో చలికి కొంకర్లుపోతూ ఎండాకాలంలో వడదెబ్బతిని చచ్చిపోతున్న శ్రామికులు నిట్టూర్పులు విడుస్తూ కనపడ్డారు. అతని ఎర్రని సారాయిలో బాధలకి గురి అయిన ప్రజల నెత్తురు కనిపించింది. పర్శుపురి అంటే నాకు అసహ్యం వేస్తోంది. ఇక్కణ్ణించి తొందరగా వెళ్ళిపోదామనుకుంటున్నాను."

"ఎక్కడికి వెళ్దామనుకుంటున్నారు నాగ్?"

"ముందు నీ విషయం తెల్సుకోవాలనుకుంటున్నాను."

"నేనెక్కడ చెప్పగలుగుతాను?"

"గ్రీసు?"

"నా కిష్టమే"

"అయితే అక్కడికే వెళ్దాం."

"కాని తోవలో నన్నెవరన్నా లాక్కోవచ్చు. ఈసారి మళ్ళీ నాగ్ లాంటి రక్షకుడు నాకు దొరక్కపోవచ్చు." సోఫియా గొంతు సన్నగిలిపోయింది. ఆవిడ చక్కటి పెద్ద కళ్ళల్లో భయం నిండిపోయింది.

నాగదత్తుడు ఆమె చెవులపై వేళ్ళాడుతున్న బంగారపువన్నెలో ఉన్న జుట్టుని సవరిస్తూ "దానికో మార్గం ఆలోచించాను. కాని దానికి నీ అంగీకారం కూడా కావాలి" అన్నాడు.

"ఏమిటి?"

"క్షత్రపుడి దగ్గర్నుంచి, క్షత్రపుని భార్య దగ్గర్నుంచి, చక్రవర్తి దగ్గర్నుంచి కూడా నేను చక్రవర్తిచేత గౌరవించబడ్డ హిందూ వైద్యుణ్ణని రాయించి పుచ్చుకుంటాను."

"అయితే నిన్నెవరూ ఎత్తుకెళ్ళరు. తస్కరించరు."

"లోకం కోసం నువ్వు వైద్యుడి భార్యగా చెప్పుకోడానికి ఒప్పుకుంటే నీ పేరు కూడా అలా అందులో రాయించేస్తాను."

ఆమె కళ్ళంట నీళ్ళు జలజల రాలాయి. నాగదత్తుడి చేతిని తన చేతిలోకి తీసుకుంది.

"నాగ్! మీరెంత ఔదార్యం కలవారో! అయినా ఆ ఔదార్యం గురించి తెలుసుకోడానికి కూడా ప్రయత్నించరు. మీరు ఎంత అందమైనవారో! కాని మీరు మీ వేపు చూసే పుష్యరాగాల్లాంటి, నీలాల్లాంటి కళ్ళని ఒక్కసారైనా చూడలేదు! నాగ్! రోశనకి మీరంటే ఎంతో ప్రేమ. ఆవిడా సంగతి నాతో లెక్కలేనన్నిసార్లు చెప్పింది. ఆవిడకో చచ్చుపీనుగులాంటి బంధువొకడున్నాడు. తల్లీ తండ్రీ అతనికిచ్చి ఆవిడ పెళ్ళి చెయ్యాలనుకుంటున్నారు. కాని ఆవిడ మిమ్మల్ని ప్రేమిస్తోంది."

"మంచిదే అయ్యింది నాకు తెలీకపోవడం! లేకపోతే నిరాకరించవలసి వచ్చేది. సోఫియా! నేను ఈ రాజభవనాల్లో పెరిగిన వాళ్ళ కోసం పుట్టలేదు. బహుశా నేను ఎవరికోసమూ పుట్టి ఉండను. నన్ను ప్రేమించే ఆడదానికి సుఖం ఉండదు. కాని నువ్వుగాని అంగీకరించినట్లైతే చక్రవర్తి రాసిచ్చేదాంట్లో - రాయడానికి మాత్రమే సుమీ-నిన్ను నా భార్యగా రాయిస్తాను. గ్రీసులో బహుశా నీకు నచ్చినవాడూ నువ్వు ఇష్టపడేవాడూ దొరకవచ్చు. అప్పుడు నువ్వు నీ దారిని నువ్వు స్వేచ్ఛగా వెళ్ళవచ్చు.

# 4

వైద్యుడు నాగదత్తుడు ప్రతీచోటా గొప్ప ఆదరసత్కారాలు అందుకున్నాడు. హిందూవైద్యుడు పార్శవ చక్రవర్తి దారయోశ్ వైద్యుడుగా కూడా కొన్నాళ్ళు ఉన్నవాడు. అదీకాక వైద్యంలో చాలా గట్టివాడు. పార్శపురిలో ఉన్నప్పుడే అతడు గ్రీకు భాష నేర్చేసుకున్నాడు. అతని సహచరి సోఫియా. అతడు మకెడూనియా చూశాడు. ఫిలిప్పు కొడుకు సికందరుకి (అలగ్జాండరు)గురువు అరిస్టోటిల్. నాగదత్తు ఆ అరిస్టోటిల్‌నీ చూశాడు. నాగదత్తూ ఆధ్యాత్మిక తత్వవేత్త. అయితే భారతీయ పద్ధతిలో! అరిస్టోటిల్ రాజరికాన్ని ఇష్టపడేవాడు. ఆ విషయంలో నాగదత్తు అతనితో ఏకీభవించలేదు. ఈ అభిప్రాయభేదం ఉన్నప్పటికీ అరిస్టోటిల్ పట్ల గొప్ప గౌరవ భావం ఏర్పరచుకునే అతడు మకెడూనియా (మాసిడోనియా) నుంచి సెలవు తీసుకున్నాడు. అరిస్టోటిల్ చెప్పిన దాంట్లో సత్యాన్వేషణకి గీటురాయి మెదడుకాదు. జగత్తులోని పదార్థమూ, ప్రకృతీను చాలా గొప్ప విషయంగా నాగదత్తు తెలుసుకున్నాడు. అది అతనికి చాలా నచ్చింది. అరిస్టోటిల్ ప్రయోగించి చూడాలనీ, అనుభవంలోకి తెచ్చుకుని, వస్తువును గురించి జ్ఞానం సంపాదించుకోడానికి పరీక్షించాలని చెప్తూ దానికి ఎక్కువ విలువని యిచ్చాడు. భారతీయ తత్వవేత్తలు సత్యాన్ని మనస్సు నుండి ఆవిర్భవింప చెయ్యాలనుకుంటున్నారని నాగదత్తు వివరించాడు. అరిస్టోటిల్ తన శిష్యుడి గొప్పతనం గురించి చాలాసార్లు చెప్పగా విని నాగదత్తుడు ఆ శిష్యుణ్ణి చాలాసార్లు కలుసుకున్నాడు. చర్చించాడు. ఆ యువకుడు అసాధారణమైన శౌర్యం కలవాడు. దానికి తోడు మంచిచెడ్డలను గుర్తించి నిర్ణయించటంలోనూ అసాధారణమైన శక్తి కలవాడు.

నాగదత్తుడు ఏథెన్సు వెళ్ళి తిరిగి వస్తానని అరిస్టోటిల్ దగ్గర శెలవు తీసుకున్నాడు. కాని ఆ గ్రీకు తత్వవేత్తని చూడ్డం అదే ఆఖరిసారి అని అతనికేం తెలుసు? తను పుట్టిన స్థలం తక్షశిలకి ఎంత ఆప్యాయంగా వెళ్తాడో అంత ప్రేమతోనూ, భక్తితోనూ అతడు వీరులని కన్నభూమికి, ప్రజాస్వామ్యపు జెండాని విజయవంతంగా ఎగరేసి ఏథెన్సు నగరానికి వెళ్ళాడు. నగరం మళ్ళీ జనంతో నిండింది. కాని ఇప్పుడది పూర్వపు ఏథెన్సులా లేదని సోఫియా చెప్పింది. వేనస్ (వీనసు), జ్యూపితర (జూపిటరు) దేవాలయాలు పూర్వంలాగానే ఇప్పుడూ అమర శిల్పులు చెక్కిన అందమైన చెక్కడాలతో ఉండడం ఉన్నాయి. కాని ఏథెన్సు నగర ప్రజల్లో వెనుకటి ఉత్సాహమూ, ఆ జీవితమూ లేవు. సోఫియాకి ఇప్పటికీ అప్పటికీ వ్యత్యాసం బాగా కనపడుతోంది.

సోఫియా తండ్రి ఇల్లు ఇప్పుడక్కడ లేదు. ఆ ఇల్లు ఉండే స్థలంలో ఓ పెద్ద భవనం ఉన్నది. మకెడూనియా వ్యాపారస్థుడిది. ఆ ఇంటిని చూసాక ఆవిడ మనస్సు ఎంతో క్షోభించింది. ఓ రాత్రంతా ఆవిడ మాటా తీరూ ప్రవర్తనా అంతా మామ్మూలు

దానికి భిన్నంగా ఉన్నాయి. అయితే మాట్లాడం తక్కువే. ఓసారి ఆవిడ కళ్ళంట నీళ్ళు జలజలా రాలతాయి. ఓసారి పాలరాతి బొమ్మలా కదలకుండా, మెదలకుండా ఉండిపోతుంది. తన చిన్ననాటి ఇల్లు ఇప్పుడీ స్థితిలో ఉండడం చూసి ఆవిడ క్షోభ పడుతోందని నాగదత్తుకి అర్థమయింది. కాని ఊరడించడానికి వీలు దొరకలేదు. దాంతో సోఫియా పడుతున్న గొప్ప క్షోభతో అతడూ క్షోభకి గురి అయ్యాడు. బాధ నుంచి తేరుకున్నాక సోఫియా పూర్తిగా మారిపోయింది.

అలంకరించుకునే ఆసక్తి ఇదివరకు ఆవిడకి అసలు లేదు. కాని ఇప్పుడు ఏథెన్సు ప్రజాస్వామ్యంలో యువతులు అలంకరించుకున్నట్టు తనూ తన విరబోసిన బంగారపు రంగుజుట్టులో అప్పుడే విరిసిన పువ్వులదండలు కట్టుకుంటోంది. గ్రీకు పడుచుల్లాగ కాళ్ళవరకూ వేళ్ళాడే అందమైన కంచుకాన్ని ఎక్కువ కుచ్చులున్న దాన్ని వేసుకుంటోంది. కాళ్ళకి ఎన్నో పట్టీలున్న చెప్పులు తొడుక్కుంటోంది. ఆవిడ చక్కటి నుదురు, గులాబీ బుగ్గలు, ఎర్రం మెత్తటి పెదాలూ అన్నిటి సౌందర్యమూ ఆరోగ్యమూ అద్భుతంగా మిళితమై కనపడుతున్నాయి. మొహం ఎప్పుడూ ప్రసన్నంగా ఉంటోంది. ఎప్పుడు చూసినా ఆ పెదాలమీద చిరునవ్వు తాండవిస్తోంది.

ఈ మార్పుకి నాగదత్తు ఆశ్చర్యపోలేదు. ఎంతో సంతోషపడ్డాడు. ఏమిటి సంగతి అని సోఫియాని అడిగాడు.

"ప్రియమైన నాగ్! నేనిప్పటి వరకూ జీవితం అంటే దుఃఖం అనీ చింతలతో కూడినదనీ అనుకున్నాను. కాని ఇప్పుడు నేననుకున్నది తప్పు అని తెలిసింది. జీవితాన్ని ఒకే కోణంలోంచి చూసే ఈ దృష్టి జీవితపు విలువని తగ్గించేస్తుంది. పని చేసే యోగ్యతనీ శక్తినీ కూడా పాడుచేసేస్తుంది. నిన్ను తీసుకుంటే నీకూ తక్షశిల భవిష్యత్తు గురించి తక్కువ చింతలేదు. నాగ్! కాని నువ్వు మనస్సుని వేడెక్కించుకోవు. చల్లగా శాంతంగా ఏం చెయ్యాలా అని మార్గాన్ని ఆలోచించటానికి నీ శక్తినంతా వినియోగిస్తున్నావు."

"నువ్వింత సంతోషంగా ఉండడం నాకు ఎంతో బాగుంది సోఫియా!"

"నా కెందుకు సంతోషంగా ఉండదూ? ఏథెన్సుకి తిరిగి వచ్చాక నాకు కావల్సినవాడు, నా ప్రియుడు నాకు దొరికాడు."

"ఇది మరీ సంతోషించవలసిన విషయం. ఇంతకాలం తర్వాత నువ్వు నీ ప్రియుణ్ణి పొందగలిగావు." నాగదత్తుడు ఆనందంతో పులకరించి అన్నాడు.

"నాగ్! నువ్వు మానవాతీతుడివే కాదు, దేవతలకన్నా పై మెట్టు మీద ఉన్నావు. నీకు అణుమాత్రమన్నా ఈర్ష్య కలగలేదు."

"ఈర్ష్య! ఈర్ష్య ఎందుకు సోఫీ? నిన్ను గ్రీస్‌దేశం చేర్చే బాధ్యత నేను తీసుకున్నానా? లేదా? అక్కడ నీకు తగినవాణ్ణి నీ ప్రియుణ్ణి వెతుక్కోమని చెప్పలేదూ?"

"అవును చెప్పావు."

"నీలో పట్టలేనంత సంతోషాన్ని చూసినప్పుడు నీకేదో అసాధారణమైనది దొరికి ఉంటుందని నాకు అనిపించింది."

"నువ్వనుకున్నది నిజమే నాగ్!"

"సరే, నీ ప్రియుణ్ణి ఇక్కడికి ఆహ్వానించడానికి అనుమతియ్యి. లేదా అతడిక్కడికి ఇప్పుడు రాలేకపోతే అతన్ని చూడ్డానికి నాకు...."

"ఎందుకంత తొందరా?"

"నిజంగా? నేను తొందరపడుతున్నానా? నువ్వు చెప్తున్నది నిజమే!" నాగదత్తుడు తననితాను అదుపులో పెట్టుకోడానికి ప్రయత్నించాడు.

తన కన్నీటిని ఆపుకోలేనని సోఫియాకి అనిపించింది. మొహాన్ని పక్కకి తిప్పేసుకుంది–"చూద్దువుగాని- కాని నువ్వు ఏథెన్సు యువకులు వేసుకున్నట్టు దుస్తులు వేసుకోవాలి" అన్నది.

"ఆ కొత్త అంగరఖా, కొత్త చెప్పులూ-నువ్వు నిన్న కొనితెచ్చావుగా-వాటిని వేసుకుంటాను."

"వెళ్ళు. తొడుక్కొనిరా ఈలోగా నా ప్రియుడికోసం పువ్వులమాలని నేను తీసుకువస్తాను. లిదియా పువ్వులు మాలగా గుచ్చులోంది."

"అలాగే" అని నాగదత్తు మరో గదిలోకి వెళ్ళాడు. సోఫియా సావిట్లోని పెద్ద అద్దం ముందుకి వెళ్ళి నిల్చుంది. ఆవిడ తన బట్టల్ని, తన పువ్వుల్ని సరిచేసుకుంది. ఓ పూలదండని అద్దం వెనక దాచి నెమ్మదిగా రెండోగది గుమ్మం దగ్గరకి వెళ్ళి "నాగ్! చాలా ఆలస్యం చేస్తున్నావే! నా ప్రియుడు మళ్ళీ ఎక్కడికన్నా షికారుకి వెళ్ళిపోతాడు!"

"అయిపోయింది. వచ్చేస్తున్నా సోఫీ! నువ్వీ అంగరఖా ఏమిటో ఇలాంటిది తెచ్చావు సరిగ్గా కుదరటంలేదు."

"నేనొచ్చి సరిచెయ్యనా?"

"అంతకన్నానా?"

అంగరఖా ముడతల్ని సరిచేసింది. నాగదత్తు కొత్త చెప్పులు వేసుకున్నాడు. విప్పారి మెరిసిపోతున్న నాగదత్తుని మొహం వేపు చూడ్డానికి సోఫియాకి ధైర్యం చాలలేదు. చెయ్యిపట్టుకుని "ముందు అద్దంలో నీ కొత్తబట్టలెలా ఉన్నాయో చూసుకుందువుగాని పద" అన్నది.

"నువ్వు చూశావు కదా సోఫీ! అదే పదివేలు! వేషం మర్యాదగా ఉండాలి."

"మర్యాదగానూ, గౌరవప్రదంగానూ ఉన్నది. కాని నువ్వోసారి అద్దంలో చూసుకుంటే తప్పేముందీ?"

సోఫీ నాగదత్తుని తీసుకువెళ్ళి అద్దంముందు నిల్చోబెట్టింది. అతడు తన బట్టల్ని చూసుకుంటున్న సమయంలో సోఫీ పూలదండ తీసి "ఇదిగో ఈ దండని నా ప్రియుడికోసం చేశాను?" అన్నది.

"దండ చాలా బావుంది సోఫీ"

"కాని అతనికి ఎలా ఉంటుందో కదా!"

"ఏం? చాలా బాగుంటుంది. చక్కగా ఉంటుంది."

"అతడిది పసుపుపచ్చని జుట్టు. ఈ దండ చూస్తే గులాబీ పువ్వులది."

"అందంగా ఉంటుంది."

"నీ జుట్టుకోసారి పెట్టి చూడనా?"

"నే ఇష్టం. నా జుట్టూ పచ్చరంగు జుట్టే."

"అందుకే పెట్టి చూసి ఎలా ఉంటుందో తెలుసుకుందా మనుకుంటున్నాను." దండని అతని జుట్టుకి పెట్టి ఎదురుగా నిల్చుని చూసి ఆ తర్వాత అతణ్ణి అద్దం వేపుకి తిప్పింది.

"నువ్వివాళ నా ప్రియుణ్ని చూడ్డువుగాని నాగ్! ఇప్పుడే! చూడు" అన్నది సోఫియా.

నాగ్ తలతిప్పి వెనక్కి చూశాడు. సోఫియా వేలు అద్దంలో కనిపిస్తున్న నాగదత్తుని ప్రతిబింబాన్ని చూపుతోంది. ఆనందంతో అశ్రువులు నిండిన కళ్ళతో "ఇదిగో ఇతడే నా ప్రియుడు" అన్నది. ఆ వెంటనే రెండు చేతులతో నాగదత్తుని కౌగిలించుకుని అతని పెదాలమీద తన పెదాలను ఉంచింది, నాగదత్తు చాలాసేపటి వరకూ అలాగే ఉన్నాడు. సోఫీ తన చెక్కిళ్ళని అతని బుగ్గలకి చేర్చింది.

"నా ప్రియుడు ఎంత బాగున్నాడో కదా నాగ్!"

"సోఫీ! నీకు నేను తగననుకుంటాను."

"కాని నేను నీకు తగినదాన్నని అనుకుంటున్నాను నాగ్! ఆజన్మాంతం మనం కలిసి ఉందాం."

నాగదత్తుడు ఆనందంతో అశ్రువులు కళ్ళనిండా నిండుకురాగా - "ఆజన్మాంతం" అన్నాడు.

# 5

సలామీ అఖాతం చూడాలని నాగదత్తుకి చాలా గట్టిగా ఉంది. అక్కడే గ్రీకుల నౌకాదళం పార్శీపుల్ని చిత్తుగా ఓడించింది. వీళ్ళిద్దరూ భూమార్గం గుండా వెళుతున్నారు. నాగదత్తుడిలో కొత్త ఉత్సాహం పుంజుకుంది. అతనికి ఉండుండి తక్షశిల జ్ఞాపకం వస్తోంది. తోవలో ఇద్దరూ ఓ చెట్టుకింద బడలిక తీర్చుకుంటున్నారు.

"విన్నావు కదా నాగ్! ఫిలిప్పు చనిపోయాడు. అలెగ్జాండరు మక్‌దూనియాకి (మాసిడోనియా) రాజయ్యాడు. అతడు చాలా గొప్ప సేనని తయారు చేస్తున్నాడు!"

"అవును. అతడు ఈ గ్రీసు (భూమధ్య సాగరం) సాగర తీరం అంతటినీ తన అధికారం కిందకి తెచ్చుకోవాలని అనుకుంటున్నాడు. కాని తూర్పుతీరం,దక్షిణ తీరం (ఈజిప్టు) పార్శ్వుల చేతిలో ఉన్నాయి."

"అంటె అతడు పార్శ్వులతో యుద్ధం చెయ్యాలని అనుకుంటున్నాడన్న మాట!"

"తన సామ్రాజ్యాన్ని స్థాపించటానికి గ్రీస్ ప్రజాస్వామ్యం నుంచి సహాయాన్ని తీసుకోవాలని అనుకుంటున్నాడు. ఓ దెబ్బకి రెండు పిట్టలు. అదీ అతని ఆశ. సోఫీ! చక్రవర్తిని భూమధ్య సాగరం నుంచి తొలగించాలి—ఇంకా ముందుకు వెళ్ళలేకపోయేమేడనుకో, అప్పుడు స్వాధీనపరచుకున్న గ్రీకు ప్రజాస్వామ్యాల రాజభక్తిని సంపాదించాలి."

"అరిస్టోటిల్ అతనికి శిక్షణ నిచ్చాడు. అతని ధైర్యాన్ని, ఆశనీ పెంచాడు."

"తత్వవేత్త అరిస్టోటిలా?"

"అవును. అతడి గురువు ప్లేటో ఓ ఆదర్శ ప్రజాస్వామ్యాన్ని ఊహించాడు. కాని అతడూ సామాన్య ప్రజానీకాన్ని రైతులుగానూ, పశువుల కాపర్లుగానే ఉంచాలని అనుకున్నాడు. అరిస్టోటిల్ ఆ ఆదర్శ ప్రజాస్వామ్యానికి బదులు ఆదర్శ రాజరికాన్ని—చక్రవర్తినీ ఊహించాడు. ఈ గ్రీకు చక్రవర్తి పార్శ్వ సమ్రాట్టుని ఓడించి ఎంతవరకూ వెళ్తాడో ఎవరికి తెలుసు."

"ఓసారి దారితీస్తే మరి ఆపడం అన్నది మనచేతిలో ఉండదు సోఫీ! అక్కడ నా సహాధ్యాయి విష్ణుగుప్త చాణక్యుడూ మగధలో ఓ చక్రవర్తిని అన్వేషించాలని వెళ్ళాడు "

"గ్రీకు చక్రవర్తీ హిందూ చక్రవర్తీ సింధుతీరంలో తారసిల్లరు కదా?"

"మొదటి తరంలో కాకపోతే రెండో తరంలో తారసిల్లుతారు సోఫీ! కాని అప్పుడు ప్రపంచం ఎంత చిన్నదైపోతుందో!"

* * * *

సముద్రతీరానికి వెళ్ళి అక్కడ్నించి నావలో సలామీ అఖాతానికి బయల్దేరారు. సముద్రం ప్రశాంతంగా ఉంది. గాలి బొత్తిగా లేదు. రెండు శతాబ్దాల కిందటి సముద్రాన్ని — పార్శ్వుల నౌకావాహినిని ధ్వంసం చేయడానికి సహాయపడ్డ సముద్రాన్ని యెంతో కృతజ్ఞతతో సోఫియా, నాగదత్తులు చూశారు.

సముద్రంలో చాలాదూరం వెళ్ళారు. ఆ సమయానికి ఓ పెద్ద తుఫాను చెలరేగింది. భీతావహంతో భయంతో నావని నడుపుతున్న నావికులని చూశారు. తెరచాప విరిగిపోయింది. నావ అటూఇటూ ఒరిగిపోతోంది. పరిస్థితి తెలుస్తూనే ఉంది.

సోఫియా నాగదత్తుని గట్టిగా కౌగలించుకుని గుండెకి హత్తుకుంది. ఆమె మొహాన్ని చిరునవ్వు. "చచ్చిపోయేవరకూ!" అన్నది.

"అవును, చచ్చిపోయేవరకూ!" నాగదత్తు సోఫియాని దగ్గరకు తీసుకున్నాడు. ఇద్దరూ ఒకరిని ఒకరు ముద్దుపెట్టుకుంటూ పెనవేసుకుపోయారు.

ఆ క్షణంలో నావ తలక్రిందులైపోయింది. ఇద్దరూ నిజంగానే ఆజన్మాంతం ఒకరినొకరు విడవకుండా ఉన్నారు. అభిన్న మిత్రులుగానే ఉన్నారు.

# ప్రభ

కాలం : క్రీస్తుపూర్వం 50

## 1

సాకేత్ (అయోధ్య) ఎప్పుడూ ఏ రాజుగారికీ ముఖ్య రాజధానిగా లేదు. బుద్ధుడి సమకాలికుడు కోసలరాజు ప్రసేన్‌జిత్తుకి ఇక్కడో రాజభవనం ఉండడం ఐతే ఉండేది. కాని అతని రాజధాని మాత్రం ఆక్కణ్ణించి ఆరు యోజనాల దూరంలో ఉన్న శ్రావస్తే (సహేట్ మహేట్). ప్రసేనజిత్తు అల్లుడు అజాత శత్రువు కోసల రాజ్య స్వాతంత్ర్యాన్ని హరించాడు. అప్పటినుంచీ శ్రావస్తి వైభవమూ హరించుకుపోయింది. తూర్పు నుంచీ ఉత్తరాపథం వరకూ (పంజాబు వరకూ)బీహారుల రాకపోకలకు మార్గం వుండడం నుంచి సరయూ నదీతీరాన్ని ఉన్న సాకేత్ ఒక్క నౌకావ్యాపారానికే కాక స్థల వ్యాపారానికి కూడా మొదటినుంచి పేరుపొందింది. చాలా రోజుల వరకూ ఆ పేరు నిలిచింది. విష్ణుగుప్త చాణక్యుడి శిష్యుడు చంద్రగుప్త మౌర్యుడు మగధరాజ్యాన్ని మొదట తక్షశిల వరకూ, ఆ తర్వాత గ్రీకురాజు శైలాక్షుణ్ణి (సెల్యూకస్) ఓడించి హిందూకుశ్ పర్వత పంక్తుల దగ్గర్నుంచి (ఆఫ్ఘనిస్థాను) బాగా పడమరకి ఉన్న హిరాత్, ఆమూ నది వరకూ విస్తరింప చేశాడు. చంద్రగుప్తుని కాలంలోనూ, తర్వాత మౌర్య వంశం పరిపాలించిన కాలంలోకూడా సాకేత్ వ్యాపారకేంద్రంగానే ఉందికాని అంతకుమించి ఏ ప్రాముఖ్యాన్నీ పొందలేక పోయింది. మౌర్యవంశాన్ని నాశనం చేసిన సేనానాయకుడు పుష్యమిత్రుడు సాకేత్‌ని మొదటిసారిగా రాజధానిగా చేశాడు. ఐతే పాటలీపుత్రానికున్న ప్రాముఖ్యాన్ని మాత్రం తగ్గించలేదు. వాల్మీకి తన రామాయణాన్ని పుష్యమిత్రుడి శాసనకాలంలోనో, లేదా అతని శుంగవంశపు శాసనకాలంలోనో రచించినప్పుడు అయోధ్య అన్న పేరుని ప్రచారంలోకి తెచ్చాడు. అశ్వఘోషుడు వాల్మీకి రాసిన మధురమైన కావ్యాన్ని చదివి రసాస్వాన చేశాడు. అందులో సందేహంలేదు. కాళిదాసు చంద్రగుప్త విక్రమాదిత్యుణ్ణి ఆశ్రయించిన కవి ఐనట్టుగానే వాల్మీకి శుంగవంశాన్ని ఆశ్రయించిన కవి అయి ఉండవచ్చు. కాళిదాసు చంద్రగుప్త విక్రమాదిత్యుణ్ణి తన రఘువంశంలో రఘువుగానూ, చంద్రగుప్తుని పుత్రుడు కుమారగుప్తుణ్ణి తన కుమారసంభవంలో కుమారుడిగానూ కీర్తించినట్లు వాల్మీకి శుంగవంశపు రాజధాని

ప్రాముఖ్యాన్ని పెంచి చెప్పడానికి జాతక కథల్లోని దశరథుని రాజధాని వారణాసిని సాకేత్ లేదా అయోధ్యగా మార్చి రాముడి పేరుతో శుంగవంశపు చక్రవర్తి పుష్యమిత్రుణ్ణీ లేదా అగ్నిమిత్రుణ్ణి కీర్తించాడు. ఇందులో వింతపడాల్సిందేం లేదు.

సేనాధిపతి పుష్యమిత్రుడు తనరాజుని చంపి మౌర్య సామ్రాజ్యం యావత్తునీ తన స్వాధీనంలోకి తెచ్చుకోలేకపోయాడు. యావత్తు పంజాబూ గ్రీకురాజు మినాందర్ చేతిలోకి పోయింది. ఓసారి మినాందర్ సాకేత్ మీదా దండెత్తాడు. పుష్యమిత్రుడి పురోహితుడు ఈ సంగతి రాశాడు. దీనివల్ల పుష్యమిత్రుడి పరిపాలన ప్రారంభమైన రోజుల్లో కూడా సాకేత్‌కి ప్రముఖమైన స్థానం వుందనీ పతంజలి, పుష్యమిత్రుల కాలంలో అది అయోధ్యగా కాక సాకేత్ అనే పేరుతోనే పిలవబడేదనీ తెలుస్తోంది.

పుష్యమిత్రుడూ పతంజలి మినాందర్ కాలం తర్వాత మరో రెండు వందల సంవత్సరాలు దాటేక కూడా సాకేత్‌లో గొప్ప ధనవంతులైన శ్రేష్ఠులు (సేఠ్‌లు) ఉండేవారు. లక్ష్మి ప్రసన్నమైన స్థలం కావడం నుంచి అక్కడ సరస్వతీదేవి క్కూడా కొంతవరకూ గౌరవ ప్రతిష్ఠలు ఉండడం తప్పనిసరి. మరి వాటితోపాటు బెల్లమూ దానితోపాటు చీమలూ ఉన్నట్టు మతమూ, బ్రాహ్మలూ ఉండడమూ సహజమే అయింది. ఈ బ్రాహ్మణుల్లో లక్ష్మీసరస్వతులు ఇద్దరూ కటాక్షించిన ఓ కుటుంబం ఉంది. ఇంటి యజమాని పేరు కాలగర్భంలో కలిసిపోయింది. కాని ఇంటి యజమానురాలి పేరుకి మాత్రం వారి పుత్రుడు శాశ్వతం కలిగించాడు. ఆవిడ పేరు సువర్ణాక్షి. ఆవిడ కళ్ళు బంగారంలా పచ్చగా ఉండేవి. ఆ రోజుల్లో బంగారపువన్నె కలిగిన కళ్ళూ, నీలిరంగు కళ్ళు బ్రాహ్మణుల్లోనూ, క్షత్రియుల్లోనూ సర్వసామాన్యంగా ఉండేవి. బంగారపు వన్నెతోనున్న కళ్ళు ఉండడాన్ని దోషంగా ఎంచే వారు కారు. సువర్ణాక్షి పుత్రుడొకడు ఆమెలాగే సువర్ణాక్షుడూ, ఆమెలాగే సువర్ణ కేశాలు కలవాడూ; ఆమెలాగే పచ్చని పసిమిఛాయ వాడూను!

## 2

వసంతకాలం. మామిడిపూత సువాసనలు అంతటా వ్యాపించుకుంటున్నాయి. చెట్లు కొత్తచిగుళ్ళు తొడుగుతున్నాయి. ఇవాళ చైత్ర శుద్ధ నవమి. సాకేతపురంలోని స్త్రీ పురుషులంతా సరయూ నదీతీరం దగ్గర జలక్రీడల కోసం పోగవుతున్నారు. సాకేతపురంలో వసంతోత్సవాన్ని జలక్రీడలతోనే జరుపుకుంటూ ఉండేవారు. ఒకే రేవులో యువతీ యువకులు దిగంబరులై జలక్రీడల్లో పాల్గొనేవారు. యువతుల్లో కర్పూరం లాంటి తెల్లటి ఛాయ ఉన్న గ్రీకు స్త్రీలూ ఉన్నారు. వారి అందమైన శరీరాలు గ్రీకు శిల్పులు చెక్కిన పాలరాతి బొమ్మల్లా ఉన్నాయి. బంగారపు వన్నె కలిగిన జుట్టుతో వాళ్ళు మరీ అందంగా కనపడుతున్నారు. అందంలో గ్రీకు స్త్రీలకి

తీసిపోని బ్రాహ్మణ కన్యలూ ఉన్నారు. వారు నల్లని జుట్టు కలవారూ, పీతకేశులూ, సువర్ణాక్షులూను. మత్తెక్కించే యవ్వనంలో ఆకర్షణలో వీళ్ళతో సమానం అనిపించే వైశ్యయువతులూ ఉన్నారు. వీరు కారునలుపు జుట్టు కలవారూ, గోధుమ ఛాయలో ఉన్నవారూను. ఇవాళ సరయూ నదీ తీరానికి సాకేతపురం మూలమూలల నుండి యవ్వనమూ అందమూ కదిలి వచ్చింది. యువతుల్లాగానే నానాకులాలకి చెందిన యువకులు కూడా తమ బట్టల్ని విడిచి నదిలోకి దూకడానికి సిద్ధంగా ఉన్నారు. కసరత్తు చెయ్యటంవల్ల కండలు తీరి బలిష్టంగా ఉన్న వాళ్ళ అందమైన శరీరాలు కర్పూరపు ఛాయ నుంచి గోధుమ ఛాయ వరకూ అన్ని ఛాయల్లోనూ ఉన్నాయి. వాళ్ళ జుట్టు, ముఖం, ముక్కు తీరులు వాళ్ళ వాళ్ళ కులాల్ని చెప్పక చెప్పు తున్నాయి. యువతీ యువకుల సౌందర్యాన్ని పరీక్షించటానికి నేటి జలక్రీడోత్సవం కన్నా మంచి తరుణం మరొకటి ఉండదు. ప్రతి ఏడూ ఈ సమయంలోనే ఎన్నో స్వయంవరాలు జరుగుతాయి. తల్లిదండ్రులు యువకుల్ని ప్రోత్సహిస్తారు. అది ఆనాటి శిష్టాచారం.

యువతీ యువకులు నావలో సరయూనది ఆవలొడ్డుకి వెళ్ళి అక్కడ నీటిలో దూకి జలక్రీడలను ప్రారంభించారు. కొందరు నల్లటి సరయూ జలాల మీద తమ పొడుగైన బంగారపు వన్నె జుట్టునో, పాండువర్ణపు జుట్టునో లేదా రజితవర్ణపు జుట్టునో ప్రదర్శిస్తూ ఈదితే మరికొందరు తమ నల్లని జుట్టుని నల్లటిజలాలలో ఏకంచేసి వెల్లకితలా పడుకుని తమ రెండు భుజాలతో నీటిని చీలుస్తూ ఈదుతున్నారు. వాళ్ళని అనుసరిస్తూ ఎన్నో చిన్నచిన్న పడవలు వెళ్తున్నాయి. ఆ పడవలని నడుపు తున్నవారు ఈదే యువతీ యువకులని ప్రోత్సహిస్తూ అలిసిపోయినవారిని పడవల్లోకి ఎక్కించుకుంటున్నారు. వేల సంఖ్యలో పోటీదారులున్నప్పుడు కొంతమందికి ఓట మిని అంగీకరించక తప్పదు. ఈతగాళ్ళంతమందీ తొందరగా ఒడ్డుకి చేరటానికి తమ యావచ్ఛక్తినీ వినియోగిస్తున్నారు. ఒడ్డు మూడోవంతు దూరంలో ఉందనగా చాలా మంది అలసిపోయారు. ఆ సమయానికి వెనకనుంచి ముందుకి ఉరకలువేస్తూ వస్తున్న కేశాల్లో ఒకటి బంగారపు వన్నెదీ, రెండోది పాండువర్ణందీను. ఒడ్డు దగ్గరికి వస్తున్న కొద్దీ వాటి వేగం ఇంకా పెరిగిపోతోంది. పడవల్లో వస్తున్నవారు ఊపిరి బిగబెట్టి చూస్తున్నారు. బంగారపువన్నె కేశాలూ, పాండువర్ణ కేశాలూ అందరికన్నా ముందు ఒకేలా సరిసమానంగా వస్తున్నాయి. ఒడ్డు దగ్గరపడిపోయింది. ఆ ఇద్దరిలో ఒకరు ముందు ఒడ్డుకి చేరుకోవాలని అంతా అనుకున్నారు. కాని వాళ్ళిద్దరూ సమానంగా వెనకాముందూ కాకుండా వస్తున్నారు. పడవల్లోని వాళ్ళు తొందరగా ఈదమనీ, ఒకరినొకరు మించి వెళ్ళాలనీ ప్రోత్సహించడమూ జనం విన్నారు.

అయితే వాళ్ళిద్దరూ ఏకకాలంలో ఒడ్డుకి వచ్చారు. ఒకరు యువకుడైతే మరొకరు యువతి అని తెలిసింది. జనం హర్షంతో చప్పట్లు కొట్టారు. వాళ్ళిద్దరూ బట్టలు వేసుకున్నారు. అందరికీ కనిపించేటట్టు పల్లకీలో కూచోపెట్టి వాళ్ళిద్దరీ్ని

తీసుకువెళ్ళారు. ప్రేక్షకులు పువ్వులు చల్లేరు. యువతీ యువకులు ఇద్దరూ ఒకరి నొకరు చూసుకున్నారు. జనం వాళ్ళిద్దరి ఈతనే కాక వాళ్ళ చక్కదనాన్ని కూడా పొగుడుతున్నారు.

"ఆ అమ్మాయిని నేను ఎరుగుదును కాని ఆ యువకుడు ఎవరు?" అని ఒకడు పక్కవాణ్ణి అడిగాడు.

"సువర్ణాక్షి పుత్రుడు అశ్వఘోషుడి పేరు విన్లేదా?"

"లేదు. నాకు తెలీదు. మా పురోహితుల కుటుంబంవాళ్ళనే నే నెరుగుదును. మా వ్యాపారస్థులకి అన్నీ తెలుసుకోడానికి తీరికెక్కడా?"

"భలేవాడివే! అశ్వఘోషుడి పాండిత్యం సాకేతంలోనే కాదు, దేశదేశాల్లో మారుమోగింది. సర్వవేదశాస్త్రాల్లోనూ నిష్ణాతుడు" మరొకడు అన్నాడు.

"అట్టే వయసున్నవాడిలా లేదే! ఇరవైనాలుగేళ్ళ కన్నా ఎక్కువ ఉండి ఉండవే" అన్నాడు మొదటివాడు.

"అవును. వయస్సులో చిన్నవాడే. ఇతని కావ్యాలు పాడుతూ జనం పరవశించిపోతూ ఉంటారు" అన్నాడు మూడోవాడు.

"ఓహో! అయితే ఇతడు అశ్వఘోష కవన్నమాట! ఇతడు రాసిన ప్రేమ గీతాలు మా యువతీ యువకులందరికీ కంఠతావే!" అన్నాడు రెండోవాడు.

"మరెవరనుకున్నావు? ఆ అశ్వఘోషుడే! ఆ అమ్మాయి పేరేమిటో?"

"ప్రభ. సాకేతపురంలోని గ్రీకుల్లో ప్రముఖుడూ, కోసలలో పేరు పొందిన వర్తకుడూ వత్తమిత్రుడి కూతురు."

"అదీ ! అలా చెప్పు. అంత చక్కదనం ఇంకెక్కడా చూద్దామన్నా చూడలేం. చూడ్డానికి ఎంత నాజూకుగా సుకుమారంగా ఉంది! మళ్ళీ ఈదడంలో ఎంత దిట్టో!" అన్నాడు రెండోవాడు.

"ఆవిడ తల్లిదండ్రులిద్దరూ మంచి ఆరోగ్యవంతులూ, బలిష్ఠులూను."

సాకేతనగరం ఉద్యానవనంలో సన్మానసభ జరిగింది. ఈతగాళ్ళిద్దరినీ ప్రజలకి పరిచయం చేశారు. వాళ్ళిద్దరూ మొహమాటపడుతూ తలలు వొంచుకుని ఒకరి కొకరు తమనితాము పరిచయం చేసుకున్నారు.

# 3

సాకేత్‌లోని పుష్పోద్యానం సేనాధిపతి పుష్యమిత్రుడి పరిపాలనకి స్మృతి చిహ్నంగా ఉన్నది. ఎంతో డబ్బుపెట్టి శ్రమపడి సేనాధిపతి ఆ ఉద్యానాన్ని పెంచాడు. ఇప్పుడు అతని వంశం వారు సాకేత్‌ని పరిపాలించటమూ లేదు. సాకేత్ రెండోతరగతి రాజధానైనా కాదు. అయినా నగరవాసులు రెండు వందల సంవత్సరాల క్రితం పుష్యమిత్రుడి శాసన కాలంలో ఉన్నట్టుగానే దానిని ఈ నాటికీ కాపా

డుతూ సాకేత్ ప్రతిష్టగా భావిస్తున్నారు. తోటమధ్యలో అందమైన పుష్కరిణి ఉంది. దాని స్వచ్ఛజలాల్లో పద్మాలూ, శ్వేతకమలాలూ, రంగు రంగుల కలువలు పూసి ఉన్నాయి. హంసల జంటలు ఆ జలాల్లో ఈదుతున్నాయి. పుష్కరిణికి నాలుగు పక్కలా స్ఫటికంలా మెరుస్తున్న తెల్లరాతితో కట్టిన రేవులు ఉన్నాయి. సరోవరం ఒడ్డుని బాగా వెడల్పుగా పచ్చటి పచ్చిక ఉంది. అక్కడక్కడ గులాబీలు,మల్లెలు, సన్నజాజులు మొదలైన పూల మొక్కలున్నాయి. ఒక్కొక్క దగ్గర కదంబ వృక్షాలూ, అశోకవృక్షాలూ, పొగడచెట్లూ ఉన్నాయి. రాతి చప్టాలతో కట్టినలతలూ తీగలూ అల్లుకుని ఉన్న లతాగృహాలూ పెద్దవి చిన్నవీ కూడా ఉన్నాయి. కొన్ని చోట్ల ఆడపిల్లలూ, మగపిల్లలూ ఆడుకునే ఆటస్థలాలూ ఉన్నాయి. ఉద్యానవనంలో రాతి గుట్టలూ, ఇసకగుట్టలూ, ఆకుపచ్చటి పచ్చికలో నిండిన గుట్టలూ ఎంతో ఆనందమైనవి క్రీడించడానికి వీలుగా ఉన్నాయి. అక్కడక్కడ వానజల్లు పడు తున్నట్టుగా నీటి జల్లుని చిమ్ముతూ జలయంత్రాలు (ఫౌంటెన్లు) ఉన్నాయి.

మధ్యాహ్నపు వేళలో ఓ లతాగృహం ముందు సాకేత్‌లోని యువతీ యువ కులు గుంపుగా నిలబడ్డం తరచుగా జరుగుతూ ఉంటుంది. లతా గృహంలో చోటు చాలకని వాళ్ళు ఇలా బైట గుంపుగా నిల్చుంటారు. ఇవాళా అక్కడ గుంపుగా జనం నిల్చుని ఉన్నారు. అయితే చాలా నిశ్శబ్దంగా నిల్చుని ఉన్నారు. లతా గృహంవేపే అందరూ చెవులు ఒగ్గి వింటున్నారు. ఓ నెల కిందట కవిత పోటీలో కావాలనే ఓట మిని అంగీకరించిన ఆ యువకుడు రాతిచప్టా గచ్చుమీద కూచుని అన్నాడు. అతని ఒంటిని మెత్తటి సన్నటి వస్త్రంలో కుట్టిన కంచుకం ఉన్నది. పొడుగ్గా ఉన్న బంగారపు కేశాల్ని ఎత్తి నెత్తిమీదకి ముడిచుట్టుకుని ఉన్నాడు. అతని చేతిలో వీణ ఉన్నాది. ఆ యువకుడి చేతివేళ్ళ సునాయాసంగా వీణ తీగల్ని మీటుతూ తన ఇచ్ఛానుసారమూ తియ్యని స్వరాల్ని పలికిస్తున్నాయి. అరమోడ్పు కళ్ళతో వీణలయలో లీనమైపోయి తాను రచించిన గీతాన్నే అతడు ఆలాపిస్తున్నాడు. "వసంత కోకిల'' గీతాన్ని సంస్కృతంలో ఇప్పుడే రచించాడు. సంస్కృతగీతం తర్వాత ప్రాకృతంలో పాట పాడాలి తప్పదు అన్న సంగతి ఆ గాయక కవికి తెలుసు. అక్కడున్న శ్రోతల్లో చాలామంది ప్రాకృతమంటే చాలా ఇష్టపడతారు. తాను ఇటీవల రచించిన "ఊర్వశీ వియోగం" గీతాన్ని ఆలాపించాడు. ఊర్వశి మాయమై పోయింది. పురూరవుడు అప్సరా! (నీళ్ళలో నడిచేది) అని ఊర్వశిని సంబోధిస్తూ అడవులూ, కొండలూ, నదులూ సరోవరాలూ లతా నికుంజాలూ వెతు కుతూ తిరుగుతున్నాడు. అప్సర అతనికి కనపడదు. కాని గాలిలో తను పలికిన పిలుపుల పలుకులే వినిపిస్తాయి. పురూరవుని కన్నీటిని గురించి పాడుతూ గాయ కుడు కన్నీళ్ళు కార్చాడు. అక్కడున్న శ్రోతలంతమందీ అతనితోపాటు కళ్ళంట నీళ్ళుకారగా విలపించారు.

సంగీతం పూర్తైన తర్వాత జనం ఒక్కొక్కరూ వెళ్ళిపోసాగారు. అశ్వ

ఘోషుడు లతా గృహం నుంచి బైటికిరాగానే కొంతమంది యువతీ యువకులు అతని చుట్టూ చేరారు. వాళ్ళలో ఏడ్చిన కారణంగా ఎర్రగా ఉబ్బినకళ్ళతో ప్రభ కూడా ఉంది. ఓ యువకుడు అశ్వఘోషుడి దగ్గరగా వెళ్ళి "మహాకవీ!!"అన్నాడు.

"మహాకవా? నేను కనీసం కవినైనా కాదు నేస్తం!" అన్నాడు అశ్వఘోషుడు.

"నాకున్న గౌరవభావాన్ని నన్ను చెప్పనీ ! కవీ! సాకేతంలో ఉన్న మా గ్రీకులది ఓ చిన్న నాట్యశాల ఉంది.

"నాట్యానికా? నాట్యమంటే నాకూ ఆసక్తే!"

"నాట్యానికి కాదు. అక్కడ మేం అభినయిస్తాం."

"అభినయమా?"

"అవును. మా గ్రీకుల అభినయాలు ఓ విశిష్టపద్ధతిలో ఉంటాయి కవీ! విభిన్న కాలాలని స్థలాలని తెలియపరుస్తూ పెద్ద పెద్ద బొమ్మల తెరలు ఉంటాయి. అన్ని సంఘటనలనీ యదార్థరూపంలో చూపెట్టడానికి ప్రయత్నం చేస్తాం."

"ఎంత విచారకరం! సాకేత్‌లో పుట్టి పెరిగిన వాణ్ణైనా అలాంటి అభినయాన్ని నేనిప్పటివరకూ చూడలేదు."

"మా అభినయాలకి ప్రేక్షకులు, ఇక్కడి గ్రీకు కుటుంబాల వాళ్ళూ, కొంత మంది సన్నిహిత మిత్రుల వరకేనని మేం అనుకున్నాం. అంచేత సాకేత నగర వాసులు చాలా మందికి ఈ గ్రీకు అభినయాల గురించి....... "

"నాటకాలు అనాలి నేస్తం!"

"ఆఁ గ్రీకు నాటకాలు.ఇవాళ మేం ఓ నాటకం వెయ్యబోతున్నాం మీరుకూడా మా నాటకాన్ని చూడాలని మా కోరిక."

"సంతోషం, మిత్రులకి నాపట్ల ఉన్న ఆదరానికి చాలా సంతోషం."

అశ్వఘోషుడు వారితోపాటు బయల్దేరాడు. నాట్యశాలలో అతనికి వేదికకి దగ్గరగా ఆసనం ఇచ్చారు. గ్రీకు విషాదాంత నాటకాన్ని ప్రాకృతభాషలో అభినయించారు. గొప్ప కుటుంబాలకి చెందిన గ్రీకు యువతీ యువకులు నాటకంలోని పాత్రధారులుగా అభినయం చేశారు. నటీనటులందరి వేషధారణా గ్రీకు దేశస్థులవేష ధారణలాగే ఉంది. విభిన్న దృశ్యాలకి సంబంధించిన బొమ్మల తెరలూ గ్రీకు పద్ధతినే చేశారు. అశ్వఘోషునికి పరిచితురాలు ప్రభ నాటకంలో నాయికగా చేసింది. ఆమె నటనాకౌశలాన్ని చూసి అతడు ముగ్ధుడయ్యాడు. నాటకం మధ్యలో యోగ్యమనిపించిన సమయంలో అశ్వఘోషుణ్ని ఇదివరకటి నుంచి ఎరిగిన గ్రీకు యువకుడు "ఊర్వశీ వియోగాన్ని" ఆలాపించమని కోరాడు. అశ్వఘోషుడు ఏ రకమైన బెరుకూ లేకుండా వీణ తీసుకుని రంగస్థలం మీదకి వెళ్ళాడు. తన గానంతో తాను విలపించడమే కాక సభలోని శ్రోతలందరినీ ఆ దుఃఖంలో ముంచెత్తాడు. ఆ సమయంలో అతని దృష్టి ఓ సారి ప్రభ మీద పడింది. ఆమె కళ్లూ వ్యాకులంతో నిండిపోయి ఉన్నాయి.

నాటకం పూర్తైనాక నటీనటులందరికీ నేపథ్యంలో కవిని పరిచయం చేశారు.

"సాకేతంలో ఉంటూ కూడా నేనీ అద్భుతమైన నాటక కళ గురించి ఏమీ తెలిసికోకుండా ఉండిపోయాను. నాకు తెలీని ప్రభతోకూడిన ప్రపంచాన్ని నాకు చూపించినందుకు మిత్రులందరికీ నా కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను" అన్నాడు అశ్వఘోషుడు.

"ప్రభలో కూడిన ప్రపంచం" అన్నప్పుడు కొంత మంది యువతులు ప్రభ వేపు చూసి చిరునవ్వులు చిందించారు.

"నాకో కొత్త ఊహ తోచింది. మీరు గ్రీకు నాటకాన్ని ఎలా అయితే ప్రాకృతంలోకి భాషాంతరీకరించి ప్రదర్శించారో అలాగ్గానే అదే పద్ధతిలో మా దేశపు కథల్ని తీసుకుని కొన్ని మంచి నాటకాల్ని తయారుచెయ్యగలం అని నాకు అనిపిస్తోంది" అన్నాడు అశ్వఘోషుడు.

"మీరు తలుచుకుంటే గ్రీకు మూల నాటకాలకన్నా మంచి నాటకాన్ని తయారు చెయ్యగలరు. మాకు పూర్తిగా నమ్మకం ఉంది కవీ!"

"మరీ అంతలా అనకు నేస్తం! గ్రీకు నాటకకర్తలకి నేను శిష్యుణ్ణి మాత్రమే కాగలుగుతాను! ఊర్వశీ వియోగాన్ని నాటకంగా రాస్తే ఎలా ఉంటుంది?"

"ఆ నాటకాన్ని ప్రదర్శించడానికి మేం సిద్ధమే. అయితే మాతోపాటు మీరు పురూరవుడిగా నటించాలి."

"నాకు అభ్యంతరం లేదు. కొంత అభ్యాసం చేస్తే నేనా పాత్రని పాడు చెయ్యకుండా నటించగలనని అనుకుంటాను."

"మేం దానికొ్కవల్సిన బొమ్మల తెరలు తయారు చేయిస్తాం."

"ఆ తెరలమీద పురూరవుడి దేశపు దృశ్యాల్ని చిత్రించాలి. నేనూ బొమ్మలు కాస్త గియ్యగలను. వీలైతే నేనూ కాస్త సాయం చేస్తాను."

"మీరు ఎలా చెపితే అలా దృశ్యాల్ని చిత్రిస్తే బాగుంటుంది. పాత్రల వేష ధారణ గురించి కూడా మీరే సలహాలు యివ్వాలి. మరి పాత్రలో?"

"పాత్రలా? ఇప్పుడే అన్నీ నిర్ణయం చేసుకోలేం. అయితే పాత్రలు మాత్రం తక్కువ సంఖ్యలోనే ఉండాలి."

"ఎన్ని ఉండాలి?"

"పదహారు ఇరవైమంది వరకూ అయితే తేలిగ్గా ప్రదర్శించవచ్చు."

"అయితే పదహారు పాత్రల వరకూ పెట్టడానికి ప్రయత్నిస్తాను."

"పురూరవుడిగా మీరు వెయ్యాలి. ఊర్వశిగా మన ప్రభ ఎలా ఉంటుంది? మీరివాళ ఆవిడ నటనని చూశారు కదా!"

"నటన గురించి పెద్దగా తెలీని నా కళ్ళకి ఆవిడ నటనలో ఏ దోషమూ కన్పించలేదు."

"అయితే ప్రభ ఊర్వశిగా వెయ్యాల్సిందే. మా నాటకసమాజంలో ఎవరికి ఏ పని అప్పచెపితే ఆ పని చెయ్యవలసిందే. కాదండానికి వీలులేదు."

ప్రభ కాస్త సంకోచిస్తూ చూసింది. కాని సమాజంలోని ఆ పెద్దతను "ఏం ప్రభా?" అని అడిగేసరికి "సరే" అని ఒప్పుకుంది.

## 4

ప్రముఖుడైన గ్రీకు యువకుడు బుద్ధ ప్రియుడితో కలిసి అశ్వఘోషుడు కొన్ని గ్రీకు నాటకాలని, ప్రాకృతంలో అనువదించిన వాటిని చదివాడు. వాటి రంగస్థల వివరణలూ సూచనల గురించీ అతనితో చర్చించాడు. నాటకంలోని బొమ్మల తెరలకి యవన కళ (గ్రీకుకళ)ని గుర్తుతెచ్చే విధంగా యవనిక అని పేరు పెట్టాడు. సంస్కృతమూ, ప్రాకృతమూ రెండు భాగాలూ వాడీ, గద్యం, పద్యం రెండింటినీ ఉపయోగించే నాటకాన్ని రాశాడు. ఆ కాలంనాటి ప్రాకృతం సంస్కృతానికి బాగా దగ్గరగా ఉండేది. అంచేత పెద్దకుటుంబాల్లోని వాళ్ళు ఆ భాషని తేలిగ్గానే అర్థం చేసుకునేవారు. ఈ ఊర్వశీ వియోగమే మొదటి భారతీయ నాటకం. అశ్వఘోషుడే మొదటి భారతీయ నాటకకర్త. ఇది అతని మొదటి ప్రయత్నం అయినప్పటికీ అతడు తర్వాత రాసిన రాష్ట్రిపాల్, సారిపుత్ర మొదలైన నాటకాల కన్నా ఇది ఏం తీసిపోదు.

రంగస్థలం నిర్మించటంలోనూ, నాటకాన్ని అభ్యాసం చెయ్యడంలోనూ యువ కవి పూర్తిగా మునిగిపోయి భోజనం నిద్రా కూడా మర్చిపోయాడు. తన జీవితంలో అందమైన క్షణాలు ఇవే అని అతనికి అనిపించింది. రోజూ గంటల తరబడి ప్రభా అతడూ కలసి నాటకానికి కావల్సినవి సిద్ధపరచడంలో గడిపారు. ఈత పోటీల నాడు వాళ్ళ మనస్సుల్లో నాటుకున్న ప్రేమబీజం ఇప్పుడు మొలకెత్తసాగింది. గ్రీకు యువతీ యువకులు అశ్వఘోషుణ్ని తమ ఆత్మీయుడిగా తలచేవారు. అంచేత అతనికి సాయం చెయ్యడం తమ అదృష్టంగా భావించేవారు. ఓ రోజు కొన్ని క్షణాలు కుంచెతో రంగులు వేశాక అశ్వఘోషుడు నాట్యశాల బైట ఉన్న చిన్నతోటలో ఓ ఆసనం మీద కూచున్నాడు. ఆ సమయానికి ప్రభ కూడా అక్కడికి వచ్చింది.

"కవీ! ఊర్వశీ వియోగాన్ని రచించేటప్పుడు మీరు దేన్ని దృష్టిలో పెట్టుకున్నారు?" అని తన సహజమైన తియ్యటి గొంతుతో అడిగింది.

"ఊర్వశీ పురూరవుల కథని."

"కథ నేనూ ఎరుగుదును. ఊర్వశిని మీరు అప్సరా అని ఒక్కసారి కాదు పదే పదే సంబోధించారు!"

"ఊర్వశి అప్సరే మరి!"

"పురూరవుణ్ని ఊర్వశీ వియోగంలో నదులూ, సరోవరాలూ, అడవులూ, కొండలూ వెతుకుతున్నట్టు దుఃఖపడుతున్నట్టూ చిత్రించారు."

"ఆ పరిస్థితిలో పురూరవుడు అలా చెయ్యడం సహజమే!"

"ఊర్వశీ వియోగాన్ని ఆలపించిన గాయకుడు లతాగృహంలో ఎడతెరపి లేకుండా కారేకన్నీళ్ళని తన వీణకి మళ్లే తన పాటకి తోడుగా చేసుకున్నాడు."

"గాయకుడూ, నటుడూ తన్మయత్వం చెందాలి ప్రభా!"

"ఉహూ! మీరు నాదగ్గర స్పష్టంగా విషయాన్ని చెప్పటంలేదు."

"నువ్వు అంటున్నదేమిటి?"

"మీరు కథల్లోని ఊర్వశీ వియోగాన్ని ఆలాపించలేదని నేనంటున్నాను."

"మరి?"

"మీ ఊర్వశి- మీ ఉరమందు నివాసం ఏర్పరుచుకున్న (హృదయంలో నివాసం ఏర్పరచుకున్న) ఆవిడ! ఆవిడ అప్సరా - అప అంటే సరయూనదీ జలాలు సరా అంటే ఈదేది!"

"ఉహూ! తర్వాత"

"ఈ ఊర్వశిని పురూరవుడు ఏ హిమాలయం లాంటి పర్వతాల్నీ, అడవుల్నీ నదుల్నీ సరోవరాల్నీ లతల మధ్యా తిరిగి వెతకలేదు-సాకేతంలోని సరయూ నదినీ, పుష్పోద్యానాలలోని సరోవరాన్నీ, లతాగృహాల్నీ క్రీడాస్థలాన్ని వెతుకుతూ తిరుగుతున్నాడు."

"ఊం. ఇంకా?"

"అతని కన్నీళ్ళు ఆ పాతకథలోని పురూరవుడి వియోగ దుఃఖానికి ద్రవించినవి ఏంకావు. తన గుండెలోని ఆవేదనని చల్లార్చుకోడానికి కార్చినవి!"

"ఇంక నేను చెప్పనా ప్రభా?"

"చెప్పండి. ఇంతవరకూ నేనే ఎక్కువగా మాట్లాడేను."

"ఆవేళ లతాగృహం నుంచి బైటికి వచ్చి నీ అందమైన నీలం కళ్ళు ఎర్రబడ్డమూ, ఎక్కువగా ఉబ్బి ఉండడమూ చూశాను."

"మీరు మీ పాటతో నన్ను ఏడిపించారు."

"నువ్వే నీ వియోగంతో ఆ పాటని నాకు ఇచ్చావు."

"కాని మీ పాటలోని ఊర్వశి రాతి గుండెది. కవీ! ఆవిణ్ణి అలాగ్గానే చిత్రించారు."

"అంతవరకూ నిజం."

"అవును మరి, నేను నిరాశతో నిండిపోయి ఉన్నాను. కలతచెంది ఉన్నాను."

"ఏం, ఎందుకనీ?"

"నాకా మెరుపులా మెరిసిన ప్రభని చూసే అదృష్టం లేదనుకున్నాను. ఆవిడ నన్నెప్పుడో మరిచిపోయి ఉంటుందని అనుకున్నాను."

"మీరంత అల్పులా కవీ!"

"ఆత్మ విశ్వాసం లేనప్పుడు మనిషి తనని తాను అల్పుడిగా కాక మరింకెలా అనుకోగలడు?"

"మీరు సాకేతంలోనే కాదు, ఈ విశాల ప్రపంచంలో పేరు పొందిన కవి. సాకేతంలోని ఈతపోటీలో గెలిచిన యువకులు. సాకేతంలో ప్రతి పౌరుని నోటా మీ విద్యా పాండిత్యాల గురించిన మెప్పే వినపడుతోంది. ఇంక స్త్రీల దృష్టితో చూస్తే, సాకేతంలోని అందమైన ఆడవాళ్ళంతా మిమ్మల్ని తమవాణ్ణిగా చేసుకోవాలని అనుకుంటున్నారు."

"అయితే ఏం లాభం? నాకు నా ఊర్వశే సర్వస్వం. రెండువారాలు ఆవిణ్ణి నేను చూడలేదు.-నాకు బతుకు వ్యర్థం అనిపించింది. నిజం చెప్తున్నాను ప్రభా! ఎప్పుడూ నా మనస్సింతగా దుర్బలం కాలేదు. ఇంకో వారంగాని నేను నిన్ను చూడకుండా ఉండి ఉన్నట్లయితే ఏమైపోయి ఉండేవాణ్ణో!"

"కవీ! మీరింత స్వార్థంతో ఆలోచించకండి. మీరు ఈ దేశపు అమరగాయకులు. ఈ దేశం మీమీద ఇంకా ఎన్నెన్నో ఆశలు పెట్టుకుని ఉంది. మీ ఊర్వశీ వియోగం నాటకానికి ఎంత ప్రశస్తి కలిగిందో తెలుసా?"

"ఊహూఁ నాకు తెలీదు."

"గత వారం మా చుట్టం ఓ గ్రీకు వ్యాపారి భరుకచ్ఛం (భడౌంచ్) నుంచి ఇక్కడికి వచ్చారు. భరుకచ్ఛంలో గ్రీకు పౌరులు ఎక్కువ సంఖ్యలో ఉన్నారు. మన సాకేతంలోని గ్రీకులం హిందూ దేశస్థులమై పోయాం. కాని భరుకచ్ఛంలో వాళ్ళు తమ భాషని మర్చిపోలేదు. గ్రీసు నుంచి వ్యాపారస్థులూ, విద్వాంసులూ భరుకచ్ఛానికి వస్తూ ఉంటారు. మా చుట్టం గ్రీకు సాహిత్యంలో పెద్దపండితుడు. ఆయన మీ నాటకాన్ని గ్రీకు నాటకకర్తల్లో గొప్పవాళ్ళైన ఎంపీదోకల్ యురీపిడ్‌ల నాటకాలతో పోల్చారు. ఆయన దాన్ని రాయించుకుని తనతోపాటు తీసుకువెళ్ళారు. ఈజిప్టు రాజు తురమాయ (తాలిమీ) గొప్ప నాట్యకళాప్రియుడు. మీ నాటకాన్ని గ్రీకు భాషలోకి తర్జుమా చేసి ఆ రాజు దగ్గరకి పంపుతామని ఆయన అన్నారు. భరుకచ్ఛాన్నుంచి ఈజిప్టుకి ఓడలు నిత్యం అలా వస్తూపోతూ ఉంటాయి. ఆయన మాటలు వింటున్నప్పుడు నా గుండె గర్వంతో నిండిపోయింది."

"నీ గర్వమే నా సర్వస్వం ప్రభా!"

"కవీ! మీకు మీ విలువ తెలీదు."

"నా విలువకి గీటురాయివి నువ్వే! ప్రభా! ఇప్పుడు నాకు తెల్సు."

"ఊహూఁ. మీరలా అనుకోకూడదు. ప్రభ ప్రేమికుడు అశ్వఘోషుణ్ణీ ఈ యుగానికంతటికీ మహాకవి అయిన అశ్వఘోషుణ్ణీ వేరువేరుగా చేసి మీరు చూడాలి. ప్రభ ప్రేమికుడు అశ్వఘోషుణ్ణి మీ ఇష్టం ఎలా అయినా చేసుకోండి, ఏమన్నా అనండి. కాని మహాకవి అశ్వఘోషుణ్ణి ప్రేమికుడు అశ్వఘోషుడికి పైవాడనీ, ప్రపంచం యావత్తుకీ చెందినవాడనీ, తెలుసుకోండి."

"నువ్వు ఎలా చెపితే అలా అనుకుంటాను."

"నాకు ఇంత అదృష్టంపడుతుందని నేనెప్పుడూ అనుకోలేదు."

"ఏమీ?"

"మీరు నన్ను ఏనాడో మర్చిపోయి ఉండి ఉంటారని అనుకున్నా."

"నువ్వంత సామాన్యురాలివి కావే!"

"మీ ముందర సామాన్యురాలినే. ఇప్పుడూ సామాన్యురాలినే!"

"నీ నుంచి నాకు కవిత్వం అనే కొత్తవరం దొరికింది. నే నిప్పుడు నా కవితల్లో కొత్తస్ఫూర్తినీ, కొత్త ప్రేరణని పొందుతున్నాను. నీ ప్రేరణవల్లే ఊర్వశీ వియోగం గీతం వెలువడింది. ఈ నాటకానికి నువ్వే కారణం. నాటకాన్ని దేశంలో అందరిదిగా చేస్తున్నాను. కాని నేను నిన్ను మరిచిపోగలనని ఎలా అనుకున్నావు?"

"ఏ రకంగా చూసినా మీకు తగినదానిగా నాకు నేను అనిపించలేదు. ఒక దాని తర్వాత ఒకటి మీ గుణాలు ఒక్కొక్కటే నాకు పూర్తిగా తెలుస్తూ ఉంటే ఇంకా నీళ్ళుకారిపోయి నిరాశపడిపోయాను. సాకేతంలో ఒకరిని మించిన అందకత్తెలు మరొకరు— అంత మందీ మీ పేరు వింటే చాలు వెర్రెత్తిపోవడం చూశాను. దాంతో ఇంకా కుంగిపోయాను. ఆశన్నది లేకుండా పోయింది. అదీకాక మీరు ఉన్నత వంశపు బ్రాహ్మలని కూడా విన్నాను. బ్రాహ్మల తర్వాత అగ్రస్థానంలో ఉన్నా గ్రీకు క్షత్రియుడి కుమార్తె నైనప్పటికి ఉన్నత వంశపు బ్రాహ్మలు పెళ్ళి కూతురి తల్లిదండ్రులవి ఏడుతరాల వరకూ పుట్టు పూర్వోత్తరాలు తెలుసుకోందే పెళ్ళిచెయ్యరు. అలాంటప్పుడు నా ప్రేమని ఎలా స్వీకరిస్తారు?"

"ఈ అశ్వఘోషుడి వల్ల నీ మనస్సుకింత బాధ కలిగిందని నాకు ఎంతో విచారంగా ఉంది ప్రభా!"

"అయితే మీరు ప్రభా...." అంటూ ఆవిడ మాట మధ్యలో ఆగిపోయింది.

నీళ్ళునిండిన ఆమె కళ్ళని ముద్దాడి అశ్వఘోషుడు ఆమెని కౌగలించుకున్నాడు. "ప్రభా! అశ్వఘోషుడు ఎప్పటికీ నీవాడు. కాలం కూడా నీ నుంచి వేరు చెయ్యలేదు" అన్నాడు అశ్వఘోషుడు. ప్రభ కళ్ళంట జలజల కన్నీరు ఒలుకుతూ ఉంటే అశ్వఘోషుడు ఆమెని కౌగలించుకుని కన్నీటిని తుడుస్తున్నాడు.

ఎన్నోసార్లు ఊర్వశీ వియోగం నాటకం ఎంతో బాగా ప్రదర్శించారు. సాకేతంలోని గౌరవనీయులైన పౌరులంతమందీ నాటకాన్ని చూశారు. నాట్యకళ ఇంత పరిపూర్ణమైనదనీ, ఇంత గొప్ప కళ అనీ వాళ్ళు ఎప్పుడూ అనుకోలేదు. నాటకాంతంలో చివరిసారి తెర పడబోయే ముందు అశ్వఘోషుడు ఎన్నోసార్లు తాను గ్రీకు రంగస్థలం నుంచి అంతా స్వీకరించానని ప్రకటించాడు. అయితే అతని నాటకాలు ఈ నేల నుండి పుట్టినవే కాబట్టి ఏ విదేశీ ప్రభావమూ ఏ రకమైనదీ మచ్చుకైనా ఎక్కడా కనిపించేది కాదు.

అశ్వఘోషుడు సంస్కృతంలోనూ, ప్రాకృతంలోనూ రాసిన గీతాలు,

కావ్యాలూ సాకేతం, కోసల ప్రాంతాల హద్దులు దాటి పై ప్రాంతాల్లోకి వెళ్ళినట్టు గానే అతడు రాసిన నాటకాలు అంతకన్నా ఎక్కువ దూరపు ప్రాంతాలకి వెళ్ళాయి. గ్రీకుల జనాభా ఎక్కువగా ఉన్న ప్రాంతాలూ, వాళ్ళ నాట్యశాలలున్న ప్రాంతాలు ఉజ్జయిని, దశపుర– సుప్పారకం, భరుకచ్ఛం, శాకలా (స్యాల్‌కోట), తక్షశిల, పాటలీపుత్రం లాంటి మహానగరాలకి చాలా తొందరగా చేరాయి. వాళ్ళ రంగస్థలాల మీద ప్రదర్శించబడ్డాయి. వ్యాపారస్థులకీ, ధనిక సామంతులకీ అందరికీ ఆ నాటకాలు అత్యంత ప్రీతిపాత్రమయ్యాయి.

# 5

అశ్వఘోషుడు రంగస్థలం మీద నటిస్తున్నాడనీ, అతనికీ గ్రీకుకన్యకీ మధ్య ప్రేమ కలాపం జరుగుతోందనీ అతని తల్లిదండ్రుల చెవినీ పడ్డాది. ఇది విని అతని తండ్రి విశేషించి కలతచెందాడు. ఆయన తన భార్య సువర్ణాక్షిని కొడుక్కి బోధపర్చమని మొదట చెప్పాడు. మన బ్రాహ్మణకులంలో ఇలాంటి సంబంధం అధర్మమని తల్లి అంటే బ్రాహ్మల వేదశాస్త్రాల్లో తనకి అపార జ్ఞానం ఉండడం నుంచి అశ్వఘోషుడు ప్రాచీన ఋషులు ఆచరించిన విధానాలని లెక్కలేనన్ని తార్కాణాలుగా తల్లికి చెప్పాడు. (వీటిలో కొన్నిటిని అతడు తర్వాత వజ్రచ్ఛేదిలో సంకలనం పరిచాడు. ఈ రోజుకీ వజ్రచ్ఛేదికోపనిషత్తు పేరుతో అది చిన్నసైజు ఉపనిషత్తుల్లో కనపడుతుంది).

"అదంతా నిజమే కాని అబ్బాయీ! నేటి బ్రాహ్మలు ఆ పాతకాలపు ఆచరణ విధానాలని స్వీకరించరు." అన్నది తల్లి.

"అలా అయితే బ్రాహ్మలకోసం నేనోకొత్త సదాచారాన్ని ప్రవేశపెడ్తాను" అన్నాడు అశ్వఘోషుడు.

తల్లికి అశ్వఘోషుడి తర్కాలు విని సంతుష్టి కలగలేదు. అయితే ప్రభసి విడిచి నేను బతకలేనని అశ్వఘోషుడు చెప్పగానే ఆవిడ కొడుకు పక్షం అయిపో యింది.

"అబ్బాయీ! నువ్వే నా సర్వస్వానివీనూ" అన్నాది ఆవిడ.

ఓ రోజు ప్రభని అశ్వఘోషుడు తన తల్లి దగ్గరికి పంపించాడు. రూపం, దానికి తగ్గట్టూ గుణం, మంచి స్వభావం ఉన్న ప్రభని చూసి ఆవిడ ఆశీర్వదించింది. కాని తండ్రి మాత్రం దీనిని అంగీకరించలేకపోయాడు. ఆయన ఓ రోజున అశ్వఘోషుడికి సూటిగా చెప్పాడు:

"బాబూ! మనది శ్రోత్రియ బ్రాహ్మణకులం గొప్పకులం. శ్రోత్రియ బ్రాహ్మణ కుటుంబాల్లోని కన్యలనే ఎన్నోతరాల నుండి మన ఇంటికి తెచ్చుకుంటున్నాం. ఇప్పుడు నువ్వు ఈ సంబంధాన్ని ఒప్పుకున్నావంటే మనమూ, మన తర్వాత

రాబోయేతరం- శాశ్వతంగా జాతి భ్రష్టులం అవుతాం. మన గౌరవప్రతిష్ఠలు మంట కలుస్తాయి."

ప్రభని వదులుకోవడం అన్నది అశ్వఘోషుడు ఊహించుకోనైనా ఊహించు కోలేడు!

అశ్వఘోషుడి తండ్రి ప్రభ తల్లిదండ్రులకి నచ్చచెప్పాడు. అయితే వాళ్ళు తమ అశక్తతని తెలియచేశారు. ఆఖరికి అతడు ప్రభ దగ్గరకే వెళ్ళేడు. తన తల పాగాని ఆమె ఎదురుగా పెట్టాడు. అశ్వఘోషునితో మీరన్నమాట మాట్లాడతానని మాత్రం ప్రభ ఆయనతో చెప్పింది.

# 6

ప్రభా అశ్వఘోషులు ఒకరినొకరు ఎప్పుడూ వదలని మిత్రులుగా సంచరిస్తు న్నారు. అది సరయూతీరం కానీ, పుష్పోద్యానం అవనీ, తీర్థం అవనీ, నాట్యశాలో మరో స్థలమో కానీ ఒకరుగాని వెళ్ళారో రెండోవారు అక్కడికి వెళ్ళడం ఖాయం. ప్రభ సూర్యప్రభలాగ అశ్వఘోషుడి హృదయ కమలాన్ని వికసింపచేసేది. పాలలా తెల్లటి వెన్నెలకాంతిలో ఇద్దరూ సరయూ నదీ సైకతాల మీదకి తరచు వెళ్ళేవారు. కేవలం ప్రణయ కలాపాలతోనే తమ సమయాన్ని గడిపేవారు కాదు. జీవితం గురించిన ఎన్నో గంభీరమైన విషయాలు వాళ్ళు చర్చించేవారు. ఓ రోజు వెన్నెట్లో సరయూనది నల్లటి జలధారకి దగ్గరగా తెల్లటి ఇసుకమీద కూచుని అశ్వఘోషుడు తన మనస్సులో చక్కటి ప్రభా రూపాన్ని చిత్రించుకుంటున్నాడు.

"ప్రభా! నువ్వే నా కవిత్వానివి! నీ ప్రేరణవల్లే నేను ఊర్వశీ వియోగాన్ని రాశాను. నీ సౌందర్యం నాకు ప్రేరణనిచ్చి ఇంకెన్ని అందమైన కావ్యాలని రాయి స్తుందో! కవిత్వం అంతరంలోని అభివ్యక్తి బైట ఉండదూ - బాహ్యంలోని అభివ్యక్తే కవిత్వం లోపల ఉంటుందీ అన్న సత్యాన్ని నువ్వే నాకు బోధపర్చేవు! ప్రేయసీ!" అశ్వఘోషుడి నోట హఠాత్తుగా ఈ మాటలు వెలువడ్డాయి.

అశ్వఘోషుడి మాటలు వింటూ చల్లని ఇసుకమీద ప్రభ పడుకొని ఉంది. ఆవిడ పొడుగాటి స్వచ్ఛమైన కురులు ఇసుకలో పొర్లాడ్డం చూసి అశ్వఘోషుడు ఆమె తలని తన ఒడిలోకి తీసుకున్నాడు. కళ్ళు పైకెత్తి అశ్వఘోషుడి ముఖాన్ని ప్రభ చూస్తోంది.

"నేను నువ్వు చెప్పే ప్రతీ విషయాన్నీ ఒప్పుకోడానికి సిద్ధం గా ఉన్నాను. మూర్తివంతమూ స్థూలం అయిన సౌందర్యం నుంచి ప్రేరణ పొందకుండా కావ్యానికి పరిపూర్ణత్వం సిద్ధించదు. నిజం. నేనూ నిన్ను కావ్యాత్మకంగా చిత్రిస్తున్నాను. అది మూగచిత్రణం మాత్రమే - కవిత్వం చెప్పటం నాకు రాదు. ఆ కళ నేన్నీకు చెప్పాను కాదా! నువ్వు నీలో ఉన్న ఇద్దరు అశ్వఘోషుల్ని విడివిడిగా చూడాలని!

అందులో ఈ యుగానికి మహాకవీ, శాశ్వతంగా నిలిచే అశ్వఘోషుడి గురించిన భావమే ప్రధానమైనది అవాలి. ఎందుకంటావా? ఆ అశ్వఘోషుడు ఏ వ్యక్తికో చెందిన వాడు కాదు. ప్రపంచానికే గొప్పనిధి. మొన్న మనం చూడ్డానికి వెళ్ళేమే-ఆ కాల్కారామం భిక్షువు చెప్పింది జ్ఞాపకం ఉందా? ఆ భిక్షువు గొప్ప విద్వాంసుడు." అశ్వఘోషుడి మాటకి సమాధానంగా ప్రభ అన్నాది.

"అతడెంతో గొప్ప మేధావిలా కనబడుతున్నాడు."

"అవును. ఎన్నో దేశాలు తిరిగాడు కూడా. ఈజిప్టులో అలసంద (సికందరియా, అలగ్జాండ్రియా) పట్నంలో పుట్టాడు."

"అలా అని నేనూ విన్నాను. కాని నాకోటి అర్థంకాకుండా ఉంది. గ్రీకులంత మందీ బౌద్ధమతాన్ని ఎందుకు స్వీకరిస్తున్నారో?"

"అది వాళ్ళ ప్రవృత్తికీ, స్వతంత్రభావాలకి అనుగుణంగా కనపడుతోంది. అదీ కారణం."

"కాని బౌద్ధులు అందర్నీ సన్యాసులుగా, తపసులుగా భిక్షువులుగా చెయ్యాలని చూస్తారు."

"బౌద్ధుల్లో భిక్షువులకన్నా గృహస్థులే ఎక్కువ. బౌద్ధులు సంసార సుఖాల్ని అనుభవించడంలో ఎవరికీ తీసిపోరు."

"ఈ దేశంలో ఇంకా ఎన్నో మతాలున్నాయి. అలాంటప్పుడు గ్రీకులు బౌద్ధ మతమంటేనే అంతగా ఇష్టపడుతున్నారెందుకో నాకు అర్థంకాదు."

"ఇక్కడున్న మతాల్లో బౌద్ధమే అన్నిటికన్నా ఉదారమైన మతం. మా పూర్వీకులు భారతదేశం వచ్చినప్పుడు అంతమందీ మమ్మల్ని మ్లేచ్ఛులు అని అసహ్యించుకునేవారు. దండెత్తివచ్చిన గ్రీకుల గురించి కాదు నేను చెప్తున్నాది. ఇక్కడ స్థిరపడ్డ గ్రీకులపట్ల, వ్యాపారం చెయ్యడానికి వచ్చిన గ్రీకులపట్లా కూడా అలాగే వ్యవహరించేవారు. కాని బౌద్ధులు వాళ్ళంటే ఏం అసహ్యించుకునేవారు కాదు. నిజానికి గ్రీకులు తమ దేశంలోనూ బౌద్ధమతం గురించి వినీ తెలుసుకుని ఉన్నారు."

"తమ దేశంలో కూడానా?"

"ఆహాఁ మౌర్య చంద్రగుప్తుడి మనవడు అశోకుడు పరిపాలించిన రోజుల్లో ఎంతోమంది బౌద్ధభిక్షువులు గ్రీసు దేశానికి వచ్చారు. మా ధర్మ రక్షితులు ఈ దేశం వచ్చి ఇక్కడ భిక్షువు కాలేదు. ఆయన ఈజిప్టులో అలెగ్జాండ్రియా బౌద్ధ విహారంలో భిక్షువయ్యారు."

"ప్రభా! నేనతణ్ణి మళ్ళీ కలుసుకోవాలనుకుంటున్నాను."

"తప్పకుండా కలుసుకో. ఆయన నీకు ఇంకా లోతైన సంగతులు చెప్తారు. బౌద్ధమతం గురించేకాదు. గ్రీకు వేదాంతం గురించి కూడా చెప్తారు."

"గ్రీకుల్లోనూ వేదాంతులున్నారా?"

"ఎంత మందో గొప్ప వేదాంతులు ఉన్నారు. వాళ్ళ గురించి భదంత ధర్మ రక్షితులు నీకు చెప్తారు. కాని ఆ బౌద్ధమతం గురించి విని ప్రభ పట్ల వైరాగ్యం తెచ్చు కోలేం!" అంటూ ఎవరో అశ్వఘోషుణ్ణి తన నుంచి వేరు చేసి లాక్కుపోతున్నారా అన్నట్టుగా ప్రభ అశ్వఘోషుణ్ణి తన రెండు చేతులతో గట్టిగా కౌగిలించుకుంది.

"కాల్కారామం సంగతులు కొన్ని నాక్కూడా ఎంతో ఆకర్షణీయంగా అని పించాయి. మన దేశం యావత్తూ కాల్కారామంలా అయితే అన్న భావం కలిగింది."

"ఉహూ! నన్ను వదిలేసి కొంపదీసి నువ్వు కాల్కారామం వెళ్ళిపోవద్దు." ప్రభ కూర్చుని అన్నది.

"ఈ బొందిలో ప్రాణం ఉండగా నిన్ను విడిచివెళ్ళడం అన్నది అసంభవం ప్రేయసీ! అక్కడ ఏ తేడాలులేని భావం ఉన్నది. దాని గురించి నేను చెప్తూ ఉంట! చూసావు కదా! అక్కడ గ్రీకుభిక్షువు, ధర్మరక్షితులు, పర్షియన్ సుమన్‌లాంటి దేశ దేశాంతరాల నుంచి వచ్చిన భిక్షువులు ఉంటున్నారు. వాళ్ళు విద్వాంసులు. వాళ్ళతో పాటు మన దేశంలోని భిక్షువులు-బ్రాహ్మల దగ్గర్నుంచి చండాలుల వరకూ అన్ని కులాలకి చెందిన భిక్షువులూ కలిసి ఉంటున్నారు. కలిసి భోజనం చేస్తున్నారు. కలిసి జ్ఞానాన్ని సంపాదిస్తున్నారు. కాల్కారామంలో ఆ నల్లగా ఉన్న ముసిలి భిక్షువు పేరేమిటి?"

"మహాస్థవిర ధర్మసేనులు. ఆయన సాకేతంలో ఉన్న బౌద్ధ విహారాలన్ని టిలో ఉండే భిక్షువులందరికీ పెద్ద."

"ఆయన పుట్టుకచేత చండాలుడని విన్నాను. ఆయన ఎదురుగా మా పిన తండ్రి శుభగుప్తభిక్షువు గొంతుకిల్లా కూర్చుని ప్రణామం చేస్తారు. ఆలోచించి చూడు-ఎక్కడ గొప్ప శ్రోత్రియ బ్రాహ్మణకులానికి చెందిన పండితపుత్రుడు శుభగుప్తుడు-ఎక్కడ చండాలకులంలో పుట్టిన ధర్మసేనులు!"

"మహాస్థవిర ధర్మసేనులూ గొప్ప పండితులే''

"నేను బ్రాహ్మల మతదృష్టితో మాట్లాడుతున్నాను ప్రభా! వాళ్ళ చేతిలోగాని ఉన్నట్లయితే ధర్మసేనుడికి దైవసమానుడై పూజనీయుడవడం మాట దేవుడెరుగు మనిషిగా గుర్తింపు దొరికేదా?''

"బుద్ధుడు తన భిక్షుసంఘాన్ని సముద్రం అన్నాడు. ఆ సంఘంలోకి ఎవరు వెళ్ళినా నదుల్లాగ తమ నామరూపాలు కోల్పోయి సముద్రంగా మారిపోతారు."

"బౌద్ధ గృహస్థులు కూడా అలా ఎందుకు చెయ్యరుమరీ!"

"బౌద్ధ గృహస్థులు దేశంలోని ఇతర గృహస్థులతో వేరైపోయి జీవించలేరు. వాళ్ళమీద కుటుంబభారం ఉంటుంది కదామరి!''

"కాల్కారామంలోని భిక్షువుల్లాగ అన్ని నగరాల్లోనూ పల్లెల్లోనూ ఏ తేడాలు లేకుండా ప్రజలు ఉంటే జాతిభేదం వర్ణభేదం ఏదీ లేకుండా ఉంటే ఎంతో మంచిదని నాకు అనిపిస్తోంది.''

"నేన్నికో సంగతి చెప్పలేదు. ఓ రోజు మీ తండ్రి నా దగ్గరికి వచ్చి తన తలపాగా తీసి నా ముందు పెట్టారు. 'అశ్వఘోషుణి విడిచిపెట్టు ప్రభా' అన్నారు."

"నువ్వు విడిచిపెట్టేస్తే ఆయనకి తన కొడుకు దొరికిపోయినట్టు!! నువ్వేం చెప్పావు ప్రభా?"

"మీరు చెప్పింది అశ్వఘోషుడికి చెప్తానని అన్నాను."

"మంచిదే. నాతో చెప్పేశావు!! నాకు బ్రాహ్మల్లో ఉండే బూటకం అంటే వచ్చేటంత అసహ్యం! ఒళ్ళుమండుతుంది. ఓపక్క తాము తమ వేదశాస్త్రాలని నమ్ముతున్నాం అంటారు. నేనెంతో కష్టపడి శ్రద్ధగా వాళ్ళ శాస్త్రాలన్నీ చదివాను. కాని వాళ్ళు దేన్ని నమ్ముతున్నారో నాకింత పిసరైనా అర్థంకాదు. బహుశా వాళ్ళు తమ స్వార్థాన్ని నమ్ముతున్నారనుకుంటాను. ప్రాచీన ఋషుల ఉవాచలని ఎత్తి చూపెడితే ఏమంటారో తెల్సా? ఇప్పుడా ఆచారాలు లేవు అంటారు. ఆచారాలనన్నా నమ్మి లేదూ ఋషుల ఉవాచలన్నా నమ్మి! ప్రాచీన వైదికనియమాన్ని ఎవరో భంగం చేస్తేనే కదా కొత్త ఆచారం అన్నది పుట్టి? పిరికివాళ్ళూ, భయస్థులూ, స్వార్థపరులూ అని వీళ్ళనే చెప్పాలి. వీళ్ళకి కావల్సిందల్లా బలిసినదూడల మాంసమూ తమకి మస్తుగా దొరికే దక్షిణాను! వీళ్ళు తాము ఆశ్రయించుకుని ఉన్న రాజుల్నీ ధనిక సామంతుల్నీ ప్రసన్నం చేసుకోడానికి ఎలాంటిపని చెయ్యడానికైనా వెనుకాడరు."

"బీదవాళ్ళకి, వీళ్ళమతంలో తావులేదు. బీదవాళ్ళని వీళ్ళు తక్కువజాతి వాళ్ళని అంటారు. ఆ తక్కువజాతి వాళ్ళు అంతమందీ పాపం బీదవాళ్ళే."

"గ్రీకుల్నీ, శాక్యుల్నీ, ఆభీరుల్నీ - పై దేశాలనుంచి వచ్చిన జాతుల వాళ్ళని వీళ్ళు క్షత్రియులుగానూ రాజపుత్రులుగానూ గుర్తిస్తారు. మరి వాళ్ళ దగ్గర అధికారమూ ఉంది. ధనసంపత్తి ఉంది. వీళ్ళకి వాళ్ళదగ్గర బాగా దక్షిణలు దొరుకుతాయి. కాని మనదేశంలోని శూద్రుల్నీ, చండాలుల్నీ, దాసుల్నీ ఎప్పుడూ ఒకేలాగే తక్కువచేసి చూస్తున్నారు. మనిషి మనస్సుకి ఔన్నత్యం కలిగించని మతమూ, మనిషి స్థానాన్ని గుర్తించటానికి డబ్బునీ అధికారాన్నీ గీటురాళ్ళుగా చేసుకునే మతమూ మనిషిజాతికే పెద్ద కళంకం అని నేను అంటాను. ప్రపంచం మారుతుంది. బ్రాహ్మలని ప్రాచీన గ్రంథాలనుంచి నేటివరకూ ఉన్న వాటిలో చెప్పిన ఆచారవ్యవహారాలని, పద్ధతులని చదివి చూశాను. వాటిలో ఖచ్చితంగా ఎంతో మార్పువచ్చినట్టు కనబడుతోంది. కాని ఇప్పుడు వీళ్ళకి ఆ మాట చెప్పిచూడు. వీళ్ళేమంటారో తెల్సా — ఆ విషయాలన్నీ సనాతనమైనవనీ, స్థిరమైనవనీ మనల్ని ఒప్పించాలని చూస్తారు. ఇది కేవలం మూర్ఖత్వం. జడత్వం ప్రేయసీ!"

"ఈ నీ భావాలకి నేనుగాని కారణం కాదు కదా! అశ్వఘోష్!"

"ప్రభా! కారణం అవడం అన్నది మెచ్చుకోవలసిన సంగతే! నువ్వు నాకపి

త్వానికి కొత్త ఊపిరిని కొత్త ప్రేరణని ఇచ్చావు. నా జ్ఞానచక్షువులకి కొత్తజీవాన్ని కొత్త ప్రేరణనీ కలిగించి నాకెంతో మేలు చేస్తున్నావు. సర్వజ్ఞానాన్ని సంపాదించేశానని ఒకప్పుడు అనుకునేవాణ్ణి. బ్రాహ్మలకి ఇలాంటి మిథ్యాగర్వం, దురభిమానం తేలిగ్గా వచ్చేస్తాయి. జ్ఞానం కేవలం బ్రాహ్మల వేదాల్లోనూ, వాళ్ళ తాటాకు గ్రంథాల్లోనూ, భూర్జపత్ర గ్రంథాల్లోనూ లేదు. వాటన్నిటికన్నా ఎంతో విస్తృతంగా జ్ఞానం ఉంటుందని ఇప్పుడు తెలుసుకున్నాను."

"నేనో స్త్రీని మాత్రమే."

"స్త్రీ అవడం నుంచి ఎవరైనా స్త్రీని తక్కువగా చూసారంటే వాళ్ళని నేను అసహ్యించుకుంటాను."

"గ్రీకుల్లో స్త్రీలంటే గౌరవభావం తతిమ్మావాళ్ళలో కన్నా ఎక్కువగా కనబడుతుంది. సంతానం కలగకుండా చనిపోయినాసరే వాళ్ళకది అంగీకారమే కాని ఓ భార్య ఉండగా పిల్లలకోసమైనా రెండో స్త్రీని పెళ్ళిచేసుకోరు."

"ఇక్కడ ఈ బ్రాహ్మలు ఒకసారికాదు వందలసార్లు పెళ్ళిళ్ళు చేయిస్తారు. దక్షిణ సంపాదించటంకోసం. ఛీ ఛీ! గ్రీకులెవరూ బ్రాహ్మణమతాన్ని స్వీకరించనందుకు నాకు సంతోషంగా ఉంది."

"బౌద్ధులమే అయినా మా ఇంటికి పూజాపునస్కారాలు చేయించటానికి బ్రాహ్మలు వస్తారు."

"తమ స్వార్థం కోసం గ్రీకుల్ని క్షత్రియులుగా వాళ్ళు అంగీకరించారు. అలాంటప్పుడు ఆ మాత్రం మీ ఇంటికిరారూ? దక్షిణ దొరుకుతుందిగా!"

"నేన్ని బ్రాహ్మణ అహంకారాన్ని పోగొట్టడానికి కారణం కాలేదుకదా?"

"చెడు ఏం జరుగలేదు. బ్రాహ్మణ అహంకారం నీకూ నాకూ తేడాలని కలిగించేదైతే అది నాకు అత్యంత హేయమైనదీ తుచ్ఛమైనదీ అవుతుంది."

"నువ్వు నన్నింతగా ప్రేమిస్తున్నావని తెలిసి నాకెంతో సంతోషంగా ఉంది."

"గుండె లోతుల్లోంచి ప్రేయసీ! నీ ప్రేమ గాని నాకు లేకుండాపోతే ఈ అశ్వఘోషుడు ప్రాణం లేని జడం అయిపోతాడు."

"అయితే నా ప్రేమకి బహుమానం వరం కూడా ఇద్దామనుకుంటున్నావా?"

"ఆ ఒక్క ప్రేమ తప్పించి మిగతా అంతా ఇస్తా."

" నా ప్రేమ శాశ్వతంగా ఎప్పటికీ నిలిచే నా యుగకవి అశ్వఘోషుడికి అణుమాత్రమైనా హాని కలగచేసేటట్లయితే ఆ ప్రేమకి ఓ దణ్ణం."

"స్పష్టంగా చెప్పు ప్రేయసీ!"

"ప్రేమకి ఆటంకం కలిగించాలని నేను అనుకోవటం లేదు. కాని ఆ ప్రేమ శాశ్వతంగా ఎప్పటికీ నిలిచి ఉండే నీ సృజనాత్మకతకి దోహదం చెయ్యాలని అనుకుంటున్నాను. ఒకవేళ నేను లేకుండా పోతే........"

అశ్వఘోషుడు పిచ్చెత్తినవాడిలా లేచి నిల్చుని ప్రభని ఎత్తుకుని తన గుండెకి

గాఢంగా హత్తుకుని కౌగలించుకున్నాడు. అతని బుగ్గలు తడిసిపోయి ఉండడాన్ని ప్రభ చూసింది. ఆమె అశ్వఘోషుణ్ని మళ్ళీ మళ్ళీ ముద్దుపెట్టుకుంటూ పదే పదే బుజ్జగిస్తూ, "అశ్వఘోష్! నా ఘోష్!" అని అన్నాది. అతడు కాస్త కుదుటబడ్డ తర్వాత "వింటున్నావా? అశ్వఘోష్! నా ప్రేమ నీ దగ్గర ఓ గొప్ప బహుమానం పుచ్చుకోవాలని అనుకుంటోంది. నువ్వు ఇవ్వాలి."

"నీకు ఇవ్వలేనిదేదీ లేదు ప్రేయసీ!"

"నువ్వు నన్ను పూర్తిగా చెప్పనియ్యవేం?"

"కాని నువ్వేదో కఠోరమైనది చెప్పేటట్టు ఉన్నావు."

"ఆ కఠోరమైనదాన్ని శాశ్వతకీర్తిని పొందే అశ్వఘోషుడి మేలు కోసం చెప్పక తప్పదు. మహాకవి అశ్వఘోషుడు శాశ్వతమైన కవిగా తనను చూసుకునే విధంగానే ప్రభ ప్రేమని కూడా శాశ్వతమైన ప్రేమగాచూడాలి. తన ఎదురుగా క్షణాచున్న ప్రభ శరీరాన్ని ఆ ప్రేమకి కొలబద్దగా చెయ్యకూడదు. శాశ్వతంగా నిలిచి ఉండే అశ్వఘోషుడి ప్రభ కూడా ఎప్పటికీ యువతిగా సౌందర్యవతిగా నిలిచి ఉంటుంది. ఇదే నేన్నిన్ను అడిగేదీ-దీనికి అంగీకారం తెలియచెయ్యమనే చెప్పేది. నిన్ను ఒప్పించాలని అనుకునేదీనూ."

"ఐతే నిజంప్రభని కాకుండా నువ్వు ఊహాప్రభని నాముందు ఉంచాలని అనుకుంటున్నావా?"

"నేనా ఇద్దరినీ నిజమనే అనుకుంటున్నాను. ఘోష్! తేడా అల్లా అందులో ఓ ప్రభ కేవలం ఓ యాభై ఏళ్ళో నూరేళ్ళో బతికేది ఐతే రెండో ప్రభ శాశ్వతంగా వుండేది. నీ ప్రభ నీ ఊర్వశీ వియోగంలో చిరస్థాయిగా ఉంటుంది. నా ప్రేమకి అమరత్వాన్ని యివ్వడానికి నువ్వు శాశ్వతంగా చిరస్థాయిగా నిలిచే అశ్వఘోషుడి వేపే నీ దృష్టి వుండాలి. రాత్రి ఎంతో పొద్దుపోయింది. సరయూ నదీతీరం కూడా నిద్రపోతున్నట్టుగా వుంది. మనం ఇంటికి వెళ్ళాలి ఇంక."

"నేను చిరస్థాయిగా నిలిచే ప్రభని నా మనస్సులో ప్రతిష్ఠించుకున్నాను."

"అశ్వఘోష్! అదే నాక్కావాలి." అని అశ్వఘోషుడి బుగ్గలమీద తన పట్టు లాంటి జుట్టుని పెట్టి ప్రభ మూగగా నిల్చుండిపోయింది.

# 7

అదో పెద్ద వాకిలి. దాని చుట్టూ వరండాలు, వెనగ్గా మూడంతస్థుల మేడ గదులూ వున్నాయి. వరండాల్లో దండేలమీద పచ్చరంగు బట్టలు ఆరవేసివున్నాయి. వాకిలికి ఓ మూల ఓ నుయ్యీ దానికి దగ్గరగా ఓ స్నానాల గదీ ఉన్నాయి. తక్కిన వాకిట్లో ఎన్నో చెట్లు వున్నాయి. వాటిలో ఓ రావిచెట్టు కూడా వుంది. రావి

చెట్టు దగ్గర ఓ అరుగూ, కాస్త యెదంగా రాతితో కట్టిన కటకటాలూ, వాటిమీద వేలకొద్దీ దీపాల ప్రమిదలు పెట్టడానికి వీలుగా కట్టి ఉన్నాయి. ప్రభ మోకాళ్ళమీద వంగి ఆ అందమైన వృక్షానికి ప్రణామం చేసింది.

"ఈ జాతి చెట్టుకిందనే కూచుని గౌతమ సిద్ధార్థుడు తన ఆత్మచింతనద్వారా, సాధన ద్వారా మనసులో కలిగే భ్రమలన్నిటినీ పోగొట్టుకుని జ్ఞానాన్ని పొందాడు. అప్పటినుంచీ బుద్ధుడన్న పేరుతో ప్రసిద్ధికెక్కాడు. ఆ మధురస్మృతికే మేం ఆ జాతి చెట్లకి ప్రణామం చేస్తాం" అన్నది ప్రభ.

"తన సాధన తన ఆత్మచింతన ద్వారా మనస్సులోని భ్రమలను పోగొట్టుకుని జ్ఞానాన్ని సంపాదించినదానికిది గుర్తు! అలాంటి గుర్తుని, చిహ్నాన్ని పూజించవలసిందే. అలాంటి చిహ్నాన్ని పూజించడమంటే మన సాధనని మన ఆత్మని జయించటాన్ని పూజించడమన్న మాట."

వాళ్ళిద్దరూ బౌద్ధభిక్షువు ధర్మరక్షితుల దగ్గరికి వెళ్ళారు. వాళ్ళు వెళ్ళిన వేళకి ఆయన వాకిట్లో ఉన్న ఓ పొగడ చెట్టుకింద కూచుని ఉన్నారు. అక్కడ తోటలో పూసిన పువ్వుల కమ్మని పరిమళం అవరించి ఉన్నాది. బౌద్ధ ఉపాసకురాలిలాగ ప్రభ ఆయనకి మోకరిల్లి (పాదాల్ని మోకాళ్ళని, రెండు అరచేతుల్ని నుదుటిని నేలకి తాకించి పంచప్రతిష్ఠితంగా) ప్రణామం చేసింది. అశ్వఘోషుడు నిలబడే గౌరవాన్ని ప్రదర్శించాడు. ఇద్దరూ అక్కడే వున్న చర్మంతో చేసిన ఆసనాల్ని తీసుకుని కూర్చున్నారు. బౌద్ధభిక్షువు శిష్యులు అశ్వఘోషుడు ఆయనతో చర్చించ డానికి వచ్చాడని తెలుసుకొని అక్కణ్ణించి వెళ్ళిపోయారు. మామూలు కుశల ప్రశ్నల తర్వాత అశ్వఘోషుడు వేదాంత చర్చ మొదలుపెట్టాడు.

"బ్రాహ్మణ కుమారా! బౌద్ధులూ - జ్ఞానులూ తమ మతంలో వేదాంతాన్ని కూడా ఓ బంధనంగా చెపుతారు. గట్టి బంధనంగా—దృష్టిని కట్టిపడేసే దానిగా చెప్తారు" అన్నారు ధర్మరక్షితులు.

"భదంతా! బుద్ధుడిమతంలో వేదాంతానికి స్థానంలేదా?"

"స్థానం లేకపోవడమేం, బౌద్ధమతం వేదాంతమయమే. ఐతే బుద్ధుడు దాన్ని తెప్పలాగ అవతల ఒడ్డుకి చేర్చేదని చెప్తాడు. అది నెత్తికి భారం కాకూడదంటాడు."

"ఏమిటీ, తెప్పలాగానా?"

"ఆఁ. పడవలు లేని చోట జనం తెప్పమీద నదినిదాటి అవతలిఒడ్డుకి వెళ్తారు. అయితే అవతలి ఒడ్డుకెళ్ళాక తెప్పగా కట్టిన కర్రల్ని ఉపయోగపడ్డాయి కదా అని నెత్తిమీద పెట్టుకుని మోసుకు తిరగరు."

"తన మతం గురించి కూడా ఇల్లాగా చెప్పడానికి ధైర్యం ఉన్న వ్యక్తి తప్ప కుండా సత్యాన్నీ ఆ సత్యానికున్న శక్తినీ దర్శించే ఉంటాడు. భదంతా! బౌద్ధదర్శ నంలోని ముఖ్యమైన దేదైనా చెప్పండి. దానివల్ల మాకూ మా ఆత్మని శోధించుకో డానికి వీలుకలుగుతుంది."

"ఇది అనాత్మవాదం బ్రాహ్మణ కుమారా! బ్రాహ్మలు ఆత్మని నిత్యమనీ, స్థిర మనీ, శాశ్వతమనీ నమ్ముతారు. బుద్ధుడు జగత్తులో - బాహ్యజగత్తు గానీ, అంతర్ జగత్తుగానీ, దేనినీ నిత్యమైనదని, స్థిరమైనదనీ శాశ్వతమైనదనీ, అంగీకరించడు. అందుకే ఆయన చెప్పిన దర్శనాన్ని అనాత్మవాదం అనీ – అనిత్యమైన దర్శనం అనీ క్షణక్షణమూ ఉద్భవించి నశించే దాని దర్శనం అనీ చెపుతారు."

"మీరుచెప్పిన ఈ ఒక్క మాట నాకు చాలు భదంతా! మతం తెప్పలాంటిదని, అనాత్మవాదాన్ని ప్రకటించిన బుద్ధుడికి ఆఅశ్వఘోషుడు శతకోటి వందనాలు అర్పించు కుంటున్నాడు. అశ్వఘోషుడు అన్వేషిస్తున్నదేదో అది అతనికి ఇక్కడ దొరికింది. నేనూ నా లోపల సరిగ్గా ఇలాంటి భావాల ఆలోచననే అనుభవంలోకి తెచ్చుకుంటు న్నాను. అయితే దానిని నేను నిర్వచించి, ఇది సుమా అని చెప్పలేకపోతున్నాను. బుద్ధుడి బోధనలని లోకం సరిగ్గా అవగాహన చేసుకుని వున్నట్లయితే ఈ ప్రపంచం ఈ సరికి ఇంకోలా ఉండి వుండేది.

"సరిగ్గా చెప్పారు! మా గ్రీసుదేశంలోనూ గొప్ప దార్శనికులు జన్మించారు. పైథాగరసూ, హెరాక్లితూ బుద్ధుడికి సమకాలికులు. సోక్రటీసు, డెమ్యూక్రితూ, ప్లేటో, అరిస్టోటిలూకి వాళ్ళ తర్వాత జన్మించినవాళ్ళు. ఈ గ్రీకు వేదాంతులూ యెంతో బోధించారు. అయితే ఒక్క హెరాక్లితుని వదిలేస్తే మిగిలినవాళ్ళు అంతమందీ 'శాశ్వతవాదం-నిత్యవాదం' పరిధికి మించి మీదకి వెళ్ళలేకపోయారు. వర్తమానాన్ని వాళ్ళు కావల్సినదానికన్నా ఎక్కువగా తలచారు. మోహపడ్డారు.అందుకే దానితోపాటు భవిష్యత్కాలాన్ని ముడివేసి ఉంచాలని అనుకున్నారు. హెరాక్లిత్తు బుద్ధుడిలాగానే జగత్తులో ఏ రెండు క్షణాల్ని ఒక్కలాంటివని ఒప్పుకునేవాడు కాదు. నిజమే. కాని అందులో అతనిదో వ్యక్తిగతమైన స్వార్థం ఉన్నాది."

"వేదాంతచర్చలోనూ వ్యక్తిగతమైన స్వార్థమా?"

"అందరికీ స్వార్థం ఉంటుంది నాయనా! ఆ కాలంలో మా ఏథెన్సు నగరంలో గణరాజ్యం - రాజులేని ప్రజాస్వామ్యం ఉండేది. మొదట్లో హెరాక్లిత్తు కుటుంబం లాంటి పెద్ద పెద్ద ధనిక సామంతుల కుటుంబాలవారు గణ పరిపాలన చేసేవారు. ఆ తర్వాత వాళ్ళని తొలగించి వ్యాపారస్తులూ, సేఠ్‌సాహుకార్లు పరిపాలనని తమ చేతిలోకి తీసుకున్నారు. ఈ స్థితి హెరాక్లిత్తుకి అసంతుష్టి కలిగించింది. మార్పు రావాలని అనుకున్నాడు. అయితే ముందుకు వెళ్ళడానికి కాదు, వెనక్కి మళ్ళ డానికి!"

"భదంత్! మనకీ మార్పుకావాలి. అయితే అభ్యుదయానికి-ముందుకు వెళ్ళ డానికి, వెనక్కి మళ్ళడానికి కాదు. గడిచినకాలం నిర్జీవం అని నేను అనుకుంటాను."

"నువ్వు చెప్పింది అక్షరాలా నిజం నాయినా! బుద్ధుడూ మార్పు కావాలను కున్నాడు. ఇంతకన్నా మంచిలోకం కోసం! భిక్షుసంఘాన్ని భవిష్యత్తులోని మంచి లోకానికి నమూనాగా ఆయన తయారుచేశాడు."

"ఆ లోకంలో పెద్దా చిన్నా తేడాలుండవు. జాతిభేదాలు, వర్ణభేదాలూ ఉండవు."

"అక్కడ అందరికీ ఒకేలాంటి భోగభాగ్యాలుంటాయి. అందరూ ఒక్కలాగే సేవాధర్మాన్ని పాటిస్తారు. మా మహాస్థవిరులు ధర్మసేనులు బైట చీపురు పెట్టి తుడవడాన్ని చూసే ఉంటావు?"

"నల్లగా ఉంటారే, ఆయనేనా?"

"అవును. ఆయన మా అందరికన్నా గొప్పవాడు. మేమంతా రోజూ మోకరిల్లి (పంచ ప్రతిష్ఠితంగా) ఆయనకి ప్రణామం చేస్తాం. కోసల దేశంలోని బౌద్ధారామా లన్నిటికీ ఆయనే పెద్ద."

"ఆయన చండాల కులానికి చెందినవాడని విన్నాను."

"సంఘారామంలో కులాన్ని చూడరు నాయినా! గుణాన్ని చూస్తారు. ఆయన తన జ్ఞానంచేతా తన గుణాలచేతా మా అందరికీ పెద్ద అయ్యాడు. మా తండ్రి అయ్యాడు. తన భిక్షాపాత్రలో దులుపుకు తినేంత తక్కువగా భిక్షదొరికినా ఆయన తన తోటివాళ్ళకి పెట్టకుండా తినడు. ఇదే బుద్ధుడు బోధించినది. కట్టుకోడానికి మూడు వస్త్రాలు, మట్టి భిక్షాపాత్ర, సూది, నీళ్ళుతాగే చెంబూ, మంగలికత్తి, నడుంకి కట్టుకొనే పటకా వదిలేస్తే మిగిలిన వస్తువులన్నీ సంఘారామానివే! ఈ ఇల్లు, తోట, ఆసనాలు అన్నీ సంఘానివే. మా సంఘారామాల్లో కొన్నిటికి పొలాలు కూడా ఉన్నాయి. అవీ సంఘానివే. ఓ వ్యక్తిని పరీక్షించి సంఘం భిక్షువుగా చేర్చుకొంటుంది. ఓసారి సంఘంలో ప్రవేశం పొంది భిక్షువు అయ్యాక- ఆ వ్యక్తి అందరితో సమానమైనవాడే అవుతాడు."

"ఇలాంటి సంఘం యావత్తు దేశానికీ ఏర్పడితే?"

"అదెలా కుదురుతుంది అబ్బాయీ? రాజులూ, ధనికులూ ఎప్పుడైనా మిగతా వాళ్ళతో సమానులం అని అంటారా? భిక్షువులు ఓ దాసుడ్ని (బానిస) సంఘంలో చేర్చుకున్నారు. సంఘంలో ప్రవేశం దొరకగానే ఆ దాసుడు ఇహ దాసుడు కాడు. అందరిలాంటివాడు అయిపోయాడు. అయితే ఎవరి దగ్గర వాడు దాసత్వం చేశాడో, ఆ యజమాని గోల పెట్టాడు. దాసదాసీలున్న యజమానులు మిగతా వాళ్ళంతా అతనికి తోడయ్యారు. రాజులు చూడబోతే వాళ్ళే వేలకొద్దీ దాసదాసీ జనాలున్న యజమానులాయె! వాళ్ళు తమ ఆస్తిని ఇలా కొల్లగొడితే ఎలా సహించగలరు? బుద్ధుడు ఏం చెయ్యగలడు? ఇకముందు సంఘారామాల్లో దాసులకి ప్రవేశం ఇవ్వరు అని బుద్ధుడు మాటఇచ్చాడు. విభేదాలు తేడాలూఉన్న సముద్ర మధ్యానఉన్న చిన్న ద్వీపం మా సంఘం. అందుకే ప్రపంచంలో ఇలాంటి బీచరికం, ఇలాంటి దాసత్వం ఉన్నంతవరకూ దానికి భద్రత లేదు."

# 8

ఆ వేళ శరత్పూర్ణిమ. సాయంత్రమే చంద్రుడు తూర్పు క్షితిజంమీదికి పొడుచుకు వచ్చాడు. సూర్యుడి ఎర్రెర్రని ఆఖరి కిరణాలు, క్షితిజమంతా ఇప్పటి వరకు పరుచుకొని ఉన్నవి, ఆకాశాన్ని వదిలేసి వెళ్ళిపోతున్నాయి. ఇటు చంద్రుడి చల్లటి తెల్లటి కిరణాలు పరుచుకుంటున్నాయి. అశ్వఘోషుడు ఈ మధ్య ప్రభ ఇంట్లోనే ఎక్కువకాలం ఉంటున్నాడు. ఇద్దరూ డాబా మీద కూచున్నారు.

"అశ్వఘోష్! సరయూనది కెరటాలు నన్ను పిలుస్తున్నాయి. నిన్నూ నన్నూ ప్రేమపాశంతో బంధించిన కెరటాలు! మొదటిసారిగా నాకు నిన్ను చూపించిన కెరటాలు! అప్పుడే రెండేళ్ళు గడిచిపోయాయి. అయినా ఆ రోజు ఇంకా నిన్నా మొన్నాలాగే అనిపిస్తున్నది. మనిద్దరం ఎన్ని వెన్నెలరాత్రులు సరయూనది సైకతాల మీద గడిపాం! ఎంత మధురమైన క్షణాలు! ఇవాళా వెన్నెల మధురంగా ఉంది. పద, సరయూతీరానికి వెళ్దాం."

ఇద్దరూ బయల్దేరారు. నది నగరానికి కాస్తదూరంగా ఉంది. వెన్నెట్లో తెల్లగా మెరుస్తున్న ఇసుకమీద వాళ్ళు చాలా దూరం నడిచారు. ప్రభ తన కాలి జోళ్ళని చేత్తోపట్టుకుంది. పాదాలకింద కూరుకుపోతున్న ఇసుక తగులుతూ వుంటే ఆవిడకి ఎంతో ఆనందంగా ఉంది. అశ్వఘోషుడి నడుంని తన రెంచు చేతుల్తో చుట్ట బెట్టి పట్టుకొని "ఈ సరయూనది ఇసుక పాదాలకి తగులుతూ ఉంటే ఎంత బాగుంది!" అన్నాది.

"పాదాలకి చక్కిలిగింత పెట్టినట్టున్నాది."

"దాంతో హర్షాతిరేకం వల్ల వళ్ళంతా గగుర్పొడుస్తోంది. నాకు సరయూ నదంటే ఎంత ఇష్టమో!"

"మనిద్దరం కలిసి పారిపోతే అని నాకు ఒక్కొక్కసారిఅనిపిస్తూ ఉంటుంది. మన ప్రేమని చూసి అసూయపడేవాళ్ళు ఎవరూలేని దేశానికి పారిపోవాలనిపిస్తుంది. అక్కడ నువ్వు నాకు ఉత్తేజాన్ని కలిగిస్తూ ఉంటావు. నేను గీతాలు రచిస్తూ ఉంటాను. ఇద్దరం కలిసి వీణమీద పాడుతూ ఉంటాం. ఇక్కడ ఈ ఇసుక తిన్నెల మీదకి ఈ రాత్రిపూట నేను నా వీణని తీసుకురాలేను. తెస్తే జనం వచ్చి గుమిగూడి పోతారు! వాళ్ళలో ఎంతమందో మనల్ని అసూయతో, ఏడ్పుతో చూస్తారు."

"ఏమీ అనుకోకు! ఘోష్! ఒక్కొక్కసారి నేను లేకుండా పోతే - అని నాకు అనిపిస్తూ ఉంటుంది."

అశ్వఘోషుడు ప్రభని తన గుండెకి హత్తుకుని రెండు చేతుల్తో కౌగిలించుకున్నాడు.

"అవదు - ఎప్పటికీ అలా అవదు. మనం ఇలాగే ఉంటాం," అన్నాడు.

"నేనంటున్నది అదికాదు ఘోష్! నువ్వు ఉండవు, నేనొక్కత్తినీ అయి

పోతాను. ఓసారి ఊహించిచూడు. లోకంలో అలా జరుగుతుందా లేదా?"

"జరుగుతుంది."

"నీ గురించి అంటే నువ్వేం కంగారుపడలేదు. నువ్వు లేకుండా పోతే దుఃఖల అనుభవించేది నేను కదా! అవునా ఘోష్?"

"ఎంత కఠినమైన మాటలంటున్నావ్ ప్రభా!"

ప్రభ అతని పెదవులని ముద్దాడి అశ్వఘోషుడికి సంతోషాన్ని కలగచేసింది.

"జీవితం ఎన్నో దిశలుగా మారుతూ ఉంటుంది. ఎప్పుడూ పున్నమి ఉండదు. అమావాస్య కూడా వస్తుంది. ఒకరు లేకుండా ఇంకొకరు ఉండాల్సి వచ్చినప్పుడు ఏం చెయ్యాలి అన్నదే నేను చెప్తూంట! నిన్ను కోల్పోయి నేను ఒంటరిదాన్నై ఉండాల్సివస్తే నేనేం చేస్తానో తెల్సా?"

"ఏం చేస్తావో చెప్పు." గట్టిగా నిట్టూర్చి తలవాల్చి అశ్వఘోషుడు అన్నాడు.

"నీతోపాటు నేనూ చచ్చిపోవాలని నేననుకోను. బుద్ధభగవానుడు ఆత్మహత్య మూర్ఖమైనదనీ, నిందించవల్సిన పని అనీ చెప్పాడు. ఈ మధ్య వీణవాయించటంలో నేను ప్రావీణ్యం సంపాదించాను. నీకు తెల్సుకదా!"

"బాగా ప్రావీణ్యం సంపాదించావు. నీ చేతికి వీణిచ్చేసి ఎన్నిసార్లో నువ్వు వాయిస్తూ ఉంటే నేను దానితో గొంతుకలిపి హాయిగా పాడాను."

"ఊఁ. మర్త్యుడైన నా అశ్వఘోషుడు నాకు లేకుండా పోయిన రోజున నేను అమరుడైన అశ్వఘోషుణ్ణి- యుగయుగాలు జీవించే కవి అశ్వఘోషుణ్ణి ఆరాధిస్తాను. నీ వీణమీద నీ పాటలని పాడతాను. యావత్తు జంబూద్వీపంలోనే కాక పై దేశాల్లో కూడా నీ పాటలని పాడతాను. జీవితాంతం వరకూ అలా గానం చేస్తూనే ఉంటాను. మన జీవనవాహినులు తిరిగి మరో దేశకాలాల్లో కలుసుకునేవరకూ పాడుతూనే ఉంటాను. మరి నేనుగాని లేకుండాపోయి నువ్వే ఉండాల్సివస్తే నువ్వేం చేస్తావ్ ఘోష్!"

ఈ మాటలు వినగానే అశ్వఘోషుడి హృదయాంతరాళ్లోనే కాదు, అతని యావత్తు శరీరం వణికిపోయింది. ప్రభ కది తెలిసింది. అశ్వఘోషుడు మాట్లాడ్డానికి ప్రయత్నిస్తున్నాడు. కాని అతని గొంతు ఎండిపోయింది. కళ్ళంట నీళ్ళు నిండుకొచ్చాయి. కొన్ని క్షణాలపాటు అతి ప్రయత్నం చెయ్యగా క్షీణ కంఠంతో ఇలా అనగలిగాడు:

"ఆ క్షణం చాలా భయంకరమైనదవుతుంది! కాని ప్రభా! నేనూ ఆత్మహత్య చేసుకోను. నీ ప్రేమ నన్ను ఉత్తేజపరుస్తూ నా గుండెని పలికిస్తూ ఉంటే నేను గానం చేస్తూ ఉంటాను. జీవితాంతంవరకూ! నేను నీ అమర అశ్వఘోషుణ్ణి!" అశ్వఘోషుడి కంఠం పట్టేసింది.

"సరయూ ప్రవాహమూ నిద్రపోతోంది. పద మనం పోదాం యిహ."

# 9

గ్రీష్మకాలం. అశ్వఘోషుడి తల్లి సువర్ణాక్షి జబ్బుపడ్డాది. పగలూ రాత్రీ అన్ని సమయాల్లోనూ అశ్వఘోషుడు తల్లి దగ్గరే ఉంటున్నాడు. ప్రభకూడా పగలంతా అక్కడే ఉంటోంది. వైద్యం ఏం పని చెయ్యలేదు. రోజురోజుకీ సువర్ణాక్షి స్థితి ఇంకా ఇంకా దిగజారిపోతోంది. పున్నమి వచ్చింది. వెన్నెల పిండారబోసినట్టుంది సువర్ణాక్షి వెన్నెట్లోకి డాబామీదకి తనని తీసుకువెళ్ళమంది. డాబామీదకి ఆవిడ మంచాన్ని తీసుకువెళ్ళారు. అస్తిచర్మం ఏకమై ఆవిడ ఒంటి మీద ఎముకలే కన బడుతున్నాయి. అశ్వఘోషుడు కుమిలిపోతున్నాడు.

"అబ్బాయీ! ఈ వెన్నెల ఎంతబాగుంది!" నెమ్మదిగా సువర్ణాక్షి అనడం అయితే అంది కాని ఆవిడ చాలా స్పష్టంగానే ఆ మాటలు అనగలిగింది.

"సరయూనది కెరటాలు నన్ను పిలుస్తున్నాయి" అని ప్రభ అన్న మాటలు ఆ క్షణంలో అశ్వఘోషుడి చెవుల్లో రింగెత్తాయి. అతని గుండె గుభేల్మంది.

"ప్రభ ఏది బాబూ?" అని తల్లి అడిగింది.

"వాళ్ళ తండ్రి ఇంటికి వెళ్ళింది. సాయంత్రం వరకూ ఇక్కడే ఉంది."

"ప్రభ! నా బంగారుతల్లి! బాబూ, దాన్నెప్పుడూ మర్చిపోకు."

ఆవిడ మాటలు పూర్తన్నా అవలేదు. ఓ దగ్గుతెర వచ్చింది. రెండు వెక్కిళ్ళు వచ్చాయి— ఆ తర్వాత ఆవిడ ఒళ్ళు చల్లబడిపోయింది.

సువర్ణాక్షి పోయింది. సువర్ణాక్షి పుత్రుడి గుండె బద్దలయింది. రాత్రంతా అతడు విలపిస్తూనే ఉన్నాడు.

మర్నాడు మధ్యాహ్నం వరకూ తల్లి దహన క్రియలలోనే ఉన్నాడు. ఆ పనులయ్యాక అతనికి ప్రభ జ్ఞాపకం వచ్చింది. అతడు దత్తమిత్రుడి ఇంటికి వెళ్ళాడు. ప్రభ తల్లిదండ్రులు ఆమె అశ్వఘోషుడి దగ్గరే ఉందనుకున్నారు. క్రితం రాత్రి తగిలిన దెబ్బకే అతడు చితికి ఉన్నాడు. ఇప్పుడు ఇది విని మరింత కుంగి పోయాడు. ప్రభ పడగ్గదిలోకి వెళ్ళాడు. అక్కడ అన్ని వస్తువులూ పొందిగ్గా అమర్చి ఉన్నాయి. పక్కమీద పరిచి ఉన్న తెల్లటి దుప్పటిని తొలగించి చూశాడు. తన చిత్రం అక్కడ ఉంది. ప్రభ ఆ చిత్రాన్ని ఓ గ్రీకు చిత్రకారుడి చేత వేయిం చింది. ఆ చిత్రకారుడు ఈ దేశం తిరగడానికి వచ్చాడు. ఇష్టంలేకపోయినా అశ్వ ఘోషుడికి ఆ చిత్రకారుడి ముందు గంటలకొద్దీ కూచోవలసివచ్చేది. ఆ చిత్రానికి ఓ వాడిపోయిన జాజిపువ్వుల దండ ఉంది. చిత్రం కింద ప్రభ సీలుపడిన తాళపత్రం చుట్టపెట్టి ఉంది. అశ్వఘోషుడు దాన్ని తీశాడు. దాన్ని చుట్టపెట్టి కట్టినదానికి వేసిన సీలు నల్లమట్టి ఇంకా తడితడిగానే ఉంది. అశ్వఘోషుడు దానికోసి ప్రభ సీలుపడి ఉన్న ఆ మట్టిని అలాగే ఉంచాడు. పొడుగ్గా ఉన్న పత్రాన్ని విప్పాడు. అందమైన దస్తూరీ ప్రభదే. ఐదంటే ఐదు పంక్తులు రాసి ఉన్నాయి.

"ప్రియతమా! ప్రభ నీ దగ్గర సెలవు తీసుకుంటోంది. నన్ను సరయూనది కెరటాలు పిలిచాయి. నీ ప్రేమకి ప్రతిఫలంగా నాకో మాట ఇచ్చావు. జ్ఞాపకం ఉందా? నీకెప్పుడూ ప్రభ సౌందర్యాన్నీ యౌవనాన్నీ ఎప్పటికీ అలాగే ఉండేవాటిని ఇచ్చి వెళ్తున్నాను. ఇహ నీకు పండిన జుట్టూ, బోసినోరూ, వంగిన నడుంతో ఉన్న ప్రభ ఎప్పటికీ చూడ్డానికి లభించదు. నా ప్రేమా, చిరయౌవనమూ నీకు ఉత్తేజాన్ని యిస్తూ ఉంటాయి. నువ్వా ఉత్తేజాన్ని ఆ ప్రేరణని ఎప్పుడూ ఉపేక్షించవద్దు. ప్రియతమా! మీ కుటుంబంలో వచ్చిన కలహంనుంచి నేను ఆత్మహత్య చేసుకుంటున్నానని అనుకోకు. కేవలంనీకు కావ్యరచన చెయ్యడానికి కావల్సినఉద్దీపన ఇవ్వడానికే నేను సంపూర్ణమైన సౌందర్యాన్ని ఇస్తున్నాను. ప్రియతమా ! నీ ప్రభ ఆఖరిసారి నిన్ను తన మనస్సులో కౌగలించుకుని ముద్దు పెట్టుకుంటోంది."

ఎన్నోసార్లు కళ్ళంట కారుతున్న కన్నీళ్ళని తుడుచుకుంటూ అశ్వఘోషుడు పత్రాన్ని చదవడం పూర్తిచేశాడు. ఆ పత్రం అతని చేతినుంచి జారి కింద పడిపోయింది. అతడు మంచం మీద కూలబడిపోయాడు. అతని గుండె ఆగినట్టయింది. గుండె ఆగిపోతే బాగుణ్ణని అనుకున్నాడు. మట్టిబొమ్మలాగా చేతలుడిగి ఎక్కడో అర్థరహితంగా చూస్తున్నాడు. ఎంతసేపటికీ అతడు ఆ గదినుంచి రాకపోవడంతో ప్రభ తల్లీ తండ్రీ అక్కడికి వచ్చారు. అతణ్ణి ఈ స్థితిలో చూసేసరికి వాళ్ళకేదో అనుమానంగా తోచింది. కింద పడి ఉన్న తాళపత్రాన్ని తీసుకుని చదివారు. తల్లి గట్టిగా కేకవేసి నేలని కుప్పగా కూలిపడింది. దత్తమిత్రుడు నోట మాట రాక కన్నీళ్ళు కారుస్తూ నిల్చున్నాడు. అశ్వఘోషుడు అలాగే రెప్ప వెయ్యకుండా ఎటో చూస్తున్నాడు. ప్రభ తల్లిదండ్రులు చాలాసేపు అతణ్ణలా ఉండగా చూసి నెమ్మదిగా బైటికి వెళ్ళిపోయారు. సాయంత్రం అయింది. చీకటి పడింది. రాత్రి అయ్యింది. అయినా అశ్వఘోషుడు అలాగే అక్కడే కూచున్నాడు. అతని కన్నీళ్ళు ఇంకిపోయాయి. గుండె కరడుగట్టిపోయింది. రాత్రి చాలా పొద్దు పోయాక అతడు అక్కడే అలా కూచునే కునికిపాట్లు పడి నిద్రపోయాడు.

పొద్దున్న ప్రభ తల్లి వచ్చి చూసేసరికి అశ్వఘోషుడు మామూలయ్యాడు. కాని ఏదో ఆలోచనలో మునిగి ఉన్నాడు.

"ఎలా ఉన్నావు బాయినా?" ప్రభ తల్లి అడిగింది.

"అమ్మా ! నేనిప్పుడు బాగానే ఉన్నాను. ప్రభ నాకు అప్పగించిన పనిని నేను చేస్తాను. నేను అర్థం చేసుకోలేదు కాని ప్రభకి తెలుసు. ఆవిడ నా కర్తవ్యం ఏమిటో నాకు చెప్పి మరీ వెళ్ళిపోయింది. ప్రభ ఆత్మహత్య చేసుకోలేదు. ఆత్మదానం చేసింది. ఈ ఆత్మదానాన్ని ఆత్మహత్యగా చెయ్యడం నా చేతిలోని పని. అయితే నేనంత కృతఘ్నుణ్ణి కాలేను."

ప్రభ తల్లికి అశ్వఘోషుని భావం అర్థం అయింది. అశ్వఘోషుడు లేచి నిల్చున్నాడు.

"ఎక్కడికి బయల్దేరావు బాబూ ?" ఆవిడ అడిగింది.

"భదంత ధర్మ రక్షితుల్ని కల్సుకోవాలనుకుంటున్నాను. సరయూ నదినీ చూడాలి."

"ధర్మరక్షితులు కిందనే ఉన్నారు, సరయూనదిని చూడడానికి నేనూ నీతో పాటు వస్తాను." ఆ మాట చెప్పేటప్పుడు ఆమె గొంతునిండా దుఃఖం నిండు కొచ్చింది.

అశ్వఘోషుడు కిందకి వెళ్ళి ధర్మరక్షితులకి మోకరిల్లి (పంచ ప్రతిష్ఠితంగా) ప్రణామం చేశాడు. "మీ సంఘంలో నన్ను చేర్చుకోండి." అన్నాడు.

"అబ్బాయీ ! నీ దుఃఖం దారుణమైంది."

"దారుణమైనదే! కాని దాన్నించి నేను చేరతాననటం లేదు. ప్రభ దీనికినన్ను సంసిద్ధుణ్ని చేసింది. నేను తొందరపడి ఈ మాట అంటంలేదు."

"అయినా సరే, నువ్వు కొన్నాళ్ళు ఆగాలి. సంఘం ఇంత తొందరగా ప్రవేశం ఇవ్వదు."

"నేను ఆగుతాను. కాని బౌద్ధవిహారంలో ఉండి ఆ రోజు కోసం ఎందుకు చూస్తాను."

"ముందుకు నువ్వు మీ తండ్రి దగ్గర అనుమతి పుచ్చుకోవాలి. తల్లిదండ్రులు అనుమతి లేకుండా సంఘారామంలో ఎవరినీ భిక్షువుగా తీసుకోరు."

"అయితే నేను అనుమతి తీసుకుని వస్తాను."

అశ్వఘోషుడు బయల్దేరేడు. అశ్వఘోషుడు మాటలు కుదుటపడిన మనస్సుతో వివేకంతో మాట్లాడిన మాటల్లాగానే ఉన్నప్పటికీ ప్రభ తల్లికి మనస్సులో సందేహం తోచింది. దాంతో ఆవిడా అతని వెనకాతలే వెళ్లింది. సరయూ నదిలో నావమీద ఇద్దరూ రోజంతా దిగువ ప్రవాహాన్ని గాలించారు. ఎక్కడ ఏ జాడా కనిపించలేదు. మర్నాడు ఇంకా దిగువగా వెళ్ళారు. అయినా అక్కడ ఏ జాడా లేదు.

అశ్వఘోషుడు ఇంటికి వెళ్ళి తండ్రిని బౌద్ధభిక్షువుగా అవడానికి అనుమతి అడిగాడు. అయితే ఏకైక పుత్రుడికి అతడా అనుమతి ఎందుకు ఇస్తాడు?

"నేను అమ్మా, ప్రభా ఇద్దరూ పోయేరన్న దుఃఖంలో భిక్షువునవుదామని అనుకోటం లేదు. నా జీవితానికి, నే పెట్టుకున్న పరమావధికి ఇదేమార్గం. నా గొంతు కని బట్టీ నా ప్రవర్తనని బట్టీ నేనే మనోదౌర్బల్యానికి గురి అవలేదని మీకు తెలుస్తూనే ఉంది కదా నాన్నా! నేనింకా బతికి ఉండాలనుకుంటే నాకు అనుమతి ఇవ్వండి. ఇంతే నేను మీకు చెప్పాల్సింది!"

"సరే రేపు సాయంత్రం వరకూ నన్ను ఆలోచించుకోనియ్యి."

"నేను ఏడు రోజుల వరకూ మీ అనుమతి కోసం ఎదురుచూడగలను నాన్నా!"

మర్నాడు సాయంత్రం కళ్ళనీళ్ళు కుక్కుకుంటూ తండ్రి అశ్వఘోషుడికి భిక్షువవడానికి అనుమతి ఇచ్చాడు.

సాకేతంలోని ఆర్యసర్వాస్తి వాదం సంఘారామంలో అశ్వఘోషుడు భిక్షు వయ్యాడు. మహాస్థవిరులు ధర్మసేనులు అతనికి గురువయ్యాడు. భదంత ధర్మ రక్షితులు ఆచార్యులయ్యారు. ఆ సమయంలో ధర్మరక్షితులు నావమీద పాటలీ పుత్రం వెళ్ళబోతున్నారు. ఆయనతోపాటు అశ్వఘోషుడూ సాకేత్‌ని విడిచిపెట్టాడు.

# 10

బౌద్ధ భిక్షువు అశ్వఘోషుడు పాటలీపుత్రంలోని అశోకారామంలో ఉంటూ పదేళ్ళు అయింది. ఆయన బౌద్ధ మతంతోపాటు బౌద్ధదర్శనాన్ని, గ్రీకు దర్శనాన్ని లోతుగా అధ్యయనం చేశాడు. మగధలోని మహాసంఘంలోని పండితులందరిలోనూ అశ్వఘోషుడికి పెద్దస్థానం ఉంది. ఆ సమయంలో పడమర నుంచి శకచక్రవర్తి కనిష్కుడు తూర్పుని జయిస్తూ పాటలీపుత్రానికి వచ్చాడు. పాటలీపుత్రమూ, మగధా రెండూ ఆ రోజుల్లో బౌద్ధమతానికి ప్రముఖమైన కేంద్రాలు. కనిష్కుడికి బౌద్ధమతమంటే అపారమైన ఆశరణా శ్రద్ధా ఉన్నాయి. అతడు బౌద్ధరామం నుండి తనతోపాటు గాంధారకి తీసుకువెళ్ళడానికి యోగ్యుడైన విద్వాంసుణ్ణి ఇవ్వమని అడిగాడు. సంఘారామం అశ్వఘోషుణ్ణి అతనితోపాటు పంపింది.

కనిష్కుని రాజధాని పురుషపురానికి (పెషావరు) వెళ్ళేక అశ్వఘోషుడు ఆ స్థలం శకులు, గ్రీకులు, తురుష్కులు, పారశీకులు, భారతీయులు, వీళ్ళందరి సంస్కృతులూ కలిసిన స్థలం అని తెలుసుకున్నాడు. గ్రీకు నాట్యకళకి ఇంతకుముందే భారతీయ సాహిత్యంలో అశ్వఘోషుడు స్థానం చేకూర్చాడు. గ్రీకు వేదాంతాన్ని లోతుగా అధ్యయనం చేసి శోధించిన తర్వాత దానిలోని ఎన్నో విశిష్టవిషయాల్ని, విశ్లేషించే పద్ధతుల్ని మనకి సరిపోయే వేదాంతతత్వాలనీ భారతీయ వేదాంతాలనీ, ముఖ్యంగా బౌద్ధదర్శనాల్లోకి చేర్చి గ్రీకు వేదాంతంతో వాటిని సమృద్ధం చేసాడు. గ్రీకు దర్శనం నుండి స్వీకరించడానికి వీలైన మార్గాన్ని బౌద్ధుల అశ్వఘోషుడు చూపెట్టాడు. దాంతో మిగిలిన భారతీయ వేదాంతులకి ఆ మార్గాన్ని అనుసరించక తప్పలేదు. కణాదుడి వైశేషికమూ, గౌతముడి న్యాయదర్శనమూ ఈ మార్గాన్ని అందరికన్నా ముందు అనుసరించాయి. అవి పరమాణువాదం, సామాన్యం, ద్రవ్యం, గుణం అవయవీ మొదలైన తత్వాలని గ్రీకుదర్శనం నుంచే గ్రహించాయి.

బౌద్ధభిక్షువు అశ్వఘోషుడికి స్వార్థచింతన అన్నది లేకుండా పోయింది. దాని క్కారణం ప్రభ అతనికి విశాలహృదయాన్ని ఇచ్చింది. ప్రభ యిచ్చిన ఉత్తేజంతో అతడు ఎన్నో కావ్యాలు, నాటకాలు, కథలు రచించాడు. వాటిలో ఎన్నో దొర క్కుండా పోయాయి, గతించిపోయాయి. అయినా విధికి అతనంటే ఎంతో ఇష్టంలా

ఉంది. మధ్య ఆశియాలోని గోబీ ఎడారిలోని అనంతమైన ఇసుకథాళులు పందొమ్మిది వందల సంవత్సరాల తర్వాత అశ్వఘోషుడు రాసిన సారిపుత్ర ప్రకరణం నాటకాన్ని మనకి అందచేశాయి. ఆయన రచించిన బుద్ధచరిత్రమూ సౌందరానందం గొప్ప కావ్యాలు. ప్రభ కిచ్చిన మాటని అతడు పూర్తిగా నిలబెట్టుకున్నాడు. ప్రభ శాశ్వత సౌందర్యము ఆయన కావ్యాలని మరింత అందంగా తీర్చిదిద్దింది. తన మాతృభూమి సాకేత్‌నీ, తనతల్లి సువర్ణాక్షినీ అతడు ఎప్పుడూ మరవలేదు. తన రచనల్లో తనను ఎప్పుడూ సాకేతపురవాసి సువర్ణాక్షీ పుత్రుడు అశ్వఘోషుడిగా చెప్పుకున్నాడు.

# సుపర్ణ యౌధేయుడు

కాలం : క్రీ. శ. 420

## 1

నా నుదుటిరాత ఎలాంటిదో కాదా! ఎప్పుడూ ఒకచోట స్థిరంగా ఉండలేను. ప్రపంచంలో నాకు తగిలిన దెబ్బలు నన్ను చంచలుణ్ణి చేశాయి. ఎప్పుడూ కంగారు కంగారుగానే ఉండేటట్టు చేశాయి. జీవితంలో తియ్యటి క్షణాలూ ఉన్నాయి. అయితే చేదుఘడియలే ఎక్కువ. బతుకులో మార్పు వర్షం వెలిసిన తర్వాత ఉండే మబ్బుల్లాగ వస్తుంది. కాస్తదూరం వానచినుకులు పడుతూంటాయి. మరికొంచెం దూరానికి ఎండకాస్తూ ఉంటుంది. ఈ మార్పు అన్నది ఎందుకు జరుగుతూ ఉంటుందో తెలీదం లేదు. పశ్చిమాన్ని ఉన్న ఉత్తరాపథపు గాంధారంలో ఇప్పటికీ మధుపర్కంలో (పంచామృతం- అతిథులకిచ్చేది) దూడమాంసాన్ని ఇస్తారు. అలాంటిది మధ్యప్రదేశంలో (యుక్త ప్రాంతం—బీహారు) గోమాంసం పేరెత్తడం కూడా మహాపాపం. అక్కడి గోబ్రాహ్మణ సంరక్షణని పరమధర్మంగా చెప్తారు. ధర్మంలో ఇంతింత తేడా లెందుకో - ఓ చోట ఓ లాగా ఓచోట ఓలాగా ఎందుకున్నాయో నాకు అర్థం కాదు. ఓ దగ్గర అధర్మం, మరో దగ్గర ధర్మంగా ఎలాగ మారి అవుతూ ఉంటుందా? లేకపోతే ఒకదగ్గర మార్పు ముందర వచ్చిందా? రెండో చోట ఆ మార్పుని తర్వాత అనుసరించి అంగీకరించి ఉంటారా? ఏకకాలంలో అన్నిచోట్లా మార్పు రాకపోవడం నుంచి అలా అవుతోంది.

అవంతి (మాలవా) లోని క్షిప్రానది ఒడ్డున ఉన్న ఓ ఊళ్ళో నేను పుట్టాను. నా కులంవాళ్ళు తమనితాము యాత్రికులుగా అనుకునేవారు. వీళ్ళకి అక్కడ భూమి పుట్రా ఇల్లూ వాకిళ్ళూ ఉన్నాయి. వాటిని వాళ్ళు తమ భుజాన్నెత్తుకుని ఎక్కడికీ తీసుకువెళ్ళలేరు కదా! నా కులంవాళ్ళు బాగా ఒడ్డూ పొడుగూ ఉండి తెల్లటి తెలుపు రంగువాళ్ళు. ఊళ్ళో మిగతావాళ్ళ రూపురేఖలకి వీళ్ళ రూపురేఖల కీతేడా ఉంది. వీళ్ళు పైవాళ్ళ దర్జాని ఏమాత్రం సహించేవాళ్ళుకాదు. మా అమ్మ ఊరంతటికీ అందమైనది. ఆవిడ తెల్లటి మొహం, బూడిదరంగు జుట్టూ ఎంతో అందంగా ఉంటాయి. మా కుటుంబం వారు తాము బ్రాహ్మల మని చెప్పుకునేవారు. అయితే ఊళ్ళోవాళ్ళకి ఈవిషయంలో సందేహం ఉన్నట్టుగా నాకు అనిపించేది. సందేహించాల్సిన సంగతే, అక్కడ

బ్రాహ్మల్లో మద్యం తాగడం మహాపాపం. కాని మా ఇంట్లో మద్యం అలా తయారవుతూనే ఉంటుంది. తాగుతూనే ఉంటారు. ఉన్నతకులాల్లో ఆడామగా కలిసి నాట్యంచెయ్యడం అన్నమాట ఎక్కడా ఉండదా కాని మా కులంలోని ఏడు కుటుంబాల వాళ్ళు- అన్ని కుటుంబాలూ ఒక్కలాగే పెద్ద పెద్ద కుటుంబాలే-సాయంత్రం అయీ అవడం నాట్యం చెయ్యడానికి పోగవుతారు. బాగా చిన్నప్పుడు అన్నిచోట్ల అలాగే నాట్యం చేస్తారని నేననుకొంటూ ఉండేవాణ్ణి. కాని ఊళ్ళో మిగతా పిల్లల్తో కలిసి ఆడుకుంటూ వాళ్ళు మమ్మల్ని ఓ చిత్రమైన మనుషులుకింద చూస్తున్నారని తెలిసింది. మా కులీనత్వాన్ని అంగీకరించినప్పటికీ వాళ్ళు మేం బ్రాహ్మలమే అని అనుకోడానికి సందేహించేవారు. మా ఊరు చాలా పెద్దది. దుకాణాలూ, కోమట్ల ఇళ్ళు కూడా ఉన్నాయి. అక్కడ కొన్ని నాగర కుటుంబాలు ఉన్నాయి. వీళ్ళని కోమట్లని అనేవారు. కాని వాళ్ళు తమనితాము మాకుమల్లేనే బ్రాహ్మలం అని చెప్పుకునేవారు. ఎంతోమంది నాగర కుటుంబాల్లోని అమ్మాయిల్ని మా కులంవాళ్ళు పెళ్ళిళ్ళు చేసుకున్నారు. ఇదీఒక కారణమే. ఊళ్ళోవాళ్ళు మమ్మల్ని బ్రాహ్మలుగా ఒప్పుకోడానికి సిద్ధంగా లేరు. బ్రాహ్మల భోజన పద్ధతులూ, పెళ్ళిపేరంటాల పద్ధతులు నియమాల్ని కాదని వాటిని తక్కువ చేసిన వాళ్ళు బ్రాహ్మలెలా అవుతారని వాళ్ళ ఉద్దేశం. వాతోటి పిల్లలు ఎప్పుడైనా నామీద కోపంవస్తే నన్ను "పందెం పుంజూ" అని వెక్కిరిస్తారు. నేను మా అమ్మని ఎన్నోసార్లు అడిగాను కాని ఆవిద ఏం చెప్పకుండా మాట మరిపించేస్తోంది.

నాకిప్పుడు జ్ఞానం పెరిగింది. పదేళ్ళవాణ్ని. ఊళ్ళో ఓ బ్రాహ్మణ గురువుగారి పాఠశాలలో చదువుకోడానికి వెళ్తున్నాను. నాతోటి విద్యార్థులు చాలావరకు అంతమందీ బ్రాహ్మలే. అంతమందీ అసలుసిసలైన బ్రాహ్మలు! నేనూ నాతోపాటు ఓ ఇద్దరు నాగర 'విద్యార్థులం ఉన్నాం – మమ్మల్ని మా తోటి విద్యార్థులు నకిలీ బ్రాహ్మలు అనేవారు. వాళ్ళు మరి పక్కా బ్రాహ్మలు! మా గురువుగారికి నేనంటే చాలా ఇష్టం. చాలా తెలివిగా, చురుగ్గా ఉంటానని ఆయన నన్ను ఎక్కువ అభిమానించేవారు. మా కులం స్వభావం నాలోనూ ఉంది. ఎవరిమాటా పడేవాణ్ని కాదు. దెబ్బలాడేవాణ్ని. ఆవేళ నాతోటి విద్యార్థి వ్యంగ్యంగా ఓ విసురుమాట అన్నాడు. "మహా పెద్ద బ్రాహ్మడొచ్చాడయ్యా! పందెంపుంజుగాడు!" మా పింతండ్రి బావమరిది కొడుకు నా పక్షాన్ని దెబ్బలాడబోయేడు. దాంతో వాణ్ని ఆ విద్యార్థి తిట్టాడు. "గ్రీకుగాడాని! నాగరబ్రాహ్మట్ట నాగరబ్రాహ్మడు!" చిన్నప్పట్నించి చిన్నపిల్లల దగ్గర్నుంచి ఇలా వ్యంగ్యంగా విసురుమాటలు అంటూ వుండడం వింటూనే ఉన్నాను. కాని అప్పుడు అవి అంత బాధపెట్టేవి కావు. వాటి అర్థమూ అంతగా తెలిసేదికాదు. పాఠశాలలో మేం ముగ్గురం కాక ముప్పైమంది విద్యార్థులు ఉన్నారు. నలుగురు అమ్మాయిలు ఉన్నారు. వాళ్ళూ మాలాగే తెల్లటి

వాళ్ళు, ఒడ్డూ పొడుకై్కతే మా అంత పొడుగైనవాళ్ళు కాదు. అయినప్పటికీ మాకు వాళ్ళముందు తలవంచాల్సి వచ్చేది.

ఆ వేళ ఇంటికి తిరిగి వెళ్ళేటప్పుడు నేను మొహం వేలేసుకుని వెళ్ళాను. మా అమ్మ వాడిపోయిన నా మొహాన్ని చూసి నన్ను ముద్దుపెట్టుకుంది.

"ఏం బాబూ, అలా ఉన్నావేం?" అంది.

ముందు నేను మాట మార్చేద్దామనుకున్నాను. కాని అమ్మ ఎంతో బలవంతం చేసి చెప్పమని అడిగింది.

"అమ్మా! మనకులం గురించి ఏదోగాని ఉంది. దాన్నించే మనల్ని బ్రాహ్మలని ఎవరూ ఒప్పుకోటంలేదు."

"మనం పరదేశ బ్రాహ్మలం బాబూ! అందుకని వాళ్ళు అలా అనుకుంటారు."

"బ్రాహ్మలే కాదమ్మా! బ్రాహ్మలు కాని వాళ్ళు అలాగే అనుకుంటారు. మనం బ్రాహ్మలమా అని సందేహంగా చూస్తారు."

"ఈ బ్రాహ్మలు చెప్పడం నుంచి వాళ్ళలాగ అనుకుంటారు."

"మనచేత యజ్ఞాలు చేయించేవాళ్ళే లేరు. మిగతా బ్రాహ్మలు పౌరోహిత్యం చేస్తారు. బ్రాహ్మణ భోజనాలకి వెళ్తారు. మనకులంలో అదేం లేదు. పైగా బ్రాహ్మలు వాళ్ళపంక్తిలో మనకి భోజనం కూడా పెట్టరు. అమ్మా! నీకు తెలిస్తే విషయం ఏమిటో చెప్పు."

అమ్మ ఎంతో బోధపర్చింది. అయినా నాకు సంతోషం కలుగలేదు.

నా మనస్సిలా చికాకు పడిపోయినప్పుడు, కంగారుగా ఉన్నప్పుడూ నా తోటి నాగర విద్యార్థులూ, మిగిలిన మట్టాలూ సానుభూతి చూపెట్టేవారు. ఇంకో మాటలో చెప్పాలంటే మేం ఒకరిపట్ల ఒకరం సానుభూతి చూపెట్టుకునేవాళ్ళం.

## 2

ఏళ్ళు గడిచి నేను పదమూడేళ్ళవాణ్ణయాను. పాఠశాలలో నా చదువు పూర్తి కావచ్చింది. నేను మన వేదాలు ఋగ్వేదం, ఐతరేయబ్రాహ్మణం, వ్యాకరణం, నిరుక్తం కొన్ని కావ్యాలూ చదివాను. గురువుగారికి నా మీద అభిమానం ఇంకా పెరుగుతూనే ఉంది. ఆయన కూతురు విద్య, నాకంటే నాలుగేళ్ళు చిన్నది. ఆ అమ్మాయికి చదువుకోడంలో నేను సాయపడేవాణ్ణి. గురువుగారూ, గురువుగారి భార్యా నాపట్ల వ్యవహరించే తీరువల్ల ఆ అమ్మాయికీ నేనంటే ఎంతో గౌరవం వుండేది. నన్ను "సువర్ణ అన్నయ్యా" అని అనేది. గురువుగారి కుటుంబం గురించి ఎప్పుడూ చెడుగు చెప్పడానికి నాకేం ఉండేదికాదు. ఎంచేతా అంటే గురువుగారి భార్య నన్ను ఎంతో వాత్సల్యంతో తల్లిలాగ చూసేది.

ఆ రోజుల్లో మళ్ళీ నాతోటి విద్యార్థుల్లో ఒకడు నన్ను "పందెంపుంజు" అని

వ్యంగ్యంగా అన్నాడు. పోనీ అని ఏదన్నా కారణం ఉందా అంటే అదీ లేదు. నేను ఏ గొడవా రాకుండా చాలా జాగ్రత్తగా మసలుకునేవాణ్ణి. చదువులో నేను చాలా చురుగ్గా ఉండటంనుంచి నాతోటి విద్యార్థులకి నేనంటే ఈర్ష్యా అసూయా ఉండేవి. అదిగో అదే కారణం తప్ప మరొకటి ఏంకాదు. ఇప్పుడు నా ప్రవృత్తి మారి పోయింది. నేను గంభీరంగా ఉంటున్నాను. మనస్సు ఆవేశానికి, ఉత్తేజానికి గురి అవటం లేదనికాదు కాని నేను నెమ్మది నెమ్మదిగా ఆత్మనిగ్రహాన్ని అలవర్చుకు న్నాను. మా తాతగారికి డెబ్బై ఏళ్ళకి పైనే ఉంటాయి. ఎన్నోసార్లు ఆయనదగ్గర కూచుని దేశ విదేశాల భోగట్టాలు, యుద్ధం గురించి, శాంతి గురించి ఎన్నెన్నో సంగతులు విన్నాను. ఈ ఊరికి ఆయనే తన సోదరులతో కలిసి మొట్టమొదట వచ్చేరన్న భోగట్టా కూడా నేను విన్నాను. ఇవాళ తాతగారిదగ్గర మా కులం గురిం చిన అసలు సంగతి ఏమిటో తెలుసుకోవాలని నిశ్చయించుకున్నాను. ఊరికి తూర్పుగా మా మామిడితోటొకటి వుంది. మామిడితోట ముమ్మరంగా కాసింది. ఇంకా పండడానికి సమయం పడుతుంది. అయినా ఇప్పట్నించీ సోనాదాసి అక్కడ తన గుడిసె వేసేసుకుంది. మా తాతగారు ఈ ఊరువచ్చిన వెంటనే నలభై వెండి నాణాలు (రూపాయలు) ఇచ్చి ఎవరో దక్షిణాది వర్తకుడి దగ్గర సోనాని కొన్నారనీ ఆ రోజుల్లో దక్షిణాది నుంచి దాసదాసీజనాన్ని అమ్మడానికి ఎంతోమంది వ్యాపారస్థులు వస్తూవుండేవారని నేను విన్నాను. సోనా యువతి. అందుకే అంత ఖరీదు పెట్టారు. లేకపోతే దాసీవాళ్ళు అంత ప్రియంకాదు. నల్లటి తారులాంటి సోనా శరీరంమీద చర్మం ఇప్పుడు వేళ్ళాడి ఉడిపోయింది. ఆవిడ మొహంమీద ముడతలు చారలు, బేతాళ నద్దుల వంకరటింకర కాలువల్లా ఉన్నాయి. అయితే యౌవనంలో ఆవిడ అందంగానే ఉండేదని చెప్తారు. తాతగారికి ఆవిడ నెత్తిమీద దేవతే-ముఖ్యంగా వాళ్ళి ద్దరూ ఏకాంతంగా ఉన్నప్పుడు! దగ్గరవాళ్ళు ఏవేవో అనేవారు. ఆరోగ్యవంతుడూ, భార్య చనిపోయి ఒంటరిగా ఉన్నవాడూ, ప్రౌఢ వయస్సులో ఉన్నవాడూ అలాంటి ఆయనమీద అలాంటి సందేహం కలగటం సహజమే.

సాయంత్రం వేళల్లో తాతగారు తోటకి వెళ్తూవుంటారు. ఓ రోజు నేను ఆయనతోపాటు తోటకి వెళ్ళాను. తెలివైన మనుమణ్ణని ఆయనకి ఎంతో వాత్సల్యం. అవీ ఇవీ మాట్లాడుతూ నేను ఇలా అన్నాను:

"తాతయ్యా! మన కులం గురించి నిజం ఏమిటో నువ్వు చెప్తే విందామను కుంటున్నాను. మనల్ని నిజం బ్రాహ్మలని ఎందుకనుకోరూ? 'పందెం పుంజు' అని ఎందుకు వెక్కిరిస్తారు? అమ్మని ఎన్నోసార్లు అడిగాను కాని తను సరిగ్గా జవాబు చెప్పలేదు."

"ఇది అడగాల్సిన అవసరం ఏముంది?"

"చాలా అవసరం తాతయ్యా? అసలు సంగతేమిటో నాకు సరిగ్గా తెలిస్తే మన కులం గురించి చేసే ఆక్షేపాలకి అవమానాలకి బదులు తీర్చుకోగలుగుతాను.

నే నిప్పుడు బ్రాహ్మలగురించి చాలావరకు చదివేశాను. తాతయ్యా! మన కులం గౌరవాన్ని నిలబెట్టడానికి కావల్సిన జ్ఞానాన్ని విద్యని నేను సంపాదించాను."

"నువ్వంటున్నది నమ్ముతున్నానురా అబ్బాయీ! కాని నీ తల్లికి పాపం మన కులం గురించి అసలుసంగతి తెలీదు. అందుకని ఆవిడ నీకు చెప్పకుండా దాస్తోందని అనుకోకు. లోకంలో ఇప్పుడు నాగరులతో మనకున్న సంబంధ బాంధవ్యాలు మన కులం స్థితి నిర్ణయిస్తున్నాయి.మనకీ వాళ్ళకీ మధ్య పెళ్ళిళ్ళూ,పేరంటాలు ఉన్నాయి. అవంతిలోనూ లాట్‌లోనూ (గుజరాతు) వాళ్ళ సంఖ్య కూడా ఎక్కువే. అంచేత వాళ్ళతోపాటే మనమూనూ! మునిగినా తేలినా! మీ తరంవారు నిజానికి యౌధేయుల కన్నా నాగరులకిందే లెక్క."

"యౌధేయులంటే తాతయ్యా?"

"మన కులం పేరురా అబ్బాయీ! దాన్నంచే మనల్ని 'పందెం పుంజు' లంటారు. (యౌధేయ అంటే యుద్ధం చేసేదని అర్థం)"

"యౌధేయులు బ్రాహ్మలా తాతయ్యా?"

"బ్రాహ్మలకన్నా అసలుసిసలయిన ఆర్యులు."

"అయితే బ్రాహ్మలుకారా?"

"దీనికి జవాబు అవుననూ కాదూ అని ఓ మాటలో చెప్పేబదులు నీకు యౌధేయుల గురించి వివరించి చెప్పడమే మంచిది. యౌధేయులు సతలజ్‌కి యమునకి మధ్య హిమాలయాలమంచి ఎడారివరకూ ఉన్న ప్రాంతంలో ఉండేవారు. యజమానులూను. యౌధేయులందరూ యజమానులే, స్వాములే!"

"అంతమందీనా?"

"ఆహాఁ. వాళ్ళలో రాజన్నవాడు ఎవడూలేడు. వాళ్ళ రాజ్యాన్ని గణరాజ్యం (ప్రజాస్వామ్యం) అనేవారు. గణం లేదా పంచాయతీ సమితి పరిపాలనా కార్యాలన్నిటినీ చక్కబెట్టేది. వాళ్ళకి ఓ మనిషి పరిపాలన-రాజు పరిపాలన-రాజరికం అంటే పడదు. వాళ్ళు వాటిని గట్టిగా గర్హించేవారు."

"అలాంటి రాజ్యం గురించి నేనెప్పుడూ వినలేదు తాతయ్యా!"

"అలాంటి రాజ్యం ఉండేదిరా అబ్బాయి! నా దగ్గర యౌధేయ గణరాజ్యపు రూపాయలు మూడు ఉన్నాయి. వాటిని మా నాన్న నాకు యిచ్చాడు. దేశంనుంచి పారిపోయి వచ్చినప్పుడు తన దగ్గర రూపాయిల్లోవే ఈ మూడు రూపాయలు."

అయితే తాతయ్యా! నువ్వు యౌధేయుల దేశంలో పుట్టలేదా?"

"నాకు పదేళ్ళున్నప్పుడు మా అమ్మానాన్నా దేశం వదిలేసి రావలసివచ్చింది. నాకన్నా పెద్దవాళ్ళు ఇద్దరు అన్నలు ఉన్నారు. వాళ్ళ సంతానాన్ని నువ్వు చూస్తూనే ఉన్నావు."

"దేశం వదిలేసి ఎందుకు రావలసివచ్చింది తాతయ్యా?"

"ప్రాచీన కాలం నుంచీ అది యౌధేయుల భూమే. గొప్ప గొప్ప వీరులు,

రాజులు, చక్రవర్తులు-మౌర్యులు, గ్రీకులు, శకులు-భారతదేశంలో పుట్టారు-అయితే అందరూ కాస్త పన్ను తీసుకోవడం తప్పించి మా గణరాజ్యాన్ని మట్టుపెట్టాలని చూడలేదు- ఈ చంద్రగుప్తుడు-తనని విక్రమాదిత్యుడని చెప్పుకుంటాడే, అప్పు డప్పుడు ఉజ్జయినిలో కొలువు చేస్తూ ఉంటాడే-అతని వంశంవాళ్ళు చక్రవర్తు లయ్యారు. వాళ్ళు యౌధేయుల్ని మట్టుపెట్టేశారు. యౌధేయులు శక్తివంతుడైన చక్రవర్తికి కొన్ని కానుకలు ఇస్తూ ఉండేవారు. అయితే గుప్తరాజు వాటితో తృప్తి పడలేదు. 'మేం ఇక్కడ మా ప్రతినిధి (గవర్నరు)ని నియమిస్తాం. ఇక్కడ మా కుమారామాత్యుడు (కమీషనరు) ఉంటాడు. మేం మా రాజ్యం అంతటినీ ఎలా పరిపాలిస్తామో అల్లాగ్గానే ఇక్కడా పరిపాలిస్తాం' అని అన్నాడు. మా గణరాజ్యపు పెద్దలు అతనికి చాలా బోధపర్చారు. యౌధేయులు అనాదినుంచీ గణ పరిపాలనలోనే ఉంటూవచ్చారనీ, ఇంకో విధమైన పరిపాలనని వాళ్ళు ఎరగరనీ చెప్పారు. కాని రాజు రాజ్యాధికారమదంతో ఉన్నవాడు. వాళ్ళమాట ఎందుకు ఒప్పుకుంటాడు? ఆఖరికి యౌధేయులు తమ ఇష్టదేవత గణదేవతదగ్గర శపథం చేసి కత్తులు పట్టారు. వాళ్ళు ఎన్నోసార్లు గుప్తుల సైన్యాన్ని ఓడించారు. గుప్తుల సైన్యం నాలుగింతలు ఐదింతలు తమకన్నా ఎక్కువగా ఉన్నాసరే తమధాటికి గుప్తుల్ని నిల్వనియ్యకుండా చేసేవారు. కాని లౌహిత్యం (బ్రహ్మపుత్ర) నుంచి ఎడారి వరకూ విస్తరించి ఉన్న వాళ్ళ సామ్రాజ్యపు సేనంతటినీ ఎదుర్కోవాలంటే యౌధేయులు ఎంతకని ఎదుర్కో గలరు? యౌధేయులు గెలుస్తూనూ ఉండేవారు. కాని వాళ్ళ శక్తి తగ్గిపోతూనూ వచ్చింది. సంఖ్య బాగా తగ్గిపోయింది. సైన్యం నశించిపోసాగింది. గుప్తులు మన నగరాల్ని, గ్రామాల్ని అన్నిటినీ సర్వనాశనం చేశారు. స్త్రీ పురుషుల్ని చిత్రవధ చేశారు. మనవాళ్ళు ముప్పై ఏళ్ళవరకూ వాళ్ళతో పోరాటం సాగించారు. ఎక్కువ కప్పం చెల్లించటానికి వాళ్ళు సిద్ధపడ్డారు. కాని తమ దేశంలోని గణతంత్ర పరి పాలనని ఖాయంగా నిలుపుకోవాలని చేశారు."

"గణతంత్ర పరిపాలన అంటే ఎలా ఉంటుంది?"

"ఆ ప్రభుత్వ పాలనలో ప్రతీ యౌధేయుడూ తలెత్తుకు తిరిగేవాడు. ఎవరి దగ్గరా చేతులు నలుపుకునేవాడు కాడు. తక్కువాణ్ణని తలొంచుకునేవాడు కాడు. యుద్ధం అంటే యౌధేయుడికి ఆటగా ఉండేది. అందుకే యౌధేయులని వంశానికి పేరువచ్చింది."

"అయితే తాతయ్యా ! మనలాగే ఇంకా యౌధేయులు ఉన్నారా?"

"ఉండి ఉంటార్రా అబ్బాయీ ! అయితే చెట్టుకొకళ్ళు పుట్టకొకళ్ళుగా చెల్లా చెదరై పోయారు."

"మనలాగానే ఏ నాగరవంశంలోనో కలిసిపోయి తమ వంశాన్ని తమ పుట్టు కనీ తమనితాము మర్చిపోయిన వాళ్లూ ఉన్నారా? మనల్ని మనం బ్రాహ్మలమని ఎందుకు చెప్పుకుంటున్నాం తాతయ్యా?"

"అదో పెద్ద కథరా బాబూ ! మొదట్లో అన్నిచోట్లా రాజులు లేరు. రాజరికం లేదు. గణతంత్రాలే ఉండేవి. ఆ కాలంలో బ్రాహ్మలూ, క్షత్రియులూ అన్న తేడా లేదు."

"అయితే బ్రాహ్మలూ క్షత్రియులూ ఒకే వర్గం వాళ్ళా తాతయ్యా ?"

"ఆఁ. అవసరం వచ్చినప్పుడు ఎవరైనా పూజాపునస్కారాలు చేసేవారు. అలాగే కత్తి పట్టేవారు. కాని ఆ తర్వాత విశ్వామిత్రుడూ, వశిష్ఠుడూ వచ్చి వర్ణాలుగా విభజించటం మొదలుపెట్టారు."

"అందుకేనన్నమాట ఓ తండ్రికి పుట్టిన ఇద్దరు కొడుకుల్లో ఒకడు రంతిదేవుడిలాగ క్షత్రియుడూ, మరొకడు గౌరివీతిలాగ బ్రాహ్మణఋషీ అవడం మొదలయింది."

"అలా రాసివుందా అబ్బాయీ?"

"అవును తాతా! వీళ్ళిద్దరూ సంకృతి ఋషి పుత్రులని వేదాల్లోనూ,చరిత్రలోనూ ఉన్నాది. అంతేకాదు. ఈ ప్రాచీన గ్రంథాల్లో చాలా చిత్రవిచిత్రమైన సంగతులు ఉన్నాయి. వాటిని ఈ కాలం వాళ్ళు నమ్మరు. చర్మణ్వతి (చంబల్) ఒడ్డున ఉన్న దశపురాన్ని చూశావా తాతయ్యా!"

"చూశానురా అబ్బాయీ ! చాలాసార్లే చూశాను. అవంతి (మాలవా) లోనే కదా ఉన్నాది. నేను ఎన్నోసార్లు పెళ్ళిళ్ళకి అక్కడికి వెళ్ళేను. అక్కడ నాగర కుటుంబాలు చాలా ఎక్కువ. వాళ్ళలో గొప్ప వ్యాపారస్థులు, బేహారులు ఉన్నారు."

"ఈ దశపురమే రంతిదేవుడి రాజధాని. చర్మణ్వతి అన్న పేరు రావడానికి మరో చిత్రమైన కథ ఉన్నాది."

"ఏంట్రటా అబ్బాయీ?"

"సంకృతి బ్రాహ్మణుడి పుత్రుడు రంతిదేవుడు. కాని తాను మాత్రం క్షత్రియుడయ్యాడు. రాజా రంతిదేవుడు తన అతిథి సేవకి గొప్పపేరు తెచ్చుకున్నాడు. సత్యయుగంలోని పదహారుమంది గొప్ప మహారాజుల్లో ఆయనొకడు. రంతిదేవుడు భోజనశాలలో ప్రతీరోజూ రెండువేల ఆవుల్ని వధించేవారు. తడితడిగా ఉన్న ఆ ఆవుల చర్మాన్ని వంటశాలలో పెట్టేవారు. ఆ చర్మాలనుంచి కారిన నీరు ప్రవహించి ఓ నది అయింది. చర్మం నుంచి వచ్చింది కాబట్టి దానికి చర్మణ్వతి అని పేరు వచ్చింది."

"ఏమిటీ, నిజంగానే ప్రాచీన గ్రంథాల్లో ఇలా రాసిఉందా అబ్బాయీ?"

"అవును తాతయ్యా! మహాభారతంలో స్పష్టంగా రాసి ఉంది."*

---

"రాజ్ఞో మహానసే పూర్వ రంతిదేవస్య వై ద్విజ।
అహన్యహని వధ్యయేతే ద్వే సహస్రే, గవాం తథా!
సమాంసం దదతోః హ్యన్నం రంతిదేవస్య నిత్యశః!
అతులా కీర్తిరభ నృపపస్య ద్విజసత్తమ।'' --వనపర్వం 208/8-10

"మహాభారతంలోనా? పంచమవేదంలోనా? గోమాంస భక్షణం గురించా?"

"రంతిదేవుడి దగ్గర అతిథులకి భోజనం పెట్టడానికి, ఈ గోమాంసాన్ని వండడానికి రెండువేలమంది వంటవాళ్ళు ఉండేవారు తాతయ్యా! అలా అయినా బ్రాహ్మణ అతిథులు ఇంత ఎక్కువ సంఖ్యలో వచ్చేవారు కదా ఆ వంటవాళ్ళకి మాంసం చాలదని, సూపు ఎక్కువగా పోసుకోవలసినదని వచ్చిన అతిథుల్ని వేడుకోవల్సివచ్చేది."*

"బ్రాహ్మలు గోమాంసం తినేవారా? అబ్బాయీ నువ్వంటున్నదేమిటీ?"

"మహాభారతం-పంచమవేదంలో ఎక్కడన్నా అబద్ధం రాసి ఉంటుందా తాతయ్యా?"**

"ప్రపంచం ఇంతలా తారుమారై పోయిందా?"

"తారుమారు అవుతూ ఉంటుంది తాతయ్యా! అయినా సరే, తమని తాము అసలు సిసలు నిఖార్సైన బ్రాహ్మలమని చెప్పుకునే ఈ గుడ్లగూబ లాంటి దివాంధులు అందరికళ్ళనీ కప్పేద్దామనుకుంటున్నారు. మన పూర్వీకులు యౌధేయులు బ్రాహ్మల కపటాలు, మోసాలు పెరగకముందున్న ఆచార వ్యవహారాలనీ, ధర్మాన్నీ, నియమాన్ని పాటిస్తూ ఉండేవారని నాకిప్పుడు నమ్మకంగా వుంది."

"అవును నిజమే. యౌధేయులు బ్రాహ్మల్ని తమకన్నా ఎక్కువవాళ్ళని ఎప్పుడూ అనుకునేవారు కాదు."

"ఇక్కడికి వచ్చాక నీ పిల్లల పెళ్ళిళ్ళు అవంతక (మాలవీయులు) బ్రాహ్మలతో చెయ్యకుండా నాగరులతో ఎందుకు చేశావు తాతయ్యా?"

"రెండు కారణాలున్నాయి. ఒకటేమో, ఈ బ్రాహ్మలకి మన కులం గురించి సందేహం ఉంది. కాని అదేం అడ్డురాదనుకో—కావాలనుకుంటే ప్రత్యేకించి బ్రాహ్మణ కన్యల్ని పెళ్ళికూతుళ్ళుగా తెచ్చుకోవచ్చు. నాగరులు కూడా మనలాగే తెల్లటితెలుపు

---

మహానదీ చర్మ రాశే రుత్క్లేదాత్ సంసృజేయతః
తతశ్చర్మణ్వ తీత్యేవం విఖ్యాతాసా మహానదీ!

-శాంతిపర్వం 29-123

* "సాంకృతి రంతిదేవం చ మృతం సృంజయ! శుశ్రుమ!
ఆసన్ ద్విశత్ సాహస్రా తస్య సూదా మహాత్మనః!
గృహానభ్యాగతాన్ విప్రాన్ అతిథీన్ పరివేషకాః"

ద్రోణపర్వం 67/1-2

"తత్రస్మసూదాః క్రోశంతి సుమృష్ట మణికుండలాః!
సూపం భూయిష్ఠ మశ్నీధ్వం నాద్య మాంసం యథాపురా!"

ద్రోణపర్వం 66/15-16

సూపం భూయిష్ఠ మశ్నీధ్వం నాద్యభోజ్యం యథాపుర!

శాంతిపర్వం 27-28

రంగులో ఉంటారనీ, మనలాగానే బ్రాహ్మలు ఒప్పుకోక పోయినా తాము బ్రాహ్మల మని చెప్పుకుంటారని మేం వాళ్ళతో సంబంధ బాంధవ్యాలు మొదలు పెట్టాం. అదీ కారణం."

"నాగరులు ఎవరు తాతయ్యా?"

"బ్రాహ్మలు! ఉత్తిదే బ్రాహ్మలు అంటే వాళ్ళు ఒప్పుకోరు-ఎక్కడి బ్రాహ్మలు? ఏ గోత్రంవాళ్ళు? అని వాళ్ళు అడుగుతారు. మన ఈ సంబంధీకులు నగరాల్లో ఉండేవారు. అందుకని వీళ్ళు తమని తాము నాగర బ్రాహ్మలమని చెప్పుకోవడం మొదలు పెట్టారు- మనం యౌధేయబ్రాహ్మలమని చెప్పుకుంటున్నట్టు!"

"కాని వాళ్ళు అసలు ఎవరు తాతయ్యా?"

"సముద్రతీరాన ఉండే గ్రీకుల్లా అబ్బాయీ! వాళ్ళలో చాలా మంది బ్రాహ్మణమతాన్ని అంగీకరించరు. బౌద్ధమతాన్ని నమ్ముతారు. ఉజ్జయిని వెళ్తే బోధపడ్తుంది. ఇప్పటికీ తమని తాము శుభ్రంగా గ్రీకులని చెప్పుకునేవాళ్ళు చాలా మంది ఉన్నారు. వీళ్ళని బ్రాహ్మలు క్షత్రియులని ఒప్పించాలని చాలా ప్రయత్నిస్తున్నారు."

"అయితే జాతివర్ణాలు ఇష్టాఇష్టాల మీద ఏర్పడుతున్నాయన్నమాట. అవునా తాతయ్యా?"

"మరి అలాగే కనపడుతోందిరా అబ్బాయీ!"

# 3

నా కిప్పుడు ఇరవై ఏళ్ళు. కండలు తిరిగిన దండలతో బలంగానూ అందంగానూ తయారయ్యాను. యువకుణ్ణి. మా ఊళ్ళో చదువు పూర్తిచేసి ఇప్పుడు ఉజ్జయినిలోని గొప్ప గొప్ప పండితులకి శిష్యుణ్ణి అయ్యాను. మా తల్లి మాతామహుల చుట్టాలు ఉజ్జయినిలోని బాగా డబ్బున్న నాగరులు. వాళ్ళు నన్ను బలవంతం చేసి తమ ఇంట్లోనే ఉండక తప్పదన్నారు. నాలాంటి గ్రామంనుంచి వచ్చిన విద్యార్థికి ఉజ్జయిని విశాల ప్రపంచాన్ని చూపించే పెద్ద గవాక్షం అని చెప్పాలి. ఇంతకు పూర్వమే కాళిదాసు పేరు విన్నాను. అతని కవిత్వం కొంత చదివీ ఉన్నాను. ఇప్పుడు ఇక్కడ ఆ మహాకవి దగ్గర కొన్నాళ్ళపాటు చదివే అదృష్టం కలిగింది. చంద్రగుప్త విక్రమాదిత్యుడి ఆస్థానంలో కవి కాళిదాసుకి గొప్ప గౌరవస్థానం ఉన్నాది. అంచేత ఆయన ఎక్కువకాలం ఉజ్జయినికి బైటే ఉండేవాడు. నాకు కవికులగురు కాళిదాసంటే చాలా భక్తిశ్రద్ధలూ గర్వమూను. అయితే కాళిదాసు రాజుని సేవిస్తాడనీ, రాజసంబంధమైన ఈ దాస్యప్రవృత్తి నాకు బాధ కలిగిస్తూ ఉండేది. ఆ రోజుల్లో కాళిదాసు కుమారసంభవం రాస్తూ ఉండేవాడు. విక్రమాదిత్యుడి పుత్రుడు కుమారగుప్తుణ్ణి తను అందులో శంకరుడి పుత్రుడు కార్తికేయుడి

పేరుతో అమరుణ్ణి చెయ్యాలని అనుకుంటున్నట్టు ఆయన నాకు చెప్పాడు. ఏ సంకోచం లేకుండా నేను ఆక్షేపించినా, నా ఆక్షేపణలు ఘాటుగా ఉన్నప్పటికీ ఆయన కోపగించుకునేవాడు కాదు.

"ఆచార్యా! మీ కావ్యప్రతిభ అనంతకాలం వరకూ నిలచివుండేది. చంద్రగుప్తుడూ కుమారగుప్తుల రాజ్యం వాళ్ళు బతికి ఉన్నంతకాలం వరకే ఉంటుంది. మరి అలాంటప్పుడు రాజులదగ్గర మిమ్మల్ని మీరు అంత తక్కువ చేసుకుంటారేం?" అని ఓ రోజు నేను అడిగాను.

"విక్రమాదిత్యుడు నిజంగా ధర్మసంస్థాపకుడే సుపర్ణా! ఆయన హూణుల చేతిలో పడకుండా భారతదేశాన్ని కాపాడాడు అవునుకదా?"

"కాని ఉత్తరాపథం (పంజాబు) లోనూ, కాశ్మీరంలోనూ ఇప్పటికీ హూణులున్నారు. ఆచార్యా!"

"చాలా ప్రాంతాల్నించి వాళ్ళని తరిమేశాడు."

"రాజులు ఇలా ఒకరినొకరు తరుముకుంటూనే ఉంటారు. పై వాళ్ళని తరిమి తమ రాజ్యాన్ని స్థాపించుకుంటూ ఉంటారు."

"కాని గుప్తవంశం గోబ్రాహ్మణుల్ని రక్షిస్తోంది."

"ఆచార్యా! మూఢుల్ని భ్రమలో ముంచెత్తే ఈ మాటలు మీ నోట వింటానని నేననుకోలేదు. మన పూర్వీకులు ఋషులు గోవుల్ని రక్షించేవారు. కాని భక్షించడానికే ఆ రక్షణ అని మీకు తెలుసు. మేఘదూతంలో* మీరే గోవధ చెయ్యగా పుట్టిన చర్మణ్వతి (చంబల్) గురించి, ఆ రంతిదేవుడి కీర్తి గురించీ రాశారు."

"నువ్వు మా కానివాడివోయి సుపర్ణా! ప్రియశిష్యా!"

"మీరేమన్నా పడతానుకాని మీరేమో అనంతకాలం మీ ప్రతిభతో ప్రపంచాన్ని ఏలే చక్రవర్తులయిఉండీ ఈ ధర్మవినాశకులు గుప్తరాజుల ఎదట తలొంచడాన్ని మాత్రం సహించలేను."

"నువ్వు వాళ్ళని ధర్మవినాశకులంటావా? సుపర్ణా!"

"ఆహాఁ. సందేహం ఏం లేదు. నందులు, మౌర్యులు, గ్రీకులు, శకులు, హూణులు వీళ్ళంతా చేయనంత పాపాన్ని ఈ గుప్తులు చేశారు. భారతభూమిలో గణరాజ్యం అన్నది లేకుండా మట్టికలిపేశారు."

"గణరాజ్యాలు ఈ యుగానికి అనుకూలమైనవి కావు సుపర్ణా! సముద్రగుప్తుడు కాని ఈ గణరాజ్యాల్ని అలాగే కొనసాగేటట్టు చేసి ఉంటే హూణుల్ని మిగతా శత్రువుల్నీ ఓడించగలిగి ఉండేవాడు కాదు. గెలిచి ఉండేవాడుకాదు."

"గెలుపు! తన రాజ్యాన్ని స్థాపించడానికి! మరో చంద్రగుప్తమౌర్యుడిగా

---

*వ్యాలంబేథాః సురభితనయా లంభజాం మానయిష్యన్,
స్రోతోమూర్త్యా భువిపరిణతాం రంతిదేవస్య కీర్తిమ్। మేఘదూతం 1/45.

అవడానికి! ! అయితే చాణుక్యులు తిరుగులేని బుద్ధిబలంతో స్థాపించిన మౌర్య సామ్రాజ్యం కూడా ఎక్కువకాలం నిలవలేదు. విక్రమాదిత్యుడు, కుమారగుప్తుడి వంశంవాళ్ళు ఆచంద్రతారార్కం పరిపాలించారు. ఏ ధర్మాన్ని పరిరక్షించటానికి వీళ్ళ ప్రజాపాలనని నామరూపాలైనా లేకుండా తుడిచిపెట్టేశారు? అనాదికాలం నుంచి వస్తున్న గుణాల్లోని ప్రజాపరిపాలనని సమూలంగా నాశనం చెయ్యడం అధర్మం కదా?"

"కాని రాజు విష్ణు అంశ ఉన్నవాడు."

"కుమారగుప్తుడూ నెమలితోపాటు తన చిత్రాన్ని గీయించుకుంటాడు. రేపో కవి అతణ్ణి షణ్ముఖుడి అవతారంగా కీర్తిస్తాడు! ఈమోసం ఈ నటనా బూటకం దేనికని? గంధశాలిక (వాసనబియ్యం) అన్నంతో భోజనం చెయ్యటానికి! మధురమయిన మాంసంతో చేసిన సూపు జుర్రటానికి! దేశంలోని యువతులందర్నీ రాణీవాసంలో పెట్టుకోవడానికి! వ్యవసాయం, చేతిపనులూ చేసే సామాన్య ప్రజల కష్టార్జితాన్ని తమ భోగవిలాసాల కోసం నీళ్ళలా ఖర్చు చెయ్యటానికి!! దీనికేనా మీరు గుప్తుల్ని ధర్మ సంస్థాపకులు అని అంటున్నది!! విష్ణువు? విష్ణ్వంశ? గుప్తులు వైష్ణవు లనిపించు కోడానికి గొప్ప కపటనాటకం మొదలుపెట్టారు. బ్రాహ్మలు వీళ్ళని విష్ణ్వంశ సంభూతులుగా వక్కాణిస్తున్నారు. వీళ్ళ నాణాలమీద లక్ష్మీదేవి బొమ్మని ముద్రించు కుంటున్నారు. ప్రజల్ని ఆకలితో మాడ్చి చంపుతూ, వాళ్ళ కష్టాన్ని దోచుకుని విచ్చలవిడిగా లెక్కలేనంత డబ్బు ఖర్చుచేసి విష్ణువు విగ్రహాల్ని చేయిస్తున్నారు. దేవాలయాలు కట్టిస్తున్నారు. గుప్తవంశపు రాజులు కలకాలం రాజ్యాన్ని పరిపాలిస్తూ ఉండాలని వాళ్ళ ఆశ."

"నువ్వంటున్నదేమిటి సువర్ణా! రాజుకి విరుద్ధంగా యెంతెంత మాటలంటు న్నావో?"

"ఆచార్యా? ప్రస్తుతానికి మీ ముందు మాత్రమే చెప్తున్నాను. ఏదో ఓ రోజున మహారాజాధిరాజు, గొప్ప మహారాజు కుమారగుప్తుడికే చెబుతాను. నా కంఠంలో ప్రాణం వుండగా ఈ బూటకనాటకాన్ని సహిస్తూ ఊరుకోలేను. ఇదంతా భవిష్యత్తు సంగతి. మీరు కూడా అశ్వఘోషుడి అడుగుజాడల్లో వెళ్ళాలని నా కోరిక."

"కాని ప్రియశిష్యా! నేను కవిని మాత్రమే! అశ్వఘోషుడు గొప్పకవీ దానికి తోడు మహామనీషీను. ఆయన దృష్టిలో ప్రాపంచిక భోగవిలాసాలకి ఏమాత్రం విలవన్నది లేదు. నాకంటావా? విక్రమాదిత్యుడి అంతఃపురంలో ఉండే అందమైన యువతుల్లాంటి వాళ్ళు కావాలి. ఎర్రటి ద్రాక్షాసవం కావాలి. ఉండడానికి గొప్ప ప్రాసాదం, కనిపెట్టుకు ఉండడానికి పరిజనం కావాలి. నేనెలా అశ్వఘోషుణ్ణి కాగ లను? 'రఘువంశం' వంకని నేను గుప్తుల రఘువంశత్వాన్ని పొగిడాను. దాంతో ప్రసన్నుడై విక్రమాదిత్యుడు నాకీ రాజ ప్రాసాదం ఇచ్చాడు. కాంచనమాలలాంటి గ్రీకు సుందరిని ఇచ్చాడు. ఆవిడ నా దగ్గరికి వచ్చి పదిహేనేళ్ళయింది. అయినా

ఆవిడ పచ్చని కేశసౌందర్యం నన్ను ముగ్ధుణ్ణి చేస్తూనే ఉంది. ఈ కుమారసంభ వాన్ని మొదలుపెట్టాను. ఇది ఇంకేమేం భోగాల్ని మాకు ప్రసాదిస్తుందో చూస్తూ ఉండు."

"ఆచార్యా! మీరు 'బుద్ధచరితం' 'సౌందరానందం' కావ్యాలే రాసి ఉంటే తిండిలేక ఆకలితో కటకటలాడి ఉండేవారనీ, లేదు భోగభాగ్యాలు మీకు సంప్రాప్తించి ఉండేవికావని నేననుకోను. కాని ఇది మాత్రం పూర్తిగా మీ భ్రమ. రాజుల్ని ఆశ్ర యించి వాళ్ళ ముఖస్తుతి చెయ్యకపోతే మీ జీవితం బొత్తిగా రసహీనంగా ఉంటుం దనుకోవడం ఉత్తి భ్రమ. ముందు రాబోయే తరాల కవులకి మీరు తప్పు వరవడి పెట్టారు. అంతమందీ కాళిదాసుని అనుసరిస్తున్నామన్న పేరుతో తమ తప్పుల్ని కప్పుకుంటారు."

"నేనలాంటి కావ్యాలు కూడా రాస్తాను."

"కాని గుప్తుల పాపాలని ఖండిస్తూ మాత్రం ఏదీ రాయరు!"

"అది నా వల్లకాదు సుపర్ణా! నేనెంతో మెత్తటివాణ్ణయిపోయాను."

"రాజులు చేసే ప్రతి పాతకాన్నీ ధర్మబద్ధమని పొగుడుతారు!"

"అలా చెయ్యాల్సిన అవసరం ఉంది. లేకపోతే రాజు అధికారం బలం దృఢపడవు. వశిష్ఠుడూ, విశ్వామిత్రుడూ కూడా ఇది యెంతో అవసరం అనే భావిం చారు."

"వశిష్ఠ విశ్వామిత్రులూ కవి కాళిదాసు లాగానే రాజప్రాసాదాల కోసం అంద మైన యువతులకోసం ఈ పాపాలన్నీ చెయ్యడానికి పూనుకున్నారు."

"సుపర్ణా! కావ్యశాస్త్రాధ్యయనమే కాకుండా నువ్వు యుద్ధవిద్యలు కూడా నేర్చుకుంటున్నావని విన్నాను. నువ్వుగాని ఒప్పుకుంటే రాజాధిరాజుతో చెప్పి నిన్ను కుమారామాత్యుడిగానో, సేనానాయకుడిగానో నియమించేటట్టు చూస్తాను. నువ్వు లాంటి పదవులు చేపడితే నాకెంతో సంతోషంగా ఉంటుంది. మహారాజు కూడా సంతోషిస్తారు."

"నేనెవరికీ నన్ను నేను అమ్ముకోను ఆచార్యా!"

"పోనీ రాజు పురోహితుల్లో ఒకడివిగా అయితే, ఎలా ఉంటుంది?"

"బ్రాహ్మల స్వార్థపరత్వం అంటే నాకు వొళ్ళుమంట."

"అయితే ఏం చేస్తావు?"

"ఇంకా నేను అధ్యయనం చెయ్యవలసినదీ తెలుసుకోవలసినదీ చాలా ఉంది."

# 4

ఇంతకు పూర్వం చెప్పినట్టూ-ఉజ్జయినిలో నా విద్యాదాహం తీర్చుకోడానికి అవకాశం కలగడమే కాకుండా విశాల ప్రపంచాన్ని తెలుసుకోడానికి కూడా మంచి అవకాశం కలిగింది. బ్రాహ్మలు రాజులకు యెలా పూర్తిగా అమ్ముడుపోతున్నారో

ప్రత్యక్షంగా చూశాను. ఇతరులు నన్ను బ్రాహ్మడని ఒప్పుకోకపోయినా ఒకప్పుడు నేను బ్రాహ్మణ్ణని నాకు మా గర్వం వుండేది. గ్రామం విడిచి రావడానికి ముందే ఆ గర్వం తగ్గుతూ వచ్చింది. గ్రామం నుంచి నగరానికి వచ్చేక భరుకచ్చం (భరోంచ్) నుంచి ఉజ్జయినికి తరుచు వచ్చే సిసలైన గ్రీకుల్ని చూశాను. వాళ్ళకి అక్కడ ఎన్నో పెద్ద పెద్ద విక్రయశాలలు ఉండేవి. ఎంతోమంది శకుల ఇంటికి ఆభీరుల ఇంటికీ వెళ్ళాను. వీళ్ళ పూర్వీకులు ఓ శతాబ్దం క్రితం ఉజ్జయినిని, లాట్ (గుజరాతు)ని, సౌరాష్ట్రాన్ని (కాఠియవాడ్) పాలించిన మహాక్షత్రపులు. (ప్రాచీన పారశీక సామ్రాజ్యపు మండలాధిపతులు, గవర్నర్లు) పండిన నారింజతో దీటుపోయే బుగ్గలూ, రోమం అన్నది లేకుండా నున్నగా వున్న మొహాలూ, గుండ్రగుండ్రటి కళ్లూ వున్న హూణుల్ని కూడా చూశాను. వీళ్ళు యుద్ధవిద్యలో నిపుణులే కావొచ్చు కాని నాకు వాళ్ళలో మరే ప్రతిభా కనిపించలేదు. ఇలాంటి విభిన్నమైనవాళ్ళని చూడ్డానికి అన్నిటికన్నా మంచి స్థలాలు బౌద్ధవిహారాలే. ఉజ్జయినికి అవతల బౌద్ధ విహారాలు ఒకటీ రెండూ కాదు, యెక్కువ సంఖ్యలోనే వుండేవి. మా మేన మామ వేపు వాళ్ళు బౌద్ధులే. ఎంతమందో నగరభిక్షువులు కూడా ఈ విహారాల్లో వుండేవారు. అంచేత నేను తరచు అక్కడికి వెళ్తూ వుండేవాణ్ణి.

గ్రంథాలను అధ్యయనం చెయ్యడం పూర్తిచేశాక దేశాటనం చేసి జ్ఞానం పెంచుకుందామని అనుకున్నాను. విదర్భలో అచింత్య (అజంతా) విహారానికి పెద్ద పేరు ఉన్నదనీ, అక్కడికి ప్రపంచ దేశాలన్నిటి నుండి వచ్చిన బౌద్ధభిక్షువులు వున్నారనీ, నాకు తెలిసింది. నేను అక్కడికి వెళ్ళాను.

ఇప్పటివరకూ నేనెప్పుడు ఎక్కడికి వెళ్ళినా నా కూడా నాకు సాయపడే మిత్రులూ వుండేవారు. కావల్సిన దారిబత్తెం కూడా వుండేది. ఈసారి మొట్టమొదటి సారి ఒంటరిగా ఎవరి సాయం లేకుండా ఏ దారిబత్తెం లేకుండా బయల్దేరాను. తోవలో దొంగలభయం లేదు. గుప్తుల్ని వాళ్ళ ఈ రక్షణ ఏర్పాటుకి మెచ్చుకోవాలి. అలా అని గుప్తుల పరిపాలనలో దేశంలోని ప్రతీ కుటుంబం ఐశ్వర్యాలతో తులతూగుతోం దని, దారిదోపుళ్ళు దాన్నించి లేకుండాపోయాయని అర్థం చేసుకోకూడదు. గుప్తులు పన్నులు వసూలు చెయ్యడంలో తమ ముందు పరిపాలించిన వాళ్ళందర్నీ మించి పోయారు. రాజప్రాసాదాల్ని నిర్మించటానికి ఇంత డబ్బు ఎవరూ ఎప్పుడూ ఖర్చు చేసి ఉండరు. ఆ ప్రాసాదాల్ని అలంకరించటంలో మరీ హద్దులు దాటిపోయారు. కొండలు, నదులు, పుష్కరిణులు, సముద్రాలు అన్నిటినీ రాజప్రాసాదాల చుట్టూ ఉండాలని దానికి తగ్గట్టూ నిర్మించటానికి ప్రయత్నించారు. వాళ్ళు క్రీడించే ఉద్యాన వనాలు నిజం వనాల్లా ఉండేవి. వాటిలో బోనులు పెట్టి క్రూరమృగాల్ని ఉంచారు. లేళ్లు, నీల్‌గాయ్‌లూ బైట సంచరిస్తూ ఉండేవి. వాళ్ళు క్రీడించడానికి కొండమీద నిజంగా కొండలమీద ఉన్నట్టు చెట్టూచేమలతో, సెలయేళ్ళూ ఉండేవి. సరోవరాన్ని సన్నటికాలువలతో కలిపారు. వంతెనలూ, ఆ కాలవల్లో నడిచే పడవలూ తయారు

చేశారు. రాజప్రాసాదాల్లో ఏనుగులు, బంగారం, వెండి, విభిన్న రత్నమాణిక్యాలు, పట్టువస్త్రాలు, మహా విలువైన తివాసీలు కుప్పతిప్పలు. రాజభవనాల్ని తీర్చిదిద్ది అలంకరించటంలో చిత్రకారులు తమ చిత్ర కళానైపుణ్యాన్ని ప్రదర్శించేవారు. శిల్పులు శిలావిగ్రహాల్ని, లోహపువిగ్రహాల్ని ఎంతో అందంగా మలిచి తగుస్థలాల్లో ప్రతిష్టించేవారు. విదేశాల నుంచి వచ్చిన యాత్రికుల నోటా, రాయబారుల నోటా ఈ చిత్రాల గురించీ, ఈ శిల్పాల గురించీ ఎంతో గొప్పగా చెప్పగా విన్నాను. వాళ్ళు అంత ఎక్కువగా మెచ్చుకుంటూ ఉంటే గర్వంతో నా ఛాతీ ఉబ్బిపోయేది. అయితే కుగ్రామాల్లో బీదవాళ్ళ ఇళ్లూ, వాళ్ళ దరిద్రాన్ని చూసినప్పుడు ఉజ్జయిని లోని ఆ రాజభవంతులంటే నా ఒంటికి కారంపూసినట్టు అనిపించింది. ఊళ్ళో లేచే గోడలవల్లా, పేటలవల్లా మట్టితవ్వడం నుంచి గుంటలూ, గోతులూ ఎలా ఎక్కువ వుతాయో అలాగ్గానే ఆ రాజభవంతుల వల్లే ఈ దారిద్ర్యం అంతా వచ్చింది అని అనిపించింది. మహానగరాల్లోనూ, పట్టణాల్లోనూ, బస్తీల్లోనే కాదు– పల్లెటూళ్ళలో కూడా ఎంతో ప్రావీణ్యంతో రకరకాలైన వస్తువుల్ని తయారుచేసే చేతిపనివాళ్ళు ఉన్నారు. నూలువడికే స్త్రీలు ఎంతో సన్నటి నూలు వడుకుతారు–నేతవాళ్ళు సన్నని వస్త్రాలని నేస్తారు. కంసాలులు, కమ్మరులు, తోళ్ళపని చేసే వారు అంత మందీ తమ తమ వస్తువుల్ని ఎంతో నైపుణ్యంతో తయారుచేస్తారు. రాజప్రాసాదాల్లో కళాఖండాన్ని తయారుచేసిన వాళ్ళు వీళ్ళకి స్వయానా బంధువులే! అయితే వాళ్ళనీ వాళ్ళ ఇళ్ళనీ చూస్తే వాళ్ళ హస్తకళానైపుణ్యంతో చేసిన వస్తువులన్నీ వాళ్ళకి మాత్రం కలలో వస్తువులే అని తెలుస్తుంది. భవనాలు నిర్మించటానికి, రాజప్రాసాదాలు కట్టడానికి, వ్యాపార స్థలాలు నిర్మించటానికి వీళ్లు తమ పల్లెటూళ్ళ నుంచి నగరాలకో, బస్తీలకో, పట్నాలకో చేరుకుంటున్నారు. వాళ్ళలో చాలా మంది అక్కణ్ణుంచి పడమర సముద్రం దగ్గరి భరుకచ్ఛం లాంటి రేవుల్నించి ఇరాన్లో లేకపోతే ఈజిప్టో వెళ్ళిపోతున్నారు. లేదు అంటే తూర్పు సముద్రం వేపు ఉన్న తామ్రలిప్తం నుంచి (తమలుక్) యవద్వీపం (జావా) సువర్ణద్వీపం (సుమత్రా)కి వెళ్ళిపోతున్నారు. భారతదేశంలో సముద్రవ్యాపారం ఇంత అధికంగా ఎప్పుడూ జరగలేదు- తమ కొనుగోలు వస్తువుల కోసం సముద్రాల అవతల నుండి ఇంత ఎక్కువగా విధించి వసూలు చేశారు. గుప్తరాజుల తర్వాత లాభం పొందింది పెద్ద పెద్ద పదవుల్లో ఉన్న జాగీరుదార్లూ, సామంతులు. వీళ్లు ఇటు వ్యాపారస్థుల దగ్గర్నుంచీ అటు చేతిపనివాళ్ళ దగ్గర్నుంచీ కూడా లాభాలు తీసేవారు. బేహారులూ షాహుకార్లూ లాభంపొందేవాళ్ళలో చివరివాళ్ళు. అయినా వీళ్ళ లాభాలూ ఏం తక్కువవి కావు. వీళ్ళ వొంతూ ఎక్కువగానే ఉండేది. గ్రామాల్లోని రైతులూ, చేతిపనివాళ్ళూ ఎందుకింత దారిద్ర్యంతో బాధపడ్తున్నారో, రాజమార్గాలనీ, మార్గాలని వేయించడానికి గుప్త రాజులు ఎందుకింత అసక్తి చూపెడ్తున్నారో నాకు స్పష్టంగా అవగాహనకి వచ్చింది.

గ్రామాల్లో దారిద్ర్యం ఉంది. కాని హృదయవిదారకమైన దృశ్యాలు అక్కడ తక్కువే కనపడతాయి. అక్కడ పశువుల్లాగ దాసదాసీజనాల్ని అమ్మేసంత కూడదు. బరివంటితో ఉన్నవాళ్ళని కొరడాలతో కొట్టే దృశ్యాలూ కనపడవు. మా గురువు కాళిదాసు ఒక సందర్భంలో దీని గురించి మాట్లాడుతూ తమ పూర్వజన్మలో చేసిన కర్మఫలాన్నుంచి దాసదాసీజనాలుగా పుడతారు అని అన్నారు. ఏ రోజైతే నేనామాట ఆయన నోట విన్నానో ఆ రోజు నుంచీ పూర్వ జన్మ అంటే నాకు నమ్మకం లేకుండా పోయింది. తమ అధికారాన్ని దృఢపర్చుకోడానికి మతాన్ని చాలా రకలుగా ఉపయోగించడానికి గుప్తులు ఎంతో హడావిడి పడ్డారు. దాన్నిబట్టి ఆలోచించగలిగిన ప్రతివాడికీ ఈ సంగతి తోచటం సహజమే. అయితే సామాన్య ప్రజలు మాత్రం ఈ విషయంలో ఏ మాత్రం ఆసక్తిలేకుండా ఉండడాన్ని నేను గమనించాను. ఏం, ఎందుకనీ? బహుశా విధిలేక పడివుండేవారేమో! గ్రామస్థులు తమ గ్రామం దాటి బైట ప్రపంచం గురించి ఏం తెలుసుకునేవారు కాదు. గ్రామంలో ఓ అంగుళంమేర స్థలం కోసం యుద్ధం చేయగల్గేవారు. బహుశా కుమారగుప్తుడు కూడా తన భుక్తి (ప్రాంతం) కోసం అంతగా యుద్ధం చెయ్యడేమో! అయితే గ్రామం ఆవతల ఏం జరగనీ, వాళ్ళకి ఏం పట్టేదికాదు. ఓ గ్రామంలో జరిగిన సంగతి నాకు జ్ఞాపకం ఉంది. ఆ ఊళ్ళో దగ్గర దగ్గర నలభై గడప ఉంది. అన్నీ గడ్డి ఇళ్లే. ఎండాకాలంలో పొయ్యిలోని నిప్పు నెరుసుపడి ఓ ఇంటికి నిప్పంటుకుంది. ఊళ్ళో వాళ్ళంతమందీ నీళ్ళు పట్టుకుని ఆ యింటి వేపుకి పరిగెట్టారు. కాని ఓ ఇంట్లో మాత్రం దంపతులు కుండలతో నీళ్ళు పట్టుకుని తమ ఇంటిదగ్గరే చూచున్నారు. అదృష్టవశాత్తూ ఆ ఊళ్ళో ఆ ఒక్క ఇంటివాళ్లే అలా చేశారు. లేకపోయినట్లైతే ఊళ్ళో ఒక్కటంటే ఒక్క ఇల్లూ మిగిలేదికాదు. ఈ సంఘటన నాకు యౌధేయుల గణాన్ని గుర్తుకుతెచ్చింది. ఓ రాష్ట్రంలోని వాళ్ళంతా తమ రాష్ట్రం కోసం ప్రాణాలకి తెగించటానికి సిద్ధపడ్డారు. బతికితే అందరూ బతకాలి, చనిపోతే అందరూ చనిపోవాలి. తమగణరాజ్యం మాత్రం వుండాలి. సముద్రగుప్తుడి దండయాత్రలకోసం, చంద్రగుప్తుడి,కుమారగుప్తుడి దిగ్విజయాలకోసం లక్షలాదిమంది తమప్రాణాలనిచ్చారు. కాని బానిసల్లాగ ఇతరుల లాభం కోసం తమ ప్రాణాలని ధారపోశారు తప్పించి స్వేఛ్ఛా స్వాతంత్ర్యం వున్న మనుషుల్లాగ తమ మేలుని కోరి, తమ వాళ్ళ మేలు కోసం ఏమీ ప్రాణాలు ఇవ్వలేదు. ఓ వంద సంవత్సరాల గుప్త పరిపాలన ప్రజల మీద ఎలాంటి ప్రభావాన్ని కలిగించిందో! ఆలోచించినప్పుడల్లా నా గుండె భయంతో ఆదిరపోతూ వుంటుంది. వీళ్ళ ఈ పరిపాలన శతాబ్దాల తరబడి సాగిందా ఈ దేశం బానిసలదేశంగా తయారవుతుంది. ఇక్కడి జనానికి కేవలం తమ రాజుల కోసం ప్రాణాల్ని ఒడ్డి పోరాడ్డం మాత్రమే తెలుస్తుంది. మనిషన్నవాడికి కొన్ని హక్కులుంటాయన్న సంగతి కూడా వాళ్ళకి తెలీకుండా పోతుంది.

అచింత్యవిహారం చాలా పెద్దదీ, అందమైనదీనూ. ఆకుపచ్చదనంతో ఆవరించుకుని ఉన్న ఓ కొండప్రాంతం — ఆ ప్రాంతాన్ని అర్ధచంద్రాకారంలో చుట్టుకుని పారుతున్న ఓ చిన్ననది. ఎప్పుడూ నీటితో నిండుగా ప్రవహించే ఈ చిన్ననదికి ఎడమ ఒడ్డుని ఉన్న కొండని దొలిచి శిల్పులు ఎన్నో గుహల్ని అందమైన శిల్పాలతో నిండిన గృహాలుగానూ, నివాసస్థానాలుగానూ, సభాభవనాలుగానూ నిర్మించారు. ఈ గుహల్లో కూడా రాజ ప్రసాదాల్లో లాగానే చిత్రాల్ని శిలాప్రతిమల్ని తీర్చిదిద్దారు. బహుశా ఎన్నో తరాల వారు వీటిని నిర్మించి ఉంటారు, రాబోయే వందలాది తరాల కోసం! అచింత్యవిహారంలో గోడలమీద చిత్రించిన చిత్రాలూ, రాతి శిల్పాలు అందమైనవి. అయితే గుప్తుల రాజప్రాసాదాలకి దీటైనవి కావు. అంచేత అవి నన్నాట్టే ఆకర్షించలేదు. ఇక్కడున్న భిక్షుమండలి నా దృష్టిని ఎక్కువగా ఆకట్టుకుంది. ఆ మండలిలో దేశదేశాంతరాలనుంచి వచ్చిన వ్యక్తులు ఓ కుటుంబం వాళ్ళలా కలసి మెలసి ఎంతో ప్రేమతో ఒకే చోట ఉన్నారు. అక్కడ చైనా లాంటి దూరదేశం నుంచి వచ్చిన భిక్షువుల్ని చూశాను. పెర్షియానుంచీ గ్రీసునుంచీ వచ్చిన భిక్షువుల్ని చూశాను. సింహళం నుంచీ, జావా నుంచీ, సువర్ణద్వీపం నుంచీ వచ్చిన భిక్షువులూ అక్కడ ఉన్నారు. చంపా ద్వీపం, కంభోజద్వీపం(కాంబోడియా) పేర్లు విన్నాను. అక్కడివాళ్ళ గురించి విన్నాను. ఆ ద్వీపాలవాళ్ళని చూశాను. కపిశా, ఉద్యాన్, తుషార్, కూచాదేశాల పురుషుల్ని పచ్చటి దేహఛాయ కలిగిన వాళ్ళని కాషాయవస్త్రాల్లో భిక్షువులుగా చూశాను.

పై దేశాల గురించి తెలుసుకోవాలన్న ఆసక్తి నాకెంతో వుంది. విదేశాల నుంచి వచ్చిన ఆ భిక్షువులు ఒక్కొక్కరుగాని నాకు తటస్థపడి ఉంటే ఒక్కొక్కరితో ఒక్కో సంవత్సరం గడిపిఉండేవాణ్ణి. ఇక్కడ అన్నతమందీ కలసికట్టుగా ఒక్కసారి ఇంత ఎక్కువ సంఖ్యలో తటస్థపడ్డంతో గర్భదరిద్రుడికి పెద్ద పెన్నిధి దొరికినట్లు అయింది. నా సంతోషానికి అవధుల్లేవు.

నా గురువుగారు చెప్పగా దిఙ్నాగ్‌ని పేరు విన్నాను. కాళిదాసు గుప్తరాజుల్ని, వాళ్ళ రాజరికాన్ని వాళ్ళకీఎంతగానో ఉపకరించే బ్రాహ్మణ మతాన్ని చాలా గట్టిగా సమర్థించేవాడు అన్న సంగతి ఇంతకు ముందే మరో సందర్భంలో చెప్పాను కదా! తన ఈ పనికి దిఙ్నాగుడు చాలా గట్టి అడ్డుపుల్ల అని కాళిదాసుకి తెలుసు. ఈ ద్రావిడ నాస్తికుడంటే ఒక్క విష్ణువే కాదు, ముప్పైమూడు కోట్ల దేవతల సింహాసనాలూ అల్లల్లాడిపోతాయని ఆయన చెప్తూ ఉండేవాడు. మతం పేరుతో, రాజుల స్వార్థం కోసమూ, బ్రాహ్మల స్వార్థం కోసం మనం ఏ ఏ మోసాలూ కుతంత్రాలూ చేస్తున్నామో వాటి కథా కమామీషూ ఆయనకి తెలియని సంగతులేం కావు. వచ్చిన బాధల్లా అతనికి వృద్ధుడైన వసుబంధువులాంటి గురువు దొరకడం. కాళిదాసు వసుబంధుని జ్ఞానసముద్రుడనేవాడు. రెండో చంద్రగుప్త విక్రమాదిత్యుని రాజధాని అయోధ్యలో ఆస్థాన పండితుడుగా కాక, స్వతంత్రంగా గౌరవనీయుడైన గురువుగా

భదంత వసుబంధువు ఎన్నో సంవత్సరాలు ఉన్నాడు. అయితే తర్వాత్తర్వాత గుప్తుల నీచభావాలకి విసుగెత్తిపోయి తన జన్మస్థలం పురుషపురం (పెషావరు)కి వెళ్ళిపోయాడు. లోహంతో చేసిన బాణాలూ, కత్తులూ, కాదు దిఙ్నాగుడు లోకానికి ఇస్తే! వాటికన్నా పదునైన జ్ఞానాన్ని తర్కాన్ని ఆయుధాలుగా ప్రపంచానికి పంచిపెట్టాలని దీక్ష పూనాడు. ఆయనతో ఓ అరగంట మాట్లాడితే చాలు బ్రాహ్మల మాయాజాలం నాచు చెదిరిపోయినట్లు చెదిరిపోతుంది. నేను అచింత్య విహారంలో ఆరు నెలలు ఉన్నాను. ప్రతీరోజూ దిఙ్నాగ్ నోట వెలువడే ఉపదేశాల్ని సర్వత్రా ప్రకాశాన్ని ప్రసరింపచేసే వచనాల్ని విన్నాను. దిఙ్నాగుడి లాంటి గురువు నాకు దొరికాడని నేనెంతో గర్వపడుతున్నాను. ఎంతో లోతైన జ్ఞానం ఉన్నవాడు. ఆయన నోట వెలువడే మాటలు సెగలుకక్కే అగ్నికణాలు, నాలాగే ఆయనా ప్రపంచంలోని మోసాన్ని, కపటాన్ని, నటనని, మాయని చూసి కోపంతో మండిపడుతూ ఉండేవారు. ఓ రోజు ఆయన ఇలా అన్నారు:

"సుపర్ణా! ప్రజాశక్తితోనే మనం కొంత సాధించగలం. కాని ప్రజలు చాలా భ్రమల్లో పడిపోయారు. తథాగతుడు (బుద్ధుడు) జాతివర్ణభేదాల్ని రూపుమాపడానికి గట్టి ప్రయత్నాలు చేశాడు. కొంతవరకూ కృతకృత్యుడయ్యాడు. విదేశాల నుంచి గ్రీకులు, శకులు, గుర్జరులు, ఆభీరులు-మన దేశం వచ్చిన వాళ్ళందర్ని బ్రాహ్మలు మ్లేచ్ఛులు అని అసహ్యించుకునేవారు. కాని తథాగతుడి సంఘం వాళ్ళకీ మానవ హక్కుల్ని సమానంగా ఇచ్చింది. కొన్ని శతాబ్దాల వరకూ భారతదేశంలోని కుల మత భేదభావాలు నశించిపోతాయనే అనిపించింది. కాని భారతదేశపు దురదృష్టం కొద్దీ ఆ సమయంలోనే బ్రాహ్మల చేతికి గుప్తరాజుల అధికారం చిక్కింది. మొట్టమొదటి గుప్తులు వచ్చినప్పుడు బ్రాహ్మలు వాళ్ళనీ మ్లేచ్ఛులనే అనేవారు. కాని వాళ్ళ గౌరవాన్ని పెంచడానికి కాళిదాసు రఘువంశాన్ని, కుమారసంభవాన్నీ రాశాడు. ఆచంద్రార్కం చిరస్థాయిగా తమ రాజవంశాన్ని నిలిపి ఉంచాలన్న పిచ్చి గుప్తులకి పట్టుకుంది. బ్రాహ్మలు వాళ్ళకా నమ్మకం కలిగిస్తూవచ్చారు. మన భదంత వసుబంధువు అలాంటి ఆశలూ నమ్మకాలూ కలిగించలేదు. ఆయనకి లిచ్ఛవుల గణతంత్రాన్ని బట్టి స్థాపించిన భిక్షుసంఘాలంటే అభిమానం. మనస్ఫూర్తిగా వాటి అనుయాయుడు. బ్రాహ్మలు బౌద్ధుల్ని పరమ శత్రువులుగా చూసేవారు. అన్ని దేశాల్లోనూ బౌద్ధులు గోమాంసం తింటారని, దానిని వాళ్ళు విసర్జించరనీ బ్రాహ్మలకి తెలుసు. అందుకని వీళ్ళు భారతదేశంలో మతం పేరుతో గోమాంస విసర్జన, గోబ్రాహ్మణ సంరక్షణనీ ప్రచారం చెయ్యడం మొదలుపెట్టారు. బౌద్ధులు జాతివర్ణ భేదాన్ని రూపుమాపాలని అనుకునేవారు. అంచేత బ్రాహ్మలు కులం నుంచి బహిష్కృతులైన గ్రీకులూ, శకులు మొదలైన వారికి పెద్ద పెద్ద కులాల్లో స్థానం కల్పించడం ప్రారంభించారు. ఇది చాలా గట్టి ఎత్తు. ఈ ఉచ్చులో ఎంతో మంది బౌద్ధ గృహస్థులూ చిక్కుకుపోతున్నారు. ఈ చీలికలతోటీ, భేదభావాలతోటి ప్రజాశక్తిని కుంటుపరచి రాజు బలాన్ని

బ్రాహ్మణుల బలాన్ని దృఢతరం చెయ్యాలని అనుకుంటున్నారు. కాని దీని పరిణామం చాలా ఘోరంగా ఉంటుంది. దేశానికి అరిష్టం. సుపర్ణా! ఎంచేత నంటావా? బానిసల మీద ఆధారపడిన ఏ దేశమూ బలవత్తరం కాలేదు."

మా యౌధేయుల ఆత్మత్యాగం గురించి ఆయనకి చెప్పాను. ఆ కథ విని ఆచార్యులు కరుణతో కదిలిపోయారు. యౌధేయుల ప్రజాస్వామ్యాన్ని పునరుద్ధరించాలన్న నా కోరికని కూడా ఆయనకి నేను తెలియజేశాను.

"నా శుభాకాంక్షల్ని ఆశీర్వాదాన్ని స్వీకరించు. కార్యశీలుడైనవాడు విఘ్నాలకీ, కష్టాలకి భయపడకూడదు." అన్నారాయన.

ఆయన ఆశీర్వాదాన్ని పుచ్చుకుని యౌధేయుల మాతృభూమికి బయల్దేరాను. జీవరహితమైన ఆ భూమికి తిరిగి ఊపిరినిస్తాను. లేదా ఇసకలోని కాలిముద్ర లాగ నశించి పోతాను.

# దుర్ముఖుడు

కాలం : క్రీ. శ. 630.

నా పేరు హర్షవర్ధనుడు.శీలాదిత్యుడు లేదా సదాచారానికి సూర్యుడు అన్నది బిరుదు. రెండో చంద్రగుప్తుడు విక్రమాదిత్యుడు (పరాక్రమానికి సూర్యుడు) అన్న బిరుదాన్ని తన పేరుకి జోడించుకున్నాడు. నేనీ బిరుదాన్ని - మృదువైన దాన్ని నా పేరుకి పెట్టుకున్నాను. విక్రమాదిత్యుడు- అన్న బిరుదులోని పరాక్రమంలో పైవాణ్ణి రక్షించడం, బాధపెట్టడం అన్న భావం ఉన్నాది. కాని శీలం(సదాచారం)లో ఎవర్నీ అణిచెయ్యాలన్న భావం గాని పీడించాలన్న భావం గాని లేదు. గుప్తులు తమని తాము గొప్ప వైష్ణవులం అని చెప్పుకున్నారు. నా పెద్దన్నగారు రాజ్యవర్ధనుడు. శశాంక గౌడుడు విశ్వాసఘాతకుడై ఆయన్ని యవ్వనంలోనే చంపేశాడు. దాన్ని తలుచు కుంటేచాలు నా మనస్సు వ్యాకులపడుతుంది. ఆ రాజ్యవర్ధనుడు పరమబౌద్ధుడు (పరమసౌగతుడు). సుగతుని (బుద్ధుని) లాగానే ఆయన క్షమాశీలి. ఆయన పట్ల నాకెంతో గౌరవం భక్తి (శ్రద్ధలూ ఉన్నప్పటికీ నేనుపరమశైవుణ్ణి అయ్యాను. శైవుణ్ణి అయినప్పటికీ నాకు బుద్ధుడంటే ఎంత శ్రద్ధాభక్తి ఉన్నాయో ఈ భారతదేశం లోనే కాదు, పై దేశాల్లో ప్రపంచమంతా ఎరుగుదురు నా రాజ్యంలో నేను అన్ని మతాలని గౌరవించేటట్టు చేశాను. ప్రజలను రంజింపచేసే ఉద్దేశంతోటే కాదు, నా శీలాన్ని (సదాచారం)సంరక్షించుకోడానికి కూడా నేనా పద్ధతిని అవలంబించాను. ఐదేళ్ళకోసారి నా ధనాగారంలో మిగిలిన దనాన్నంతటినీ ప్రయాగలోని త్రివేణీ సంగమం దగ్గర బ్రాహ్మలకి శ్రమణులకి (బౌద్ధభిక్షువులకి) దానం చేసేవాణ్ణి. నేను అన్ని మతాల అభివృద్ధినీ సమానంగా కాంక్షిస్తున్నానన్న సంగతి ఈ దానాలవల్ల కూడా ఋజువు అవుతోంది. శీలాదిత్యుడన్న బిరుదు నేనింకా స్వీకరించని రోజుల్లో నేనూ సముద్రగుప్తుడి లాగ జైత్రయాత్ర చేశాను. దక్షిణాపథం లోని పులకేశి చేతిలో ఓడిపోటు ఉండకపోయినట్లైతే నేను విక్రమాదిత్యుడిలాగే ఏదో పదవిని స్వీకరించి ఉండేవాణ్ణని మాత్రం అనుకోకండి. యావత్ భారతదేశానికి చక్రవర్తినైనా సరే నేను చం దగుప్తుడిలా తయారై ఉండేవాణ్ణికాను. అశోకుడి కళింగ విజయంలాగ పశ్చా త్తాపపడి శీలస్వభావంతో మనిషి మనస్సుని జయించేవాణ్ణి. నా స్వభావం అంత మెత్తటిది.

రాజ్యాన్ని పొందాలని నేననుకోలేదు. నిరాకరిస్తూనే ఉన్నాను. ఎంచేతంటారా? స్థాణవీశ్వరపతి మహారాజు ప్రభాకరవర్ధనుడి పుత్రుణ్ణి. కన్యాకుబ్జాధిపతి పరమ భట్టారకుడు. మహారాజాధిరాజు రాజవర్ధనుడి తమ్ముణ్ణి నేను రాజభోగాలని చూసి అవి సారహీతమైనవిగా అనుకోలేదు. రాజభోగాలని అనుభవించి నేనా అభిప్రాయానికి వచ్చాను. సోదరుడు చనిపోయిన తర్వాత చాలా రోజుల వరకూ సింహాసనాన్ని అధిష్టించడానికి నిరాకరించాను. సోదరుడి హత్యకి ప్రతీకారం తీర్చుకోవాలన్న క్షత్రియోచితమైన ఆలోచనగాని రాకపోయి నట్లైతే నేను కన్యాకుబ్జపు సింహాసనాన్ని అధిష్టించి ఉండేవాణ్ని కాదు. కన్యాకుబ్జమూ నా సోదరి రాజశ్రీ అత్తవారి వంశం - మౌఖరివంశానికి చెందిపోయి ఉండేది. నిజానికి నా సోదరుడికి ముందు నేనే అక్కడ పరిపాలనని గుప్తులు వెళ్ళిపోయిన తర్వాత నిర్వహిస్తూ ఉండేవాణ్ని. నా తర్వాత నాళ్ళు హర్షుడు స్వార్థంతో కిరీటాన్ని ధరించి రాజ్యాన్ని పాలించలేదన్న సంగతి తెలుసుకోవాలనే ఇదంతా చెప్పుకువస్తున్నాను. నా ఆస్థానంలో ఉంటూ స్తోత్రం చేసేవాళ్లు నన్నూ సముద్రగుప్తుడిలాగా,చంద్రగుప్త విక్రమాదిత్యుడి లాగా చేద్దామని చూశారు. అందుకు నాకు చాలా విచారంగా ఉంది. ఆస్థానంలో ముఖస్తుతి చేసేవాళ్ళని ఏ రాజూ వదల్చుకోలేడు! అయితే వీళ్ళు నన్ను కీర్తించే విధానం నాకు న్యాయం చేకూర్చేది కాదు. అన్యాయం కలిగించేది !

నేను రాజ్యాన్ని స్వీకరించాను- శీలరక్షణకి, ధరాన్ని పాలించటానికి, సర్వ ప్రాణులకి మేలు చెయ్యటానికి ! విద్యాదానం అన్నిదానాల్లో గొప్పదానం అని నా భావం. అందుకే గుప్తులకాలం నుంచీ వృద్ధిచెందుతూ వచ్చిన నలందని మరింత అభివృద్ధిపరిచాను. అక్కడ పదివేల మంది దేశవిదేశాల విద్వాంసులూ, విద్యార్థులూ విద్యాధ్యయనం చెయ్యటానికి, హాయిగా ఉండటానికి సౌకర్యం కలిగించాను. విద్వాంసులని గౌరవించటం అంటే నాకు పరమానందంగా ఉండేది. అంచేత చైనా విద్వాంసుడు భిక్షువు వేన్‌చాంగ్‌కి భూరి భూరి సత్కారాలు చేశాను. బ్రాహ్మణుడు బాణుడి అద్భుతమైన కావ్య ప్రతిభని చూసి తప్పు దారిని పట్టిన అతణ్ని సరియైన మార్గానికి తీసుకువద్దామని అనుకున్నాను. కాని అతడు వృద్ధిలోకి రాలేకపోయాడు! కాళిదాసు అడుగుజాడల్లో పడి ముఖస్తుతిచేసే భట్టాజుకవే అయ్యాడు! మగధలోని ఓ చిన్న ఊరు నుంచి వచ్చిన వాణ్ని ప్రపంచం ఎదుటికి తీసుకువద్దామన్న నా ప్రయత్నాన్ని మాత్రం నా విద్యాభిమానానికి తార్కాణంగా తీసుకోవచ్చు.

అందరూ తమ తమ మతాలని అనుసరించి నడవాలని నేను అనుకున్నాను. ఎవరి మతాన్ననుసరించి వాళ్ళు నడవడం మంచిది. దాన్నించి ప్రపంచంలో శాంతి నెలకొని ఉంటుంది. ఇహంలో సౌఖ్యం సంపదా పెరుగుతాయి. పరలోకంలోని మోక్షమూ దొరుకుతుంది. అన్ని వర్గాల వాళ్ళూ తమ వర్ణధర్మాన్ని పాటించాలి. అందరూ అలాగే వారి వారి ఆశ్రమ ధర్మాల్ని పాటించాలి. తమ తమ మత విశ్వా

సాల ననుసరించి అంతమందీ ఆయా విధానాల్లో పూజలూ వ్రతాచరణలూ చెయ్యాలి. ఇవన్నీ జరగాలన్న భావంతో నేనప్పుడూ ఆ విధంగా ప్రయత్నిస్తూ ఉండేవాణ్ని.

కామరూపం (అస్సాము) నుంచి సౌరాష్ట్రం (కాఠియావాడ్) వరకూ, వింధ్య నుంచి హిమాలయాల వరకూ వ్యాపించి ఉన్న నా విశాల రాజ్యంలో న్యాయాన్ని ప్రతిష్ఠించాను. నా ఉద్యోగస్తులు (ఆఫీసర్లు) అన్యాయాలు చెయ్యడానికి ఏ మాత్రం ఆస్కారం లేకుండా మధ్య మధ్య నేను స్వయంగా తనిఖీచెయ్యడానికి దేశమంతా పర్యటిస్తూ ఉండేవాణ్ణి. ఇలా తనిఖీకి ఓ సారి వెళ్ళినపుడే నేను కబురు పంపగా బాణుడు నా దగ్గరికి వచ్చాడు. తనకి తెలిసినంత వరకూ అతడు నా కీర్తిని పెంచుదామనుకున్నాడు. అయితే యాత్రలో ఉన్నప్పుడు నా రాజోచితమైన ఆడంబరాల గురించి అతడు చేసిన వర్ణనలు నా గురించి చేసిన వాటిలా లేవు. ఏ విక్రమాదిత్యుడి ఆస్థానానికో సంబంధించిన వర్ణనలా ఉన్నాయని నేను అనుకున్నాను. జీవితచరిత్రని (హర్షచరితం) రహస్యంగా ఎవరికీ చెప్పకుండా రాస్తున్నాడు. ఓ రోజునా నాకా సంగతి తెలిసిపోయింది. అడిగాను. తాను రాసిన దాన్ని తీసు కొచ్చి చూపెట్టాడు. దాన్ని నేను ఇష్టపడలేదు సరికదా చీవాట్లు పెట్టాను. దాంతో అతడు దాన్ని అంత ఉత్సాహంగా తర్వాత రాయలేకపోయేడు. అదీ నా చీవాట్ల పరిణామం. అతని కాదంబరి నాకు ఎక్కువ నచ్చింది. అయితే దాన్లో రాజాస్థానం గురించి, రాణీవాసం గురించి, పరిచారికలు, పరిచారకులు, ప్రాసాదాలు, తోటలు మొదలైనవాటి గురించి చేసిన వర్ణనలు అన్నీ నా రాజాస్థానాన్ని వర్ణించేడేమోనని ఉట్టుట్టిభ్రమలు జనానికి కలిగేటట్టుగా ఉన్నాయి. నాకు నా పారశీకపు రాణి అంటే చాలా ప్రేమ. ఆవిడ నౌశేర్వా మనమరాలే కాదు, తన గుణాలతో తన చక్కని రూపంతో ఏ పురుషుణ్నైనా సరే మోహంతో ముంచెత్తెయ్యగలదు. బాణుడు ఆవిణ్ణి మహాశ్వేత పేరుతో కాదంబరిలో వర్ణించాడు. నా సౌరాష్ట్రపు రాణి కాస్త వయస్సు మళ్ళిన తర్వాత నా అంతఃపురానికి వచ్చింది. ఆవిణ్ణి తృప్తిపర్చడానికి ఆవిడ ప్రసాదాన్ని అలంకరించడానికి ప్రత్యేకమైన ఏర్పాట్లు చేశాను. బాణుడు ఆవిణ్ణే కాదంబరిగానూ, ఆవిడ భవనాన్నీ వర్ణించాడు. బాణుడి కావ్యంలో ఈ రెండు విషయాల్ని వదిలేస్తే మిగిలిన వర్ణన ఏదీ నాకు వర్తించదు. మిగిలిన వర్ణనంతా అతిశయోక్తే అని చెప్పాలి.

నా జీవితపు ఆఖరి రోజులలో బాణుడు నా శ్రేయోభిలాషి కాలేదని నాకుఅనుభవంలోకి వచ్చింది. బాణుడు హర్షచరితంలోనూ, కాదంబరిలోనూ రాజుల గురించీ, వాళ్ళ ఐశ్వర్యాల గురించీ చేసిన వర్ణనలు చదివి అవి నన్ను గురించి చేసినవే అని జనం అనుకుంటారు. పోతే నాగానందం, రత్నావళి, ప్రియదర్శిక నాటకాల్ని నా పేరునే రాసి మరింత అనర్థాన్ని చేశాడు. కీర్తికాంక్షతో డబ్బిచ్చి ఇతరుల గ్రంథాలని హర్షుడు తన పేరు పెట్టుకుని కొనుక్కున్నాడు అని జనం చెప్పుకుంటారు. నిజం చెప్తున్నాను, ఈ సంగతి నాకు తర్వాతర్వాత తెలిసింది. అప్పటికే వేలకొద్దీ

విద్యార్థులు నా పేరుతోనే ఈ గ్రంథాలని చదివారు. ఎన్నోసార్లు ఆ నాటకాలు అద్దమూ జరిగిపోయింది.

నా ప్రజలు సుఖంగా వుండాలని నేను అనుకునేవాణ్ణి. అలా వుండేటట్టు చూశాను. నేను నా రాజ్యం శాంతి భద్రతలతో వుండాలని అనుకునేవాణ్ణి. చివరికి ఈ నా కోరిక కూడా తీరింది. నా రాజ్యంలో ప్రజలు కావల్సినంత బంగారం పట్టుకుని ఓ చోటు నుంచి మరో చోటుకి నిర్భయంగా వెళ్ళగలిగేవారు.

నాది వైశ్యకులం అని వెనకచాటుగా ఇప్పటికీ జనం చెప్పుకుంటూవుంటారు. అయితే యిది పచ్చి అబద్ధం. మేం వైశ్య క్షత్రియులం, వైశ్య వ్యాపారస్తులం (కోమట్లం) కాం. ఒకానొకప్పుడు మా శాతవాహన కులమే యావత్ భారతదేశాన్నీ రాజ్యమేలింది. శాతవాహన రాజ్యం ధ్వంసం ఐపోయిన తర్వాత మా పూర్వీకులు గోదావరి ఒడ్డున వున్న ప్రతిష్ఠానపురాన్ని (పైఠను) వదిలేసి స్థాణీశ్వరం (థానేసర్) వచ్చేశారు. శాతవాహన (శాలివాహన) వంశం కోమట్ల వంశం. వ్యాపారస్థులది కాదు. ఈ సంగతి లోకమంతా ఎరుగుదురు. అయితే వాళ్ళ వైవాహిక సంబంధాలు శక క్షత్రియులతోనూ వుండేవి. రాజులకి తగిన సంగతే అది! నా ప్రియురాలు మహాశ్వేత కూడా పారశీక రాజవంశానికి చెందినావిడే!

## 2

నా పేరు బాణుడు. నేను ఎన్నో కావ్యాలూ, నాటకాలూ రాశాను. నన్ను వాటితోనే జనం అంచనా వేయాలని అనుకుంటారు. అందుకే ఈ వ్యాసం రాయవలసి వచ్చింది. ప్రస్తుతపు ఈ రాజవంశపు కాలంలో ఈ వ్యాసం బైటికిరాదని నాకు కచ్చితంగా తెలుసు. దీనిని నేను సురక్షితంగా ఉంచే ఏర్పాట్లు చేశాను. రాబోయే కాలంలోని జనం నా గురించి తప్పుడు అంచనాలు, అభిప్రాయాలు ఏర్పరచుకోకుండా ఉండటానికి యిది సహాయపడుతుంది. నా ప్రసిద్ధ రచనలు చదవడానికి ముందు ఈ వ్యాసాన్ని వాళ్ళు చదవాలి మరి.

హర్షుడు నిండు సభలో నన్ను విషయలోలుడు (లంపటుడు) అన్నాడు. జనానికి దాన్నించి భ్రమ కలిగవచ్చు. మా తండ్రి బాగా ధనవంతుడు. నేనతనికి ముద్దుల కొడుకుని. భాసుడి రచనలు, కాళిదాసు రచనలు చదివి నాలో రసికత్వం ఎక్కువైంది. అందులో ఏం అబద్ధంలేదు. నేను అందమైనవాణ్ణి, యువకుణ్ణీను. దేశాటనం అంటే ఎంతో సరదా వున్నవాణ్ణి. యవ్వన సుఖాలని అనుభవించాలని అనుకున్నాను. కావాలంటే మా తండ్రిలాగానే ఇంటిపట్టున ఉంటూ అవన్నీ పొందగలిగి వుండేవాణ్ణి. అయితే నాకు అలా పొందడం పెద్ద బూటకంగా, కపటంగా అనిపించింది. లోపల కామేచ్ఛతో స్వేచ్ఛావర్తనం కలిగి బైటికి మాత్రం తననితాను

జితేంద్రియుడిగా, సంయమం కలవాడిగా, మహాత్ముడిలా, ఉపాసకుడిలా చెప్పు కోడం అన్నది నాకు చాలా పెద్ద విషయంగా తోచింది. జీవితం మొత్తంలో ఎప్పుడూ అలా చెయ్యడం నాకు నచ్చలేదు. ఏం చేసినా బహిరంగంగా చేశాను. మా తండ్రి మరో వర్ణానికి-మరో జాతికి చెందిన పుత్రుణ్ణి తన పుత్రుడేనని ఒక్కసారంటే ఒక్క సారి చెప్పడానికి ధైర్యం చెయ్యగలిగాడు. కాని అది యవ్వనంలో జరిగే "పాపం"గా లెక్కపెట్టబడింది. యవ్వనపు సౌఖ్యాలను జుర్రుకుందామని నాకు ఉంది. ఐతే నా జన్మస్థలంలో కుదరదు. అక్కడ జాతివాళ్ళంతా కులంవాళ్ళంతా కోపగిస్తారు. పైగా ధనం సంపత్తిని కూడా వదులుకోవలసి వస్తుంది. నాకు ఓ మంచి పద్ధతి కనిపించింది. నేనో నాటక సమాజాన్ని స్థాపించాను. మగధలో కాదు, మగధ వది లేసి వెళ్ళేకే! నా యువ మిత్రులందరూ బైటవాళ్ళే. గుణవంతులూ, కళాకౌశల్యం వున్నవాళ్ళూనూ. ధూర్తుల్ని ముఖస్తుతిచేసే కాకారాయళ్ళనీ, మనల్ని మూర్ఖుల్ని చేసేవాళ్ళనీ నేనెప్పుడూ ఇష్టపడేవాణ్ణి కాదు. నాటక సమాజంలో ఎంతోమంది యువ తుల్ని కూడా చేర్చాను. అంతమందీ వారాంగనలే (వేశ్యలు)కారు. ఇదిగో ఈ పర్య టన సందర్భంలోనే నేను రత్నావళి, ప్రియదర్శిక మొదలయిన నాటకాల్ని,నాటికలని రాశాను. యవ్వనపు ఆనందాన్నీ కళనీ మిశితం చేసేశాను. దాంతో కళా సేవ జరి గింది. నా కళాసేవని చూసి సహృదయులు నన్ను ప్రశంసిస్తారు. జీవిత సౌఖ్యాలన్నీ పొందాను.దాంతోపాటు మీకు రత్నావళి, ప్రియదర్శిక మొదలైనవాటినీ ఇచ్చాను. మిగి లిన భోగలాలస కలిగిన విలాస పురుషులు వున్నారు-వాళ్ళకి వాళ్ళ ఆనందమే సర్వ స్వమూ. ఇంకేం అక్కర్లేదు. హర్షచక్రవర్తిని ప్రసన్నంచేసుకోడానికి నా నాటకాన్ని అతని పేరుతో రాశానని జనం అంటారు. కాని నేను ప్రవాసంలో ఉంటూ ఈ నాటకాలు రాశాను అప్పుడు నాకు హర్షుడి పేరు మాత్రమే తెలుసును. ఈ సంగతి జనానికి తెలీదు. హర్షుడు నన్ను పిలిచి తన ఆస్థానకవిగా చేసుకుంటాడన్న విష యమూ నాకప్పుడు తెలీదు. నన్ను నేను లోకానికి చాటుగా కళ్ళబడకుండా ఉంచుకో డానికి మాత్రమే ఆ నాటకాలకి హర్షుణ్ణి కర్తగా ప్రకటించాను. ఈ నాటకాలని చదివినవాళ్ళకి వాటి విలువ తెలుస్తుంది. అవి సరికొత్త నాటకాలు. నా ప్రేక్షకుల్లో గుణగ్రాహ్యత కలిగిన వాళ్ళూ ఎక్కువమంది వుండేవారు. పండితులు రాజులు కళాకోవిదులు ప్రముఖంగా వచ్చేవారు. వాళ్ళకి గాని తెలిసిపోతే నేను మరి నాటక సమాజానికి సూత్రధారుడిగా వుండలేక పోయేవాణ్ణి. జనం మహాకవిగా బాణుని వెంటపడేవారు, హర్షుడిని వదిలేసి! కామరూపం (అస్సాం) నుంచి సింధు వరకూ హిమాలయం నుంచి సింహళంలోని అనురాధపురం వరకూ అన్ని రాజాస్థానాల లోనూ నా నాటకాలు ఆడాను. కామరూపేశ్వరుడికీ, సింహళేశ్వరుడికీ, కుంతలేశ్వరు డికీ ఈ నాటకాలు రాసిన రచయిత, మహాకవీ ఈ బాణభట్టుడే అని తెలిసి పోయిం దనుకోండి. ఇహ నా పర్యటనా, నా సరదా అనుభవాలూ ఎక్కడుంటాయి? ఆసాన కవి కావాలని నేనెప్పుడూ అనుకోలేదు. హర్షుడి రాజ్యంలో నివసించేవాణ్ని కాక

పోయి ఉంటే అతని ఆస్థానంలోనూ కవిగా ఉండేవాణ్నికాదు. నాకు నా తండ్రి ఆస్తీ సంపత్తీ కావల్సినంత ఉంది.

హర్షుడు అన్నట్టూ నేనుట్టి వేశ్యాలంపటుణ్ని అని మీకు అనిపించవచ్చు. నా నాటక సమాజంలో వేశ్యలు చాలాతక్కువ. ఉన్నవాళ్ళనైనా, సంగీతం, నృత్యం, అభినయం కళలు తెలిసినవాళ్ళని నేను చేర్చుకున్నాను. నా నాటకాలకి వచ్చే యువ తారలు వేరేరకంగా వచ్చేవారు. ముందు ముందు ఏమవుతుందో నాకు తెలీదు కాని ఆరోజుల్లో దేశంలోని యువతులందరూ రాజుల సొత్తుగానో, లేకపోతే వాళ్ళ సామం తుల సొత్తుగానో భావించబడేవారు. ఆ యువతులు బ్రాహ్మణకన్యలు కానివ్వండి, క్షత్రియకన్యలు కానివ్వండి అంతమందినీ అలాగే భావించేవారు. నామేనత్తనిమగధలోని ఓ మౌఖరి సామంతుడు బలవంతంగా వుంచుకున్నాడు. అతడు చనిపోయాడు. మేన త్తకి వయస్సు ఉడిగిపోయింది. ఆవిడ మా ఇంట్లోనే ఉంటూ వుండేది. ఆవిడకి నేనంటే చెప్పలేనంత అభిమానం. నేనెప్పుడూ ఆవిడకీ ఆ సామంతుడికీ వున్న సంబంధం గురించి ఏమీ పట్టించుకునేవాణ్ని కాదు. పాపం ఆడది. ఆవిడ తప్పే ముంది? అందమైన యువతులు తక్కువ మందే వుంటారు. రాజులూ, వారికి సామంతులు కొంతమందికీ యువతుల్ని పొందడానికి మొదటిహక్కు వుంది. అలాం టప్పుడు ఒక్కొక్క సామంతుడికి ఎంతమంది అందమైన యువతులు దొరకగలరో మీరే అంచనా కట్టుకోగలరు. ఈ యువతుల్ని స్వీకరించే విషయంలోనూ రాజులూ, సామంతులూ కొన్ని పద్ధతుల్ని ప్రవేశపెట్టారు. వాటిని జనం ధర్మమనీ రివాజా పద్ధతీ అనీ అనుకునేవారు. తమ కూతుళ్ళనీ, కోడళ్ళనీ అప్పచెల్లెళ్ళనీ పల్లకీల్లో కూచో పెట్టి అంతఃపురానికి ఓ రాత్రికోసం పంపించేవారు. పల్లకీ పంపించకపోవడం అంటే నెత్తికి సర్వనాశనం తెచ్చుకోవడం అన్నమాటే. మనస్సుకి నచ్చిందా ఆ యువతిని అంతఃపురంలో వుంచేసుకునేవారు. రాణీ హోదా ఇచ్చికాదు - పరిచారికగా-రాణీ అయ్యే అదృష్టం రాజకుమార్తెలకీ, సామంతకన్యలకి మాత్రమే వుండేది. అంతఃపు రంలోని ఈ వేలాది యువతుల్లో చాలామందికి రాజుగారితోగాని సామంతునితోగాని ఓ రోజుకన్నా ఎక్కువ పర్యాయాలు సమాగమం జరిగేదికాదు. వాళ్ళ యవ్వనం వాళ్ళని ఏం అభ్యర్థించేదో మీరే చెప్పండి! నా అభినేత్రులు ఎక్కువ మంది ఈ అంతఃపురాలనుండే వచ్చేవారు. దొంగతనంగా పారిపోయిరావడం కాదు! నాలో ఉన్న ఈ గుణం మంచిదనండి, చెడ్డదనండి, నాకు రాజుల్నీ సామంతుల్నీ క్షణంలో నావేపుకి తిప్పుకో గలిగిన నైపుణ్యం వుంది. రాజనీతిలో కాదు సుమండీ—దానికి నాకూ ఏం సంబంధంలేదు. రాజులూ వాళ్ళ సామంతులూ నన్ను ప్రశంసిస్తూ రాసిన ఉత్తరాలు వందల సంఖ్యలో ఉన్నాయి. ఆ ఉత్తరాలు సాక్ష్యం-రాజుల్నీ సామంతుల్నీ నావేపుకి తిప్పుకోగల్గిన నా నైపుణ్యానికి! వాళ్ళ కళని ప్రశంసించే సరికి నేను నా కళాకారుల కష్టాన్ని ఏకరువుపెట్టేవాణ్ని.

"ఏం చెయ్యగలం దేవా! కళాకారిణులు ఉన్నారు. అయినాసరే దొరకటం లేదు!"

"ఉన్నా దొరకటంలేదా?"

"ఒకే ఒక్కరోజు ముద్దులాడ్డానికి, ఒకే ఒక్కరోజు ఆలింగనసుఖం పొందడానికి, లేదూ ఒకే సెజ్జమీద పవళించడానికి వెళ్ళిన యువతుల్ని లక్షలాది మందిని అంతఃపురాల్లో బంధించేసి వుంచేస్తే మరి కళాకారిణులు ఎక్కడ దొరుకుతారు?"

"ఆచార్యా! సరిగ్గానే చెప్పావు. నేనూ అలాగే అనుకుంటున్నాను. అయితే ఓసారి అంతఃపురంలోకి తీసుకువెళ్ళాక మళ్ళీ వాళ్ళని మేం బయటికి ఎల్లా పంపించం?"

దీనికి నేను ఓ చిట్కా చెప్పాను. నృత్యం సంగీతం నేర్చుకోవడం అన్నది మన రాజకుమార్తెలకూ, సామంతుల అమ్మాయిలకూ రాజాంతఃపురాలలో వుండే యువతులకూ తప్పనిసరి. ఈ విద్యలు ఆహారం పానీయం ఎంత అవసరమో అంత అవసరమైనవి. నేను నా దగ్గరున్న చతురులైన స్త్రీలని పంపించుతాను. రాజు తన అంతఃపురంలో ఉన్న యువతుల్ని సంగీత నృత్య కళలని నేర్చుకోడానికి వాళ్ళదగ్గరకి వెళ్ళమని చెబుతాడు. ఏ యువతులైనైతే మేం తెచ్చుకోవాలనుకుంటామో వాళ్ళకి అంతఃపురంలోని కష్టాల్నీ కళాకారిణిగా అయితే వచ్చే సుఖాల్నీ వర్ణించి చెప్పేవాళ్ళం. దాంతోపాటు మా నాటక సమాజంలోని మంచి నైపుణ్యం వున్న నటీమణిని రాజు అంతఃపురంలో ఎంత గొప్ప స్థానంలో ఉంచాడో కూడా చెప్తాం. ముందు ముందు నీకూ అలాంటి యోగం కలగొచ్చు, మా సమాజంలోగాని వుంటే అని ఆశ చూపెడ్తాం. ఇలా చెప్పేసరికి యువతుల్లో చాలామంది మా సమాజంలో చేరటానికి సహజంగా అంగీకరించేవారు. అయితే మేం మాత్రం వాళ్ళలో యోగ్యులైన వాళ్ళనే ఎంచుకునేవాళ్ళం. రాజులు జీవితంలో ఒకే ఒక్కసారి సమాగమానికి వేలకొద్దీ యువతులని అంతఃపురాల్లో నిరోధించి ఉంచేవారు. అయితే అంతఃపురాల్లో పురుషుల ప్రవేశ నిషిద్ధం అని గట్టి బందోబస్తు వున్నా దాని వల్ల పెద్ద ప్రయోజనం ఉండేది కాదు. ముసలి అంతఃపుర రక్షకులు లేదా బ్రాహ్మలు ఆ యువతుల యవ్వనలాలసలని ఏం ఆపలేకపోయేవారు.

విధవలైన స్త్రీలు సహగమనం చెయ్యడాన్ని నేను అడ్డుకున్నాను. దాంతో బూటకపు రాయళ్ళు - ఈ ప్రపంచంలో బ్రాహ్మలకన్నా క్షత్రియులకన్నా బూటకపు రాయళ్ళు మరింకెవరూ ఉండరు-ఏదో కొంపలు మునిగిపోయినట్టు నానాగోలా రభసా చేశారు. భ్రూణహత్యలనీ, విధవావివాహాలనీ సమర్థించి వాటిని పెంచాలని చూస్తున్నాడు అని అనడం మొదలుపెట్టారు. భ్రూణహత్యలని నేను బొత్తిగా ఇష్టపడను. అయితే విధవావివాహాల్ని ఇష్టపడతాను అని చెప్పడానికి గాని ఆ మాటని స్వీకరించడానికి గాని నాకేం అభ్యంతరంలేదు. గుప్తుల పరిపాలనాకాలంలో మన ప్రాచీన ధర్మాలు ఒకదానికొకటిగా మారిపోయాయి. మన శ్రోత్రియులు

పూర్వం ఆవుదూడ మాంసం లేకుండా ఏ ఆతిథ్యాన్నీ స్వీకరించే వారు కాదు. అలాంటిది ఇప్పుడు గోమాంసభక్షణం ధర్మవిరుద్ధంగా ఎంచబడుతోంది. మన ఋషులు విధవస్త్రీలకి మరిది - రెండోవరుడు కావడాన్ని పూర్తిగా ఉచితమేనని అనుకునేవారు. యవ్వనంతో ఉన్న ఏ బ్రాహ్మణ విధవరాలుగాని క్షత్రియ విధవరాలుగాని ఆర్నెల్లు లేదా ఏడాదికన్నా ఎక్కువ కాలం భర్తృరహితగా ఉండడానికి వీలులేదు. అలాంటిది ఇప్పుడు దాన్ని ధర్మవిరుద్ధం అనుకుంటున్నారు. ఇదిగో ఈ కుత్సితాలకన్నిటికీ-ఈ కొత్త (హిందూ) ధర్మానికి మూలం అయిన గుప్తరాజవంశంలోనే రామగుప్తుడి భార్యని (విధవ కాదు సధవ!) చంద్రగుప్త విక్రమాదిత్యుడు తన పట్టపు రాణిగా చేసుకున్నాడు. యువతి అయిన స్త్రీని విధవరాలిగా బ్రాహ్మలు కాదు ఆ విష్ణు మహేశ్వరులు కూడా ఉంచలేకపోతున్నారు. అయినా ఏ మొహం పెట్టుకుని వాళ్ళు ఉంచగల్గుతారు? భార్యలుంటూ ఉండగా తామేమో ఇతర స్త్రీల కోసం వెంపర్లాడ్డం మానలేరుకదా! యువతుల్ని విధవరాళ్ళుగా ఉంచితే భ్రూణహత్యలు జరగడం అన్నది తప్పనిసరి పరిణామమే అవుతుంది. ఎంచేతా అంటే పిల్లని కనిపెంచడం అంటే విధవా వివాహాన్ని అంగీకరించడం అని అర్థం. దాన్నించి వాళ్ళు దూరంగా తప్పుకుని ఉందామని అనుకుంటున్నారు. ఇదిగో ఈ భయంతోనే ఇప్పుడు బ్రాహ్మలూ, సామంతులూ తమ కులీనత్వాన్ని ఋజువు చేసుకోడానికి ఓ కొత్త పద్ధతిని కనిపెట్టారు. అదే విధవలని సజీవంగా దహనం చెయ్యడం. స్త్రీని ఇలా సజీవంగా దహనం చెయ్యడాన్ని వాళ్ళు మహాపాపం అని అనరు. మహాపుణ్యంగా భావిస్తారు. ప్రతీ సంవత్సరం లక్షలకొద్దీ యువతులు బలవంతంగా అగ్నిలో భస్మం అయిపోవడం చూసి దేవతల గుండె కరగకుండా ఉందీ అంటే ఆ దేవతలు వాస్తవానికి రాతిదేవతలైనా అవాలి లేదా దేవతలు కానన్నా కాక పోవాలి. స్త్రీ తన యిష్టంతో స్వేచ్ఛగా సహగమనం చేస్తోంది అంటారు! నరాధములారా! ధూర్తులారా! బూటకపు పెద్ద మనుషులారా! ఇంత అబద్ధం ఎందుకు ఆడుతున్నారు? ఈ రాజాంతఃపురంలోని వందలాది స్త్రీలని - రాజుగారి స్పర్శని ఒకే ఒక్కసారి పొందిన ఈ స్త్రీలని అగ్నికి ఆహుతి ఇచ్చి సహగమనం చేయిస్తున్నారే-ఈ స్త్రీలలో ఆ ద్విపాదపశువంటే కాస్తన్నా ప్రేమ ఉన్నవాళ్ళు ఎంతమంది ఉన్నారు? ఆ ద్విపాద పశువు వీళ్ళని జీవితాంతం బంధించి ఉంచాడు. అతనంటే ప్రేమ! ! నిజంగా పతీవియోగంవల్ల అగ్నిలో దూకి ప్రాణాలు అర్పించుకునేవాళ్ళు ఒకరిద్దరు కనిపించవచ్చు. అయితే వాళ్ళ ఉన్మాదాన్ని కూడా నాలు గైదు రోజుల్లో శాంతపరచవచ్చు. ఆత్మహత్యా ధర్మం! ఈ బూటకపు పురోహితులూ, రాజులూ సర్వనాశనం కావాలి! ప్రయాగలో ఆ మర్రి చెట్టు-అక్షయ వటవృక్షం మీంచి యమునలోకి దూకి ప్రాణాలు పోగొట్టుకోవడం ధర్మంగా చెప్పారు. దాంతో ప్రతీ సంవత్సరం వేలాది మంది పిచ్చివాళ్ళు చచ్చి స్వర్గం చేరుకుంటున్నారు. కేదార పర్వత మార్గాన్ని మంచులో గడ్డకట్టుకుపోవడాన్ని ధర్మంగా చెప్పారు. దాంతో ప్రతీ సంవత్సరం వందలాదిమంది ఆ సన్మార్గం గుండా

స్వర్గం చేరుకుంటున్నారు. అన్ని రకాల ఆత్మహత్య లని వ్యతిరేకిస్తూ నేను గొడవ చెయ్యలేను. ఎందుకంటే బ్రాహ్మల్లో నేను రాజుదగ్గర ఆశ్రయం పొందాలి.

రాజాశ్రయంలో ఉన్నాను. అయితే కావాలని నేనీ ఆశ్రయాన్ని పొందలేదు. భోగవిలాసాలతో కూడిన జీవితాన్ని సంయమంతో అనుభవించడానికి సరిపడా ధన సంపత్తి నాకు ఉన్నాది. నా కాలంనాటి ధర్మాత్ములైన రాజులకన్నా, బ్రాహ్మలకన్నా నేను ఎక్కువ సంయమాన్ని పాటించగలిగేవాణ్ణి. హర్షుడిలాగా, మిగిలిన రాజర్షుల్లాగా లక్షమంది యువతులను అనుభవించడానికి పందెం కట్టగలిగేవాణ్ణి. మహాఅయితే ఓ నూరుమంది అందగత్తెలతో ఏదో ఓ సమయంలో పొందు నాకు లభ్యం అయివుంటుంది. అయితే నా ఇల్లూ వాకిలీ, ధనసంపత్తీ అంతా హర్షుడి రాజ్యంలో ఉంది. అతని దగ్గర్నుంచి కబురుమీద కబురు దూత తర్వాత మరో దూత వస్తూ ఉంటే రాజాస్థానానికి వెళ్ళకుండా ఎలా నిరాకరిస్తాను? నేనూ అశ్వఘోషుణ్ణి అయితే, ఇల్లూ వాకిలీ కోసం చింతలేకుండా ఉన్నట్లయితే హర్షుణ్ణి ఖాతరు చేసేవాణ్ణి కాదు.

హర్షుడి గురించి నా అభిప్రాయం రహస్యంగా తెలుసుకోవాలని అనుకుంటే అతడు తనకాలం వాళ్ళలో చెడ్డవ్యక్తి కాడు, చెడ్డరాజూ కాదని చెప్తాను. తన సోదరుడు రాజ్యవర్ధనుడంటే అతనికి అపారమైన ప్రేమ. సోదరుడితో సహగమనం చెయ్యాలని మన ధర్మవేత్తలుగాని నియమం పెట్టి ఉంటే, లేదా సూచనమాత్రంగానైనా అని ఉంటే హర్షుడు ఆ పని చేసేఉండేవాడు. అతనిలో చెడ్డలు లేవని కాదు. అన్నిటికన్నా పెద్ద చెడ్డ విషయం అతని ఆడంబరం - ప్రశంసలు పొందాలని ఓ ప్రక్క కాంక్షిస్తూ తను పొగడ్తలకి అతీతుణ్ణన్నట్టూ, తనకి అవేమీ ఇష్టం లేదన్నట్టూ నటిస్తాడు. అందమైన యువతులపట్ల తనకేమీ కాంక్ష లేదన్నట్టు చెప్తూ మరోపక్క యువతులంటే ఎంతో కాంక్ష కలిగిఉండేవాడు. కీర్తి అంటే తెగమోజు పడుతూ తనకే కీర్తి అక్కర్లేదన్నట్లు చెప్తూ తిరిగేవాడు. హర్షుణ్ణి అడక్కుండా నా నాటకాలకి 'హర్షనిపుణకవి'ని రచయితగా ఎందుకుచేశానో ఇంతకు ముందే చెప్పాను. అయితే అతనితో పరిచయం కలిగాక, సన్నిహిత బాంధవ్యం ఏర్పడ్డ తర్వాత 'ఇంకీ నాటకాలని నీ పేరుతోనే, నీవనే ప్రకటించుకో బాణా!' అని హర్షుడు ఎప్పుడూ అనలేదు. ఆ మాట అనడం ఎంతో తేలిక. ఒక్కసారి అతని సామంతుల అస్థానాల్లో "శ్రీహర్ష నిపుణకవి"కి బదులుగా "శ్రీబాణ నిపుణకవి" అని ఆ నాటకాలని ఆడిస్తేచాలు- సరిపోయేది!

లోకవృత్తాన్ని ఎలా ఉన్నదాన్ని అలాగ యథార్థంగా చిత్రించడం అంటే నాకు ఇష్టం. నేను పర్యటిస్తూ పన్నెండేళ్ళు గడిపి ఉండకపోయినట్లైతే నా కిలాంటి కోరిక కలిగి ఉండేది కాదు. అధవా కలిగినా నేను ఆ చిత్రణని సరిగ్గా చెయ్యగలిగి ఉండేవాణ్ణికాదు. అచ్ఛోద సరోవరం గురించి వర్ణించేటప్పుడు నా కళ్ళముందు హిమా

లయ పర్వతలోయల అందమైన ప్రాంతం కదల్లాడేది. జరద్ (ముసిలి) ద్రవిడుణ్ణి ధర్మపరాయణున్ని నేను కూచోపెట్టినచోటు నిజంగా వింధ్యాటవిలో నేను చూసిన ఓ స్థలమే! అయితే ఇంతింతమాత్రం చిత్రించి ఊరుకోవడం నాకిష్టంలేకపోయింది. నేను నా గ్రంథాల్లో హర్షుడివీ, నేను ఎంతో సన్నిహితంగా ఎరిగిన రాజులవీ రాజప్రాసాదాలు, అంతఃపురాలు వాటి సిరిసంపదలు అన్నిటినీ చిత్రించాను. అయితే గుడిసెలనీ, గుడిసెల్లో ఉండే వారి వేదనలని, దుఃఖాలనీ-ఆ జీవితాన్ని నేను చిత్రించలేకపోయాను. ఈ రాజప్రాసాదాలు, ఈ అంతఃపురాల నుంచే ఆ గుడిసెల్లో వాళ్ళ బతుకు అలా ఉండేది! నేను వాటి గురించి చిత్రించి ఉండి ఉంటే ఈ రాజప్రాసాదాలకి, ఈ భోగ భాగ్యాలకి అన్నిటికీ ఎప్పటికి చెరగని కళంకం సిద్ధించి ఉండేది. ప్రతి ఐదేళ్ళకోసారి ప్రయాగలో తన రాజ్య ధనాగారం నుంచి - అబ్బే - మిగిలిన ధనాగారపు సంపత్తిని పంచిపెట్టే హర్షుడు నన్ను అప్పుడు లంపటుడని, విషయలోలుడని మాత్రమే అని తృప్తిపడి వుండేవాడు కాదు! !

# 3

నన్ను దుర్ముఖుడంటారు. ఎంత కటుసత్యాలైనా బెరుకులేకుండా మొహం మీదే చెప్పేసే అలవాటు వున్నవాణి. అందుకే నాకాపేరు వచ్చింది. మా కాలంలో కటు సత్యాలని చెప్పేసేవాళ్ళు అక్కడా అక్కడా ఉండేవాళ్ళు. అయితే వాళ్ళలో కొందరు పిచ్చివాళ్ళమనే వంకతో అలా సత్యాలని చెప్పేవారు. దాంతో వాళ్ళని చాలా మంది పిచ్చివాళ్ళే అనుకునేవారు. మరికొంతమందిని శ్రీపర్వతం నుంచి వచ్చిన గొప్ప సిద్ధులు అని అనుకునేవారు. నేనూ శ్రీపర్వతం నుంచి వచ్చిన ఓ గొప్ప సిద్ధుణ్ణి కాగలిగేవాణ్ణి. అయితే అప్పుడు నా పేరు దుర్ముఖుడు అయ్యేది కాదు. ప్రపంచాన్ని మోసం చెయ్యడం అంటే నాకు ఇష్టంలేదు. ప్రపంచాన్ని మోసం చెయ్యడం అన్నది చూసే నేను నలందని వదిలేసి వచ్చాను. అలా కాకపోతే నేనూ కనీసం అక్కడి పండితుల్లో మహాపండితుల్లో ఒకణ్ణి అయివుండేవాణ్ణి. అక్కడ నేనో మహావ్యక్తిని చూశాను. అతడు చిమ్మచీకట్లలోకి అగ్ని కణాలని విసురుతూ ఉండడాన్ని చూశాను. తన పర అన్న భేదం లేకుండా అంత మందీ అతని వెంట పడ్డం చూశాను. అతని గురించి తెలుసుకోవాలన్న కోరిక మీలో పుట్టింది. అవునా? ఆయన ధర్మకీర్తి. తార్కిక శ్రేష్ఠుడు. వేల సంఖ్యలో ఉన్న గొర్రెలమందలో ఒకే ఒక్క సింహం!

"బుద్ధీ వివేకం కన్నా గ్రంథాలకి ఉన్నతస్థానం ఇవ్వడం, ప్రపంచానికి కర్తా ధర్తాగా దేవుణ్ణి అంగీకరించడం, స్నానం ఆచరించి ధర్మాన్ని పాటించే కోరిక కలిగి ఉండగం, జాత్యహంకారం కలిగి ఉండడం, పాపప్రక్షాళనార్థం శరీరాన్ని కష్ట

పెట్టడం— ఈ ఐదు లక్షణాలు అవివేకుల జడత్వానివి!"* అని నలందలో ఢంకాబజాయించి ధర్మకీర్తి చెప్పాడు.

"ఆచార్యా! మీ అస్త్రాలు చాలా తీక్షణమైనవి. అయితే చాలా సూక్ష్మంగా ఉన్నాయి. జనం దృష్టికి రాలేవు," అని నేను ధర్మకీర్తితో అన్నాను.

"నా అస్త్రాలలోని లోపం నాకూ తెల్సు. ఆ లోపాన్ని సరిచెయ్యాలని అనుకుంటున్నాను. దానికి కవచాన్నైనా ధరించకుండా నేను ప్రచండమైన ఆయుధాల్ని -అందరికీ కనిపించేవాటిని పట్టుకోవాలి. నలందలోని స్థవిరులూ మహాస్థవిరులూ (సాధువులు, మఠాధీశులు) ఇప్పటికే నేనంటే మండిపడుతున్నారు. నలంద ఓతమాషా అనీ, అక్కడికివచ్చే విద్యార్థులు విస్తృతజ్ఞానంతో ప్రకాశవంతులు కాలేరని, తమ జ్ఞానంతో వాళ్ళ అల్పుల్ని అజ్ఞానుల్ని మాత్రమే మెప్పించి కళ్ళు కప్పగలరు నేను చెప్పడంగాని మొదలుపెడితే నాకు ఒక్క విద్యార్థియినా దొరుకుతాడంటావా? శిలాదిత్యుడు ఇచ్చిన గ్రామాలనుంచే సువాసనతో కూడిన సన్నబియ్యం, వండి వార్చిన భోజ్యపదార్థాలు, నెయ్యి, ఖర్జూరం మొదలైనవన్నీ వీళ్ళకి లభిస్తున్నాయి. వాళ్ళ శిలాదిత్యుని భోగభోగ్యాలకి ఎర అయిపోయేరు. అలాంటప్పుడు శిలాదిత్యుడికి వ్యతిరేకంగా ప్రజలు తిరుగుబాటు చెయ్యాలని ప్రజలకి ఎలా చెప్పగలుగుతారు?"

"అయితే ఆచార్యా! ఈ చీకట్లలోంచి బైటపడే మార్గం మీ కేమన్నా కనిపించిందా?"

"మార్గమా? ప్రతీ రోగానికి మందు ఉంటుంది. ప్రతీ ఆపదనుంచి బైటపడ్డానికి ఏదో ఓ తోవ తప్పకుండా ఉంటుంది. కాని ఈ చీకటి నుంచి బైట పడేమార్గం చూడ్డం లేదా ఈ వైతరిణికి వంతెన కట్టడం అన్నది ఓ తరంలో జరిగేది కాదు మిత్రమా! ఇటుచూస్తే వంతెనకట్టే చేతులేమో చాలాతక్కువ! అటేమో. వైతరిణి బలం, చీకటి ప్రాబల్యం చాలా ఎక్కువగా ఉంది."

"అయితే నిరాశేనన్నమాట?"

"నైరాశ్యంతో ఏం చెయ్యలేకపోవడం ప్రపంచాన్ని మోసం చెయ్యడం కన్నా మంచిపనే! మార్గదర్శకులు కావల్సినవాళ్ళు ఎలా లోకవంచకులుగా అవుతున్నారో చూస్తున్నావుకదా!! ఆ పరిస్థితి ఒక్క దేశంలోనేలేదు. ప్రపంచం మొత్తాన్ని కనపడుతోంది. సింహళం, సువర్ణద్వీపం, జావా, కంభోజద్వీపం, చంపాద్వీపం- చీనా, తుషారం, పారస్యం ఒక్కదేశం ఏమిటి ఎక్కడెక్కడ నుండో విద్వాంసులైన

---

* వేద ప్రామాణ్యం కస్యచిత్ కర్తృవాదః
స్నానేధర్మేచ్ఛా జాతి వాదావలేపః।
సంతాపారంభః పాపహానాయ చేతి
ధ్వస్త ప్రజ్ఞానాం పంచలింగానిజాడ్యే॥ —ప్రమాణ వార్తిక.

విద్యార్థులు ఇక్కడ మన నలందాలో లేరో చెప్పు! ప్రపంచాన్ని ఎంత గుడ్డిదానిగా చేసేస్తున్నారో వాళ్ళతో మాట్లాడితే బోధపడ్తుంది. 'ధిగ్ వ్యాపకం తమః' అన్ని దిశలా అంధకారం వ్యాపించి ఉంది."

ధర్మకీర్తి వేలాది సంవత్సరాలు జ్వలిస్తూ నిలిచి ఉండే అగ్నివాక్కులని ఈ అంధకారాన్ని పారదోలడానికి వదిలాడు. కాని వాటిప్రభావం ఆ రోజుల్లో నాకు ఏం కనిపించలేదు.

మందే దివిటీలని వదలాలని నేనూ నిశ్చయించుకున్నాను. దాని ఫలితంగా నేను దుర్ముఖుణ్ణి అయ్యాను. నా మాటల మంటలని ఉపయోగించడానికి ముందు నాక్కూడా రాజ్యాధికారం మీద ప్రత్యక్షంగా దెబ్బతియ్యకుండా ఉండేటట్టు చూసు కోవలసి వస్తోందని మీకు స్పష్టం చేస్తున్నాను. అలాగ్గా నేను నా నోరుని కట్టుకోక పోయానా, దుర్ముఖుడి నోటిని న్యాలోజుల్లో పూర్తిగా మూసుకుపోయేటట్టు చేసేస్తారు! అయినప్పటికీ అప్పుడప్పుడు నేను అందరి కళ్ళూ కప్పి చాలా దూరం దెబ్బ తీస్తూనే ఉంటాను.

నువ్వు చచ్చిపోయేక మోక్షాన్నీ నిర్వాణాన్నీ ఇప్పిస్తానని అంటావు. దాని అర్థం ఏమిటో కాస్త చెప్పూ! లక్షలాది మంది బానిసలు పశువుల్లాగా బంధించబడి అమ్ముడు పోతున్నారు. వీళ్ళకి ముక్తి కలిగేటట్టు ఎందుకు ప్రయత్నించవూ? ఓసారి ప్రయాగ సంబరంలో నేను శీలాదిత్యుణ్ణి ఇదే ప్రశ్న వేశాను. "మహారాజా! ప్రతి ఏటా మీరు గొప్ప గొప్ప బౌద్ధవిహారాలకీ, బ్రాహ్మణులకీ ఇంతింతడబ్బు దానం చేస్తున్నారే! ఆ డబ్బుతో బానిస స్త్రీ పురుషులని విడిపిస్తే అంతకన్నా గొప్ప పుణ్యకార్యం కాదా?"

మరోసారి మాట్లాడుకుందాం అని శీలాదిత్యుడు మాట తప్పించడానికి చూశాడు. అయితే నేను మరోసారి అవకాశాన్ని చిక్కించుకున్నాను. ఈ అవకా శాన్ని రాజుగారి సోదరి రాజ్యశ్రీ భిక్షుణి బలవంతంగా కల్పించింది. నేను రాజ్యశ్రీ ఎదట బానిస స్త్రీ పురుషులు పడే యమయాతనలని వర్ణించి చెప్పాను. ఆవిడ మనస్సు కరిగిపోయింది. డబ్బు ఇచ్చి సనాతన కాలం నుంచీ-తరతరాలనుంచీ బందీలైపోయి బానిస బతుకు బతుకుతున్న ఈ మనుష్యులకి ముక్తికలిగించడం అన్నిటికన్నా గొప్ప పుణ్యకార్యం అని నేనావిడకి చెప్పినప్పుడు ఆ మాట ఆవిడ మనస్సులో గట్టిగా నాటు కుంది. సరళ హృదయురాలు, స్త్రీ, పాపం బానిసత్వంలో దాగి ఉన్న పెద్ద పెద్ద స్వార్థాల గురించి ఆవిడకేం తెల్సు? ఈ భూలోకాన్ని స్వర్గంగా మార్చేస్తే ఆకాశంలోని స్వర్గం నామరూపాలు లేకుండా పోతుందని ఆవిడకేం తెల్సు? ఆకాశ పాతాళాలలో ఉన్నస్వర్గనరకాలు శాశ్వతంగా ఉండడానికి, వాటి పేరుతో వ్యాపారం చెయ్యడానికి భూలోకంలో స్వర్గం నరకం, రాజూ పేదా, బానిసా యజమానీ ఉండడం అవ సరం అని ఆవిడకేం తెల్సు?"

రాజు ఏకాంతంలో నాతో మాట్లాడాడు.

"నేనోసారైతే విపరీతంగా ధనాన్ని ఇచ్చి బానిసలకి ముక్తి కలిగించగలను కాని మళ్ళీ బీదరికంతో వాళ్ళు అమ్ముడుపోతారే!"అని రాజు మొదట అన్నాడు.

"భవిష్యత్తులో మనుష్యులను అమ్మడం కొనడం అన్నది చేస్తే శిక్షపడుతుందని చట్టం చెయ్యండి."

అతడు ఏం మాట్లాడకుండా ఆలోచనలో పడ్డాడు. నాగానందంలోని నాగుడి ఉదాహరణ ఎత్తి చూపెట్టాను. నాగుడు ఇతరుల ప్రాణాలు రక్షించడానికి తన ప్రాణాల నివ్వడానికి చూశాడు. "నాగానందం" నాటకం హర్షుడు రాశాడని చెప్తారు. అలాంటప్పుడు అతనేం సమాధానం చెప్పగలడు? బానిస స్త్రీ పురుషులకి ముక్తి కలిగిస్తే అతనికి అంతకీర్తి రాదు. బౌద్ధ భిక్షువులకీ బ్రాహ్మణులకీ దానం చేస్తే, పెద్ద పెద్ద మఠాలనీ, దేవాలయాలనీ కట్టిస్తే వచ్చేకీర్తి ఇంతా అంతా కాదు, అని ఆఖరికి అతని అభిప్రాయంగా తేలింది. ఆ రోజే అతడు శీలాదిత్యుడు కాడు, శీలాంధకారుడు అని నాకు తెలిసింది.

పాపం, శీలాదిత్యుణ్ణి మాత్రం నేనెందుకు తప్పుపట్టాలి? ఈ రోజుల్లో, కులీనులు, నాగరికులు అయినవాళ్ళ లక్షణమే అంత ! ఒకరిని ఒకరు మోసం చేసుకోవడం వాళ్ళ నైజం. బౌద్ధ గ్రంథాల్లో బుద్ధుడి కాలం నాటి ఆచార వ్యవహారాల గురించి చదివితే పూర్వం మద్యపానం అంటే జలపానం లాంటిదేనని నాకు తెలిసింది. తాగకపోవడం అంటే ఆ రోజుల్లో ఉపవాసం పాటించడం అని అనుకునేవారు. ఆ రోజుల్లో బ్రాహ్మలు మద్యపానాన్ని నిషిద్ధంగా చెప్తున్నారు. బహిరంగంగా తాగడం అంటే నైతిక విపత్తు తెచ్చుకోవడం అన్నమాటే. అయితే దీని ఫలితం ఏం వచ్చింది? దేవీ దేవతల పేర్లతో సాధనసిద్ధికి అని చెప్పి దొంగదాటుగా భైరవీచక్రాల్ని వేస్తున్నారు! బ్రహ్మచర్యం అంటూ పెద్ద గగ్గోలూ గోలా చేశారు. దాని ఫలితం ఏమైంది? భైరవీసాధనలో తన పర భేదం లేకుండా అందరు స్త్రీలూ పొందుకి పనికివచ్చేవాళ్ళే,ఇంతేకాదు, దేవి ఇచ్చే వరం అన్న పేరుతో తల్లి,కూతురు, అప్పచెల్లెలు అంతమందీ– ఏ విచక్షణా లేకుండా పనికివచ్చేవాళ్ళ కింద జమకట్టబడ్డారు. పరివ్రాజకులూ, భిక్షువులూ ఉండే మఠాలు అసహజమైన వ్యభిచార గృహాలు అయ్యేయి. నిజంగా ఈ లోకాన్ని చూసి కాపాడేవాడు ఎవడన్నా ఉంటే ఈ మోసాన్ని ఈ కపటాన్ని, ఈ అన్యాయాల్ని ఓ క్షణం కూడా సహించలేడు.

ఓసారి నేను కామరూపం వెళ్ళాను. అక్కడి రాజుకి నలందా అంటే ఎంతో శ్రద్ధా భక్తి. మహాయానం అంటే విపరీతమైన అభిమానం.

"మహాయానులు బోధిసత్వుడు చెప్పిన దాన్ని అంగీకరిస్తారు. బోధిసత్వుడు 'లోకంలో బానిసగా ఒక్క వ్యక్తి ఉన్నాసరే నాకు నిర్వాణం అక్కర్లేదు.' అని మహాయానమతంలో బోధించాడు. మహారాజా ! మీ రాజ్యంలో ఇంతమంది అంటరాని వారు ఉన్నారు! నగరంలోని వీధుల్లోకి వచ్చినప్పుడు వాళ్ళు తమ చేతిలోని

క్రని తిప్పుతూ నడుస్తారు. చుట్టూ ఉన్న జనం దాంతో జాగ్రత్తపడి వాళ్ళని ముట్టుకోకుండా అపవిత్రులు కాకుండాతప్పుకు నడవాలని అనుకుంటారు. వాళ్ళుచేత్తో ఓ పాత్రని పట్టుకుని మరీ నడుస్తారు. తమ ఉమ్మిపడి నగర వీధులుమైలపడి పోకూడదని, ఆ పాత్రలో ఉమ్మివేస్తూ ఉంటారు. కుక్కని ముట్టుకుంటే మనిషి మైలపడడు. కుక్క మలంతో నగరాన్ని మైలపరుస్తూనే ఉంటుంది. అయినా అంటరానివాళ్ళు కుక్క కన్నా హీనమైనవాళ్ళు అవునా?" అని నేను అడిగాను.

"కుక్క కన్నా హీనులు కారు. వాళ్ళలోనూ ఆ బీజం, ఆ జీవచైతన్యం, ప్రవాహం ఉన్నాది. ఎప్పటికైనా అది పెరిగి వికసించి బుద్ధుడు కాగలదు."

"మరి అలా అయితే ఇవాళ నుంచి ఏ అంటరానివాడూ నగరంలో క్ర తిప్పుతూ, చేత్తో ఉమ్మివేసుకునే పాత్రని పట్టుకుని నడవక్కర్లేదు అని రాజ్యం అంతటా డప్పుకొట్టించి చాటించరెందుకనీ?"

"ఇది నా శక్తికి మించినపని."

"శక్తికి మించినదా?"

"అవును. ధర్మం కట్టుబాట్లు అలాగే ఉన్నాయి."

"బోధిసత్వుడి ధర్మంలోనూ - మహాయానంలోనూ సర్వత్రా ఇవే కట్టుబాట్లున్నాయా ?"

"కాని ఇక్కడి ప్రజలందరూ మహాయానాన్ని అనుసరించి నడవడం లేదు కదా ?"

"నేను ఊరూరా,నగరం నగరంలోనూ సర్వత్రా త్రిరత్నాలవిజయ దుందుభి మోగడాన్ని చూస్తున్నాను."

"అవును, పైకి చెప్పుకోడానికి మాత్రమే. నేనుగాని అలాంటి చాటింపు వేయించానూ అంటే నా కక్షిదారులు సనాతన ధర్మాన్ని మట్టిపాలు చేస్తున్నాడు అని పెద్ద తుఫాను లేవదీస్తారు."

"బోధిసత్వుడి జీవితం గురించీ ఆయన మహిమ గురించీ అహర్నిశలూ ఇంతలా ఉపదేశాలు ఇస్తున్నారే - వాటి ప్రభావం ఎవరి మీదా ఏ మాత్రమన్నా పడటం లేదా ? కొంత మంది మీద ఆ ప్రభావం తప్పకుండా ఉందని నేను అనుకుంటున్నాను. మహారాజా ! మీరుగాని బోధిసత్వుడిలాగా తమ సర్వస్వాన్ని అర్పించటానికి సిద్ధపడితే మీ వెనకే నడవడానికి కావల్సినంత మంది బయల్దేరుతారు."

"రాజ్యంలోని ప్రజల గురించిన సమస్య లేదు. అలాచేస్తే మన పరమ భట్టారకులు చక్రవర్తి కూడా కోపగించుకుంటారు."

"శీలాదిత్యుడా? హర్షచక్రవర్తా? ఆయనేనా, నాగానందం నాటకంలో బోధిసత్వుడి దివ్యజీవితాన్ని అద్భుతంగా చిత్రించింది."

"అనాది నుంచీ వస్తూ ఉన్న వాటిని కాదనడం ఎవరికీ శక్యం కాదు."

"ఇలాగే తథాగతుడు అనుకుని ఉంటే? ఇదే మాట ఆర్య అశ్వఘోషులు అనుకుని ఉంటే? ఇలాగే ఆర్య నాగార్జునులు అనుకుని ఉంటే ?"

"వాళ్ళకా సాహసమూ ధైర్యమూ ఉన్నాయి. అయినా వాళ్ళు ఆ పాత పద్ధతుల్ని మట్టుపెట్టడంలో ఎంతో దూరం కృతకృత్యులు కాలేకపోయేరు."

"ఎక్కువగా కాకపోతే తక్కువగానైనా సరే చేసి చూపెట్టండి మహారాజా! మీరు ముందు అడుగువేస్తే మరి కొంతమంది ముందుకు వస్తారు."

"నా నోటితో నన్ను నేను పిరికివాణ్ణి అని చెప్పుకునేదాకా నువ్వు వదలవా ఏం ?"

"పిరికివాళ్ళు కారు. కాని ఈ ధర్మం, మతం మనకి ఓ బూటకం. అది మాత్రం కచ్చితంగా నిజం."

"నా మనస్సురో మాట చెప్పమంటావా? అయితే నీవన్నది నిజం అనే అంటాను. అయితే నా నోటిని అడుగు– 'కాదు' అని స్పష్టంగా చెప్పేస్తుంది. లేకపోతే పెదవి విప్పకుండా మూగనోము పడుతుంది."

బ్రాహ్మల మతం అంటే నాకు అసహ్యం. నిజానికి కామరూపుల రాజుగారి లాగ ఎంతో మంది సహృదయులని పిరికివాళ్ళగా ఈ బ్రాహ్మణ ధర్మమే తయారు చేస్తోంది. దోషం ఆ ధర్మానిదే. ఈ దేశం నుంచి బ్రాహ్మణ ధర్మం నశించి పోయిన రోజున లోకంలో ఉన్న పెద్ద కళంకం కూడా తుడుచుకుపోతుంది. నలందకి వచ్చిన పై దేశాల భిక్షువులు తమ దేశాల్లో బ్రాహ్మణ జాతి లాంటి బలవత్తరమైన మత నాయకత్వం వహించిన జాతి ఏదీలేదని, చెప్పారు. వాళ్ళ దేశాల్లో కర్రనీ, ఉమ్మిపాత్రని పట్టుకుని నడిచే అంటరాని వాళ్ళు ఎందుకులేరో నాకు దాంతో అర్థమయింది. బ్రాహ్మలే మనదేశంలో మనుష్యుల్ని చిన్నా పెద్ద జాతులుగా విడదీసేశారు. ఎవరూ తనకంటే కిందివాణ్ణి తనతో కలవనియ్యడానికి ఒప్పుకోడు. వీళ్ళ ధర్మం జ్ఞానం రాహుకేతువుల్లాంటివి.

నలందాలో దేశవిదేశాల సంగతులు చిత్రచిత్రమైన భోగట్టాలు తెలుస్తూ ఉండేవి. అందుకనే నేను ఓ ఏడాదీ రెండేళ్ళూ పర్యటించడానికి వెళ్ళినా ఓ ఆర్నెల్ల పాటు ఉండడానికి నలందకి వచ్చేస్తూ ఉంటాను. ఓసారి ఓ పారశీక భిక్షువు చెప్పగా విన్నాను. వాళ్ళ దేశంలో ఈ మధ్యకాలంలోనే మజ్దక్ అనే పండితుడు ఉండేవాట్ట. ఆయన ఓరకమైన సంఘవాదాన్ని ప్రచారం చేశాట్ట. బుద్ధుడు కూడా భిక్షుణిలకోసం ఓ రకమైన సంఘవాదాన్ని - సంపత్తికి సంబంధించినంతవరకూ - ఉపదేశించాడు. అయితే ఇప్పుడా సంఘవాదం కేవలం వినయ పిటకంలో చదవడానికి మాత్రమే ఉనా–ది! ఈ రోజుల్లో వ్యక్తిగతమైన సంపత్తి విస్తృతంగా ఉన్న బౌద్ధభిక్షువులు

ఉన్నారు! ఆచార్య మజ్దకులు బ్రహ్మచర్యాన్నీ, భిక్షువాదాన్నీ అంగీకరించలేదు. ఆయన మానవుల సహజ జీవనాన్ని, ప్రేమని - ప్రేయసీ ప్రియుల్ని-పుత్ర పౌత్రులతో కూడిన జీవితాన్నే ఒప్పుకునేవాడు. అయితే అన్ని చెడ్డలకి మూలం "నేను" "నాది" అన్న భావం అని చెప్పేవాడు. "సంపత్తి వేరుగా ఉండకూడదు. అందరూ కలసి సంపాదించాలి. అందరూ కలసి తినాలి. భార్యాభర్తలు వేరవకూడదు. ప్రేమకి స్వేచ్ఛ ఉండాలి. సంతానాన్ని అందరి సంతానంగా భావించాలి" అని ఆయన చెప్పాడు. భూతదయ కలిగి ఉండాలనీ సంయమం అవసరమని బోధించేవాడు. నాకు ఆయన భావాలు నచ్చాయి. మజ్దక్‌నీ, ఆయన అనుయాయులు లక్షలాది మందినీ చంపి "నౌశేర్‌వా" అనే ఓ పారశీకరాజు న్యాయమూర్తి అన్న బిరుదును పెట్టుకున్నాడని విన్నప్పుడు రాజులు ఉన్నంతకాలం ధర్మం - దానితోపాటు దానాలూ, పుణ్యాలూ అంటూజీవించే శ్రమణులూ, బ్రాహ్మణులూ ఉంటారనీ, వీళ్ళున్నంతకాలం ఈ భూతలం స్వర్గంకాలేదు అనీ నాకు అనిపించింది.

# చక్రపాణి

కాలం : క్రీ. శ. 1200

ఆ రోజుల్లో భారత దేశంలోని పట్నాలన్నిటిలోనూ కనోజ్ పెద్దదీ సమర్థవంతమైనదీనూ. ఆ పట్నంలోని వీధులు, బజారులు, నాలుగురోడ్ల కూడలి స్థలాలూ ఎప్పుడూ ఎంతో శోభస్కరంగా ఉండేవి. మిఠాయికి, వాసననూనెలకి, సుగంధద్రవ్యాలకి, తాంబూలాలకి, ఆభరణాలకి-ఒకటేమిటి, ఇంకా ఇలాంటి ఎన్నెన్నో వస్తువులకియావత్ భారతదేశంలోనూ ఆపట్నం ప్రసిద్ధి చెందింది. మౌఖరి, బైస్, ప్రతిహార్, గహడ్‌వార్‌లాంటి గొప్ప రాజవంశాలకి ఆరువందల సంవత్సరాల పాటు కనోజ్ ఆయాకాలాల్లో రాజధాని నగరం అవడం నుంచి జనానికి ఆ పట్నం అంటే ఓ గౌరవం ఏర్పడింది. అంతేకాదు - ఎన్నో జాతుల వాళ్ళు ఆ పట్నంపేరు తమ తమ శాఖలకి పెట్టుకున్నారు. అందుకే ఇప్పటికీ బ్రాహ్మణులలో, గొల్లవారిలో, కాందూలలో (వ్యాపారస్థుల - కోమట్ల ఉపజాతి) కన్యాకుబ్జ బ్రాహ్మలు, కన్యాకుబ్జగొల్లలు మొదలైన వాళ్ళు కనపడుతున్నారు. హిందూ మతం అనేసరికి జనానికి ఎలాంటి భావం ఏర్పడుతుందో, కన్యాకుబ్జం (కనోజ్) అన్నా అలాంటి భావమే కలుగుతుంది. హర్షవర్ధనుడి తర్వాత ప్రపంచంలో ఎంతో మార్పు వచ్చింది. కాని అప్పటికీ ఇప్పటికీ కలిపి చూస్తే ఇప్పుడు భారతీయులకి నూతిలో కప్పల్లాగ సంకుచితత్వం ఎక్కువగా పెరిగింది.

హర్షవర్ధనుడి కాలంలో అరబ్బుదేశంలో ఓ కొత్తమతం - ఇస్లాం పుట్టింది ఆ మతాన్ని స్థాపించినవాడు చనిపోయి (క్రీ.శ. 632) నూరేళ్ళయినా కాకుండానే ఆ మతం సింధు దగ్గర్నుంచి స్పెయిన్ వరకూ వ్యాపిస్తుందని అప్పుడు ఎవరూ ఊహించలేకపోయారు. జాతుల పేరుతో రాజుల పేరుతో ఇంతవరకూ దేశాలని జయించటం అన్నది జనం వింటూ వచ్చారు. ఇప్పుడు మతం పేరుతో దేశాలని గెలవటం అన్నది మొట్టమొదటసారిగా విన్నారు. వాళ్ళు ఆత్మరక్షణకి ఏ మాత్రం అవకాశం యివ్వకుండా శత్రువుల మీదపడ్డారు. ఇరానీయుల అంత గొప్ప సామ్రాజ్యం అరబ్బుల తాకిడికి కాగితం పడవలాగ చూస్తూ చూస్తూ ఉండగానే మునిగిపోయింది. ఇస్లాము ప్రవక్త మరణించి రెండు శతాబ్దాలు గడిచీ గడవక ముందే ఇస్లాం రాజ్యపు జెండా పామీరు మీద ఎగరసాగింది.

తన అరబ్బు తెగలని ప్రపంచమంతటా విస్తృతపరచాలని ఇస్లాం మొదట్లో అనుకుంది. తెగల్లోని నిరాడంబరత్వాన్ని, సమానత్వాన్ని, సోదర భావాన్ని తన అనుయాయుల్లో కలగచెయ్యాలని అనుకుంది. వైదికార్యుల పూర్వీకులు అప్పటికి మూడువేల సంవత్సరాలకి ముందే అలాంటి స్థితినుండి ఇంకా ముందుకి పయనించారు. గడిచిన యుగం మళ్ళీ తిరిగిరావడం అన్నది అసంభవం అంచేత ఇస్లాం తెగల స్థితిని దాటి మరోమెట్టు ముందు ఉన్న ఫ్యూడల్ పద్ధతి ఉన్న (జమీందారీ వ్యవస్థ) దేశాల సంపర్కంలోకి రాగానే దాని ఖడ్గధాటికి రాజకీయ స్వాతంత్ర్యం పోయింది. వాటి సంపర్కం వల్ల ఇస్లాం సమాజంలోని తెగల స్వరూపం మాయమైపోయింది. ఇస్లాం ప్రధాన శాసకుడు చాలా కాలం తనని ఇస్లాం ప్రవక్త యొక్క ఖలీఫా (అధికారి)గా-వారసుడిగా చెప్పుకునేవాడు. నిజానికి అతడుసుల్తాను-నిరంకుశుడైన రాజు. కాని ఇప్పుడు సుల్తాను పేరుతో పిలవబడేవాళ్ళు చాలా మంది కనపడతారు. వాళ్ళకీ, ఇస్లాం పవిత్రతెగలకీ,వాటి నిరాడంబరత్వానికీ,సమానత్వానికీ, సోదరభావానికీ ఏం సంబంధం అన్నది లేనేలేదు. అయితే కొత్త కొత్త దేశాలని గెలవడానికి కత్తి పట్టగలిగే సైనికులు అవసరం. ఈ కత్తి పట్టగలిగేవాళ్ళు ఇప్పుడు అరబ్బులు కారు. అరబ్బులు కానివారే ఉన్నారు. ఈ సైనికులని సుల్తాను కోసం యుద్ధంలో ప్రాణాలు అర్పించడానికి ప్రోత్సహించడానికి అంతగా వీలుపడలేదు. అంచేత వాళ్ళకి పరోక్షంగా స్వర్గాన్నేకాక ప్రాపంచిక లాభాలను కూడా చూపెట్టవలసివచ్చింది. దోపిడీచేసిన వస్తువులపైనా, బందీలుగా పట్టుకున్న వాళ్ళ మీదా వాళ్ళకి హక్కు ఉంది. కొత్తగా జయించిన రాజ్యంలో నివాసం ఏర్పరచుకునే అధికారం ఉంది. తమ పూర్వపు యజమానుల దగ్గర్నుండి, పీడించేవాళ్ళ దగ్గర్నుండి ముక్తి పొందడానికీ హక్కు ఉంది. ఓడిపోయిన వాళ్ళలోంచి గెలిచిన వాళ్ళ జెండాని తమదని స్వీకరించి ముందుకు ఉరికే సైనికులు ఇంత సంఖ్యలో ఎప్పుడూ ఎవరికీ లభ్యంకాలేదు. ఇలాంటి సేనని—మనలోంచే మనతో వాళ్ళ కోసం యుద్ధం చేసే సైనికుల్ని పుట్టించే సేనని - ఎదురుకోవడం మాటలతో పనికాదు.

హర్షుడు చనిపోయి వంద ఏళ్ళన్నా కాలేదు. సింధుదేశం ఇస్లాం చేతుల్లోకి పోయింది. బనారసు సోమనాథ్ (గుజరాతు) వరకూ భారతదేశం ఇస్లాం యుద్ధ కౌశలాన్ని చవిచూసింది. ఈ కొత్త ప్రమాదం నుండి తప్పించుకోడానికి కొత్తపద్ధతి అవసరం. కాని హిందువులు తమ పాత పద్ధతులని వదలడానికి సిద్ధంగా లేరు. దేశం మొత్తం యుద్ధం చెయ్యడానికి సిద్ధం అవ్వాలి. అలాంటిది కేవలం లెక్కకు నలుగురు రాజపుత్రులే (పూర్వపు క్షత్రియులు - పెళ్ళిళ్ళ సంబంధాలూ చేసుకుని వీళ్ళలో కలిసిపోయిన శకులు, గ్రీకులు, గుర్జరులు మొదలైనవారు) భారతసైన్యం అయింది. వీళ్ళకి తమలో తమకున్న శత్రువులతో పోరాడ్డానికే సమయం చాలేది కాదు. రాజవంశీకులతో వాళ్ళకున్న పాత శత్రుత్వాలవల్ల కొస వరకూ వాళ్ళలో వాళ్ళకి ఐకమత్యం అన్నది కుదరలేదు.

# 1

"మహారాజా! చింతించకండి. గురువుగారు సిద్ధులు. గాల్లో ఎండుటాకులు ఎగిరిపోయినట్టు తురకసేనని ఎగరగొట్టడానికి సాధన మొదలుపెట్టారు."

"గురువు మిత్రపాదులకి (జగన్మిత్రానంద) నా మీద ఎంత దయ! నాకు గాని, నా కుటుంబానికి గాని ఏదన్నా ఆపదగాని వచ్చిందా గురుమహారాజు తన దివ్యశక్తితో మమ్మల్ని కాపాడారు."

"మహారాజా! హిమాలయాలకి అవల ఉన్న భోట్ దేశంనుంచి కన్యాకుబ్జానికి ప్రమాదం రానున్నదని సిద్ధులు గుర్తించారు. అందుకే నన్ను ఆయన మీ దగ్గరికి పంపించారు."

"నా మీద ఆయన కెంత దయ ఉందో!"

"తారిణి (తారాదేవి) మహారాజుకి సహాయపడుతుంది. తురకల గురించి చింతపడకండి అని ఆయన అన్నారు."

"తారా తల్లిమీద నాకు పూర్తివిశ్వాసం ఉంది. తారిణీ! నువ్వే శరణ్యం! ఆపదల్లో ఉన్నవాళ్ళకి నువ్వే దిక్కు! తల్లీ! మ్లేచ్ఛుల నుంచి మమ్మల్ని కాపాడు."

ఇంద్ర భవనంతో సమానం అనిపించే తన రాజప్రాసాదంలో కర్పూరం లాంటి తెల్లటి మృదువైన గద్దె మీద ముసలి మహారాజు జయచంద్రుడు ఆసీనుడై ఉన్నాడు. ఆయన సరసనే అత్యంత సుందరులైన యువతులు - నలుగురు రాణులూ కూచుని ఉన్నారు. గౌరవర్ణపు ఛాయతో అతిచక్కగా ఉన్నారు. తుమ్మెద రెక్కల్లాంటి నల్లని కురులని వెనక్కి పెద్ద ముడిగా వేసుకున్నారు. వారి సిగలు పెద్దవిగా ఉండడాన్ని మరో తలా అన్నట్టుగా కనిపిస్తున్నాయి. చూడామణులు, కర్ణాభరణాలు, కంకణాలు, దండకడియాలు, హారాలు, చంద్రహారాలు, ముత్యాల హారాలు, మువ్వల వడ్డాణాలు, మువ్వల పట్టీలు - ఎన్నెన్నో రకాల రత్నాభరణాలు, బంగారపు నగలు వాళ్ళు పెట్టుకున్నారు. ఈ ఆభరణాలన్నిటితో వారి శరీరాలు బరువెక్కి ఉన్నాయి. వాళ్ళ ఒంటిని పల్చటి మృదువైన చీరా, రవికా ఉండడం ఉన్నాయి. కాని అవి శరీరాన్ని దాచటానికి ఉపకరించటంలేదు. వారి అందాన్ని మరింత బహిరంగపరుస్తున్నాయి. రవిక వారి ఉన్నత వక్షోజాల్నీ, మెరిసి పోతున్న కాంతినీ మరింత చక్కగా కనిపించేటట్టు చేస్తోంది. రవిక కిందభాగం ఉదరభాగం నాభివరకూ అనాచ్ఛాదితంగా ఉంది. తొడలు, పిక్కలు చక్కటి సౌష్టవంతో మెరుస్తూ కనపడుతున్నాయి. వారు తలలకి రాసుకున్న వాసన నూనెల పరిమళం, వారు ధరించిన తాజా మల్లెపువ్వుల దండల పరిమళం రాజప్రాసాదమంతా వ్యాపించి ఉంది. రాణులేకాక ఏభై మందికి పైగా యువతులు, పరిచారికలు కూడా అక్కడ ఉన్నారు. వాళ్ళలో కొందరు చామరాలు, పంకాలు, నెమలి పింఛాలతో చేసిన చామరాలు పట్టుకుని విసురుతున్నారు: కొంతమంది తాంబూలపు ఉమ్మిపాత్రలు

పట్టుకుని ఉంటే కొంతమంది దర్పణాల్ని దువ్వెనలని పట్టుకుని ఉన్నారు. కొందరి చేతిలో సువాసనతో పరిమళించే మంచినీటి కూజాలుంటే కొందరిచేతిలో గాజుతో చేసిన మద్యపు కూజాలున్నాయి. మరికొందరి చేతిలో బంగారపు మద్యపాత్రలు ఉన్నాయి. ఇంకొందరు పాముపొరలాంటి పల్చటి శుభ్రమైన వస్త్రాన్ని శరీరాన్ని తుడుచుకోడానికి పనికివచ్చే వస్త్రాన్ని పట్టుకుని ఉన్నారు. కొంతమంది మృదంగం, మద్దెల, వీణ, వేణువు మొదలైన వాద్యాలు ఎన్నెన్నో రకాలవి పట్టుకుని కూచున్నారు. అక్కడక్కడ కొంతమంది బంగారపు రాజదండాన్ని పట్టుకుని నిల్చునైనా ఉన్నారు, లేదా అటూ ఇటూ పచార్లు చేస్తున్నారు. రాజుని కలవడానికి వచ్చిన మిత్రపాదుల శిష్యుడు భిక్షువు శుభాకరుణ్ణి, రాజు జయచంద్రుణ్ణి మినహాయిస్తే అచ్చట ఉన్నవాళ్ళంతా రాణులే. అందరూ వయస్సులో ఉన్న అందమైన పడతులే!

భిక్షువు రాజుదగ్గర సెలవు తీసుకున్నాడు. రాజూ రాణులూ లేచి నిల్చుని అతనికి నమస్కరించారు. ఇహ ఇప్పుడక్కడున్నది ఆడవాళ్ళు, ముసలి రాజుగారే! జయచంద్రుడు ముసలివాడైపోయినా సగం నెరిసిన పొడుగాటి జుట్టుని మధ్య పాపిడితీసి వెనకవేపుగా రెండు భాగాలు చేసి కట్టుకున్న పద్ధతినిబట్టీ, పెద్ద పెద్ద మీసాల్ని దువ్వి తీర్చిదిద్దుకున్న దాన్ని బట్టీ ఆయన ఒంటిని ఉన్న ఆభరణాలను బట్టీ, వేసుకున్న బట్టలబట్టీ ఆయన తానింకా పడుచువాణ్ణనే అనుకుంటున్నారని తెలుస్తోంది. ఆయన సైగ చెయ్యగానే మద్యపాత్రని ఓ పరిచారిక వంగి అందించింది. దానిని రాణీ తీసుకొని రాజు నోటికి అందించింది – ఆయన దానిని రాణి నోటి దగ్గర పెట్టాడు – "రాజ్యలక్ష్మీ! నా అందాల భామా! నువ్వు దీనిని ఎంగిలి చెయ్యకపోతే నేనెల్లా తాగ్గలుగుతాను?" అన్నాడు. రాణి పాత్రను తన పెదిమలను తగిలించి నాలుకని మద్యంలో తడుపుకుంది. అప్పుడా ప్రసాదాన్ని రాజు తాగాడు. ఆ తర్వాత ఆయన అందాలభామలు ఒక్కొక్కరూ తమ ఎంగిలి ప్రసాదాన్ని ఆయనకి అందించారు. ఆయన కళ్ళు ఎర్రబడ్డాయి. తురకల భయమూ చింతా మాయమై మొహంలో నవ్వు కనిపించింది. ఆయన స్థూల శరీరం బాలీసుమీదకి వాలిపోయింది. ఆయన ఓ రాణిని ఓ పక్కకీ, ఇంకోరాణిని మరో పక్కకీ లాక్కున్నాడు. ఒకతె ఒళ్ళో తల పెట్టుకున్నాడు. మరొకతె వక్షస్థలం మీద భుజాలని ఆనించాడు. మధ్య మధ్య మదిరాపానం సాగుతోంది. రాణులతో కామాన్ని ఉత్తేజపరిచే హాస్యపరిహాసాలు కానిస్తున్నాడు. రాజు నృత్యం చెయ్యండని ఆజ్ఞాపించాడు. గజ్జెలు కట్టుకుని కుచ్చుల లంగా కట్టుకుని మారేడు పళ్ళలాంటి స్తనాలున్నవాళ్ళు పెద్ద పెద్ద నితంబాలు ఉన్నవాళ్ళు ఉదరమే లేదన్నట్లుగా ఉన్న నడుంవాళ్ళు-అందమైన పడుచులు నృత్యం చెయ్యడానికి నిలబడ్డారు. వీణావాద్యం మృదంగనాదం మొదలయ్యాయి. తియ్యటి కాకలీ స్వరంతో పాటు పాటా నాట్యం ప్రారంభమయ్యాయి. ఓ పాట

తర్వాత రాజుగారికి అది రుచించలేదు. ఆయన ఆ అందమైన పడుచుల్ని నగ్నంగా నృత్యం చెయ్యమని ఆదేశించాడు. నాట్యగత్తెలందరూ తాము కట్టుకున్న బట్టలూ, పెట్టుకున్న ఆభరణాలు తీసేశారు. కాళ్ళకి గజ్జెలు మాత్రం ఉన్నాయి. రాజుగారు పక్కనే కూచునివున్న రాణులనూ; పరిచారికలనూ ఆలింగనం చేసుకుంటూ, ముద్దులాడుతూ వేళాకోళం చేస్తూనే ఉన్నారు. మధ్య మధ్య నగ్న నృత్యమూ సాగుతోంది. నగ్న నాట్యకత్తెలలో ఓ అందాలభామ నగ్న సౌందర్యం రాజుగారి దృష్టిని ఆకట్టుకుంటుంది. ఆవిడ మహారాజా దగ్గరికి వస్తుంది. ఆవిడ బదులు మరొకావిడ బట్టలు వదిలి నగ్నంగా నాట్యకత్తెలతో నాట్యం చెయ్యడానికి వెళ్తుంది. మహారాజుగారి కళ్ళు మరింత ఎర్రబడ్డాయి. ఆయన కంఠం, మాటా మద్యపానం వల్ల మారిపోయాయి.

"ఛూ ఛూ - ఛీ-ఛీ తురకల్లారా-నా-నా ఇం....ఇంద్ర...పుప్పరంలో ఏ-ఏ గాడిదలు - రా ర్రాగలుగుతా—తారు! ఛూ - ఛూ - ఊఁ అం—అంతా గుడ్డలు-విప్పుకొని ఆడండి" అన్నారు రాజుగారు.

అక్కడున్న రాణులందరూ తమ తమ బట్టల్నీ ఆభరణాల్నీ తీసేసి దిసమొలలయ్యారు. యవ్వనంతో పిటపిటలాడుతూ అందంగా తెల్లగా మెరిసిపోతున్నారు. వాళ్ళ పెద్ద పెద్ద ముడులు రాజుగారికి నచ్చలేదు. ఆయన అందరినీ జుట్టు ముడులు విప్పేయండని ఆజ్ఞాపించాడు. నల్లతాచుల్లా పొడుగైన కేశాలు నితంబాల వరకూ వేళ్ళాడాయి. మహారాజుగారూ తమ వస్త్రాలని తీసివేయబోవడం చూసి ఆ పడుచులు ఆయన వస్త్రాలనీ, ఆభరణాలనీ కూడా తీసివేశారు. ఆయన కండలు, వేళ్ళాడుతున్న గెడ్డం, బాగా ఉబికి ఉన్న బుగ్గలూ, నెరిసీ నెరియని మీసాలూ, ప్రసవించిన స్త్రీకున్నట్టు వేళ్ళాడుతున్న స్తనాలూ, పెద్ద బానలాంటిబొజ్జా, మాంసం కొవ్వుతో లావుగా పెద్దగా ఉన్న మెత్తటి తొడలూ, పిక్కలూ, రోమాలతో నిండివున్న లావుగా ఉన్న చేతులూ - అతి మామ్మూలు పడుచైనా సరే అసహ్యించుకోకుండా ఉండలేదు. అయితే ఇక్కడ అందరి పడుచుల ప్రాణాలూ ఆ ముసలివాడి గుప్పిట్లోనే ఉన్నాయి. ఒకతె ఆయన బోసినోటికి తన పెదిమలను చేర్చింది. మరొకతె తన స్తనాలతో అతని పక్కలకి రాపిడి కలిగిస్తోంది. ఇంకొకతె రోమాలతో నిండిన అతని భుజాల్ని తన భుజాలకి చేర్చుకుంటోంది. తన బుగ్గలని ఆనిస్తోంది. కామాన్ని ప్రకోపించే పాటా ఆటా మళ్ళీ మొదలయింది. రాణుల మధ్య పరిచారికల మధ్య తన బొజ్జని ఎగరేస్తూ మహారాజా నాట్యం మొదలెట్టాడు.

## 2

"కవి చక్రవర్తీ! రండి రండి!" అని రాజు మధ్యవయస్సులో ఉన్న ఒకతణ్ణి మర్యాదచేసి ఆసనం చూపెట్టాడు. అతడు కూచున్నాక ఎంతో గౌరవంతో తాంబూలపు చిలకలు రెండు అందించాడు. కవిచక్రవర్తి ఏభై పైబడ్డవాడు. మంచి ఛాయతో

మెరుస్తున్న ఆయన మొహంలో గతించిపోయిన పడుచుతనపు ఛాయలు ఇంకా దోబూచులాడుతున్నాయి. ఆయన మీసాలు నల్లగానే ఉన్నాయి. ఇంకా నెరిసిపోలేదు. ఆయన వొంటిని తెల్లటి పంచె, తెల్లటి కండువా ఉన్నాయి. అందమైన రుద్రాక్షమాల మెళ్ళో వేళ్ళాడుతోంది. నుదిటిని చంద్రవంక ఆకారంలో భస్మంతో పెటుకొన్న నామం ఉన్నది.

బంగారు రేకుతో చుట్టిన తాంబూలాన్ని - ఘుమఘుమలాడుతున్న దాన్ని నోట్లో పెట్టుకుంటూ, "మహారాజా, ప్రయాణం బాగా జరిగిందా? ఆరోగ్యం బాగుంది కదా! రాత్రుళ్ళు సుఖంగా నిద్రపడుతోందా?" అని ఆయన అడిగాడు.

"కవిపుంగవా! నాలో పురుషత్వం నశించిపోతోంది."

"మహారాజా! మీరు మీ కవి శ్రీహర్షుణ్ణి ఎగతాళి పట్టిస్తున్నారు!"

"పుంగవుడంటే ఎగతాళీ ఏముంది! అది ప్రశంసే!"

"పుంగవుడంటే వృషభం మహారాజా!"

"తెల్సు. అయితే శ్రేష్ఠుడని మరో అర్థమూ ఉంది."

"నేను వృషభం అన్న అర్థమే తీసుకున్నాను."

"నేను శ్రేష్ఠుడన్న అర్థంలో అన్నాను. కవీ! నీలాంటి దగ్గర స్నేహితుడితో కాక ఇంకెవరితో పరాచికాలాడమన్నావు?"

"దర్బారులోనా మహారాజా?" శ్రీహర్షుడు మెల్లిగా అన్నాడు.

మహారాజు శ్రీహర్షుడి చెయ్యి పుచ్చుకుని ఆస్థానపు హాలులోంచి ఉద్యానవనానికి దారితీశారు. గ్రీష్మం మొదలయింది. పచ్చని చెట్లని ఊగులాడిస్తూ నెమ్మదిగా వీస్తున్న గాలి ఎంతో సుఖంగా అనిపిస్తోంది. రాజు పుష్కరిణి మెట్టుమీద నిర్మించిన స్వచ్ఛమైన పాలరాతి ఆసనం మీద కూచున్నారు. తనపక్కనే మరో ఆసనం మీద కవిని కూచోమన్నారు.

"రాత్రులు ఎలా గడుస్తున్నాయని నువ్వు అడుగుతున్నావు కవీ! ముసలివాణ్ణయి పోయానని నాకు అనిపిస్తోంది."

"అదెలా"?

"నగ్నంగా ఎదట నిలిచిన పడుచులు కూడా నాలో ఉత్తేజాన్ని కలిగించలేక పోతున్నారు."

"అలా అయితే మీరు పూర్తిగా యోగులయ్యారన్నమాట మహారాజా!"

"ఈ యోగిదగ్గర ఉన్న ఈ పదహారు వేలమంది పడుచులూ ఏం చేస్తారు?"

"ఎవరికన్నా దానం చేసెయ్యండి మహారాజా! దానం పట్టేవాళ్ళు చాలా మంది ఉంటారు. లేదా గంగ ఒడ్డుని బ్రాహ్మలకి ధారపొయ్యండి. సర్వేషా మేవ దానానాం భార్యాదానం విశిష్యతే."

"అదే చెయ్యాలి. వైద్యులు చక్రపాణి కామోద్దీపనానికి ఇచ్చే ఔషధరసం నిష్ప్రయోజనమైపోయింది. ఇంకిప్పుడు నీ కావ్యరసం మీదే నా భరోసా!"

"నగ్న సౌందర్యం నిరర్థకమై పోయినప్పుడు కావ్యరసం వల్ల ఏమవుతుంది? అదికాక మహారాజా! మీకు అరవయ్యోపడి దాటిపోయింది."

"అరవయ్యో పడిలో మరింత శక్తీ కోరికా దృఢంగా వుంటాయి కవీ!"

"ఎవరికి? పదహారువేల మందితో నిత్య వ్యవహారం సలిపిన వృషభానికా?"

"నువ్వు కాశీలో కనిపించావు కావు. నేను కన్నౌజ్‌నుంచి వచ్చి రెండుమాసా లయింది!"

"నేను చైత్రమాసం నవ్రాతులకి వింధ్యవాసిని చరణాలని సేవించుకోడానికి వెళ్ళాను మహారాజా!"

"మా పడవ వింధ్యవాసిని మార్గాన్నే వెళ్ళింది. నాకు తెలిసివుంటే నిన్ను పిలిచి ఉండేవాణ్ణి."

"పిలిచేవారా? అక్కడ దిగి కుమారి-ఉపాసనలో మునిగిపోయేవారా?"

"మరి నీ సంగతేమిటి కవీ! నువ్వు కుమారి-ఉపాసన కోసమే కదా అక్కడికి వెళ్ళ?"

"నేను భగవతి వింధ్యవాసినిని ఉపాసించే శక్తుణ్ణి మహారాజా!"

"ఐతే సీతారాములని పూజిస్తావే! అది చూస్తే అసలుసిసలు వైష్ణవుడివి అనిపిస్తుంది."

"అంతఃశాక్తా బహిశ్శైవాః సభామధ్యేచ వైష్ణవాః!"

"సభామధ్యంలో వైష్ణవుడివా?"

"అవ్వాల్సి వస్తుంది మహారాజా! మీకుమల్లే మేం ఇతరుల నోళ్ళు మూయించ లేంకదా!"

"చాలా గొప్పవాడివే! ఊసరవిల్లివి!"

"మహారాజా! అంతటితో అవలేదు. సుగతుణ్ణి (బుద్ధుడు)నా ఆరాధ్యదైవాల్లో కలుపుకున్నాను."

"సుగతుణ్ణా? భగవానుడు తథాగతుణ్ణా?"

"అహా భగవానుణ్ణే!"

"ఛీఛీ ఆ పేరు తలుచుకుంటే నాలాంటి వాడికి కూడా కాస్త సిగ్గేస్తుంది!"

"మహారాజా! వజ్రయానం వచ్చి మా శాక్తులకు సుగతుణ్ణి ఉపాసించటం సులభం చేసిపెట్టింది."

"సరిగ్గా చెప్పవయ్యా! మిత్రమా! అందుకే దాన్ని సహజయానం అన్నారు."

"ఈ సహజయానుల దోహాల్లోనూ పాటల్లోనూ నాకేం కవిత్వం కనిపించదు. అయితే పంచమకారాలని (మద్యం. మాంసం, మీనం, ముద్ర, మైథునం) బాగా ప్రచారం చేసి లోకానికి ఉపకారం చేశారు. అందుకు నేను వాళ్ళకి యెంతో కృతజ్ఞుణ్ణి."

"కాని, ఇప్పుడు నాకు పంచమకారోపాసన ఆపకుండా చెయ్యడం దుష్క రంగా కనపడుతోంది."

"వజ్రయానంతోపాటు నాగార్జునుడి 'మాధ్యమిక దర్శనం' బంగారానికి తావి కలిగినట్టు ఉంటుంది!"

"నీ కావ్యాలని ఆస్వాదించగలను. అదీ ఒక్కొక్కసారైతే తలకెక్కదు. కాని ఈ దర్శనం ఉందే-ఓ పెద్ద బండరాయిలాగ అనిపిస్తుంది."

"మహారాజా! నాగార్జునుడి దర్శనం చాలా ఉపయోగకరమైనది. అర్థరహిత మైన భ్రమల్ని చాలా వాటిని తొలగిస్తుంది."

"వేదాంతిగా కూడా నీకు పేరుంది కదా కవీ!"

"నేను నా గ్రంథాన్ని వేదాంతం పేరుతోనే ప్రఖ్యాతి కలిగేటట్టు చేశాను. మహారాజా! కాని 'ఖండన ఖండఖాద్యం'లో నాగార్జునుడు పెట్టిన భిక్షనే నాదాంట్లో వాడుకున్నాను."

"ఇవేవీ జ్ఞాపకం వుంచుకోలేను అనుకో - అయినా నాగార్జునుడు చెప్పిందది ముఖ్యమైనదేమిటో అది చెప్పు."

"సిద్ధ యోగులు, మిత్రపాదులూ నాగార్జునుడి దర్శనాన్ని అంగీకరిస్తారు."

"నా మతగురువా?"

"అవును. పాపం, పుణ్యం,ఆచారం, అనాచారం ఇవన్నీ ఉట్టి కల్పనలు. జగత్తులో అస్తిత్వం వుండడం,అస్తిత్వం లేకపోవడం అంటూ వేరుచెయ్యడానికి కుదరదు. స్వర్గ నరకాలు, ముక్తి-బంధనాలు ఇవన్నీ చిన్నపిల్లల భ్రమలు! పూజలు, ఉపాసనలు అన్నీ పామరులని మోసం చెయ్యటానికే! దేవుళ్ళు దేవతలూ - అలౌకిక కల్పనలు అన్నీ మిథ్యే అని నాగార్జునుడు అంటాడు."

"జీవితమంతా నేనీ వేదాంతంలోనే గడిపాను కవీ!"

"అందరూ గడుపుతారు మహారాజా! ఎదురుగుండా ఉన్నదాన్ని వదిలి ఎక్కడో లేనిదాని కోసం మూర్ఖులే పరిగెడతారు."

"కాని ఎదురుగా ఉన్నదాన్ని కూడా అనుభవించలేక ఉట్టుట్టినే నోరు తెరచుకొని చూడాల్సివస్తోంది మిత్రమా! నువ్వు దృఢంగానే ఉన్నావే! నీ శరీర పటుత్వం తగ్గలేదు."

"మీకంటే ఎనిమిదేళ్ళు చిన్నవాణ్ణి కదా మహారాజా! నేను ఒకే పెళ్ళి చేసుకున్నాను. ఎక్కువమందిని పెళ్లాడలేదు."

"పెళ్ళిళ్ళు చేసుకుంటే మాత్రం ఏమవుతుంది? ఇన్నిన్ని పెళ్ళిళ్ళు చేసుకుంటే అతి అయిపోయి మనిషి అలిసి చచ్చిపోతాడు."

"నా కొక్కత్తే భార్య మహారాజా!"

"కవి శ్రీహర్షుడు ఆ పళ్ళూడిన ముసలమ్మ నొక్కదాన్నే అంటిపట్టుకొని ఉన్నాడని లోకం నమ్ముతుందా?"

"నమ్ముతుంది. నమ్ముతోంది మహారాజా! నేను నా గ్రంథాల్లో నా సమాధి గురించీ బ్రహ్మ సాక్షాత్కారం గురించి కూడా రాశాను."

"నీ మాధ్యమిక దర్శనంలో బ్రహ్మకీ, బ్రహ్మ సాక్షాత్కారానికి కూడా అవకాశం ఉందా కవీ?"

"మహారాజా! అందులో అన్నిటికీ ఆస్కారం వుంది."

"ప్రజలు గుడ్డివాళ్ళవాలి. అప్పుడు వాళ్ళకి దేన్నైనా సాక్షాత్కరించేటట్టు చెయ్యొచ్చు."

"ఐతే మీకు మతం అంటే నమ్మకం పోయిందా మహారాజా?"

"నాకు తెలీదు కవీ! ఎప్పుడు నమ్మకం పుడుతుందో ఎప్పుడు నమ్మకం లేకుండా పోతోందో నాకే తెలీదు. మీ బ్రాహ్మలు చెప్పే ఉపదేశాలూ, ఆచరణ విధానాలు వినగా వినగా ఎటు నిర్ణయించుకోలేని స్థితిలో పడ్డాను. ఇదీ అని నిశ్చయించుకోవడం కష్టమైపోతుంది. దేవాలయాలు, సుగతుడి ఆలయాలు కట్టించమనీ, దానం చెయ్యమనీ, పుణ్య కార్యాలు ఆచరించమనీ- ఇలా మతం ఏం చెప్పినా చెయ్యి. అయితే ఎదురుగుండా చేతిలో ఉన్నదాన్ని అనుభవించకుండా వదిలిపెట్టకు. బతుకుని చేజార్చుకోకు."

ప్రేమ, మతం గురించి మాట్లాడుతూ వాళ్ళు రాజకీయాల్లోకి వెళ్ళారు.

"పృథ్వీరాజుకి సాయం చెయ్యనని నిజంగానే నిరాకరించారా మహారాజా!" శ్రీహర్షుడు అడిగాడు.

"అతనికి సాయం చెయ్యాల్సిన అవసరం నాకేమిటి? అతడే స్వంతంగా నెత్తి మీదకి తెచ్చుకున్నాడు. తుపానుతో తలపడ్డాడు. దాని ఫలితం అతనే అనుభవిస్తాడు."

"నా అభిప్రాయమూ అదే మహారాజా! చక్రపాణి ఉట్టిపుణ్ణానికి కలత పడేటట్టు చేస్తున్నాడు."

"చికిత్స చెయ్యడం అతడి పనీ. అది చేతకావడం లేదు. మూడుసార్లు వాజీకరణ చికిత్స (కామోద్దీపనకి చేసే వైద్యం) చేశాడు. కాని నిష్ప్రయోజనమే అయింది. ఇహ ఇప్పుడు రాజకీయాల్లో సలహాలివ్వాలని తలదూరుస్తున్నాడు."

"మూర్ఖుడు మహారాజా! యువరాజుగారు అనవసరంగా అతణ్ణి నెత్తికెక్కించుకున్నారు!"

## 3

"సరిగ్గా చెప్పారు వైద్యరాజా! శ్రీహర్షుడు గహడ్‌వాల్లకి వేరుకి పట్టిన చెదపురుగే. ఆయన మా తండ్రిని కాముందుడిగా చేసేవాడు."

"నేను ఇరవై ఏళ్ళ బట్టీ కన్యాకుబ్జేశ్వరుడికి రాజవైద్యుడిగా ఉన్నాను. రాజకుమారా! నా ఔషధాలు గుణం చేస్తాయి."

"ఆ సంగతి లోకం అంతా ఎరుగుదురు రాజవైద్యా!"

"కాని మహారాజుగారు వాజీకరణం (కామోద్దీపనానికి చేసే వైద్యం) విష యంలో నాపట్ల కోపగించుకున్నారు. అతికాముకుడికి వీర్యవృద్ధి కలిగించి యవ్వన వంతుడిగా ఎంతకాలం ఉంచగలుగుతాం కుమారా! అందుకే ఆహార విహారాదుల్లో సమయం ఉండాలని చెప్పారు. నన్ను మల్లగ్రామం(మలాఁవ్)లో ఉండనివ్వండి అని అడిగాను. కాని దానికి ఆయన ఒప్పుకోలేదు."

"తండ్రిగారు చేసిన తప్పులకి మమ్మల్ని వదిలేసి వెళ్ళిపోకండి. గహడవార్ లకి మీ మీదే ఇంక భరోసా ఉంట."

"నా మీద కాదు. రాజకుమారుడు హరిశ్చంద్రుడిమీద ! గహడ్‌వార్ వంశంలో జయచంద్రుళ్ళకి బదులు హరిశ్చంద్రుళ్ళు ఉండి ఉంటే ఎంత బాగుండి ఉండేది! చంద్రదేవుల సింహాసనం మీద హరిశ్చంద్రుడి లాంటివాడు కూర్చోవాలి."

"శ్రీహర్షుడికి బదులు రాజవైద్యులు చక్రపాణి జయచంద్రుడికి అంతరంగిక మంత్రి అయిఉండాల్సింది. కాని వైద్యరాజా! గహడ్‌వార్ వంశం అస్తమించేవరకూ మీరు మాతో ఉండాలి."

"నా ప్రాణాలు పోయేంత వరకూ ఉండటానికి సిద్ధమే రాజకుమారా ! కాని గహడ్‌వార్ వంశం అస్తమించదు. హిందువుల సూర్యుడు అస్తమిస్తాడు. మా మల్ల గ్రామపు బ్రాహ్మలు హోమపు నేతితెడ్డునీ, ప్రోక్షించే జలపాత్రని పట్టుకోవడంలో మాత్రమే గట్టివాళ్ళు కారు. కత్తిపట్టడంలోనూ దిట్టలే. అంచేత మేం కూడా తురక లతో యుద్ధం చెయ్యాలనుకుంటున్నాం."

"అలాంటిది మా తండ్రి తన సొంత అల్లుడికి సాయం చెయ్యడానికి సిద్ధంగా లేరు! పృథ్వీరాజు నా బావ. సంయుక్త అతణ్ణి ప్రేమించింది. ఆవిడ అతనితోపాటు సంతోషంగా ఇష్టపడి వెళ్ళింది. ఇందులో కోపగించుకోవలసినది ఏముంది ? చెప్పండి!"

"పృథ్వీరాజు వీరుడు రాజకుమారా?"

"అందులో ఏం సందేహం లేదు వైద్యరాజా ! వీరుడు కాబట్టే తురక సుల్తా నుతో ఢీకొంటున్నాడు. లేకపోతే మన కన్యాకుబ్జం రాజ్యం ముందు పృథ్వీరాజు రాజ్యం అనగా ఎంత? సుల్తానుకి తోవ మాత్రం ఇస్తేచాలు. అతనికి సుల్తాను బహు మతులు ఇస్తాడు. సుల్తాను దృష్టి ఢిల్లీ మీద లేదు. కన్యాకుబ్జంమీద ఉన్నాది. ఆరు వందల ఏళ్ళబట్టీ భారతదేశంలోకల్లా విశాలమైన రాజ్యాన్ని కన్నోజే పరిపాలి స్తోంది! కాని ఆయనకి ఎవరు బోధపరుస్తారు? అర్థంచేసుకునే శక్తి మా తండ్రి కోల్పోయేరు!"

"ఆయన పరిపాలనా భారాన్ని యువరాజు చేతుల్లో ఇప్పుడాయన పెడితే?"

"నాకూ ఓసారి ఆ ఆలోచన వచ్చింది వైద్యరాజా ! మా తండ్రిని సింహా సనం నుంచి తొలగించాలని అనిపించింది. అయితే మీ బోధనలు నాకు జ్ఞాపకం

వచ్చాయి. ఇరవై ఏళ్ళ బట్టి మీరు బోధించిన విద్యా, జ్ఞానం మేలుచేసేవి అని నాకు తెలుసు. అంచేత నేను ఆ బోధలకి వ్యతిరేకంగా నడవలేను."

"కన్యాకుబ్జ సింహాసనం శిథిలమై పోయింది. చిన్నదైనా తప్పుగా అడుగు గాని పడ్డదా మొత్తమే కూలిపోతుంది. తండ్రీ కొడుకుల కలహానికి ఇది సమయం కాదు."

"ఏం చెయ్యాలి వైద్యరాజా ! మన సేనాధిపతులూ సేనానాయకులూ పిరికి వాళ్లూ, అయోగ్యులూను. యువసేనా నాయకుల్లో కొంతమంది యోగ్యులైన వాళ్లూ వీరులూ ఉన్నారు. కాని వాళ్ళని ముందుకు రానీయకుండా ముసిలివాళ్ళు అడ్డుగా వున్నారు. ఇదే స్థితి మంత్రుల్లోనూ కనపడుతోంది. ముఖస్తుతి చెయ్యడమే వాళ్ళ కర్తవ్యంగా వాళ్ళు భావిస్తున్నారు."

"అంతఃపురానికి తమ అప్ప చెల్లెళ్ళనీ, కుమార్తెలనీ పంపి పదవులు పొందే వాళ్ళు ఇలాంటి స్థితిలోనే ఉంటారు. కాని జరిగిపోయిన దానికోసం మనం విచారించ కూడదు. జరగబోయే దానికోసం చింతించాలి."

"నా చేతిలో గాని అధికారం ఉండి ఉంటే హిందూ యువకులందరి చేతా కత్తిపట్టించి ఉండేవాణ్ని."

"ఇది తరతరాలనుంచి వచ్చిన దోషం రాజకుమారా! రాజపుత్రుల కొక్క రికే యుద్ధంచేసే బాధ్యత అప్పగించారు! ద్రోణుడూ కృపుడూ లాంటి బ్రహ్మలు మహాభారత యుద్ధంలో పోరాడారు. కాని తర్వాతర్వాత కేవలం ఓ జాతికే ఆ బాధ్యత...."

"ఈ జాతి భేదాలు కూడా మన దారికి పెద్ద అడ్డుగా ఉన్నాయని నేను అను కుంటున్నాను."

"అడ్డంటే అడ్డా రాజకుమారా! అన్నిటికన్నా పెద్ద అడ్డు. పూర్వీకులు మంచి కార్యాల పట్ల గర్వం ఉండడం వేరు. కాని హిందువుల్ని లెక్కలేనన్ని చీలికలుగా వేరు వేరు జాతులుగా విడదియ్యటం మహాపాపం."

"దాని ఫలితం ఇవాళ అనుభవించవలసివస్తోంది. కాబూలు ఇంక హిందువు లది కాదు. లాహోరూ వాళ్ళ చేతిలోంచి జారిపోయింది. ఇంక ఢిల్లీ వొంతు రాబో తోంది."

"నేటికీ మనం పిథౌరాతో కలిసి యుద్ధం చెయ్యగలిగితే?"

"అబ్బా! ఎంత పెద్ద ఇక్కట్టు! వైద్యరాజా!"

"ఒక్క ఇక్కట్టా? మన పడవ ఇక్కట్ల బరువుతో మునిగిపోతోంది. అయినా మనకున్న మోహం మా గట్టిది. పడవ బరువు తగ్గించటానికి ఓ వస్తువు నైనా పారేద్దామని అనుకోం."

"మతం జీర్ణించుకోలేకపోవడం నుంచే వైద్యరాజా!"

"మతపు క్షయరోగం! మనం ఎన్నెన్ని అత్యాచారాలు చేశాం? ప్రతీ సంప

త్సరం కోట్లకొద్దీ విధవలని అగ్నికి ఆహుతిచ్చాం! స్త్రీ పురుషులని పశువుల్లాగా క్రయవిక్రయం చేశాం. దేవాలయాల్లో, విహారాల్లో బంగారం, వెండి, వజ్రవైఢూర్యాలు ముత్యాలు తాపడం చేసి మ్లేచ్ఛ బందిపోటుల్ని ఆహ్వానించాం! శత్రువులతో చెయ్యికలిపి ఆక్రమణ సమయంలో కలహాల్లో పడ్డాం. మన ఇంద్రియసుఖాల కోసం, కామార్తి తీర్చుకోడం కోసం ప్రజలు చెమటోడ్చి సంపాదించిన దాన్ని నిర్దాక్షిణ్యంగా తగలెడుతున్నాం!"

"విషయలోలత్వం, కామార్తీ కాదు వైద్యరాజా! ఉన్మాదం! కామేచ్ఛని చల్లార్చుకోటానికి మనకి నచ్చిన మనస్సున్న ఓ స్త్రీ చాలు. ఉన్మాదానికి, మదప్చిచికి వందలూ వేలూ కూడా సరిపడరు.. అక్కడ ప్రేమన్నది ఉండమన్నా ఉండదు. గత సంక్రాంతినాడు తన అంతఃపురంలోని స్త్రీలలో చాలామందిని మా తండ్రి బ్రాహ్మలకి దానం చేశారు. ఆ స్త్రీలు ఏడవలేదు సరికదా లోలోపల సంతోషించారు. నా భార్య భామ చెప్పింది."

"దానం పట్టిన బ్రాహ్మడి ఇంట్లో అ స్త్రీలకి ఒకరో తప్పితే ఇద్దరో సవతులు ఉంటారు రాజకుమారా! అక్కడ పదహారువేల మంది స్త్రీల గుంపు ఉండదుకదా! నా దృష్టిలో ఇదీ బానిసత్వమే. స్త్రీ ఆస్తా - దానం చెయ్యటానికి?"

"మనం అంతా కలసి తురకలని ఎదుర్కోడానికి ప్రయత్నం చెయ్యాలి."

"ఇది మహారాజుగారి చేతిలో ఉంది. ఖూటకపురాయుడు శ్రీహర్షుడు ఆయన చెవులు కొరుకుతున్నాడు. ఆయన అతణ్ణి నమ్ముతున్నారు."

# 4

అష్టమిరాత్రి. తూర్పుని చంద్రుడు ఇప్పుడిప్పుడే ఉదయిస్తున్నాడు. వెన్నెల అంతటా ఇంకా పరుచుకోలేదు. అంతా నిశ్శబ్దంగా ఉంది. ఎక్కడో దూరం నుంచి గుడ్లగూబ అరుపు భయం కలిగించేటట్టు వినిపిస్తోంది. ఆ నిశ్శబ్ద వాతావరణంలో ఓ ఇద్దరు మనుషులు పైవేపునుంచి యమునానది లోతట్టుకి దిగారు. నోట్లోవేళ్ళు పెట్టుకుని వాళ్ళు మూడుసార్లు ఈల వేశారు. యమున ఆవలగట్టు నుంచి ఓ నావ వస్తూ కనిపించింది. నిశ్శబ్దంగా పారుతున్న నదిలో నెమ్మదినెమ్మదిగా తెడ్లువేసుకుంటూ ఓ మాదిరిసైజు నావ ఒడ్డుకి వచ్చింది. ఇద్దరు వ్యక్తులూ నావలోకి దూకారు.

"సేనా నాయకుడు మాధవుడేనా?" లోపల్నుంచి ఎవరో అడిగారు.

"అవును. నేనే ఆచార్య! నాతోపాటు అల్హణుడు కూడా వచ్చాడు. రాజకుమారుడెలా ఉన్నారు?"

"ఇంకా తెలివి రాలేదు. తెలివి రాకుండా ఉండటానికి నేను కొద్దిగా మందు వేశాను, ఓవేళ యువరాజు యుద్ధరంగానికి తిరిగి వెళ్తానంటాడేమోనని!"

"ఆయన మీ మాటని ఎప్పుడూ జవదాటలేరు ఆచార్యా!"

"నాకా నమ్మకం ఉంది. కాని ఎందుకైనా మంచిదని అలా మందు ఇచ్చాను. దీంతో గాయంనెప్పి కూడా తగ్గుతుంది."

"గాయం ప్రమాదకరం కాదుగదా ఆచార్యా!"

"కాదు సేనాపతీ! గాయాన్ని కుట్టేశాను. రక్తంకూడా కట్టింది. నీరసం ఉందనుకో. కాని ఇంక భయంలేదు. ఊఁ అదిసరే, మీరేం చేసుకువచ్చారో చెప్పు, మహారాజు శవాన్ని అంతఃపురానికి పంపారా?"

ఆఁ"

"అయితే రాజాంతఃపురంలోని స్త్రీలు మహారాజుతోపాటు సహగమనం చేస్తారా?"

"చేసేవాళ్ళు చేస్తారు."

"సేనాధిపతి సంగతేమిటి?"

"ముసలి సేనాధిపతికి చచ్చిపోయేముందు ఆఖరికి తెలివి వచ్చింది. ఎంత మందో సేనానాయకులు ఎత్తు తిరగబడ్డం చూసి పారిపోయారు. కాని కొంత మందికి పారిపోయే నేర్పూ లేకపోయింది. వాళ్ళలో ఎవరూ బతికి ఉండి ఉంటారని నేను అనుకోను."

"ఇదిగాని మూడేళ్ళ క్రితం కాని జంగవుంటే హరిశ్చంద్రుడు మన మహారాజు అయ్యేవాడు. మాధవ్! నువ్వు కన్యాకుబ్జపు సేనాధిపతివి అయ్యేవాడివి."

"ఆచార్యా! మీరు చెప్పే ప్రతీ మాటా అద్దంలోలా స్పష్టంగా కనపడుయినే ఉంది. పిథౌరాతో కలసి తురకలని ఎదిరించండని మీరు మహారాజుకి బోధపర్చారు. కాని అంతా అరణ్యరోదనమే అయింది." మాధవుడు నిట్టూర్చి అన్నాడు.

"ఇప్పుడింక విచారించి ఏం లాభం? ఇంకా ఏమేమి ఏర్పాట్లు చేశావో చెప్పు".

"ఐదువందల నావలు ఏభై ఏభై చొప్పున సైనికులతో వస్తున్నాయి. గాగా మోగే, సలఖూలకి సేనలని విభజించి అప్పచెప్పాను. చందావర్ (ఇటావా) నుంచి తూర్పువైపుగా తురకలతో యుద్ధం చెయ్యమని ఆదేశం ఇచ్చాను. ప్రత్యక్షంగా ఎక్కువ ఎదుర్కోకుండా దాడులు చేస్తూ పోరాడమన్నాను. పరిస్థితి అనుకూలంగా గాని లేకపోతే తూర్పువేపుకి తొలగిపోతూ వెళ్ళిపొమ్మన్నాను."

"కన్నౌజ్ రాజప్రాసాదం?"

"రాజప్రాసాదం నుంచి తీసుకురాగలిగినంత వరకూ అన్ని వస్తువుల్నీ తీసుకురావడం జరిగింది. గంగానదిలో చాలా నావలు రెండురోజుల క్రితమే బయల్దేరాయి."

"ఇందుకే మాధవ్! సేనాధిపతి సీదపడకుండా నిన్ను కాపాడత! వాడు నిన్నే తనకంటే ముందు చంపించి ఉండి ఉండేవాడు! నువ్వూ యువరాజూ బతికి బైటపడ్డందుకు నాకు సంతోషంగా ఉంది. హిందువులకి ఆశన్నది ఇంకా వుంది. ఏది ఏమవనీ, ఆఖరివరకూ మనం మన శక్తిని ఆలోచించి చూచిచూచి వినియోగించాలి."

"మిగతా నావలు వస్తున్నట్టున్నాయి ఆచార్యా!"

"అల్లాణా! అవి రాగానే అన్ని నావల్ని ఇక్కణ్ణించి బయల్దేరమని ఆదేశించు."

"మంచిది ఆచార్యా!" అల్లాణుడు ఎంతో నమ్రతతో అన్నాడు.

"పద మాధవ్! కింద గదిలోకి పద. కాని అక్కడ చీకటిగా ఉంది. నేనే కావాలని అక్కడి దీపాల్ని ఆర్పేయించాను." కొంచెం దూరం వెళ్ళాక ఆయన అన్నారు- "ఆగుకాస్త. రాధా!"

"బాబా!" ఓ యువతి కంఠం వినిపించింది.

"చెకుముకితో దీపం వెలిగించు. ఇనపముక్కని జాగ్రత్తచేసేవు కదా?"

"ఆ."

"చూడు బాబూ! ఒకరు నన్ను వైద్యరాజా అంటారు. మరొకరు ఆచార్యా అంటారు. ఇంకొకరు బాబా అని పిలుస్తున్నారు. ఇవన్నీ జ్ఞాపకం ఉంచుకోడం కష్టం-మీరంతా నన్ను నా చిన్నప్పటి ముద్దుపేరు చక్కూ అని పిలుస్తూ వుండండి" ఆయన మాధవ్‌వేపు తిరిగి అన్నారు.

"ఉహూ! ఆడవాళ్ళ అలవాట్లు మారటం కష్టం. అంచేత మేమంతా మిమ్మల్ని బాబా చక్రపాణి పాండేయ్ అనే బదులు 'బాబా' అని అంటాం."

"సరే అయితే, పద. దీపం వెలిగించడం అయింది."

వాళ్ళిద్దరూ మెట్లుదిగి కిందికి వెళ్ళారు. నావలో మూడొంతుల భాగంరో రెండువంతులు పైన కప్పువేసివుంది. కిందని ఓ గది తర్వాత ఓ గది చొప్పున రెండు చిన్నగదులు వున్నాయి. ఓ పక్క నావలో ఖాళీస్థలం వుంది ఇద్దరూ ఓ గదిలోకి వెళ్ళారు. అక్కడ దీపపు మసకకాంతిలో ఓ మంచం కనిపిస్తోంది. దాని మీద కంఠం వరకూతెల్లటి దుప్పటి కప్పుకుని ఎవరో పడుకుని వున్నారు. మంచం పక్కనే వున్న పీటమీదకూచున్న ఓ యువతి లేచినిల్చుంది.

"భామా! యువరాజు కదిలాడా?"

"లేదు బాబా! ఆయన ఊపిరి ఒకేలయలో తీసుకుంటున్నారు."

"గాభరా పడటంలేదు కదా తల్లీ!"

"చక్రపాణిగారి నీడని వుండగా గాభరా ఎందుకు? గహడ్‌వార్ వంశం ఇంతకుముందే తమగురువు ద్రోణాచార్యుణ్ని గుర్తించగలిగి వుండివుంటే!"

"ఈయన మన సేనాధిపతి. మనకి గొప్ప సహాయకుడు. మహారాజాధిరాజు హరిశ్చంద్రుని సేనాధిపతి మాధవుడు."

"మహాదేవి భామా! మీ సేవకుడు మాధవుడు మిమ్మల్ని సేవించుకోడానికి సిద్ధంగా వున్నాడు" అని మాధవుడు ఆమెకి నమస్కరించాడు.

"నేను మన మాధవుణ్ని ఎరుగుదును. యువరాజుతోపాటు చిన్నప్పుడు మట్టిలో ఆడుకునేవాడు, మర్చిపోతామా?"

"భామా! గహడ్‌వార్ వంశపు లక్ష్మిని ధూళీ దుమ్ము కొట్టుకుపోయి కిందపడి పోయిన దాన్ని తిరిగి లేవనెత్తే భుజబలం మాధవుడిలో వుంది."

"బాబా! మీ నోట భామా అన్న పిలుపు ఎంతబాగుందో!"

"మీ తండ్రి జ్ఞాపకం వస్తున్నారా అమ్మా!"

"లేదు బాబా! మనం రాజకులంలో మార్పు తీసుకురావాలి. అబ్బా! ఎంత కృత్రిమత్వం! ఎంత నటన! మనం మనిషికీ మనిషికీ మధ్య సరళమైన సంబంధాలని ఏర్పరచుకోవాలి. పాత రాజకులాన్ని (మావగారు) పరమభట్టారకులు మహారాజు గారితోపాటే పోనియ్యాలి."

"పోయింది తల్లీ! అది పోయింది. పాతపద్ధతి పోయి చాలారోజులయింది. నువ్వు యువరాజకుమారుని అంతఃపురం చూశావా?"

"బాబా! మీరు మమ్మల్ని మళ్ళీ మనుషులుగా చేశారు." కన్నీళ్ళు తుడుచుకుంటూ భామ అన్నాది.

"లేదు తల్లీ! హరిశ్చంద్రుడి బదులు ఇంకెవరన్నా అతని స్థానంలో వుంటే నేను చాలా కష్టపడి వుండేవాణ్ని. ఇదంతా కుమార హరిశ్చంద్రుడు...."

"బాబా!"

అంతమందీ కుమారుడి సహం తెరిచిన కళ్ళని చూశారు. భామ అతని దగ్గరికి పరిగెట్టుకు వెళ్ళింది.

"చంద్రా! రాహువు నోటినుంచి బైటపడ్డావు చంద్రా!"

"అవును భామా! అవును, బాబాగొంతు నాకు వినిపించిందే!"

"బాబావా?"

"గహడ్‌వార్‌లని ముంచేసిన ఆ బాబా (తండ్రి) కాదు. ఈ బాబా- నువ్వు బాబా అని పిలుస్తూ వుంటావ్—ఈయన—నేనూ బాబా అనే పిలుస్తాను."

చక్రపాణి దీపపుకాంతిలో కుమారుడి పాలిపోయిన మొహాన్ని చూసి నుదుటిమీద చేత్తోరాస్తూ "నాయినా కుమారా! ఒంట్లో ఎలా వుంది?" అని అడిగాడు.

"ఒంట్లో బాగానే వుంది. యుద్ధరంగంలో గాయాలు తగిలి వచ్చినట్లుగా అనిపించడం లేదు."

"గాయం పెద్దదే కుమారా!"

"అయివుంటుంది. కాని అమృతహస్తుడు బాబా దగ్గర కదా వున్నాను."

"ఎక్కువ మాట్లాడకు కుమారా!"

"హరిశ్చంద్రుడికి బాబా చక్రపాణి నోట వచ్చిన ప్రతీపలుకూ బ్రహ్మవాక్కే."

"కాని అలాంటి హరిశ్చంద్రుడు చక్రపాణికి ఎందుకూ పనికిరాడు."

"బాబా! ఇది హరిశ్చంద్రుడికి మీమీదున్న భక్తి శ్రద్ధాను! బుద్ధి వివేకపు విషయంలో హరిశ్చంద్రుడు బ్రహ్మవాక్కైనా గీటురాయి మీద గీసి చూడందే ఒప్పుకోడు."

"కుమారా! గహడ్‌వార్ వంశమే కాదు, హిందూదేశం కూడా నీలాంటి వాడు వున్నందుకు ధన్యమయింది."

"బాబా చక్రపాణి వున్నందువల్ల-కొంచెం నీళ్ళు."

భామ వెంటనే గ్లాసులో నీళ్ళు యిచ్చింది. నావ వెళ్తూ వున్నట్లు చూసి బాబా ఇలా అన్నారు- "మనం బనారసు వెళ్తున్నాం కుమారా! రెండో రాజధానికి. సేనాధిపతి మాధవుడు సేనకి ఆదేశాలిచ్చాడు. సేనలు అటు తురకల్ని అటకాయిస్తాయి. ఇటు మనం బనారసులో గహడ్‌వార్ రాజ్యలక్ష్మి కోసం సైనికుల్ని సిద్ధం చేద్దాం."

"ఊహూ కాదు బాబా! మీరు మరోసందర్భంలో చెప్తూ వుండేవారే-అలాగ హిందూ రాజ్యలక్ష్మిని తిరిగి ప్రతిష్టించటానికి సిద్ధంచేద్దాం. పునఃప్రతిష్టించే రాజ్యలక్ష్మి హిందూ రాజ్యలక్ష్మి అవాలి. దీనిని హిందూ భుజబలంతో గెలిచి తిరిగి సంపాదించాలి—బ్రాహ్మణ చండాలులన్న భేదాన్ని రూపుమాపి."

"అవును ఆచార్యా!"

# బాబా నూర్‌దీన్

కాలం : క్రీ. శ. 1300

"హిందూదేశాన్ని పాడిఆవు అని అనుకునే ఆ రోజులు పోయాయి. అప్పుడు మనం రైతుల దగ్గర్నుంచి, చేతిపనివాళ్ళ దగ్గర్నుంచి, వ్యాపారస్థుల దగ్గర్నుంచి, రాజుల దగ్గర్నుంచి ఎక్కువకెక్కువ ధనాన్ని లాగి పోగుచేసి గోర్ (కందార దగ్గర వున్న ఓ ప్రదేశం) కైనా పంపించేవాళ్ళం, లేదా మనమే ఆ ఐశ్వర్యాన్ని అనుభవించేవాళ్ళం. ఆ రోజులు పోయాయి. ఇప్పుడు మనం గోర్‌కి బానిసలం కాం. హిందూదేశపు ఖిల్జీ పరిపాలకులం. స్వతంత్రులం." స్ఫూర్తివంతుడైన ఓ యువకుడు తన నల్లనిగెడ్డం మీద వున్న పల్చటి మీసాన్ని వేళ్ళతో దువ్వుతూ అన్నాడు. ఆతనికి ఎదురుగా తెల్లటి పొడుగైన గెడ్డం, పెద్ద తలపాగా, తెల్లటి పొడుగైన అంగీతో వున్న ఓ ముసలివ్యక్తి మోకాళ్ళ మీద కూచుని వున్నాడు. అతని మొహం ప్రశాంతంగానూ స్ఫూర్తివంతంగానూ వుంది.

"కాని, లోకరక్షకా! గ్రామ మునసబుల్నీ, గ్రామాధికారులనీ, ఇలాకాదారుల్ని దెబ్బగొడితే వాళ్ళకి కోపం వస్తుంది. సామ్రాజ్యంలోని ఊరూరూ తిరిగి పన్నులు వసూలు చెయ్యడానికి మన సైనికుల్ని పంపించలేం." అన్నాడు ముసలాయన.

"ముందు మీరు హిందూదేశస్థులయి హిందూ పరిపాలకులుగా వుందామనుకుంటున్నారో లేకపోతే రత్నవైడూర్యాలన్ని ఒంటెల మీదా కంచరగాడిదల మీదా నింపుకుని తీసుకువెళ్ళే గజనీ, గోరీల దోపిడీదార్లుగా వుందామనుకుంటున్నారో ఆ సంగతి తేల్చి చెప్పండి."

"ఇప్పుడు మనం హిందూదేశంలో వుండాలి లోకరక్షకా!"

"అవును, అయితే బానిసల్లాగా ఇప్పుడు మన పునాదులు గోర్‌లో లేవు, ఢిల్లీలో వున్నాయి. ఏదన్నా తిరుగుబాటు వచ్చినా, ఏదన్నా గందరగోళం జరిగినా మనకిప్పుడు అరేబియానుంచీ, అఫ్ఘనిస్తాన్ నుంచీ సైన్యం సాయపడ్డానికి రాదు. మనం పారిపోయి తలదాచుకోడానికి అక్కడ స్థలమూ లేదు!"

"నిజమే. ఒప్పుకుంటున్నాను, లోకరక్షకా!"

"అంచేత మనం ఇక్కడే వుండాలి. దీన్ని సరిచెయ్యాలి. ఇక్కడివాళ్ళు సుఖంగా శాంతితో వుండేటట్టు చెయ్యాలి. ఇక్కడి ప్రజల్లో ఎంతమంది తురకలు వున్నారు? నూరేళ్ళయినా ఢిల్లీకి చుట్టుప్రక్కల వున్న వాళ్ళని మనం తురకలుగా

చెయ్యలేకపోయాం. మొత్తం ఢిల్లీని, ఈ ప్రాంతాన్ని తురకమయం చెయ్యడానికి ఎంతకాలం పడుతుందో మీరే చెప్పండి, ముల్లా అబూ మహమ్మద్!"

ఎదురుగా కూచున్న మరో వృద్ధుడు బోసినోటి కిందనుంచి బొడ్డువరకూ వేళ్ళాడుతున్న తెల్లటి గడ్డాన్ని సవరించుకుంటూ ఇలా అన్నాడు-"బాద్షాహ్! నేనేం అధైర్యపడ్డం లేదు. ఎనభై ఏళ్ళ అనుభవంతో ఈ ముసలివాడు తెలుసుకున్నదేమిటంటే - మనం బలవంతంగా తురకలుగా చేద్దామనుకుంటే మనం ఎప్పటికీ పూర్తిగా కృతకృత్యులం కాలేం. అదీ నా నమ్మకం."

"అంచేత హిందూదేశంలో స్థిరంగా నివాసం ఏర్పరచుకున్న మనం యావత్తు హిందూదేశం తురకమయం అయ్యే వరకూ ఎదురుచూస్తూ కూచోలేము. మనమో శతాబ్దాన్ని ఉట్టుటిదీ వ్యర్థంగా పోగొట్టుకున్నాం. మన ప్రజల కష్టసుఖాల గురించి పట్టించుకోకుండా మనభూమిపన్నులు, వర్తకపు పన్నులూ, శిస్తులూ ఎక్కువకెక్కువ వసూలు చెయ్యాలని అనుకున్నాం. దాని ఫలితం ఎదురుగుండా ఉంది. బాద్షా ఖజానాలోకి ఓ రూపాయ జమ అయితే భూమి శిస్తు వసూలు చేసేవాళ్ళు ఐదు రూపాయలు తినేస్తారు. గ్రామాధికార్లనీ, మునసబుల్నీ గుర్రాల మీద స్వారీచేస్తూ, పట్టు బట్టలు కట్టుకుని ఇరానులో తయారైన విల్లు పట్టుకుని బాణాలు వెయ్యడం ప్రపంచంలో ఏ దేశంలోనన్నా చూస్తామా? ఉహూఁ వజీర్! నా సామ్రాజ్యంలో ఇలాంటి దోపిడీని ఇక ఆపుచెయ్యాలి."

"కాని హుజూర్! ఈ లోభంతో ఎంతమందో హిందువులు ముసల్మానులుగా మారారు. ఇప్పుడు ఈ మార్గం కూడా లేకుండా పోతుంది!"

"ఇస్లాం ఇలాంటి దోపిడీని లంచగొండితనాన్ని అంగీకరిస్తే రాజకోశాగారానికీ, రాజ్యపు వస్తువులకీ ముప్పు వస్తుంది. ఇలాంటి సేవకులు ఉన్న రాజ్యంగురించి ఏం ఆశలు పెట్టుకోగలం?"

"జహాపనాహ్! ఇలాంటివాళ్ళనుంచి సామ్రాజ్యపు పునాదులు గట్టిపడలేవు. ఒప్పుకోవల్సిందే! శాంతిభద్రతలూ కట్టుబాట్లూ సరిగ్గా ఉండవేమోనని నా ఆలోచన." అన్నాడు మంత్రి.

"గ్రామంలోని అధికార్లు తాము కోరుకున్నట్టూ తమకి చేతదయినట్లయితే చేసుకోవచ్చు. కాని గ్రామంలో అధికార్ల సంఖ్య ఎక్కువా? రైతులు ఎక్కువా?"

"రైతులే. నూరుమందికి ఓ అధికారి చొప్పున వేసుకోవచ్చు."

"ఆ నూరుమంది రైతుల రక్తాన్ని పీల్చి ఆ అధికారి గుర్రపుస్వారీ చెయ్యగలుగుతాడు. పట్టుబట్టలు కట్టుకోగలుగుతున్నాడు. ఇరాన్ విల్లూ అమ్ములూ వాడగలుగుతున్నాడు. ఈ రకమైన పీడించడాన్ని ఆపుచేసి మేం రైతుల స్థితిని బాగుచేస్తాం. పరిపాలకుల పట్ల విశ్వాసపాత్రులుగా ఉండేటట్టు చేస్తాం. ఒకణ్ణి కాదని దుఃఖం కలిగించి, వందమందిని సంతోషపెట్టడం, సంపన్నులు చెయ్యడం మంచిది కాదూ?"

"తప్పకుండా హుజూర్! నాకూ ఇహ అనుమానం ఏం లేదు. హిందూదేశం లోని ముసల్మానుల్లోనూ సుల్తానుల్లోనూ మీరో కొత్త వరవడి పెట్టబోతున్నారు. తప్పకుండా ఇది సఫలమవుతుంది. దీన్నించి గ్రామాల్లోని పైతరగతి వాళ్ళకి కొంచెంమందికి మాత్రమే కోపం కలుగుతుంది."

"గ్రామాల్లోనూ, పట్టణాల్లోనూ పైతరగతి వాళ్ళు కొంతమంది కోపగించు కున్నా ఫర్వాలేదు. కొద్ది రోజులవరకూ ఉండే ఇప్పటి గుడిసెకి బదులు దిట్టమైన భవనానికి - స్సామ్రాజ్యానికి గట్టి పునాదులు వెయ్యాలి."

ముల్లా ఏదో ఆలోచిస్తున్నాడు. తన గెడ్డాన్ని సవరించుకుంటూ ఆయన ఇలా అన్నాడు: "గ్రామంలోని అధికారులకి బదులు గ్రామాల్లోని అంతమంది రైతుల అభివృద్ధి గురించి యోచించటం స్సామ్రాజ్యానికి ఎంతో లాభదాయకం అవు తుంది. మేం గ్రామాల్లోనూ, బస్తీల్లోనూ ఉండే బట్టలునేసే నేతపనివాళ్ళని కాస్త చూశాం. వాళ్ళ పంచాయితీలని సుదృఢం చెయ్యడానికి సాయపడ్డాం. వ్యాపార స్థుల బారినుండీ, వడ్డీవ్యాపారస్థుల బారినుండీ వాళ్ళని కాపాడాం. ప్రతీ అధికారీ వెట్టికి వాళ్ళచేత బట్టలు నేయించుకునేవాడు. దూది ఏకింపించేవాడు. దాన్ని మాని పించాం. బట్టలునేసే వాళ్ళూ, కుట్టేవాళ్ళూ ఇంచుమించు అందరూ ఇస్లాం నీడ కిందకి వచ్చేశారు."

"చూశారా ముల్లాసాహెబ్ ! స్సామ్రాజ్యానికి మేలుచేసేది ఏదైనా ఇస్లాముకీ చేస్తుంది."

"కాని ఒక విన్నపం. మీరు గొప్పవాళ్ళకీ, సంపన్నులకీ (ముసల్మానుల) నాయకులు."

"దాంతోపాటు హిందువుల సుల్తానుని కూడా! హిందూదేశంలో ముస్లిముల సంఖ్య చాలా తక్కువ. బహుశా వెయ్యిమందికి ఒకరు ఉంటారు."

"హిందువులు ఇస్లాముని అవమానపరుస్తూ ఉంటారు. ముందు ముందు వాళ్ళ ధైర్యం ఇంకా పెరుగుతుంది. ఇలా అవమానపర్చటాన్ని ఆపు చెయ్యాలి."

"అవమానపర్చటమా? పవిత్రమైన ఖురాన్‌ని కాళ్ళతో తొక్కి అవమానిస్తు న్నారా?"

"అంత ధైర్యం ఎక్కడుంటుంది?"

"మసీదుల్ని అపవిత్రస్థలాలని అంటున్నారా?"

"అదీ అనలేరు."

"మన ప్రవక్త ఖుదాని బహిరంగంగా అందరి ఎదటా తిడుతున్నారా?"

"లేదు జహాపనాహ్ (లోకరక్షకా)! పైగా మన సూఫీలతో సాంగత్యం చేసిన వాళ్ళు మన ప్రవక్త ఖుదాని కూడా ఋషి అని ఒప్పుకుంటున్నారు. కాని వాళ్ళు మన ఎదుటే ఇస్లాము మతానికి విరుద్ధమైన ఆచారాలని పాటిస్తున్నారు."

"మీరు వాళ్ళని కాఫిర్లని (మతవిరుద్ధంగా నడిచేవాళ్ళ)ఒప్పుకుంటున్నారు. మరి అలాంటప్పుడు ఇస్లాం మతానికి విరుద్ధమైన ఆచారాలని పాటిస్తే నేరంగా ఎంచుతారేం? నా పినతండ్రి సుల్తాను జలాలుద్దీను నాలాగ తనని తాను శాశ్వతంగా హిందూ పరిపాలకుణ్ణని అనుకోలేకపోయాడు. లేదూ యావత్ హిందూ దేశం ముస్లిము దేశం అయ్యేంతవరకూ కొద్దికాలమే ఉండే (టెంపరరీ) పరిపాలకుణ్ణనీ అనుకోలేదు. ఎటూ నిర్ణయించుకోలేకపోయాడు. కాని ఆయన ఓసారి మీలా ప్రశ్నించేవాళ్ళకి ఏం జవాబు ఇచ్చారో తెలుసా?"

"తెలీదు హుజూర్!"

"ఆయన అన్నారు కదా-"ఏయ్ మూర్ఖుడా ! రోజూ హిందువులు నా మహలు ముందునుంచే శంఖాలు ఊదుతూ డోలువాయిస్తూ యమునానది ఒడ్డున ఉన్న తమ దేవతా విగ్రహాలని పూజించటానికి వెళ్తూ ఉండడాన్ని నువ్వు చూట్టంలేదా ? వాళ్ళు నా కళ్ళ ఎదటే ఇస్లాంమతానికి విరుద్ధమైన తమ మత ఆచారాలని పాటిస్తున్నారు. నా ప్రతాపాన్నీ, నా రాజరికపు ప్రతాపాన్నీ, లెక్కచెయ్యకుండా అగౌరవపరుస్తున్నారు. నా మతానికి శత్రువులు–హిందువులు,నా రాజధానిలో నా కళ్ళముందే ఐశ్వరాల్లో,భోగాల్లోమునిగితేలుతూ, దర్జాగాఆడంబరంగాబతుకుతున్నారు.ధనసంపత్తిచేతా, సుఖసమృద్ధిచేతా ముస్లిముల ముందు తమ గొప్పనీ, డాబునీ, గర్వాన్నీ ప్రదర్శిస్తున్నారు. వాళ్ళని భోగవిలాసాల్లో మునిగి తేలేటట్టూ, గర్వంతో మదంతో విర్రవీగేటట్టూ చేసి వదిలేసినందుకు లజ్జపడుతున్నాను. వాళ్ల పన్ను రూపంలో ఇచ్చే నాలుగురాళ్ళు పుచ్చుకుని సంతోషపడుతున్నాను. అదీ వాళ్ళు నాకు ఏదో దానం చేస్తున్నట్టు ఇస్తూ ఉంటే పుచ్చుకుంటూ తృప్తిపడి ఊరుకుంటున్నందుకు సిగ్గుపడుతున్నాను. ఇదీ ఆయన చెప్పినది. ఇంతకన్నా బాగా నేనూ దీనికి జవాబు ఇవ్వలేనని అనుకుంటున్నాను."

"కాని సుల్తాన్! సుల్తానులకి ఇస్లాంమతంపట్ల నిర్వర్తించవలసిన కర్తవ్యం కూడా ఉంది."

"నేరంచేసి మృత్యుదండన పొందినవాణ్ని, వాడు ఇస్లాంమతాన్ని పుచ్చుకోడానికి అంగీకరిస్తే - వదిలిపెట్టగలుగుతాను. బానిస ఇస్లాంలో చేరినట్లయితే వాడికి బానిసత్వం నుంచి విముక్తి కలిగేటట్టు హుకుం జారీ చెయ్యగలుగుతాను. రాజ కోశాగారం నుంచి కొనటానికి పెట్టిన వెలని ఇచ్చి విడిపించగలుగుతాను. కాని ఈ దేశంలో కోట్లకొద్దీ రూపాయలు బానిసలను కొనడానికి ఖర్చు అయ్యాయి. అంతమంది బానిసలకీ స్వేచ్ఛ కలిగించమని మీరూ అనలేరు కదా?"

"అనను ప్రభూ! బానిసలను ఉంచుకోడాన్ని అల్లా కూడా న్యాయ సమ్మతమేనని ఉచితమేనని చెప్పాడు."

"మీరుగాని చెపితే సింహాసనానికి ప్రమాదం వచ్చినా సరే నేను ముస్లిము

జానీసలకీ, ముస్లిమేతర బానిసలకి స్త్రీ పురుషులందరికీ స్వేచ్ఛ కలిగేటట్టు ఆజ్ఞ జారీచేస్తాను."

"ఉహూఁ వద్దు. ఇస్లాంమతానికి విరుద్ధంగా చేయడం అవుతుంది."

"ముల్లాసాహెబ్! ఇస్లాంమతానికి వ్యతిరేకం అన్న మాటని వదిలెయ్యండి. మీ దృష్టి ఇప్పుడు ఏ ఆమీనా దాసీ మీదో పడి ఉంటుంది!! ముస్లిముల ఇళ్ళలోనే అందరికన్నా ఎక్కువగా బానిసలు ఉన్నారు."

"అల్లా ధార్మికులైన ముసల్మానులు బానిసల్ని ఉంచుకోవడం ఉచితమనే చెప్పాడు."

"కాని ఆ బానిస స్త్రీలూ పురుషులు కూడా ధార్మికులైన ముస్లిములయితే ? అలాంటప్పుడు! మీరు వాళ్ళని ఈ ప్రపంచంలో స్వేచ్ఛగా ఊపిరి తీసుకోనివ్వదలచు కోటంలేదు. కేవలం స్వర్గం పేరు చెప్పి ఆ ఆశలో ఉంచాలనుకుంటున్నారు."

"ముసల్మాను రాజ్యంలో ఇస్లాంమతం ప్రకారం పరిపాలన జరగాలి. నేను చెప్పదలచుకున్నది అంతే. ఇంక నేనేమీ అనను."

"ఈ అనుకోడం అన్నదేం తక్కువ సంగతికాదు. దీనికి ముస్లిం సామ్రా జ్యంలో అధిక సంఖ్యాకులు ముస్లిములవాలి. మీకు నా అభిప్రాయాన్ని స్పష్టంగా చెప్పబోతున్నాను. వజీర్‌సాబ్! మీరూ వినండి. మహమ్మదు సుల్తానులాంటి ఓ విదే శపు సుల్తాను, బ్రహ్మాండమైన తన విదేశీ సైన్యంతో శాంతిగా బతుకుతున్న నగరాల మీదపడి, కొల్లగొట్టి, ఒంటెలమీదా, కంచరగాడిదలమీదా కొల్లగొట్టిన సొత్తుని వేసుకుని పోగలిగితే పోగలుగుతాడు కాని అల్లాగ్గా చెయ్యడం ఢిల్లీలో పిల్లా పాపాతో నివాసం ఏర్పరచుకున్న నాలాంటి వాడికి సాధ్యంకాదు. హిందూ ప్రజలు చెల్లించే పన్నుల మీదా, హిందూ సైనికుల మీదా, సేనానాయకులమీదా నాప్రభుత్వం ఆధారపడి ఉంది. నా సేనాధిపతి మలిక్ హిందువే! చిత్తౌడ్ రాజు ఐదువేల సైన్యా నికి సేనాధిపతి."

"కాని జహాపనాహ్ ! బానిసవంశపు సుల్తాను ఢిల్లీలో ఉండేవారు."

"మీరేం సందేహించి తటపటాయించకండి. నన్ను అస్థిరుణ్ణనీ, కోపిష్టి వాణ్ణనీమీరు అనొచ్చు! కాని మీ అభిప్రాయాలకి వ్యతిరేకమైన అభిప్రాయాన్ని చెప్పడం మాత్రం మానను. బానిసవంశపు పరిపాలన మూణ్ణాళ్ళ ముచ్చట పరిపాలన! మంగో లుల దాడికి హిందూదేశంలోని ముసల్మానుల సామ్రాజ్యం ఎలాగో తట్టుకుని బట్ట కట్టి బతికింది. మంగోలుల్లాంటి శత్రువుల్ని ముసల్మానులు ఎప్పుడూ చూసి ఎరగ రన్న సంగతి హిందువులకి తెలీదు. లేకపోయినట్లయితే, వాళ్ళు ఏ కొంచమైనా మంగోలుల్ని రెచ్చగొట్టి ఉంటే హిందూదేశంలో కొత్తగా నాటుకున్న, ఇస్లాం పేరు కైనా మిగిలి ఉండేది కాదు. చంగేజ్ వంశం ప్రపంచంలోకెల్లా పెద్దదైన రాజ్యం చైనాని పరిపాలిస్తోంది. మీకు తెలుసుకదా!"

"తెలుసు జహాపనాహ్!" ముల్లా అన్నాడు.

"ఆ వంశం శ్రమణమతాన్ని (బౌద్ధమతం) ఒప్పుకుంటుంది."

"శ్రమణమతమా? ఇస్లాంమతానికి వ్యతిరేకమైన మతం! హిందూదేశం నుంచి ఆ మతం నాశనం కావటంలేదు! వాళ్ళ మఠాలనీ మందిరాలనీ కాల్చి నాశనం చేసినా ఆ మతం చావలేదు."

"ఇస్లాం మతానికి వ్యతిరేకమైన అదే ఎందుకయింది?"

"హిందువుల మతం-బ్రాహ్మణుల మతంలో సృష్టికర్త అల్లా గురించిన భావం ఉంది కాని, ఈ శ్రమణులున్నారే, వాళ్ళు సృష్టికర్తని ససేమిరా ఒప్పనన్నా ఒప్పుకోరు జహాపనాహ్!"

"చంగేజ్‌వంశం వాళ్ళు ఇప్పుడు కాదు, వాళ్ళ మనమడు కుబ్లైఖాను కాలం నుంచీ శ్రమణుల శిష్యులమని చెప్పుకుంటారు. అంతేకాదు, చంగేజ్ సైన్యంలోని మంగోలులలో చాలామంది సేనాధిపతులూ సైనికులూ శ్రమణులే, ఇస్లాం ప్రపంచంలోని పట్టణాలు బుఖారా, సమరకంద్, బలఖ్ మొదలయినవాటిని, ముసల్మాను సభ్యత ఉన్న కేంద్రాలన్నిటినీ ఏరిఏరి మట్టుపెట్టారు. మన స్త్రీలని, ఉన్నతవంశం వాళ్ళవనీ, తక్కువ వంశం వాళ్ళవనీ ఏం లెక్క చెయ్యకుండా అందరినీ దాసీలు (బానిసలు)గా చేశారు. నిర్దయగా పిల్లల్ని హత్య చేశారు. ఈ అత్యాచారాలన్నిటికీ ప్రోద్బలం యిచ్చినవాళ్ళు ఆ శ్రమణ మంగోలులే!

అరబ్బులు మా విహారాలని (బౌద్ధ) నాశనం చేశారు. మా నగరాల్ని ధ్వంసం చేశారు. కాల్చేశారు. మా పిల్లల్ని చంపేశారు. వీటన్నిటికి మనం ప్రతీకారం తీర్చుకోవాలి అని వాళ్ళు చెప్తున్నారు. ఒక్కసారి ఆలోచించి చూడండి. ఈ మంగోలులు ఓ వేళ హిందూ శ్రమణులతో (బౌద్ధ) కలిసి హిందువుల్ని తమవేపు గాని లాక్కోవడంలో కృతకృత్యులయి ఉంటే ఇస్లాంమతం స్థితి ఏమై ఉండేది?"

"సర్వనాశనమై ఉండేది జహాపనాహ్!"

"అందుకే మనం ఇసకపునాదులమీద మన రాజ్యాన్ని లేవదియ్యకూడదు. మనం బానిసవంశపు రాజులని అనుకరించకూడదు."

వజీరు ఇప్పటివరకూ ఏమీ మాట్లాడలేదు. ఇప్పుడు నోరు తెరిచాడు.

"కాని మహాప్రభూ! గ్రామాల్లోని రాజోద్యోగులు బలహీనులైపోతే ప్రభుత్వ పాలన అక్కడ ఎలా జరుగుతుందండీ?"

"పట్టుబట్టలు కట్టుకుని గుర్రాల మీద స్వారీ చేసే రాజోద్యోగులు ఉన్నప్పుడు ఎలా పనులు జరిగేవో మీకు తెలుసా?"

"నేనెప్పుడూ తెలుసుకోడానికి భోగట్టా చెయ్యలేదు."

"నేను భోగట్టాచేసి తెలుసుకున్నాను. పరిపాలకులు తమనితాము దోపిడీదార్ల లాంటి వాళ్ళమని అనుకున్నరోజుల్లో దోపిడీచేసే రాజోద్యోగులనే నియమించేరు. అల్లాగా అన్నికాలాల్లో అన్నిదేశాల్లోనూ జరుగుతుంది. అంతకుముందు ప్రతీ గ్రామానికి పంచాయతీ ఉండేది. ఆ పంచాయితీయే గ్రామంలో నీటిపారుదల ఏర్పాట్లు,

తగాదాలు, కలహాలు తీర్చటం దగ్గర్నుంచి ప్రభుత్వానికి చెల్లించే పన్నులవసూలు వరకూ అన్ని ఏర్పాట్లు చేసేది. రాజుకి గ్రామంలో ఇంకేవ్యక్తితోనూ సంబంధం ఉండేదికాదు. పంచాయతీతోనే సంబంధం. పన్నులు ఇచ్చే రైతులకి తనకి మధ్య సంబంధాన్ని కలిగించేవి ఈ పంచాయతీలే అని అనుకునేవాడు."

"అయితే జహాపనాహ్! నూరేళ్ళక్రితం రూపు మాసిపోయిన పంచాయతీలని మళ్ళీ మనం పునరుద్ధరించాలి."

"మరో మార్గంలేదు. ఇస్లాం సామ్రాజ్యాన్ని ఈ దేశంలో బలపర్చాలని మనం అనుకునేటట్లైతే ప్రజల్ని అన్నివిధాలా సుఖపెట్టడానికిశాయశక్తులా ప్రయత్నం చెయ్యాలి. హిందూ ప్రజల ఆచార వ్యవహారాలు, వాళ్ళ నీతినియమాలు, అన్నిటిని మనం గౌరవించాలి. ఢిల్లీరాజ్యంలో ఇస్లాంమతం నియమాలు పాటించబడవు. సుల్తాను నీతి పాటించబడుతుంది. ఇస్లాంని ప్రచారం చెయ్యటం ముల్లాల పని. వాళ్ళకి మేం ధన సహాయం చేస్తాం. అది సూఫీల పని. వాళ్ళు ఆ పనిని బాగానే చేస్తున్నారు. వాళ్ళ ఖాన్‌కాహ్‌లకి (ముసల్మాను గురువుల మఠాలు) నగదు డబ్బు ఇస్తాం. లేదా ప్రభుత్వపు పన్నుల్ని వాళ్ళకి రద్దుచేస్తాం."

## 2

వర్షాకాలం పూర్తైపోయింది. అయినా చెరువుల్లోనూ, మడుగుల్లోనూ ఇంకా నీరు నిండుగా ఉంది. పెద్దపెద్ద గట్లతో వరిచేలు నిండా నీళ్ళతో ఉన్నాయి. పచ్చటి పొలాలు కన్నులపండువుగా ఉన్నాయి. నాలుగుదిశలా పచ్చటిపొలాలతో ఆవరించుకుని ఉన్న మగధలో హిస్సా (పాట్నా) అనే పెద్దగ్రామం ఉంది. ఆ ఊళ్ళో వ్యాపారస్థుల భవంతులు ఇటుకలతో కట్టినవీ, రైతుల ఇళ్ళు, కార్మికుల ఇళ్ళు-గడ్డితో కట్టినవి, పెంకుటిళ్ళూ ఉన్నాయి. అవేకాక బ్రాహ్మల ఇళ్ళూ కూడా ఉన్నాయి. వాళ్ళ ఇళ్ళు రైతుల ఇళ్ళకన్నా, కార్మికుల ఇళ్ళకన్నా కాస్త బాగున్నాయి. నూరేళ్ళక్రితం హిస్సాలోని దేవాలయాన్ని మహ్మద్ బిన్ బఖ్తియార్ ఖిల్జీ సైన్యం ధ్వంసం చేసింది. ఆతర్వాత ఆ శిథిలాల్లోనే హిందువులు తమ దేవుళ్ళని పూజించు కుంటున్నారు. గ్రామానికి పడమటిదిశని బౌద్ధుల మఠం ఉంది. మఠంలోని ప్రతిమా గృహం పడిపోయింది. కాని, మిగతా భాగంబాగానే ఉంది. మఠంలోకి వెళ్ళి అక్కడ నివసిస్తున్న వాళ్ళని చూస్తే బౌద్ధ భిక్షువులు మఠాన్ని వదిలేసి వెళ్ళిపోయారని ఎవరూ అనుకోరు!

ఆ వేళ సాయంత్రం మఠం బైటని రాతితో కట్టి వున్న చిన్న అరుగుమీద ఓ మధ్య వయస్కుడు కూచుని ఉన్నాడు. అతని ఒంటిని కాషాయబట్టలు ఉన్నాయి. కనుబొమలూ తలమీద వెంట్రుకలూ కత్తిరించి ఉన్నాయి. గెడ్డం కాస్త మాసి ఉంది. అతని చేతిలో జపమాల ఉన్నది. అళ్ళ ఆశ్వయుజ పూర్ణిమ. ఊళ్ళోని

ఆడ మగా అందరూ బట్టలు, తినుబండారాలు మొదలైన వస్తువులు తీసుకొచ్చి ఆ కాషాయవస్త్రాలు కట్టుకున్నాయనకి సమర్పించి ప్రణామం చేస్తున్నారు. ఆయన చిరు నవ్వుతో చెయ్యెత్తి వారినీ ఆశీర్వదిస్తున్నాడు.

ఇదేమిటిది? హిస్సారోని ప్రాచీన బౌద్ధమతం ధ్వంసం అయిపోయింది కదా? అయినా కాని ఒకటి మాత్రం నిజం - శ్రద్ధాభక్తులన్నవి మతాలబైట భక్తుల మన స్సుల్లో ఉంటాయి! హిస్సాలోని ఈ కాషాయవస్త్రాల్లో ఉన్న బాబాని చూసి ఇవాళ ఎవరైనా అతణ్ని బౌద్ధభిక్షువు అనికాక ఇంకేమన్నా అనగలరా? అతడు అవివాహి తుడు. అంతేకాదు, అతనికి ముందు నలుగురు గురువులూ అవివాహితులే! కాషాయ వస్త్రాలు ధరించినవాళ్ళే, హిందువులు-లేదా బౌద్ధుల్లోంచి ముసల్మానులయిన పది పన్నెండు మంది చేతిపనివాళ్ల ఇళ్ళవాళ్ళు మాత్రం దాన్ని మతం అనికాక ఖాకకాహ్ (ముసల్మాను గురువుల మఠం) అని అంటారు. బ్రాహ్మలూ కొంతమంది వ్యాపార స్థులు కూడా దాన్ని మతం అని అనరు. కాని మిగతా వాళ్ళందరికీ అది ఇప్పటికి మతమే! ఆ మతంలోని బాబాకి పూర్వమూ వర్ణభేదాలు లేవు. ఇప్పుడు వచ్చిన కొత్తబాబాలకీ జాతి వర్ణభేదాలు లేవు. పూర్వపు బాబాల్లాగే వీళ్ళూ కాషాయ బట్టలు కట్టుకుంటారు. అవివాహితులుగా వుంటారు. జబ్బులు చేసినపుడు జనానికి పట్టిన భూత ప్రేతాల్ని మంత్రం వేసి వదలగొడ్తారు. చావులూ దుఃఖమూ సంభవించిన పుడు వీళ్ళే అగోచరుడు అయిన పరమాత్మ గురించీ నిర్వాణం గురించీ చెప్పి ఉప దేశాలు యిచ్చి జనానికి ఊరట కలిగిస్తారు. అంచేత ఇవాళ శరత్‌పూర్ణిమ నాడు పూర్వపు పద్ధతినే ఈ ముసల్మాను ఫకీరులని కూడా జనం పూజిస్తున్నారు. చేతి పనులు చేసుకునే ముస్లిములు పూర్వం ఎలా అయితే ఆ బౌద్ధ భిక్షువుల్ని తమ ఆరాధ్య గురువులని అనుకునేవారో అలాగ్గానే ఇప్పుడు తమ ఈ బాబాని, కాషాయ వస్త్రాలు కట్టుకునే అతని శిష్యుల్ని అనుకుంటున్నారు.

ఖాన్‌కాహ్‌లోని పీరుల గోరీలకి నమస్కరించి జనం నెమ్మది నెమ్మదిగా వెళ్ళిపోయారు. రాత్రి గడిచినకొద్దీ పుచ్చపువ్వులా వెన్నెల అంతటా పరుచుకుంది. ఆ వేళకి శిల్పకారుల ఇళ్ళవేపు నుంచి ఓ ఇద్దరు వ్యక్తులతోపాటు ఎవరో అరుగు వేపు వస్తున్నట్టు కనపడింది. దగ్గరికి వచ్చేక బాబా మౌల్వీ అబుల్-అలాయీనీ గుర్తు పట్టాడు. ఆయన తలమీద తెల్లటి తలపాగా, వొంటిని పొడుగ్గా వున్న అంగరఖా, కాళ్ళజోళ్ల పైకి ఉన్న పైజామా ఉన్నాయి. ఆయన నల్లని గెడ్డం గాలికి నెమ్మదిగా ఊగుతోంది. బాబా లేచి నిల్చుని రెండు చేతులూ చాచి తియ్యటి గొంతుతో ఆహ్వా నించాడుః

"రండి రండి మౌలానా అబుల్ అలాయీ! అస్సలామ్ అలేఖుం" అన్నాడు.

ముడుచుకున్న మౌలానా చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుని బాబా అతని పక్కకి చేరాడు. మౌలానా అన్యమనస్కంగా "వాలేకుంఁసలాం" చెప్పాడు.

బాబా ఆ రాతి అరుగు దగ్గరికి మౌలానాని తీసుకువెళ్ళాడు.

"మా సింహాసనం ఈ రాతి అరుగే! పయచెయ్యండి" అన్నాడు.

మౌలానా కూచున్నాక బాబా కూడా కూచున్నాడు. మౌలానాయే ముందు సంభాషణ ప్రారంభించాడు:

"శాహ్‌సాబ్! ఇక్కడ కాఫిర్లు గుమిగూడారు కదా! ఆ తమాషాని నేను నిత బడి చూశాను" అన్నాడు మౌలానా.

"తమాషా అని అంటే అనండి కాని మౌలానా! కాఫిర్లని మాత్రం అన కండి. అలా అంటే ఆ జ్యోతిస్వరూపుడికి ములుకులతో పొడిచినట్లు బాధ కలుగు తుంది."

"ఈ హిందువులు కాఫిర్లు (ముసల్మాను మతం ప్రకారం ఈశ్వరుణ్ని అంగీ కరించనివాళ్లు) కాకపోతే మరింకెవరు?"

"అందరిలోనూ ఆ పరంజ్యోతే వుంది. చీకటీ వెలుతురూ ఒకేచోట వుండ లేనట్లుగానే ఆ పరంజ్యోతి ప్రకాశమూ, ఇస్లాం మతానికి విరుద్ధమైన మతమూ వుండ లేవు."

"నీ యీ వేదాంతం అంతా ఇస్లాం మతం కాదు! మార్గభ్రష్టత్వం!"

"మీ అభిప్రాయాలను మార్గ భ్రష్టాలని మేం అనం. మేం 'నది ఒకటే– రేవులు మాత్రం అనేకం' అనే మాటని నమ్మేవాళ్ళం. అది సరే, ఇది మీరు ముందు చెప్పండి– మనుషులంతా ఆ ఖుదా సంతానమేనని మీరు ఒప్పుకుంటారా? లేదా?"

"ఒప్పుకుంటాను."

"ఈశ్వరుడు సర్వశక్తి సంపన్నుడని కూడా అంగీకరిస్తారా?"

"ఆహా!"

"మౌలానా! మరి ఆ సర్వశక్తి సంపన్నుడైన ఈశ్వరుడి ఆజ్ఞలేందే ఆకన్నా కదలదు కదా, అలాంటప్పుడు ఆ అల్లా సంతానాన్ని అతని పిల్లల్ని కాఫిర్లందానికి మీరవండి మేమవండి–మనం ఎవరం? అల్లాకి ఇష్టమయిందా అంతమందినీ ఒకే తోవని నడిపిస్తాడు. ఇష్టం లేదూ అంటే అతనికి అన్ని తోవలూ ప్రీతికరమైనవే అని అర్థం!"

"శాహ్‌సాబ్! మీ వేదాంతపు అబద్ధాలని, బూటకాల్ని నాకు చెప్పొద్దు."

"కాని మౌలానా! నేను చెప్పేది ఇస్లాం చెప్పేదే. ఆ దృష్టికోణం నుంచే చెప్తున్నాను. మేం సూఫీలం. అల్లాకి సేవకుడికి మధ్య తేడా వుందని ఒప్పుకోం. మన కల్మా (మహామంత్రం) అన్–ల్-హక్- (నేనే సత్యాన్ని! నేనే బ్రహ్మని! నేనే ఖుదాని!) కదా? అంతా ఆ బ్రహ్మమయమే!"

"ఇది ముస్లిము మతానికి విరుద్ధం."

"మీరలా అభిప్రాయపడుతున్నారు. మీలాగే ఇంతకుముందు కూడా కొందరు అభిప్రాయపడ్డారు. కాని సూఫీలు తమని తాము ఆహుతి చేసుకుని తమ నెత్తురు

ధారపోసి ఈ సత్యాన్ని ప్రతిష్ఠించారు. ముందు ముందు భవిష్యత్తులో అవసరం వస్తే మేం కూడా అదేపని చేస్తాం."

"మీలాంటివాళ్ళ వల్ల ఇస్లాం ఇక్కడ వ్యాపించటం లేదు."

"మేం మీ కత్తినీ, నిప్పునీ చెడ్డవని మనస్ఫూర్తిగా అనుకుంటున్నాం. కాని మిమ్మల్ని మాత్రం మేం అడ్డలేదు. మరి మీరెంత వరకూ కృతకృత్యులయ్యారు? మతాన్ని వ్యాపించగలిగారు?"

"మీరు వాళ్ళ మతాన్ని సత్యం అని చెపుతారు."

"అవును నిజమే. ఎంచేతా అంటే మహత్తరసత్యాన్ని మూతవేసి దాచే శక్తి మాకు లేదు. ఆత్మాహుతి చేసుకున్న అమరజీవుల వల్ల, ఇస్లాం గొప్పదైతే, వేదాంతం దివ్యత్వం కలిగిన ఫకీరుల వల్లా గొప్పదైతే హిందువులూ తమ హిందూ మతం గొప్పదని మీ కత్తివేట్లకు తలలువొంచి నవ్వుతూ ప్రాణాలు అర్పించి మరీ ఋజువు చేశారు."

"హిందూ మతం-మార్గం గొప్పదా? సత్యమైనదీనా? హిందువుల మార్గం తూర్పు వేపైతే మనది పశ్చిమానికి! పూర్తిగా తలకిందులు! విరుద్ధం!"

"అంత తలకిందులూ విరుద్ధమూ అయితే ఇవాళ సాయంత్రం ఊళ్ళోని ఈ రైతులు ముసల్మానుల మతానికి వచ్చి ఎందుకు పూజలు చేశారు? మీరు ముస్లిముల్లో ఏ మాత్రమూ హిందూ వాసనలని చూడ్డానికి ఒప్పుకోటం లేదు మౌలానా!"

"ఊహూ! ఏ మాత్రం ఉండకూడదు!"

"అయితే మన సుమంగళులైన ముస్లింవనితలు నుదుటిని పెట్టుకునే సింధూరాన్ని తుడిపించెయ్యండి!"

"తుడిపించేస్తాం!"

"సింధూరపు బొట్టుని భర్తలు బతికుండగానే తుడిపించేస్తారా? జుమ్మన్! నువ్వే చెప్పు బాబూ! దీనికి నీ భార్య సలీమా ఒప్పుకుంటుందా?" బాబా నవ్వుతూ అడిగాడు.

"ఒప్పుకోదు బాబా ! మౌల్వీసాబ్‌కి తెలీదు. విధవరాలయితేనే నుదుటి సింధూరపు బొట్టుని చెరిపేస్తారని ఆయనకి తెలీదు."ఆ పక్కగా నిల్చున్న జుమ్మన్ అన్నాడు.

బాబా తను చెప్పేది మళ్ళీ కొనసాగించాడు: "మన్నించండి మౌల్వీ అబుల్ అలాయీ! మేం సూఫీలం. ఏ సుల్తానో ఇచ్చే దయాధర్మం మీద ఆధారపడి ఇక్కడ నివాసం ఏర్పరచుకోలేదు. ఏ ధనవంతుడి దానభిక్ష మీదా ఆధారపడి లేం. మేం కఫనీ (ఫకీరులూ బైరాగులూ కట్టుకునే బట్టలు - కుట్టకుండా వేసుకునేవి) లంగోటీ వేసుకుని యిక్కడికి వచ్చాం. ఏ హిందువూ మా మీదకి కత్తి ఝళిపించలేదు. ఈ ఖాన్‌కాహ్‌నే చూడండి-ఇది మొదట్లో శ్రమణుల విహారం. నాకు వుందు ఐదో గురువు శ్రమణుడే (బౌద్ధుడు). ఫకీరుల శిష్యుడు, నిరాడంబరుడు. ఆయన బుఖారా

నుంచి వచ్చాడు. వాళ్ళ మతానికి, వేదాంతానికి ప్రభావితుడై వాళ్ళ శిష్యుడయ్యాడు. వేదాంతం అన్నది ఎక్కడయినా ఒకటే. బాహ్య పద్ధతులతో దానికేం తగాదాలేదు. బాహ్యంగా దాని కట్టుబొట్టూ శ్రమణులదికావొచ్చు, హిందువులదీ అవొచ్చు.ముస్లిములదీ కావొచ్చు. మా ఆ గురువుగారి తర్వాత ఈ ఖాన్‌కాహ్ ముసల్మానుల పేర్లు పెట్టుకున్న ఫకీర్లది అయింది. పై పై వేషభాషల్ని మార్చుకోవాలని మేం నొక్కి చెప్పలేదు. ప్రేమతత్వాన్ని బోధించాం. దాని ఫలితం మీరే చూస్తున్నారు. ఏ ఊరు వెళ్ళినా మేం అంటే ఇష్టపడేవాళ్ళు ఎక్కువయ్యారు. మమ్మల్ని అసహ్యించుకునేవారు తగ్గిపోయారు. పండితులలో ఆ చైతన్యం లేదు. మీలాగానే వాళ్ళు ప్రేమ మార్గాన్ని తెలుసుకోలేకపోయారు. అంచేతే జుమ్మన్ తల్లిదండ్రులు తమ సంతానానికి హిందువుల పేర్లకి బదులు ముసల్మాను పేర్లు పెట్టుకోవలసి వచ్చింది. ఇప్పుడు వాళ్ళు మీరన్నా గౌరవభావం చూపెడ్తున్నారు."

# 3

చైత్రమాసం గడిచిపోయింది. చెట్లు చిగిర్చాయి. ఈ ఏడాది మామిడి కాపు బాగా వుంది. అంచేత ఆ చెట్లని పాత ఆకులు యింకా మిగిలి వున్నాయి. ఆ చెట్ల కింద కళ్లాలు వున్నాయి. మధ్యాహ్నపు ఎండలో గాడ్పుగాలిలోనే రైతులు ధాన్యాన్ని నూరుస్తున్నారు. ఆ వేళకి ఓ ప్రయాణీకుడు బాగా అలసిపోయి ఎండలో చెమటలు కారుతూ వుంటే ఆ కళ్ళాల్లోని ఓ చెట్టుకింద కూచున్నాడు. అతని వాలకాన్ని బట్టి ఎవరో పరదేశి అయివుంటాడనుకుని మంగళ చౌదరి అతని దగ్గరికి వెళ్ళాడు.

"నమస్తే. ఇంత ఎండలో ప్రయాణం చేస్తున్నారే! గట్టివారే!" అన్నాడు.

"నమస్కారమండీ! తప్పని అవసరాలు ఉన్నప్పుడు ఎండా వానా లెక్కకి తీసుకుంటామా?" అన్నాడు.

"దాహం పుచ్చుకోండి. నోరెండిపోయినట్టుంది. కుండలో చల్లటి నీళ్ళు ఉన్నాయి."

"మీరెవరు?"

"గొల్లవాళ్ళం. నా పేరు మంగళ చౌధరి."

"చౌధరీ! నా దగ్గర తాడూ చెంబూ వున్నాయి. నేను బ్రాహ్మణ్ణి. నుయ్యి యెక్కడుందో చూపెట్టు."

"పండితవర్యా? మా కుర్రాడిచేత తెప్పించమంటే తెప్పిస్తాను."

"అలసిపోయాను. అలాగే తెప్పించు చౌధరీ!"

"ఒరే బాబూ ఫీసా! ఇలా రా" మంగళ చౌధరి కొడుకుని నూర్పు ఆపి

రమ్మనమని పిల్చాడు. బెల్లం ముక్కా, సూతిలోంచి తోడిననీళ్ళూ తెమ్మనమని చెప్పాడు.

ఢిల్లీ అక్కణ్ణించి మరో ఇరవై కోసుల దూరం వుంటుందనీ, ఇవాళకి తను అక్కడికి చేరుకోలేనన్న సంగతి ఆ ప్రయాణికుడు వాకబు చేసి తెలుసుకున్నాడు.

మంగళ చౌధరి కలుపుగోలు మనిషి. అతడు మాట్లాడకుండా ఓ నిమిషం కూడా వుండలేడు!

"ఈ ఏడాది దేవుడిదయ వల్ల పంట చాలా బాగుంది. వైశాఖలో నూర్పులు పూర్తికావడం కష్టమే! పండితవర్యా! మీ వేపున పంటలెలా వున్నాయి?" అని అడిగాడు.

"ఫర్వాలేదు—బాగానే పండాయి."

"రాజు మంచివాడైతే దేవతలు ప్రసన్నంగా వుంటారు. కొత్త సుల్తాను సింహాసనం ఎక్కినప్పటినుంచీ ప్రజలు సుఖపడుతున్నారు."

"ఏమిటిలా చెప్పేస్తున్నావు? ఏం విశేషం కనిపించిందేం?"

"కనిపించటంలేదా? ఈ కళ్ళాల్లోని ధాన్యం రాశుల్ని చూస్తున్నారా? రెండేళ్ళ క్రితం గాని వచ్చివుంటే ఇందులో నాల్గోవంతు పంట కూడా మీకు చూడ్డానికి కనిపించేది కాదు?"

"బాగుపడ్డాదా చౌధరీ?"

"బాగుపడ్డాది. ఈ వృద్ధికి కారణం సుల్తాను గుణగణాలే బాబూ! పూర్వం మా రైతులం తిండానికి తిండిలేకా కట్టడానికి గుడ్డలేకా అల్లల్లాడేవాళ్ళం. వాళ్ళ దుంప తెం.... వాళ్ళు మెత్తటి సన్నటి సిల్కుబట్టలు కట్టుకుని గుర్రాలమీద వచ్చేవాడు.

జానెడు జాగాలోనైనా గోధుమలు అయ్యేవో లేదో వాళ్ళూ, వాళ్ళ గుర్రాలూ మా పొలాల్లోకి వచ్చిపడేవాళ్ళు. నోరు విప్పడానికి ఎవరికి దమ్ము వుంటుంది? మా గ్రామాలకి వాళ్ళే సుల్తానులు!"

మంగళ చౌధరి లాగానే మోకాళ్ళ వరకూ పంచె కట్టుకుని మాసిపోయిన బిగుతు బొక్కా వేసుకుని, నెత్తిని చికను (పువ్వులు కుట్టిన) టోపీ పెట్టుకున్న మరో చౌధరీ అక్కడికి ఆ సమయానికి వచ్చాడు. వస్తూనే మంగళ చౌధరి మాటలని మధ్యలో అందుకున్నాడు.

"అవునా చౌధరీ! ఇప్పుడు చూస్తున్నాం కదా! వాళ్ళ ఆ దాబూదర్పం అంతా యెక్కడికి పోయిందో! ఇప్పుడు ఆ బాబులు గింజకి మొహంవాచి వున్నారు! నాతో ఆ బ్రాహ్మడు ఏమన్నాడో తెల్సా - ఆఁ చౌధరీ! ఆ బ్రాహ్మడి పేరు ఏమిటన్నావూ?"

"సివా."

"ఇప్పుడు సివా అంటున్నావు! అప్పుడాయన పండిత శివరాములు! ఆయన

చౌదరీ ఛేదారామ్, రెండు మణుగులు గోధుమలు ఇవ్వు. డబ్బు చేతికి రాగానే ఇస్తాను,' అని అడిగాడు. మొహాన్ని లేదనడం కష్టం కదా! కాని నాకు బాగా జ్ఞాపకం — అప్పుడు ఆ రోజుల్లో యెప్పుడూ తిన్నగా మాట్లాడేవాడేకాదు! ఆ బ్రాహ్మడి నోటంట ఆ రోజుల్లో 'ఒరే ఛేదూ, వెధవా'అని తప్ప మరోమాట వచ్చేది కాదు."

"మరి ఇప్పుడు నువ్వేమో చౌధరీ ఛేదారామ్‌వి, నేను చౌధరి మంగళ రామ్ నీనూ! ఒరే మంగళ్, ఒరే ఛేదూ నుంచి రెండున్నర ఏళ్ళలో ఎక్కణ్ణించి ఎక్కడికి మనం వచ్చేమో!"

"ఇదంతా సుల్తాను దయ అని నేనంటాను చౌధరీ! లేకపోతే మనం అందరం ఛేదూ, మంగూగాళ్ళగానే వుండేవాళ్ళం."

"ఆ సంగతే ఈ పండితులవారికి నే చెప్తున్నాను."

"లేక పోయినట్లయితే మనకీ పంచాయతీ వచ్చేదికాదు-మన రోజులు మారేవీ కావు!"

"చౌధరీ మంగళరామ్! నీకు చేత్తో కలం పట్టుకోవడమన్నా రాదు. కాని నువ్వు పంచాయితీ అధ్యక్షుడవయ్యావు. పనులన్నీ ఎలా చేస్తున్నావు? రాజోద్యోగులు రాజోద్యోగులే! వాళ్ళూ వాళ్ళకన్నా ఎక్కువగా ఈ వర్తకులూ రూపాయికి రెండ్రూపాయల పంట ఎత్తుకుపోయేవారు. జ్యేష్టం వెళ్ళీ వెళ్ళకుండానే మన ఇళ్ళలో పొయ్యిలో పిల్లి లేచేదికాదు."

"నిజం! మన సుల్తాను ఎల్లకాలాలకీ సుఖంగా ఉండాలి!"

ఈ పల్లెటూరి రైతు గొల్లవాళ్ళ నోట సుల్తాను గురించిన పొగడ్త వినివిని ఆ ప్రయాణికుడు లోలోపల మండిపడుతున్నాడు. తను మాట్లాడ్డానికి అవకాశం ఎలా దొరుకుతుందా అని చూస్తున్నాడు. బెల్లం తిని మంచినీళ్ళు తాగిన తర్వాత అతడు మరి ఆగలేకపోయాడు. ఈ చౌధరీల పొగడ్తలు పూర్తయ్యేటట్టు అతనికి కనిపించలేదు. అంచేత వాళ్ళ మాటల మధ్యలో కల్పించుకున్నాడు - "అల్లా ఉద్దీను సుల్తాను మీకు పంచాయితీలు యిచ్చాడా?"

"అవునండీ! మీ నోట ముత్యాలురాలా! మన సుల్తానుకి అలాఉదీను అని ఎవరు పేరు పెట్టారో కాని మేం మాత్రం మా ఊళ్ళో ఆయన్ని లాఉదీను (దీనులకి కల్పవృక్షం) అని పిల్చుకుంటున్నాం."

"చౌదరీ!" నువ్వు ఏ పేరుతోనన్నా సుల్తాన్ని పిలువు కాని సుల్తాను మన హిందువుల పట్ల ఎన్నెన్ని అత్యాచారాలు చేశాడో తెల్సా?" అడిగాడు బ్రాహ్మడు.

"మా గొల్ల ఆడవాళ్ళు పమిటన్నా కప్పుకోకుండా రాత్రీపగలూ పొలల్లో పని చేస్తూ తిరుగుతున్నారు. వాళ్ళని ఎవరూ ఎత్తుకుపోలేదు!"

"గౌరవనీయులైన కుటుంబాల వారి గౌరవాన్నీ మానాన్నీ మంటకలుపుతున్నారు."

"అయితే మేం గౌరవనీయులమైనవాళ్ళం కాదన్నమాట పండితబాబూ! ఎవరా గౌరవనీయులు? ఆ గాడిదకొడుకులు?"

"నువ్వు తిడుతున్నావు చౌధరీ మంగళరామ్!"

"అయ్యా, మాకు పంచాయితీలు వచ్చినప్పటి నుంచీ మా గౌరవం మాకు వచ్చిందన్న సంగతి మీరు తెలుసుకోవాలి. ఇప్పుడు మాకు బాగా తెల్సు. రాజ కర్మ చారులూ, ఆ ఉద్యోగులూ ఎంత గౌరవనీయులో! హిందువులు హిందువులు, ముస్లి ములు ముస్లిములు అని వేరుచేసి మాట్లాడతారు! ఎవరన్నా కానీ రాజ కర్మచారి అయినవాడు, ఉద్యోగస్థుడయినవాడు అందరూ ఆ బాపతే. మళ్ళీ ఈ ఉద్యోగస్థులు ఎక్కువకెక్కువ మంది హిందువులే వుండేవారు."

సందు దొరగ్గానే చేదారామ్ మొదలుపెట్టాడు-

"మనకి హిందువులు వేరు ముస్లిములు వేరు అని చెప్తారా, అలాంటిది చౌధరీ హిందూ బ్రాహ్మలు తమ భార్యల్ని పరదాలమాటున పెట్టి బేగముల్లాగే చూస్తున్నారు!"

"చౌధరీ! పూర్వం అలా ఉండేదికాదు. మా తాత చెప్తూఉండేవాడు-కనౌజ్, ఢిల్లీ రాణులు స్వేచ్ఛగా అందరిముందుకీ గుర్రాలమీద స్వారీచేస్తూ వచ్చేవారనీ తను ఆ రాణుల్ని చూసేనని చెప్పాడు."

"కాని చౌధరీ, ఆ రోజుల్లో ఏ ముసల్మానూ మన హిందువులని అగౌరవ పర్చేవాడు కాదు. మన స్త్రీల మానాల్ని దోచుకునేవాడు కాడు" అన్నాడు పండితుడు.

"ఇప్పుడూ మా స్త్రీలు పొలాల్లో నిర్భయంగా తిరుగుతున్నారు. వాళ్ళని ఎవరూ చెరచటం లేదు."

"అప్పుడు ఆ రోజుల్లో చెరచబడ్డారన్నా చౌధరీ, ఆ హయాం ఎవరిది? ఆ బ్రాహ్మడు శివాది! అతని హయాంలోనే అలాంటివి జరిగితే జరిగాయి."

"తేరగా ఉల్కాగా పైవాడి సొత్తుని తినేవాళ్ళు పైవాళ్ళ మానాన్ని చెరచక ఏం చేస్తారు? ఇది హిందువులకి ముస్లిములకి సంబంధించిన సంగతికాదు పండిత వర్యా! ఇది ఉల్కాగాళ్ళ పని! తేరగావస్తే మెక్కేవాళ్ళపని! మేం అసలు సిసలైన హిందువులం! మా ఆడవాళ్ళు ఏనాడూ ఘోషాలో లేరు."

"అయ్యో చౌధరీ! నీకు తెలీదు. సుల్తాను సేనాధిపతి మాలిక్ కాఫర్ దక్షిణాన్ని మన హిందువుల దేవాలయాలన్నిటినీ ధ్వంసం చేశాడు. మన దేవతా మూర్తుల్ని ముక్క ముక్కలుగా విరగ్గొట్టి కాళ్ళరాశాడు." బ్రాహ్మడు మరోసారి ధైర్యం చేసి వాళ్ళకి చెప్పాడు.

"ముసల్మానుల రాజ్యంలో హిందూమతం లేదన్నమాట ఒక్క సారి కాదు లక్షసార్లు మేమూ విన్నాం. కాని మేం ఢిల్లీకి బాగా దగ్గరగా ఉన్నవాళ్ళం. అదే కాకాపోయినట్లయితే మేమూ ఆ మాటల్ని నమ్మేవాళ్ళం బాబూ! ఇక్కడ మా చుట్టు

పక్కల ఇరవైకోసుల దూరంలో ఏ దేవాలయాన్నీ ఎవరూ విరగ్గొట్టలేదు! ఏ దేవతా విగ్రహాల్ని ఎవరూ కాళ్ళతో ముట్టలేదు."

"మంగళరామ్ చౌదరీ! ఇది ఉట్టి అబద్ధం. నువ్వైతే నాకన్నా కూడా ఎక్కువ సార్లు ఢిల్లీ వెళ్తూ వస్తూ వుంటావు. నేనూ ఎన్నోసార్లు దసరా వేడుకల్ని చూడ్డానికి ఢిల్లీ వెళ్ళాను. ఎంత పెద్ద సంబరం! ఆ సంబరంలో సగానికిపైగా ఆడవాళ్ళే వుంటారు. సంబరం ఏమో హిందువులది- సంబరంలో ఉన్నవాళ్ళు ఎక్కువ మంది హిందువులే! దేవతామూర్తుల్ని అలంకరించి సుల్తానుగారి భవనం వేపునుండి అతని గవాక్షాల కింద నుంచి ఊరేగించి తీసుకువెళ్తారు. శంఖాలు ఊదుతూ, నగాధాలు వాయిస్తూ కొమ్ము బూరాలు ఊదుతూనూ!"

"అవును ఛేదారామ్! సుల్తాను గురించి చెప్పేవి అన్నీ అబద్ధాలే! నిక్కామల్ మహలుకి నూరుగజాల దూరంలో ఓ పెద్ద దేవాలయం కట్టిస్తున్నారు. ఎన్ని లక్షల రూపాయలు ఖర్చు అవుతుందో! నేను కిందటిసారి వెళ్ళినపుడు పునాదులు వెయ్యి డాన్ని చూశానా ఈ సారి నడుం ఎత్తుని అప్పుడే గోడలు లేచిపోయాయి. సుల్తానుకి గుళ్ళని పడగొట్టాలని ఉంటే ఎక్కడన్నా తన కళ్ళముందు అంత దేవాలయం లేపుతూవుంటే ఊరుకుంటాడా?"

"అవును చౌదరీ! రాజులకీ రాజులకీ మధ్య తగాదాలు యుద్ధాలూ జరుగుతూ వుంటాయి. యుద్ధంలో ఎవరికి ఎవరు పడతారు! ఏదన్నా జరిగిందనుకో - ఇంక దాన్ని పట్టుకుని గోలా గగ్గోలు గందరగోళం చేస్తారు. నూరేళ్ళ క్రితం మన వేపున అలాంటివి జరిగాయి. కాని ఇప్పుడు ఎక్కడా అలాంటిది కల్లోనన్నా జర గటం లేదు."

"ఈ చుట్టుపక్క ఊళ్ళవాళ్లందరమూ కలసి ప్రధాన ఉద్యోగిగారి దగ్గరికి వెళ్ళినప్పుడు అతనేం చెప్పాడో జ్ఞాపకం లేదూ? పూర్వం ఇక్కడ రాజ్యం చేసిన సుల్తానులు ముష్టాళ్ల ముచ్చటగాళ్ళు. ఇప్పటి మన సుల్తాను లాటదీను (దీనులపాలిటి కల్పవృక్షం) మనవాడు. మన కష్టానికీ సుఖానికీ అయినవాడు. అతడు మనల్ని దోచుకోడు. మనల్ని సుఖపెడతాడు అని కదూ చెప్త?"

"సుఖపెడతాడు, కాదు సుఖపెట్టాడు అను. ఇప్పుడు జనం అంతా సుఖ సంతోషాలతో వున్నారు."

## 4

ఢిల్లీకి బైట గోరీలు వున్న స్థలం, అక్కడ వేపచెట్లూ చింతచెట్లూ వున్నాయి. మార్గశిరమాసపు చలిరాత్రులు. కర్రల నెగడు ముందు ఇద్దరు ఫకీర్లు కూచుని వున్నారు. ఒకరు మనకు తెలిసిన నూర్‌దీనే! రెండో ఫకీరు తన తెల్లని గెడ్డాన్ని మీసాల్ని రెండు చేతుల్తో దువ్వుకుంటూ నూర్‌దీన్‌తో మాట్లాడుతున్నాడు.

"బాబా! ఐదేళ్లలో హరియానాలో మళ్ళీ పుష్కలంగా పాడీ పంటా పెరిగాయి."

"నిజమే, బాబా జ్ఞాన్‌దీన్! రైతుల మొహాల్లో ఆనందం వెల్లివిరుస్తోంది!"

"పంటలు విరివిగా పండితే రైతుల మొహాలు కలకల్లాడతాయి."

"రాజకర్మచారులూ ఉద్యోగులూ లేకుండా పోయారు. ఈ వడ్డీ వ్యాపారస్థులు కూడా లేకుండాపోతే పూర్తిగా సుఖశాంతులు నెలకొంటాయి."

"బాగా దోచుకుంటారు. వీళ్ళు కట్టించే మఠాలు, పెద్ద పెద్ద ఆలయాలూ, దానధర్మాలు అన్నీ ఆ దోపిడీడబ్బుతో కట్టించినవీ యిచ్చినవే!"

"డబ్బున్న వాళ్లుండకపోతే ధర్మమూ వుండదని అంటారు. కాని నా ఉద్దేశం డబ్బున్న వాళ్ళున్నంతవరకూ అధర్మం మరింత ఎక్కువవుతుందని."

"జ్ఞానులు, యోగులు, పీరులు, ఫకీర్లు, సాధువులు, సన్యాసులు, ఋషులు, మునుల కన్నా ధర్మాన్ని ఆచరించేవాళ్ళు ఎవరు వుంటారు? కాని వాళ్ల దగ్గర ఏముంటుందీ, కాషాయగడ్డలూ కౌపీనాలు తప్ప!"

"బీదవాళ్ళ శ్రమని దోచుకునే ధనికులున్నంతవరకూ భ్రాతృత్వ భావం మనుషుల్లో పెంపొందదు. జ్ఞానదీన్! ఈ సుల్తానులూ అంతే! మనిషికి మనిషికీ మధ్య హెచ్చుతగ్గులు విభేదాలు పెట్టేవాళ్ళు వీళ్లే! ఇదిగో వీట్నించే ఇలా జరుగుతోంది! కష్టించి పనిచేసేవాళ్ల ఆర్జనని వీళ్ళు కొల్లగొట్టకపోతే వీళ్ల డాబూ దర్పం, దర్జా అన్నీ హుళక్కే!"

"ఈ కుతంత్రాలూ, జంజాటాలూ, చిక్కులూ పోయేరోజు వస్తుంది! ఈ తేడాలు పోయి లోకంలో ప్రేమరాజ్యం తప్పకుండా ఏర్పడుతుంది."

# సురైయా

కాలం: క్రీ. శ. 1600

## 1

వర్షంపడి బురదనీరు ధారలుకట్టి అంతటా పారుతోంది. సమతలంగా ఉన్న నేలమీద నెమ్మది నెమ్మదిగా పాకుతూ, ఏటవాలు జాగాల్లో పరుగులు పెడుతూ, కాలవల్లోనూ గెడ్డల్లోనూ ప్రవహిస్తూ కొండవాగులతో కలిసి విస్తృత జలరాశిగా మారుతోంది. వర్షాన్ని ఇంకా ఆపి ఉంచాయా అన్నట్టు చెట్లు ఇప్పటికీ పెద్ద పెద్ద చినుకుల్ని టపటపమంటూ వర్షిస్తున్నాయి. నిజానికి వానజల్లుగా మారి చిన్నగా పడుతోంది.

జమ్మిచెట్టుకి కొంచెం దూరంలో తెల్లటి బట్టలు కట్టుకున్న యువతి ఒకామె నిల్చుని ఉంది. ఆవిడ తలమీద వేసుకుని ఉన్న తెల్లటి మేలిముసుగు జారిపోయింది. తుమ్మెద రెక్కల్లాంటి నల్లటిజుట్టు మధ్య పాపిడి హిమాలయాల్లోని అడవులమధ్య వెండి ధారలా ప్రవహిస్తున్న గంగానదిలా ఉన్నాది. ఆమె చెవులదగ్గర రింగు రింగులుగా చుట్టుకుని ఉన్న ఉంగరాలజుట్టులోంచి ఇంకా ఒకటీ అరా నీటి చుక్కలు కిందకి జారుతున్నాయి. ఆమెది తెల్లటి గంభీరమైన మొహం. పెద్దపెద్ద నల్లటి కళ్ళు దూరంగా దేన్నో చూస్తున్నాయి. మోకాళ్ళవరకూ వేళ్ళాడుతున్న సిల్కు కుర్తా తడిసిపోయి గుండెకి అతుక్కుపోయింది. కుర్తాకింద ఎర్రటి బాడీతో బిగించి కట్టుకున్న ఆమె రెండు స్తనాలు నారింజఫళ్ళలా పైకి ఉబికి అందంగా కనపడుతున్నాయి. కుర్తా మడతల్లో కనిపించని నడుంకింద పైజామా తడిసి ఒంటికి అంటుకుపోవడంతో యువతి కాలిపిక్కలు, ఎత్తుపల్లాలు స్పష్టంగా కనపడుతున్నాయి. మట్టి అంటుకుని పాడైపోయిన తెల్లమేజోళ్ళు ఎర్రచెప్పులు ఆమె కాళ్లని ఉన్నాయి. ఆ చెప్పులు తడిసిపోయి బాగా మెత్తబడిపోవడంతో ఇహ నడవడానికి పనికి రాకుండా పోయినట్టున్నాయి.

యువతి దగ్గరికి ఓ యువకుడు వస్తూ కనిపించాడు. తలకి పెట్టుకున్న చుట్టూ అంచులుతీరిన తలపాగా, తొడుక్కున్న పొడుగుకోటు, పైజామా అన్నీ తెల్లటివే. అవి పూర్తిగా తడిసిపోయేయి. దగ్గరగావచ్చి అతడు చూసేసరికి కూడా యువతి అతనివేపు చూడటంలేదు. కాని చప్పుడుకాకుండా నడిచివచ్చి యువతికి

పక్కగా రెండు అడుగుల దూరంలో నిల్చున్నాడు. కొంచెందూరంలో కాలవలో ప్రవహిస్తున్న బురదనీటిని ఆవిడ కన్నార్పకుండా చూస్తోంది. తన స్నేహితురాలు ఇహ తనవేపు చూస్తుంది, ఇహ చూస్తుంది అని యువకుడు భావించాడు. ఎన్నో యుగాల్లా నిమిషాలకి నిమిషాలు గడిచాయి. కాని యువతి కదలకుండా మెదల కుండా అలాగే ఉండి కళ్ళార్పకుండా చూస్తోంది. మొహంమీద పడిన వానజల్లుని కనుబొమ్మలమీంచి తుడిచైనా తుడుచుకోలేదు. యువకుడు ఇహ ఎదురుచూడలేక యువతి భుజంమీద నెమ్మదిగా చెయ్యివేశాడు. యువతి మొహం ఇటుతిప్పింది. ఎక్కడో దూరంగా నిల్చి ఉన్న ఆవిడ దృష్టి ఇటు మళ్ళింది. నల్లటి పెద్ద పెద్ద కళ్ళు తళుక్కుమని మెరిసాయి. ఆవిడ ఎర్రటి పెదాలమీద చిరునవ్వు మొలక లెత్తింది. తెల్లటి పలువరస మెరిసింది. ఆవిడ యువకుడి చేతిని తనచేతిలోకి తీసు కుంది.

"కమల్! నువ్వు వచ్చి నిల్చుని చాలా సేపయిందా?"

"నిల్చుని ఎన్నో యుగాలైనట్టుగా అనిపిస్తోంది. సృష్టికర్త జలంనుండి పృథ్విని సృష్టించడం మొదలు పెట్టినప్పటినుంచీ !! ఇంకా అప్పటికి పృథ్వి తడితడి గానే ఉంది—గట్టి పడలేదు- పర్వతాలు, వృక్షాలు, ప్రాణికోటి భారాన్ని మొయ్య గల శక్తిని ఇంకా సంతరించుకోలేదు!"

"పోవోయ్ కమల్! నువ్వెప్పుడూ కవిత్వం మాట్లాడతావు."

"ఆహా! సురైయా! నీ మాట నిజం అయితే ఎంత బాగుణ్ణు ! కాని కవిత్వం చెప్పడం అన్నది నా నుదుటిని రాసిలేదు."

"సురైయా తనకో సవతి ఉండడానికి ఒప్పుకోదు."

"నా మనస్సూ అదే అంటోంది! అది సరే కాని, అంత ధ్యానంగా నువ్వేమిటి ఆలోచిస్తున్నావు? సురైయా !"

"చాలా దూరంగా ఆలోచిస్తున్నా. సముద్రం ఎంత దూరంలో ఉందికమల్!"

"మనకి అన్నిటికన్నా దగ్గరగా ఉన్నది సూరత్! ఓ నెలరోజుల ప్రయాణం."

"ఈ నీళ్ళన్నీ ఎక్కడికి వెళ్తాయి?"

"బెంగాల్‌వేపుకి, అది ఇంకా దూరం. బహుశా రెణ్ణెళ్ళ ప్రయాణం చెయ్యాలి."

"పాపం, ఈ బురదనీరు ఎంతదూరం ప్రయాణం చెయ్యాలో కదా ! నువ్వు సముద్రాన్ని చూశావా కమల్?"

"మా నాన్నగారితో కలిసి ఒరిస్సా వెళ్ళాను. అక్కడ చూశాను."

"సముద్రం ఎలా ఉంటుందీ?"

"ఎదురుగా ఆకాశం వరకూ వ్యాపించి, నల్లటి కెరటాల్లాంటి మబ్బుల్లా ఉంటుంది."

"ఈ జలం అంతా సముద్రంలో కెళ్ళి కలుస్తుందా? అక్కడా ఇలాగే మురిగ్గా బూడిద రంగులోనే ఉంటుందా?"

"ఊహూ ! అక్కడ ఒకే ఒక్కరంగు. ముదురు నీలం లేదా నలుపు."

"నువ్వు నాకు చూపెడతానంటే నేను ఎప్పుడైనా సముద్రాన్ని చూస్తాను."

"సురైయా! నువ్వు ఆజ్ఞాపిస్తే ఈ నీటితోపాటే ప్రయాణం చెయ్యడానికి సిద్ధంగా ఉన్నాను."

సురైయా కమల్‌ని తన రెండు చేతులతో చుట్టుకు పోతూ తన తడిసిన బుగ్గలని అతని బుగ్గలకి చేర్చింది. కమల్ మెరిసే కళ్ళలోకి చూస్తూ అన్నది - "మనం సముద్రానికి వెళ్దాం. అయితే ఈ నీటితోపాటు కాదు."

"ఈ మురికి బూడిదరంగు నీటితో కాదు సురైయా!"

"బూడిదరంగు నీరు అని అనకు కమల్! ఆకాశం మీంచి కిందపడేటప్పుడు ఆ రంగులో అదిలేదు కదా!"

"ఊహూఁ లేదు. అప్పుడు సూర్యచంద్రులకన్నా నిర్మలంగా ఉంది. నీ అందమైన ఉంగరాల జుట్టుని తళతళ మనేటట్టు చేసింది! చందమామలా తెల్లగా ఉండే నీ బుగ్గల్ని ఎంత మెరిసిపోయేటట్టు చేసిందో !! ఆకాశం నుంచి తిన్నగా పడ్డ ప్రతీ చోటా నీ సౌందర్యాన్ని మరింత సానబెట్టింది."

"అలా అయితే ఈ బురదరంగు దానికి సహజసిద్ధమైనది కాదన్నమాట. సాగరంలో కలవడానికి వెళ్ళనివ్వకుండా అడ్డువచ్చిన వాటితో ఘర్షణ పడ్డంవల్ల దాని రంగు అలా మారిపోయింది. సముద్రంలోనేగాని తిన్నగా ఆది పడి ఉంటే ఇలా బూడిద రంగుగా అయి ఉండేదా, కమల్?"

"ఉండదు ప్రేయసీ!"

"అంచేత దాని బూడిద రంగుని కాలుష్యమైనదని నేను అనుకోను. అది మంచిదనే అనుకుంటాను. నీ అభిప్రాయమేమిటి కమల్?"

"సురైయా! నీ నోటినుంచి వచ్చిన మాటలు నా మనస్సులో మాటలే!"

## 2

ఆకాశపు నీలిరంగు నీడ లోతుగా ఉన్న పుష్కరిణి నీటిని మరింత నీలంగా చేస్తోంది. ఈ నీలిరంగు నీటికి చుట్టూవున్న రేవులు తెల్లటి స్వచ్ఛమైన పాలరాతితో కట్టి ఉన్నవి కావడాన్ని మరింత తెల్లగా కనపడుతున్నాయి. పుష్కరిణి వేపుని ఆకుపచ్చటి గడ్డి తివాసీ మధ్య ఎత్తైన శిఖరాలతో సర్వీచెట్లు ఎంతో అందంగా కనపడుతున్నాయి. విశేషించి ఈ వసంతకాలపు మధ్యాహ్నం సమయంలో మరీను! ఉద్యానవనాలు, పంక్తులు తీర్చి ఉన్న చెట్లు, లతాగృహాలు, ఔత్‌ఖానా అక్కడ ఉన్నాయి. ఆ వేళ ఈ రాజోద్యానాన్ని యువతీ యువకుల కోసం తెరచి ఉంచారు. వసంతోత్సవం రోజు అవడాన్ని యువతీ యువకులు ఆ చక్కటి తోటలో స్వేచ్ఛగా స్వర్గంలో విహరించినట్టు విహరిస్తున్నారు.

తోటకి ఓ కొసని పుష్కరిణికి దూరంగా ఎర్రటి రాళ్ళతో కట్టిన ఆవరణకి అవతలగా నలుగురు వ్యక్తులు నిల్చుని ఉన్నారు. అందరి తలలకి తలపాగాలు ఒకే లాంటివి ఉన్నాయి. ఆ తలపాగాలు దప్పళా కొంచెం ముందుకి పొడుచుకుని ఉన్నాయి. మోకాళ్ళ వరకూ వేళ్ళాడుతూ బిగుతుగా ఉన్న చొక్కాలూ, ఒకే లాంటి నడుం పటకాలూ ఉన్నాయి. అందరికీ ఒకేలాంటి మీసాలు ఉన్నాయి. వాళ్ళ మీసాలు చాలా వరకు తెల్లగా పండిపోయి ఉన్నాయి. వాళ్ళు కొంతసేప ట్నుంచి తోటవేపు చూస్తున్నారు. ఆ తర్వాత నాలుగువేపులా దారులతోఉన్న ఆ ఆవ రణలోకి వెళ్ళి పరుపులు పరుచుకుని వాటిమీద కూచున్నారు అంతటా నిశ్శబ్దం ఆవరించి ఉంది. ఈ వృద్ధులు తప్ప ఇంకెవ్వరూ అక్కడ లేరు. వాళ్ళలో ఒకడు నిశ్శబ్దాన్ని చీలుస్తూ "బాద్‌షా!" అన్నారు.

"ఏమిటి ఫజుల్ ! ఇప్పుడు మనం దర్బారులో కూచున్నామా ఏం ? మని షన్నవాడు ఎక్కడైనా మనిషిలా ఉండ తగడా?"

"మరిచిపోతూ ఉంటాను."

"జలాల్ అను, అక్బర్ అను, లేదూ నేస్తం అను!"

"నేస్తం జలాల్! ఎంత కష్టమైన సంగతి! మనకి రెండు రకాలుగా జీవి తాన్ని గడపాల్సి వస్తుంది!"

"రెండు రకాలు కాదు భాయీ ఫజల్ ! నాలుగు రకాలు!"

"బీరూభాయీ ! నిన్ను ప్రశంసించాలి! ఎప్పుడు ఎలాంటి దానికైనా సిద్ధంగా ఓఉంటావు! మేం ప్రపంచంనుంచి మరో ప్రపంచానికి వస్తామా ,ఆ పాత ప్రపంచం సంగతుల్ని వదిలించుకోవడానికి చాలా సమయం పడుతుంది. ఏమంటావు టోండూ! నేనన్నది నిజమే కదూ?"

"నిజమే ఫజుల్! నాకు ఆశ్చర్యం వేస్తుంది. ఈ బీరూనిచూస్తే. ఇతనిది ఎంత తీక్షణమైన బుద్ధి!"

"బీరబలుడే హిందుస్థానంలో ప్రతీచోట చక్రం తిప్పుతున్నాడని జనం అంటున్నారు."

"కానీ బీరూభాయీ! తోడర్‌మల్లూ ప్రతి చోట చక్రం తిప్పటం లేదూ?"

"తిప్పామో తిప్పలేదో ఆ సంగతి లోకానికి తెలుసు. ఈ బుద్ధికుశలతని మన జల్లూ కూడా పొగుడుతాడు" అన్నాడు బీరబల్.

"నిస్సందేహంగా పొగుడుతాడు. జలాలుద్దీను అక్బరు బాద్‌షా వేషం మార్చు కుని ఊరూరా తిరిగి చూస్తాడన్న కథ లాంటిది కాదుగా ఇది!" అన్నాడు అక్బరు.

"కథ అని మా బాగా జ్ఞాపకం చేశావు జలాలు భాయీ! జనం నోట పుట్టిన కథ లతో నాకు చచ్చే చావుగా ఉంది. బీరబల్ - అక్బరు పేరుతో ఏదో ఓ కట్టుకథ అల్లి చెప్పుకోడం అన్నది మామూలై పోయింది. నేను అలాంటి కథల్ని ఎన్నిటినో

పోగుచేశాను. ఒకొక్కకథకి ఒకొక్క బంగారపు నాణెం చెల్లించాలి అని నిర్ణయించాను" అన్నాడు బీరబల్.

"బంగారపు నాణెంకోసం అప్పటి కప్పుడు ఏదో ఒకటి కల్పించి చెప్పేస్తావేమో!" అన్నాడు అక్బరు.

"కావచ్చు. అయినా దానివల్ల ఏం ఇబ్బంది రాదు. అలా అయినాసరే మనిద్దరి పేరుతో ఎలాంటెలాంటి అసందర్భపు మాటలు చెప్పుకుంటున్నారో తెలుస్తుంది!"

"ఫజుల్! నేను ఛదామీ మలిసేక్‌లా లోభిని కాను, పోతే పోనీ!" అన్నాడు బీరబల్.

"అది కాదు బీరబల్! నా మీద ఉట్టిపుణ్యానికి కోపం తెచ్చుకోకు. భాయీ! నీ కథలంటే నాకు చాలా భయం" అన్నాడు అబుల్ ఫజల్.

"అవునవును. నేనే కదామరి 'ఆయనే అక్బర్' లాంటి పెద్ద గ్రంథాన్ని రాస్తా!" అన్నాడు బీరబల్.

"అయితే అక్బరీని చదివేవాళ్ళు ఎంతమంది ఉంటారు? టోడూ భాయీ! నువ్వే సత్యప్రమాణంగా చెప్పు. బీరబల్ కథల్ని మళ్ళీ మళ్ళీ చెప్పుకునేవాళ్ళు ఎంతమందో చెప్పు!"

"ఆ సంగతి బీరబల్‌కి తెలుసు" అన్నాడు టోడర్‌మల్లు.

"అదిసరేగాని బీరూ! బంగారపు నాణెం ఇచ్చి సంపాదించిన ఓ కథని చెప్పు" అన్నాడు అబుల్ ఫజల్.

"కాని మీరంతా ముందే నిర్ణయించేశారు కదా, ఆ కథ నేను బంగారపు నాణెం ఇచ్చి సంపాదించింది కాదూ నేను కల్పించిందేననీ" అన్నాడు బీరబల్.

"నువ్వు చెప్పకపోయినా నీ కథో, నకిలీ కథో మేం పోల్చుకోగలం" అన్నాడు అక్బరు.

"అక్కడికి నా ప్రతి కథ మీదా ఏదో ముద్రవేసి ఉన్నట్టు! మంచిదే. మీ సరదా నేనెందుకు కాదనాలి. కథ చెప్తాను వినండి. అయితే క్లుప్తంగా ముఖ్యమైన విషయాలే చెప్తాను. ఓసారి అక్బరుకి తను హిందువునై పోవాలని సరదా పుట్టింది. ఆ సంగతి బీరబల్‌కి చెప్పాడు. బీర్‌బల్ గట్టి చిక్కులో పడిపోయాడు. బాద్‌షాకి కాదు కూడదు అని జవాబూ చెప్పలేడు. హిందూగా మార్చే హక్కు బీర్‌బల్‌కి ఎక్కడుందీ? చాలారోజులు కనిపించకుండా తప్పించుకున్నాడు. ఓ రోజు సాయంత్రం బాద్‌షాగారి మహలు కిటికీకి దగ్గరగా దబ్ దబ్ దబ్ అన్న చప్పుడు గట్టిగా వినిపించింది. బాద్‌షాకి ఇదివరకు ఎప్పుడూ ఆ సమయంలో బట్టలు ఉతికే చప్పుడు వినిపించలేదు. దాంతో ఆయనకి అదేమిటో తెలుసుకోవాలని కుతూహలం కలిగింది. ఆయన కూలివాడిలా వేషం మార్చుకుని యమునా నది ఒడ్డుకి వెళ్ళాడు. ఎంత వేషం మార్చుకుని ఉన్నప్పటికి బాద్‌షా బీర్‌బల్‌ని పోల్చుకోగలిగాడు. అక్కడ బీర్‌బల్ చాకటి బల్లమీద బట్టలు ఉతకడం లేదు. ఓ లావు

పాటి పెద్దగాడిదని చాకలిసోడాతోనూ కుంకుడుకాయ పులుసుతోనూ షాఘి షామీ కడుగుతున్నాడు. బాద్‌షా వచ్చేనవ్వుని ఆపుకుంటూ గొంతుమార్చి "ఏం చేస్తు న్నావు చౌదరీ?" అని అడిగాడు.

"నీ పనేదో నువ్వు చూసుకో, నా సంగతి నీకేలా?"

"ఏదీకానివేళ చలిలోనూ మంచులోనూ నూవణికి పోతున్నావు చౌదరీ!"

"వణికి చావవలసిందే! రేపటికల్లా ఈ గాడిదని గుర్రంగా మార్చి బాద్‌షాకి ఇవ్వాలి."

"గాడిదని గుర్రంగా చేశా?"

"ఏం చెయ్యనూ? బాద్‌షాగారి ఆజ్ఞ!"

బాద్‌షా నవ్వి తన సహజ కంఠంతో బీర్‌బల్‌తో ఇలా అన్నాడు:

"పద బీర్‌బల్! ముసల్మానుని హిందువుగా చెయ్యడమూ, గాడిదని గుర్రంగా మార్చడమూ రెండు సమానమే అని నాకు అర్థమయిందిలే!" ఫజుల్‌భాయీ! ఈ కథ విన్నప్పుడు నా ఒంటిని తేళ్ళు జెర్రెలూ పాకినట్లయింది."

"ఈ కథ ఇప్పుడు మా ఆఖరి రోజుల్లోనా వినాల్సి వచ్చింది! మేం జీవిత మంతా పడిన శ్రమకి ఇదా పరిణామం?" అన్నాడు అక్బరు.

"జలాల్! మనం మన ఒక్కతరం బాధ్యత తీసుకో గలుగుతాం, మన ప్రయత్నాల్ని కృతకృత్యమయేటట్టు చెయ్యటమూ మానటమూ అన్నది ఇదిగో ఈ తోటలో వసంతోత్సవం చేసుకుంటున్న ఈ యువతీ యువకుల చేతిలో ఉన్నది" అన్నాడు అబుల్ ఫజల్.

"కాని భాయీ! మేం ముసల్మానుల్ని హిందువులుగానూ, హిందువుల్ని ముసల్మానులుగానూ చెయ్యాలని అనుకోలేదే" అన్నాడు టోడర్‌మల్లు.

"మేం వాళ్ళని ఒకటిగా చూడాలని అనుకున్నాం. ఒకే జాతిగా భ్రాతృభావంతో ఉండాలని అనుకున్నాం" అన్నాడు అబుల్ ఫజల్.

"కాని ముల్లాలూ, బ్రాహ్మణ పండితులూ మనలా ఆలోచించరు. హిందూ స్థానాన్ని బలపరచాలని మనం అనుకుంటున్నాం. హిందుస్థానం యుద్ధ విద్యలో గట్టిది. బుద్ధి వైభవానికి పెట్టింది పేరు. ఇక్కడి యువకులు ధైర్యసాహసాలు ఉన్నవాళ్ళు. అయితే హిందూస్థానంలో ఒకే ఒక్కదోషం ఉంది. బలహీనత ఉంది. ముక్కముక్కలుగా విభజించుకుపోయింది! హిందూస్థానంలోని వాళ్ళందరి శక్తి యుక్తులని ఒకటిగా సమీకరించగలిగితే ఎంత బాగుణ్ణు!" అన్నాడు బీర్‌బల్.

"అదొక్కటే నా కోరిక నేస్తులారా! సహచరులారా! దాని కోసమే మేం ఇంతవరకూ శ్రమించాం-మేమీపని మొదలుపెట్టే సమయానికి చుట్టూ చీకట్లు అలుము కుని ఉన్నాయి. కాని ఇప్పుడు అలా లేదు. ఓ తరం ఎంత చెయ్యగలుగుతుందో అంతా మేం చేశాం.'కాని ఈ గాడిదా గుర్రం కథ సంగతి నా గుండెలో ములుకులా గుచ్చుకుంది" అన్నాడు అక్బరు.

"జలాల్ భాయీ! మనం నిరాశపడకూడదు. ఓ సారి మన సమయాన్ని ఖాన్ ఖానా సమయంతో పోల్చిచూడు. ఆ సమయంలో జోధాబాయి నీ భార్య అయి రాజ మందిరంలో విష్ణువుని పూజించగలిగేదా?" అన్నాడు అబుల్ ఫజల్.

"తేడా ఉంది ఫజల్! కాని గమ్యం చేరడానికి మనం ఇంకా ఎంతదూరం ప్రయాణం చెయ్యాలి? పాశ్చాత్య పాదరీలు చెప్పగా ఓసారి విన్నాను.వాళ్ళ దేశంలో పెద్ద చక్రవర్తైనా సరే ఒక స్త్రీనితప్ప ఎక్కువమందిని పెళ్ళాడ్డానికి వీలులేదట. నాకీ పద్ధతి యెంతో నచ్చింది. బ్రదర్! నేనెప్పుడు నీతో చెప్పిన మాటలతో నా అభిప్రాయం నీకు తెలిసే వుంటుంది. అలా నేను చెయ్యగలిగి వుంటే!! కాని బాద్‌షాలకి కీడు చేసే పనులు చెయ్యడానికి ఉన్నంత స్వేచ్ఛ మేలు చెయ్యడానికి లేదు! ఎంత హాస్యాస్పదమో!! వీలైనట్లైతే నేను సలీమ్ తల్లిని తప్ప మరే స్త్రీనీ అంతఃపురానికి తీసుకువచ్చేవాణ్ణికాదు! కనీసం ఇప్పుడు సలీం విషయంలో ఆ పద్ధతిని అనుసరించగలిగి ఉంటే బాగుండేది!" అన్నాడు అక్బరు.

"జలాల్! ప్రేమన్నది ఒకరిపట్లే కలుగుతుంది. హంసల అందమైన జోడీని చూసినప్పుడు జీవితం యెంత అందమైనదీ అని నాకు అనిపిస్తుంది. కష్టానికి సుఖానికీ అవి ఒకటి కొకటి యెప్పుడూ తోడూ నీడగా ఉంటాయి!" అన్నాడు బీర్‌బల్.

"బీరూ భాయి! ఓసారైతే నాకళ్ళంట నీళ్ళు వచ్చాయి. నేను సింహాలని వేటాడ్డానికి గుజరాతుకు వెళ్ళాను. ఏనుగుమీద కూచుని రంజకం తాడు అంటించి తుపాకీతో సింహాన్ని చంపడం ఏమీ గొప్ప వీరత్వం కాదని ఒప్పుకుంటాను. నీకు సింహానికున్నట్టూ పెద్ద పెద్ద పంజాలూ దవడలూ లేవు. నువ్వు కత్తీ డాలూ పట్టుకుని దాంతో సమానం అవొచ్చు. కాని అంతకన్నా ఎక్కువ ఆయుధాల్ని పట్టుకోవడం అన్నది వీరత్వం అనిపించుకోదు. నేను రంజకం తాడు ముట్టించి సింహాన్ని చంపాను. గుండు దాని తలకి తగిలింది. అదో గెంతుగెంతి అక్కడికక్కడే కూలిపడిపోయింది. పొదలోంచి ఆడ సింహం ఒక్కదూకు దూకి అక్కడికి రావడాన్ని నేను చూశాను. ఆ ఆడసింహం నావేపోసారి అసహ్యంగా చూసింది. ఆ తర్వాత మొహం తిప్పేసుకుంది. సింహం మొహం నాకడం మొదలు పెట్టింది. నేను వేటగాళ్ళని తుపాకులు పేల్చకండని ఆజ్ఞాపించాను. ఏనుగుని వెనక్కి తిప్పించాను. ఆడసింహం నామీద అప్పుడు దాడిచేసినా దాన్ని చంపగలిగే వాణ్ణికాదు. నా మనస్సు అంతగా కలత చెందింది. తర్వాత చాలా రోజులవరకూ ఆ కలతా బాధా నాలో అలాగే వున్నాయి. సింహానికి కూడా పదిహేను వందల ఆడసింహాలు వుండి వున్నట్లైతే అది సింహం మొహాన్ని నాకడానికి అలా వచ్చి వుండేదా అని నాకు తోచింది."

"మనదేశం యెంతో పురోగమించవలసివుంది. మన నడక ఎంత నెమ్మదిగా వుందో! మన తర్వాత మన ఈ భారాన్ని ఎవరన్నా వహిస్తారో లేదో అదీ మనకి తెలీదు." అన్నాడు అబుల్ ఫజల్.

"యుద్ధాలు కొనసాగించే హిందువులూ, ముస్లిములు రెండు జాతులవాళ్ళూ రక్తసంబంధీకులై మెలగాలని నేను ఆశించాను. వారి కలయికని దృష్టిలో పెట్టుకునే ప్రయాగలో త్రివేణీ సంగమం దగ్గర కోట కట్టించాను. గంగాయమునల సంగమం నాలో మరో బృహత్తర సంగమం గురించిన ఆలోచనని కలిగించింది. కాని ఆ విషయంలో నేనెంత తక్కువగా కృతకృత్యుణ్ణి అయ్యేనో ఇప్పుడు తెలుస్తోంది. నిజానికి ఎన్నో తరాల ప్రయత్నంతో జరగవలసినదాన్ని ఓ తరం చెయ్యలేదు. అయితే నాకు దొరికినలాంటి సహచరులు అందరికీ దొరకరు. ఆ అదృష్టం చాలా తక్కువమందికే పడుతుంది. జోధాబాయీ అందుకు నేనెప్పుడూ గర్వపడుతూ ఉంటాను. ప్రతి ఇంటా అక్బరూ మేహరున్నిసాలుండాలని, మతాంతర వివాహాలు జరగాలని కోరుకున్నాను. కాని నేను సాధించలేక పోయాను" అన్నాడు అక్బరు.

"హిందువులే ఈ విషయంలో వెనకబడ్డారు" అన్నాడు టోడర్‌మల్లు,

"పైగా గాడిదని సామి తోమి గుర్రంగా మార్చే కథల్ని అల్లుతున్నారు. కాని హిందూ ముస్లిముల మధ్య ఇంత తేడా వుంటే గుర్రం గాడిద యెలా అవుతుంది? వేలకొద్దీ హిందువులు ముస్లిములుగా మారడం చూట్టం లేదూ?" అన్నాడు బీర్‌బల్.

"తమ పేర్లూ, మతం మార్చుకోకుండా హిందూ యువకులు కూడా ముస్లిము యువతులను పెళ్ళి చేసుకోవాలని నేనెంత ఆశపడ్డానో! నా ఆశ నిరాశే అయింది!" అన్నాడు అక్బరు.

"ఈ సందర్భంలో నీకో శుభవార్త చెప్పనా జలాల్ భాయీ! మా అమ్మాయి సురైయా మనం చెయ్యలేని పనిని చేసింది." అన్నాడు అబుల్ ఫజల్. అబుల్ ఫజల్ వేపు అందరూ కుతూహలంగా చూశారు.

"మీరందరూ చాలా కుతూహలంగా ఉన్నారు కదూ-సంగతేమిటా అని! కాస్త నన్ను బైటకి వెళ్ళనివ్వండి" అని అబుల్ ఫజల్ బయట ఉన్న కటకటాల దగ్గర నిల్చుని చూశాడు. మళ్ళీ లోపలికి వచ్చి "సంగతి చెప్పడం కాదు. చూపెడతాను రండి" అన్నాడు. అంతమందీ ఆ కటకటాల దగ్గరికి వెళ్ళారు.

అశోకవృక్షంకింద రాతి చప్టామీద కూచున్న యువతీ యువకుల్ని వేలుతో చూపెడ్తూ అబుల్ ఫజల్—"అదిగో చూడండి మా అమ్మాయి సురైయాను" అన్నాడు.

"మా అబ్బాయి కమల్! మనం దురదృష్టవంతులం కాం! లోకంలో మనకి అన్యాయం జరగలేదు!" అంటూ టోడర్‌మల్ అబుల్ ఫజల్‌ని రెండుచేతులూ చాచి కౌగలించుకున్నాడు.

వాళ్ళిద్దరూ కౌగలించుకుని తిరిగి మిగతావారిని చూశారు. అందరికళ్ళూ ఆనందంతో చెమర్చాయి.

"యువతీయువకుల కోసం ఈ వసంతోత్సవాన్ని ఏర్పాటు చేసి యెన్నో సంవత్సరాలయింది. నిజమైన వసంతోత్సవం ఇవాళ అన్నిరోజుల తర్వాత జరుగుతోంది.! వాళ్ళిద్దర్నీ దగ్గరికి పిలిచి ఇద్దరి నుదుటినీ ముద్దుపెట్టుకోవాలని అనిపిస్తోంది. గంగా యమునా సంగమంలాంటి వాళ్ళిద్దరి కలయికని మనం మన సారా అభినందిస్తున్నామనీ, ఆనందిస్తున్నామనీ వాళ్ళిద్దరికీ తెలిస్తే యెంత బావుణ్ణు!" అన్నాడు అక్బరు.

"వాళ్ళమ్మా నాన్నా తన ఈ ప్రేమ గురించి తెలుసుకుని ఎంతో సంతోషిస్తారని మా అమ్మాయి సురైయాకి తెలీదు!" అన్నాడు అబుల్ ఫజల్.

"కమల్‌కి తెలీదు. అయితే నువ్వుమాత్రం చాలా అదృష్టవంతుడివి ఫజల్! సురైయా తల్లికూడా నీతోపాటే ఈ విషయంలో ఏకాభిప్రాయం కలిగి ఉంది. కమల్ తల్లీ, సురైయా తల్లీ ఇద్దరూ బాగా దగ్గర స్నేహితురాళ్ళే. అయినా కమల్ తల్లి పాతకాలపుది! ఆవిడ ఇలాంటి వాటిని అంగీకరించదు. అయినా సురైయాని కమల్‌ని నేను ఆశీర్వదిస్తాను" అన్నాడు టోడర్‌మల్.

"అందరికన్నా ముందు దీవించే హక్కు నాదవాలి" అన్నాడు అక్బరు.

"మరి నేనో జలాల్! నీతోపాటు నేనూను!" అన్నాడు బీర్‌బల్.

"తప్పకుండా! ఇలాంటి చాకలి ఎక్కడ దొరుకుతాడు." అన్నాడు అక్బరు.

"మరి ఇలాంటి గుర్రాన్ని చేసే గాడిదా ఎక్కడ దొరుకుతాడు?" అన్నాడు బీర్‌బల్.

"ఇవాళ మన సంభాషణలు ఎంత సంతోషకరంగా ఉన్నాయి! ఇలాంటి ఆనందం నెలకోరోజునన్నా కలిగితే ఎంత బాగుంటుంది!" అన్నాడు అక్బరు.

# 3

ఆది నాలుగువేపులా ద్వారగుమ్మాలతో ఉన్నగది. మేడమీద ఉన్న ఆ గది చక్కగా అలంకరించి వుంది. ఎరుపురంగువీ, ఆకుపచ్చ రంగువీ, తెల్లవీ గాజు దీపాల గుత్తులు గది పైకప్పునుంచి వేళ్ళాడుతున్నాయి. గుమ్మాన్ని రెండేసి తెరలు వేళ్ళాడుతున్నాయి. లోపలివేపు తెరలు గులాబీరంగువీ, సిల్కువీ, బుటాలున్నవి. నేలని అందమైన ఈరాను తివాసీ పరిచిఉంది. గది మధ్యని తెల్లటి పరుపూ, గోడకి ఆనుకుని కూచునే బాలీసులూ దిండ్లూ ఉన్నాయి. పరుపుమీద ఇద్దరు యువతులూ కూచుని చదరంగం ఆడుతున్నారు. ఇద్దరిలో ఒకావిడ మనకితెలిసినావిడే, సురైయా. రెండో ఆమె ఎర్రటి ఘాఘరా (పెద్దపరికిణి), ఆకుపచ్చ రవికా, పసుపుపచ్చని వల్లెవాటు వేసుకున్న పూల్‌మతి. ఆవిడ బీరబల్ కూతురు. పదమూడేళ్ళది. వాళ్ళిద్దరూ చదరంగం ఎత్తులు వెయ్యటంలో పూర్తిగా మునిగిపోయి ఉన్నారేమో పక్కనవచ్చి ఎవరో కూచున్న సవ్వడిని కూడా తెలుసుకోలేకపోయారు.

"సురైయా!" అన్న పిలుపు వినగానే ఇద్దరూ కళ్ళెత్తి చూశారు. లేచి నిల్చున్నారు.

"పిన్నీ!" అంది సురైయా.

కమల్ వాళ్ళమ్మ ఆమెని కౌగిలించుకుని రెండు బుగ్గలూ ముద్దు పెట్టుకుంది.

"అమ్మాయీ! కమల్ నీకోసం ఎర్రరంగు చేపలు తీసుకువచ్చాడు. నీటి కుండీలో వెయ్యటానికట! అంతవరకూ నేను మున్నీతో చదరంగం ఆడుతూ ఉంటాను" అంది సురైయా వాళ్ళమ్మ.

"మున్నీ చాలా తెలివైంది అమ్మా! నా ఆట రెండుసార్లు కట్టేసింది. దీన్ని చిన్నపిల్ల అని అనుకోకు" అని సురైయా వోణీని సరిచేసుకుంటూ తొందర తొందరగా గదిలోంచి బైటికి వెళ్ళిపోయింది.

మహల్ వెనకవేపు నున్న తోటలో నీటికుండీ దగ్గర కమల్ నిల్చుని ఉన్నాడు. అతనికి దగ్గరగా కొత్త మట్టికుండ ఉన్నది. సురైయా అతని దగ్గరగా వెళ్ళి చెయ్యిపట్టుకుని, కమల్! నాకోసం ఎర్రటి చేపలూ పసుపురంగు చేపలూ తెచ్చావా?"

"బంగారపు రంగువి కూడా తెచ్చాను!"

"ఏదీ చూడనీ" అని సురైయా వొంగి కుండలోకి మొహం పెట్టి చూసింది.

"వీట్ని కుండీలో వేస్తాను. అందులో ఈదుతూ ఇవి ఎంతో అందంగా కనపడతాయి. ఈ స్ఫటికపు రాతికుండీ అడుగున మెరుస్తూ ఈదుతూ ఉంటే చూడు సురైయా!"

కుండీ దగ్గర సురైయా కలకలలాడే నవ్వుమొహంతో నిల్చుంది. కమల్ కుండలోని చేపల్ని కుండీలోకి వొంపేడు. స్ఫటికపు రాతికుండీలో నిజంగానే ఎరుపు గులాబీ బంగారపు రంగులతో చేపలు చూడముచ్చటగా ఉన్నాయి.

"ఇవింకా చిన్నపిల్లలు సురైయా! పెరిగిన తర్వాతైనా ఇవి ఆరు అంగుళాల కన్నా పెద్దవికావు" అని కమల్ బోధపరుస్తూ చెప్పాడు.

"ఇప్పుడూ ఎంతో అందంగా చూటముచ్చటగా ఉన్నాయి కమల్!"

"ఇదిగో దీన్ని చూడు సురైయా! దీనిరంగు ఎలా ఉందో!"

"గులాబీరంగు!"

"నీ బుగ్గల్లా సురైయా!"

"నా చిన్నప్పుడూ నువ్విలాగే అంటూ ఉండేవాడివి కమల్!"

"మరి చిన్నప్పుడూ నీ బుగ్గలు అలాగే ఉండేవి సురైయా!"

"చిన్నప్పుడూ నువ్వు నాకెంతో బాగుండేవాడివి!"

"మరి ఇప్పుడు?"

"ఇప్పుడు ఇంకా బాగున్నావు!"

"ఇంకా బాగున్నానా! ఏం ఎందుకనీ?"

"ఏమో నాకేతెలీదు. నీ గొంతు మారి, నీకు నూనూగు మీసాలు వచ్చినప్పటి నుంచీ నీమీద నా ప్రేమ మరింత ఎక్కువైనట్టు నాకు అనిపిస్తోంది."

"మరందుకేనా నువ్వు మరింత దూర దూరంగా తప్పుకు తప్పుకు తిరుగుతున్నావు!"

"తప్పుకు తప్పుకు తిరుగుతున్నానా!"

"ఎందుక్కాదూ? ఇంతకు ముందు ఎగురుతూ గెంతుతూ వచ్చి నా భుజాలు పట్టుకుని వేళ్ళాడేదానివి!"

"చాడీలని ఏకరువు పెట్టకు కమల్! ఏదన్నా కొత్త సంగతి చెప్పు."

"కొత్త సంగతా? సురైయా! మన ప్రేమసంగతి అందరికి తెలిసిపోయింది."

"ఎవరికి?"

"మనవాళ్ళందరికీ-మీ ఇంట్లోనూ, మా ఇంట్లోనూ! పాదుషాకుకూడా!"

"పాదుషాకి కూడానా?"

"ఏం, భయంగా ఉందా సురైయా!"

"ఊహూ! ప్రేమ అన్నది ఎప్పటికో అప్పటికి అందరికీ ఎలాగూ తెలుస్తుంది! కాని ఇప్పుడే ఎలా తెలిసిపోయింది?"

"పూర్తిగా వివరాలు నాకూ తెలీవు. నీ తల్లి తండ్రులు మొదట దీనికెంతో సంతోషించి అంగీకరించారట! తర్వాత మా నాన్న, పాదుషా ఒప్పుకున్నారట! చిట్ట చివరకి మా అమ్మ ఒప్పుకుందిట!"

"మీ అమ్మా?"

"మా అమ్మ విషయంలో అందరికీ భయమే! ఆవిడవన్నీ పాత భావాలు!"

"ఇప్పుడే ఆవిడ నన్ను ముద్దు పెట్టుకుని ఎంతో అభిమానంగా పలకరించింది!"

"నిజమే! అందరి అభిప్రాయాలూ ఆవిడ విషయంలో అంచనా తప్పాయి! మా నాన్న ఆవిడతో మన సంగతి చెప్పినప్పుడు చాలా సంతోషించింది!"

"అయితే మన ప్రేమ సంగతి తెలిసి అంతమందీ సంతోషించారా?"

"మన వాళ్ళందరూ - ఇటుబంధువులూ అటుబంధువులూ మన సన్నిహిత మిత్రులూ సంతోషించారు, లోకం మాత్రం దీనిని ఒప్పుకోదు!"

"లోకం గురించి నువ్వు పట్టించుకుంటావా కమల్?"

"ఎంత మాత్రమూ పట్టించుకోను సురైయా! మనం పట్టించుకోవల్సినది ముందుతరాల వారిని! మనం వాళ్ళకి ఓ మార్గాన్ని చూపెట్టబోతున్నాం!"

"మన విషయం మా వదినకి కూడా తెలుసునని నాకిప్పుడు బాగా అర్థం అవుతోంది. కమల్! నిన్నరాత్రి వాళ్ళింటికి వెళ్ళాను. 'ఆడపడుచుపిల్లా! మా తమ్ముడు ఎప్పుడొస్తాడో, ఎప్పుడు బూరెముక్క తింటానో-అని కళ్ళుకాయలు కాసేటట్టు చూస్తున్నాను! మరదలు పిల్లా! ఇహ నా కోరికా తీరేరోజు వచ్చే

సిందిలే!' అంటూ నా పెళ్ళిమాట ఎత్తి వెటకారా లాడింది. అయితే నీ పేరు ఎత్త లేదులే" అన్నాది సురైయా.

"అంటే అన్నగారు వదినగారికి చెప్పారన్నమాట! వాళ్ళిద్దరికీ మనం ఒకట వడం ఇష్టమేనన్నమాట!"

"అయితే కమల్! నీ అత్తారింటి తరఫు వారంతా నీ అడుగులకి మడుగు లొత్తేవారే అయ్యారన్నమాట!"

"నువ్వేం తక్కువదానవా? మా అమ్మని నీ వేపుకి గమ్మత్తుగా తిప్పేసుకు న్నావు!"

"మీ అమ్మగారు నిష్ఠానియమాలతో పూజలూ పునస్కారాలు చేస్తారని మీరంతా అలా తప్పు అభిప్రాయం ఏర్పరచుకున్నారు. కమల్! నేనంటే ఆవిడ ఎంత అభిమానపడుతుందో మీకు తెలిసి ఉన్నట్లయితే మీరు ఆవిడ విషయంలో సందేహించి ఉండి ఉండేవారు కాదు!"

"అందుకే ఆవిణ్ని మనవేపు తిప్పుకోడానికి నాన్నగారు నిన్నే తురుపు ముక్కగా ఉపయోగించాలని అనుకున్నారు. అయితే తురుపుముక్క వాడానికి ముందే గెలుపు మన వేపే అయిపోయింది! మన పెళ్ళి జరగబోతోంది!"

"ఎక్కడా? ఎలాగ?"

"పురోహితుడి ద్వారానూ కాదు! ముల్లా ద్వారానూ కాదు!"

"మన మత ప్రవక్తద్వారా! హిందూ దేశంలో కొత్త త్రివేణిని, కొత్త కోటని కడుతున్న మన ప్రవక్త ద్వారా జరగబోతోంది!"

"నదుల్ని కాలవలనీ చిన్నచిన్న గుంటలని సరోవరాలని సముద్రంలా తయారు చెయ్యాలని అనుకుంటున్నాడాయన!"

"ఎల్లుండి ఆదివారంనాడు సురైయా!"

"ఎల్లుండా?" సురైయా కళ్ళనిండా ఆనందబాష్పాలు నర్గీస్ పువ్వు నిండా ఉన్న మంచుబిందువులా నిండుకొచ్చాయి. కమల్ కూడా సంతోషంతో ఆమె కళ్ళని ముద్దాడాడు. చాటుగా మరోజంట వీళ్ళలాగానే ఆనందబాష్పాలు విడుస్తు న్నట్టు వీళ్లు ఎరగరు.

## 4

వసంతకాలం. సంధ్యాసమయం. అస్తమిస్తున్న సూర్యుడి ఎర్రటికిరణాల కాంతితో నిప్పులా ఎరుపురంగుతో సముద్రంఎంతోఅందంగాకనపడుతోంది. సముద్రం ఒడ్డున ఇసుకమీద ఇద్దరు యౌవన వయస్కులు ఆ అందాన్ని ఆస్వాదిస్తూ ఆనంది స్తున్నారు. ఎరుపురంగు సముద్రమంతా బాగా అలుముకోవడం చూసి "సముద్రుడు! మన ఇష్టదైవం! ఎంత అందంగా ఉన్నాడు!" అని యువకుడు అన్నాడు.

"మనం సముద్రుడి పిల్లలం! అందులో ఇంకా ఏమన్నా సందేహం ఉందా? ప్రియతమా!"

"ఊహూ! ఎంత మాత్రమూ సందేహం లేదు! కమలం లాంటి కమల్! సముద్రుడు తన కడుపులో ఇంత స్వర్గాన్ని దాచుకున్నాడని మనం ఎప్పుడనా ఊహించామా?"

"సంపూర్ణంగా కాకపోయినా వెన్నిసు వాసులు స్వర్గాన్ని నిర్మించారు. ప్రియతమా! సందేహం ఏం లేదు!"

"మా దేశంలో పెద్దింటి కోడళ్ళు, ఆడబడుచులు మేలి ముసుగుతో మొహం కప్పుకోకుండా స్వేచ్ఛగా మొగవారిలా తిరుగుతారని ఆ సాదువమ్మ చెప్పినప్పుడు నేను నమ్మలేదు. ఈ స్వర్గభూమిలో మనం ఉంటూ రెండేళ్లు అయింది. ఓ సారి వెన్నిసుతో ఢిల్లీని పోల్చిచూడు, ప్రియతమా!"

"మనం యెప్పుడైనా ఇవన్నీ నమ్మేవాళ్ళమా సురైయా! రాజన్నవాడు ఎవరూ లేకుండా ఫ్లారెన్సులాంటి సమృద్ధివంతమైన రాజ్యం ఉందని ఎవరైనా చెపితే నమ్మే వాళ్ళమా?"

"వెన్నిసులాంటి నగరాలని రాణులు పరిపాలిస్తున్నారూ అంటే నమ్మే వాళ్ళమా?"

"ఢిల్లీలో మనం ఇంత స్వేచ్ఛగా కలిసి తిరగగల్గుతామా సురైయా?"

"బురఖా లేకుండా, మేనాలో ముడుచుకుని కూచుని వెళ్ళాల్సి వచ్చేది! ఇక్కడ మనం చేతిలో చెయ్యి వేసీ, చెట్టపట్టాలు వేసుకుని తిరుగుతున్నా ఎవరూ కన్నెత్తి చూడమన్నా చూడరు!"

"అయితే ఒకటి, నేను గుజరాతు వెళ్ళినప్పుడు బురఖా, ముసుగూ లేకుండా తిరిగే పెద్దింటి స్త్రీలని చూశాను. దక్షిణాదిని కూడా ఇలాంటి పరదా పద్ధతి ఉండదని విన్నాను."

"దీన్నిబట్టి ఒకప్పుడు హిందూదేశపు స్త్రీలు కూడా పరదా లేకుండా స్వేచ్ఛగా ఉండేవారని తెలుస్తోంది! మళ్ళీ మనదేశం అలాగ అవగలుగుతుందా కమల్!"

"మన తండ్రులు తమ జీవితాంతం వరకూ దానికోసం శాయశక్తులా ప్రయత్నించారు. ఇంత చిన్నదేశం ఈ ఫ్లారెన్సును చూడు-మూడు రోజుల్లో ఈ దేశాన్ని ఈ వేపునుంచి ఆ వేపుకి వెళ్ళి చుట్టి రావొచ్చు. అంత చిన్నది! ఇక్కడి జనం ఎంతో గర్వంతో తలెత్తుకు తిరుగుతారు. ఎవరి ముందూ తల వంచరు. సలాం పెట్టడం, దండాలు పెట్టి కాళ్ళకి మొక్కడం అన్నది వాళ్ళు ఎరగనే ఎరగరు. రాజన్నా రాజరికపు పాలన అన్నా వాళ్లు అసహ్యించుకుంటారు. వాళ్ళ దృష్టిలో రాజంటే సైతానూ దెయ్యం. లేదా అంటే విషం కక్కే నాగుపాము."

"కమల్! ఫ్లారెన్సులోని రైతులతో హిందూదేశపు రైతుల్ని పోల్చిచూడు.

వాళ్ళు చెప్పేదాంట్లో కొంత నిజం ఉందని తెలుస్తుంది! ఇక్కడ రైతులు తిండీ గుడ్డాలేక కుంగి కృశించి ఎక్కడన్నా కనపడుతున్నారా?''

"ఊహూ! కనపడరు! ఇక్కడ రాజవైభవాలకీ డాబు దర్పాలకి కోట్ల కొద్దీ ధనాన్ని వెచ్చించరు!"

"వెన్నిసులోనూ కుబేరులూ, కోట్లకి పడగలెత్తిన వాళ్ళూ వున్నారు. మన దేశంలోని సేఠ్‌లూ, సాహుకార్ల కన్నా మించిన వాళ్లు వున్నారు."

"మన సేఠ్‌లూ, సాహుకార్లు లక్షలు లక్షలు గడించిన వాళ్ళు! పాతర్లలో మూలుగుతున్న ఆ ధనమూ బంగారపు నాణాలకి ముక్తీ మోక్షమూ కలగాలని నేను అనుకుంటూ వుంటాను. ధనం ఒకరి చేతినుండి మరొకరి చేతికి నిత్యమూ మారుతూ ఉండాలి. లేకపోతే చలామణీ కాక ఒకచోట పడి ఉండి తీపి తినుబండారాలు మురిగి కంపుకొడతాయి. పళ్ళు కుళ్ళి పాడైపోతాయి. బట్టలు బేళ్ళకి బేళ్ళు గోదాముల్లో పురుగుల పాలవుతాయి. ఇహ ధనాన్ని మురగబెట్టి మురగబెట్టి మన సేఠ్‌లూ సాహుకార్లూ లక్షలకి లక్షలు చేస్తారు. నూరులక్షలని మురగబెట్టిన సేఠ్‌ని కరోడ్‌మల్లుగా కోటీశ్వరుడిగా జనం చెప్పుకుంటారు!"

సూర్యుడు అస్తమించి చాలా సేపయింది. చీకట్లు చుట్టూ పరుచుకున్నాయి. సముద్రపు కెరటాలు ఒడ్డున ఉన్న బండరాళ్ళని కొట్టుకుంటూ నిర్విరామంగా చప్పుడు చేస్తున్నాయి. సముద్రపు ఒడ్డునున్న ఆ ఇసకమీంచి లేచి వెళ్ళడానికి ఆ యువతీ యువకులకి మనస్కరించటంలేదు. వాళ్లు సముద్రుణ్ణి తమకి యెంతో ఇష్టమైన బంధువుగా తలచారు. భూమార్గాన్నే వాళ్ళు ప్రయాణం చేసినా తమకి ఎదురుగా ఉన్న సముద్రానికి అటు ఉన్నతీరం తమ హిందూదేశానికి అనుకుని ఉన్నదని వాళ్ళకి తెలుసు. అందుకే ఈ తీరాన్నీ ఆ తీరాన్నీ కలపటం సాధ్యమౌతుందా అన్న ఆలోచన అప్పుడప్పుడు వాళ్ళకి వస్తూ వుంటుంది.

రాత్రి చాలా పొద్దుపోయాక వాళ్ళిద్దరూ అక్కడ నుంచి తిరుగు మొహం పట్టారు. ఆ చీకటి రాత్రినీ తన మనస్సులోని భావాలనూ కలగలుపుకుని సురైయా ఆలోచనలో పడింది.

"మన పాదుషా తన రాజ్యంలో శాంతిని నెలకొల్పటానికి ఎంతో గట్టి ప్రయత్నం చేశాడు. చాలా వరకూ కృతకృత్యుడయ్యాడు. అయినా అక్కడ ఇలాంటి చీకటి రాత్రప్పుడు మనం జంకూ గొంకూ లేకుండా నిర్భయంగా ఇలా తిరగ్గలుగుతామా? ఎంచేతంటావూ?" అని అడిగింది.

"ఇక్కడ ప్రజలు మంచి స్థితిలో వున్నారు. రైతులు పుష్కలంగా ద్రాక్ష తోటలని, యాపిల్ తోటల్ని పెంచుతున్నారు. గోధుమని పండిస్తున్నారు."

"మన పొలాలూ బంగారాన్ని పండిస్తున్నాయి కదా?"

"కానీ బంగారాన్ని దోచుకునే వాళ్లు మన దేశంలో యెక్కువ మంది ఉన్నారు సురైయా!"

"మరో సంగతి చూశావా కమల్! ఇక్కడ ఎవరింటికి వెళ్ళ ఎంతో మామ్మూలుగా సారాయి బుడ్లూ గ్లాసులూ అందిస్తారు!"

"హిందూదేశంలో మా నాన్నగారికి పాదుషాతో కలిసి మంచినీళ్ళు తాగటం వల్ల చెడ్డ పేరు వచ్చింది?"

"రాజపుత్ర స్త్రీలు యెంతో ఎడ్డివాళ్ళనీ, అపరిశుభ్రంగా ఉంటారని, వాళ్ళి ళ్ళల్లో పందిమాంసం వండుకుంటారనీ మా ఇంటి పరిచారికలు చెపుతూ వుండేవారు. అక్కడి గుడ్డి జనం ఇక్కడికి వచ్చి చూస్తే బావుణ్ణు! ఇక్కడ పెద్దజాతి అనీ చిన్నజాతి అనీ హెచ్చుతగ్గులు లేవు!"

"ఇక్కడ అన్నపానాదుల విషయంలో మడీ మైలా అంటరానితనమూ లేవు!"

"ఫ్లొరెన్సులో సమైక్యత ఉంది. అది ఒకటే దేశం! ఎప్పటికైనా మన హిందూ దేశమూ ఇలాగ సమైక్య దేశం అవగలదా కమల్!"

"సముద్రుణ్ణి శరణుజొచ్చి సముద్రుణ్ణి జయించిన నాడు అది సంభవం అవు తుంది!"

"సముద్రాన్ని జయించటమా? సముద్రాధిపత్యమా?"

"వెన్నిసునగరం సముద్రాన్ని జయించిన నగరం! సముద్రాధిపత్యం వల్ల ఏర్పడ్డ నగరం! ఈ నగరంలో కాలువలే రోడ్లు. ఈ రోడ్లు ఈ ఎత్తైన భవనాలు అన్నీ సముద్రాన్ని గెలవటం వల్ల ఏర్పడినవే. ఇప్పుడు వెన్నిసుతో పోటీ పడే దేశాలూ ఉన్నాయి. సముద్రాన్ని జయించటంలో పోటా పోటీలు పడుతున్నాయి. సముద్రాధిపత్యం సంపాదించిన వాళ్ళే ప్రపంచాధిపత్యం సంపాదించి, పరిపాలిస్తా రని నాకు స్పష్టంగా తోస్తోంది. ఈ సంగతి నాకు స్ఫురించి నందుకు నన్ను నేను అభినందించుకుంటున్నాను. అదృష్టవంతుణ్ణని అనుకుంటున్నాను."

"ప్రతి రాత్రీ అలా ఏవేవో పుస్తకాలు చదువుతూనే ఉంటావు! ఇక్కడ పుస్తకాలు యెంత సులువుగా దొరుకుతాయో!"

"మన దేశంలోనూ సీసం ఉంది. కాగితమూ ఉంది. పనితనం ఉన్న లోహపు పని వాళ్ళూ వున్నారు. అయినా ఇప్పటికీ మనకి పుస్తకాలు అచ్చువేసు కోడం తెలీదు. అచ్చుయంత్రాలతో ముద్రణాలయాలు మన దేశంలోనూ స్థాపిస్తే విజ్ఞానం యెంత త్వరితంగా నలుగురికీ అందుబాటులోకి వస్తుందో కదా! నేను చదువుతున్న ఈ పుస్తకాలవల్లా, వారాల తరబడి వారాలు ఈ నావికులతో తిరిగి తెలుసుకున్న సంగతుల వల్లా సముద్రాధిపత్యం కలిగిన దేశం ప్రపంచం యావత్తునీ గెలిచి తీరుతుందని నాకు అనిపిస్తోంది. ఈ యూరపు దేశం వాళ్ళని మన దేశం వాళ్లు మురికి వాళ్ళనీ, అనాగరికులనీ, స్నానం చెయ్యరనీ అంటారు. కాని వీళ్ళ కున్న జ్ఞాన జిజ్ఞాసని చూస్తే మెచ్చుకోకుండా ఉండలేం. భూగోళం గురించి వీళ్లు కల్పించి కథలు అల్లి చెప్పలేదు. భూగోళాన్ని చుట్టబెట్టి వచ్చి ప్రతీస్థలం గురించి

అన్ని విషయాలూ సేకరించి తెలుసుకున్నారు. వాళ్ళు తయారు చేసిన దేశపటాల్ని నీకు చూపెట్టాను కదా సురైయా!"

"సముద్రం అంటే నాకు యెంత ప్రీతో, కమల్!"

"ప్రీతే కాదు సురైయా! సముద్రం చేతిలో దేశాల స్వాతంత్ర్యం ఉంది! బతుకూ భవిష్యత్తూ ఉన్నాయి! ఈ కర్ర ఓడల మీద ఉన్న ఫిరంగుల్ని చూశావు కదా! ఈ ఓడలు నీటిలో సంచరించే కోటలు! దుర్గాలు! మంగోలుల విజయానికి కారణం వాళ్ళకున్న అశ్వాలు! తుపాకులూను! అయితే ఇప్పుడు యుద్ధ నౌకలున్న వాళ్ళకే గెలుపు లభిస్తుంది. అందుకే నేనీ విద్యని–నౌకా యుద్ధాన్ని నేర్చుకోవాలని నిశ్చయించుకున్నాను. సురైయా!"

కమల్, సురైయాల కోరిక తీరలేదు. వాళ్ల భారతదేశానికి తిరుగు ప్రయాణం కట్టారు. కాని ఆ రోజుల్లో సముద్రపు దొంగలు ఎక్కువగా ఉండేవారు. సూరతు చేరడానికి రెండు రోజుల ముందు వాళ్ళ ఓడని సముద్రపు దొంగలు ముట్టడించారు. తన సహచరులతో కలిసి కమల్ తన ఫిరంగుల్ని, తుపాకుల్ని పేలుస్తూ దొంగలని యెదురుకున్నాడు. అయితే దొంగలు సంఖ్యలో యెక్కువ ఉన్నారు. కమల్ ఓడ ఫిరంగుల గుండు దెబ్బలు తిని నీటిలో మునిగి పోవడం మొదలు పెట్టింది. ఆ సమయంలో సురైయా అతనికి దగ్గరగానే ఉంది. ఆమె ఆఖరిసారిగా చిరునవ్వుతో "సముద్రాధిపత్యం! సాగర విజయం!" అని అన్నది.

# రేఖాభగత్

కాలం : క్రీ. శ. 1800

ఆవేళ కార్తిక పున్నమి. గండక్ (నారాయణి)లో స్నానం చేసి హరిహర నాధుడి దర్శనం చేసుకోడానికి జనం గుంపులు గుంపులుగా వచ్చారు. దూరదూర ప్రాంతాల నుంచి పల్లెటూళ్ళ జనం ఆడా మగా ఎంతో కష్టంతో కూడబెట్టిన డబ్బూ, సత్తుపిండీ (పేలపిండీ), బియ్యం పట్టుకుని హరిహరక్షేత్రం చేరుకున్నారు. తోటలో కట్టి ఉన్న ఎద్దుల్నీ, గుర్రాల్నీ, ఏనుగుల్నీ చూస్తే, ముందు ముందు ఇదే ప్రపంచంలో కల్లా పెద్ద తీర్థం అవుతుందని ఎవడూ అనుకోలేడు! !

ముతగ్గా ఉన్న అంగోస్త్రంలో ఉప్పు కలిపిన సత్తుపిండిని, పచ్చి మిరపకాయలూ, ఉల్లిగి ముక్కలూ నంచుకుంటూ లొట్టలు వేసుకుంటూ తిని రేఖా తన నలుగురు స్నేహితులతో ఓ మామిడి చెట్టు కింద కంబళీ మీద కూచున్నాడు. రేఖా గేదెని అమ్మేశాడు. తన నడుముకు కట్టుకున్న కండువాలో మూటకట్టి బొడ్డులో దోపుకున్న ఇరవై రూపాయిల్ని ఉండీ ఉడిగీ ఇప్పటికి చూసుకుంటూనే ఉన్నాడు. కన్నుగప్పి గమ్మత్తుగా డబ్బుని దొంగలాడే దొంగలు తీర్థానికి ఎక్కువమంది వచ్చేరని అంతా చెప్పుకుంటున్నారు. రేఖా చెయ్యి మరోసారి నడుం దగ్గర కట్టుకున్న మూట మీదకి వెళ్ళింది! తడుముకుని చూసుకున్నాక నిశ్చింతతో మాట్లాడ్డం మొదలుపెట్టాడు.

"నా గేదెని అమ్మేశాను భోలూ భాయీ! మూడు నెలలు బాగా మేపి మరీ అమ్మకానికి పెట్టాను. ఇరవై రూపాయిలు అలాంటి గేదెకి తక్కువ వెలేమీకాదు! అయితే ఈ రోజుల్లో చూస్తూ ఉండగా లక్ష్మీదేవి ఇట్టే మాయమైపోతుంది."

"మాయమైపోతుంది రేఖా భాయీ! రూపాయి అణా పైసలకీ విలువ లేకుండా పోయింది. ఎందుకూ కొరగాకుండా ఉన్నాయి. ఈ కంపెనీవాడి రాజ్యంలో ఏ వస్తువూ అభివృద్ధి చెందదు! మన్ను పిసుక్కుంటూ, తవ్వుకుంటూ మన బతుకులు ఇలాగే తెల్లారిపోతాయి. ఓ పూటైనా మన పిల్లలకి కడుపునిండా తిండి పెట్టలేం!" అన్నాడు భోలా.

"ఇప్పటి వరకూ పెద్ద అధికార్లకి మామ్మూళ్ళు, ముట్టగింపులూ, కచేరీ ఉద్యోగస్థులకి లంచాలూ ఇస్తూ తగలడ్డాం. అయితే కనీసం పొలాలు మనవై ఉండేవి!" అన్నాడు రేఖా.

"ఏడు తరాలు అడివిని కొట్టి సేద్యపు పొలాలుగా చేసుకున్నాం." అన్నాడు మౌలా.

"భోలూ భాయీ! బఘియా పొలం ఉంది చూశావూ. ఒకప్పుడక్కడ దట్టమైన అడివి ఉండేది. చచ్చిపోయిన మా పూర్వీకుడు ఫినావన్ తండ్రిని అక్కడే పులి ఎత్తుకుపోయింది. అప్పట్నించే దానికి బఘియా (పులి)పొలం అన్న పేరు వచ్చింది. ప్రాణాలు పోగొట్టుకుని మరీ ఆ అడివిని సేద్యపు పొలంగా చేశాం!" అన్నాడు సోబరన్.

నల్లటి బరివొంటితో ఉన్న రేఖా సన్నటి తెల్లటి పేలికతో చుట్టుకున్న తల పాగాని సర్దుకుంటూ భోలాపండితుడి వేపుచూసి మాట అందుకున్నాడు.

"భోలా! నీకు సత్యయుగపు సంగతులూ తెలుసు! జనం ఇంతలా ఎప్పుడూ కష్టపడి ఉండరు."

"సేద్యపు పొలాల్ని తయారుచేసింది మేం. దున్నడం సాగుచెయ్యడం మేం. భోలాపండిత్! కాని ఇప్పుడు మా ఊరికి రామపురం మున్షీ (గుమాస్తా)యజమాని!" అన్నాడు మౌలా.

"అన్యాయం, అన్యాయం రేఖా భగత్! కంపెనీవాడు రావణుణ్ణీ, కంసుణ్ణీ కూడా మరిపింపచేస్తున్నాడు. అంత ఎక్కువగా అన్యాయాలు చేస్తున్నాడు. రైతు దగ్గర రాజు పంటలో పదోవంతు తీసుకోవాలని ప్రాచీన ధర్మశాస్త్రాల్లో ఉన్నది" అన్నాడు భోలా పండిత్.

"అవునుగాని పండిత్‌జీ! ఈ రామపురం మున్షీని మాకు యజమానిగా జమీం దారుగా ఎందుకు చేశారో నాకు ఆశ్చర్యంగా ఉంది." అన్నాడు మౌలా.

"అంతా తిరకాసు. కిందా మీదా అయింది మౌలూ! పూర్వం ప్రజలకి ఓ రాజు ఉండేవాడు. రైతన్నవాడు ఒక్క రాజునే ఎరిగి ఉండేవాడు. ఆ రాజు ఎక్కడో దూరంగా తన రాజధానిలో ఉంటూ ఉండేవాడు. అతనికి పంటలో పదోవంతు ఇస్తే సరిపోయేది. అదీ పంట పండితేనే! కాని ఇప్పుడా? పంట పండనీ పండకపోనీ, జమీందారుకి నీ చర్మాన్ని బలించైనా సరే, నీ పిల్లా పాపని తాకట్టు పెట్టయినా సరే, అమ్ముకునైనా సరే పన్ను కట్టితీరాలి!" అన్నాడు భోలా పండిత్.

"ఆ పన్నైనా ఇంతని ఎప్పుడూ ఒక్కలా ఉంటోందా? పండిత్! ఏడాది ఏడా దికీ పెరిగిపోతుంది. అడిగే నాదుడెవడూ లేడు. ఇలా హెచ్చుతోందని సవాలు చేసేవాడు ఎవడూ లేడు!"

మున్షీ సదాసుఖలాల్ కరణంగారు హరిహరక్షేత్రానికి స్నానం చెయ్యవచ్చారు. చవగ్గా దొరికితే ఓ ఆవుని కొందామనీ అనుకున్నారు. అయితే ఈ ఏడాది పశువుల ధరలు మరీ ప్రియంగా ఉండడంతో చప్పబడిపోయారు. అతని ఒంటిని మాసి నలిగి పోయిన చొక్కా, నెత్తిని టోపీ ఉన్నాయి. ఇక్కడ ఈ తీర్థంలో కూడా రాతాకోతా పని ఉంటుందని కాబోలు చెవి సందున పుల్లతో చేసిన కలాన్ని దోపుకుని ఉన్నారు.

జమీందారుగారి కరణం అవడం నుంచి వాళ్ళ సంభాషణలో కలగ చేసుకోవడమా మానడమా అని ఆలోచనలో పడ్డారు. కాని ఊరికి సంబంధించిన రాజకీయాలు చర్చిస్తూ ఉంటే నోట్లో నాలుకున్న వాడెవడూ నోరుమూసుకుని కూర్చోలేడు. అదీ కాక దయాల్‌పురం ఆయన యజమానిగారి ఊరు కూడాను. అంచేత దయాల్‌పురం రైతుల సంభాషణలో తనూ కలగచేసుకుని మాట్లాడ్డంలో ఆయనకేం అభ్యంతరం కనిపించలేదు. ఆయన కలాన్ని వేళ్ళ సందులో పట్టుకుని ఆడిస్తూ వాళ్ళ మాటల్లో కలగచేసుకున్నాడు.

"పండిత్‌జీ! ఏమిటో అడిగే నాథుడే లేడంటున్నావు! ఎవరు అడుగుతారు? అంతా ఎవరికివారు దొరికింది అంకించుకునేవాళ్ళే! ఎవరి మానాన్ని వాళ్ళు దోచుకుంటున్నారు. 'దోచుకో దోచుకో పరాయివాడి సొత్తు ఇది! దోచుకోగలిగితే దోచుకో', ఇదీ పాట! రాజూ లేడు పాడూ లేదు. నాజమ్‌సాహెబ్‌గారి దర్బారులో మా పింతల్లి కూతురిగారి అల్లుడు ఉన్నాడు. వాడికి అన్ని గుట్టు మట్లూ తెలుసు. రాజు ఎవడూ లేడు! వందా, రెండువందలమంది యూరోపీయ దొంగలు ముఠాగా ఏర్పడ్డారు. ఇదిగో ఈ ముఠాకే కంపెనీ అంటారు." అన్నాడు.

"మున్షీజీ! మీరు నిజం చెప్పారు! కంపెనీ బహద్దరువారు, కంపెనీ బహద్దరు వారు అంటే ఎవరో కంపెనీరాజు ఉన్నాడని అనుకున్నాం. కాని ఇవాళ నిజం ఏమిటో తెలిసింది," అన్నాడు రేఖా.

"అందుకేమరి-ఎక్కడపడితే అక్కడ దోచుకుంటున్నారు. న్యాయం అని అన్యాయం అని అనేవాడు ఎవడన్నా ఉన్నాడా? రామపురం మున్షీకి ఏడుతరాలనాడైనా దయాల్‌పురంతో ఏమన్నా సంబంధం ఉన్నదా?"

"నాకైతే ఏమీ అర్థం కావడంలేదు మౌలూ భాయీ! ఈ రామాపురం మున్షీ మా ఊరికి యాజమాని యెలా అయ్యాడోను! ఢిల్లీ పాదుషాని కంపెనీ ఓడించిందా?"

"ఢిల్లీ కాదు సోబరన్ రావూత్! మక్‌సూదాబాదు (ముర్షీదాబాదు) నవాబుని ఓడించింది. మక్‌సూదాబాదు ఢిల్లీ అధికారం నుంచి మన ప్రాంతాన్ని లాక్కుంది. సోబరన్‌రావుత్!" అన్నాడు మున్షీ.

"మాకు ఇవన్నీ అంత జ్ఞాపకం ఉండవు. మాకు ఢిల్లీ ఒకటే తెలుసు. అయితే మక్‌సూదాబాద్ కిందికి రాజ్యం వచ్చిందీ? మరి అప్పుడూ రాజు ఒకడే కాడా? మేం కూడబెట్టగలిగినంతా, చైత్రనంతా పన్నులు కడుతున్నాం! ఇప్పుడు మనకి ఇద్దరు రాజులున్నారని అనుకోవాలా?" అన్నాడు సోబరన్.

"సోబరన్‌భాయీ! రెండు రాజ్యాలు అవలేదామరి!, ఒకటి కంపెనీ రాజ్యం రెండోది రామాపురం మున్షీ రాజ్యం. తిరగలిదిమ్మల్లో ఓ దిమ్మ మీదే నలిగితే కొంతలో కొంత నలక్కుండా మిగలొచ్చునన్న ఆశ వుంటుంది. కాని భోలాపండిత్! ఈ రెండు దిమ్మల మధ్యా నలిగి పిండిపిండి అయి ఇహ మిగిలేది ఏం ఉండదు.

సున్నానే! మనకళ్ళతో మనం చూస్తున్నాం, మున్షీజీ! మీరే చెప్పండి. మేమంటే పల్లెటూరి బైతులం, మూర్ఖులం, జ్ఞానంలేని వాళ్ళం. మీరే మా మధ్య జ్ఞానం కలిగి అన్నీ తెలిసున్నవారు! ఇదిగో ఈ భోలాపండిత్‌కి తెలుస్తుంది!" అన్నాడు రేఖా.

"రేఖాభగత్! నువ్వు చెప్పేది నిజమే! జమీందారు తిరగలికి రెండో దిమ్మే! జమీందారు రాజుకి ఏం తీసిపోడు!" అన్నాడు మున్షీ.

"తీసిపోడని, మెల్లిగా అంటారేమిటి? రాజు కన్నా నాలుగాకులు ఎక్కువ అనండి. మున్షీజీ! గ్రామ పంచాయతీని ఇప్పుడు ఎవరన్నా ఖాతరు చేస్తున్నారా? పంచాయితీ అన్నదో పద్ధతి అంది. అందుకని మేమేదో ఐదుగురు మెంబర్లని ఎన్ను కుంటున్నాం. కాని వాళ్ళేపనిలోనైనా బుర్రదూర్చి పెత్తనం చెయ్యగలుగుతు న్నారా? అన్ని విషయాల్లోనూ జమీందారూ ఆయన కచేరీ ఉద్యోగస్థులూ పెత్తనం వహిస్తున్నారు. అన్నీ వాళ్ళే నిర్ణయిస్తారు. ఏ తగవన్నా తీర్చాల్సివస్తే వాదీ ప్రతివాదీ ఇద్దరి దగ్గరా జుర్మానా వసూలు చేస్తారు. పదిహేనేళ్ళయినా కాలేదు సోబరన్‌రావత్! ఎప్పుడైనా ఆలూమగల జట్టికి గేదెని వేలం వెయ్యడం అన్నది ఎప్పుడన్నా ఎరుగుదుమా?" అన్నాడు రేఖా.

"అప్పుడు, ఆ రోజుల్లో అంతా పంచాయితీ చేతుల్లో ఉండేది. గ్రామ పంచా యతి గ్రామంలో ఏ కుటుంబాన్నీ పాడైపోనిచ్చేదికాదు. హత్యానేరాల్లో కూడా ఎలాగో ఓలాగ సంధి కుదిరేటట్టూ, రాజీ పడేటట్టూ చూసేది. రేఖాభగత్! కాలు వలూ, కట్టలూ చూడకూడదూ! చూసి చేసే నాధుడెవడూ లేడు! పంచాయితీ పెత్తనమే అయినట్లయితే యెప్పుడన్నా ఇలా ఉండేదా?" అన్నాడు సోబరన్.

"ఇలా ఎందుకుంటుంది సోబరన్‌రావూత్? తమ పిల్లాపాపలకి కష్టాన్ని ఎవ రన్నా కలగజేస్తారా? ఇప్పుడా! వర్షం ఎక్కువగా కురిసిందా-ఆ నీరు పోవడానికి కాలువల్ని శుభ్రం సరిచేసి పెట్టేవాళ్ళు లేరు. వానలు పడకపోతే కట్టలు కట్టి నీటిని అవసరానికి వాడుకునేట్టు చేసేవాళ్ళు లేరు! పంటచేలు ఎండిపోకుండా నీరు పెట్టుకునే సదుపాయం లేదు!" అన్నాడు రేఖా.

"కంపెనీవారు పంచాయితీలని మట్టుపెట్టి ఆ పనిని జమీందార్లకి అప్పచెప్పారు. అన్నాడు మున్షీ.

"జమీందారు ఏం చేస్తున్నాడో మా కళ్ళతో మేం చూస్తున్నాం." అన్నాడు రేఖా.

"నేనూ జమీందారుగారి ఉప్పుతిని బతుకుతున్నవాణ్ణే, రేఖాభగత్! మసరజ్ జమీందారు దగ్గర కరణాన్ని. అన్యాయపు సొమ్ము తిన్నవాడు సర్వనాశనం అయి పోతాడు తెల్సా. రేఖాభగత్! నన్నే చూడు. ఏడుగురు కొడుకులు, అంబోతుల్లా! ఏడుగురికి ఏడుగురూ దక్కకుండా పోయారు!" మున్షీ కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు. అతని దుఃఖాన్ని చూసి అందరూ "అయ్యోపాపం!" అనుకున్నారు. "రేఖాభగత్!

అంతమందీ చచ్చిపోయారు! ఇప్పుడు ఇంట్లో మంచినీళ్ళిచ్చే దిక్కులేదు! ఇహ మా యజమాని సంగతి వినే ఉంటావు. చప్రా (ఊరు) భోగందాని వెంటపడి ఏ స్థితి పట్టిందో, మొగాడిగా పనికిరాకుండా పోయాడు! ఇంద్రియం పనికిరాకుండా పోయింది. అతని కొడుకులు—ఈ చిన్నబాబుల్ని చూస్తున్నావుకదా-వాళ్ళు అతని కొడుకులు కారు - వాళ్ళింటి పనివాడికి పుట్టినవాళ్ళు!"

"యజమానుల ఇళ్ళలో ఇలాంటి భాగోతాలు చాలానే జరుగుతున్నాయి మున్షీజీ!" అన్నాడు రేఖా.

"పొలాలు పోయాయి. ఊళ్ళు పోయాయి. సమస్తమూ పోయింది. ఏడు సముద్రాల కవతల నుంచి వచ్చిన బందిపోటు దొంగలు, మన నెత్తిని దోపిడీ దొంగల్ని మన ఇంటివాళ్ళనే ఎక్కించారు. పంచాయితీలు పోయాయి. అదృష్టం బాగుండి వానలు సరిగ్గా పడి నాలుగు గింజలు ఇంటికి తెచ్చుకున్నాం అంటే చాలు యజమానులు, బుగతలు, జమీందార్లు, కాపలాదార్లు, చౌకీదార్లు కరణాలు,గుమాస్తాలు ఇంతమందికీ భాగం ఇవ్వాలి, తప్పదు. ఇహ మాకు మిగిలేది ఏముంటుంది?" అన్నాడు సోబరన్.

"కరణాలు దోచుకుంటారంటే నేను ఒప్పుకుంటున్నాను. సోబరన్‌రావుత్! అయితే కరణానికి జమీందారు నెలకి యెంత యిస్తాడో తెలుసా? అర్ధరూపాయి దబ్బులు! ఆ అర్ధరూపాయి దబ్బుల్తో నెల నెలంతా మేం యెలా గడుపుకుంటాం? అవి ఏ మూలకి వస్తాయి? ఏం, ఈ సంగతి జమీందారు ఎరగడూ?" అన్నాడు మున్షీ.

"ఎందుకు ఎరగడూ? జమీందారు ఏం గుడ్డివాడు కాదు. అంతా తెలుసు! కంపెనీ బహద్దరువారు దోపిడీదొంగే! వారు మన నెత్తిని జమీందారుని కొత్తగా దోచుకోమని ఎక్కించారు. ఆ జమీందారు మరో ఇంత మంది దోపిడీగాళ్ళని తగిలించాడు. ఇంత మంది దోచుకుంటూ ఉంటే మనం ఎలా బతుక్కువస్తున్నామో!" అన్నాడు రేఖా.

"ఏం బతుకులు బతుకుతున్నాం రేఖా! కడుపునిండా తిని వొంటి నిండా గుడ్డ కట్టుకున్న వాళ్ళం దయాల్‌పురంలో ఎంతమందిమి ఉన్నాం చెప్పు!" అన్నాడు సోబరన్.

"కంపెనీకి ఏం పట్టింది సోబరన్ రావుత్? పన్నులు విధించింది. పన్ను వాయిదా వసూళ్ళకి జమీందార్ల దగ్గరికి సంచులు పట్టుకుని చప్రా వచ్చి దబ్బు మూటకట్టుకుపోతారు. కంపెనీ బహద్దరు వారికి దమ్మిడీ వారా లేకుండా మొత్తం ముడుతుంది. దయాల్‌పురం రైతులు చావనీ బతకనీ! పన్ను కట్టకపోతే జమీందారు చావబాదుతాడు. ఐదు రూపాయిలు నీ దగ్గర తీసుకుంటాడు. కంపెనీ వారికి ఓ రూపాయి ఇస్తాడు. మిగతా నాలుగు రూపాయిలూ తన బొద్దుని దోపుకుంటాడు, సోబరన్‌రావుత్!" అన్నాడు మున్షీ.

"ఓ భగవంతుడా! నువ్వున్నావా లేదా ? ఉండీ నిద్రపోతున్నావా ? ఇదంతా చూస్తూ అన్యాయాల్ని ఆపవేం? మేం ఏం చెయ్యలేం. మావల్లేం కాదు. మేం ఓడి పోయాం" అన్నాడు రేఖా.

"అవును. మనం ఓడిపోయాం. రేఖా! నువ్విది విన్నావా? బరయీా పరగణా వాళ్ళంతా ఏకమై, జమీందారు మాకేం పెద్దకాదు - మా యజమాని కాదు అని అన్నారు. వాళ్ళు చప్రా వెళ్ళి కంపెనీ బహద్దరు వారితో చెప్పారటా, మా పంచాయతీ పన్ను కడుతుంది – జమీందార్లు మాకు అక్కర్లేదూ అన్నారట. దానికి బహద్దరు వారు ఏం సెలవిచ్చారో ఎరుగుదువా? వానల్లేక కరువువచ్చినా,వరదొచ్చి పంట కొట్టుకు పోయినా పన్ను కడతారా ? అని అడిగారట ! కరువు వస్తే ముంపు వస్తే పిల్లాపాపతో కడుపు నింపుకోవడమే కష్టమైపోతుంది. అలాంటిది ఆ కంపెనీ దొర వారికి నోరు ఎలా వచ్చిందో అలా అడగటానికి ! దేవుడంటూ ఉంటాడన్న భయమన్నా లేకపోయింది! అదీ వారు ఏదో మాట వరసకి అన్నారు ! నిజంగా కాదు. ఆఖరికి వారు చెప్పింది- మీరు బీదవాళ్ళు. మీరు పన్ను కట్టలేకపోతే మీ దగ్గర్నుంచి మేం ఏం వసూలు చెయ్యగలం? మేం బాగా డబ్బూ పరువూ ఉన్నవాళ్ళని జమీందార్లుగా వేసుకుంటున్నాం. వాళ్ళకైతే మా పన్నులు బకాయి పెడితే ఇల్లూ వాకిలీ వేలం వేస్తామనీ, వాళ్ళ పరువూ ప్రతిష్టా పోతాయని భయం ఉంటుంది. అదీ సంగతి." అన్నాడు సోబరన్‌రావుత్.

"అందుకే మరి ఈ దొరల వొళ్ళంతా అలా ఉంటుంది – చర్మ వ్యాధితో! వీళ్ల జాలీ దయా లేనివాళ్లు!" అన్నాడు రేఖా.

"బరయీా వాళ్ళకి మరో గత్యంతరం లేక పోయింది. ప్రాణాలకి తెగించి మరీ పోరాడారు. కంపెనీ బహద్దరు నిజంగా బహద్దరు అయితే బహద్దరులాగా యుద్ధం చేసేవారు! ఎలా యుద్ధం చెయ్యాలో అలా చేసేవారు. బరయీా వాళ్ళ దగ్గర పాతకాలపు తుపాకీలు ఉన్నాయి. కంపెనీ బహద్దరు వారి దగ్గర మరఫిరంగులు ఉన్నాయి. ఎక్కడెక్కడి నుంచో తెల్ల దొరలతో నల్ల దొరలతో సైనిక దళాలు వచ్చిపడ్డాయి. ఊళ్ళకి ఊళ్ళు తగలబెట్టారు. ఆడవాళ్ళనిగాని పిల్లలనిగాని వదిలి పెట్టలేదు. దయా జాలీ చూపెట్టలేదు. బరయీా వాళ్ళేం చెయ్యగలరు?" అన్నాడు సోబరన్.

"వ్యవసాయం ఇలా మట్టికొట్టుకు పోయింది. ఇప్పుడిహ సాలెవాళ్ళనోటా దుమ్ము కొట్టారు! సోబరన్‌రావుత్! కంపెనీ బహద్దరు వారు విదేశాల నుంచి బట్టలు తెచ్చి అమ్ముతున్నారు!" అన్నాడు మౌలా.

"అవును, మిషీనుమీద నేసిన బట్టలు. ఇదిగో నా చొక్కా మిల్లు చొక్కానే సోబరన్‌రావుత్! ఇంత చవగ్గా రాట్నం మీద నూలువడికి మగ్గంమీద నేస్తే బట్ట దొరకదు! అందుకోసమనీ, నలుగురిలో గౌరవంగా ఉంటుందనీ మిల్లు బట్ట కొనాల్సి వస్తోంది. గౌరవంగా ఉండాలన్న భావమే రేఖాభగత్! అలా నవ్వుతున్నా వెందుకూ?

సర్కారు వారిదర్బారుకి వెళ్ళి రంగు రంగుల తివాసీల మీద కూచున్నప్పుడు దాని సంగతి తెలుస్తుంది!" అన్నాడు మున్షీ.

"నీ గౌరవం గురించి కాదు నేను నవ్వుతూ ఉంట, మున్షీజీ! కంపెనీ బహద్దరు వారు రాజ్యమూ ఏలుతున్నారు. వ్యాపారమూ చేస్తున్నారు అని నవ్వుకుంటున్నాను. అదీ ఇలాంటి ఏలుబడి!" అన్నాడు రేఖా.

"సత్యయుగం, త్రేతాయుగం, ద్వాపరయుగం వెళ్ళిపోయాయి. కలియుగంలోనూ ఐదువేల ఏళ్ళు గడిచిపోయాయి. ఇంతవరకూ ఇలాంటి పాలనని కనీవినీ ఎరగం." అన్నాడు భోలాపండిత్.

"నాజిమ్ దర్బారులోని ఓ మున్షీ కంపెనీ వారిని ఫిరంగి దొంగలనిఅన్నాడు భోలాపండిత్! మరొకడు చెప్పాడుకదా, ఈకంపెనీ దొరలు వర్తకుల సమూహం. వాళ్ళు తమ దేశంనుంచి వ్యాపారం చేసుకోడానికి మాత్రమే వచ్చారు. మొదట్లో వాళ్ళు ఇక్కడి వస్తువులు తీసుకెళ్ళి అక్కడ అమ్మేవారు. ఇప్పుడు విదేశాల్లో పెద్ద పెద్ద మిల్లులు పెట్టారు. ఆ మిల్లుల్లో పనులు కల్పిస్తున్నారు. వస్తువులు తయారు చేయించి స్వయంగా అమ్ముతున్నారు."

"అయితే ఇహ చేతిపనులు చేసేవాళ్ళపనీ సరన్నమాట!" అన్నాడు మౌలా.

# 2

చలి కాలంలో గంగానది ప్రశాంతంగా ఉంటుంది. సహజంగా నిండుగాపారే నది మరింత నిండుగా ప్రసన్నంగా ఉంటుంది. ఆ సమయంలో పడవల మీద ప్రయాణం చెయ్యడానికి ఎక్కువ భయపడక్కరలేదు. అందుకే వ్యాపారానికి ఆ కాలం చాలా వీలుగా ఉంటుందని వ్యాపారస్థులు అనుకుంటారు. గంగానది ఒడ్డున కూచుని నాలుగు గంటలపాటుగాని చూస్తే అక్కడ వందల కొద్దీ పెద్ద పెద్ద పడవలు వెళుతూ ఉండడం ఆ కాలంలో కనపడుతుంది. ఈ పడవల్లోని సరుకు చాలా భాగం కంపెనీదే. విదేశాల నుంచి వచ్చిన ఆ సరుకులో చాలా భాగం ఎగువకి పోతుంది. పాట్నా, గాజీపురం, మీర్జాపూర్ లాంటి వర్తక కేంద్ర నగరాల రేవుల్ని చూస్తే గంగా ప్రవాహం నిండా పెద్ద పెద్ద నావలు కనపడతాయి.

పాట్నా నుంచి ఓ పెద్దనావ దిగువకి పోతోంది. మందుగుండు, శాలువలు, తివాసీలు మొదలైన సరుకుల్ని ఈ నావలో విదేశాలు పంపుతున్నారు. పాట్నానుంచి కలకత్తా చేరడానికి ఓ వారంకన్నా ఎక్కువే ప్రయాణం చెయ్యాలి. అన్ని రోజుల ప్రయాణం కాబట్టే తిన్కాడీదేకి కోల్మన్కి స్నేహం పెరుగుతూ వచ్చింది. నిజానికి మొదట్లో ఇద్దరూ ఒకరితో ఒకరు మాట్లాడ్డానికి కూడా సంకోచపడ్డారు. కోల్మన్ పెట్టుకున్న కృత్రిమపు విగ్గూ, కాళ్ళని అంటిపెట్టుకుని ఉన్న పంట్లామూ, నల్లకోటూ, పెద్ద పెద్ద గుడ్డ బొత్తాములూ, పీటికితోడు ఆ తెల్లటి మొహం చూస్తే

తిన్‌కౌడీకి భయం జంకూ కలిగాయి. ఓ పక్క అతనిపట్ల ఆకర్షణా కలిగింది. అయితే కోల్‌మన్నే తిన్‌కౌడీతో మొదట మాట కలిపాడు. దాంతో తిన్‌కౌడీకి ధైర్యం వచ్చింది. అతని సంభాషణనిబట్టి కోల్‌మన్‌కి కంపెనీ దొరలంటే వాళ్ళు మంటని తిన్‌కౌడీకి బోధపడింది. గవర్నరు లగాయితు కంపెనీవాళ్ళ పెద్ద ఉద్యోగస్థుల్ని, చిన్న ఉద్యోగస్థులని అందరినీ ఒక్కలా నిందించాడు. ఆ నిందించడంలో చిన్నా పెద్ద అని ఏం వెనకాడలేదు. తిన్‌కౌడీకి కూడా కంపెనీ ఉద్యోగస్థులంటే మంటే! కంపెనీ తాలూకు పెద్ద పెద్ద ఆఫీసుల్లో ఇరవైఏళ్ళపాటు క్లర్క్ (గుమాస్తా)గా పనిచేశాడు. తిన్‌కౌడీ ఓ బీద కుటుంబంలో పుట్టినవాడే. అయినాఅంత "దురాశ ఉన్నవాడుకాడు. ఆత్మగౌరవంతో బతుకు వెళ్ళదీసుకోవాలన్న ఉద్దేశం ఉన్నవాడూను. తిన్‌కౌడీ బతుకంతటికీ సరిపడా ఆర్జించాడు. కంపెనీవారి దోపిడీ సాగిన రోజులలో ఓ పాత ఏజెంటు దయవల్ల ఇరవై నాలుగు పరగణాల జిల్లాలో నాలుగు ఊళ్ళ జమీందారీని సంపాదించాడు. ఆ ఊళ్ళ నుంచి వచ్చే రాబడి ఎక్కువా, పన్ను చూస్తే తక్కువాను. ఇది దొరగారి దయవల్ల సంభవం అయింది. అయితే ఆ దయని సంపాదించడానికి తిన్‌కౌడీ చెయ్యరానిపని చేశాడు. ఆ చేసిన పాపం జన్మ జన్మలకీ పోదని తిన్‌కౌడీ అనుకునేవాడు. దొరగారిని ప్రసన్నం చేసుకోడానికి ఊళ్ళోని ఓ అందమైన బ్రాహ్మణ యువతిని ఆయన దగ్గరికి పంపించాడు. దొరలు ఆ రోజుల్లో తమతోపాటు దొరసానుల్ని తెచ్చుకోవడం తక్కువే. ఎంచేతా అంటే ఆల్నెల్లు ప్రమాదాలతో కూడిన సముద్ర ప్రయాణం చేస్తేనే ఈ దేశం చేరుకోవడం జరిగేది! ఆ ప్రయాణం అంత సుఖమైనది కాదు. తిన్‌కౌడీ నలభై అయిదేళ్ళవాడు. నల్లగా దృఢంగా ఆరోగ్యంతో ఉన్నాడు. అయినా ప్రతీరోజూ పొద్దున్నే లేచి అద్దంలో తన మొహం చూసుకుంటూ ఉంటాడు. చేతివేళ్ళన్నిటినీ పరిశీలించి చూసుకుంటూ ఉంటాడు. ఏదో ఓ రోజున కుష్ఠువ్యాధి తనకి సోకుతుందని అనుకుంటూ ఉండేవాడు. బ్రాహ్మణ యువతి శీలాన్ని చెరచడానికి దొర దగ్గరికి పంపేడు. ఆ పాపానికి శిక్ష అదే అని ఈతడు అనుకుంటూ ఉండేవాడు. దొరలు పెట్టే చీవాట్లు, తిట్లూ, చెప్పుదెబ్బలూ తిని తిని విసుగెత్తిపోయాడు. ఉద్యోగ విరమణ చెయ్యడానికి ఇంకా సమయం ఉన్నప్పటికీ ఉద్యోగానికి అందుకే రాజీనామా ఇచ్చేసి తన గ్రామానికి బయల్దేరాడు. అతని కుటుంబంలోని వారంతా మరణించనూ మరణించారు. ఇరవై ఏళ్ళపాటు పెదవి విప్పకుండా భరించిన అవమానాలు అతని గుండెలో కుత కుత లాడుతున్నాయి. కోల్‌మన్ తనకన్నా కూడా ఎక్కువగా కంపెనీని, కంపెనీ ఉద్యోగస్థులనీ తిడుతూ ఉండడం చూశాడు. దాంతో వాళ్ళిద్దరూ మనస్సులు విప్పుకుని మాట్లాడుకోవడం ప్రారంభించారు.

ఓ రోజు కోల్‌మన్ ఇలా చెప్పుకువచ్చాడు:

"ఈస్టిండియా కంపెనీ వ్యాపారంకోసం ఏర్పడ్డది. కాని తర్వాత్తర్వాత జనాన్ని దోచుకోవడం మొదలుపెట్టింది. చూట్టంలేదూ, ఇక్కడికి ఎంత మంది

దొరలు వస్తారో అంత మందీ తొందర తొందరగా లక్షాధిపతులై తమ దేశానికి తిరిగిపోదామని అనుకుంటారు. పెద్దవాడవనీ, చిన్నవాడవనీ, అందరి ఉద్దేశమూ అదే. క్లైవూ అలాగే చేశాడు. అతణ్ణి ఎవరూ పట్టుకోలేదు. వారన్ హేస్టింగ్స్ దురాశతో చేత్‌సింహ్ రాణులని ఆకలితో చంపేయడానికి వెనుతియ్యలేదు. అవధ్ నవాబుగారి బేగములందర్నీ బికారీవాళ్ళగా చేశాడు. అయితే మా దేశస్థులు అతణ్ణి క్షమించలేదు. శిక్షపడకుండా తప్పించుకున్నాడు కాని సంవత్సరాల తరబడి పోరిన దావాకోసం తన సంపాదన నంతటినీ పోగొట్టుకున్నాడు."

"దావా ఎవరు వేశారు సాబ్?"

"పార్లమెంటు. మా దేశంలో రాజు తన చిత్తం వచ్చినట్టు చేయలేడు. తన చిత్తం వచ్చినట్టు సంచరించిన ఓ రాజు తలకాయని గొడ్డలితో మేం నరికిపారేశాం. ఆ గొడ్డలిని ఇప్పటికీ పదిలంగా దాచి ఉంచాం, తిన్‌కౌడీదే! పార్లమెంటు ఓ పంచాయితీ! అందులో వాళ్ళని చాలా వరకూ దేశంలోని డబ్బూ ప్రతిష్ఠా ఉన్న వాళ్ళు ఎన్నుకుంటారు. కొంతమంది పెద్ద పెద్ద జమీందార్లు తమ వంశ ప్రతిష్ఠ కారణంగా పార్లమెంటులోకి తీసుకోబడతారు."

"జమీందార్లు ఎంతకాలం నుంచి ఉంటూవచ్చారు సాబ్!"

"మా దేశాన్ని చూసి హిందూదేశంలోనూ భూస్వామ్య విధానం ఏర్పడింది. మా దేశంలో అయితే కొన్నివందల సంవత్సరాల నుంచీ అమలులోఉంది. అయితే అక్కడ కూడాబలవంతంగా రైతుల దగ్గర్నుంచి భూమిమీద ఉన్న వాళ్ళ హక్కుల్ని లాక్కున్నారు. భూస్వామ్య వ్యవస్థని ప్రవేశపెట్టిన గవర్నరు పేరు నీకు తెలుసా?"

"ఊఁ-కార్న్‌వాలీసు."

"ఇంగ్లండులో ఒకటోరకపు కటికగుండె కసాయి జమీందారు. ఇక్కడికి వచ్చి అతడు గ్రహించినదేమిటంటే - రైతులు భూమికి హక్కుదారులుగా ఉన్నంత కాలం అతివృష్టి అనావృష్టి కారణాలుగా పన్నులు సరిగ్గా వసూలు అవవు. అదీ కాక ఏడు సముద్రాల అవతల ఉన్న ఇంగ్లీషువాళ్ళకి ఈ పరాయి దేశంలో స్నేహితుల్ని సమకూర్చిబెట్టాలి. ఆ స్నేహితుల స్వార్థమూ ఇంగ్లీషువాళ్ళ స్వార్థంతోముడిపడి ఉండాలి. అందుకే జమీందార్లని ఇంగ్లీషువాళ్ళు సృష్టించారు. రైతులు తిరుగుబాటు చేస్తే ఇంగ్లీషువాళ్ళ ప్రమాదంలో రాజ్యం పడుతుంది. అలానే జమీందార్ల జమీందారీ, వాళ్ళ ఆస్తిపాస్తులూ, పరువూ ప్రతిష్ఠాఅన్నిటికీ ముప్పు వాటిల్లుతుంది. అంచేతా చిన్న చిన్న రైతుల్ని యజమానులుగా చెయ్యకుండా పెద్ద పెద్దవాళ్ళని, పాతికా యాభై గ్రామాలకి ఓ యజమానిగా -జమీందార్లని ఏర్పరచినట్లయితే మన కష్టానికి సుఖానికీ ఉపయోగపడతారు. ఇల్లాగా ఇంగ్లండుకి చెందిన ఈ కటికగుండె జమీందారు కార్న్‌వాలీసు హిందూదేశంలోని రైతులని పూర్తిగా మట్టుపెట్టేశాడు."

"మట్టుపెట్టేశాడు. నిజమే. సందేహం ఏం లేదు," అన్నాడు తిన్‌కౌడీ. అతనికి తన జమీందారీలోని రైతులు గుర్తుకు వస్తున్నారు.

"ఈ జమీందారుల అత్యాచారాలవల్ల ప్రపంచంలో అన్ని దేశాల్లో ప్రజలూ సర్వనాశనం అయిపోతున్నారు. అయితే జమీందార్ల రోజులు బాగా దగ్గర పడ్డాయి దే!"

"అదేం సాబ్?" అని అడిగాడు దే.

"ఎన్నో ఏళ్ళు కాలేదు. ఈ మధ్యే ఫ్రాన్సు రాజునీ రాణీనీ ఫ్రాన్సు ప్రజలు కాల్చి చంపేశారు. ప్రజల కోపపు మంటల్లో ఎంతోమంది జమీందార్లూ జాగీరు దార్లూ కూడా మాడి చచ్చారు. జమీందారీ విధానాన్ని ఎత్తేశారు. స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వం మానవమాత్రుడు ప్రతీవాడికి ఉండాలన్న సిద్ధాంతాన్ని ప్రజలు ఉద్ఘాటించారు. ఆ సమయానికి నేను ఫ్రాన్సులోనే ఉన్నాను దే! ఫ్రాన్సు రాజభవనాలమీద ఫ్రాన్సు ప్రజాస్వామ్యపు మూడు వన్నెల పతాకం ఎగరడాన్ని నా కళ్ళారా చూశాను. ఇంగ్లాండులోని రాజు, జమీందార్లు, జాగీరుదార్లు ఇప్పుడు గడగడ వణికి పోతున్నారు. ఇంగ్లాండులోనూ ఫ్రాన్సులో జరిగినదే జరిగి ఉండేది. అయితే ఓ విషయాన్నించి వాళ్ళందరూ బతికి పోయారు. అలా అయినందుకు నాకు చాలా విచారంగా ఉంది దే!"

"ఏ విషయం వల్ల సాబ్?"

"చూస్తున్నావు కదా, విదేశీ కార్ఖానాల్లో తయారైన సరుకు హిందూదేశపు బజార్లలో ఎంతలా అమ్ముడు పోతోందో! మీ దేశంలోని సాలెవాళ్లూ, నేతపని కత్తెలు అందరూ పనీ పాటా లేకుండా పోతున్నారు. మా దేశపు సేఠ్‌లు కార్ఖానాలు పెట్టి జమీందారుల చేతుల్లో నానాకష్టాలు పడుతున్న జనానికి వాటిల్లో పని కల్పించారు. ఆ జనం తయారుచేసిన సరుకే ఇక్కడికి వస్తోంది. ఇప్పటి వరకూ మా దేశంలో యంత్రాలని మనుషులే నడిపేవారు. ఇప్పుడు మనుషులకి బదులు ఆవిరి ఇంజనులు నడుపుతున్నాయి. దాంతో అలాంటి మగ్గాలమీద తయారైన బట్టలు మరింత చవక అయాయి. మీ దేశంలోని చేతిపనివాళ్ళ పని గోవిందా అయిందనుకో! మా దేశంలోని పనివాళ్ళ పనీ అంతే అయింది. అయితే వాళ్ళకిప్పుడు కార్ఖానాల్లోకూలిపని చేసుకొని పొట్టపోసుకోడానికి ఏదో ఇంత దొరుకుతోంది. ఈ కార్ఖానాలే కాని పెట్టి ఉండకపోతే మా దేశంలోనూ ఫ్రాన్సులోలాగే అయి ఉండేది. మనిషి మనిషిలా బతకాలి దే! ఎదుటివాణ్ణి పశువులా చూసేవాడు తనూ పశువు అవాల్సివస్తుంది. వాడి పిల్లా పాపా అందరూ పశువులవ్వాల్సివస్తుంది."

"నిజమే సాబ్! నేను నా దాసీ వాళ్ళని, బానిసలని, నౌకర్లని మనుషుల్లా చూడలేదు. అయితే దొరలు నా పట్ల అలాగే ప్రవర్తించినప్పుడు మనిషికి అవమానాన్ని భరించటం ఎంత సహించలేనిదో నాకు బోధపడ్డది."

"బానిసత్వాన్ని రూపుమాపటానికి విదేశాల్లో గట్టిప్రయత్నం జరుగుతోంది."

"విదేశాల్లోనూ బానిసత్వం ఉందా?"

"ప్రపంచం అంతటా నిర్భాగ్యులైన స్త్రీలనీ పురుషులనీ అమ్మటం కొనటం అన్నది ఉన్నది. అయితే విదేశాల్లో తొందర్లోనే ఈ బానిస వ్యాపారాన్ని అపు చేసే చట్టం వస్తుందని నేను ఆశిస్తున్నాను."

"మరి అప్పుడు బానిసల యజమానులు, ధనికులు ఊరుకుంటారా?"

"ధనికులు దీన్ని అంగీకరించరు. మా పార్లమెంటులో ధనికుల ప్రభుత్వమే ఉంది. అయితే వాళ్ళలో కొందరు ఈ బానిస వ్యాపారాన్ని గర్హిస్తున్నారు. మనిషిని కొనడం, అమ్మడం అన్నది ఎంత నీచమైనదో దే! నీకూ తెలుసుకదా! అయితే పాపం పుణ్యం అన్న అభిప్రాయంతో కాదు బానిసత్వాన్ని రూపుమాపాలని చాలా మంది అనుకుంటూ ఉంట! ఈ రోజుల్లో కార్ఖానాల్లో ఇనప యంత్రాలు పనిచేస్తున్నాయి. వాటి ఖరీదు ఎక్కువ. బానిసలు వాట్తో పని చెయ్యడానికి పనికిరారు. చూస్తున్నావు కదా! సున్నితమైన పనులకి బానిసలని నియోగించటంలేదు. ఇరవై నాలుగ్గంటలూ, బానిసల బతుకులతో చెలగాటి మాడితే, అవకాశం దొరికినప్పుడు సీమీద తిరగబడి నీకు ఘోరనష్టాన్ని కలిగించి ప్రతీకారం తీర్చుకోవాలని బానిసలు అనుకుంటారు తప్పదు. అందుకని బానిసత్వాన్ని రూపుమాపడాన్ని ఎంతో మంది సమర్థిస్తున్నారు."

"ఆవునూ దూడనూ వేరుచేసి అమ్మినట్టు ఏ బానిస స్త్రీనైనా పిల్లల్ని వేరుచేసి విడివిడిగా అమ్మడాన్ని చూస్తే నాకు విపరీతమైన బాధ కలుగుతుంది."

"బాధపడనివాడు మనిషికాడు దే!"

"ఫ్రాన్సులో రాజులేని రాజ్యం అన్నారే - దాన్ని ఏమని అంటారు సాబ్?"

"ప్రజాస్వామ్యం!"

"ప్రజాస్వామ్యం అన్నిటికన్నా ఉత్తమమైనదా?"

"ప్రజాస్వామ్యం అన్నిటికన్నా ఉత్తమమైనది. చక్రవర్తులకోసం, చక్రవర్తి కుమారుల కోసం, నవాబుల కోసం. బేగముల కోసం, యువరాజుల కోసం, యువ రాణులకోసం ప్రజల కష్టార్జితాన్ని అనవసరంగా భారీ ఎత్తున ఖర్చుచేస్తారు. అదే పంచాయితీ రాజ్యంలో రాజుకన్నా న్యాయానికి, నిష్పక్షపాతానికి, సానుభూతికి ఎక్కువ విలువ ఉంటుంది."

"నిజమే మా గ్రామంలో పూర్వం పంచాయితీ ఎలా పనిచేస్తుందో చూశాను. న్యాయం ఎక్కువగా జరిగేది. డబ్బు తగలడి మనిషి చెడిపోయేవాడు కాడు. కాని కార్న్ వాలీసు పెట్టిన జమీందారులు వచ్చి పంచాయితీలని అణిచేశారు. అదిగో, అప్పట్నించి జనం తగలడిపోయారు."

"అది నిజమే దే! అయితే ఫ్రాన్సు ప్రజల ఉద్దేశం ప్రజాస్వామ్యంకన్నా ఉన్నతమైనది, గొప్పది, సమానత్వం, స్వాతంత్ర్యం, సౌభ్రాతృత్వం ఉండాలని. ఈ మూడింటితో కూడిన రాజ్యాన్ని స్థాపించాలని వాళ్ళు కోరుకుంటున్నారు."

"మా దేశంలో కూడానా?"

"నువ్వు మనిషివేనా కావా?"

"గొప్ప దొరబాబుల దృష్టిలో మేం మనుషులంకాం."

"స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వంతో కూడిన పరిపాలన మొత్తం ప్రపంచం యావత్తులోనూ వచ్చేవరకూ, తెల్లవాళ్ళూ నల్లవాళ్ళూ అని లేకుండా యావత్ మానవ ప్రపంచంలోనూ ఆ పాలన స్థిరపడేంతవరకూ మనిషి మనిషి కాలేడు దే! కటికగుండె కసాయివాడు కార్న్‌వాలీసు తన దేశపు తెల్లజాతి రైతుల్ని మనుషులుగా పరిగణించడు. ఫ్రాన్సులో రాజులూ, జమీందార్లూ పోయారు. కాని వాళ్ళస్థానే వర్తకులు - ఈస్టు ఇండియా కంపెనీవంటి వర్తకులు రాజ్యాన్ని హస్తగతం చేసుకున్నారు. దాంతో నిజమైన స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వపు మూడు వన్నెల జెండా ఫ్రాన్సులోనూ ఎగరటం లేదు."

"అయితే ఫ్రాన్సులోనూ రాజులూ జమీందార్ల స్థానే ధనికవర్తకుల రాజ్యం ఏర్పడ్డదా?"

"అవును. ఇహ ఇప్పుడు ఇంగ్లాండులోని ధనికవర్తకులూ గోల మొదలు పెట్టారు. ఏడు సముద్రాల కవతల ఉన్నా హిందూ దేశాన్ని మేం పరిపాలిస్తున్నామే, మరి ఇంగ్లాండులో మాత్రం ఎందుకు పరిపాలించలేమూ అని అంటున్నారు. వాళ్ళు రాజ్యాధికారాన్ని తమ చేతుల్లోకి తెచ్చుకోవాలని అనుకుంటున్నారు. అయితే రాజుని పూర్తిగా తొలగించి కాదనుకో!"

"ఇంగ్లాండులో పరిపాలనా అధికారాలు రాజుచేతిలో లేనేలేవని మీరు చెప్పేరే!"

"అవును. ఇక్కడ ఈ తెల్లవర్తకులు చేసే దురన్యాయాల్ని నేను చూశాను. దేశాన్ని చూడాలన్నది నా కోరిక. అవకాశం చూసుకుని నేను కంపెనీలో ఉద్యోగం సంపాదించాను. ఉద్యోగం చెయ్యకపోతే కంపెనీ వర్తకులు నన్ను అనుమానిస్తారు. నా దేశాటనానికి ఆటంకాలు వస్తాయి. అందుకని రెండేళ్ళపాటు నేను ఈ ఈస్టిండియా కంపెనీలో ఉద్యోగం అనే నరకాన్ని అనుభవించాను."

"మంచి మనిషికి ఇది నరకమే సాబ్! ఇందులో పాపాలు చేసి, ఎలాంటి అవమానాన్నైనా భరించి డబ్బు చేసుకోడానికి సిద్ధపడ్డవాళ్ళే ఉండగలరు. కార్న్‌వాలీసు అనుచరుడి దయవల్ల నాకూ పాపపు సంపాదనకింద నాలుగు ఊళ్ళ జమీందారీ దఖలు పడ్డది. ఆ పాపానికి ఫలితాన్ని అనుభవించాను. కలరా సోకి భార్యా పిల్లలూ అందరూ చచ్చిపోయారు. ఆ జమీందారీని తలుచుకుంటే చాలు నాకు కంపరం వస్తుంది. స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వంతో రాజ్యం ఏర్పడినప్పుడే ప్రపంచం స్వర్గంగా మారుతుంది. మనిషి ఏ అవమానానికి గురిఅవకుండా ఉంటాడు. ఈ అభిప్రాయంతో నేనూ ఏకీభవిస్తున్నాను."

"మన ఏకాభిప్రాయంవల్లకాని, మనం కోరుకోవడంవల్లగాని అది ఏర్పడదు దే! ఫ్రాన్సులోలాగ వేలకొద్దీ జనం ప్రాణాలు అర్పించి త్యాగం చెయ్యాలి. ఊరికే ప్రాణాలు అర్పించినా లాభంలేదు. హిందూదేశపు సైనికులు లక్షలాది ఇంగ్లీషు వాళ్ళకోసం ప్రాణాలు అర్పిస్తూనే ఉన్నారు. అయితే దీనికోసం తమకి తాము తెలుసుకుని తమ కోసంగాను ప్రాణాలు అర్పించటం జరగాలి."

"తమకి తాము తెలుసుకోవడమా?"

"తెలుసుకోవడం అంటే హిందూ దేశస్థులకి ప్రపంచం గురించిన జ్ఞానం ఉండాలి. సైన్సు మనిషికి బ్రహ్మాండమైన శక్తిని ప్రసాదిస్తోంది. ఈ సైన్సు జ్ఞానం వల్లే మానవుడు మందుగుండునీ తుపాకుల్నీ తయారుచేశాడు. శక్తివంతు డయ్యాడు. ఈ సైన్సే మీ దేశంలోని నగరాల్ని నాశనం చేసి ఇంగ్లాండులో కొత్త కొత్త కార్ఖానాలని, ఫ్యాక్టరీలని, నగరాలని నిర్మించింది. మీరూ ఈ సైన్సుని ఉప యోగించుకోవాలి."

"ఊఁ- ఆ తర్వాత?"

"హిందూ దేశంలోని అంటరానితనం, జాతి భేదాలు, కులభేదాలు, హిందూ ముస్లిం భేదాలు అంతరించేటట్టు చెయ్యాలి. చూస్తున్నావు కదా! మేం ఎవరిచేతి భోజనమన్నా ఏమీ అనుకోకుండా చేస్తాం. అంటరానితనం మాలో లేదు."

"అవును, మీలో లేదు."

"ఇంగ్లీషు వాళ్ళలో గొప్పా బీదా అన్న తేడా తప్ప కింది జాతి వాడు, పై జాతివాడు అన్న భావం ఉన్నదా?"

"ఉహూ, లేదు!"

"మీరు సతీ సహగమనాన్ని నిషేధించాలి. ప్రతీ ఏడాదీ లక్షలాది స్త్రీలని నిలువునా కాల్చివేయటాన్ని భగవంతుడు క్షమిస్తాడంటావా?"

కోల్‌మన్, లిన్‌కాడీ దే కలకత్తా వెళ్ళేక ఎవరి దారిని వారు వెళ్ళడానికి విడిపోవలసి వచ్చినందుకు చాలా విచారపడ్డారు.

"నేస్తం! మనం పందొమ్మిదో శతాబ్దంలో ప్రవేశించాం. ప్రపంచంలో పెను మార్పులు వస్తున్నాయి. ఆ మార్పుల్లో మనమూ పాల్గొనాలి. ముఖ్యంగా మొట్ట మొదట మనం చెయ్యవలసినది ముద్రణాలయాలు స్థాపించి, వార్తాపత్రికలు పెట్టి, ప్రపంచంలో వస్తున్న మార్పులన్నిటి గురించిన జ్ఞానాన్ని ప్రజలకి విస్తృతంగా తెలియపర్చాలి." కోల్‌మన్ ఆఖరిని దే కి చెప్పాడు.

## 3

ఆ ఏడు వానలు లేవు. జ్యేష్ఠ మాసంలో ఎండిపోయిన చెరువులు అలా ఎండే ఉన్నాయి. తొలకరికి గుప్పెడు ధాన్యం పండలేదు. రబీ పంటా పండలేదు.

నవధాన్యాలూ పండలేదు. కుటుంబాలకి కుటుంబాలు ఆకలికి ఆహుతైపోయాయి. ఇళ్ళు పాడుపెట్టి కొందరు పారిపోయారు. ధుర్‌దేహ్ పెద్ద చెరువు ఎండిపోయింది. పాతిక కోసుల దూరం నుంచి చుట్టుపక్కల జనం ఆ ఎండిపోయిన చెరువు గర్భానికి చేరుకున్నారు. తామర దుంపల్ని తవ్వుకోడానికి వాళ్ళక్కడికి వచ్చారు. ఆ దుంపలకోసం ఎన్నోసార్లు వాళ్ళలో వాళ్ళు జట్టీలు పడ్డారు.

మరుసటి సంవత్సరం వానలు పడ్డాయి. మొదటి పంట రాగుల్ని రేఖా కొడుతున్నాడు. మంగరీని దగ్గరగా చూసి ఆశ్చర్యపోయాడు. ఈ ఏడాదిలోపల అంతా ఎంత మారిపోయింది. ఇంటింటా ఎక్కువెక్కువమంది చచ్చిపోయారు. ప్రతీ కుటుంబం చెల్లాచెదరైపోయింది. తామిద్దరమూ ఎలా ప్రాణాలు దక్కించుకుని విడిపోకుండా ఉండగలిగామా అని రేఖాకి ఆశ్చర్యంగా ఉంది. ధుర్‌దేహ చెరువు ధర్మమా అని తనూ తన భార్యా బతికి బట్టకట్టి ఉన్నారని అతడు ఆ చెరువుకి కృతజ్ఞతలు చెప్పుకున్నాడు.

ఇంతకు పూర్వమూ వానలు పడక కరువు వచ్చి ఉండొచ్చు కాని రేఖాకి పూర్వపు రైతులు ఎప్పుడూ బహుశా ఇంత కష్టం పడి ఉండరు. ఆ రోజుల్లో ప్రభుత్వం ఒకటే ఉండేది. పన్నులూ తక్కువే ఉండేవి. ఇప్పుడు కంపెనీ ప్రభుత్వం, దాని కింద జమీందారుల లావు పెత్తనమూ ఉన్నాయి. ఆ జమీందార్ల తాబేదార్లు గుడిసెకప్పు మీద పాకిన ఆనప పిందెల్ని కూడా దక్కనివ్వరు పండిన పంట నెలా పదిహేను రోజులు తిండానికైనా సరిపోనప్పుడు కరువు రోజులకని రైతులు ఏం జాగ్రత్తపడి నిలవచేసుకోగలరు? మార్గశిరమాసంలో మంగరీ కొడుకుని కన్నది. రేఖాకి మరింత ఆశ్చర్యం వేసింది. తను ఏభైయ్యోపడిలో పడ్డా మంగరీ ముప్పై ఏళ్ళదే. అదీకాక ఇదివరకూ ఎన్నో కాన్పులూ అయ్యాయి. పిల్లలు కలిగి చచ్చిపోయారు. ఈ కరువులో తన ప్రాణాల్ని నిలుపుకోవడమే కష్టం. అలాంటిది మంగరీ కన కడుపులో పిల్లాణ్ణి ఎలా బతికించుకుందా అని రేఖాకి ఆశ్చర్యం వేసింది. కరువులో పుట్టాడని రేఖా కొడుక్కి కరువయ్య అని పేరు పెట్టాడు.

మాఘ మాసంలో రామపురం అధికారి తన ఏనుగులతోనూ, గుర్రాలతోనూ, సిపాయిలతోనూ, మందీ మార్బలంతోనూ దయాల్‌పురం వచ్చాడు. ఈ అధికారి ఇంట కరువు రోజుర్లోనూ, పిల్లా పాపా తిండి లేక చిక్కిపోలేదనీ, ఏడేళ్ళ క్రితపు ధాన్యం తీసుకుని తిన్నారనీ రేఖా విన్నాడు. దయాల్‌పురం అధికారి కచేరి ఊరికి ఓ చివరగా ఉంది. దానికి ఎదురుగా పాతిక ఎకరాల మామిడి తోట ఉంది. ఆ తోటకి నీరు పెట్టడం సంరక్షణ చెయ్యటం దయాల్‌పురం వాస్తవ్యులు వెట్టి చాకిరీగా చెయ్యాలి. ప్రతీ ఇంటికీ ఏభై మొక్కలు చొప్పున అప్పచెప్పాడు. మొక్కలు గాని ఎండిపోయాయా మొక్కకి రూపాయి పావలా చొప్పున జరిమానా చెల్లించుకోవాలి. రేఖా తర్వాత తరం వారు జమీందారీ డాబుదర్పాలు పాతకాలపు మాటలుగా పరిగణించడం మొదలుపెట్టారు. సోబరన్‌రావుత్, రేఖాభగత్‌లు

చెప్పిన జమీందారీ విధానపు పాత రోజులు, గ్రామంలోని పంచాయితీ రాజ్యం అన్నీ కథల్లా తోస్తున్నాయి. అధికారి బంట్లూ, తాబేదార్లు కరువు తర్వాత మరింత పేట్రేగిపోయారు. ఈ కరువు రైతుల మనోనిబ్బరాన్ని పాడు చెయ్యటానికి యజమానుల పెత్తనాన్ని మరింత పెంచడానికీ వచ్చిందని వాళ్ళు అనుకున్నారు. మార్గశిర మాసంలో రేఖా గుడిసె మీదకి పాకిన ఆనప పాదు పిందె తొడగడం మొదలు పెట్టిందో లేదో, యజమాని బంట్లు ఆ చుట్టుపక్కల తచ్చాడ్డం మొదలు పెట్టారు. కరువు తర్వాత రేఖాకి కోపం ఎక్కువయింది. కొత్త కొత్త సంగతులు అతడికి తడుతున్నాయి. కరువు తర్వాత గ్రామంలో అందరికీ వివేచనా శక్తి తగ్గిపోయింది. వాళ్ళతో పోలిస్తే రేఖా బాగా నయం. అందుకే అతని ప్రవృత్తి మారి కోపిష్టి వాడయినట్టుగా అనిపిస్తోంది. అధికారి బంట్లూ, తాబేదార్లు ఆనపపాదు చుట్టూ తచ్చాడుతూ ఉండడంచూసి లోలోపల రేఖా మండిపడుతున్నాడు. అయితే పైకి నోరు విప్పి ఏమీ అనలేదు. ఓ రోజు చౌకీదారు కరణంగారి కోసం ఆనపకాయలు కొయ్యడానికి గుడిసె పైకి ఎక్కాడు. ఆ సమయంలో రేఖా గుడిసెలో కరువయ్యని ఒళ్లో కూచోపెట్టుకుని ముద్దులాడుతున్నాడు. గుడిసె మీద మనిషి పాకిన జర జర చప్పుడు వినిపించగానే కరువయ్యని చాపమీద పడుకోబెట్టి రేఖా బైటికి వచ్చాడు. చౌకీదారు గుడిసెక్కి ఆనపకాయల్ని తెంపుతున్నట్టు చూశాడు. అప్పటికి మూడుకాయలు కోసేశాడు. నాలుగోది కొయ్యబోతున్నాడు. రేఖాకి ఒళ్ళు మండింది. ఊళ్ళో సహం మందికి వినిపించేటట్టు పెద్దగొంతుక పెట్టి గట్టిగా గదమాయించాడు :

"ఎవ్రరా అక్కడ?"

"కరణంగారికోసం ఆనపకాయలు కోస్తున్నా, కనపట్టంలేదూ?" అని అతెల్లి చౌకీదారు తలన్నా ఎత్తకుండా జవాబు చెప్పాడు.

"చెయ్యీకాలూ తిన్నగా ఉండాలనుకుంటే తిన్నగా దిగు! వినపడుతోందా లేదా? నీకే చెప్తూ ఉంట!" రేఖా మళ్ళీ అరిచాడు.

"ఎవరితో మాట్లాడుతున్నావో తెలిసే మాట్లాడుతున్నావా? గ్రామాధికారి చౌకిదార్ని! ఏమనుకున్నావో!"

"తెల్సు తెల్సు. ఆనపకాయల్ని అక్కడే వదిలిపెట్టి మరీ దిగు. లేదూ అంటే మర్యాద దక్కదు!"

చౌకీదారు మాటాడకుండా కిందికి దిగివచ్చాడు. కరణంగారు ఇదంతా చౌకీదారు ద్వారా విని కోపాన్ని అప్పటిమటుక్కి దిగమింగుకుని ఊరుకున్నాడు. మాఘ మాసంలో అధికారి వస్తాడు. ఆ అదనుకోసం చూస్తూ ఉన్నాడు.

అధికారి వచ్చాక ఆ చౌకీదారే సాయంత్రం వేళప్పుడు రేఖా ఇంటికి వెళ్ళాడు- "రేపొద్దున్నే అధికారిగారి కోసం రెండు సేర్ల పాలు పంపించాలి," అని కబురు తెచ్చాడు.

"మా ఇంట గేదెలూ, ఆవులూ ఏం లేవు. పాలు ఎక్కణ్ణించి పంపుతాం?" అన్నాడు రేఖా.

"ఎక్కణ్ణించి పంపుతావో ఏమో! అధికారిగారి ఆజ్ఞ!"

కరణానికి తెల్సు - రేఖా దగ్గర గేదెలూ ఆవులూ లేవని! అయితే రేఖాకి బుద్ధి చెప్పడానికి ఇదే అదను. సాయంత్రం ఆయన అధికారి దగ్గరకి వెళ్ళి రేఖా పొగరుమోత్తనం గురించి పంచాంగం విప్పాడు. రేఖా నుంచి గ్రామంలో మిగతా జనం అంతా ఎలా పాడైపోతున్నారో కూడా చెప్పాడు. అధికారి ఆ రాత్రికి రాత్రే రేఖాని ఎలా శిక్షించాలో నిర్ణయించాడు.

పొద్దున్న రేఖా పాలు పంపించలేదు. చౌకీదారు వెళ్తే తన యింట ఏం పాడి లేదని రేఖా బదులు చెప్పాడు. అధికారి ఓ అయిదుగురు బలిసిన దుండగీళ్ళని పిలిచి ఆజ్ఞాపించాడు– "వెళ్ళండి, ఆ ముండాకొడుకు పెళ్ళాం చన్నులు పిటికి పాలు తీసుకురండి."

ఊళ్ళో జనం చాలా మంది అక్కడ ఉన్నారు. ఆ అధికారి బంట్లు రేఖాని కట్టి తీసుకువస్తారనే వాళ్ళు అనుకున్నారు. రేఖాకి నోరువిప్పి మాట్లాడ్డానికి అవకాశం ఇవ్వకుండా ఆ బంట్లు వాణ్ణి పట్టుకుని వాడి చేతులు వెనక్కి విరచి కట్టేశారు. ఇద్దరు ఇంట్లోకి దూరి మంగరీని లాక్కుని బైటకి తీసుకువచ్చారు. ఏడుస్తూ గోలపెడుతున్న మంగరీ చన్నుల్ని పట్టుకుని నిజంగానే గ్లాసులోకి పాలు పిండుతూ ఉంటే ఏం చెయ్యలేక నిస్సహాయంగా నెత్తురు మండే కళ్ళతో రేఖా చూస్తూ నిల్చున్నాడు రేఖా కట్లు విప్పకుండా అలాగే వదిలేసి వాళ్ళు వెళ్ళిపోయారు.

మంగరీ సిగ్గుతో ఒళ్ళు చచ్చిపోయి మొహం కప్పుకుని కూచుంది. నోట మాటరాక నిల్చున్న రేఖా కాస్సేపటికి నోరు తెరచాడు.

"మంగరీ! సిగ్గుపడకు. మన గ్రామంలో పంచాయితీ కాని ఉన్నట్లయితే పాదుషా అయినా ఇలా చెయ్యగలిగి ఉండేవాడు కాదు. అయితే ఈ అవమానానికి ప్రతీకారం తీర్చుకుంటాను. నా ఒంట్లో నిజంగా అహీరుల (గొల్ల) నెత్తురే ఉన్నట్లయితే కరణం ఇంట్లోనూ రామాపురం మున్షీ వంశంలోనూ వాళ్ళ కోసం కన్నీరు కార్చడానికైనా ఒక్కడైనా మిగలడు! ఎవరూ మిగలరు! అవమానానికి ప్రతీకారాన్ని ఈ చేతుల్తోనే తీర్చుకుంటాను. మంగరీ! రా! నాచేతి కట్లు విప్పు," అన్నాడు.

మంగరీ ఎడతెరిపి లేకుండా ధారా ప్రవాహంగా కారుతున్న కన్నీటితో వెనక్కి విరిచిపెట్టి కట్టిన రేఖా చేతుల్ని విప్పింది. రేఖా లోపలికి వెళ్ళి కరవయ్యని ఎత్తుకుని ముద్దు పెట్టుకున్నాడు.

"ఇంట్లోంచి కావలసిన వస్తువులు ఏమున్నాయో అవన్నీ తీసుకుని వెంటనే మీ పుట్టింటికి వెళ్ళిపో. ఈ ఇంటికి నిప్పు పెట్టబోతున్నాను" అని మంగరీతో చెప్పాడు.

మంగరీ రేఖా మాటల్ని అర్థం చేసుకుంది. పిల్లాణీ కొన్ని బట్టల్నీ తీసుకుంది. రేఖా కాళ్ళ మీద పడ్డాది. రేఖా గొంతు ఎంతో మృదువుగా ఉంది.

"నీ గౌరవమే కాదు —ఊరు ఊరందరి గౌరవం కోసం ప్రతీకారం తీర్చుకోవాలి వెళ్ళు. కరవయ్యకి పెద్దయ్యాక చెప్పు, వాడి తండ్రి ఎలాంటివాడో! ఆలస్యం చెయ్యకు. కుంపటిలోంచి అగ్గి తేవడానికి నేను వెళ్తున్నాను" అన్నాడు.

గుడిసె మీంచి మంటలు పైకి లేచేంతవరకూ మంగరీ కాస్త దూరం వెళ్ళి రేఖాఇంటిని చూస్తూ నిల్చుంది. గ్రామానికి ఓ చివరగానున్న కచేరీవేపు నుంచి జనం ఇంటి వేపుకి పరుగు పరుగున వచ్చారు. ఇటు రేఖా కత్తి పట్టుకుని జమీందారు కచేరీ సావిటికి పరుగు పెట్టాడు. ప్రాణభయంతో బంట్లూ, చౌకీదార్లూ పారిపోయారు. రేఖా అధికారినీ కరణాన్నీ పొడిచి చంపుతూ—"మీరు చచ్చేక మీ కోసం ఏడ్చేవాడు ఒక్కడంటే ఒక్కడైనా మిగలడు, అందరినీ చంపితీరతాను, పాపాత్ములారా!" అన్నాడు.

రేఖా తను అన్నమాటని నిలబెట్టుకున్నాడు. అంతేకాదు, అన్నదానికన్నా ఎక్కువగా చేసి చూపెట్టాడు.

కటికగుండె కసాయివాడు కార్న్‌వాలీసు వల్ల ఇలాంటి రేఖాలు ఎంత మంది పుట్టారో?!

# మంగళసింహుడు

కాలం: క్రీ. శ. 1857

ఇవాళ వాళ్ళిద్దరూ టవరునీ ఆ టవరులోని గదులనీ చూడ్డానికి వెళ్ళారు. ఆ గదుల్లో రాజుగారి శత్రువులు జీవితాంతం ఖైదు చెయ్యబడి యమయాతనలు అనుభవిస్తూ వుండేవారు. ఆ గొడ్డళ్ళని, ఆ ఆయుధాల్ని, శికంజా*లని అన్నిటినీ చూశారు. వాటివల్లే రాజులు తాము రాజులమనీ, తమ చేతిలో జనం చావుబతుకులు ఉన్నాయనీ, భూమ్మీద తామే భగవంతుడి నిజమైన ప్రతినిధులమనీ— యువ రాజుల మనీ లేదూ యమరాజులమనీ ఋజువు చేసుకునేవారు. వాళ్ళిద్దర్నీ ఎక్కువగా ఆకర్షించిన స్థలం - ఇంగ్లండు రాజుగారి తలనీ, రాణీగారి తలనీ నరికి నేలని పడేసిన స్థలం.

యానీరసల్ మృదువైన చేతుల్ని అతని చేతికి ఇవాళా అందించింది. అయితే ఇవాళ ఆ చేతుల మెత్తదనం మరో రకమైన ప్రభావం కలిగిస్తోంది. పదకొండేళ్ళ ముందే (క్రీ. శ. 1846) విజ్ఞాన శాస్త్రజ్ఞుడు ఫారడే కనిపెట్టిన విద్యుత్ శక్తిలాంటి శక్తి యానీ చేతినుంచి అతని శరీరంలోకి ప్రసరిస్తోంది.

"యానీ! నువ్వు విద్యుత్ ఉత్పాదక కేంద్రానివా ? (బేటరీ)" అని మంగళ సింహుడు అడిగాడు.

"ఏం అలా అడుగుతున్నావు మంగీ?"

"నా కలాగే అనిపిస్తోంది. పదహారేళ్ల క్రితం ఇంగ్లాండు నేల మీద కాలు పెట్టినప్పుడు చీకట్లోంచి వెలుతురులోకి వచ్చినట్టు నాకు అనిపించింది. నాకు ఓ కొత్త ప్రపంచం - ఓ విశాల ప్రపంచం- పొడుగూ వెడల్పుల్లో కాదు— భవిష్యత్ కాలంలో ఎంతో పురోగమించి వృద్ధిచెందే ప్రపంచం కనిపించింది. దూప పంచదారా(క్రీ.శ. 1808), ఆవిరితో నడిచే స్టీమరు నౌకలు (క్రీ. శ. 1819), రైల్వేలు (క్రీ.శ. 1825), టెలిగ్రాఫులు (క్రీ. శ. 1833), అగ్గిపెట్టెలు (క్రీ. శ. 1833), ఫోటోలు (క్రీ. శ. 1839), విద్యుత్‌కాంతి (క్రీ. శ. 1844), అన్నీ చూడ్డానికి కొత్తవే—ఆశ్చర్యకరమైన వస్తువులే ! కాని కేంబ్రిడ్జిలో వాటన్నిటిగురించీ చదవ

---

*శికంజా- కర్రతో చేసిన యంత్రం- దానిలో పెట్టి నొక్కి శిక్షించేవారు.

డానికీ ప్రయోగశాలలో ప్రయోగాలు చేసి చూడడానికి నాకు అవకాశం దొరికాక ప్రపంచానికి ఎంత ఉజ్జ్వలమైన భవిష్యత్తు ఉందో నాకు అర్థమయింది."

"నిజంగానే ఇంగ్లాండు రావడంతో చీకట్లోంచి వెలుతురులోకి వచ్చినట్టు నీకు అనిపించిందా?"

"పైన చెప్పిన వాటి విషయంలో నాకు అలా అనిపించింది. నిజానికి భారత దేశం వదలి యిక్కడికి రావడంలో నాకు రెండే అభిప్రాయాలు వుండేవి. ఒకటి-నా ప్రియతమ ప్రభువు ఏసుక్రీస్తు భక్తుల దేశాన్ని చూడ్డం. రెండోది- మేం ,పోగొట్టుకున్న మా రాజ్యలక్ష్మిని తిరిగి సంపాదించటానికి ప్రయత్నించడం."

"ఎన్నోసార్లు నీ గురించి తెలుసుకుందామని అనుకున్నాను. ఇంతవరకూ మరేవేవో మాటల్లోపడి దాన్ని మర్చిపోతూ వచ్చాను. ఇప్పుడు నీ సంగతులన్నీ చెప్పు మంగీ!"

"నా బతుకునే మార్చినదానివి, నీకు చెప్పడానికి నాకేం అభ్యంతరం వుంటుంది? పద, ప్రశాంతంగా పారుతున్న థేమ్సు నదీ తీరానికి పద. థేమ్సు మా గంగానదంత పెద్దదీకాదు, అందమైనదీ కాదు. అయినా థేమ్సు నదిని చూసినప్పుడల్లా నాకు గంగానది తియ్యటి జ్ఞాపకాలు వస్తాయి. యానీ ! నీకు తెల్సు కదా ! క్రైస్తవులు క్రీస్తుని తప్ప ఇంకే దేవుణ్ణి పూజించినా అది మత విరుద్ధం అని చెపుతారు. హేయదృష్టితో చూస్తారు. థేమ్సు నది మళ్ళీ ఓసారి ఈ క్రైస్తవుణ్ణి మత ద్రోహిగా చేసింది! నేను హిందూ మతస్థురాలైన నా తల్లిని, ఎంతో భక్తి భావంతో గంగానదికి పువ్వులు సమర్పించి పూజిస్తున్నట్టుగా చూస్తున్నాను."

వాళ్ళిద్దరూ థేమ్సునది ఒడ్డుకి చేరుకున్నారు. ఓ రాతి అరుగుమీద థేమ్సు నదికి అభిముఖంగా కూచుని నదిని చూస్తున్నారు. చెవులను కూడా కప్పిపెట్టుకున్న తెల్లటి టోపీలోంచి యానీ బుగ్గల వంకూ వేళ్ళాడుతున్న బంగారపువన్నె జుట్టు గాలి ఊపులకి ఎగురుతోంది. మంగల్ ఆ జుట్టుని ముద్దాడాడు.

"ఈ థేమ్సు ఒడ్డున నిల్చుని నేను ఎన్నో పర్యాయాలు నా మనస్సులో— మనస్సులోనే మా గంగానదికి పుష్పాలు సమర్పించాను" అన్నాడు.

"మీ అమ్మ గంగానదికి పువ్వులు సమర్పించేదా?"

"ఎంతో భక్తిభావంతో! క్రైస్తవులు క్రీస్తుపట్ల ఎంత భక్తిని ప్రదర్శిస్తారో అంత భక్తితో! నేనారోజుల్లో కొత్తగా క్రైస్తవమతాన్ని స్వీకరించానేమోనాకుఅదంతా హేయమైనదానిగా అనిపించేది. కాని గంగానదిపట్ల నేను ప్రదర్శించిన అగౌరవ భావానికి ఇప్పుడు నేను లెక్కలేనన్ని సార్లు పశ్చాత్తాప పడుతున్నాను."

"క్రైస్తవం ఏ భావాన్నైతే రూపుమాపాలని అనుకున్నదో దాన్నే మా కవులు మళ్ళీ పునరుజ్జీవింపచేశారు. మేం థేమ్సుని తండ్రి అని అంటాం- నీకు తెల్సా?"

"మేం మా గంగానదిని గంగామాత అంటాం."

"మీ కల్పన ఇంకా తియ్యగా వుంది మంగీ! ఊఁ- చెప్పు, నీ గురించి అన్ని సంగతులూ చెప్పు!"

"గంగానదికి ఈ ఒడ్డున బనారస్సూ ఆ ఒడ్డున రామనగరూ కాస్త దూరంలో ఉన్నాయి. పదహారేళ్ళ వరకూ గంగని చూస్తూనే వున్నాను. మా ఇల్లు బనారస్‌లో గంగ ఒడ్డునే ఉంది. ఆ ఒడ్డుకే అరవై మెట్లతో గంగానదీ జలాల వరకూ దిగడానికి రేవు ఉన్నది. బహుశా నేను భూమ్మీద పడ్డరోజునుంచీ మా అమ్మ నన్ను ఎత్తుకుని గంగమ్మకి చూపెడ్తూ వచ్చింది. గంగా నా అస్థి చర్మాలకి పట్టి నా నెత్తురులో భాగం అని ఎందుకోగాని నాకు అనిపిస్తూ వుంటుంది. రామనగరంలో మా తాతగారికోట వుంది. కాని దాన్ని నేను ఒకటి రెండు సార్లు మాత్రమే చూశాను. అదైనా గంగానదిలో నావలో వెళ్తూను! లోపలికి వెళ్ళి చూడాలని కాని, ఒకటికి పదిసార్లు చూడాలని కాని ఎందుకో అనిపించేదికాదు. మా అమ్మైతే మరీను. ఆ ఛాయలకి వెళ్ళాలని అనుకునేదేకాదు. యానీ! నువ్వే ఆలోచించి చూడు! ఆ కోటకి యువరాణి కావల్సినది. ఇంగ్లీషు వాళ్ళ భయంతో బనారసులో ఓ ఇంట్లో పేరుమార్చుకుని బతుకు వెళ్లమార్చుకుంటూ ఉన్నదాయె! అలాంటావిడ ఆ కోటని కన్నెత్తి చూడ్డానికి యెలా సాహసిస్తుంది? మా తాతగారు జేత్‌సింహ్ మహారాజుని దోపిడీదారు వారన్ హేస్టింగ్స్ అనవసరంగా పదవినుంచి తొలగించాడు. తాను చేసిన దానికి ఫలితాన్ని కొంతలో కొంత వారన్‌హేస్టింగ్సు ఇంగ్లాండులో పొందాడు. కాని మా తాతగారికి మాత్రం న్యాయం ఏమాత్రం జరగలేదు. బలవంతంగా లాక్కున్న రాజ్యాన్ని తిరిగి ఇవ్వడం అన్నది నిజమైన న్యాయంకాదా యానీ?"

"మీ అమ్మగారు బతికే ఉన్నారా?"

"మా పాదరీ బనారస్ నుంచి అప్పటప్పటా ఉత్తరాలు రాస్తూ వుంటారు. ఆయన ద్వారా నేను మా అమ్మకి ఉత్తరాలు రాస్తూ ఉండేవాణ్ణి! ఐదు నెలల క్రితంవరకూ ఆవిడ బతికే ఉంది యానీ!"

"ఐతే నువ్వు మొదట్నించీ క్రైస్తవుడివి కాదన్నమాట!"

"ఉహూ! మా అమ్మ హిందువు. ఆవిణ్ణి క్రైస్తవం పుచ్చుకునేటట్టు చేద్దామని ముందర అనుకున్నాను. కాని ఇప్పుడు........"

"ఇప్పుడు నువ్వుకూడా మీ అమ్మతోపాటు గంగమ్మతల్లికి పువ్వులు సమర్పించి ప్రణామం చేస్తావా?"

"పీడు క్రైస్తవాన్ని విడిచి పెట్టేశాడని పాదరీలు అంటారు!"

"నువ్వు క్రైస్తవుడిగా ఎలా మారేవు?"

"ఏదో అంతరాత్మ ప్రబోధం వల్ల ఏం మారలేదు. బనారసులో కూడా ఇంగ్లీషు మిషనరీలు, పాదరీలు, పాదరమ్మలూ క్రైస్తవమతాన్ని ప్రచారం చేస్తూ వుండేవారు. బనారసు హిందువులకి మీ రోము లాంటిది. అంచేత ఆ మిషనరీలు తమ ప్రచారంలో అంతగా కృతకృత్యులు కాలేదు. ఓసారి మా అమ్మకి ఒంట్లో

బాగుండకపోతే ఓ పాదరీ వైద్యం చేశాడు. ఆ తర్వాత పాదరీ భార్య మా ఇంటికి వస్తూ పోతూ వుండేది. ఆవిడకి మా అమ్మకి స్నేహం బాగా పెరిగింది. నేనప్పుడు చిన్నవాణ్ణి, ఆవిడ తరచు నన్ను ఎత్తుకుంటూ వుండేది."

"నువ్వు చిన్నప్పుడూ యెంతో అందంగా వుండి వుంటావు. అలాంటప్పుడు ఎవరు మాత్రం ఎందుకు ఎత్తుకోరు?"

"ఆ పాదరమ్మే పిల్లాడికి ఇంగ్లీషు చదువు చెప్పించు అంటూ మా అమ్మకి బోధపర్చింది. ఐదారేళ్ళ వయస్సప్పటినుంచీ నాకు ఆ పాదరీ ఇంగ్లీషు నేర్పించడం మొదలుపెట్టాడు. మా అమ్మ తన కుటుంబపు గత వైభవం గురించి ఎప్పుడూ తలుచుకుంటూ వుండేది. ఇంగ్లీషు చదువు చదువుకుని తన కొడుకు వంశం పోగొట్టుకున్న రాజ్యలక్ష్మిని తిరిగి సంపాదించటానికి ఏమన్నా చెయ్యగలుగుతాడని ఆవిడ లోలోపల ఆశపడుతూ ఉండేది. నాకు మూడేళ్ళప్పుడు మా తండ్రి చనిపోయారు. అంచేత మా అమ్మే అన్నీ చూసుకోవాలి, చేసుకోవాలి. మా ఐశ్వర్యం అంతా మా రాజ్యంతో పాటే పోయింది. అయితే అమ్మదగ్గర ఆవిడ అత్తగారు యిచ్చిన నగలు చాలా ఎక్కువగానే వున్నాయి. అదీగాక మా మేనమామ కూడా తన సోదరిని సర్వవిధాలూ చూసేవాడు. ఎనిమిదేళ్ళ వాణ్ణయ్యేక నేను యెక్కువగా పాదరీ ఇంట్లోనే ఉండేవాణ్ణి. హిందూ మతం గురించి నాకు తెల్సుకునే అవకాశం చాలా తక్కువ. ఏ మాత్రమన్నా తెలుసుకున్నానూ అంటే అది పాదరమ్మ చెప్పగా తెలుసుకున్నదే. 'నువ్వు అదృష్టవంతుడివి అబ్బాయి! మీ అమ్మ బతికిపోయింది. లేకపోయినట్లైతే మీ నాన్నగారు చనిపోయిన తర్వాత ఆవిణ్ణి సజీవదహనం కావించి సహగమనం చేసేటట్టు చెయ్యాలని అందరూ అనుకున్నారు' అని ఆవిడ నాతో చెప్తూ వుండేది. మా అమ్మని బతికుండగానే కాల్చి చంపేయాలనుకున్నారన్నారని విని, హిందువులన్నా, హిందూమతమన్నా, సతీధర్మమన్నా ఒకటే అనుకున్నప్పుడు ఆ మతం పట్ల నాకు ఏహ్యభావం తప్ప ఇంకేం కలుగుతుంది? నువ్వే చెప్పు యానీ! ఆ తర్వాత, రెండేళ్ళకే సతీసహగమనాన్ని నిషేధించారు. (క్రీ.శ. 1829). నా శ్రేయస్సుని దృష్టిలో పెట్టుకుని మా అమ్మ పాదరమ్మ సలహా వింది. నన్ను చదువుకోడానికి కలకత్తా పంపించింది. కలకత్తాలో నేను చదువుకుంటున్న రోజుల్లో మా అమ్మకి అనుమానం వేసింది. పాదరమ్మ నన్ను క్రైస్తవుణ్ణిగా చెయ్యడానికే ఇదంతా చేసిందని ఆవిడికి అనిపించింది. అది మంచిదే అయింది. అమ్మకి ముందు తెలియలేదు. ఆవిడకి ముందే తెలిసి వుంటే నాకు చదువుకునే అవకాశమూ, ప్రపంచాన్ని తెలుసుకుని జ్ఞానం సంపాదించే అవకాశమూ కలిగి వుండేవి కావు."

"భారతదేశంలో పిల్లల చదువుల విషయమై శ్రద్ధవహించరా?"

"నాకు చదువు చెప్పించి ఉండేవారు. అయితే పదమూడు సంవత్సరాలక్రితం పనికివచ్చే విద్యని నేర్పించి ఉండేవారు!"

"అయితే తర్వాత నువ్వు ఇంగ్లాండు రావడానికి మీ అమ్మగారు అంగీకరించారా?"

"ఆవిడ అనుమతిస్తుందా? చెప్పాపెట్టకుండా నేను వచ్చేశాను. ఫాదరీ నాకు సాయపడ్డాడు. కేంబ్రిడ్జిలో చదువుకోడానికి అన్ని ఏర్పాట్లూ అతడే చేశాడు. ఇక్కణ్ణుంచి 'నేను క్షేమంగా ఉన్నాను' అంటూ అమ్మకి ఉత్తరం రాశాను. దానికి ఆవిడ తన ఆశీర్వాదాలు అందచేసింది. ఆవిడకి ఏభై ఐదేళ్ళు పైబడ్డాయి. ప్రతీ ఉత్తరంలోనూ ఇంటికి వచ్చేయమని రాస్తూవుంటుంది."

"నువ్వు దానికి జవాబు ఏం రాస్తూ ఉంటావు?"

"జవాబు ఏం రాస్తాను?" ఏదో ఓ వొంక రాస్తాను. నేను రాజధానిలో ఉన్నాను. ఇంగ్లాండు మహారాణిగారిని నేను కలుస్తూ ఉంటాను. ఏదో ఓ రోజున చేత్సింహ్ సింహాసనాన్ని తిరిగి సంపాదించుకుని మరీ వస్తాను అని ఆవిడ అనుకుంటోంది."

"పాపం, గంగామాతని పూజించే ఆ భక్తురాలికేం తెల్సు—నువ్విక్కడ విక్టోరియా మహారాణిని కలుసుకోలేదని, ఆవిడకి బదులు యావత్ ప్రపంచంలో కిరీటాలు పెట్టుకున్న రాజులకీ మహారాజులకీ ఘోరశత్రువులయిన వాళ్ళని కలుసుకున్నావనీ, కార్ల్‌మార్క్స్‌నీ, ఫ్రెడ్రిక్ ఎంజిల్స్‌నీ కలుసుకున్నావని!"

"భారతదేశంలో పెట్టుబడిదారీ ప్రపంచం గురించి గాని దాని శక్తి గురించి గాని జ్ఞానమే పెరగలేదు. అలాంటప్పుడు మార్క్స్ సామ్యవాదాన్ని ఏం అర్థం చేసుకో గలుగుతారు?"

"భారతదేశం గురించి మార్క్స్‌తో ఎప్పుడన్నా మాట్లాడావా?"

"ఎన్నోసార్లు మాట్లాడాను. ఇక్కడ కూచున్న మార్క్స్‌కి భారతదేశంలోని జీవితం గురించి దాని వికాసం గురించి ఇంత జ్ఞానం ఎలా కలిగిందా అని నాకు ఆశ్చర్యం వేస్తూ వుంటుంది. కాని ఇదేమీ ఇంద్రజాలమూ, మంత్రబలముకాదు. గత మూడు వందల ఏళ్ళబట్టి ఇంగ్లీషువాళ్ళు అనేకులు భారతదేశం గురించి క్షుణ్ణంగా తెలుసుకుని ఆ విషయాలన్నిటినీ గ్రంథస్థం చేశారు. ఈ గ్రంథాలన్నీ ఇక్కడ ఈ లండనులో ఉన్నాయి. మార్క్స్ ఆ దుమ్ము పేరుకుపోయిన గ్రంథాల్ని దులిపి ఎంతో అధ్యయనం చేశాడు. దానికి తోడు భారతీయుడెవడైనా కనపడితే చాలు - అతణ్ణి అడిగి తాను చేసిన నిర్ణయాల నిజానిజాలు పరీక్షించి చూసుకుంటాడు."

"భారతదేశపు భవిష్యత్తు గురించి మార్క్స్ అభిప్రాయం ఏమిటి?"

"భారతదేశపు వీరుల శౌర్యాన్ని ఆయన ఎంతో పొగుడుతాడు. మా మేధాసంపత్తినీ ప్రశంసిస్తాడు. కాని మా పూర్వాచార పరాయణతే మాకు అందరికన్నా పెద్ద శత్రువని ఆయన అభిప్రాయం. మా గ్రామాలన్నీ స్వయం పోషకత్వం కలిగిన చిన్న చిన్న ప్రజాస్వామ్యాలు."

"ప్రజాస్వామ్యాలా?"

"యావత్ దేశంకాదు. ఓ జిల్లా కూడా కాదు. ఇంకా చెప్పాలంటే రెండు ఊళ్ళు కలిపి కాదు! ఏ గ్రామానికి ఆ గ్రామమే! అయితే అన్ని చోట్లా కాదు. లార్డు కారన్ వాలీసు ఇంగ్లీషు వాళ్ళని అనుకరిస్తూ జమీందారీ విధానాన్ని ప్రవేశపెట్టిన ప్రాంతాలన్నిటిలో గ్రామాల్లోని ప్రజాస్వామ్యం మట్టుపెట్టుకుపోయింది. ఈ గ్రామాల ప్రజాస్వామ్యాన్ని నిర్వహించటానికి ప్రజలు ఎన్నుకున్న ఐదుగురో లేదూ అంటే అంతకంటే ఎక్కువ మందితోనో పంచాయతీ ఉండేది. పోలీసు, న్యాయ, రక్షణ, విద్య, నీటిపారుదల సౌకర్యాలు, మతం, ధర్మం అన్ని శాఖల్నీ ఆ పంచాయితీనే నిర్వహించేది. ఎంతో నిజాయితీతో, బుద్ధికుశలతతో, న్యాయంగా, నిర్భయంగా తమ గ్రామంలోని ప్రతి అంగుళం భూమికోసం లేదూ అంటే గ్రామంలోని అతి హీనుల్ని వ్యక్తి గౌరవాన్ని కాపాడ్డం కోసం- పంచాయతీ నిర్ణయాల్ని అమలు పర్చడానికి గ్రామంలోని పిల్లల దగ్గర్నుంచి పెద్దలవరకూ యావన్మందీ తమ ప్రాణాలని అర్పించటానికి ఎప్పుడూ సిద్ధంగా ఉండేవారు. ముస్లిము పరిపాలకులు మొట్టమొదట్లో తమ రాజ్యం ఢిల్లీకి చుట్టు పక్కలవరకే వ్యాపించి ఉన్న రోజుల్లో, తమను తాము బాటసార్లు అని అనుకునే రోజుల్లో- ఈ పంచాయితీలని రద్దుచేసి నాశనం చేద్దామని అనుకున్నారు. కాని తర్వాత పంచాయితీల స్వయం పోషక పరిపాలనని వాళ్ళు అంగీకరించారు. ఈ ఇంగ్లీషు పరిపాలకులు- అందులోనూ ముఖ్యంగా ఇంగ్లాండులోని జమీందారు కార్న వాలీసు గ్రామ ప్రజాస్వామ్యాన్ని నాశనం చెయ్యడానికి కంకణం కట్టుకున్నాడు. తన ప్రయత్నంలో అతడు చాలా వరకూ కృతకృత్యుడయ్యాడు. అయితే అంతమాత్రానికే ఆ పంచాయితీలు రూపు మాసి పోయేవి కావు. మాంచెస్టరు, లంకాషైర్ బట్టలు, శేఫీల్డు ఇనుప సామాన్లు – ఇంకా ఇలాంటి ఎగుమతి వస్తువులు- ఇక్కణ్ణించి వెళ్ళేవి. గ్రామ ప్రజాస్వామ్యాల మీదా, వాటి ఆర్థిక స్వాతంత్ర్యం మీదా అన్నిటికన్నా గట్టి దెబ్బ కొట్టాయి. పద్దెనిమిది వందల ఇరవై రెండు జులై పదవ తారీఖున కలకత్తాలో మొట్టమొదటి సారిగా ఆవిరితో నడిచే స్టీమరు నీటిలో నడిచింది. దాంతో గ్రామాల్లో కాస్తాకూస్తో మిగిలి ఉన్న ఆర్థిక ప్రజాస్వామ్యపు పునాదులూ పూర్తిగా పడిపోయాయి. హిందూ దేశంలోని ఢాకా- సన్నబట్టల నేతకి ఆటపట్టు - మూడువంతులు అడుగంటి పోయింది. యాసీ! గ్రామాల్లోని సాలెవాళ్ళ సంగతి మరీ అడగక్కర లేదు. భారత దేశపు గ్రామాలు తమ లోహకారుల వల్లా, కుమ్మరుల వల్లా, సాలెవాళ్ళ వల్లా, మగ్గపునేతపనివాళ్ళ వల్లా స్వయంసమృద్ధాలై స్వతంత్రంగా ఉండేవి. ఇప్పుడు అక్కడి చేతిపనివాళ్ళు గోళ్ళుగిల్లుకుంటూ తిండానికి తిండిలేక ఆకలితో మాడి చచ్చిపోతున్నారు. ఆ గ్రామాలకి ఇప్పుడు లంకాషైరు, మాంచెస్టరు, బర్మింగుహామ్, శేఫీల్డు నుంచి సరుకులు పంపుతున్నారు. కేవలం వస్త్రాల సంగతే తీసుకో. క్రీ. శ. 1814 లో బ్రిటన్‌కి భారతదేశం నుంచి 18,66,608 తానుల బట్ట ఎగుమతి

అయింది. 1935 లో 3,76,086 తానుల బట్ట పంపించబడ్డది. ఇదిగో ఈ రెండు సంవత్సరాల్లోనే మనదేశానికి విదేశీ వస్త్రాలు రావడం ఎక్కువయింది. ఢాకాలో సన్నటి ఉలిపిరి మస్లినుబట్టలు తయారుచేసే భారతదేశం ఇప్పుడు తన ప్రత్తినంతటినీ విదేశానికి పంపించి బట్టలు నేయించి తెప్పించుకుంటోంది. ఎంతనుకుంటున్నావు? ప్రస్తుతపు లెక్కల్నే తీసుకుందాం. 1846 లో 10,75,309 పౌండ్ల ప్రత్తి ఇంగ్లాండుకి వచ్చింది."

"ఎంత క్రూరత్వం! ఎంత అత్యాచారం!"

"మా గురువుగారు అంటారు కదా- ఈ విదేశస్థుల అత్యాచారాలకి మాకూ ఎంతో దుఃఖం కలుగుతోంది. అయితే పూర్వాచార పరాయణతా, పాత పద్ధతులూ పటాపంచలవుతున్నందుకు మాకు సంతోషంగా కూడా ఉంది. బుద్ధితో ఆలోచించి చూస్తే మంచిదే అనిపిస్తోంది."

"అయితే రెండింటి తోవలూ వేరు వేరు అన్నమాట!"

"రెండింటి తోవలూ వేరు వేరే యానీ! తల్లి ప్రసవించే సమయంలో ఎంత యాతన పడుతుంది! అయితే సంతానప్రాప్తితో ఎంత ఆనందపడుతుందీ? ధ్వంసం అవకుండా నిర్మాణం జరగదు. ఈ చిన్న చిన్న ప్రజాస్వామ్యాలని ధ్వంసం చెయ్యకుండా ఓ బలవత్తరమైన పెద్ద ప్రజాస్వామ్యానికి పునాదివెయ్యడం అన్నది కుదరదు. భారతీయుల శక్తియుక్తులు కేవలం గ్రామాల ప్రజాస్వామ్యాల వరకే పరిమితమై ఉండిపోతే వారిలో దేశభక్తి - విశాలమైనది— యావత్ భారత దేశం కోసం ప్రాణాలను అర్పించి త్యాగం చేసే గుణం పెంపొందదు. ఇంగ్లీషు వాళ్ళు ఓడలూ, రైళ్ళూ, టెలిగ్రాపు సదుపాయాలూ లాంటి వాటినే తమ వ్యాపారాభివృద్ధి కోసం, సౌలభ్యం కోసం భారతదేశంలో ప్రవేశపెడుతున్నారు. అయితే కార్ల్‌మార్క్స్ చెప్పింది మాత్రం నిజం. రైళ్ళు వెయ్యడానికి వాటి మరమ్మత్తులకి ఇంగ్లీషు పెట్టుబడిదారులకి భారతదేశపు బొగ్గునీ, ఇనుమునీ ఉపయోగించక తప్పనిసరైనప్పుడు భారతదేశంలోనే ఆ సామాన్లు చవగ్గా చేయించకుండా ఎన్నాళ్ళని ఊరుకోగల్గుతారు? భారతీయులూ తమ కళ్ళ ఎదట కనిపించే సైన్సునీ దాని అద్భుతాలని తెలుసుకోకుండా ఎన్నాళ్ళని నిద్రపోతారు?"

"అంటే భారతదేశంలోనూ పెట్టుబడీ విధానమూ, పారిశ్రామీకరణా వ్యాపించక తప్పదన్నమాట!"

"అవును, తప్పదు. ఇప్పుడు ఇంగ్లాండులో ఫ్యూడలు జమీందార్ల ప్రభుత్వం లేదుకదా యానీ!"

"లేదు."

"సంస్కరణ చట్టం (1832)వల్ల ఇంగ్లాండులో పరిపాలనాధికారం పెట్టుబడిదారుల చేతుల్లోకి వచ్చిందికదూ?"

"ఇంకోలా చెప్పాలంటే పెట్టుబడిదారుల పెత్తనాన్ని సూచిస్తూ ఆ చట్టం చెయ్యబడ్డాది."

"నువ్వన్నదే నిజం. చార్టిస్టుల సభలూ సమావేశాలూ, పత్రికలూ నిన్ను ప్రభావితం చేశాయి యానీ!"

"సభలూ సమావేశాలకి నా కంత జ్ఞానం పెరగలేదు. ఏదో చిన్నగా జ్ఞాపకం మాత్రం ఉంది. అయితే మా పింతండ్రి రస్సెలు – మంత్రిమండలిలో చార్టిస్టులకి బలీయమైన ప్రత్యర్థి. ఆయన చెప్పగా ఎన్నోసార్లు విన్నాను. ఇది ఎంతో భయంకరమైన పోరాటంట."

"యానీ! పన్నెండు లక్షలకు పైగా ప్రజలు సంతకాలు పెట్టి పార్లమెంటుకి కార్మికుల సాధారణ డిమాండులకోసం సమర్పించిన వినతిపత్రాన్ని పార్లమెంటులో తృణీకరించినప్పుడు మీ పింతండ్రి రస్సెలు ఎంత ఉద్రేకపడుతూ మాట్లాడారో అల్లాగానే ఈ మాట చెప్పినప్పుడు గట్టిగా మంచి వక్తగా మాట్లాడారా?"

"లేదు. ఇప్పుడాయన జంకుతున్నారు. ఈ 1856లో చార్టరు వాదం అసలు వినిపించకుండా పోయిందా! అయినా సరే ఆయన జంకుతున్నారు."

"ఎందుకు జంకరు యానీ! ఫ్యూడల్ ప్రభువుల చేతుల్లోంచి రాజ్యాధికారాన్ని ఈ పెట్టుబడిదారు వర్తకులు తమ హస్తగతం ఎలా చేసుకున్నారో అలాగే ఈ డబ్బు సంచుల ఆసామీల రాజ్యాధికారాన్ని కాలరాచి కూలీలు తమ రాజ్యాన్ని స్థాపించుతారు. మానవత్వపు రాజ్యాన్ని ఖాయపరుస్తారు. ఆ రాజ్యంలో గొప్ప బీదా తేడాలూ, చిన్నా పెద్దా తేడాలూ, నల్లవాడూ తెల్లవాడూ అన్న భేదాలు ఉండవు."

"స్త్రీ పురుషుల తేడాలో మంగీ?"

"అదీనూ. స్త్రీలూ పురుషులు పెట్టే యాతనలకి అత్యాచారాలకి గురి అవుతున్నారు. మా దేశంలో భూస్వామ్య విధానపు ఆచారంగా మొన్నమొన్నటి వరకూ సహగమనం పేరుతో ప్రతీ సంవత్సరమూ లక్షలాది స్త్రీలని నిలువునా కాల్చేసేవారు. ఇప్పటికీ మోషాలో మగ్గిపోతూ ఆస్తిహక్కులు లేకుండా స్త్రీలు పురుషులు పెట్టే యాతనలని సహిస్తున్నారు. ఇది మానవత్వానికి తీరని మచ్చ."

"మా దేశంలో స్త్రీలకి మోషా లేదని మేం స్వతంత్రులం అని అనుకుంటున్నావా?"

"లేదు యానీ! మీరూ స్వతంత్రులు కారని తెలుసు. అయితే మీరు మీ భారతీయ సోదరీమణులకన్నా మెరుగ్గా ఉన్నారు. మీ స్థితి వారి కన్నా బాగుంది."

"బానిసత్వంలో మెరుగ్గా ఉండడం, మెరుగ్గా లేకపోవడం ఏమిటి మంగీ! మాకు పార్లమెంటుకి ఓటువేసే హక్కులేదు. పెద్ద పెద్ద విద్యాలయాల్లో శిక్షణ పొందడానికి హక్కులేదు. వాటి గుమ్మం తొక్కే అధికారం లేదు. అరవై గజాల సన్నని కుచ్చుల పరికిణీలు కట్టుకుని నేలని జీరాడించుకుంటూ సీతాకోకచిలుకల్లా మగవాళ్ళని అలరించటానికి మాత్రం పనికివస్తున్నాం. ఆదిసరేలే, అయితే

మార్క్స్ భారతదేశంలో పారిశ్రామీకరణ జరుగుతుందనీ, పెట్టుబడిదారీ విధానం వ్యాపిస్తుందనీ దాంతో ఓ పక్క జనంలో ధైర్య సాహసాలు ఎక్కువవుతాయనీ రెండోపక్క గ్రామాల్లో పని దొరక్క అల్లల్లాడే రైతుల్నీ చేతిపనివాళ్ళనీ ఫ్యాక్టరీ లలో పనులు చెయ్యడానికి సమీకరించడం జరుగుతుందనీ చెప్పాడన్న మాట. దాంతో ఆ పని వాళ్ళంతా తమ కూలీ సంఘాలు ఏర్పరచుకుని అన్యాయాల్ని ఎది రిస్తూ పోరాడ్డం నేర్చుకుంటారని, ఆ తర్వాత సామ్యవాదపు జెండాని ఎత్తి ఇంగ్లాండులోని శ్రామికులతో చెయ్యి చెయ్యి కలిపి మానవ స్వేచ్ఛ కోసం, స్వాతంత్ర్యం కోసం పోరాడతారనీ, ప్రపంచానికి పెట్టుబడిదారుల బానిసత్వం నుండి మోక్షం లభించి స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వం ప్రపంచమంతటా రాజ్యం యేలతాయని చెప్పేడన్నమాట! కాని ఇది ఎన్ని వందల సంవత్సరాలకి సంభవమౌతుందో మంగీ!"

"మార్క్స్ మరోమాట కూడా చెప్పాడు. ఆంగ్లేయులు సైన్సు ఇచ్చిన వరా లని—ఫ్యాక్టరీలని కార్ఖానాలని భారతదేశంలోకి ఇంకా రాకుండా చేసిన సైన్సు ప్రసా దించిన మరో వరాన్ని- యుద్ధ పరికరాలను మాత్రం భారత సైనికులకి అంద చేశారు. ఆ ఆయుధాలను ఉపయోగించటం నేర్పారు. ఈ భారతీయ సైనికులే భారతదేశానికి స్వాతంత్ర్యం సమకూర్చడంలో పెద్ద ఎత్తున సహాయపడతారు."

"ఇది తొందరలోనే జరుగుతుందా?"

"తొందరలో జరగడం కాదు యానీ! ఆ సమయం వచ్చేసింది ! ఫిబ్రవరి ఏడోతారీఖు (1856) వార్తాపత్రికలో చదవలేదూ అవధ్‌ని ఆంగ్లేయుల రాజ్యంలో కలిపేసుకున్నారని?"

"అవును. అన్యాయంగా, అక్రమంగా కలిపేసుకున్నారు. నమ్మకద్రోహం చేశారు."

"నమ్మక ద్రోహం చేశారో న్యాయబద్ధంగా చేశారో అది మనకి అనవసరం. ఆంగ్లేయ వ్యాపారస్థులు తమ స్వార్థం కోసమే అంతా చేశారు. అయితే వాళ్ళకి తెలియకుండా వాళ్ళు మాకు మేలు జరిగే పనులు కూడా చేసిపెట్టారు. గ్రామ పంచా యితీలని రద్దుచేసి విశాలమైన దేశాన్ని మనదిగా చేశారు. రైళ్ళు, ఓడలు, తంతి తపాలాలు ప్రవేశపెట్టి విశాల ప్రపంచంతో మాకు సంబంధ బాంధవ్యాలు కలిగే టట్టు చేశారు. నూతిలో కప్పల్లా ఉన్న మాకు ప్రపంచ జ్ఞానం కలగచేశారు. అవధ్‌ని కలుపుకుని నమ్మక ద్రోహం చెయ్యడం ఓ రకంగా మంచిదే అయింది. అలాంటి నాని కోసమే నేను ఎదురుచూస్తున్నాను యానీ!"

"మార్క్స్ శిష్యుడివి ! నువ్వు ఇలాకాక మరోలా అంటావని ఎలా అను కుంటాను?"

# 2

ప్రశాంతంగా ఉన్న గంగాతీరం అల్లకల్లోలంగా తయారవుతోంది. బిహూర్ రాజ్యానికి వంశపారంపర్యంగా తనకి వచ్చే పీష్వా అధికారమూ నానాకి లేకుండా పోయింది. పెన్షనూ యివ్వమని అన్నారు. దాంతో నానాలో చురుకుతనం పెరిగింది. అతని తాలూకు మనుషులు అతనిలాగే ఆంగ్లేయుల కారణంగా పదవీచ్యుతులై సామంతరాజుల దగ్గరికి పదే పదే పరుగులమీద వెళ్ళి కలుసుకుంటున్నారు. అతని అదృష్టానికనే చెప్పాలి-ఆంగ్లేయులు మరో తప్పుచేశారు. నిజానికి తప్పుకాదది-నిత్యమూ నూతనత్వాన్ని సంతరించుకునే లోకంతో కలిపి అడుగు వెయ్యడానికి వీలైనదే! ఆంగ్లేయులు పూర్వపు తుపాకీలకి బదులుగా మరింత శక్తివంతంగా పేలే తూటాలున్న తుపాకీలని సైనికులకి యిచ్చారు. ఈ తూటాలని పళ్ళతో కొరికి ఉపయోగించాలి. ఆంగ్లేయుల శత్రువులు దీన్ని తమకి మంచి అవకాశంగా భావించారు. ఈ తూటాలని ఆవుకొవ్వూ, పందికొవ్వూ పెట్టి చేశారని, కోరుండీ ఆంగ్లేయులు ఈ తూటాలని సిపాయిలకి యిచ్చి వాళ్ళు ఆ కొవ్వు తూటాలని కొరికే పరిస్థితిని కలుగచేస్తున్నారనీ, దీంతో హిందూ దేశంలోని హిందూ మతమూ, ముస్లిము మతమూ నాశనం అయిపోతున్నాయనీ, అంతమందీ కిరస్తానీవాళ్ళు అయిపోతున్నారనీ గోలా గగ్గోలూ ప్రారంభించారు.

కాశీరాజు చేత్‌సింహ్ మనుమడు మంగళసింహుడని తన పేరు చెప్తే చాలు సైనికులు ఉత్తేజితులవుతారు. బాగా పని జరుగుతుంది అన్న విషయం మంగళసింహుడికి తెలుసు. అయినా ఈ రహస్యాన్ని రహస్యంగా ఉంచాడు. నానాకీ, మిగిలిన తిరుగుబాటు నాయకులకి అతడు ఆంగ్లేయుల పరిపాలనకి పరమ శత్రువనీ, విదేశాలకి వెళ్ళి ఇంగ్లీషు చదువులు బాగా చదువుకుని వచ్చాడనీ, ఇంగ్లీషువారి రాజకీయాలు క్షుణ్ణంగా అతనికి తెలుసుననీ తెలుసును. విదేశాల్లో ఉండడం నుంచి అతడు మతం పోగొట్టుకున్నాడనీ అయినా క్రైస్తవ మతాన్ని అతడు ఒప్పుకోడనీ వాళ్ళు ఎరుగుదురు.

తిరుగుబాటు నాయకుల మనోభావాల్ని మంగళసింహుడు సుళువుగానే ఆకళించుకున్నాడు. పదవీచ్యుతులైన సామంతరాజు లందరూ తమ తమ అధికారాలని తిరిగి సంపాదించుకోవాలని అనుకుంటున్నారనీ, అందుకు అందరికీ ఉమ్మడి శత్రువులైన ఆంగ్లేయుల్ని తామంతా ఏకమై దేశం నుంచి పారదోలాలని కోరుకుంటున్నారనీ మంగళ సింహుడు తెలుసుకున్నాడు. వాళ్ళ కోసం ప్రాణాలు అర్పించే సిపాయిలు వాళ్ళ దృష్టిలో చదరంగపు పావుల్లాంటివాళ్ళు. సిపాయిలు తమ మతం పోతోందన్న భావంతో ఉత్తేజితులయ్యారు. ఒకవేళ తూటాలకున్న కొవ్వుని నోటితో కొరక నక్కరలేకుండా ఉపయోగించే అవకాశం కాని కలిగించి ఉంటే ఆ సిపాయిలు కంపెనీ బహద్దరు వారికి జేజేలు కొడుతూ కంపెనీ బహద్దరు వారి కోసం తమ

ప్రాణాలని ఏనాటికీ అర్పిస్తూనే ఉండి ఉండేవారు. హిందూ, ముస్లిముల మధ్య ఉన్న అఖాతం ఆఖాతంలాగే ఉంది. ఓ వేళ తిరుగుబాటు కాని విజయవంతం అయిందా, మతం పేరుతో ఉసికొల్పగా లేచి నిరక్షరులూ, మూఢులూ అయిన సిపాయిలు తమ అల్లా కోసమో లేదూ అంటే తమ భగవంతుడి కోసమో మరింత మూఢనమ్మకంతో ఆ భేదాల్ని ఇంకా పెంచడానికి ప్రయత్నిస్తారు. సిపాయిలకి గ్రామాల్ని, పట్టణాల్ని కొల్లగొట్టుకోవచ్చునన్న భావమూ ఉంది. అయితే ఇలాంటి భావం ఉన్న సిపాయిల సంఖ్య తక్కువ. చాలా తక్కువ చోట్లే వాళ్ళు కొల్లగొట్టుకున్నారు. అయినా సరే దాన్నించి గగ్గోలూ గోలా ఎక్కువే అయింది. గ్రామాల్లో ఉన్న జనం సిపాయీలంటే చాలు దోపిడీదారులని అనుకుని భయపడ్డం మొదలు పెట్టారు. దాస్యశృంఖలాలనుంచి దేశానికి విముక్తి కలిగించే సైన్యంపట్ల ఇలాంటి భావం కలగడం మంచిది కాదు. ఈ విషయాలన్నీ ఆకళించుకున్నప్పుడు మొదట్లో మంగళసింహుడికి నిరాశే కలిగింది. అతడు చేత్‌సింహుడి సింహాసనాన్ని తన హస్తగతం చేసుకుందామన్న ఉద్దేశంతో పోరాడ్డానికి రాలేదు. స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వం వెల్లివిరిసే పరిపాలనని స్థాపించాలని వచ్చాడు. ఆ పరిపాలనలో జాతి భేదాలూ, హిందూ-ముస్లిము విభేదాలూ అవాంఛనీయాలు. ఆంగ్లేయ పెట్టుబడిదారుల పరిపాలన ఎంత అవాంఛనీయమో అవీ అంత అవాంఛనీయాలే. "నూతిలో కప్పతనాన్ని"-అజ్ఞానాన్ని కాపాడ్డానికి అతడు ఇక్కడికి రాలేదు. భారతదేశంలో శతాబ్దాల తరబడి పెరిగిన అడ్డుగోడల్ని పగలగొట్టి ప్రపంచంలో దానిని ఓ భాగంగా చేద్దామన్న ఉద్దేశంతో వచ్చాడు. ఇంగ్లీషు పెట్టుబడిదారీ ప్రభుత్వ దోపిడీని, పరిపాలనని అంతమొందించి భారతదేశపు ప్రజలకి స్వాతంత్ర్యం వచ్చేటట్టు చేసి, ప్రపంచంలోని ఇతర దేశాల ప్రజలతో కలసి సౌభ్రాతృత్వంతో ఓ మంచి ప్రపంచాన్ని నిర్మించటంలో వాళ్ళని భాగస్వాములయేటట్టు చెయ్యాలని వచ్చాడు. తూటాలకి ఉన్నది పందికొవ్వూ, ఆవుకొవ్వూ అన్న అబద్ధపు ప్రచారాలన్నా అతనికి ఇష్టంలేదు. ఆ ప్రచారాల వల్ల భారతదేశంలో మతం మరింత దృఢంగా వేరూనడాన్నీ అతడు ఇష్టపడలేదు. నానా, తదితర తిరుగుబాటు నాయకులూ శ్రేష్ఠాతిశ్రేష్ఠమైన విదేశీ మద్యాలని సేవిస్తూ, అవకాశం దొరికితే, పంది మాంసము భక్షించీ సారా సేవించీ వచ్చిన తెల్లదొరసానుల ఎంగిలి పెదిమలు ముద్దాడ్డానికి సిద్ధపడుతూ ఉంటారు. కాని వాళ్ళే ఇప్పుడు మతాన్ని సంరక్షించటానికి సిపాయిలకి నాయకత్వం వహించాలని అనుకుంటున్నారు.

అయితే ఈ లోపాలన్నిటితోపాటు మంగళసింహుడు ఓ విషయం గురించి ఆలోచించాడు. అందుకనే తన కర్తవ్యమేమిటో నిర్ణయించుకోడానికి అతనికి ఆట్టే సమయం పట్టలేదు.

భారతదేశం ఇంగ్లీషు పెట్టుబడిదారీ పరిపాలనక్రిందా, సామంతరాజుల కిందా-రెండు విధాల దాస్యంలో మగ్గిపోతోంది. ఈ రెండింటిలో ఇంగ్లీషు పరిపాలన అన్నిటికన్నా దృఢమైనదీ, కపటమూ, మోసముతో కూడినదీను. దానిని కాని తొలగించినట్ల

యితే భారతదేశపు ప్రజలు స్వదేశీ సామంతులు పెట్టే బాధలే భరించవలసి ఉంటుంది. అది కొంతలో కొంత తేలికైనదే అవుతుంది.

జనవరి నెల. రాత్రిళ్ళు చలి విపరీతంగా ఉంది. లండను రాత్రుళ్ళతో పోల్చి చూస్తే ఈ చలి చలికిందే లెక్కకిరాదు. నిజమే. బిఠూర్ రాజమహలు నిశ్శబ్దంగా ఉంది. అయితే పీష్వా మహలులోని దర్వానులు తమ తమ జాగాల్లో ఏమరక ఉన్నారు. యజమానితోపాటు ఎవరో ఓ అగంతకుడు మహలులోకి వెళ్ళడాన్ని వాళ్ళు చూశారు. అయితే ఈ మధ్య ఇలాంటి అగంతకులు ప్రతీ రోజూ రాత్రి వేళప్పుడు మహలులోకి వస్తూనే ఉన్నారు. వాళ్ళు చూస్తూనే ఉన్నారు.

మంగళసింహుడు నానాని కలుసుకోవడం ఇది మొదటిసారి కాదు. వాళ్ళిద్దరూ ఒకరి నొకరు బాగా ఎరుగుదురు. మంగళసింహుడు అక్కడ ఉన్నవారిని చూశాడు. పెన్షను పుచ్చుకుంటున్న ఢిల్లీ పాదుషా, అవధ్ నవాబు, జగదీశ్‌పుర్ కువర్ సింహుడూ, ఇంకా ఇతర సామంతుల దూతలూ ఉన్నారు. బైరక్‌పూర్ (కలకత్తా), దానాపూర్, కాన్పూర్, లక్నో, ఆగ్రా, మీరట్ మొదలైన సైనిక శిబిరాల్లోని సిపాయిల్లో తిరుగుబాటు భావం ఎంత గట్టిగా ఉందో వాళ్ళు చెప్పారు. ఇంత పెద్ద బలాన్ని ఎదుర్కోడానికి ఈ సామంతుల దగ్గర తమ స్వంత బలం ఏంలేదు. కేవలం తిరుగుబాటు చేసిన సైనిక పటాలాల మీదే అంత ఆశా పెట్టుకున్నారు. ఆశ్చర్యంగా ఉంది! ఇంచుమించు ఇక్కడున్న నాయకులందరికీ సైనిక సంచాలనం గురించీ ఏమీ తెలీదు. అయినా ప్రతి ఒక్కరూ 'జనరల్' పదవిని చేపట్టడానికి సిద్ధపడుతున్నారు. నానా ఎంతో ఆశాపూరితంగా అన్నాడు—

"భారతదేశంలో ఇంగ్లీషువాళ్ళ రాజ్యం హిందూస్థానీ సైనిక పటాలాల మీద ఆధారపడి ఉంది. ఇప్పుడు ఆ పటాలాలు మనతో కలుస్తున్నాయి!"

"కాని హిందూ పటాలాలన్నీ మనవేపుకి రావటం లేదు నానాసాబ్! పంజాబీ సిక్ఖులు ఇటు చేరుతున్నారో లేదో ఇంకా మనకి కబురు రాలేదు. పైగా హిందూస్థానంలోని మిగిలిన పటాలాలన్నీ కలసి ఇంగ్లీషు వారి తరపున పోరాడి వాళ్ళు పంజాబుని ఓడించిన సంగతిని గుర్తుచేసుకుని పంజాబీలు దానికి ప్రతీకారం తీర్చుకోవాలని అనుకుంటారు. ఇంగ్లీషువారు చాలా చతురులు నానాసాబ్! పీష్వానీ, అవధ్‌నవాబునీ బంధించినట్టుగా వాళ్ళు దలీప్ సింహుణ్ణి భారతదేశంలో ఖైదుచేసి ఉన్నట్లయితే ఈ రోజు సిఖ్ఖు పటాలాన్ని యావత్తునీ మనవేపు కలుపుకోడం ఎంతో తేలిక అయి ఉండేది. ఇప్పుడు మనం జ్ఞాపకం ఉంచుకోవలసినది సిఖ్ఖులు మనతో సహకరించరు. నేపాలు తదితర సంస్థానాల పటాలాలూ మనతో సహకరించవు. దేశం కోసం చేసే యుద్ధంలో మనతోపాటు లేనివాళ్ళని మనం మన శత్రువులుగా పరిగణించాలి."

"మీరన్నది నిజమే ఠాకూర్‌సాబ్!" నానా అన్నాడు. "అయితే ప్రారంభం

లోనే మనకి జయంకాని లభించిందా ఇంక ఏ దేశద్రోహికి మనకి విరుద్ధంగా పని చెయ్యడానికి ధైర్యం చాలదు."

"ఇంకో ఏర్పాటు మనం చేసుకోవాలి. యుద్ధం మొదలైన తర్వాత చెయ్యాలి. కాని దానికోసం ఇప్పట్నించీ మనుషుల్ని సంసిద్ధ పరచాలి. మనం దేశానికి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు తెచ్చే సైనికులమని ప్రజలకి తెలియచెయ్యాలి."

"ఇంగ్లీషు వారితో పోరుకి తలపడితే చాలదా?" అన్నాడు తూర్పు నుంచి వచ్చిన ప్రతినిధి.

"ప్రతీచోటా ఇరవైనాలుగ్గంటలూ యుద్ధం జరగదు కదా! మనదేశంలో చాలా మంది పిరికివాళ్ళూ స్వార్థపరులూ ఉన్నారు. ఇంగ్లీషువాళ్ళు అజేయులని వాళ్ళ నమ్మకం. వాళ్ళు ఉన్నవీ లేనివీ కల్పించి పుకారులు పుట్టిస్తారు. తూర్పు ప్రాంతం, పడమర ప్రాంతం, మధ్య ప్రాంతం అని మూడు భాగాలుగా విభజించి హిందీలోనూ ఉర్దూలోనూ మనం మూడు వార్తాపత్రికలని ప్రచురించాలి," అన్నాడు మంగళ సింహుడు.

"ఇంగ్లీషువాళ్ళ పద్ధతులంటే మీకు ఎక్కువ ఇష్టం ఠాకూర్‌సాబ్! కాని వార్తా పత్రికలు లేకుండా మేం తూటాలమాటతో ఎంతగా ప్రచారం చేసి ప్రజలని సన్నద్ధం చేశామో చూశారా?" అన్నాడు నానాసాబ్.

"కాని యుద్ధం జరుగుతున్నప్పుడు ఇంగ్లీషువారి నౌకర్లూ తాబేదార్లూ మనకి వ్యతిరేకంగా పుట్టించే పుకార్లని అరికట్టడానికి మనం ఏమన్నా చెయ్యాలి నానాసాబ్! ఇంగ్లీషువారి చేతిలోని రాజ్యాధికారాన్ని యావత్తునీ ఒక్కరోజులో మన చేతిలోకి తీసుకోవడం అన్నది సంభవం కాదు. వాళ్ళు ఓ వేళ ఇలా పుకారు లేవతీసేరను కోండి—'తిరుగుబాటుచేసిన పటాలాలు'-మనవి. వాళ్ళు అలాగే అంటారు అది గుర్తుంచు కోండి- 'గ్రామాల్నీ పట్నాలనీ కొల్లగొడ్తూ పిల్లాపాపనీ చంపేస్తూ దోచుకుంటూ ముందుకు వస్తున్నాయి' అని పుకారు అనుకోండి. అప్పుడు?"

"జనం నమ్ముతారా?" అడిగాడు నానాసాబ్.

"పదే పదే ఒకే మాటని చెప్పినట్లయితే ఆ మాటని ఖండిస్తూ మాట్లాడేవాడు ఎవడూ లేకపోయినట్లైతే దాన్ని జనం నమ్ముతారు. అదే నిజం అనుకుంటారు" అన్నాడు మంగళసింహుడు.

"తూటాల గురించి చెప్పి ఇంగ్లీషువాళ్ళు మత వినాశకులని ఇంతలా ప్రచారం చేసి ఇంగ్లీషువాళ్ళని అపకీర్తిపాలు చేశాం. వాళ్ళమాట జనంలో ఇహ చెల్ల దని నేను అనుకుంటున్నాను" అన్నాడు నానాసాబ్.

"మీరు చేసిన ప్రచారం ఎల్లప్పుడూ చాలదు. మరో సంగతి. మన ఈ యుద్ధాన్ని ఇంగ్లీషువాళ్ళు 'తిరుగుబాటు' అంటూ ప్రపంచంలో ప్రచారం చేస్తారు. కాని మన దేశా నికి స్వాతంత్ర్యంరావాలని కోరుతున్న వాళ్ళు మన మిత్రులూ, ఇంగ్లీషువారి శత్రువులూ చాలామంది ప్రపంచంలో ఉన్నారు.ముఖ్యంగా యూరోపియను జాతుల్లో అలాంటివారు

చాలామంది ఉన్నారు. అంచేత మనం ఈ యుద్ధాన్ని యూరోపియన్లకి వ్యతిరేకంగా చేస్తున్న ధర్మయుద్ధంగా చెప్పకూడదు. యుద్ధం చేసే ఇంగ్లీషువారి పిల్లల్నీ వృద్ధుల్నీ స్త్రీలనీ హింసించకూడదు. అలాగ్గాని చెయ్యకపోతే మనకి లాభం ఉండదు. సరికదా ప్రపంచంలో ఉట్టి పుణ్యానికి హిందూస్థానీయులు అపకీర్తి పాలవుతారు!" అన్నాడు మంగళ సింహుడు.

"ఇది సేనాపతులు ఆలోచించాల్సిన విషయం. ఎప్పుడు ఏమిటి చెయ్యాలో వాళ్ళు స్వయంగా నిర్ణయించుకోగలరని నేను అనుకుంటున్నాను." అన్నాడు నానా.

"నేను చెప్పే చివరి మాటకూడా వినండి. ఈ యుద్ధంలో ప్రాణాలకి తెగించి పోరాడ్డానికి సిపాయిలు సిద్ధమౌతున్నారు. మనం సామాన్య ప్రజానీకం నుంచి కూడా ఈ యుద్ధానికి సాయం పొందాలని ఆశిస్తున్నాం. అలాంటి యుద్ధం కేవలం కొవ్వుతో చేసిన తూటాల తగాదా కారణంగానే జరగకూడదు. ఇంగ్లీషు వారిని తరిమికొట్టి మనం రాజ్యం ఎలా పాలిస్తామో, ఆ రాజ్యంలో యుద్ధం చెయ్యటాని కొచ్చిన సిపాయిలకీ, రైతులకీ ఎలాంటి లాభం చేకూరుతుందో మనం ప్రజలకి చెప్పాలి," అన్నాడు మంగళసింహుడు.

"మన వినాశకుల పరిపాలనని అంతమొనరిస్తే చాలదా? ప్రజలు సంతోషించరూ?" అన్నాడు నానా.

"ఇదే ప్రశ్న మిమ్మల్ని అడిగితే మీరేం జవాబు చెప్తారు? పీష్వా రాజధాని పూనా అవాలని మీరు మీ మనస్సులో కోరుకోవటం లేదా? నవాబుగారికి లక్నో సింహాసనం కావాలని లేదా? తూటాలని ఇంగ్లీషువారి పరిపాలననీ తొలగించటమే కాక మీకు ఇంకా పెద్ద పెద్ద కోరికలు ఉంటె వాటికోసం ప్రాణాలకి తెగించి పోరుతున్నారు. అలాంటప్పుడు మనం సామాన్య ప్రజానీకానికి కూడా వారు పొందే లాభాల గురించి చెప్పడం మంచిదని నేను భావిస్తున్నాను," అన్నాడు మంగళసింహుడు.

"ఉదాహరణకి?"

"మేం ప్రతి గ్రామంలోనూ పంచాయితీలని ఏర్పరుస్తాం. తక్కువ ఖర్చుతో యెక్కువ న్యాయం ఆ పంచాయితీల్లో మీకు దొరుకుతుంది. మేం యావత్ దేశాన్ని ఓ పంచాయితీగా చేస్తాం. ఆ పంచాయితీని గ్రామాల్లోని జనం ఎన్నుకుంటారు. ఆ పంచాయితీ ఆదేశాన్ని పాదుషా కూడా శిరసావహించాలి. జమిందారీ విధానాన్ని మేం ఎత్తేస్తాం. రైతుకీ, ప్రభుత్వానికి మధ్య మరో యజమాని ఎవడూ ఉండడు- జాగీరు ఉన్నవాడికి కేవలం ప్రభుత్వానికి చెల్లించే పన్నుని మాత్రం పొందే హక్కు ఉంటుంది. మేం మిల్లులూ, ఫాక్టరీలు పెట్టి మనం దేశంలోని కార్మికులందరికి పనులు కల్పిస్తాం. నిరుద్యోగి అన్నవాడెవడూ ఉండకుండా చూస్తాం. కాలవలూ, చెరువులూ తవ్వి, ఆనకట్టలు కట్టి నీటిపారుదల సౌకర్యాలు కలిగిస్తాం. దాంతో కోట్లకొద్దీ కూలీలకి పని దొరుకుతుంది. దేశంలో పంట ఎన్నోరెట్లు అధికంగా

పండుతుంది. రైతులకి కొత్తపొలాలు ఎన్నెన్నో దొరుకుతాయి అని చెప్పాలి" అన్నాడు మంగళసింహుడు.

మంగళసింహుడు చెప్పిన మాటలకి ఎవరూ అంతగా ప్రాముఖ్యం ఇవ్వలేదు. ఇవన్నీ అధికారం-చేతికొచ్చాక చూసుకోవలసిన విషయాలు అని మాట తప్పిం చేశారు.

మంచంమీద పడుకున్న చాలా సేపటి వరకూ మంగళసింహుడికి నిద్రరాలేదు. ఆలోచనలో పడ్డాడు. ఇది సైన్సు యుగం. రైళ్ళు, తంతి తపాలాలు, ఓడలు-వీటన్నిటి విచిత్రాలు వీళ్ళు చూస్తూనే ఉన్నారు. అగ్గిపెట్టెలు, ఫోటోగ్రాఫీ, విద్యుద్దీపాల కాంతి- ఇన్ని కొత్తలతో కొత్తయుగంలోకి అడుగు పెడుతున్నాం. అయినా వీళ్ళు పాతకాలపు ఆలోచనల్లోనే ఉన్నారు. పాత కలలనే కంటున్నారు. అయితే ఇంత కటికచీకటిలోనూ ఓ విషయం మాత్రం అతి స్పష్టంగా అనుతోంది. ఈ యుద్ధాన్ని కేవలం ప్రజాబలం వల్లే జయించటం జరుగుతుంది. ఆ విజయం వల్ల ప్రజలకి వాళ్ళకున్న శక్తి ఏమిటో తెలుస్తుంది. విదేశాల్లో పెట్టుబడిదారులు తమ దేశాల్లోని శ్రామిక శక్తి సాయంతో తమ పోటీదార్లని అధికారంలోంచి తొలగించి తమకు సాయం చేసిన శ్రామికులను ఎలా త్యజించారో అల్లాగ్గానే భారతదేశంలోని సామంతులందరూ భారతీయ ప్రజలని- సిపాయిలని, రైతులని ఉపయోగించుకుని తమపని అయ్యేక నమ్మక ద్రోహంచేస్తే చెయ్యొచ్చుకాక కాని ప్రజలకు కలిగిన ఆత్మ విశ్వాసాన్ని మాత్రం వాళ్ళు సడలించలేరు. బైటి శత్రువుల నుండి తమను తాము కాపాడుకోడానికి సైన్సు ప్రసాదించిన కొత్త కొత్త వస్తువులని స్వీకరిస్తే అడ్డూ పడలేరు. రైలు పట్టాలు, టెలిగ్రాపు స్తంభాలూ, కలకత్తాలో తయారయ్యే ఆవిరి స్టీమర్లూ ఇహ భారతదేశాన్ని వదలవు. ఈ ఛాందస సామంతులమీద కాదు మంగళసింహుడు విశ్వాసం ఉంచినది—ప్రపంచంలో పరివర్తనం చెందే మానవ శక్తి మీద! ప్రజల మీద!!

# 3

మే పదవ తారీఖున (1857వ సంవత్సరం) మంగళసింహుడు మీరట్‌కి దగ్గరగా ఉన్నాడు. సిపాయిలు అక్కడ తిరుగుబాటు జెండాని ఎగరేశారు. మంగళసింహుడు బహాదూర్‌షాకి ప్రతినిధిగా ఓ చిన్న పటాలానికి అధికారి అయ్యాడు. సామంత నాయకులకి మంగళసింహుడి యోగ్యతా దక్షతా తెలుసును. అయితే అతని ఉద్దేశము తమ ఉద్దేశానికి బొత్తిగా విరుద్ధమైనదని కూడా వాళ్ళు ఎరుగుదురు. అంచేత మంగళసింహుణ్ణి డిల్లీ వేపు పంపకుండా తూర్పుదిశగా పంపారు. మీరట్ నుంచి తూర్పుదిశగానూ పడమర దిశగానూ చీలిన ఈ దారులు భారతదేశంలో స్వాతంత్ర్య సంగ్రామపు అదృష్టాన్ని తూర్పు పడమరలుగా చీల్చి వెయ్యలేదని

ఏవరు చెప్పగలరు? ఢిల్లీవేపు వెళ్ళే సైన్యానికి మంగళసింహుడిలాంటి నాయకుడు కావాలి. ఢిల్లీని పూర్తిగా జయించటానికి దాని గౌరవ ప్రతిష్ఠలని ఎలా వినియోగిం చుకోవాలో అతనిలాంటి వానికే తెలుస్తుంది.

మంగళసింహుడి సైనికదళంలో వెయ్యిమంది సిపాయిలు ఉన్నారు. తిరుగు బాటు మొదలైన రోజునుంచీ ఎవరికివారు తామే (జనరల్) సేనాధిపతులమని అను కోడం మొదలుపెట్టారు. కేవలం సేనాధిపతులే ఉన్నా సైన్యం ఎప్పటికీ గెలవ లేదన్న విషయం తెలుసుకోడానికి మంగళసింహుడికి ఓ వారం పట్టింది. సైన్యంలో మంగళసింహుణ్ణి వదిలేస్తే యుద్ధకౌశలం తెలిసినవాడు మరొకడు ఎవడూ లేడు. తిరుగుబాటు చేసిన సైన్యాలన్నిటికీ ఈ మాట వర్తిస్తుంది. ఓ చోట స్థిరంగా ఉండి శిక్షణ యివ్వడానికి మంగళసింహుడికి అవకాశం చిక్కలేదు. సాధ్యమైనంత తొంద రగా వీలైనన్ని ఎక్కువ జిల్లాలలో ఇంగ్లీషువారి శక్తిని మట్టు పెట్టాలి. అదీ ఆ సమయంలో చెయ్యవలసినది.

గంగదాటి రుహేల్‌ఖండ్ ప్రవేశించిన వెంటనే ప్రతీరాత్రీ మంగళసింహుడు తన రాజకీయ లక్ష్యాన్ని సిపాయిలకి చెప్పడం తన నియమంగా పెట్టుకున్నాడు. సిపాయిలు అర్థం చేసుకోడానికి సమయం పట్టేది. వాళ్ళకి ఎన్నెన్నో సందేహాలు కలిగేవి. మంగళసింహుడు వాళ్ళ సందేహాలన్నిటినీ తీర్చాడు. ఫ్రాన్సులో జరిగిన రెండు విప్లవాల చరిత్రని (1792, 1848) వారికి చెప్పాడు. వేల్సులోని ఇంగ్లీషు కూలీజనం హిందూదేశాన్ని పాలిస్తున్న ఈ ఇంగ్లీషు వర్తకులకి వ్యతిరేకంగా ఎలా కత్తిదూశారో ఎంత వీరోచితంగా పోరాడారో కూడా చెప్పాడు. తమ సంఖ్యాబలం వల్ల సాహుకార్లు వాళ్ళని అణిచి వెయ్యగలిగారు. కాని వాళ్ళు గెలుచుకున్న హక్కుల్ని మాత్రం లాక్కోలేకపోయారు అని చెప్పాడు.

విషయాలన్నిటిని ఆకళించుకుని సరియైన అవగాహనతో యుద్ధం చేసే ఈ సిపాయిల నడవడి పూర్తిగా మారిపోయింది. ప్రతి సిపాయీ స్వాతంత్ర్య సంగ్రా మపు మిషనరీగా మారిపోయాడు. పల్లెల్లో, పట్నాల్లో కస్బాల్లో వాళ్ళు తమ మాట లతో, తమ ప్రవర్తనతో ప్రజల విశ్వాసాన్ని చూరగొన్నారు. గౌరవాన్ని సంపా దించుకున్నారు. ఇంగ్లీషువారి ఖజానాల్లో దొరికిన ధనాన్ని పైసా పైసా జాగ్రత్తగా ఖర్చుచెయ్యడం, అవసరం అయితే ప్రజల నుంచి పన్నులు వసూలు చెయ్యడం, ఆయా ఊళ్ళలో స్థానికంగా పంచాయితీలని ఏర్పరచటం, పంచాయితీలకీ ప్రజలకీ విషయాలని బోధపర్చడం, మంగళసింహుడు చెప్పినట్టు ఏ వస్తువునీ వెల ఇవ్వ కుండా ఎవరి దగ్గరా తీసుకోకపోవడం-ప్రతీచోటా వేలకొద్దీ గుమిగూడిన జనానికి మంగళసింహుడు అన్ని విషయాలని బోధపర్చి చెప్పడం—వీటన్నిటి ప్రభావం చాలా తొందరగా అంతటా ప్రసరించింది. యువకులు గుంపులు గుంపులుగా స్వతంత్ర వాహినిలో చేరటానికి రాసాగారు. మంగళసింహుడు సైనికులచేత కవాతూ పెరేడూ చేయించడమేకాక, గూఢచారులుగా పనిచెయ్యడానికి, సైన్యానికి కావల్సిన ఆహారము

మొదలైన సామాగ్రిని ఏర్పాటు చెయ్యడానికి ఉపయోగించే శిక్షణని కూడా వారికి ఇచ్చాడు. వైద్యవిభాగాన్ని కూడా ఓ దళంగా చేర్చుకున్నాడు. భూస్వామ్య విధానపు దోపిడీలని, లంచగొండితనాన్ని నివారించటానికి చదువుకున్న వారికి దేశభక్తి అనే గట్టి డోసు యివ్వాల్సిందే. ఆ సమయంలో అలాంటి డోసు ఇవ్వడం అంత తేలిక కాదు. అయినా మంగళసింహుడి సాంగత్యంలో రెండు రోజులు గడిపిన ప్రతీవాడూ మారిపోయేవాడు. అతని ప్రభావం పడేది. సిపాయిలతో నవ్వుతూ మాట్లాడుతూ తిరిగే మంగళసింహుణ్ణి చూసినవారెవరూ అతడు ఇంత పెద్ద సైన్యానికి జనరల్ అని అనుకోరు. మంగళసింహుడి సేన రెండు వేలకి పెరిగిపోయింది. పటాలంలోని ప్రతి జవానూ అతని కనుసన్నలకి తన ప్రాణాన్ని అర్పించటానికి సిద్ధంగా ఉండేవాడు. మంగళసింహుడు సిపాయిలు వండుకునే వంటనే- వాళ్ళు తినే రొట్టెల్నే ఎప్పుడూ తినేవాడు. వాళ్ళలాగే కంబళి పరుచుకొని పడుకునేవాడు. ప్రమాద స్థలాల్లో అందరికన్నా తనే ముందర ఉండేవాడు. ఖైదీలుగా పట్టుబడ్డ ఇంగ్లీషు స్త్రీలనీ పురుషులనీ ఎంతో జాగ్రత్తగా చూసేవాడు. వారికి ఏ ఇబ్బంది కలగకుండా ఉంచేవాడు. ఈ సేనాధిపతి సజ్జనత్వాన్ని చూసి వాళ్ళు ఆశ్చర్యపోయేవారు. ఆ రోజుల్లో యూరపులో కూడా ఖైదీలపట్ల ఇంత బాగా ప్రవర్తించేవాడు కాడు. మంగళసింహుడు రుహేల్ ఖండంలోని నాలుగు జిల్లాలకీ వెళ్ళాడు. అన్ని చోట్లా చక్కటి ఏర్పాట్లు చేశాడు.

నానాసాహెబ్ జూన్ ఐదవ తారీఖున (1858 వ సంవత్సరం) ఆంగ్లేయులకి విరుద్ధంగా కత్తిపట్టాడు. నెలాపదిహేను రోజులైనా గడిచీ గడవక మునుపే జూలై పద్దెనిమిదవ తారీఖునే ఇంగ్లీషువాళ్ళ చేతిలో ఓడిపోయాడు. గాలివాటం ఎటు ఉన్నదో అర్థం చేసుకోడానికి మంగళసింహుడికి అట్టే సమయం పట్టలేదు. అయినాసరే అతడు స్వాతంత్ర్య పతాకాన్ని తాను బతికి ఉండగా అవనతం కానివ్వలేదు. ఇంగ్లీషువారి పటాలాలు అవధ్‌లో నిరాయుధులైన ప్రజలని చిన్నా పెద్ద అని చూడకుండా నరికి చంపటం మొదలుపెట్టాయి. స్త్రీల మాన ప్రాణాలని కాళ్ళ రాశాయి. ఇదంతా విన్నప్పటికీ మంగళసింహుడూ అతని సహచరులూ తాము ఖైదు చేసిన ఏ ఇంగ్లీషు వాడినీ బాధించలేదు.

వర్షాకాలం అయిపోయేసరికి అన్ని చోట్లా తిరుగుబాటుదార్లు వీగిపోయారు. కాని రుహేల్ ఖండంలోనూ, అవధ్ పశ్చిమాన్నీ మంగళసింహుడు తన పట్టు సడలనివ్వకుండా నిలిచి ఉన్నాడు. నాలుగు పక్కల నుండి ఇంగ్లీషు సేనలూ, గూర్ఖా సిపాయిలూ, సిక్కు సైనికులూ అతణ్ణి ముట్టడిస్తూనే ఉన్నారు. స్వాతంత్ర్య వాహినిలోని సైనికుల సంఖ్య రోజు రోజుకీ తగ్గిపోతోంది. భవిష్యత్తు ఆశాజనకంగా లేదని నచ్చచెప్పి మంగళసింహుడు వారిలో చాలా మందిని ఇళ్ళకి పంపించివేశాడు. అయితే మీరత్ నుంచి అతనితోపాటు బయల్దేరి వచ్చిన వెయ్యిమంది సిపాయిల్లోనూ ఏ ఒక్కడూ అతనిని వదిలి వెళ్ళిపోవడానికి అంగీకరించలేదు. చివరికి అతడికి

కనిపించిన దృశ్యం వల్ల మంగళసింహుడికి మృత్యువు కూడా ఆనందదాయకంగా తోచింది. చనిపోవటానికి సంసిద్ధతతో ఉన్న ఆ చిన్న సైనికదళంలో బ్రాహ్మణులూ, రాజపుత్రులూ, జాట్‌లూ, గూజర్‌లూ, హిందువులు, ముస్లిములూ అన్న తేడాలు లేకుండా పోతున్నాయి. అంత మందీ కలిసి రొట్టెలు చేసుకునేవారు. కలిసి తినే వారు. ఈ మాదిరిగా వాళ్ళు హిందూదేశం యావత్తునీ ఒకటిగా కలిపే సమగ్ర జాతీయతా భావపు ఉదాహరణగా కనబడ్డారు.

బిందాసింహా, దేవరామ్, సదాఫల్‌పాండే, రహీమ్‌ఖాన్, గులాంహుస్సేన్ – మీరత్‌కి చెందిన ఈ ఐదుగురు సిపాయిలు మంగళసింహుడితోపాటు చివరివరకూ ఉన్నారు. చివరికి గంగానదిలో నావమీద వెళ్తూ ఉంటే రెండు వేపుల నుంచీఇంగ్లీషు వారు ముట్టడించారు. మంగళసింహుడు ఖైదు చేసిన ఇంగ్లీషు స్త్రీ పురుషులు ప్రార్థించడంతో ఇంగ్లీషు జనరల్ క్షమించామని ప్రకటించాడు. మంగళసింహుణ్ణి లొంగిపొమ్మని ఎంతగానో కోరాడు. కాని మంగళసింహుడు దానికి ససేమిరా ఒప్పుకోలేదు. ఆ రోజున కూడా అతనిని లొంగిపొమ్మని అడిగారు. దానికి అతడు తుపాకిగుళ్ళు పేల్చి సమాధానం చెప్పాడు. చివరికి గంగానదిలో ఆరు శవాలతో పడవ పోతూ ఉండగా దానిని ఇంగ్లీషు వారు పట్టుకున్నారు. ఇంగ్లీషువారు అప్పుడు భారతీయుల వీరత్వాన్ని, శౌర్యాన్నీ ఎంతో శ్లాఘించారు.

# సఫ్దర్

కాలం : క్రీ. శ. 1922

అదో అందమైన చిన్న బంగళా. దాని ఆతాలో ఓ పక్కని గులాబీ మొక్కలు. ఎర్రగులాబీలు తెల్లగులాబీలు పూసివున్నాయి. ఇంకోపక్కన బాడ్ మెంటన్ ఆడుకోడానికో చిన్న జాగా, ఆ బాడ్మెంటన్ కోర్టు పచ్చని గరికతో నిండి ఉంది. దాని మీద నడిచినా ఆనందంగానే ఉంటుంది. మూడో వేపున లతా మండపం. నాలుగోవేపున బంగళాకి వెనకపక్కగాఓ పెద్ద అరుగు. సాయంత్రం వేళల్లో బారిస్టరు సఫ్దర్జంగ్ ఆ అరుగుమీద కూర్చుంటూ ఉంటారు.

బంగళా బైటగోడలకి పచ్చటి లత అల్లుకుని ఉన్నది. ఆక్స్ఫర్డ్లో అలాంటి లతలు అల్లుకున్న ఇళ్ళనెన్నిటినో సఫ్దర్సాహెబు చూశారు. ప్రత్యేకించి ఈ లతలని తెప్పించి అందుకే వేయించారు. బంగళా ఆతాలో రెండు మోటారు కారులు పెట్టేందుకు 'గేరేజీ' ఉంది. సఫ్దర్ జంగ్ జీవించే విధానం, నడవడి ఆయన బంగళా వాతావరణం, అంతా ఇంగ్లీషు పద్ధతే! ఆయనదగ్గర పనిచేస్తున్న అరడజను నౌకర్లు ఏ ఇంగ్లీషు ఆఫీసరుగారి నౌకర్లలాగానో, అదే పద్ధతులతో, మర్యాదలతో, నడవడికతో ఉంటారు. వాళ్ళ నడుముకి ఎర్రటి పటకా, తలకి పకడ్బందీగా చుట్టిన తలపాగా, ఆ తలపాగాకి సాహెబ్గారి మోనోగ్రామూ ఉంటాయి.సఫ్దర్సాహెబ్కి విదేశీపద్ధతి భోజనం అంటే ఎంతో ప్రీతి. అందుకని ప్రత్యేకించి వంటవాళ్ళని పెట్టు కున్నారు.

సఫ్దర్ ఎలాగా దొరగారే. అలాగే సకీనాని కూడా నౌకర్లందరూ దొర సానమ్మగారు అని అంటారు. సకీనా విల్లులా వంగిన తన కనుబొమ్మల్ని సన్నటి గీతగా ఉండేటట్టుగా కత్తిరించుకుని నల్లరంగు వేసుకుంటుంది. ప్రతీ పదిహేను నిమిషాలకోసారి పెదిమలకి రంగు వేసుకునే అలవాటూ ఆవిడకి ఉంది. అయితే దొరసానుల్లాగ విదేశీ దుస్తులు వేసుకోవడం అంటే ఆవిడకి ఇష్టంలేదు.

గత సంవత్సరం (క్రీ.శ. 1920లో) సఫ్దర్సాహెబ్ తమ భార్యని తీసు కుని మొట్టమొదటిసారి విదేశానికి వెళ్ళినప్పుడు తమ భార్య సకీనా స్కర్టూ పెటీ కోటూ వేసుకోవాలని అనుకున్నారు. అయితే అందుకావిడ ఒప్పుకోలేదు. విదేశంలో వారిని కలవడానికి వచ్చిన ఇంగ్లీషు దొరలూ, దొరసానులూ సకీనా సౌందర్యాన్ని

మెచ్చుకోవడంతోపాటు ఆమె చీరని కూడా పొగడ్డంతో సఫ్దర్ సకీనా విదేశీ దుస్తులు ధరించడానికి నిరాకరించినందుకు విచారించడం మానేసారు. ఈ దంపతు లిద్దరూ పచ్చటి ఛాయవాళ్ళేమో యూరపులో వీళ్ళిద్దర్నీ అందరూ ఇటాలియన్లు అని అనుకునేవారు.

పంతొమ్మిది వందల ఇరవై ఒకటో సంవత్సరం చలికాలం. ఉత్తరభారత దేశంలోని అన్ని నగరాల్లోలాగే లక్నోలో కూడా చలికాలం చాలా అందమైన కాలం. సఫ్దర్‌సాహెబు కోర్టు నుంచి రాగానే బంగళా వెనకవేపున ఉన్న అరుగుమీద బెత్తుకుర్చీలో కూర్చున్నారు. ఆయన ఎంతో గంభీరంగా ఉన్నారు. ఆయన కెదురు గుండా ఓ చిన్న మేజాబల్ల ఉంది. దాని మీద ఓ నోటుబుక్కూ, రెండు మూడు పుస్తకాలూ ఉన్నాయి. దగ్గరగా మూడు ఖాళీ కుర్చీలు కూడా వున్నాయి. ఆయన గంజిపెట్టి ఇస్త్రీచేసిన ఖరీదైన ఇంగ్లీషుసూటు వేసుకుని ఉన్నారు. గెడ్డాలూ మీసాలూ లేకుండా సాపుగావున్న ఆయన మొహం చాలా సీరియస్‌గా ఉంది. ఆయనేదో గట్టి ఆలోచనలో ఉన్నారని తెలుస్తోంది. అలాంటి సమయాల్లో సాహెబ్‌గారి నౌకర్లు ఆయన దగ్గరకి రారు. సఫ్దర్‌కి కోపం అన్నది చాలా అరుదుగానే వస్తుంది. అయినా సరే ఇలాంటి సమయాల్లో నౌకర్లకి తన దగ్గరికి రావొద్దనీ, ఒంటరిగా ఉండడమే తనకెంతో ఇష్టమనీ ఆయన చెప్పి ఉంచారు.

సాయంత్రం కాబోతోంది. సఫ్దర్ ఇంకా ఆ కుర్చీలో అలాగే కూర్చుని ఉన్నారు. నౌకరు వైరు తగిలించి టేబిల్‌లైటు వెలిగించి పెట్టాడు. బంగళావేపు నుంచి వచ్చిన అలికిడిని సఫ్దర్ విన్నారు. ఎవరని నౌకర్ని అడిగితే శంకర్ సింహా మాస్టారు వెళ్ళిపోతున్నారని నౌకరు ఆయనకి చెప్పాడు. వెంటనే పరిగెట్టుకెళ్ళి మాస్టారిని పిలుచుకురమ్మని నౌకర్ని ఆయన పంపారు.

శంకర్ సింహా మాస్టారు ముప్పై, ముప్పైరెండేళ్ళవాడు. అయినా ఆయనకి అప్పుడే ముసలివాలకం వచ్చేసింది. మెడవరకూ బిగిసివున్న నల్లటి కోటూ, అలాం టిదే పైజామా, నెత్తిని గుండ్రటి ఫెల్టుటోపీ, పెదిమలకిందవరకూ వేళ్ళాడుతున్న నల్లటి దట్టమైన మీసాలూ, ఎక్కడా యవ్వనపు ఛాయలు కనిపించటంలేదు. అయితే ఆయన కళ్ళ మెరుపుమాత్రం ఆయన ప్రతిభావంతుడని చెప్పకచెపుతుంది.

మాస్టరుగారు రాగానే సఫ్దర్‌జంగ్ లేచినిల్చుని షేక్‌హేండ్ ఇచ్చారు. కుర్చీలో ఆయన కూర్చున్నాక, "శంకర్! ఇవాళ నన్ను కలవకుండానే నువ్వు వెళ్ళిపోతున్నావే?" అని అన్నారు.

"భాయిసాబ్, మన్నించాలి. మీరు ఏకాంతంగా కూచుని ఏదో పనిలో మునిగి ఉన్నారని అనుకున్నాను."

"కోర్టు దావా ఫైలు కాగితాల్లో తలమునకలైపోయి ఉన్నా నీ కోసం ఓ రెండు నిమిషాలు కేటాయించి ఎప్పుడూ ఉంటాయి. ఇవాళైతే నా ముందర ఆ ఫైళ్ళు కూడా లేవు."

శంకర్‌సింహ్ అంటే సఫ్దర్‌కి చాలా అభిమానం. అతనికంటే మంచి స్నేహితుడు తనకి మరి ఎవరూ లేరని ఆయన అనుకుంటారు. సౌద్‌పురం స్కూల్లో నాలుగోక్లాసులో చేరినలగాయితు లక్నోలో బియ్యే పాసయ్యేంతవరకూ ఇద్దరూ కలిసే చదువుకున్నారు. ఇద్దరూ తెలివైన విద్యార్థులే. పరీక్షల్లో ఒకసారి ఒకరికి నాలుగు మార్కులు ఎక్కువస్తే మరోసారి మరొకరికి ఎక్కువ వచ్చేవి. అయితే సమానమైన ఉజ్జీగా ఉండడంచేత వాళ్ళెప్పుడూ దెబ్బలాడుకోలేదు. వైమనస్యం పెంచుకోలేదు. ఇద్దరికీ మధ్య స్నేహం పెరగడానికి ఓ కారణం కూడా ఉంది. ఇద్దరూ గౌతమ్ రాజపుత్రులే. ఇప్పుడు ఒకరు హిందువూ మరొకరు ముస్లిమూనూ! కాని పది తరాల క్రితం ఇద్దరూ హిందువులే కాదు - ఇద్దరి వంశాలూ ఒకటే. పూర్వీకులూ ఒక్కరే. ప్రత్యేకించి ముఖ్యమైన సమయాల్లో ఇప్పటికీ ఉభయ కుటుంబాలూ జ్ఞాతి కలయికల్లో కలుస్తూనే ఉంటాయి.

సఫ్దర్ తన తండ్రికి ఒక్కడే కొడుకు. అన్నదమ్ములు లేని కొరత శంకర్ వల్ల అతనికి తీరింది. శంకర్ సఫ్దర్‌కన్నా ఆర్నెల్లు చిన్నవాడు. ఇవి పైకి కనిపించే విషయాలు. కాని వీటికి మించి శంకర్‌లో చాలా మంచి గుణాలు ఉన్నాయి. వాటి నుంచే పూర్తిగా దొరలా ఉండే సఫ్దర్ నిరాడంబరంగా ఉండే శంకర్ అంటే అంతగా అభిమానపడి గౌరవంగా చూస్తాడు. శంకర్ చాలా నమ్రత కలిగినవాడు. ముఖస్తుతి చెయ్యడం అంటే ఏమిటో అతనికి తెలియదు. అందుకే ఎమ్మే ఫస్టుక్లాసులో పాసయ్యీ కూడా ఇప్పటికీ ఆయన ఓ గవర్నమెంట్ స్కూల్లో అసిస్టెంట్ టీచరుగా ఉన్నాడు. ఆయన ఏమాత్రమన్నా అడిగి ఉంటే ఆయనకోసం ఎవరన్నా సిఫారసు చేసి ఉండేవారు. ఆయన ఏ హైస్కూలుకైనా హెడ్‌మాస్టరు అయి ఉండేవాడు. కాని ఆయన జీవితాంతం అసిస్టెంటు టీచరుగా ఉండదల్చినట్టుగా కనపడుతోంది. ఆయనకి లక్నో నుంచి బైట ఎక్కడికో బదిలీ అయినప్పుడు మాత్రం, ఆయన స్నేహితుల సహాయాన్ని ఒకే ఒక్కసారి అర్థించాడు. నమ్రతతోపాటు ఆత్మగౌరవం కూడా ఆయనకి ఎక్కువే. ఆ గుణాల్నే సఫ్దర్‌జంగ్ ఎంతగానో ప్రశంసిస్తాడు. పన్నెండేళ్ళ వయస్సప్పుడు ఏర్పడిన స్నేహం ఇప్పుడు ఇరవై ఏళ్ళ తర్వాత కూడా అలాగే చెక్కుచెదరకుండా ఉంది.

వాళ్ళిద్దరూ పిచ్చాపాటీగా ఏదో రెండు మాటలు మాట్లాడుకున్నారో లేదో ఆకుపచ్చ చీరా, ఎర్ర రవికా వేసుకుని సకీనా అక్కడికి వచ్చింది. "ఒదినగారూ, సలామ్!" అంటూ శంకర్ లేచినిల్చున్నాడు.

"సలామ్!" ఒదినగారు నవ్వుతూ జవాబు చెప్పింది. ఒకప్పుడైతే ధనవంతుడు 'సర్' బిరుదం కలవాడూ అయిన తండ్రికి తగ్గ గ్రాడ్యుయేట్ కూతురు సకీనా ఈ పల్లెటూరి గబ్బిలాయిలా కనిపించే మాస్టారితో సఫ్దర్‌కి స్నేహం ఏమిటా అని చికాకుపడుతూ ఉండేది. సకీనా తండ్రి ఇంట్లో ఉన్న రోజుల్లోనూ ఘోషా పాటించేదికాదు. అంచేత శంకర్ ఎదటకి రావడం రాకపోవడం అన్నది ఆవిడకి ఓ పెద్ద

సమస్యేంకాదు. అయినప్పటికీ ఆర్నెల్ల వరకూ ఆవిడ మొహం చిట్లించుకునే ఉంది. సఫ్దర్ సిగూ చిన్నతనం ఏమీ పడకుండా శంకర్‌తోపాటు కూచుని పనిచేసుకోవ డాన్ని చూసి మొహం మొటమొటలాడించుకునేది. కాని చివరికి శంకర్ నిజంగానే వాళ్ళకి దగ్గర స్నేహితుడూ, అభిమానస్తుడూ, గౌరవనీయుడూ అని ఆవిడ సఫ్దర్ ఎదట ఒప్పుకోవలసి వచ్చింది.

ఇప్పుడైతే సకీనా శంకర్‌తో వొదినామరుదుల సంబంధాన్ని ఖాయపర్చేసు కుంది. సకీనా తనకి సంతానం ఇప్పట్నించీ అక్కర్లేదనుకుని బుద్ధిపూర్వకంగా పిల్లల్ని ఇంకా కనలేదు. అయితే అప్పుడప్పుడు శంకర్ పిల్లాణ్ణి ఎత్తుకుంటూ ఉంటుంది. ఇహ శంకర్‌ని చూడబోతే రెండేళ్ళకోసారి అతనింట ఓ పిల్లాడు పుడుతూనే ఉన్నాడు. గత ఆరేళ్ళబట్టీ ఈశ్వరుడి దయ తన మీద ఉందనీ, తనకి సంతానం కలుగుతోందని శంకర్ అనుకుంటూ ఉంటాడు.

గత వారం రోజులై భర్త గంభీరంగా ఉంటున్నాడని సకీనాకి విచారంగా ఉంది. ఇవాళ శంకర్‌ని చూడగానే ఆవిడకి చాలా సంతోషం కలిగింది. దొరగారి చింతని తగ్గించి మనస్సుని తేలిక పర్చగలిగే శక్తి ఒక్క శంకర్‌కే ఉందని ఆవిడకి తెలుసు.

"మరిదీ! ఇవాళ మీకు తొందర పనులేమీ లేవుకదా! ఈ ఒదినచేతి చాక్‌లెట్ పుడ్డింగు తింటారా?" అని శంకర్‌వేపు చూసి అడిగింది.

"బాగుంది బాగుంది, అలా అడుగు" అన్నాడు సఫ్దర్.

"మరిదిగారి సంగతి తెలీదుకదా! ఎప్పుడు ఎలా జారుకుంటారో! అందుకని ముందరే అడుగుతున్నాను." అన్నది సకీనా.

"మీరు ఛాలా అన్యాయంగా మాట్లాడుతున్నారు ఒదినా! మీరు ఎప్పుడు ఏది చెప్పినా ఎప్పుడైనా నిరాకరించానా?" అన్నాడు శంకర్.

"ఆజ్ఞని జవదాటటం గురించి కాదు నే చెప్తున్నది! ఆజ్ఞని వినకుండా తప్పించు కుని పోవడం నేరం అని అంటున్నాను."

"జనరల్ ఒదినగారి ఆజ్ఞ ఏమిటో? శిరసావహించడానికి ఈ మరిది సిద్ధంగా ఉన్నాడు" అన్నాడు శంకర్.

"మంచిది. మా ఇంట్లో భోజనం, చాక్‌లెట్ పుడ్డింగుతో తినాలి. మరి నే వెళ్తాను." అని సకీనా అక్కణ్ణించి తొందర తొందరగా లోపలికి వెళ్ళిపోయింది. సఫ్దర్, శంకర్ సీరియస్‌గా మాట్లాడుకోసాగారు.

"శంకర్! మనమో కొత్త విప్లవయుగంలో ప్రవేశిస్తున్నాం. సరికొత్త విప్లవ యుగం. పద్దెనిమిది వందల యాభై ఏడో సంవత్సరం తర్వాత బహుశా ఇదే మొదటిసారి అనుకుంటాను - మళ్ళా దేశం అంతా కూకటివేళ్ళతో సహా కదులుతు న్నది," అన్నాడు సఫ్దర్.

"నువ్వనేది రాజకీయ ఆందోళన గురించేనా సఫ్దూభాయీ!"

"రాజకీయ ఆందోళన అన్నది సర్వసామాన్యమైన మాట శంకర్! 1885లో కాంగ్రెసు ఏర్పడ్డది. అప్పట్లో అది ఇంగ్లీషు ఐ.సి.యస్. పెన్షన్‌దార్ల దయ మీద నడిచేది. అందుకే క్రిస్టమస్ సందర్భంలో చేసుకునే వేడుకల్లో, వినోదాల్లో ఇచ్చే ఉపన్యాసాలనీ మద్య సేవనాన్నీ ఆందోళన అని అనేవారు. నువ్వు దాన్నే ఆందోళన అని అనుకుంటున్నావంటే, ఆ ఆందోళనని అధిగమించి మనం ఇప్పుడు విప్లవ యుగంలో అడుగు పెడుతున్నామని నేను అనుకుంటున్నాను."

"గాంధీజీ తిలక్ స్వరాజ్య ఫండు కోసం ఓ కోటిరూపాయలు పోగు చేశాడు. స్వరాజ్యం కోసం గట్టిగా ఘోష వినపడుతున్నది. అందుకేనా నువ్విలా అనుకుంటున్నావు?"

"విప్లవానికి కాని, విప్లవాత్మకమైన ఆందోళనకి కాని ఎవరో ఓ వ్యక్తి ఎప్పుడూ కారణభూతుడు ఆధారం కాడు శంకర్! విప్లవం బ్రహ్మాండమైన మార్పుని తెస్తుంది. అది ఏ ఒకరి వల్లో లేక ఓ అరడజను మంది మహానుభావుల శక్తి సామర్థ్యాల వల్లో వచ్చేదికాదు. నేటి ఈ ఆందోళనకి ఆధారం ఏమిటి, దీని పునాది ఏమిటి అని ఆలోచించి ఆలోచించి ఆఖరికి నేనీ అభిప్రాయానికి వచ్చాను. నీకు తెల్సుకదా-1857లో జరిగిన స్వాతంత్ర్య సంగ్రామానికి నాయకత్వం వహించినది పూర్వభ్రష్టులైన సామంత రాజులని! ఆ స్వాతంత్ర్య సంగ్రామపు కేంద్రాల్లో లక్నోకూడా ఓ కేంద్రం. ఇంకా చెప్పాలంటే ఇంగ్లీషువాళ్ళు లక్నోని తమ చేతికిందకి లాక్కోవడమే ఆ సంగ్రామపు గట్టి కారణాల్లో ఓ కారణం అని చెప్పొచ్చు. కాని సామాన్య ప్రజానీకపు ప్రాణాల్ని ఒడ్డి ఆ యుద్ధం చేశారు. మనకున్న అనేక బలహీనతలవల్ల ఆ యుద్ధంలో మనం గెలవలేకపోయాం. ఇంగ్లీషువాళ్ళు ఓడిపోయిన వాళ్ళమీద గుళ్ళవర్షం కురిపించిమరీ తమ కోపాన్ని చల్లార్చుకున్నారు. ఇంతకీ నేను చెప్పొచ్చేదేమిటంటే-1857 తర్వాత మళ్ళీ ఇప్పుడు మొదటిసారిగా దేశ ప్రజలందర్నీ స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొనేటట్టుగా పని జరుగుతోంది. నువ్వు భారతదేశ చరిత్రని బాగా అధ్యయనం చేసిన విద్యార్థివి కదా! నువ్వే చెప్పు, ఇలాంటి ఆందోళన దేశంలోని యావత్ ప్రజానీకం పాల్గొన్నది ఇంకెప్పుడన్నా జరిగిందా?"

"సహ్చుభాయీ! నాగ్‌పూర్ కాంగ్రెస్(1920) కలకత్తా కాంగ్రెసూ రెండు జరిగాయి. ఊరూరా సంచలనం వున్నదని నువ్వే సంచలనం గురించి చెప్తున్నావో దాన్ని నేనూ నా కళ్ళారా చూశాను. అది అసాధారణమైనదని నేనూ ఒప్పుకుంటున్నాను. ఇంత ఉప్పెన వచ్చినా, ఈ లక్నోలో లెక్కలేనన్నిసార్లు విదేశీ వస్త్రాలని తగలబెట్టినా నీకు ఎప్పుడు చీమకుట్టినట్లైనా అనిపించలేదు. మరి ఇవాళ నువ్వు విప్లవపు సుడిగుండంలో చిక్కుకున్నవాడిలా మాట్లాడుతున్నావే!"

"అవును తమ్ముడూ! నువ్వు అన్నది నిజమే! ఈ సుడిగుండం నన్ను తనలోకి లాక్కుపోతోంది. అయితే దీన్ని స్థానికంగా ఏర్పడిన చిన్న సుడిగుండం అని నేను అనుకోవటం లేదు. ఇది ఓ పెద్ద సుడిగుండంతో ఏకమై మరీ ఏర్పడ్డది. ప్రతీ

యుగంలోనూ అన్నిటికన్నా బలవత్తరమైన విప్లవాత్మకమైన శక్తి ప్రజల్లోంచే బహిర్గత మౌతుంది."

"నువ్వు 1857 నుంచీ కథ ప్రారంభించావు. అంటే పేదరాశి పెద్దమ్మా, పెద్దమ్మ కొడకా అన్నట్టు చాలా పొడుగ్గా కథ చెప్పేటట్టున్నావు."

"చెప్పొద్దా శంకర్?"

"నాకు వినాలనే వుంది. ఒదినగారు పుడ్డింగు చేయిస్తున్నారు. రేపేమో ఆది వారం. శంకర్ ఈ లక్నోలో బతికే వున్నాడనీ వాళ్ళ వదిన సకీనాగారింట పుడ్డింగు మెక్కి హాయిగా గుర్రుపెట్టి నిద్రపోతున్నాడనీ మీ మనిషి చేత మా ఇంటికి కబురు పంపితే చాలు- ఏ చింతా లేకుండా రాత్రంతా నువ్వు చెప్పేదేమిటో వింటాను."

"శంకర్! నువ్వూ నాతోపాటు లేకపోవడం వల్లే ఆక్స్ఫర్డ్‌లో నేను గడిపిన రోజుల మజా సగానికి సగం తగ్గిపోయింది. నేనేకాదు, భారతదేశం బైట అన్ని చోట్లా రాజకీయాలు అధ్యయనం చేసే విద్యార్థులు గత శతాబ్దంలోనూ, ఈ శతాబ్దం లోనూ ఇంగ్లాండు రాజకీయాల్లో మార్పులు వచ్చాయని వప్పుకుంటారు. ఆ మార్పులు అంతర్జాతీయ పరిస్థితుల కారణంగానూ, ప్రపంచంలోని ఇతర రాజకీయ శక్తుల స్థితి గతులవల్లా మరో గత్యంతరం ఏం లేకా వచ్చాయని అంగీకరిస్తారు. ఏ కారణాలవల్ల ఈ పరిస్థితులు ఏర్పడ్డాయని ఆలోచించి చూస్తే ముఖ్యంగా ఆర్థిక కారణాలే కనపడ తాయి. 1857లో తగిలిన దెబ్బతో మన దేశం నిద్రాణమైపోయింది. మనదేశంలో వచ్చే మార్పుల స్థితిగతులు చాలా మందగించాయి. దాన్ని మనం స్తబ్దత్వమనీ, నిద్ర పోవడమనీ చెప్పొచ్చు. కాని మిగతా దేశాల్లో బ్రహ్మాండమైన మార్పులు వచ్చాయి. వెయ్యి సంవత్సరాల క్రితం రోమన్ సామ్రాజ్య కాలంనుంచి ముక్క చెక్కలైందా, అలాంటి ఇటలీ 1860లో ఏప్రిల్ 2 వ తారీఖున ఓ దేశంగా జాతీయైక్యతని సాధిం చింది. మనదేశపు యువకులకు మేజినీ, గారీబాల్డీ లాంటి ఆదర్శప్రాయుల ఆదర్శా లని ప్రసాదించింది. రోమను సామ్రాజ్యాన్ని ధ్వంసం చెయ్యడంలో తన సామర్థ్యాన్ని ప్రదర్శించిన జర్మనీ తనని తాను సంఘటితపరుచుకోలేక పోయింది. 1866లో కాస్త మేరకూ ఫ్రాన్సుని గెలిచిన తర్వాత 1871 జనవరి పద్దెనిమిదో తారీఖున చాలా వరకూ సంపూర్ణంగా పర్షియా నాయకత్వాన తనది అని స్వరాష్ట్రాన్ని ఏర్పరచు కోగలిగింది. 1866లో జరిగిన ఈ మార్పు ప్రపంచంలో వచ్చిన బ్రహ్మాండమైన మార్పు అని ఒప్పుకోవాలి ఈమార్పురావడంవల్లే జర్మనీ ఎంతోశక్తివంతమైన ఫ్రాన్సుని 1870 లో ఓడించి పారిస్‌లోనూ, వర్సాయిూలోనూ తన జెండాని ఎగురవేయడంలో కృతకృత్యురాలయింది. దాంతోనే ఇంగ్లాండూ, రష్యా భయంతో బెర్లిన్‌ని చూడ్డం మొదలయింది. ఇదంతా బైట దేశాల భయం. కాని ఇంతకన్నా పెద్దభయం, పారిస్ లోని కూలీల రాజ్యం పారిస్ కమ్యూన్‌వల్ల పట్టుకుంది. ఏప్రిల్ రెండవ తారీఖు నుంచి నెలా పదిహేను రోజులకి మించి (1871వ సంవత్సరం ఏప్రిల్ 2 వ తారీఖు

నుంచి మే 21 వ తారీఖు వరకూ) పారిస్ కమ్యూన్ రాజ్యం ఏలింది. భూస్వాములూ, సాహుకార్లే కాదు, కూలీలు కూడా రాజ్యం ఏలగలరని తెలియజెప్పింది."

"వీటన్నిటితో భారతదేశపు రాజకీయ సంఘటనలకి సంబంధం వుందని నువ్వు అనుకుంటున్నావా?"

"రాజకీయ సంఘటనలకే కాదు—మన పాలకులు ఇంగ్లీషువారు మనదేశ పాలన పట్ల అవలంబించే వైఖరికి వీటికీ చాలా గట్టి సంబంధం ఉంది. యూరప్‌లో జర్మనీలాంటి అజేయశక్తి ఉద్భవించగానే ఫ్రాన్సు ఇంగ్లాండుతో పోటీపడ్డం మానేసింది. ఇప్పుడు ఫ్రాన్సు జర్మనీ నుంచి ప్రమాదంలో పడే స్థితి వుంది. దానికి జర్మనీ భీతి పట్టుకుంది. కొద్దిరోజుల్లోనే గతించిపోయినా పారిస్ కమ్యూనూ, ఒక్క ఆస్ట్రియాని వదిలేస్తే మిగిలిన అన్ని జర్మను సంస్థానాలను కలగలుపుకుని 1871లో ఏర్పడ్డ జర్మన్ స్వరాష్ట్రమూ మన పెట్టుబడిదారీ పరిపాలకులకి భయభ్రాంతులు కలిగించాయి. దీని గురించి మనం వేరే చెప్పుకోనక్కరలేదు. దీనిలోపాటు ఇప్పుడు ఇంకా మార్పు జరుగుతోంది. 1672లో ఇంగ్లీషువాళ్ళు వర్తకుల్నించి పెట్టుబడిదారులుగా మారారు. ముడిసరుకును కొనుగోలు చెయ్యడం దగ్గర్నుంచి వస్తువుల్ని తయారుచేసి విక్రయించేదాకా అన్నిటా లాభాలు లాగే అతి చవకబారు పెట్టుబడిదారీ విధానాన్ని వాళ్ళు అవలంబించారు. వర్తకంతో అయితే పనివాడి దగ్గర సరుకుని తీసుకుని ఇక్కడిది అక్కడా అక్కడిది ఇక్కడా అమ్మగా ఎంత లాభం వస్తే అంత లాభం వారికి దొరికేది. కానీ యీ పెట్టుబడిదారీ విధానంలో అడుగడుగునా లాభాలే. ప్రత్తి కొనుగోలులో లాభం, గింజ తీయించడంలో లాభం, బేళ్ళు కట్టించడంలో లాభం, ఓడలో అద్దెకు తీసుకువెళ్ళడంలో లాభం, మాంచెస్టరు మిల్లులో నూలు వడికించడంలో లాభం, బట్టలు నేయించడంలో లాభం. మళ్ళీ ఓడలో బట్టల్ని పంపడంలో ఓడ కంపెనీకి లాభం,రైల్వేకి—లాభం ఈ లాభాలన్నిటితో పనివాడి దగ్గర కొనుగోలు చేసిన సరుకుని అమ్మేవర్తకుడి లాభంలో పోల్చి చూడు- అప్పుడు తెలుస్తుంది ఎంత తేడా వుందో?"

"వర్తక వ్యాపారంకన్నా పెట్టుబడిదారీ విధానం వల్లే లాభం ఎక్కువ"

"18,1లో వర్సాయిలో విజేత అయిన జర్మనీ పర్షియారాజు మొదటి విలిఘమ్‌ని జర్మనీదేశం యావత్తుకి కైజర్ (చక్రవర్తి)గా ప్రకటించింది. ఆ తర్వాతి సంవత్సరం అంటే 1872లో గట్టి పట్టుదల వున్న ఇంగ్లీషు పెట్టుబడిదారులు-టోరీలు ఇంగ్లాండు ప్రధానమంత్రి యూదుడూ అయిన డిస్రాయిలీద్వారా తమ సామ్రాజ్యవాదాన్ని ప్రకటించుకున్నారు. ఈ ప్రకటన కేవలం ఏదో మాటవరసకి చేసిందికాదు. వాస్తవంగా సామ్రాజ్యవాదం ఉద్భవించిందని చేసిన ప్రకటన! ఫ్యాక్టరీల సంఖ్య బాగా పెరిగిపోవటంతో వాటిలో తయారయ్యే సరుకును కొనే మార్కెట్లు తమవైన ఖచ్చితమయిన మార్కెట్లు కావల్సి వచ్చాయి. జర్మనీ ఫ్రాన్సుల్లో తయారయ్యే సరుకుతో పోటీకి వెరపులేనిచోట మార్కెట్లు కావాలి. అంటే

ఆ మార్కెట్లమీద గుత్తాధికారం పూర్తిగా తమ చేతిలో వుండాలి. దీనికితోడు పెట్టు బడి కూడా విపరీతంగా పెరుకుపోవడంతో లాభసాటిగా దానిని తిరిగి వినియో గించటానికి పనికివచ్చే స్థలాలు, ఏ విధమయిన నష్టమూ రాకుండా పదిలంగావుండే స్థలాలూ కావాలి. దీనికి ఇతర దేశాలని సంపూర్ణంగా తమ అధికారం కిందకి తెచ్చుకోవాలి. 'సామ్రాజ్యం' అంటే డిస్రాయిలీ అర్థం ఇదే! భారతదేశంలో ఈ రెండింటికీ చక్కటి సౌలభ్యం వుంది. యూరప్ నుంచి భారతదేశానికి రావడానికి అన్నిటికన్నా దగ్గరదారి సూయజ్ కాల్వగుండా వచ్చేదారి. 1869లో ఈ దారిని ఏర్పరచారు. 1875లో ఈజిప్టు చక్రవర్తి దగ్గర 1,77,000 షేర్లని నలభై లక్షల పౌండ్లు యిచ్చి పెట్టిగ్రాం ద్వారా డిస్రాయిలీ కొన్నాడు. సామ్రాజ్యవాద విధాన ప్రకటనకి ఇది మరో ముందడుగు. 1877 జనవరి ఒకటవ తారీఖున ఢిల్లీలో దర్బారు చేసి విక్టోరియా రాణిని సామ్రాజ్ఞిగా ప్రకటించి డిస్రాయిల్ ప్రభుత్వం సామ్రాజ్యవాదాన్ని చాలా దూరం వరకూ వ్యాపింపజేసింది. ఇప్పుడిహ లిబరల్ పార్టీ గ్లాడ్‌స్టన్ తాత మంత్రి అయి వచ్చినా డిస్రాయిలీ విధానాన్ని మార్చ లేదు."

"విక్టోరియా మహారాణి భారతదేశపు సామ్రాజ్ఞిగా హిందూదేశపు చక్రవర్తినిగా పదవిని స్వీకరించి భారతదేశానికి గొప్ప గౌరవాన్ని ప్రసాదించిందని ఇప్పటికీ మేం మా విద్యార్థులకి బోధిస్తున్నాం!"

"అరేళ్ళక్రితం పర్షియా రాజూ ఆ కైజర్ (చక్రవర్తి) పదవిని స్వీకరిం చాడు. కైజర్ యెంత విలువయిన మాటగా తయారయిందో!! రోమన్ సామ్రాజ్య కాలంనుంచీ ఈ త్యజించబడిన కైజర్ అన్న మాటకి విలువ చూస్తూ వుండగా మళ్ళీ యెంత తొందరగా పెరిగిపోయిందో!"

"రోమన్ భాషలో కైజర్ శబ్దాన్ని హిందూదేశంలో వాడ్డం, ఇంగ్లీషులో ఆ శబ్దానికి బదులు 'ఎమ్‌ప్రెస్' అని అనడంలో ఏమన్నా రహస్యం వుందంటావా?"

"ఉండొచ్చు. కైజర్ శబ్దంతో 1871వ సంవత్సరంనుంచి మనం సామ్రాజ్య వాద యుగంలో కాలుపెట్టాం. మొదట ఇంగ్లాండు వస్తుంది. ఓడిపోయిన ప్రజా స్వామ్యపు ఫ్రాన్సు కాస్త తేరుకున్నాక 1881లో టూనిస్‌ని (ఆఫ్రికా) తన అధి కారంలోకి తీసుకుని సామ్రాజ్యవాదాన్ని తనూ ప్రారంభించింది. కొత్త ఫ్యాక్టర లతో పెట్టుబడిదారులతో సంసిద్ధంగా వున్న జర్మనీ కూడా 1884 సంవత్సరం నుంచీ వలస రాజ్యాల కోసం అర్రులు చాస్తూ సామ్రాజ్యవాదాన్ని స్థాపించడానికి ప్రయత్నించింది."

"కాని దీనికి భారతదేశంలో ఇంగ్లీషువారి రాజకీయ విధానంలోని మార్పుకి ఏం సంబంధం వుంది?"

"నిత్యమూ కొత్త కొత్త మార్పులూ చేర్పులతో తయారయే యంత్రాలకి, వృద్ధి పొందుతున్న కార్ఖానాలకి - వాటి వల్ల వచ్చే లాభాలని పెట్టుబడి రూపంలో

పెట్టడానికి ఏదన్నా ఏర్పాటు కావాలి. 1874-80 సంవత్సరాల్లో డి[స్రాయిలీ మంత్రిమండలి ఆ ఏర్పాటు చేసింది. 1880-92ల్లో వున్న లిబరల్ పార్టీ గ్లాడ్‌స్టన్ ప్రభుత్వం డిస్రాయిలీ వేసిన అడుగుని వెనక్కి తియ్యలేకపోయింది. అయితే ఒకటి, పెట్టుబడితో సాగించే నగ్న సామ్రాజ్యవాదపు రాక్షసత్వానికి కొంతమేరకి మర్యాద తొడుగు వెయ్యాల్సిన అవసరం వుంది. అలా అయితే సామాన్య ప్రజానీకం రెచ్చిపోదు. దీనికోసం డిస్రాయిలీ 'భారత సామ్రాజ్ఞి' అన్న నాటకం మొదలు పెట్టనే పెట్టాడు. ఇప్పుడిహ లిబరల్ పార్టీవాళ్ళు మరింత ఔదార్యం చూపెట్టాల్సిన అవసరం కలిగింది. ఈ ఔదార్యం ఐర్లాండు 'హోమ్‌రూలు బిల్లు' రూపంలో బహిర్గతమైంది. కాని ఐర్లాండు సమస్య ఈనాటికీ అలాగే వుంది! ఇదిగో, ఈ ఔదార్యాన్ని మితవాదాన్ని ముందుంచుకుని మన హిందూస్థానీ దొరలు 1885లో తమ కాంగ్రెస్‌ని స్థాపించారు. కాంగ్రెస్ నిజానికి బ్రిటిష్ లిబరల్ పార్టీ అభిమాన పుత్రిక (గాడ్ డాటర్)గా ఈ భూమ్మీద వెలిసింది. చాలాకాలం దాని పని అది నిర్వహిస్తూ వచ్చింది. కాని 1895 నుంచి 1905 వరకూ పదేళ్ళపాటు బ్రిటనులో మళ్ళీ టోరీల ప్రభుత్వం వచ్చింది. ఆ ప్రభుత్వం ఎల్గినూ, కర్జనులాంటి సుపుత్రుల్ని భారతదేశానికి పంపింది. వాళ్ళు సామ్రాజ్యవాదాన్ని మరింత బలపరచాలని ప్రయత్నం చేశారు. అయితే దానికి విరుద్ధమైన పరిణామం కలిగింది!"

"నువ్వు అనేది లాల్ (లజపతిరాయ్), బాల్ (బాలగంగాధర తిలక్).పాల్. (బిపిన్ చంద్రపాల్) గురించేనా?"

"లాల్ బాల్ పాల్ దానికి బాహ్య ప్రతీకలు మాత్రమే! జపాను రష్యాని (1904) ఫిబ్రవరి ఎనిమిదవ తారీఖు నుంచి 1905 సెప్టెంబరు మధ్య) ఓడించి తనూ అగ్రరాజ్యాల్లో చేరిపోయి ఆసియాలో ఓ నూతన జాగృతిని కలగచేసింది. కర్జను వంగదేశ విభజనా ఈ ఆసియా గెలుపూ రెండూ కలిసి భారత యువకుల్ని ఉత్తేజపరిచాయి. కాంగ్రెస్ వేదికమీద చెవికి ఇంపైన ఉపన్యాసాలివ్వడం కాదు-మనం యింకా ముందు అడుగు వెయ్యాలి అని వాళ్ళు అనుకునేటట్టుగా ప్రేరేపణ కలగజేశాయి. అర్థశతాబ్దం తర్వాత మళ్ళీ భారతీయులు ప్రాణత్యాగం చెయ్యడానికి సిద్ధమయ్యారు. ఐర్లాండులోనూ రష్యాలోను ప్రాణాలు అర్పించిన అమర జీవుల దృష్టాంతాల వల్ల మనలో చాలా ఉత్సాహం కలిగింది. అంచేత ఈ మార్పులన్నిటికీ మూలకారణాలు ఏమిటని కేవలం భారతదేశంలో మాత్రమే అన్వేషించటం తప్పే అవుతుంది. అవునా?"

"నిజమే. వాస్తవానికి ప్రపంచం ఒకదానితో ఒకటి కలసి గుత్తలంగా వున్నది."

"శంకర్! ఏ విప్లవాత్మక ఆందోళనైనా రెండింటిమీద ఆధారపడి వుంటుంది. ఆ ఆందోళనకి అంతర్జాతీయ పరిస్థితులూ, దృష్టాంతాలూ ఊపిరిపోసి శక్తినిస్తాయి. దేశంలో విప్లవకారుల వర్గం ఆ ఆందోళనలో ఎంత ఎక్కువగా ఎంతవరకూ పాల్గొం

టోంది? ఇది రెండో సంగతి! ఆందోళనకి శక్తిని అందించే మొదటి ఊట గురించిన దృష్టాంతాలు నీకు ఇంతవరకూ చెప్పాను. రెండోది శ్రమించే రైతుజనం. విప్లవ పోరాటాన్ని వాళ్ళే సాగించగలరు. వాళ్ళ దగ్గర పోగొట్టుకోడానికి ఏం వుండవు. సకీనా పెదపులరంగూ, ఏః బంగళా, తండ్రి తాతల ఆస్తులూ, మొఖాసాలూ, ఊళ్ళూ పోతాయన్న భయం వున్న నాబోటివాడు విప్లవయోధుడు కాలేడు. అందుకే సామాన్య జనం విప్లవాన్ని ముందుకి తీసుకువెళ్ళ గలుగుతారని నేను చెప్తున్నాను."

"నేనూ నీ అభిప్రాయాన్ని ఒప్పుకుంటున్నాను."

"సామాన్య ప్రజానీకంలో ఎంత ఉద్రేకమూ ఆవేశమూ వున్నాయో చూస్తూనే ఉన్నావు. అంతర్జాతీయ పరిస్థితులు ఎంతగా ఉత్తేజపరుస్తున్నాయో, అదీ గమనించు. గత ప్రపంచయుద్ధం (1914-18) ప్రపంచానికి పెద్ద ఎసరే పెట్టింది. ఆ యుద్ధం సామ్రాజ్యవాదం సృష్టించిందే. పెట్టుబడికీ, తయారైన సరుకులకీ పదిలమైన మార్కెట్లని స్థాపించుకోవడానికి, అలాంటి మార్కెట్లని లాక్కోవడానికి చేసిన దాని పరిణామ రూపమే ఈ యుద్ధం! జర్మనీకి కొత్త వలస రాజ్యాలు కావల్సి వచ్చాయి. అప్పటికే పృథ్వినంతటిని పంచేసుకోడం జరిగిపోయింది. అంచేత యుద్ధంచేసి ఆ వలస రాజ్యాన్ని లాక్కోవలసి వచ్చింది. దాంతో వలస రాజ్యాల యజమానులైన ఇంగ్లాండుతో ఫ్రాన్సుతో జర్మనీ తలపడ్డది. కాని జర్మనీ ఓడిపోయింది. అయితే దాంతోపాటు సామ్రాజ్యవాదపు గుండెల్లో గుబులు పుట్టించే ఓ శత్రువు పుట్టుకొచ్చింది-అదే సామ్యవాదం-వస్తూత్పత్తి, లాభంకోసం కాదు-మానవాళి సుఖసంతోషాల కోసం అభివృద్ధి కోసం చెయ్యాలని సామ్యవాదం అంది. యంత్రాలు ఇంకా బాగా పనిచేసేవిగా రూపొందుతాయి. కార్ఖానాలు పెరుగుతాయి. వస్తూత్పత్తి ఎక్కువ అవుతుంది. ఆ పెరకువతోపాటు మార్కెట్లూ అధికంగా కావల్సి వుంటాయి. కొనుగోలు శక్తి పెరగాలంటే కొనేవాడి చేతిలో డబ్బులాడాలి. అందుకు వీలుగా జీతాలు పెరగాలి. చేతిలో డబ్బాడ్డం తగ్గిపోతే మార్కెట్టులో వస్తువూ కదలదు. దాంతో మార్కెట్టులోనూ గోడౌన్లలోనూ వస్తువులు అదే నిష్పత్తిలో ముక్కుతూ వుంటాయి. మాంద్యం వస్తుంది. దరలు పడిపోతాయి. దాంతో ఆ నిష్పత్తి ననుసరించి వస్తూత్పత్తి చెయ్యడం జరుగుతుంది. కొన్ని ఫ్యాక్టరీలు మూతపడతాయి. కొంతమంది కూలీలు పనిలేక అల్లల్లాడుతారు. ఆ నిష్పత్తి ననుసరించే వాళ్ళ దగ్గర కొనుగోలు చెయ్యడానికి డబ్బు వుండదు. ఇహ వస్తువులేం కొంటారు, వాళ్ళ తలకాయ! కార్ఖానాలు ఏం నడుస్తాయి? అందుకే సామ్యవాదం లాభాలు తియ్యాలన్న మాటని మర్చిపొమ్మంటుంది. స్వదేశాన్ని, లేదూ యావత్ ప్రపంచాన్ని ఓ కుటుంబంగా భావించి, దానికి కావల్సిన వాటిని తయారు చెయ్యమంటుంది. ప్రతీవాడి చేతా వాడికున్న యోగ్యత ప్రకారం పనిచేయించు. ప్రతీ వాడికీ వాడి అవసరాలకి తగ్గట్టూ జీవించడానికి కావల్సిన వస్తువులన్నిటినీ

ఇయ్యి. అవసరాలకి తగ్గట్టూ పనిచెయ్యటానికి సరిపోయినన్ని కార్ఖానాలూ, ఫ్యాక్టరీలూ, పనివాళ్ళూ, ఇంజనీర్లు సమకూరనంతవరకూ, పనినిబట్టి ప్రతీవాడికీ వస్తువులు ఇయ్యి. భూమిమీదగాని, ఫ్యాక్టరీమీదగాని - ఏ వ్యక్తికీ ఆస్తిహక్కులు లేనప్పుడే ఇది సంభవం అవుతుంది. అంటే ఉత్పత్తి సాధనాలన్నిటిమీదా ప్రపంచ మానవ కుటుంబానికే అధికారం వుండాలి-అంటుంది సామ్యవాదం."

"ఊహ చాలా చక్కగా వుంది."

"ఇది ఊహ కాదు శంకర్! ప్రపంచంలో ఆరవ వంతు భాగంలో అంటే రష్యాలో 1917 నవంబరు ఏడవ తారీఖు సామ్యవాద ప్రభుత్వం స్థాపించబడ్డది. ఇప్పుడూ పెట్టుబడిదారీ ప్రపంచం మానవత్వానికి ఉన్న ఒకే ఒక్క ఆశాజ్యోతిని ఆర్పేయాలని చూస్తోంది. కాని సోవియట్ ప్రభుత్వం మొదటి అగ్నిపరీక్షకి తట్టుకుని నిలబడింది. హంగేరీలో ఆర్నెల్ల తర్వాత ఫ్రాన్సు, అమెరికా పెట్టుబడిదారుల సహకారంతో (1919 మార్చి-ఆగస్టు కాలంలో) సోవియట్ ప్రభుత్వాన్ని తీసి పారేశారనుకో-అది నిజమే. సోవియట్ రష్యాలోని రైతుకూలీల ప్రభుత్వం యావత్ ప్రపంచానికి గొప్ప ప్రేరణని ఇస్తోంది. సోవియట్ ప్రభుత్వాన్ని ఏర్పరచిన శక్తులు ప్రతిదేశంలోనూ పని చేస్తున్నాయి. యుద్ధం పూర్తవగానే ఇంగ్లీషువారు రౌలట్ చట్టాన్ని చెయ్యటానికి ఎందుకంత తొందరపడ్డారంటావు? ప్రపంచ వ్యాప్తంగా ఉద్భవించిన ఆ విప్లవ శక్తులను పాతిపెట్టాలనే! మట్టుపెట్టాలనే! ఇంకోలా ఆలోచించి చూడు. ఈ విప్లవ శక్తులు ప్రపంచాన్ని తారుమారు చెయ్యడానికి భూమండలంలో ప్రతీ మూలమూలకీ ప్రసరించలేదనుకో, ఇంగ్లీషు వాళ్ళు రౌలట్ చట్టం చేసి ఉండే వారు కారు—రౌలట్ చట్టం వచ్చి ఉండేది కాదు-గాంధీజీ ఆ చట్టాన్ని వ్యతిరేకిస్తూ ధిక్కరించాలని ప్రజలని ఆహ్వానించే వాడు కాదు. లోలోపల అణిగి దాగి ఉన్న దావానలం 1857 తర్వాత ఇన్నాళ్ళకి మళ్ళీ రగుల్కొని ఉండేదీ కాదు. అందుకే మనం సరికొత్త విప్లవ యుగంలోకి అడుగు పెడుతున్నామని నేను చెప్తున్నాను."

"అయితే గాంధీజీ విప్లవనాయకుడని నువ్వు అనుకుంటున్నావా? గోఖలేలాంటి మితవాద నాయకుణ్ణి తన గురువు అని చెప్పుకునే గాంధీ విప్లవనాయకుడు ఎలా అవగలుగుతాడు సప్తూభాయీ?"

"గాంధీ చెప్పేవన్నీ విప్లవాత్మకంగా ఉన్నాయనీ, ఆయన భావాలన్నీ విప్లవ పంథావనీ నేను అనుకోవటం లేదు శంకర్! విప్లవశక్తుల మూలవిరాట్టుని-ప్రజలని అతడు మేల్కొలిపాడు. అంతవరకూ ఆయన చేసిన ఆ పని విప్లవాత్మకమైనదనే నేను అంటాను. మతానికి ప్రాముఖ్యతనివ్వడం, ముఖ్యంగా ఖిలాఫత్ గురించిన ఆయన భావాలూ-అలాంటి వాటినిమాత్రం విప్లవ వ్యతిరేక చర్యలుగా భావిస్తాను. మిల్లుల్నీ కార్ఖానాలనీ కాదని వెనక్కి గతంలోకి పోదామని ఆయన అంటాడే, దాన్ని తిరోగమనంగా నేను భావిస్తాను. అలాగే స్కూళ్ళనీ కాలేజీలని మూసివేయించా లనడమూ ఆ కోవలోకే వస్తుందని నా అభిప్రాయం."

"సప్టూ భాయీ! నువ్వు పిల్లాపాపలతో నాలుగు కాలాలపాటు వర్ధిల్లు! గాంధీని ప్రశంసించడం మొదలు పెట్టావా దాంతో నాకు విపరీతమైన భయం వేసింది. చచ్చేంరా నాయనా, గాంధీలాగే నువ్వూ స్కూళ్ళనీ కాలేజీలని దెయ్యాల ఫ్యాక్టరీలని అంటావు కాబోలు అనుకున్నాను."

"విద్యావిధానం లోపభూయిష్టం కావొచ్చు శంకర్! కాని ఈ రోజుల్లో స్కూళ్ళల్లోనూ, కాలేజీల్లోనూ మనం సైన్సు విషయాలు అవగాహన చేసుకుంటు న్నాము. ఆ సైన్సే లేకపోతే ఇవాళ మనిషి మనిషి కాకుండా పోతాడు. మనకి దాస్య విముక్తి ఎప్పుడు రానీ, ఆ విముక్తికి సైన్సు దోహదం ప్రత్యేకించి తప్పకుండా ఉండి తీరుతుంది. దినదినాభివృద్ధి చెందుతున్న మానవజాతి భవిష్యత్తు ఆ సైన్సు మీదే ఆధారపడి వుంది. అలాంటి సైన్సుని త్యజించి వెనక్కిపోవడం అంటే ఆత్మ హత్య చేసుకోవడమే! స్కూళ్ళనీ కాలేజీలని మూయించి రాట్నం మగ్గాలతో బళ్ళు పెట్టడం అన్నది మళ్ళీ చీకటి యుగంలోకి పూర్తిగా లాక్కుపోవడమే అవుతుంది! విప్లవయోధులుగా ముందుకు ఉరకవలసినదిగా విద్యార్థులని ఆహ్వానించడంలో తప్పేమీలేదు. దీన్ని నువ్వూ అంగీకరిస్తావనుకుంటాను శంకర్!"

"ఆహాఁ ఒప్పుకుంటాను. మరి మిగతా బాయ్‌కాట్ బహిష్కారం ఉద్యమాల మాటో?"

"కోర్టుల బహిష్కారమా? దాని ద్వారా మనం మన విదేశీ పాలకులకి మనశ్శక్తి సామర్థ్యాలేమిటో, మనం వాళ్ళపాలన అంటే ఎంతలా మండిపడుతున్నామో బాగా చెప్పొచ్చు. అలాగే విదేశీ వస్తు బహిష్కరణా మంచి చెంపదెబ్బే ఇంగ్లీషు పెట్టుబడి దారులకి! దాంతో మనదేశపు పరిశ్రమలకీ, వృత్తులకి మేలూ, లాభం కలుగుతాయి."

"నువ్వు చాలా ముందుకువెళ్ళి ఆలోచిస్తున్నావు."

"లేదు-ఇంకా ముందుకు ఇప్పుడు వెళ్దామనుకుంటున్నాను."

"వెళ్ళాలనుకుంటున్నావా?"

"మనం విప్లవయుగంలో ఊపిరి పీలుస్తున్నామో లేదో అది ముందర చెప్పు."

"అడగాలని బుద్ధిపూర్వకంగా నిన్ను ఎన్నో ప్రశ్నలు అడిగాను సప్టూ భాయీ! రష్యా విప్లవం గురించి విన్న రోజు లగాయితు నేను ఎక్కడెక్కడ లేని సామ్యవాద సాహిత్యాన్ని సంపాదించి చదవడం, మన సమస్యలని సామ్యవాద దృష్టితో పరిష్కరించటానికి ఆలోచించటం మొదలుపెట్టాను. భారతదేశానికీ ప్రపంచానికీ కూడా ఇదే సరియైన మార్గం. దాంతోనే మంచి జరుగుతుంది. గాంధీ సహాయనిరాకరణం ఆ మహత్తరమైన ఉద్దేశసాధనకి సహాయకారి అవుతుందా అవదా అని ఇప్పటివరకూ నా మనస్సులో గుంజాటన పడుతూ ఉన్నాను. కాని ఇప్పుడు నీ మాటలతో నా సందేహం తీరిపోయింది. విప్లవాన్ని ముందుకు తీసుకు వెళ్ళేవాళ్ళు సామాన్య ప్రజలు అని నువ్వు చెప్పగానే నా గుంజాటనా పోయింది.

గాంధీ విప్లవాన్ని దక్షతతో నడపగలడని నేను అనుకోటం లేదు సఫ్దాభాయీ! నా అభిప్రాయాన్ని స్పష్టంగా నీకు చెప్తున్నాను. ప్రజలమీద నాకు నమ్మకం వుంది. 1857 లో పదవీచ్యుతులైన సామంతరాజులు కొవ్వుతూటాల పేరు చెప్పి మతం ప్రమాదంలో పడ్డదని చెప్పి అబద్ధపు ప్రకటనలు చేసి ప్రజల్లో చాలామందిని తమ వేపుకి లాక్కోగలిగారు. కాని ఇప్పుడు తిండి సమస్య గురించి చెప్పి ప్రజల్ని ఇటు లాగుతున్నారు. అలా చెయ్యటం మంచిదే అని నేను అనుకుంటున్నాను. విప్లవ శంఖం పూరించటమూ ఉచితమే. గాంధీ భవిష్యత్తులో ఒకవేళ తన అసలు వైఖరికి వచ్చేసినా విప్లవచక్రాన్ని ఓసారి ముందుకు తిరిగినదాన్ని మళ్ళీ వెనక్కి మాత్రం తిప్పలేకపోతాడని నా నమ్మకం. విప్లవం ఆపడం ఎవరితరమూ కాదు!"

"అందుకే విప్లవ సేనలో చేరదామని నేను అనుకుంటున్నాను. సహాయ నిరాకరణవాదిని అవాలని అనుకుంటున్నాను."

"ఇంత తొందరగానా?"

"తొందరే ఉండి ఉంటే నేను ఇదివరకే రంగంలోకి దూకి ఉండేవాణ్ణి. పూర్వాపరాలు అన్నీ బాగా ఆలోచించి అర్థం చేసుకున్న తర్వాతా, నీ అభిప్రాయం తెలుసుకున్న తర్వాతా నేను నా నిర్ణయాన్ని నీకు చెప్తున్నాను."

సఫ్దర్ సీరియస్‌గా ఈ మాటలు చెప్తున్నప్పుడు శంకర్ ఎటో పరధ్యాన్నంగా చూస్తున్నాడు. శంకర్ ఏమీ మాట్లాడకపోవడం చూసి సఫ్దర్ మళ్ళీ ఇలా చెప్పాడు:

"తమ్ముడూ! నువ్వు బహుశా నీ ఒదినగారి పెదిమలరంగు గురించీ, ఆవిడ కట్టే ఖరీదైన సిల్కు చీరలూ, మఖమల్ చెప్పుల గురించీ, లేదూ ఈ బంగళా, ఈ వంటవాళ్ళ గురించీ ఆలోచిస్తూ ఉండివుంటావు! నేను సకీనాని ఏం బలవంత పెట్టను. ఆవిడకి ఎలా ఇష్టమైతే అలా ఉంటుంది. ఆవిడకి ఆవిడ సొంతఆస్తి ఉంది. ఈబంగళా, ఎన్నో మొఖాసా గ్రామాలూ, కొంత నగదూ కూడా ఉన్నాయి. వీటి వేటిమీదా నాకు మోజులేదు. ఆవిడ తన యిష్టప్రకారం తన జీవితాన్ని గడుపుకోవచ్చు."

"నేను ఒదినగారి విషయమూ, నీ విషయమూ ఆలోచించటం లేదు. నాగురించి నేను ఆలోచించుకుంటున్నాను. నా మనస్సులో వున్న గుంజాటన ఇప్పుడు పూర్తిగా పోయింది. మనం సోదరుల మిద్దరం ఒకేసారి విప్లవపంథాని చేపడ్దాం."

"శంకర్ ! ఆక్స్‌ఫర్డులో నువ్వు నాతోపాటు లేవే అని చాలా బాధపడేవాణ్ణి. ఇప్పుడు ఉరికొయ్యనైనా నవ్వుతూ ఎక్కగలను!" కళ్ళనిండా నీళ్ళు నిండుకురాగా సఫ్దర్ చెప్పాడు.

సకీనా భోజనానికి లేవండని పిలవడానికి వచ్చింది. వారి చర్చ ముగిసింది.

# 2

సకీనా సఫ్దర్ ఎంతో ఉల్లాసంగా ఉన్నట్టుగా గమనించింది. మరిది శంకర్‌తో కులాసాగా కబుర్లు చెప్పుకోవడం నుంచే భర్త అలా ఉల్లాసంగా ఉన్నాడని ఆవిడ అనుకుంది. తన నిర్ణయాన్ని సకీనాకి చెప్పడం సఫ్దర్‌కి గండ్రకత్తిలా ఉంది. నిజానికి సఫ్దర్ కూడా ఎంతో అల్లారు ముద్దుగా పెరిగాడు. అయితే పల్లె టూరి వాడవడాన్ని ఘోర దారిద్ర్యాన్ని ఎంతో జాలితో ఆయన చూసి ఉన్నాడు. దారిద్ర్యం అంటే ఏమిటో అతనికి తెలుసు. అందుకే అతనికి ఆత్మవిశ్వాసం కలిగింది. తనీ పరీక్షల్లో నెగ్గగలనని అనుకుంటున్నాడు. కానీ సకీనా సంగతి వేరు. ఆవిడ పట్నంలో ఓ పెద్ద ధనికుడి ఇంట పుట్టిపెరిగింది. "ఎండ కన్నెర గని రాజకుమార్తె" అని ఆవిడ గురించి చెప్పొచ్చు! ఆదివారంనాడు కూడా ధైర్యం చేసి సకీనాకి సఫ్దర్ చెప్పలేకపోయాడు. సోమవారంనాడు హైకోర్టులో తన సన్ని హిత మిత్రులకి తన నిర్ణయం గురించి చెప్పేశాడు. ఇహ సకీనాకి చెప్పక తప్పని పరిస్థితి వచ్చింది.

ఆ రాత్రి ఆయన లక్నోలో లభ్యమయ్యే ఖరీదైన సర్వోత్తమమైన"శాంపేను" తెప్పించాడు. ఇవాళ ఎవరో మిత్రుడు వస్తాడు కాబోలు అని సకీనా అనుకుంది. కాని భోజనం అయిన తర్వాత ఆయన పనిపిల్లవాణ్ని "శాంపేను" బాటిలు మూత విప్పి తీసుకురమ్మనమన్నప్పుడు సకీనాకి ఇదేమిటి చెప్మా అని కొంచెం కుతూహలం కలిగింది. సఫ్దర్ శాంపేను కప్పుని సకీనా నోటికి అందించాడు.

"సకీనా! నా చేత్తో ఆఖరిసారి ఇస్తున్న ప్రసాదం! పుచ్చుకో" అన్నాడు.

"మద్యం తాగడం మానేస్తున్నారా?"

"అవును, మానేస్తున్నాను. ఇంకా చాలా వదిలేస్తున్నాను. అయితే నిన్ను వది లెయ్యనులే! ఇహ ఇప్పట్నించి నువ్వే నాకు మత్తునిచ్చే మద్యానివి. నీ సౌందర్యాన్ని ఆస్వాదించి నా కళ్ళు మత్తుతో ఎర్రబడతాయి!"

ఆ మాటలు విని సకీనా మొహం వాడిపోయింది.

"సకీనా! ముందు మనం ఈ 'శాంపేన్' ని పూర్తిచేద్దాం. మాట్లాడుకోవలసి నది చాలా వుంది" అన్నాను.

సకీనాకి మద్యసేవనంవల్ల ఆనందం ఏం కలగలేదు. సఫ్దర్ ఉమర్ ఖయ్యాం రుబాయిలు ఎన్నెన్నో పాడి వినిపించినా ఆవిడకి సంతోషం కలగలేదు.

నౌకర్లూ, పనివాళ్ళూ అందరూ వెళ్ళిపోయారు. ఏదో అశుభం వినవలసివస్తుం దన్న శంకతో ముడుచుకుపోయి సకీనా సఫ్దర్ దగ్గరికి వచ్చి పడుకుంది. సఫ్దర్ చెప్పడం మొదలు పెట్టాడు—

"సకీనా! నేనో పెద్ద నిర్ణయం చేసుకున్నాను. అంత పెద్ద నిర్ణయం చేసు కునేముందు నీతో చెప్పి నువ్వు ఏమనేది వినాలనుకో-అలా చెయ్యకపోవడం నేరమే.

ఒప్పుకుంటున్నాను. నేనెందుకిలాంటి నేరం చేశానో నేను చెప్పేది విన్నాక నీకే అర్థం అవుతుంది. రెండు ముక్కల్లో చెప్పాలంటే నా నిర్ణయం ఇదీ- నేనిహ దేశ స్వాతంత్ర్యంకోసం పోరాడే యోధుణ్ణి కాబోతున్నాను."

సకీనాకి తన గుండె మీద పిడుగు పడ్డట్టుగా అనిపించింది. ఆవిడ నోటమాట రాలేదు. ఆవిడేం మాట్లాడక పోవడంతో సఫ్దర్ మళ్ళా అన్నాడు:

"సకీనా! నువ్వు పుట్టిన లగాయితూ సుఖంగా బతికేవు. కష్టాల్లోకి నిన్ను లాగాలని నాకు లేదు."

సకీనా గుండెకి మరోదెబ్బ గట్టిగా తగిలింది. దీంతో ఆవిడ మొదట తగిలిన దెబ్బని మరిచిపోయింది. ఆవిడలోని ఆత్మగౌరవం ఒక్కసారిగా మేల్కొంది.

"అయితే మీరు నిజంగానే నన్ను విలాసాల్లో మునిగితేలుతూ ఎప్పుడూ సుఖాన్నే కోరుకుంటూ ఉండేదాన్నని అనుకున్నారా! మీరు కష్టాలు పడుతూ ఉంటే సుఖంగా హాయిగా బతుకుతాననుకున్నారా? సఫ్దర్! మీరంటే నాకు నిజంగా ప్రేమ ఉంటే, మనసారా మిమ్మల్ని నావారని నేను అనుకుంటే మీతోపాటు నరకానికి రావడానికైనా సిద్ధపడనని ఎలా అనుకున్నారు? సుగంధ ద్రవ్యాలమధ్య విలాస వంతమైన జీవితాన్ని ఇంతవరకూ గడిపాను. నన్ను నేను అలంకరించుకోవడం లోనూ, నా ఇంటిని అలంకరించుకోవడంలోనూ నా సమయాన్ని వెచ్చించాను. జీవితంలోని కష్టం అంటే ఏమిటో తెలుసుకోవడానికి ఇంతవరకూ ప్రయత్నం చెయ్యలేదు. మీరే నా సర్వస్వం, సఫ్దర్! మీకు భారంగా వుండాలని నేను అను కోటంలేదు. మీతోపాటు ఉందామని అనుకుంటున్నాను. ఇంతవరకూ జీవితంలో అడుగుతో అడుగుకలిపి ఎలా నడిచామో భవిష్యత్తులోనూ అలాగే నడుద్దాము. నాకు మీరు మీతో కలిసి నడిచే తోవ చూపెట్టండి" అన్నది సకీనా.

సకీనా నిర్ణయాలు చాలా గట్టివని సఫ్దర్‌కి తెలిసినప్పటికీ ఆయన సకీనా ఇలాంటి నిర్ణయం తీసుకుంటుందని ఆశించలేదు.

"నేను కొత్తకేసుల్ని తీసుకోడం మానేశాను.పాత దావాల్ని కూడా ఎన్నిటినో ఎవరెవరికో అప్పచెప్పేయబోతున్నాను. ఈ వారంలోనే నాకు కోర్టు నుంచి సెలవు దొరుకుతుందని అనుకుంటున్నాను. మరోమాట సకీనా! శంకరూ నాతోపాటు ఈ సంగ్రామరంగంలో దూకబోతున్నాడు!" అన్నాడు సఫ్దర్.

"శంకరా?" సకీనా ఆశ్చర్యంగా అడిగింది.

"శంకర్ మణిపూస సకీనా, మణిపూస! వాడు నాతోపాటు ప్రపంచపు చివరల వరకూ ప్రయాణిస్తాడు. ఆక్స్‌ఫర్డ్‌లో వాడు నాతో లేడని నేనెప్పుడూ బాధపడేవాణ్ణి. ఎప్పుడూ జ్ఞాపకం వచ్చేవాడు."

"కాని శంకర్ త్యాగం మీ త్యాగంకన్నా గొప్పది సఫ్దర్!"

"త్యాగమయ జీవితాన్నే వాడు ఎంచుకున్నాడు సకీనా! కోరుండి, కావాలనీ స్వీకరించాడు. ఆ తోవనుండి ససేమిరా వాడు మరోతోవకి రాలేదు. లేకపోతే గొప్ప

వకీలు అయివుండేవాడు. ఇప్పుడు తను పనిచేస్తున్న విభాగంలోనూ బాగా మీతకి వచ్చి ఉండేవాడు."

"అతని పిల్లలిద్దరూ చనిపోయినప్పుడు నేనెంతో దుఃఖించాను. కాని నలుగురు పిల్లల్లో ఇద్దరు అలా పోవడంతో బరువు కాస్త తగ్గింది. మంచిదే అయింది. అని ఇప్పుడు అనుకుంటున్నాను."

"శంకర్ చేసుకున్న ఈ నిర్ణయానికి చంపా ఏమంటుందో సకీనా?"

"ఆవిడ ముందూవెనకా చూడకుండా కళ్ళు మూసుకునిమరీ సరే అంటుంది. ఆవిడ అలాంటిది. అవిజ్ఞించే మిమ్మల్ని ప్రేమించటం నేను నేర్చుకున్నాను."

"ఇహ భవిష్యత్తులో మనం ఎలా గడపాలో కూడా నిర్ణయించుకోవాలి."

"ఇప్పుడేగా మీరీసంగతి చెప్పారు! మన పద్ధతులు ఎలా మార్చుకోవాలో ఆలోచించడానికి వ్యవధి ఏదీ? మీరే చెప్పండి!"

"మన గ్రామంనుంచి వచ్చిన దాసీవాళ్ళు శరీఫనూ, మంగర్-ఈ ఇద్దర్నీ తప్పించి మిగిలిన పనివాళ్ళనీ నౌకర్లనీ ఓ నెల జీతం బక్షీసుగా ఇచ్చి మానిపిం చేద్దాం."

"బాగుంది, అలాగేచేద్దాం."

"రెండు మోటారుకార్లని అమ్మేద్దాం."

"సరే."

"ఒకటి రెండు మంచాలూ, కొన్ని కుర్చీలు తప్ప మిగతా సామానంతా పంచేయనన్నా పంచేద్దాం, లేదూ వేలం వేద్దాం."

"ఇదీ బాగుంది."

"లాట్స్‌రోడ్డుని ఉన్న హవేలీకి — పింతల్లిగారు ఇచ్చిందాంట్లోకి మారి పోదాం. ఈ బంగళాని అద్దెకిచ్చేద్దాం."

"మంచిది. బాగుంది."

"ఇంకేం చెయ్యాలో గుర్తుకు రావడంలేదు."

"ఈ బట్టలు? - ఈ విదేశీ వస్త్రాలు?"

"గాంధీ సహాయనిరాకరణలో చేరబోతున్నానని అంటున్నావా? ఈ వస్త్రాల్ని కాల్చడాన్ని నేను సమర్థించను. విదేశీ వస్త్రదహనం చాలాసార్లు ఇప్పటికే జరిగింది! అయినా ఖద్దరు చొక్కా పైజామా కుట్టి ఎల్లుండికల్లా తెస్తానన్నాడు. కుట్టమని చెప్పాను."

"భలే స్వార్థపరులు సప్పూ!"

"మోటగా బరువుగా ఉండే ఖద్దరు చీర నువ్వు కట్టుకుంటావా సకీనా?"

"మీతోపాటు ప్రపంచం చివరలకైనా వస్తాను!"

"మరి ఈ బట్టలో?"

"ఏం చెయ్యాలో తోచటంలేదు."

"వేలంలో అమ్ముడుపోతే ఆ డబ్బుతో బీదవాళ్ళకి బట్టలు కొని పంచిపెడతాను. పంచిపెట్టడానికి ప్రయత్నిస్తాను."

## 3

సఫ్‌దర్‌లాంటి వృద్ధిలోకి వస్తున్న బారిస్టరు ఇంత పెద్ద త్యాగం చేశాడని అందరూ అన్నిచోట్లా ప్రశంసిస్తున్నారు. అయితే తనకన్నా శంకరే ఆ ప్రశంసలకి అర్హుడని సఫ్‌దర్ అనుకుంటూ వుంటాడు. అక్టోబరులోనూ నవంబరులోనూ పూర్తిగా జనం మధ్యకివెళ్ళి ప్రచారం చెయ్యడానికి సఫ్‌దర్‌కి అవకాశం చిక్కింది. ఆయనతో పాటు చాలాసార్లు సకీనా వెళ్ళింది. శంకరూ వెళ్ళాడు. ఆయనకిపల్లెటూళ్ళంటే ఎక్కువ మక్కువగా వుండేది. పల్లెల్లో ఉండే రైతులన్నా శ్రామికులన్నా ఆయనకి ఎంతో విశ్వాసం. అంత విశ్వాసం పట్నాల్లో చదువుకున్న వర్గాలమీద ఉండేదికాదు. అయితే ఓ వారం రోజుల్లోగానే తాను మాట్లాడే సొంపైన ఉర్దూ నాల్గోవంతైనా జనానికి అర్థం కావటం లేదని ఆయన గుర్తించాడు. శంకర్ మొదట్నించీ జనం మాట్లాడుకునే భాషలోనే ఉపన్యాసాలు ఇవ్వడం మొదలుపెట్టాడు. జనంలో ఆ ఉపన్యాసాల ప్రభావాన్ని చూసి సఫ్‌దర్ కూడా జనం భాషా అవధీలో మాట్లాడాలని నిశ్చయించుకున్నాడు. మొదట్లో మొదట్లో అతని నోట పుస్తకాల భాషా ఆ బరువైన శబ్దాలూ వచ్చేవి. కాని తర్వాత్తర్వాత శ్రమపడి, శంకర్ సాయంతో రెండు నెలలు పూర్తికాకుండానే ఆయన తాను మర్చిపోయిన అవధీని, ఆ భాషలోని కొత్తమాటలని నేర్చుకున్నాడు. పల్లెల జనం ఆయన చెప్పే ప్రతిమాటనీ ఉత్సాహంతో ఊగిపోతూ సంతోషంగా వినడం మొదలుపెట్టారు.

డిసెంబరు (1920 సంవత్సరం) మొదటి వారంలో దేశంలోని చాలామంది దేశ సేవకుల్లాగానే శంకర్‌తోపాటు సఫ్‌దర్‌ని కూడా ఓ ఏడాది శిక్ష అనుభవించడానికి ఫైజాబాదు జైలుకి పంపారు. చంపా, సకీనా దేశసేవలో మునిగి వున్నారు. పని చేస్తూనే వున్నారు. కాని వాళ్ళు పట్టుబడలేదు.

జైలుకి వెళ్ళేక సఫ్‌దర్ రోజూ ఓ గంటసేపు నియమంగా రాట్నం వడికేవాడు. గాంధీకి వ్యతిరేకమైన రాజకీయ భావాలు కలిగున్నవాడని తెలిసిన వారు ఆయన రాట్నం వడకడం చూసి ఆక్షేపించేవారు.

"విదేశీవస్త్ర బహిష్కరణని నేను ఓ రాజకీయ అస్త్రంగా భావిస్తాను. దాంతోపాటు మనదేశంలో మనకి సరిపడినంత వస్త్రాల తయారీ జరగటంలేదని కూడా నేను ఎరుగుదును. అంచేత మనం వస్త్రాలని తయారుచెయ్యాలి. కాని మనదేశంలోని మిల్లులు మనకి చాలినంత వస్త్రాలని తయారుచేసే రోజు వచ్చినప్పుడు ఈ రాట్నాలని వడకడాన్ని నేను సమర్థించను" అనేవాడు సఫ్‌దర్.

జైల్లో ఏ పనీ లేకుండా కూచున్నవాళ్ళ సంఖ్యే ఎక్కువ. వీళ్ళు ఓ ఏడాదిలో

స్వరాజ్యం వస్తుందన్న గాంధీగారి మాటని నమ్ముకుని కూచున్నారు! జైలుకి వస్తే వారిపని పూర్తి అయిపోయిందని వాళ్ళు భావించారు. అప్పటికి ఇంకా గాంధీవాదం వల్ల మోసం, కపటం, నటన, బూటకం, ఆడంబరం రాలేదు. అంచేత సహాయనిరాకరణం చేసి జైలుకి వచ్చిన ఖైదీల్లో నిజాయితీపరులైన దేశసేవకులూ, దేశభక్తులూ ఎక్కువ సంఖ్యలో ఉన్నారని మనం చెప్పగలం. అయినప్పటికీ సఫ్దర్, శంకర్ వాళ్ళని చూసి విచారపడుతూ ఉండేవారు. వాళ్ళలో ఎవరికీ తమ రాజకీయ జ్ఞానాన్ని పెంచుకోవాలన్న ధ్యాస ఉండేదికాదు. వాళ్ళలో చాలామంది రామాయణాన్ని, భగవద్గీతని, ఖురానునీ చదివేవారు. తావళం పట్టుకుని జపం చేసేవారు. కొంతమందైతే పేకాడ్డంలోనూ, చదరంగం ఆడ్డంలోనూ తమ కాలాన్ని గడిపేవారు!

ఓ రోజు గాంధీవాది, రాజకీయ దురంధరుడూ, పండితుడూ అయిన వినాయక ప్రసాద్‌కి, సఫ్దర్‌కి మధ్య వాదం జరిగింది. అప్పుడు శంకర్ కూడా అక్కడే వున్నాడు.

"రాజకీయాల్లో అహింసని ఉపయోగించడం అన్నది గాంధీజీకనిపెట్టిన గొప్ప విషయం! అమోఘమైన అస్త్రం!" అన్నాడు వినాయక్ ప్రసాద్.

"మన ప్రస్తుత పరిస్థితిలో అది ఉపయోగకరమైనదే కావచ్చు. కాని అహింస అన్నదేమీ అమోఘ అస్త్రమూకాదు. నా తలకాయాకాదు! ప్రపంచంలో హింసకి పాల్పడని జంతువులు ఎన్ని ఉన్నాయో అన్నీ మిగిలిన జంతువుల హింసకి గురి అవుతూనే వుంటాయి."

"జంతువుల్లో కాకపోవచ్చుకాని మనిషికి మాత్రం అహింసవల్ల మహత్తరమైన శక్తి లభిస్తుంది"

"రాజకీయరంగంలో అలాంటి దృష్టాంతం ఎక్కడా కనిపించదు."

"కొత్తగా కనిపెట్టినదానికి దృష్టాంతాలు వెంటనే వుండవు."

"ఇదేం కొత్తగా కనిపెట్టినదేమీ కాదు." శంకర్ అన్నాడు:" బుద్ధుడు, మహావీరుడు మొదలైన మతప్రవక్తలు అహింసకి ఎక్కువ విలువ ఇచ్చి దీన్ని గురించి నొక్కి చెప్పారు."

"కాని రాజకీయరంగంలో మాత్రం కాదు."

"రాజకీయరంగంలో దీని ఉపయోగం పెరగడానికి కారణం ప్రస్తుతం మానవత్వపు విలువలు కాస్త పెరగడం. నిరాయుధులైన వారిమీద తుపాకీలని పేల్చడం తప్పని వార్తాపత్రికల్లో జనం గోలపెడుతున్నారు. జలియన్‌వాలాలో తుపాకీగుళ్ళ వర్షం కురిపించి దాని ఫలితం ఏమిటో ఇంగ్లీషువాళ్ళు చూడే చూచారు!"

"అయితే ఈ అహింసాత్మకమైన సహాయ నిరాకరణం స్వరాజ్యం సంపాదించడానికి సరిపడదంటారా?"

"ముందు స్వరాజ్యం అంటే ఏమిటో మీరు చెప్పండి!"

"మీరూ స్వరాజ్యపోరాటంలోకి వచ్చినవారే! మీరేమిటనుకుంటున్నారో అది చెప్పండి."

"ఆర్జించేవాళ్ళ రాజ్యం-కేవలం ఆర్జించేవాళ్ళ రాజ్యం అని నా అభిప్రాయం."

"అయితే మీ స్వరాజ్యంలో మనసా వాచా కర్మణా ధనం ఇచ్చి సహాయపడే వాళ్ళకీ, కష్టాలుపడి జైళ్ళకి వెళ్ళే విద్యార్థికులకీ, సేఠ్‌లకీ, సాహుకార్లకి, తాలూకా డార్లకీ ఏ హక్కూ ఉండదా?"

"సాహుకార్లకీ, తాలూకాదార్లకీ శాంతి సమావేశాలు ఏర్పరచడానికే తీరిక లేదే! అలాంటిది పాపం వాళ్ళు జైళ్ళకి ఎందుకు వస్తున్నారో? ఎవడైనా జైలుకి వచ్చాడా అతని స్వార్థమూ, ఆర్జించేవాడి స్వార్థమూ వేరు వేరు కాకూడదు."

శంకర్, సఫ్దర్ నిరంతరం గ్రంథాలని అధ్యయనం చేసేవారు. దేశంలోని ఆర్థిక సమస్యల గురించి, పాంఘిక సమస్యల గురించీ చర్చించేవారు. మొదట్లో మిగిలినవాళ్ళు వీళ్ళిద్దరి మాటలు వినడానికి వచ్చేవారుకాదు. కాని 1921వ సంవత్సరం డిసెంబరు 31వ తారీఖున అర్ధరాత్రి గడిచిపోయినా జైలు ద్వారాలు తెరుచుకోలేదు. దాంతో వాళ్ళు నిరాశపడ్డారు. చౌరీచౌరాలో భయభీతులైన జనం ఉత్తేజితులై కొంత మంది పోలీసులనిచంపారన్న వార్త విని గాంధీజీ సత్యాగ్రహాన్ని విరమించుకున్నాడని వాళ్ళకి తెలిసింది. ఇహ వాళ్ళలో చాలామందికి సీరియస్‌గా ఆలోచించక తప్పలేదు. తర్కించుకున్నమీదట సఫ్దర్, శంకరు వెలిబుచ్చిన అభిప్రాయాలతో ఏకీభవించారు.

"ప్రజలే విప్లవానికి శక్తిని ఇస్తారు! గాంధీ మెదడు ఇవ్వదు! ప్రజాశక్తి పట్ల గాంధీ తన అపనమ్మకాన్ని ప్రకటించి తాను విప్లవ వ్యతిరేకినని తనకి తాను ఋజావు చేసుకున్నాడు."

# సు మే రు డు

కాలం క్రీ.శ. **1942.**

1941 ఆగష్టు నెల. ఈ ఏడాది వానలు చాలా ఎక్కువగా వున్నాయి. ఎన్నోసార్లు ఎన్నోరోజులవరకూ సూర్య భగవానుడు ఎక్కడున్నాడో కనిపించనే లేదు. పాట్నాలో గంగానది పొంగి పరవళ్ళు తొక్కుతోంది. ఏ క్షణాన కట్ట తెంచుకుని నగరం మీదకి వచ్చి పడుతుందోనని అంతా భయపడుతున్నారు. కట్టదగ్గర కాపలా ఉండడం ఇలాంటప్పుడు చాలా అవసరం. పాట్నాలోని యువకులు—అందులోనూ ఎక్కువ మంది విద్యార్థులే- కట్ట కాపలా కాసే బాధ్యత తమమీద పెట్టుకున్నారు. పాట్నా కాలేజీలో ఎమ్మే మొదటి సంవత్సరం విద్యార్థి సుమేరుడు. దీఘా ఘాట్ దగ్గర డ్యూటీ అతనికి ఇచ్చారు. ఆవేళ అర్ధరాత్రప్పుడు గంగ మరింత ఉధృతంగా పెరుగుతున్నట్లుగా తోచింది. ఉదయం అయినా పెరుగుతూనే ఉంది కాని వెనక్కి తియ్యలేదు. కట్ట అంచుకింద జానెడు ఎడం మాత్రమే వుంది. జనం యావన్మందీ భయం భయంగా ఉన్నారు. అక్కడా అక్కడా కట్టపొడుగునా మధ్య మధ్యన వేలసంఖ్యలో జనం తట్టాపారా పట్టుకుని నిల్చున్నారు. ఇటికలతో కట్టిన ఆ కట్టని ఓ అంగుళం మేరకి మాత్రమే వాళ్ళు ఎత్తుచేయగలుగుతే చెయ్యగలుగుతారేమో! అదీ చెప్పలేం. సుమేరుడు కూడా పొద్దుట్నించీ కంగారు పడుతూ కట్ట మీద పచార్లు చేస్తున్నాడు. మధాహ్నానికి మెల్లి మెల్లిగా నీరు తియ్యడం మొదలు పెట్టింది. కంగారూ, భయంతో తిరుగుతున్న సుమేరుడికి కాస్త దిలాసా కలిగింది. తనకి దగ్గరగానే మరోవ్యక్తి కట్టకి కాపలా కాస్తూ ఉండడాన్ని సుమేరుడు చూశాడు. ఆ వ్యక్తి ఎంతో సౌమ్యమైనవాడిలా కనపడుతున్నాడు. అతనితో మాట్లాడాలని సుమేరుడికి ఉండుండి అనిపించింది కాని వరద భయంతో మనస్సంతా కంగారుగా వుండడాన్ని మాట్లాడలేకపోయాడు. ఇప్పుడు వరద తగ్గి నీరుతియ్యడం మొదలు పెట్టింది. ఆకాశంలో మబ్బులూ తేలిపోవడం మొదలుపెట్టాయి. సుమేరుడికి తన పక్కనే కాపలా కాస్తున్న ఆ వ్యక్తిని పలకరించి మాట్లాడాలనిపించింది.

వీరిద్దరిలో ఒకరు చామనఛాయగా ఉంటే ఇంకొకరు నల్లగా వున్నారు. అయితే ఇద్దరూ ఒకే ఎత్తు ఉంటారు. పొడుగూ కాదు పొట్టీకాదు....వయస్సయితే సుమేరుడు ఇరవైయొక్కేళ్ళవాడు. అందమైన యువకుడు. రెండో ఆయన నలభై ఏళ్ళవాడు.

స్థూలకాయుడూ కాస్త వయసు పైబడ్డవాడూను. సుమేరుడు ఖాకీ నిక్కరూ, పొట్టి చేతులతో కాలరున్న ఖాకీ చొక్కా వేసుకున్నాడు. అతని భుజాన్ని రెయిన్‌కోటూ కాళ్ళని నల్లటి రబ్బరు స్లిప్పర్లూ ఉన్నాయి. రెండో ఆయన ఖద్దరు పంచే, లాల్చీ తెల్లటివి వేసుకున్నాడు. నెత్తిన గాంధీ టోపీ, భుజాన్ని ఓ కంబళి, కాళ్ళకి ఏ చెప్పులూ లేవు. సుమేరుడు దగ్గరగా వెళ్ళి చిరునవ్వుతో అతనిని పలకరించాడు.

"అమ్మయ్య బతికించింది. నీరు తియ్యడం మొదలుపెట్టింది."

"మబ్బులూ విడిపోతున్నాయి."

"మనకందరికీ ఎంత కంగారూ భయమూ వేశాయో! నేటికి రెండున్నర వేల సంవత్సరాల క్రితం పాటలీపుత్ర నగరాన్ని నిర్మిస్తున్నప్పుడు గౌతమబుద్ధుడు మిగతా అన్నిటి దృష్ట్యా నగరం ఎంతో సమృద్ధమైనదేనని చెపుతూ పాటలీపుత్రానికి ముగ్గురు శత్రువులున్నారని కూడా చెప్పాట్ట. ఆ మూడూ నిప్పూ, నీళ్ళూ, అంతఃకలహాలూను! ఓసారి ఎక్కడో ఇదంతా చదివేను!"

"అయితే మీరు చరిత్ర విద్యార్థులా?"

"రాజకీయశాస్త్రం నా అసలు విషయం. అయితే చరిత్ర అంటే దాగా సరదా, ఇష్టమూను. ముఖ్యంగా మూలగ్రంథాల అనువాదాలు చదవడం అంటే నాకు ఎక్కువ ప్రీతి."

"నిజమే! మన శత్రువు నీరు ఎంతటిదో ఇప్పటికి చాలా రోజులబట్టీ మన కళ్ళతో మనం చేస్తూనే ఉన్నాం."

"అగ్ని భయాలు పాటలీపుత్రంలో కర్రతో కట్టిన ఇళ్ళు ఉన్న కాలంలో ఎక్కువగా ఉండి ఉంటాయి. టేకు అడవులకి అడవులు మనకి ఎక్కువగా ఉండడం నుంచి మరి ఇళ్ళు ఉండడమూ తప్పేదికాదు. అగ్ని భయమూ తప్పేదికాదు."

"ఇహ అంతఃకలహాలా, యావత్ భారతదేశపు సంపత్తినీ పోగొట్టుకునేటట్టు చేశాయి! మీ పేరేమిటో?"

"నా పేరు సుమేరుడు, పాట్నా కాలేజీలో ఎమ్మే మొదటి సంవత్సరం చదువుతున్నాను."

"నా పేరు రామబాలక్ ఓఝా. ఒకప్పుడు నేనూ పాట్నా కాలేజీ విద్యార్థినే. కాని ఇప్పటి మాటకాదు. ఇరవై ఏళ్ళ క్రితం సంగతి! ఓ మిత్రుడు గట్టి పట్టుబట్టబట్టి కాని లేకపోతే నేను ఎమ్మే పూర్తి చెయ్యకుండానే సహాయనిరాకరణంలో చేతిపనిచేసేవాణ్ణి. అలా అయినా బాగుండేది. విచారం లేకపోయేది. ఈ స్కూళ్ళలోనూ, కాలేజీల్లోనూ చెప్పే చదువులు అనర్థాలని ఈ మధ్య సంవత్సరాల్లో బాగా బోధపడ్డది."

"అయితే మీరు చదువుకున్న చదువునంతా పూర్తిగా వదిలేశారా? మరచిపోయారా?"

"పూర్తిగా మరచిపోగలిగితే, మళ్ళీ నా మెదడు చదువుముద్ర పడని ఖాళీ

పలక అయిపోతే ఎంత బాగుణ్ణు! అలా అయితే సత్యాన్ని సరిగ్గా అవగాహన చేసుకోగలిగేవాణ్ణి."

"అంటే బుద్ధినీ, వివేకాన్నీ వదిలేసి కేవలం పవిత్ర నమ్మకాలని పట్టుకుని కళ్ళు మూసుకుని నడిచేవారన్న మాట!"

"మనస్సుకున్న నమ్మకాలతో నడవడం మంచిది కాదంటారా సుమేర్ బాబూ?"

"నేనేం బాబుని కాదు రఘూగారూ! నేనో సామాన్యుడి కొడుకుని! అందులోనూ మాదిగవాడి కొడుకుని. మాకు ఓ మట్టి పెళ్ళ పాటి భూమన్నా లేదు. జమీందారు బలవంతాన్న జొరబడి అక్కడ తన తోట వేయించేసుకున్నాడు. అమ్మ ఇప్పటికీ వడ్లుదంచీ విసిరీ పొట్ట బోసుకుంటుంది. మొదట్లో ఓసత్పురుషుడు సాయం చేశాడు. తర్వాత స్కాలర్ షిప్పు దొరికింది. అందుకని ఇంతవరకూ రాగలిగాను. మీరు అనుకున్నట్టూ 'బాబూ' అనిపించుకునే అర్హత నాకు లేదు."

"అలవాటు కొద్దీ నా నోట ఆ మాట అలా వచ్చింది సుమేర్‌గారూ! అయితే మీ గురించి అంతా విన్నాక నాకు చాలా సంతోషంగా ఉంది. గాంధీగారి శిష్యుడికి ఓ హరిజన యువకుడు ఇలా బతుకుతో పోరాడుతూ ముందుకు రావడాన్ని చూసి ఎంత సంతోషం కలుగుతుందో మీకు తెలియదు!!"

"రఘూగారూ! మీతో మరోమాటకూడా చెప్దామనుకుంటున్నాను. స్నేహభావంతోనే సుమండీ! మీతో నాకు అభిప్రాయ బేదం ఉన్నదని మీకు ముందే తెలిస్తే మంచిది. 'హరిజనుడు' అన్న మాట అంటేనే నాకు మహా ఏవగింపు. 'హరిజన్' పత్రిక పాతమార్గాన్ని పోయే చాందస పత్రిక. భారతదేశాన్ని చీకటియుగాలకి తిప్పి తీసుకువెళ్ళే పత్రిక. ఇహ గాంధీగారా? ఆయన మా జాతికి పరమ శత్రువని నా అభిప్రాయం."

"గాంధీజీ మీ జాతికి ఏ ఉపకారమూ చెయ్యలేదని మీరు అనుకుంటున్నారా?"

"శ్రామికుడికి మిల్లు యజమాని ఎంత ఉపకారం చేస్తాడో అంత ఉపకారం గాంధీ మాకు చేశాడని ఒప్పుకుంటాను."

"గాంధీజీ యజమాని అవమని ఎప్పుడూ చెప్పరే!"

"జమీందార్లని, పెట్టుబడిదార్లని, రాజుల్ని పరిరక్షకులవాలనీ, గార్డియన్లవాలని అంటే దాని అర్థం ఏమిటి? మేం హిందువులనుంచి వేరై పోకూడదని గాంధీగారి భావన. అందుకే ఆయనకి మేమంటే ప్రేమ! పూనాలో ఆమరణ నిరాహార దీక్ష ఎందుకు చేశారంటారు? మేం హిందువులనుంచి వేరు పడి, మాదీ అని వేరే మాకు మేం ఉనికిని, అధికారాన్నీ ఏర్పరచుకోకుండా ఉండాలని!! హిందువులకి ఎన్నో వేల సంవత్సరాల నుంచి తమకి చవగ్గా దొరకే సేవకులు, దాసీ వాళ్ళు కావాలని అనుకున్నారు. మా జాతి వాళ్ళం వాళ్ళ ఆ అవసరాన్ని తీరుస్తూ వచ్చాం.

మొదట్లో మమ్మల్ని దాసులనే అనేవారు. ఇదిగో, ఇప్పుడు గాంధీజీ హరిజనులని మమ్మల్ని ఉద్ధరిస్తానంటున్నాడు. హిందువుల తర్వాత బహుశా మా పరమశత్రువు 'హరే' అవుతాడు. అలాంటివాడికి జనుడై ఉండడం అంటే మేమెందుకు ఇష్టపడ తామో మీరు చెప్పండి!"

"అయితే మీరు దేవుణ్ణి నమ్మరా?"

"ఏం చేశాడని నమ్మమంటారు? వేల సంవత్సరాలబట్టి మా జాతి పశువుల కన్నా హీనంగా ముట్టరాని జాతిగా అవమానించబడుతోంది. ఆ దేముడి పేరుతో హిందువుల్లోని పెద్దజాతులవాళ్ళు చెప్పే ప్రతి చిన్న విషయానికీ, దేముడు బుర్రూ పుతూ అవతారాలెత్తుతూ రథాన్ని తోలుతున్నాడు!! ఒకటికాదు రెండు వందల తరాలబట్టి మా ఆడవాళ్ళ మానాన్ని దోచుకుంటున్నారు. మమ్మల్ని సోన్‌పూర్ సంబరంలో, సంతల్లో పశువుల్లా అమ్ముతున్నారు. ఇప్పటికీ మేం తిట్లూ, చీవాట్లు తినడం, ఆకలితో మలమల మాడి చావడం దేవుడివల్లే అని చెప్తున్నారు! ఇంతయినా ఆ దేవుడికి చీమ కుట్టినట్టయినా లేదే! అలాంటివాణ్ణి మేం ఎందుకు నమ్ముతాం? మా నెత్తిని కష్టాలు తెచ్చి పెట్టేవాణ్ని!!"

"అయితే డాక్టరు అంబేద్కరు మార్గాన్ని అంగీకరించారన్నమాట?"

"తప్పు తప్పు డాక్టరు అంబేద్కరు స్వయంగా అన్నీ అనుభవించినవాడు! కాలేజీలో మొదటి రెండేళ్ళూ హిందూకుర్రాళ్ళు నన్నూ హాస్టల్లో ఉండనివ్వలేదు. అయినా అంబేద్కరు పద్ధతికీ అస్పృశ్యతా నివారణకి పూనుకున్న కాంగ్రెసు నాయ కుల పద్ధతికీ నాకు ఏం తేడా కనిపించలేదు. ఇంకా చెప్పాలంటే ఆ పద్ధతి గాంధీ–బిర్లా–బజాజ్‌ల పద్ధతిలో వెళ్ళి కలుస్తోందని నా అభిప్రాయం. అంటే వాళ్ళ ప్రకారం అస్పృశ్యుల్లోనూ కొంతమంది నెలనెల ఐదారు వేలు రాబడి తెచ్చుకునే వాళ్ళు తయారవుతారు. అస్పృశ్యుల్లో బిర్లాలూ బజాజ్‌లు కాకపోతే వేలు సంపాదించే వాళ్ళు తయారవుతారు. అస్పృశ్యులకి ఒకటో రెండో సంస్థానాలు లేకపోతే పోనీ, ఒకటో రెండో చిన్న చిన్న జమీందారీలు ఏర్పడతాయి. కాని దీనివల్ల పదికోట్ల అస్పృశ్యుల స్థితి ఏం మారదు."

"అంటే మీరనేది దోపిడీ పోవాలనా?"

"అవును. బీదవాళ్ళ కష్టార్జితంతో బాగా బలిసిపోతున్నవాళ్ళు భారత దేశంలో కలికంలోకన్నా లేకుండా పోతే అదిగో, అప్పుడూ మా సమస్య పరి ష్కారం అవుతుంది."

"మరి అందుకోసమే గాంధీజీ చేనేత బట్టలు, దంపుడు బియ్యం, వంటబెల్లం- ఒకటేమిటి అన్నిటినీ వాడమని, మిల్లు వస్తువుల్ని వాడొద్దనీ నొక్కి చెపుతున్నారు."

"అవును. చెప్తున్నాడు! బిర్లా బజాజ్‌ల డబ్బు ఆసరా చూసుకుని! ! ఖాదీ బోర్డుకి ఓ లక్షో రెండు లక్షలో నష్టం వస్తే ఎవడో ఓ సాహుకారు ఓ చెక్కురించి ఇస్తాడు! గాంధీగారి రాట్నం మగ్గాలవల్ల మిల్లులు మూల పడతాయనీ, ముత్యాల

హారాలూ, సిల్కు చీరలూ కలలో వస్తువులైపోతాయని వాళ్ళకి నిజంగా నమ్మకం కలిగితే ఈ సేఠ్‌లూ సేఠమ్మలూ గాంధీగారికి ఆరతులు పట్టడానికి రమ్మన్నా రారు. అది మాత్రం జ్ఞాపకం ఉంచుకోండి ఓఝాజీ!"

"అంటే మీరు గాంధీవాదుల్ని బ్రోకర్లని అనుకుంటున్నారా?"

"ఏ మాత్రమూ సందేహం లేదు! ఏ మాత్రమన్నా లోపం అన్నది ఉండి పోయి ఉంటే ఉన్న ఇంటికే ఎసరు పెట్టే పద్ధతికి వ్యతిరేకంగా హిందూస్థానీ సేఠ్ సాహుకార్ల మాటలకి తందానతాన పాడి ఆ లోపాన్ని తీర్చేశారు!"

"అంటే మీరనేదేమిటి? జపానువాళ్ళు వచ్చి పడబోతున్నారే—మిల్లులూ కార్ఖానాలూ తగలబెట్టి ధ్వంసం చెయ్యాలంటారా? భారతీయులు ఎంత కష్టపడి బాధ పడి ఈ కార్ఖానాలని మిల్లుల్నీ నిర్మించుకున్నారు! దాని సంగతీ మీరు కాస్త ఆలోచించాలి సుమేర్‌గారూ!"

"నేనూ భారతీయులు పడ్డ కష్టం గురించీ శ్రమగురించీ ఆలోచించాను. దాంతో పాటు గాంధీవాదులు అనే మాట గురించీ ఆలోచించాను. వాళ్ళు యంత్రాలు ఉండడాన్ని ఏ మాత్రమూ సహించమని చెప్తున్నారు! సేఠ్‌లు మన కార్ఖానాలు పదిలంగా భద్రంగా జపానువాళ్ళ చేతుల్లోకి పోవాలని అనుకుంటున్నారనీ నాకు స్పష్టంగా తెలుసు. జపానువాళ్ళు పెట్టుబడిదారీ విధానాన్ని పూర్తిగా సమర్థిస్తారు. జపాను రేడియో విన్న సేఠ్‌లకి బాగా నమ్మకమే- జపానువారి పరిపాలనలో తామే కార్ఖానాలకి యజమానులవుతామని వాళ్ళు అనుకుంటున్నారు. పోనీ ఇదంతా వదిలెయ్యండి-ఇంకే పెద్ద ఆదర్శాలకోసం వాళ్ళలో త్యాగభావం ఇలా పొంగి పొర్లుకు వస్తోందో చెప్పండి చూద్దాం!"

"దేశం సముపార్జించిన యావత్ సంపత్తిని కాపాడాలని అనుకుంటున్నారు."

"ఓఝాజీ! పుండుమీద కారం చల్లకండి! సేఠ్‌లకి దేశసంపత్తిని గురించి కాదు బాధ! వాళ్ళ సొంత సంపత్తుల గురించి వాళ్ళు పాపం బాధపడుతున్నారు! దేశం ఏ గంగలో పడ్డా వాళ్ళకేం అక్కరలేదు! ఎక్కువ కెక్కువ లాభాలు ఆర్జించడం వాళ్ళకి కావాలి. కూలివాళ్ళ కూలి ఓ నాలుగు డబ్బులు పెంచడానికి బదులు సమ్మెదారుల్ని తమ కార్లతో మట్టించే వాళ్ళకి దేశ సంపత్తిని పెంచాలన్న భావం, రక్షించాలన్న భావం ఉందని మరి చెప్పకండి!"

"వాళ్ళమాట పోనీ మీరన్నట్టూ ఒప్పుకున్నా గాంధీగారి నిజాయితీని మీరు శంకించకూడదే!"

"నిజాయితీని మనిషి మాటాడే మాటని బట్టీ వాడు చేసేపనిని బట్టీ నేను అంచనా కడతాను. గాంధీ పొలుతాగే పసిపాపని నేను అనుకోటం లేదు. "ఏంగ్రూస్ ఫండు" కోసం ఆయనకి ఐదులక్షలు కావల్సి వచ్చాయి. ఐదంటే ఐదురోజుల్లో బొంబాయి సేఠ్‌లు గాంధీగారి కాళ్ళముందు ఏడు లక్షలు కుప్ప పోశారు! సేఠ్ల కోసం ఇంత గొప్పపని చేస్తున్నారు కదా మరి! ఆయన కోసం ఇంగ్లాండులో సేఠ్‌లూ,

అమెరికాలో సేఠ్‌లూ ఏడు కోట్ల డబ్బు సంచులు యివ్వగలరు! ఇది చాలా చవక బేరం కదా మరి!"

"అంటే ఇది లంచం అంటారు!"

సేఠ్‌లు దేవుడికి కూడా కొంత ముట్టచెప్తారు- ఇదిగో ఈ భావంతోనే! వాళ్ళ గుమ్మాల మీద "లాభం - శుభం" అని రాసి ఉంటుంది!"

"అయితే రాట్నాల్నీ మగ్గాల్నీ దోపిడీకి శత్రువులనీ, దోపిడీని ఆపేసాధనాలనీ మీరు పరిగణించారా?"

"పరిగణించను సరికదా, పైపెచ్చు వాట్ని నేను దోపిడీని మరింత గట్టిగా పెంచే సాధనాలని అంటాను."

"అలాంటప్పుడు మిల్లుల్ని మీరు దోపిడీకి శత్రువులని అంటారా?"

"వాట్ని దోపిడీదార్లని నేనెందుకు అంటున్నానో చెప్తాను. వినండి.ప్రపంచం రాతి ఆయుధాల కాలం నుంచి వృద్ధి పొంది పొంది ముందుకు నడిచింది. అలాగే రాట్నాలూ మగ్గాల యుగం నుంచి యింకా ముందుకి పోయింది. పాట్నా మ్యూజి యంలో వెయ్యి సంవత్సరాల క్రితపువి పాత తాటాకు గ్రంథాల్ని నేను చూశాను. ఆ కాలంలో సేఠ్ సాహుకారుల చిఠావర్జాలు,నలందా విద్యార్థుల పుస్తకాలు,నోట్సులూ అన్నీ ఈ తాటాకుల మీదే రాయబడేవి. గాంధీగారిని ఏడు జన్మలపాటు ఘోషిస్తూ ఉండనివ్వండి- తాటాకు గ్రంథాల యుగానికి తిరిగి పోదాం అని అననివ్వండి! కాని దేశం టిట్టాఘడ్ కాగితాన్ని, మోనోటైపునీ, రోటరీ ముద్రణాలయాల్నీ వదిలి, ఈ యుగాన్ని విడిచిపెట్టి ఆ తాటాకు గ్రంథాల యుగానికి ససేమిరా మళ్ళదు! వెనక్కి వెళ్ళక పోవడమే మంగళదాయకం. వెనక్కి పోతే సేవా గ్రామంలోని భజనపాటల్ని ప్రచారం చెయ్యడానికి ఏమీ అంత పెద్ద కష్టం అవదుకాని ప్రతి వ్యక్తిని విద్యా వంతుడిగా చెయ్యాలంటే, అందులోనూ నేటివరకూ మానవుడు సముపార్జించిన జ్ఞానాన్నీ విజ్ఞానాన్నీ ప్రతివాడికీ అందచెయ్యాలంటే కష్టమా? కాదు, అసంభవం అవుతుంది. ఫాసిస్టు దోపిడీదొంగల టాంకులనీ, విమానాలనీ, జలాంతర్గాముల్నీ, విషవాయువుల్నీ ఎదురుకోవడానికి గాంధీజీ రాతి ఆయుధాల్ని ఉపయోగించమని, వెనుకటి మాటలు మాట్లాడితే ఏ మాత్రం బుర్రలో బుద్ధి ఉన్న జాతైనా ఒప్పు కుంటుందంటారా?ఒప్పుకోదు! ఎంచేతా అంటేఅది పూర్తిగా ఆత్మహత్యచేసుకోవడమే అవుతుంది."

"అహింసా సిద్ధాంతం మహత్తరమైనదనీ ఒప్పుకోరా?"

"గాంధీగారి అహింసా సిద్ధాంతం! ఆ దేవుడే రక్షించాలి! రైతుల మీదా కూలీల మీదా కాంగ్రెసు ప్రభుత్వాల ద్వారా కురిపించే తుపాకీ గుళ్ళ వర్షాన్ని సమ ర్థించే అహింస నాకు అర్థంకాదు! ఫాసిస్టు దోపిడీ హంతకుల ఎదుట నిరాయుధు లవాలని చెప్పే అహింసని అర్థం చేసుకోడం నాకు చేతకాదు! మీరడిగిన మొదటి ప్రశ్నకి నా సమాధానం ముందుగా వినండి. రాట్నాలూ మగ్గాలూ ఉపయోగించి

తయారుచేసే చేనేత బట్టలు తమ కార్ఖానాలకి ఏ మాత్రం హాని కలిగించలేవని సేఠ్‌లు ఎరుగుదురు! మిల్లు సరుకుకన్నా చవగ్గానూ నాణెంగానూ ఉన్న బట్టల్ని చేనేత వారు మార్కెట్టుకు యివ్వలేరు. వాళ్ళ ఉనికి సేఠ్ సాహుకార్ల దయాధర్మం మీదే ఆధారపడి ఉంటుంది. ఈ రాట్నాలూ మగ్గాలూ – దోపిడీకి అసలు మందు అయిన సామ్యవాదానికి, దాని దారికీ పెద్ద అడ్డంకిగా ఉన్నాయి. దోపిడీని అరికట్ట డానికి సామ్యవాదం కన్నా, మిల్లులూ కార్ఖానాలమీద ప్రజల పెత్తనం కన్నా రాట్నామూ మగ్గమే మంచి మందని ఎంతో మంది తమ తెలివితక్కువతనం వల్ల అనుకొంటూ ఉంటారు. ఇదిగో ఈ అభిప్రాయాల వల్లే ప్రపంచానికి మిల్లు బట్టలు ఇచ్చే సేఠ్‌లూ సాహుకార్లు రాట్నం భక్తులు అయ్యారు! గాంధీగారికి ఇదంతా బాగా తెలుసు!"

"ఆయన ప్రవర్తన మీదా అభిప్రాయాల మీదా మీరు దాడి చేస్తున్నారే?"

"ఆయన వేసే ప్రతి అడుగూ-ఆయన ప్రతి కదలికా దోపిడీకి గురి అవుతున్న జనానికి, ముఖ్యంగా మాకు–భారతదేశంలో అందరికన్నా ఎక్కువగా దోపిడీకి గురి అవుతున్న వాళ్ళం మేమే-మరీ ప్రమాదకరం? భావ దాస్యానికి ఆటపట్టులు, దోపిడీదార్లని పెంచి పోషించే పురోహితుల నెలవులు ఈ కోవెళ్ళు! వీటికి తాళాలు వేయించాలి! అలాంటిది పైగా పెచ్చు మమ్మల్ని ఆ ఉచ్చుల్లో బిగించడానికి గాంధీజీ మా కోసం ఆ కోవెళ్ళ ద్వారాలు తెరిపించాలని అనుకుంటున్నారు!! పాత గ్రంథాల్నీ, డబ్బున్నవాళ్ళు పడేసే డబ్బులికి కక్కుర్తిపడి పొట్ట పోసుకునే మహా త్ముల ప్రవచనాల్నీ తగలబెట్ట లేకపోతే పోయె- వాటిని ఏడేడు తాళాలు వేసి ఎవరి కంటా పడకుండా దాచెయ్యాలి. అలాంటిది గాంధీ వాళ్ళనే రక్షణకి ఆశ్రయించి మమ్మల్ని తప్పుదారి పట్టించాలని అనుకుంటున్నారు. అయితే దీనికి అనాసక్త యోగాన్ని జోడించి వినసొంపైన వ్యాఖ్యానం చేస్తున్నారు. ఇదంతా ఆలోచించి చూస్తే హరిజనోద్ధరణ ఓ పెద్ద బూటకం కాక మరేమిటి? దీనివల్ల పెద్ద జాతులకి చెందిన హరిజనోద్ధరణ చేసే కార్యకర్తలకి పొట్టపోసుకోడానికో ఆధారం దొరికితే దొరకొచ్చు కాక కాని ఉద్ధరణ ఏదో జరుగుతుందనుకోడం ఏమీ తెలీని గుడ్డివాడు అనుకోవలసినదే!"

"అస్పృశ్యులు సవర్ణులూ అంతా ఏకమవ్వాలని మీరు అనుకోటం లేదా?"

"కాలమే మనల్ని కలిపింది. కాని గాంధీ ప్రీతిపాత్రమైన మతమూ, దేవుడూ, పాత పద్ధతులూ దాన్ని అర్థం చేసుకోనివ్వటం లేదు. నన్నే చూడండి ఓర్ఘాజీ! నా రంగు చామన ఛాయ–ముక్కు సూదిగా సన్నగా ఉంది. మీ రంగు నలుపు, ముక్కు చప్పి, దీని అర్థం ఏమిటి? నాలో ఆర్యరక్తం ఎక్కువగా ఉంది. మీలో నా పూర్వీకుల రక్తం ఎక్కువగా ఉంది. మీ పూర్వీకులు వర్ణవ్యవస్థ అనే ఇనప చట్రాన్ని తయారు చేసి రక్తం కలుషితం కాకూడదనీ, కలవకూడదనీ కోరు కున్నారు కాని వాళ్ళ కోరిక సిద్ధించ లేదు. దానికి సాక్ష్యంగా మనం ఇద్దరమే!!

ఓల్గా గంగా తీరాల రక్తం ఒక దానితో ఒకటి కలిసి పోయాయి. ఇప్పుడు రంగు (వర్ణం) కోసం తగాదా లేదు-మిమ్మల్ని బ్రాహ్మణుడు కాదని ఎవరూ వెలివెయ్య డానికి సిద్ధపడరు. మతాన్నీ దేవుణ్ణీ పాత ఆలోచనా పద్ధతినీ మనం వదిలి పెడితే అన్నీ సవ్యం అయిపోతాయి! దోపిడీదారులూ, వాళ్ళని పోషించి పెంచే గాంధీజీ లాంటి వాళ్ళూ ఉన్నంత వరకూ ఇది సంభవం కాదు!"

"మీ కటువైన మాటలు విని నేనేం కోపం తెచ్చుకోటం లేదు."

"మండుతున్న మనస్సు, ఉరకలెత్తే వయస్సు నా చేత మాట్లాడిస్తున్నాయి ఓఝాజీ! నా మాటలు మీ మనస్సుని నొప్పిస్తే క్షంతవ్యుణ్ణి!"

"నేనేం మీ మాటల్ని తప్పుపట్టం లేదు. కాని ఒక్క విషయం- రాట్నం మగ్గం లాంటి మన గడ్డమీది వస్తువుల్ని మళ్ళీ తీసుకురావడం అన్నది సంభవం కాదని మీరంటున్నారే-మరి అలాంటప్పుడు విదేశీ సామ్యవాదాన్ని ఈ గడ్డ మీద తేగలుగుతామని అనుకుంటున్నారా?"

"దోపిడీదార్లకి ఇష్టం లేని దేదైనా వివేకానిదీ, సంభవం కానిదీ అయి పోతుంది!! పంచదార మిల్లులూ, విదేశీ ఓడలు, కార్లు, గాజు, ఫౌంటన్ పెన్నులు, బూట్లు, విద్యుత్తుతోనూ, ఆవిరితోనూ నడిచే లక్షలూ కోట్లూ ఫ్యాక్టరీలు- ఇవేవీ వీళ్ళకి ఈ సేఠ్ సాహుకార్లకి విదేశీవి కావు! అవునుమరి, వీటివల్లే వీటిదయవల్లే వాళ్ళు కోటీశ్వరులయ్యారు! రేడియో, టెలివిజనూ, ఫిల్ములు, ట్యాంకులు, ఇవన్నీ శ్రామికుల ఆర్జితాన్ని-కోట్ల కొద్దీ రూపాయిలని రెండో కంటి వాడికి తెలీకుండా సేఠ్‌ల జేబుల్ని నింపుతాయి. అవి విదేశీవి కాకుండా పోతాయి! దోపిడీకి పనికి వచ్చే సమస్తమైన విదేశీ యంత్రాలూ వాళ్ళకి స్వదేశీవే! కాని దోపిడీని సర్వనాశనం చేసే సాధనం—సామ్యవాదం మాత్రం ఎప్పటికీ విదేశీదే! దీన్నే నిజాయితీ అంటారు ఓఝాజీ!"

"సామ్యవాదం మతానికి శత్రువు. భారతదేశం అనాదినుంచి మతపరమైన దేశం. ఈ చిక్కు గురించి కూడా కొంచెం ఆలోచించాలి సుమేర్‌గారూ!"

"మీరేమో కాలేజీలోనూ స్కూల్లోనూ చదివిన చదువుల్ని మర్చిపోయానని అంటున్నారు. ఇహ నేనేం చెప్పగలనూ? మతం అని మీరు అన్నప్పుడు మీ దృష్టిలో కేవలం హిందూమతం మాత్రమే ఉంది! గాంధీజీ బజాజ్‌గారి గోసంరక్షణా సంస్థల్ని ఆశీర్వదించి బలపరచారు! వాటిలో గోమాంసం తప్ప మిగిలిన వన్నిటినీ, ఆవుకి సంబంధించిన వాటిని తింటామని ప్రతిజ్ఞ చేయిస్తారు- గోమూత్రాన్నీ గోమయాన్నీ కూడా!! గోభక్షణ చేసే వారినీ, చెయ్యని వారినీ లెక్కబెట్టి చూస్తే భారతదేశంలో గోభక్షణ చేసే వారే సగంకన్నా ఎక్కువ తేలుతారు. మా జాతీ గోభక్షక జాతే, మీకా సంగతి తెలుసు. అలా అనుకుంటే భారతదేశంలో దగ్గరదగ్గర నాలుగోవంతు ముస్లిములు ఉన్నారు. సుమారు కోటి మంది క్రైస్తవులూ, కొన్ని లక్షల మంది బౌద్ధులు ఉన్నారు. మీరు ఈ మతాల్ని మతంలో కలిపితే ప్రపంచంలో ఏ దేశం

మతాన్ని నమ్మటం లేదో చెప్పండి? గాంధీజీ మిత్రుడు మాజీ లార్డు ఇర్విసుగారు, ఇప్పటి లార్డు హెలిఫెక్సూ ఇద్దరూ గట్టి క్రైస్తవ సాధువులే!! మత రక్షణ పేరుతోనే మతప్రియులైన బ్రిటిషువారు సామ్యవాదానికి దూరంగా ఉండాలంటూ ఈ సాధువులైన మహానుభావులే ప్రచారం చేస్తున్నారు. అరబ్బు, టర్కీ, ఇరాను, అఫ్ఘనిస్తాను దేశాల్లోని ముస్లిములకి హిందూ దేశపు ముస్లిములకన్నా మతాభిమానం తక్కువ ఏం లేదు. లక్షలాదిమంది అందమైన పడతులు స్వయంగా ఇష్టపడి మరీ తమ జుట్టుని కత్తిరించి ఇవ్వగా దాంతో పేనిన తాళ్ళతో కోవిళ్ళు కట్టడానికి కర్రలు మోసుకుని వెళ్ళారు. ఎక్కడా? జపానులో!! ఆ జపానుకి మతాభిమానం ఏం తక్కువ లేదు! దోపిడీ దారులందరూ మాంచి మతాభిమానం కలవాళ్ళే అవుతారు ఓర్భూజీ!! దోపిడీని వ్యతిరేకించేవారూ, దోపిడీకి బద్ధశత్రువులూ మతానికి శత్రువులుగా పేరు పడిపోతారు! సామ్యవాదాన్ని పోనీ విదేశీది అని అనుకున్నా క్రైస్తవం, ఇస్లాం లాంటి విదేశీ మతాలూ, రైళ్ళు, తంతి, విమానాలు, మిల్లులూ, కార్ఖానాలూ లాంటి విదేశీ వస్తువులు మన కళ్ళముందు స్వదేశీవిగా చెలామణి అవుతూ ఉండడం చూస్తున్నాం. అలాగే సామ్యవాదమూ స్వదేశీది అయిపోతుంది. అయిపోతుందేమిటి-అయిపోయిందప్పుడే!!"

# 2

పాట్నాలో సాయంత్రం పూట షైరు వెళ్ళడానికి రెండే రెండు స్థలాలు ఉన్నాయి. ఒకటి లాను, రెండోది హార్డింగు పార్కును. రెండింటికి రెండూ ఒక్కలాగే ఉన్నాయి! ఎవరూ అక్కడికి వెళ్ళడానికి ఉత్సాహపడరు! అయినా కులాసాగా తిరుగుదామనుకునే వాళ్ళూ, పచార్లు చేద్దామనుకునే వాళ్ళూ స్నేహితులతో చర్చలు సాగిద్దామనుకునేవాళ్ళూ ఈ రెండు చోట్లకీ వస్తూ వుంటారు. చీకటి పడిపోతోంది. అయినా ఆ ముగ్గురి యువకుల మాటలు పూర్తవటం లేదు. బాంకీపూర్ (పాట్నా) లానులో (మైదానం) కూచుని ఉన్నారు.

"నేస్తం! సుమేర్! మరోసారి ఆలోచించమని నా సలహా. నువ్వు పెద్ద అడుగే వెయ్యబోతున్నావు!" అన్నాడు ఓ యువకుడు.

"మృత్యువుతో పోరాడ్డానికి మించి వేసే అడుగు ఏం ఉంటుంది కనుక? రూప్! నేనేం తొందరపాటు నిర్ణయం తీసుకోలేదు. అది మాత్రం నిజం. ఇలాంటిది తొందరలో చేసుకునేది ఎంతమాత్రం అవదు!"

"గాల్లో ఎగరడం భాయీ!! నాకైతే మేడమీద జాలు దగ్గర నిల్చోడానికి కూడా భయమే!"

"ఎంతో మంది సైకిలు ఎక్కడానికీ భయపడతారు. నువ్వు రెండు చేతులూ వదిలేసి మరీ తొక్కుతావు!"

"కాని నాకిదేం అర్థం కావటం లేదు! మామూలు కూలీదాని కొడుకు సుమేర్‌కి ఈ సామ్రాజ్యవాదపు యుద్ధంలో ప్రాణాలివ్వాలని ఎందుకు తోచిందిటా?"

"ఈ యుద్ధంతో కూలిదాని కొడుకు భవిష్యత్తూ, వాడి వర్గం యావత్తు భవిష్యత్తూ ముడిపడి ఉంది. అదీ కారణం! ఈ యుద్ధంతో సామ్రాజ్యాల నిర్ణయమే కాదు అవబోయేది! దోపిడీవిషయమై కూడా నిర్ణయం జరుగుతుంది!"

"ఈ యుద్ధానికి కారణమూ, దోషమూ అందరికన్నా ఇంగ్లీషు పెట్టుబడిదారులదే అని నువ్వు ఒప్పుకోవా?"

"బాల్డ్‌విన్, చాంబర్లేనూ వాళ్ళ స్వార్థానికి ప్రాతినిధ్యం వహిస్తున్నారనేనా? ఆహా, దాన్ని నేను ఒప్పుకుంటున్నాను. వాళ్ళే ముసోలినీని, హిట్లరునీ పోషించి పెద్దవాళ్ళుగా చేశారు. దాంతో దోపిడీదారీ వర్గానికి సామ్యవాదుల బెడద తీరి వాళ్ళ ప్రాణం హాయిగా వుంటుందని వాళ్ళ భావన. కాని భస్మాసురుడు ముందు శివుడి నెత్తినే చెయ్యి పెట్టాలని అనుకున్నాడు!! బాగానే ఉంది అని నేనూ తమాషా చూస్తూ సంతోషించాను. అందుకే ఇప్పటివరకూ ఇంత పెద్ద నిర్ణయం తీసుకోలేదు. కాని ఇప్పుడు భస్మాసురుడు శివుడినెత్తిని కాదు, మన నెత్తిన చెయ్యి పెట్టాలని చూస్తున్నాడు!"

"మన నెత్తినా? నాకైతే పూర్వానికి ఇప్పటికీ ఏం తేడా కనిపించటం లేదు!"

"మీకేం తేడా కనపడదు! ఎందుకంటారా? మీ వర్గం- ధనికవర్గం-ఫాసిస్టు పరిపాలనలోనూ నేతి భోజనాన్నే చెయ్యొచ్చునని అనుకుంటుంది? క్రుస్ మిత్సుయీకి ఈ యుద్ధంవల్ల అంతా లాభమే! కాని సోవియట్‌దేశం కాని ఓడిపోయిందా దోపిడీకి గురి అవుతున్న కూలీలకీ, రైతులకీ ఇంక ఏ ఆశా ఉండదు. కసాయివాళ్ళు హిట్లరూ, తోజోల పరిపాలనలో రైతులు బతుకు బతుకంతా పోరాడలేరు రూప్ కిశోర్ బాబూ! ఫాసిజం రైతుకూలీలని పూర్తిగా బానిసలుగా చేద్దామని కోరుకుంటుంది. సోవియట్‌దేశం అంటే మా దృష్టిలో అన్ని దేశాల మధ్యా ఓ దేశం కాదు! ఆ దేశం ఒక్కటే మాకు దేశం!! ప్రపంచం మొత్తాన్ని రైతుకూలీలు దానిమీదే అంత ఆశా పెట్టుకున్నారు. అదే తమ దేశం అంటారు. నూటయాభై ఏళ్ళపాటు లక్షలాది మంది, కోట్లాది మంది తమ ప్రాణాలని అర్పించి పోరాడితే మానవత్వం కోసం, అనాది నుండి దోపిడీకి గురి అవుతున్న జనం కోసం ఈ సామ్యవాద దీపం భూమ్మీద తన వెలుగుని ప్రసరింపచేస్తోంది. ఓసారిగాని దీపాన్ని ఆర్పేశారా మళ్ళీ ఎన్నాళ్ళ వరకో ప్రపంచం చీకట్లలో మగ్గిపోతుంది! మా కంఠంలో ప్రాణం ఉండగా ఈ దారుణ కృత్యాన్ని మా కళ్ళముందు జరుగుతూ ఉంటే చూస్తూ ఊరుకోలేము."

"కాని ఒకటి సుమేర్‌భాయీ! దేశంలో ఇంకా చాలామంది సమాజ వాదులు ఉన్నారే- వాళ్ళూ ప్రపంచంలో జరుగుతున్న దోపిడీని రూపుమాపుదామనే అనుకుంటున్నారు."

'సేవాగ్రామం నుంచి వ్యాపిస్తున్న చీకట్లనే వెలుగురేఖలని అనుకునే సమాజ

వాదుల నుంచి మనల్ని దేవుడే కాపాడాలి! అలా అనుకుంటే హిట్లరూ తననిసమాజవాది అనే చెప్పుకుంటాడు. గాంధీజీ శిష్యులూ వారిని సమాజవాది అనే చెప్తారు! సమాజవాదిని అని చెప్పుకున్నంత మాత్రాన ఎవరూ సమాజవాదులు అయిపోరు. హిట్లరూ, తోజో కలిస్తే హిందూదేశంలో పెట్టుబడిదారీ విధానం, పెట్టుబడిదారీ వర్గం సమసిపోవు. మరింత దృఢపడతాయి. తెల్సా? కాని ఫాసిస్టు రాక్షసులు రైతుకూలీలని ఊపిరి తీసు కోనివ్వరు. సామ్యవాదుల స్థితి ఏమవుతుందో తెలుసుకోవాలనుంటే ఇటలీ జర్మనీల ఈ మధ్య చరిత్రని చూడండి, అదే ఎందుకూ? ఫ్రాన్సులోనే, కేవలం ఒక్క ఫ్రాన్సు లోనే ప్రతీరోజూ కమ్యూనిస్టుల్ని కాల్చి చంపేస్తున్నారే—వాళ్ళని చూడండి! తనని మార్క్సిస్టువాది అని చెప్పుకుంటూ ఈ యుద్ధానికి దూరంగా ఉన్నవాడు తనని తాను మోసం చేసుకుంటూనేనైనా ఉండాలి. లేదూ అంటే ఇతరులనైనా మోసం చేస్తూ వుండాలి. హిట్లరూ తోజోల పరిపాలనలో మార్క్సిస్టువాదాన్ని నమ్మిన సమాజ వాదుల ప్రాణం ఖరీదు ఓ తుపాకీ గుండు మాత్రమే! ఈ సంగతి మనకి బాగా తెలుసు. అలాంటప్పుడు ఏ సమాజ వాదైనా తనని తటస్థుణ్ణని చెప్పుకున్నాడా వాడు గబ్బిలాయి అన్నమాట! గోడమీద పిల్లివాటం అన్నమాట! సోవియట్ దేశం ధ్వంసం అయిపోయాక సమాజవాద పతాకాన్ని తాము ఎగరేస్తామని చెప్పుకునేవాళ్ళని పిచ్చివాళ్ళనైనాఅనాలి. లేదూ అంటే వంచకులూ మోసగాళ్ళనైనా అనాలి!"

"అంటే ఈ యుద్ధంలో ఎవరూ తటస్థంగా ఉండలేరనా మీ ఉద్దేశం?"

"అవును. ఖచ్చితంగా అదే నా అభిప్రాయం. స్పష్టంగా ఆలోచించ గలిగిన వాడు ఏదో ఓ పక్షాన్ని స్వీకరిస్తాడు. ఎంచేతా అంటే ఈ యుద్ధ పరిణామం ఒక వేళ అయితే దోపిడీని వ్యతిరేకించే శక్తుల్ని సర్వనాశనం చెయ్యడం అవుతుంది. లేదా ఆ శక్తుల్ని మరింత దృఢపరచి మళ్ళీ ముసోలినీ, హిట్లరూ, తోజో, లేదూ వాళ్ళ బాబులు బాల్డుబిన్, చేంబర్‌లేను, హెలీఫెక్సు లాంటి వాళ్ళకి ఈ ప్రపం చంలో చోటులేకుండా చెయ్యడం అవుతుంది! హిందూదేశంలో సుభాష్‌చంద్రుడూ అతని అనుయాయులూ తమ పక్షమేమిటో తమ స్థానమేమిటో నిర్ణయించేసుకు న్నారు. వాళ్ళ తటస్థత పైపైది మాత్రమే. వాళ్ళకి ఫాసిస్టు కదలికలు తెలియని వేంకావు."

"కాని మన దేశంలోని ఇంగ్లీషు పరిపాలకుల భావాలు ఎలా ఉన్నాయో చూస్తు న్నావు కదా?"

"వీళ్ళు గుడ్డివాళ్ళు. ముప్పై ఏళ్ళ క్రితంలాగే ఇప్పుడూ ఉండడానికి ప్రయ త్నిస్తున్నారు. యుద్ధం తర్వాత ప్రపంచం ఈ పాత నిర్ణయాలని పట్టుకుని నడు స్తుందని అనుకుంటావా? మనం యుద్ధానికి ఆయత్తమవుతూ వుంటే అడుగు అడు గునా వీళ్ళు అడ్డంకులు కల్పిస్తారు. ఎంచేతా అంటే ప్రతీదాన్నీ గతించిన కాలపు దృష్టితోనే వీళ్ళు చూస్తారు. ఇది మనకి తెలియనిదేం కాదు."

"అవును. చూస్తున్నావుగా! శాంతి సమావేశాల్లో కనిపించే మొహాలు, ఇప్పుడు జాతీయస్థాయి నాయకులైపోయి ప్రజలముందు గర్జిస్తున్నారు! మన గవర్నర్లు, గవర్నరు జనరలు ప్రజల్ని ప్రాణత్యాగం చెయ్యాలని ప్రబోధిస్తున్నారు. మనకి వాళ్ళ ఖర్చులు చూస్తే బుర్ర తిరిగిపోతుంది! మన దేశంలో కూలీవాడికి కనీసపు కూలీ రోజుకి అణా. ఆ లెక్కని ఏడాదికి ఇరవై అయిదు రూపాయలు ఆర్జన అన్నమాట! మరి వీళ్ళ జీతాలో?

| | | | |
|---|---|---|---|
| వైస్రాయి | 2,50,800 | అంటే కూలివాడి ఆర్జనకి | 10,000 (వంతులు) రెట్లు |
| బెంగాలు గవర్నరు | 1,20,000 | | 4,800 (వంతులు) రెట్లు |
| సంయుక్త ప్రాంతం గవర్నరు | " | | " " " |
| బీహారు గవర్నరు | 1,00,000 | | 4,000(వంతులు)రెట్లు |

మిగతా ఖర్చులు వదిలిపెట్టి ఈ పద్దు! మిగతా ఖర్చులు కూడా కలిపితే ప్రయాణపు ఖర్చులు. సెలవు ఖర్చులు వదిలేసినా బెంగాలు గవర్నరు సాలీనా ఖర్చు 6,07,200 రూపాయలు. అంటే కూలివాడి ఆర్జనకి 42,291 వంతులు. దీంతో ఇంగ్లాండులోని కూలీవాడి కూలీని పోల్చి చూడండి. అక్కడ కూలి తక్కువకి తక్కువ 85 షెల్లింగులు. యాభై ఆరున్నర రూపాయిలకన్నా ఎక్కువ) లేదూ 75 షిల్లింగులు(52 రూపాయిలకన్నా ఎక్కువ) ప్రతి వారానికి బొగ్గుగనుల్లో యివ్వాలని నిర్ణయించారు. వ్యవసాయ కూలీకి కూడా వారానికి 45 రూపాయిలకన్నా ఎక్కువే దొరుకుతాయి. అంటే 200 లేదూ 121 పౌండ్లు సాలీనా కూలీ కన్నా మహామంత్రి కేవలం 36 రెట్లు ఎక్కువ జీతం పుచ్చుకుంటున్నాడన్నమాట. సోవియట్ దేశంలో 12,000 రూబుల్లు మహామంత్రికి ఇస్తారు. కూలీల్లో చాలామంది ఇంత జీతమూ పుచ్చుకుంటున్నారు. తక్కువకి తక్కువ జీతం పుచ్చుకుంటున్న కూలీకి కూడా దానిలో ఆరోవంతుకన్నా తక్కువ జీతం వుండదు. సరిపోల్చి చూడండి."

| | | |
|---|---|---|
| భారతదేశంలో బెంగాలు గవర్నరు | కూలీకన్నా | 42,292 రెట్లు |
| ఇంగ్లాండులో మహామంత్రి | " | 36 రెట్లు |
| సోవియట్ రష్యాలో మహామంత్రి | " | 6 రెట్లు |

"దనవంతులయిన సేఠ్‌ల సంపాదనతో కూలీవాడి ఆర్జనని పోల్చిచూడు. గుండె బద్దలవుతుంది!"

"దారుణమయిన దోపిడీ! సుమేర్ భాయీ!"

"హిందూదేశంలో ఉద్యోగాలు చేస్తున్న స్వార్థపరులు, పిరికివాళ్ళు, దూరదృష్టి లేనివాళ్ళు ఈ అయిన ఇంగ్లీషువాళ్ళమీద మనం ఏ ఆశా పెట్టుకోలేం అని అందుకే నేను చెప్తున్నాను! మనం వీళ్ళకోసం ఈ యుద్ధాన్ని చెయ్యడానికిగాని గెలవడానికి గాని వెళ్ళటం లేదు. మనం ప్రాణాలు అర్పించబోతున్నాం- ఆ ప్రపంచం కోసం! భూమ్మీద ఆరోవంతు భాగంలో అప్పుడే ఏర్పడిన ప్రపంచం కోసం; ఫాసిస్టులు ఆ ప్రపంచాన్ని తుడిచేద్దామనుకుంటున్నారు. ఆ రాబోయే ప్రపంచం కోసం ప్రాణాలివ్వబోతున్నాం! ఆ ప్రపంచంలో మానవత్వం స్వేచ్ఛగా వృద్ధిచెందుతుంది!"

సమద్ ఇప్పటివరకూ ఏం మాట్లాడకుండా వింటూ కూర్చున్నాడు. ఇప్పుడు అతడూ ఏదో అడగాలని అనుకున్నాడు.

"నేస్తం, సుమేర్! నువ్వు చెప్పిన వాటిలో చాలావరకూ అన్నిటితో ఏకీభవిస్తున్నాను. కొన్నిటిని మాత్రం ఒప్పుకోలేను. అయితే నీ అభిప్రాయాలని నేనెంత గౌరవిస్తానో నీకు తెలియనిది ఏంకాదు. యావత్ ప్రపంచాన్ని చుట్టబెట్టిన ఈ యుద్ధం విషయంలో తటస్థంగా ఉండలేమన్నదాన్ని నేనూ అర్థం చేసుకున్నాను. కాని నేస్తం! ఎంపికా అదీ అయిపోయి జాయినైపోయాక నువ్వు మాకు చెప్పావు. కాస్త ముందే చెప్పాల్సినది."

"ముందుచెప్పి ఎంపికలో ఎంపిక కాకపోతే! అందుకని ప్రవేశించాక ఇరవై నాలుగు గంటలు ఎగిరాక నేస్తాలతో చెప్పాను. ఇప్పుడు చెప్పటానికి అభ్యంతరం ఏంలేదు. ఎల్లుండే నేను అంబాలా వెళ్ళిపోతున్నాను వైమానిక శిక్షణా కేంద్రానికి!!"

"మీ అమ్మగారికి తెలియజేశావా?"

"అమ్మకి ఏదైనా ఒకటే. పాట్నా యెంతో అంబాలా కూడా అంతే. అంతా విడమర్చి స్పష్టంగా నేను యుద్ధంలోకి వెళ్తున్నానూ ప్రాణాలకి తెగించి యుద్ధం చెయ్యటానికి అని చెప్పేంతవరకూ ఏదైనా ఆవిడకి ఒకటే! విడమర్చి ఉన్నది ఉన్నట్టు ఉత్తరం రాయడం అంటే ఇహ ఎప్పటికీ ఆవిడ మనస్సుకి శాంతి లేకుండా చెయ్యడం అవుతుంది! బతికున్నంతకాలం ఉత్తరాలు రాస్తూ ఉంటాను. దాంతో ఆవిడ సంతోషపడుతూ ఉంటుందని నేను నిర్ణయించుకున్నాను."

"నీ ధైర్యానికి మెచ్చుకోవాలి."

"మనిషి అయి పుట్టాక అన్నిటినీ ఎదురుకోవడానికి సిద్ధంగా ఉండాలి ఆ మనిషన్నవాడు తన కర్తవ్యాన్ని నిర్వహించాలి. అందులోనూ ఆదర్శంగా బతకాలనుకున్నప్పుడు మన బాధ్యతలు ఇంకా పెరిగిపోతాయి సమద్!"

"ఈ యుద్ధం గొప్ప మార్పు తెస్తుందని నువ్వు ఉద్దేశపడుతున్నావా?"

"గత యుద్ధం ఏం తక్కువ మార్పులు తేలేదు. సోవియట్ రష్యా పుట్టుక-ఉనికి-ప్రపంచంలో ఆరోవంతు భాగంలో సమానత్వం స్థాపించబడిన పరిపాలన—ఇది చిన్న విషయం కాదు. కాని ఈ యుద్ధంతో వచ్చే మార్పు కొత్త భూమినీ, కొత్త ఆకాశాన్నీ మనకి తెస్తుంది నేస్తం! ఎటైతే సోవియట్ దేశం ఉందో, ఎటువైపైతే ఎర్ర

సేన ఉందో, ఏ పక్షం గెలవాలని ఇప్పుడు చైనా, ఇంగ్లాండు, అమెరికా ప్రజలు తమ సర్వస్వం ధారపోసి మరీ యుద్ధం చేస్తున్నారో ఆ పక్షం గెలుస్తుంది. తప్ప కుండా గెలుస్తుంది. ఏం సందేహం లేదు!"

సమదూ, రూప్‌కిశోరూ పాకిస్తాను గురించి ఈ మధ్య చాలారోజులై చర్చించు కుంటున్నారు. ఇవాళ రూప్‌కిశోర్ పాకిస్తాను సమస్యని లేవనెత్తాడు.

"గాంధీవాదీ స్వరాజ్యమూ, సామ్యవాదీ, స్వరాజ్యమూ, అని మన మధ్య అభి ప్రాయభేదాలు ఉండొచ్చు కాని నేస్తం? స్వరాజ్యం భారతదేశానికే రావాలి. ఇందులో ఏం అభిప్రాయభేదం లేదుగా."

"భారతదేశం అన్నదీ ఓ ఆకారంలేని శబ్దం రూపబాబూ! ఈ పేరుతో ఎన్నో భ్రమల్లో పడేయొచ్చు! భారతీయులకి స్వరాజ్యం రావాలి. భారతీయులు తమ అదృ ష్టాన్ని తాము నిర్ణయించుకోగలగాలి. ఆకాశం నుంచి ఊడిపడ్డ స్వరాజ్యం కొంత మంది గొప్పవాళ్ళ వరకే పరిమితమై ఉండకూడదు."

"అలాగే అనుకోండి. స్వరాజ్యం అని ఈ భారతదేశాన్ని ముక్కముక్కలు చేసెయ్యకూడదు."

"మళ్ళీ నువ్వు భ్రమలో పెట్టే మాటనే వాడుతున్నావు. భారతదేశం ముక్క చెక్కలై పోవడం, అఖండంగా ఉండడం అన్నది దేశంలో నివసించే ప్రజల మీద ఆధారపడి ఉంది. మౌర్యుల కాలంలో హిందూకుష్ అవతల "అమూదరియా" భారత దేశపు ఎల్లగా ఉండేది. భాష, ఆచార వ్యవహారాలు, చరిత్ర దృష్ట్యా ఆఫ్ఘన్ జాతి (పఠానులు)భారత దేశానికి చెంది ఉండేది. పదో శతాబ్దం వరకూ కాబూలు హిందూ రాజ్యంగానే వుంది. హిందూస్థాన్‌కి ఎల్లగా హిందూకుష్ వుండేది. అఖండ హిందూ దేశం కావాలనే వాళ్ళు హిందూకుష్ వరకూ కావాలని డిమాండ్ చెయ్యడానికి సిద్ధంగా వున్నారా? ఆఫ్ఘన్ స్థానపు ప్రజల కోరికకి భిన్నంగా మాట్లాడకుండా వుంటే సింధుకి పశ్చిమాన నివసించే సరిహద్దు ఆఫ్ఘన్ వాసులు(పఠానులు)ని వాళ్ళ కోరికకి భిన్నంగా అఖండ హిందూస్థానంలో చేర్చుకోలేం. అదే మాట సింధూ, పంజాబూ, కాశ్మీరూ, తూర్పు బెంగాలు విషయంలోనూ చెప్పాల్సి వస్తుంది."

"అంటే భారతదేశం నుంచీ అవన్నీ వేరు అయిపోవాలా?" అడిగాడు రూప్.

"ఆహా! వాళ్ళు అలా కావాలని పట్టుగా వుంటే! మనది ప్రజల యుద్ధం. దాని అర్థం ఏ దేశపు ప్రజలైనా వారి కోరికకి భిన్నంగా రాజకీయ దాస్యంలో వుంచడా నికి వీల్లేదు. పాకిస్తాన్ నిర్ణయం హిందువులు కాదు చెయ్యవలసినది - దాన్ని నిర్ణ యించవలసినది ముస్లిము ప్రజలు. ఆయా ప్రాంతాల్లో అధిక సంఖ్యలో వున్న ముస్లిం ప్రజలు మనం భారతదేశంలో ప్రజారాజ్యాన్ని కాక దోపిడీదారుల పరిపాల నని తేబోతున్నామంటే పాకిస్తానం తప్పకుండా ఏర్పడి తీరుతుంది. బుద్ధితోనూ, శరీరంతోనూ శ్రమించే ప్రజాపరిపాలనని ఏర్పరచాలని మనం కోరుకుంటే భారత దేశం స్వేచ్ఛా స్వాతంత్ర్యం వున్న ఎన్నో జాతులతో కూడిన అఖండ దేశంగా

తయారవుతుంది. ఒక జాతి, ఒక జాతీయత కోసం ఒక భాష, ఒకే రకపు భోజన పానాదులు, వివాహాది సంబంధాలు అవసరం అవుతాయి. అవన్నిటినీ సామ్యవాదమే కల్పించగలదు. దానిక్కూడా భాషల దృష్టితో మనం ఎనభై పైచిలుకు వేరువేరు జాతుల్ని గుర్తించవలసి వస్తుంది."

"ఎనభై పైచిలుకా? నువ్వు పాకిస్తాను కన్నా కూడా మించిపోయావు!"

"భాషల్ని నేనేం ఏర్పరచలేదు. ప్రజా రాజ్యంలో వాళ్ళ వాళ్ళ మాతృభాషల్లో విద్య బోధించాలి. మాతృభాషంటే చిన్న పిల్లాడు కూడా వ్యాకరణ సంబంధమైన తప్పు చెయ్యడు. అదీ మాతృభాష!! సోవియట్ రిపబ్లిక్ 70 జాతులతో కూడిన బహుజాతుల దేశం. ఆ దేశం కన్నా రెండింతలు జన సంఖ్య ఎక్కువగా వున్న భారతదేశం ఎనభై జాతులతో కూడిన బహుజాతుల దేశం అయితే ఆశ్చర్యపడాల్సిన దేముందీ?"

"అయితే నువ్వు పాకిస్తానుని సమర్థిస్తావా?"

"ముస్లిం ప్రజలు కావాలని కోరుకుంటూ వుంటే దాన్ని నేను సమర్థిస్తాను, ఇప్పుడు ఏ ధోరణికి చెందినవాడైనా ప్రతి ముస్లిం నాయకుడూ పాకిస్తానం కావాలన్న డిమాండును అంగీకరించాలని ఏకాభిప్రాయంతో వున్నాడు. ముస్లిమేతరులకి ఈ న్యాయబద్ధమైన డిమాండును కాదనడానికి ఏవిధమైన హక్కులేదు. అధిక సంఖ్యాకులుగా వున్న ప్రాంతపు ముస్లిం ప్రజలు భారతదేశం నుంచి విడిపోవాలని అనుకుంటే ఆయా ప్రాంతపు ప్రజలకి ఆ హక్కు యిచ్చి తీరాలి."

# 3

కింద నల్లసముద్రం. ప్రశాంతంగా కనపడుతున్న ఆ సముద్ర జలాల్లో ఎక్కడా జీవన స్పందన కనిపించటంలేదు. దూరంగా తెల్లటి మేఘాలు విస్తృతంగా పరచుకుని వున్నాయి. ఆకాశంలో తను ఎటుపోతున్నదీ తెలుసుకోడానికి ఏం సాధనం లేదు. కేవలం మార్గదర్శక యంత్రం ద్వారానే సాధ్యం. అది సుమేరుడికి ఎదురుగా వుంది. గంటకి మూడు వందల మైళ్ళ వేగంతో నడవగల్గే విమానాన్ని నడపడం! సరిగ్గా ఆకారమన్నా ఇవ్వలేని ఆ రాతి ఆయుధాల్నే మనిషి తన గొప్ప సృష్టిగా, పెద్ద శక్తిగా అనుకునే ఆ రాతియుగాన్ని గురించి సుమేరుడు తలుచుకున్నాడు. కాని ఇప్పుడో? మనిషి ఆకాశానికి రాజు!! మానవత్వం ఎంత వికాసాన్ని సాధించింది. అయితే ఆ వెంటనే అతని ఆలోచన మానవత్వపు శత్రువులు ఫాసిస్టుల వేపు మళ్ళింది. మనిషి తన బుద్ధి బలంతో సృష్టించుకున్న అద్భుతమైన సాధనాలని మానవత్వానికి సంకెళ్ళు వెయ్యడానికి వాళ్ళు ఉపయోగిస్తున్నారు. జపాను ఫాసిస్టులు భారతదేశం పొరుగుకి బర్మాకి వచ్చేశారన్నది జ్ఞాపకం రాగానే సుమేరుడికి నిలువునా ఒణుకు వచ్చింది. అతని కళ్ళముందు "కదమ్‌కులూ"లోని ఆ ఇల్లు, ఆ ఇంట్లో

వుండే ఆడవాళ్ళు ఒక్కొక్కరూ గుర్తుకి వచ్చారు. వాళ్ళలో ఒకామె అతని ప్రియు రాలు. ఇంకా ఎంతోమంది స్త్రీలు వున్నారు. అస్పృశ్యురాలికి పుట్టిన ఈ మేధావిని, ఈ ఆదర్శవాదిని కొడుకులాగా సోదరుడిలాగా ఆదరించిన వాళ్ళు వున్నారు. ఫాసి స్టుల పట్ల అతని మనస్సులో విపరీతమైన ఏవగింపు. ఆ సమయంలో అతనికి ఎదు రుగా సూర్యచిహ్నం వున్న విమానాలు ఓ మూడు ఎగురుతూ కనిపించాయి! సుమేర్ తన మెషీను గన్నర్‌కి ఫోనులో ఈ విషయం చెప్పి రెండు నిమిషాల్లో ఫాసిస్టు విమానాల మధ్యకి చేరుకున్నాడు. మాట్లాడ్డానికి సమయం పడుతుంది. రాయడాని కైతే ఇంకా సమయం పడుతుంది. కాని సుమేరు తన విమానాన్ని సరియైన స్థానానికి ఎలా తీసుకువెళ్ళాడో, సుమేరుడి విమానంలోని శరీఫ్ ఎలా తన మెషీను గన్‌ని ట్రిగ్ ట్రిగ్ ట్రిగ్ అని అనిపించాడో, పది నిమిషాల్లోగానే మూడు ఫాసిస్టు విమా నాలూ రెక్కలు తెగిన గెద్దల్లా ఎలా సముద్రంలో పడ్డాయో తెలియే తెలియలేదు.

సుమేరుడికి ఇదే మొదటి అవకాశం తన కౌశలం చూపడానికి! ఈ గెలుపుకి అతనికి చాలా సంతోషం కలిగింది. తిరిగి వచ్చేటప్పుడు అతడు శరీఫ్‌తో అన్నాడు:

"శరీఫ్ భాయీ! మనం మన వంతు పని చేసేశాం! మనలో ప్రతీవాడూ ఇల్లాగా ఫాసిస్టు విమానాలని మూడు మూడింటిని కూల్చేస్తే ఎంత బావుణ్ణు!"

"వాటిని పడగొట్టగానే నా మనస్సు తేలిగ్గా హాయిగా వుంది. ఇప్పుడిహ మనం చచ్చిపోయినా వృథాగా చచ్చిపోలేదని చెప్పుకోవచ్చు!"

"మనం బతికి వున్నన్నాళ్ళు జపాను ఫాసిస్టులని చంపేస్తూ లాభంగానే వుందాం!"

సుమేరుడు రెండువందల రోజులు బతికి వున్నాడు. నూరు జపాను విమా నాల్ని కూల్చాడు. ఆఖరిరోజున బంగాళాఖాతంలో అతనికి పని యిచ్చారు. అండ మాన్లకి పశ్చిమంగా జపాను వాళ్ళ యుద్ధనౌక వెళ్తోంది. సుమేరుడు నలభైవేల టన్నుల యుద్ధ నౌకని బ్రహ్మాండమైన దాన్ని చూశాడు. నౌకకి చుట్టూ దగ్గరగా కాపలాకాస్తూ విమానాలు ఎగురుతున్నాయి. కాని మేఘాల మధ్య నుంచి తొంగి చూస్తున్న సుమేరుడి కళ్ళని అవి కనిపెట్టలేకపోయాయి.

సుమేరుడు తన గన్నర్‌ని టార్పిడో సిద్ధం చెయ్యమని ఆజ్ఞాపించాడు. మేఘం యుద్ధనౌక వరకూ పరుచుకుని వుంది. సుమేరుడు పూర్తివేగంతో తన విమానాన్ని నడిపాడు. శత్రువుల విమానాలకి ఏమాత్రం ఆచూకీ తెలియలేదు. ఎప్పుడు యుద్ధనౌక మీదకి ఓ విమానం వచ్చిందో, ఎప్పుడు భారతీయ విమాన వాహకులు టార్పిడోని తీసుకుని విమానంతోపాటు మహానౌక మీదకి విరుచుకు పడ్డారో అర్థం కాలేదు. సుమేరుడికీ అతని గన్నరుకీ ఏం తెలియలేదు. కాని వాళ్ళు తమతోపాటు ఆ యుద్ధనౌకనీ సర్వనాశనం చేశారు.

—:(o):—

# అనుబంధము

## మన దేశ భాషలన్నిటిలో అద్వితీయమైన పుస్తకం

### భదంత ఆనందకౌసల్యాయన్

"వోల్గానుంచి గంగకు" పుస్తకంలోని కొన్ని కథలని నేను హిందీ పత్రికల్లోనే చదివాను. పుస్తకరూపంలో వచ్చాక మొదటి ప్రతే నా చేతికి బహుశా వచ్చింది. పుస్తకాన్నంతటినీ ఓసారి, ఎన్నో కథలని చాలాసార్లు చదివాను. చదివి ఇతరులకి వినిపించాను. అన్ని రకాలైన వాళ్ళకీ, అన్ని వయస్సుల వారికి కూడా! "చాలా కథలు కథలు కావు, చరిత్రే" అని అభిప్రాయపడ్డాను. నిజంగానే కొన్ని కథలు జ్ఞాన భారంతో చాలా బరువుగా తోచాయి. కథ కాస్త తేలిగ్గా హాయిగా ఉండాలి. నా యీ అభిప్రాయాన్ని ఓ సారి రాహుల్ గారికి రాసి పంపాను. దానికి ఆయన జవాబు కూడా యిచ్చారు— "ఈ కథల్ని రుచించేటట్టు ఇంపుగా రాసిన చరిత్ర అనే అనుకున్నా నాకు తృప్తే" అన్నారు.

"వోల్గానుంచి గంగకు" పుస్తకాన్ని ప్రశంసించాను. ప్రశంసలు విన్నాను. అయితే ఆ వేళ ఓ మహారాష్ట్రీ పండితుడు-అందులోనూ విశ్వ సాహిత్యాన్ని తెలిసున్నవాడు ఈ పుస్తకం గురించి రాసిన అభిప్రాయాన్ని చదివినప్పుడు హిందీ భాష పట్ల అత్యంత ప్రీతి కలిగిన నాకు నిజంగానే ఎగిరి గెంతేయాలని అనిపించింది. ఆయన "మనదేశ భాషల్లో ఏ భాషలోనూ ఈ హిందీ పుస్తకంతో సరిపోయే పుస్తకం ఏదీలేదు," అని అన్నారు.

కాని నిన్ననో పెద్ద మనిషి సెప్టెంబరు 20వ తారీఖు "విశ్వబంధు" పత్రిక కటింగు పంపించాడు. అది చదివి 'అయ్యో' అనుకున్నాను. అందులో "రాహుల్ దిగంబర వాది, వేదాల్ని నిందించిన వాడూను" అని రాసి ఉంది. ఆ రాసినాయన పేరు "శ్రీస్వామీజీ." తనెవరో తెలియకుండా రహస్యంగా ఉండాల్సిన అవసరం ఆయనకి ఏం కలిగిందో? అయితే ఒకటి—ఆయన పేరే "స్వామీజీ" అయితే అది వేరే సంగతి!

ఏ పుస్తకాన్నైనా ఇష్టపడడం, ఇష్టపడక పోవడం అన్నది ఆయా వ్యక్తుల అభిరుచిని బట్టే కాదు ఆయా వ్యక్తుల యోగ్యతని బట్టి కూడా ఉంటుంది. అందరికీ ఓ

పుస్తకం ఒక్కోలా ఎప్పుడూ నచ్చదు. "వోల్గానుంచి గంగకు" పుస్తకం దీనికి మిన హాయింపు ఎందుకవాలి?

అయితే శ్రీస్వామీజీ ప్రజలముందు ఉంచిన ఈ కోరిక గురించే నాకు విపులంగా తెలుసుకోవాలని ఉంది. "ఈ హేయమైన పుస్తకాన్ని నిషేధించడానికి పూర్తిగా ప్రయత్నించాలి" అని ఆయన కోరిక! ఈ కోరిక ప్రకారం మనం ఆ పని చేస్తే మనల్ని మనం గౌరవించుకున్నట్లవుతుందా? లేక అగౌరపరచుకున్నట్లవుతుందా? మిథ్యావాదాల్ని తప్పుటభిప్రాయాలని తన ధైర్యబలంతో ఓడించడానికే ఎప్పుడూ ఆర్యజాతి ప్రయత్నించిందనీ, ఆర్యజాతి గొప్పతనం అదేనని మనం వింటూ వచ్చాం. "వాదే వాదే జాయతే తత్వబోధః" అన్నది ఆ పూర్వులే చెప్పారు కదా??

"రాహుల్‌జీ రచించిన ఈ విప్లవాత్మకమైన పుస్తకంతో నాకు ఎంతో సాన్నిహిత్యం ఉంది. మనదేశపు అసాధారణమైన చింతనశీలీ, ఆలోచనాపరుడు జీవితాంతం చేసిన అధ్యయనం ఆ పుస్తకంలో పొందుపరిచి ఉంది. ఆయన మన ముందు ఉంచిన సారాంశాలు మనకి తప్పుఅని తోస్తే వాటిని తప్పుఅని మనం ఋజువుచెయ్యాలి. మౌలికమైన ఆలోచనపట్ల ఆయన నిజాయితీగా ఉన్నప్పుడూ, నిజాయితీని పెంచాలని అనుకుంటున్నప్పుడూ దీనికి మరో మార్గం ఏదీ లేదు. రాహుల్‌జీ రచించిన "వోల్గానుంచి గంగకు" పుస్తకంలోని మొదటి నాలుగు కథల పేర్లూ—నిశి, దివ, అమృతాశ్వుడు, పురుహూతుడు. ఈ నాలుగు కథల్లోనూ క్రీస్తుకు పూర్వం 6000 సంవత్సరాల లగాయితు క్రీస్తుకు పూర్వం 2500 వరకూ ఉన్న సమాజాన్ని చిత్రించారు. అది ప్రాగైతిహాసిక కాలం. ఇవి కథలూను! అంచేత ఆ కథల్లో కల్పన ప్రధానం అన్నది సర్వవిదితం. కాని అవి కేవలం కల్పనతో రాసినవి మాత్రంకావు. ఆ కథల్లో మహత్తరమైన విషయాలన్నీ రాహుల్‌జీ ఇండో యూరోపియను, ఇండో ఈరానీ భాషా శాస్త్రాల అధ్యయన ఫలితాలు! "కుటుంబ ఉత్పత్తి" (Origin of **Family Private Property and State: by Engels**) అని ఓ ప్రసిద్ధ గ్రంథం ఉన్నాది! రాహుల్‌జీ రాసిన కథల్ని నిషేధించటానికి ముందు మనం ఆ గ్రంథం నిషేధింప బడేటట్లు చూడాలి!!

తర్వాతి నాలుగు కథలు - పురుధానుడు, అంగిరా, సుదాసుడు, ప్రవాహణుడూను, ఈ కథలన్నిటికీ సాహిత్య ప్రమాణాలు ఉన్నాయి. వేదాలు, బ్రాహ్మణాలు, మహాభారతం, పురాణాలు, బౌద్ధ గ్రంథాల్లోని "అట్టకథ" పేరుతో ప్రసిద్ధిచెందిన భాష్యం - ఇవీ ప్రమాణాలు. సుదాసుడి కథకి ప్రమాణం సాక్షాత్తూ ఋగ్వేదమే! ఎంతమంది పాఠకులకో బౌద్ధులకీ, బౌద్ధేతరులకీ అందరికీ చికాకు పుట్టించి మండిపడేటట్టు చేసే కథ! ప్రవాహణ జైవాలికి ఆధారాలు ఛాందోగ్యోపనిషత్తు, బృహదారణ్యక ఉపనిషత్తు, పైన ఉటంకించిన బౌద్ధుల అట్టకథలూను! ఈ నాలుగు కాథల్లోనూ క్రీస్తుకు పూర్వం 2000 దగ్గర్నుంచి క్రీస్తుకు పూర్వం 700 వరకూ

ఉన్న సమాజం ఎలా వికాసం చెందిందో చెప్పడానికి ప్రయత్నం చెయ్యబడ్డాది. పాఠకులు గుర్తుంచుకోవాలి - మనం ఇంకా బుద్ధుడి కాలం వరకూ రాలేదు!!

ఆ తర్వాత కథ బంధులమల్లుడిది (క్రీస్తుకు పూర్వం 490). ఈ కథకి కావలసిన సామాగ్రినంతటినీ బౌద్ధగ్రంథాల నుంచే రచయిత తీసుకున్నారు. దీనికి సంబంధించిన సామాగ్రి ఎంతో విస్తారంగా లభ్యమవటంతో రాహుల్‌జీ ఆ కాలపు స్థితిగతులను చిత్రించటం కోసం "సింహసేనాపతి" పేరుతో వేరే ఓ నవల విడిగా రాయవలసి వచ్చింది.

పదోకథ నాగదత్తుడు. కౌటిల్యుడి అర్థశాస్త్రం, గ్రీకు యాత్రికుల యాత్రా వివరాలు, జాయస్ వాల్‌గారు రాసిన "హిందూపాలిటీ" చదవండి - మీ స్కూళ్ళలో కాలేజీల్లో బోధించే విన్సెంట్ స్మిత్ రాసిన చరిత్రా చదవండి. వీటన్నిటిలోని చారిత్రక సత్యాలు కొన్నైనా మీకు తెలుస్తాయి. వాట్నే రాహుల్‌జీ ఈ నాగదత్తుడి కథలో వ్యక్తపరిచారు.

పదకొండోకథ "ప్రభ"కి కథగా చాలా పేరు వచ్చింది. ఈ కథకి అశ్వఘోషుడి బుద్ధచరితం, సౌందరనందం కావ్యాలూ, సంస్కృత నాటకాలూ, వింటర్నిజ్ రాసిన భారత సాహిత్య చరిత్రా, రీజ్ డేవిడ్స్ రచించిన 'బౌద్ధభారత్' ఆధారాలు. ఈ కథా కాలం క్రీస్తుకు పూర్వం 50 సంవత్సరాలు.

పన్నెండోకథ సువర్ణయౌధేయుడు గుప్తకాలపు కథ. దానికి కావలసిన విషయవస్తువు గుప్తకాలపు రికార్డుల్లో లభ్యమైనది. అది శాశ్వతంగా రికార్డయిన సామాగ్రి. మనం నిత్యం చదువుకునే రఘువంశం, కుమారసంభవం, అభిజ్ఞాన శాకుంతలం నుంచి కూడా దీనికి కావల్సిన సామాగ్రి రాహుల్‌జీ తీసుకున్నారు. పాణిని, చీనా యాత్రికుడు ఫాహియానూ కూడా దీనికి సహాయపడ్డారు!

పదమూడోకథ దుర్ముఖుడు – బాణపుసూది మొనలాగ గుండెకి గుచ్చుకునే కథ! ఏం చెయ్యగలం? కాదనలేం - హర్షచరిత్రం, కాదంబరి, హుయాన్‌సాంగ్, ఇత్సింగు యాత్రా వివరాలు దానికి ఆధారాలు.

పద్నాలుగో కథాకాలం క్రి.శ. 1200. కథ పేరు చక్రపాణి. దీని కాధారాలు మీకు నైషధంలోనూ ఖండన ఖండకాద్యంలోనూ అనేక శిలాశాసనాల్లో, రికార్డుల్లోనూ దొరుకుతాయి.

బాబా నూర్‌దీను నుంచి సుమేర్ వరకూ ఆరు కథలు ఉన్నాయి. ఆ కథల కాలం పదో శతాబ్దం నుంచి ఇరవయ్యో శతాబ్దం వరకు ఉన్నకాలం. ఈ కథలన్నిటికీ కూడా చారిత్రక ప్రమాణాలు ఇంచుమించు మిగతా కథలకున్నట్టే ఉన్నాయి. కాని ఈ కథల విషయంలో ఎవరికీ ఏ అభ్యంతరాలు ఉన్నట్టు నాకు కనిపించలేదు. బహుశా ఈ కథలు ఆధునిక కాలానికి ఎక్కువగా సంబంధించిన కారణంగా విశేషించి అభ్యంతరాలు ఉండి ఉండకపోవచ్చు. అవునుమరి, మనకి గతించిన కాలం అందేనే కద ఎక్కువ ప్రీతి ఉన్నది!!

ఈ పుస్తకంలోని కథల్లో వ్యక్తపరిచిన భావాలతో వాటి సారాంశాలతో ఏకీభవించడానికి, ఏకీభవించకపోడానికి నాకు అంత పెద్ద అర్హతా, సామర్థ్యమూ లేదు. అలాంటి దానికి రాహుల్ అంతకాకపోయినా ఆయనలా శాస్త్రాన్నా అధ్యయనం చెయ్యాలి. నేను ఈ వాక్యాలు శ్రీస్వామీజీలాంటి వాళ్ళకి ఈ కథలు ఏదో ఆషామాషీగా రాసినవి కావనీ సంవత్సరాల తరబడి చేసిన అధ్యయనం వీటి వెనుక ఉందని చెప్పడానికి మాత్రమే రాస్తున్నాను.

ఈ మధ్యే కొద్దిరోజుల క్రితం కొంతమంది చదువుకోని జైనులు ఆచార్యులు ధమ్మానందోజీ కోసంబీ వెలిబుచ్చిన భావాలకి వ్యతిరేకంగా గగ్గోలు చేశారు. జైన్ పండితులు దానికి ఏం చెప్పారో తెల్సా? "మేం కోసంబీజీ పక్షాన్ని సాక్ష్యం యివ్వగలం." అయితే "సాక్ష్యం ఇవ్వాల్సిన అవసరం లేదు." అని ఆయన చెప్పారు.

మన ప్రాచీన గ్రంథాలు వాటి రచయితలు ఋషులూ మహర్షులూ శ్రీ రాహుల్‌జీ పక్షాన్ని సాక్ష్యం ఇస్తున్నారని నేను భయపడ్తున్నా! నిజమే "సత్యాన్ని మించిన మతం లేదు" అంటున్నారు!!

***

## రచయిత గురించి



రాహుల్ సాంకృత్యాయన్ అంతర్జాతీయ విఖ్యాతి పొందిన పాళీ, సంస్కృత భాషా పండితుడు. గొప్ప చరిత్రకారుడు, కార్యశూరుడు, సుమారు 10 సం॥లు సుదీర్ఘ కాలాన్ని స్వాతంత్ర్య యోధులుగా కారాగారాల్లో గడిపిన త్యాగమూర్తి. లెనిన్‌గ్రాడ్ విశ్వవిద్యాలయంలో ప్రాచ్యభాషా బోధకుడుగా పనిచేసి ఖ్యాతినొందిన సుప్రసిద్ధ భారతీయుడు. హిందూ సన్యాసిగను, ఆర్యసమాజకునిగను, అంతర్జాతీయ ఖ్యాతి గడించిన బౌద్ధబిక్షువుగను ఈయన పేరు పొందారు.

వీరు చేసిన భాషాసేవకు కాశీ పండితులు వీరిని "మహాపండిత్" బిరుదుతో గౌరవించారు. బౌద్ధవేదముల మూడింటిలోను ఈయన నిధి. అందువల్ల బౌద్ధ విజ్ఞానులు ఈయనకు "త్రిపీఠకాచార్య" బిరుదు నిచ్చారు.

రాహుల్‌జీ సాగించిన పరిశోధనలు భారత సంస్కృతిని 600 సం॥లు చరిత్రలో సుసంపన్నం చేశాయి. వీరి రచనలు హిందీ భాషకు 400 సం॥ల చరిత్రను చేర్చాయి. వాటిలో హెచ్చువాటిని జైళ్ళలోను లేక నేపాల్, టిబెట్, సిలోన్‌లలో రచించారు. వివిధ భాషలలో వీరి గ్రంథాలు 60కి పైగా వుంటాయి.

తెలుగు పాఠకులకు సుపరిచితమైన "ఓల్గా నుంచి గంగకు" రచనను 1941 సం॥లో నిర్బంధవాసంలో రాశారు.

### రాహుల్‌జీ రచనలలో సుప్రసిద్ధమైనవి కొన్ని...

- ఋగ్వేద ఆర్యులు
- సింహసేనాపతి
- విస్మృత యాత్రికుడు
- దివోదాసు
- లోకసంచారి
- జయయౌధేయ
- మధురస్వప్నం
- ఓల్గా నుంచి గంగకు